శ్రీరస్తు

# శ్రీకృష్ణభారతము

## కర్ణ శల్య సౌప్తిక స్త్రీపర్వములు


కవిసార్వభౌమ

శ్రీపాద కృష్ణమూర్తిశాస్త్రి ప్రణీతము





చెన్నపురి:

వావిళ్ల రామస్వామిశాస్త్రులు అండ్ సన్స్ వారి

'వావిళ్ల' ప్రెస్సున ముద్రితము

1934





Title Page Printed at the 'Vavilla' Press Madras



బాలాత్రిపురసుందర్యై నమః.

# శ్రీకృష్ణభారతము

## భీష్మపర్వము - ప్రథమాశ్వాసము.



వత్సాంకితుఁడుం గుమారకుఁడు లక్ష్మీవల్లభుం డేకసం
ఖ్యావిద్యాగ్రహణైకదక్షుఁడు సుధీత్వప్రాంచితుం డీశ్వరీ
సేవాసక్తుఁడు మాసుదర్శనుఁడు సుశ్రీవైభవోపేతుఁ డై
భావంబం దలరారి నావెతలు వాపం జూచి కాపాడుతన్. 1

వ. అని పరమాత్మస్వరూపునిం బ్రస్తుతించి. 2

క. కృతు లిచ్చి ధనాశం గొని, మతిమాలినవాఁడ నగుచు మనుజాధిపులన్
బ్రతిపత్తి చేసి హీనపు, గతి కైతిం దప్పు సైఁచి కావుము దేవా. 3

వ. దివ్యచిత్తంబున నవధరింపు మక్కథకుండు శౌనకాదిమహామునుల కిట్లనియె. 4

---

శ్రీవత్సాంకితుఁడు= బొడ్డునందుఁ బుట్టుమచ్చచేఁ జిహ్నితమైనవాఁడు; కుమారకుఁడు= పుత్రుఁడు, కు= భూమిని, మా= లక్ష్మిని, ర= గ్రహించినవాఁడు "రాతి గృహ్ణాతీతి రః" స్వార్థేకప్రత్యయః; లక్ష్మీవల్లభుండు= వస్త్రభూషణాదిశోభయందుఁ బ్రియుఁడు, లక్ష్మి కధిపతి, సంపద కధిపతి; ఏకసంఖ్యావిద్యాగ్రహణైకదక్షుఁడు= ఒక్కసంతచే విద్య నేర్వ సమర్థుఁడు, ఏకేశ్వరునియందుఁ బ్రతిజ్ఞ గల జ్ఞానమును బుద్ధియుఁ గలమహర్షులకు దక్షుఁడు, నియామకుఁడు, లేక పరమాత్మబోధకం బగుజ్ఞానము నేకీభావము చేసి భగవద్గీతాదులను బోధించినవాఁడు; సుధీత్వప్రాంచితుండు= సుధి యనుపేరుచే నొ[illegible] వాఁడు, మంచిజ్ఞానముచేఁ బొందఁదగినవాఁడు. "అంచు గతిపూజనయోః" లేక మం[illegible] (దుష్టసంహారశిష్టరక్షణాదికము) ప్రతిపాదించువాఁడు; ఈశ్వరీసేవాసక్తుఁడు= ఈశ్వరి[illegible] [illegible]ఁ గాసక్తి గలవాఁడు, మాయయొక్క సంగము గలవాఁడు, విషయాసక్తుఁ డైనన-

క. జనమేజయజనవల్లభుఁ, డనుపమమేధానిధాన మగు వైశంపా
యనమునిఁ గని కురుపాండవు, లని చేసినవిధము దెలుపు మని యడుగుటయున్. 5

వ. వైశంపాయనుం డిట్లనియె. 6

—:జంబూఖండనిర్మాణపర్వము:—

క. జననాథ! పాండునందను, లును ధృతరాష్ట్రాత్మజన్ములుఁ గురుక్షేత్రం
బున మన్యువశంబునఁ జేసిన ప్రవిదారణ మది యెల్లఁ జెప్పెద వినుమా. 7

వ. *అట్లుభయబలంబులును దమతమకాలంబు లెఱింగించుకొనినంత మఱునాఁ డరు
ణోదయంబున ధార్తరాష్ట్రప్రచోదితు లగు నానాదేశాగతరాజు లెల్లరును దమతమ
బలగమ్ములతోఁ గాల్యకరణీయంబులం దీర్చి ధౌతమాల్యాంబరాభరణధారులును
గృహీతశస్త్రాస్త్రులు నై స్వస్తివాచనపూర్వకంబుగా నశ్వత్థామ భీష్మ జయద్రథ
శకుని కృతవర్మ శల శల్య బృహద్బల భూరిశ్రవఃప్రముఖులం గూడి భారద్వాజుం
బురస్కరించుకొని భ్రాతృశతపరివారితుం డగుకురురాజు ననుసరించి సమరోత్సా
హం బినుమడింప నానావిధవాదిత్రంబులు బోరుకలుగఁ గదలి చని కురుక్షేత్రం
బునఁ జతుర్యోజనమండలం బేపు గలుగ దుర్యోధనకల్పితంబులును దుర్గమదుర్గాభి
రక్షితంబులు నగుశిబిరంబుల హాస్తినపురంబునం బోలె వసియించి భక్ష్యభోజ్య
పానీయాదుల రాజగౌరవంబు నొందుచుండి రంతఁ గాంతేయాగ్రజుండును జేది
కాశ కరూశ ప్రభృతు లైనపృథివీపతులం గూడి విరాట ద్రుపద ధృష్టద్యుమ్న
ధృష్టకేతు యుధామన్యూత్తమౌజో యుయుధాన జయత్సేన ప్రభృతులును
భీమార్జున నకుల సహదేవ ద్రౌపదేయ సౌభద్రేయులును వివిధవిధసైన్యంబులుం
దన్నుఁ బరివేష్టింప శ్రీకృష్ణుం బురస్కరించుకొని వివిధమంగళవాదిత్రంబులతోఁ
బయనం బై చని రంగస్థలం బాక్రమించె. 8

—: సేనాద్వయసన్నివేశము :—

సీ. యుద్ధాభినందులు సిద్ధతేజస్కులు, పాండవుల్ సోమకపరివృతు లయి
వివిధసేనలు గొల్వ విజయ మాకాంక్షించి, కౌరవవాహినిం జేర నరిగి
ఘభాగంబు వట్టి ప్రాఙ్ముఖు లయి, పోర నెదిర్చి ర్వీరసమితి

# విజ్ఞాపనము

నేను సుమారు పదునైదుసంవత్సరములక్రిందటనే శ్రీమహాభారతము నాంధ్రీకరించుటకుఁ బ్రారంభించి అనేకాంతరాయములకు లోనై యిప్పటికి శాంతిపర్వములో నింతకొఱఁగాఁ బదునెనిమిదిపర్వములును దెనిఁగించితి ననివ్రాయుట కెంతయు సంతసించుచున్నాను. ఈ పదునైదుసం॥రములకాలములో సరిగ లెక్కవేసి చూచినచో నాభారతరచనకై దాఱుసం॥రముల కాలము కంటె నధికకాలము కాలేదనియుం జెప్పఁగలను. అయిదాఱు భిన్నదేశప్రతులు చూచుచుండుటయు, తదర్థావబోధము చేసికొనుటయును గాలహరణమునకుఁ గారణమైనది. మఱియు నీభారతము రచించు కాలములో నీగ్రంథము ముతోడనే కూరుచుండక పదునైదుగ్రంథము లన్యములు రచించి యుంటిని అదియు నాలస్యమునకుఁ గొంత కారణమైనది. ఆధివ్యాధులు, దారిద్ర్యము లోనగునవి మహాకారణము లనియుం జెప్పఁగలను.

కర్ణశల్యసౌప్తికస్త్రీపర్వములు గలయీ యైదవసంపుట మందలి గ్రంథము నిప్పటి కాఱుసం॥రముల క్రిందటనే రచియించితిని దీనిని ముద్రించుటకుఁ బాలకొల్లుపురవాస్తవ్యులు, వైశ్యశిఖామణులు మ. రా. రా. శ్రీ చుండూరి నారాయణరావుగారు వాగ్దత్తముచేసి మున్నే ముద్రణమునకుఁ గొంత సొమ్మిచ్చినారు కాని కొంత నాలోపముచే నింతవఱకును ముద్రితము కాలేదు. దైవానుగ్రహము కలిమి నేవిధమైనయంతరాయములును లేక యిప్పటికి ముద్రింపఁ గలిగినందులకు సంతసించుచున్నాను. నారాయణరావుగారు యువకులైనను వారికిఁ గల భాషాభిమానము. దేశాభిమానము నమితము కావుననే యెట్టియెట్టి చిక్కులు వచ్చినను వాని నన్నిటి నొకతట్టునకుం దట్టి యిట్లు గ్రంథము ముద్రింపఁ గలిగినందులకుఁ గృతజ్ఞుఁడనై వారికాయురారోగ్యైశ్వర్యాభివృద్ధి యగునట్లాశీర్వదించుచున్నాను.

ఈసంపుటమందును అచ్చుతప్పులు లోనగునవి పెక్కులు పడి యున్నవి. అవి సవరించి శుద్ధపత్రము వ్రాయుటకు స్థిమితత కలిగినది కాదు. ఆదిపర్వము మొదలుకొని యిదివఱకు ముద్రితమైనంతవఱకు "శ్రీకృష్ణభారతార్థప్రకాశిక" యనుపేరితో నొక గ్రంథము వ్రాసి యందీతప్పులం జేర్చియచిరకాలములోఁ బ్రకటించుచున్నా నని విన్నవించుచున్నాను.

శ్రీపాద కృష్ణమూర్తిశాస్త్రి

# విషయసూచిక.

## కర్ణపర్వము—ప్రథమాశ్వాసము.

—:o:—



## కర్ణపర్వము—ద్వితీయాశ్వాసము.

## కర్ణపర్వము—చతుర్థాశ్వాసము.



## శల్యపర్వము—ప్రథమాశ్వాసము.

## శల్యపర్వము—ద్వితీయాశ్వాసము.

విషయము | పుట
--- | ---



## శల్యపర్వము_తృతీయాశ్వాసము.



## సౌప్తికపర్వము-ప్రథమాశ్వాసము.

## సౌప్తికపర్వము—ద్వితీయాశ్వాసము.



## స్త్రీపర్వము—ప్రథమాశ్వాసము.

## స్త్రీపర్వము—ద్వితీయాశ్వాసము.



సంపూర్ణము.



# శ్రీకృష్ణభారతము

శ్రీ చుందూరివారి వంశవర్ణనము.

శా. శ్రీరాధామధురాధరాధికసుధాసేవావశస్వాంతుఁడై
సారాచారత సామిమీలితశిఖిపింఛంబు బూని వ్రేపల్లెలో
నారీలోకము చెంత నాడుకొనుకృష్ణస్వామి ప్రోచుం గృపా
శూరుం దానపరుం వరాన్వయభవుం జుందూరినారాయణున్. 1

చ. కలువలతేనితోడు గిరికన్యకజోడు రతీశునమ్మ త
మ్ముల నివసించుకొమ్మ కనుముద్దులు గుల్కఁగఁ బాలవెల్లిలో
వెలసినముద్దరాలు కరివేలుపువాలిక నేలుమేటి య
క్కలుములబోటి పేర్మిఁ గనుఁ గావుత మాణెమ గన్నపుత్రునిన్. 2

మ. చను వొప్పం దల నొక్కపద్మనయనుం సామేన వేఱొక్కచం
దనగంధిం దొడలం గుమారయుగముం దాఁ దాల్చి ప్రేమించుచు
న్మనమందు గడుసంతసించు త్రిజగన్నాథుండు సంపద్యశో
ఘనునిన్ జుండురివంశరత్నమును వేడ్కం బ్రోచు నారాయణున్. 3

చ. అరుణశరీరకాంతి వెస లంతరమింతయు లేక నిండుకోఁ
గరముల నాల్గిటం గళముఁ గంజము పుస్తక మక్షమాలయుం
బరఁగ శివాంకసంస్థయయి బాలిక వైఖరి భక్తకోటులన్
సురుచిరలీల నేల్త్రిపురసుందరి మాణెమపుత్రు నేలుతన్. 4

మ. వెలిదమ్మిం గొలువుండి ప్రాణిసమితి న్వ్రాన్నణ మేపాఱఁగాఁ
గలుగంజేసి పురాకృతంబు తదళీకంబందు ముబ్బంతులన్
వెలియం జేయుచు భారతీసహితుండై పల్గొందువేల్పుపాన్
దెలియం జుండురివంశభూషణునకున్ దీర్ఘాయురారోగ్యముల్. 5

మ. తలపూవెన్నెలతాకకళల్ గఱఁగి చిందన్ వల్లకీదండమం
దలరుంజొంపము లల్లుకొ న్పరశుకం బయ్యంచవార్వంబు నిం
పలర న్వాగ్గతులం దొలంగి యట నున్నట్లుండఁ దాఁ గచ్ఛపిన్
లలి వాయించుసరస్వతీరమణి మానారాయణుం బ్రోచుతన్. 6

సీ. పటికంపుటాలడా లటమటింపఁగఁ జాల నిద్దంపుఁదెలిమేని నిగ్గు లెసఁగ

సూర్యచంద్రాగ్నుల సొంపొందుమూఁడేసి కనులఁ జొనంచు మొగంబులరఁల
బాపటసుల నేపుఁ జూపులేజాబిల్లి, చేర్చుక్కవలె వ్రేలి చెన్నుమీఱ
నైదైదుచేతుల నబ్జత్రిశూలాది, పరికరంబులు మహాప్రతిభ దెలుప

తే. నల్లవేదములకుఁ గన్నతల్లి యగుచు, నెన్న మూర్తిత్రయంబున కన్న నున్న
తముగ వర్తించి నిజభక్తసమితి నేలు, నట్టిగాయత్రి బ్రోచు నారాయణాఖ్యు. 7

శా. మూఁడుంగాలములందుఁ బ్రత్యహముఁ దా మువ్వేళ్ళ లై లోకముల్
మూఁడుం బ్రోచెడు ధ్యానశాత్ముఁడు మహాత్ము ల్గొల్చు గాయత్రికిన్
తేఁ డాదిత్యుఁడు నిత్యుఁ డూర్జితమతిన్ బ్రేమించి యెల్లప్పుడున్
దోషై మానెమ యగ్రపుత్రునకుఁ దోడ్తో నిచ్చు నారోగ్యమున్. 8

వ. అని పరోపకారపరాయణుం డగు నారాయణరావు నాశీర్వదించి యేనొక్కసమయం
న శ్రీరామాంబునకుం బోయియున్నప్పుడు నావృత్తాంత మాత్రేయునివలనవినియ
ట ధనికుండును దాతయు నై యున్న చుండూరి నారాయణరా వను వైశ్యశిఖామణి
నాకడకు వచ్చి మీ శ్రీకృష్ణభారతంబునఁ గర్ణ, శల్య, సౌప్తిక, స్త్రీ, పర్వములు గల
సంపుటము నేను ముద్రింతు నని నుడికార మిచ్చి వెండిపళ్లెరముతో నూటపది
యూఱురూప్యములతో నమూల్యము లగు వస్త్రములతో ఫలంబులతోఁ గర్పూరతాం
బూలం బిచ్చినం బుచ్చుకొని ముదం బంది ముందు మంగళాచరణంబుగా నవ్వైశ్య
శిఖామణివంశావతారం బభివర్ణించెద. 9

సీ. సకలసురాసురకృతకరార్చితాచ్యుత, సదమలవిపులోరుసంభవంబు
అఖిలభూవిశ్రుత వ్యాపారసంపాదితాధిక విమలయశోధనంబు
న్యాయసమాసాదితాఖండ ధనసంచయాధరీకృత రాజద్రైలబిలము
సకలజగజ్జన సన్నుతవిశ్రావణాల్పిత కామధుక్కల్పకంబు

తే. శాశితాఘంబు పరమార్థసంగ్రహంబు, సన్నుతాచార నిరతంబు సదమలంబు
దేవభూదేవ పూజాతిదీపితంబు, వైశ్యవర్ణంబు పెంపొందు వసుధయందు. 10

ఆ. అల్లవైశ్యవర్ణమందువినుకులాఖ్య, గోత్రమందుసుగుణపాత్రు లగుచు
సుజను లార్య లొప్పి చుండూర నుండుట, వారి కదియె యింటిపేరువచ్చె. 11

శా. ఆవర్ణంబున సింగరప్ప యన విఖ్యాతాహ్వయుం డొప్పి స
ద్భావంబుం గొని విష్ణుభక్తిభరితస్వాంతుండు శాంతుండు నై
శ్రీవిఖ్యాతియు భూతియుం గలిగి వంశీయాగ్రగణ్యుండు నై
తా వెల్గొందెను దానధర్మపరుఁడై ధన్యుండు మాన్యుండు నై. 12

మ. తిరునామాంకితఫాలభాగుఁ డగుచున్ దీపించి తాపింఛరు

న్వరదేహంబునఁ గాంచనాంబరము లేవం జెన్నుమీఱంగ భ
ర్మరుచిభ్రాజితరత్నమాలిక యురోమధ్యంబునం గౌస్తుభ
స్ఫురణం బ్రాలఁగ విష్ణువో యనఁగ నై శోభించె నాతం డిలన్. 13

ఆ. దానకర్ణుఁ డనఁగఁ దళ్కొత్తి ఘనుఁడై, వర్తకంబు వలన వన్నె గాంచెఁ
బాలకొల్లుపురిని బ్రజలకుఁ గొంగుబంగార మనఁగఁ బేరు గాంచె నతఁడు. 14

క. అతనికి శఠగోపాఖ్యుఁడు, మతిమంతుం డుదయ మంది మాన్యగుణుండై
నుతియింపఁ బఱచు రాజమ, సతిగాఁ గొని పేర్మి కయ్యె శఠగోపుఁ డనన్. 15

మ. శఠు లన్నన్ నిరసించి శిష్టు లనినన్ సద్భక్తి నీక్షించి గో
మఠకోటిన్ ఘనగౌరవంబునఁ జనన్ మన్నించి యెన్నేనియున్
మఠముల్ గట్టియు మాన్యముల్ సలిపియున్ ధర్మమండలశ్రీదుఁడై
శఠగోపాఖ్యుఁ డభిఖ్య కయ్యె సుజనస్వాంతంబులం దెంతయున్. 16

తే. అతని యర్ధాంగి రాజమ్మ సతులలోన, వన్నె వాసియుఁ గల దయ్యు వంగసములు
రెండునుం గీర్తి కెక్కంగ నిండు వైభ, వమున వర్ణింప నయ్యె నీవసుధయందు. 17

క. ఆజంపతులకు జగ్గఁడు, రాజిల్లె సుపుత్రుఁ డగుచు రాజితగుణుఁడై
భూజనులు మెచ్చుమెచ్చునఁ, దేజంబును గాంచి మించె స్థిరసంపదలన్. 18

ఉ. ఇమ్మహి జగ్గయాహ్వయుఁ డహీనధనంబున రాజరాజు, ధై
ర్యమ్మున నద్రిరాజు, విభవాతిశయంబున దేవరాజు, దా
నమ్మున నంగరాజు, కరణమ్మున సన్మునిరాజు, దివ్యతే
జమ్మున ఘనప్రిగా జన నజస్రము కీర్తి వహించె నెంచఁగన్. 19

క. అతనికి న్నాంచారమ, ప్రీతిం బానగూర్పునట్టిప్రియసతి యగుచున్
ఖ్యాతికి నై భూతలమున, నాతతవైభవము గాంచె నతివలలోఁన్. 20

తే. అల్లజగ్గయ నాంచారమాబ్జవదన, యందు రెడ్డియనామవిఖ్యాతయశుని
గాంచెఁ బుత్రుని సుచరిత్రు ఘనులలోనఁ, దనరుపేరు ప్రతిష్ఠయుఁ దలుకులొత్త.

ఉ. రెడ్డియ నామవైశ్యమణి రేబవ లర్థులపాల వేలుపుం
గిడ్డి యనంగ నై ప్రబలి గీరితికిం గుదురై జగంబునన్.
దెడ్డ లెఱుంగ కెప్పుడును శ్రీయము లందుచుఁ బూర్ణకాముఁడై
దొడ్డతనంబునం బ్రబలెఁ దోరముగా సిరిప్రాపు గల్గుటన్. 22

సీ. పరదేశముల నూలు వ్యాపార మొనరించి, మించినవిత్తమార్జించి మించెఁ
బాలకొలుపురంబులో లెలి నివసించి, నిత్యాన్నదానంబు నెఱయఁ జేసెఁ
జెఱువులు నూతులు చెన్నొందఁ ద్రవ్వించి, ధర్మకార్యము లెల్లఁ దనరఁ జేసె

పరువేద లగువారి నరసి సంతతముగ, వస్త్రదానంబు లవ్వారి సేసెఁ
తే. గవులపాలిటి కల్పవృక్షంబు నాఁగఁ, దనరి విప్రుల కెంతేనిధన మొసంగి
బీదసాదలపాలిటిపెన్నిధి యయి, యార్యవర్యుల రెడ్డెయ్యయశముఁ గాంచె. 23
క. అతఁడు వేంకమ యనియెడు, ప్రాతచరిత్రను వివాహమునఁ గైకొని సం
ప్రీతిమెయి జగ్గయాహ్వయు, నాతతవిభవమునఁ గాంచె నాసతియందున్. 24
ఉ. జగ్గయ దానధర్మము లజస్ర మొనర్చుచు వేన వేలకున్
దగ్గనివిత్తముం బడసి ధారణియందు మనుష్యధర్ముఁడై
ముగ్గురు మూర్తులందు సమబుద్ధి గలాఁ డయి యన్ రమేశుపై
నొగ్గినభక్తిఁ గల్గి పరమోదయ మంది తలిర్చె నెంతయున్. 25
సీ. అతఁడు శ్రీరామమం దాళువారల, కోవెల గట్టించి కొలిచె భక్తి
బైరాగులు వసింప వసతులు గల్పించె, వెలయ జగ్గారావుపేటఁ గట్టెఁ
బ్రతిపౌషమాసమం దతులితంబుగ బీద, జనులకుఁ దగినవస్త్రంబు లిచ్చె
నన్నదాన మొనర్చె ననిశంబు బ్రాహ్మణాదులకుఁ బ్రత్యహము సంతుష్టి గలుగ
తే. వడ్డివ్యాపారమునఁ బెంచి వసువెసంగ, జీవులును నూతులును దవ్వఁ జేసి వాసి
వేణుగోపాలుని ప్రతిష్ఠ వెలయఁ జేసె, గుళ్ళు గట్టించెఁ గొల్లేటికోటయొద్ద. 26
క. అతఁడు మాణిక్యాంబను, బ్రీతిగఁ గొని తొలుతఁ గనియె వేంకమ్మ యనన్
బూతచరిత్రను బ్రతికఁ బీతాంబరుఁ డాది గంగ వెసఁగన్నగలిన్. 27
సీ. అవల సుబ్బాయమ్మ యనుసతిఁ బరిణయంబై యామెవలన రెడ్డయ్యనాము
మాణిక్యనాముని మఱి పానకాలారావు, నా ముప్పురఁ గొమాళ్ళఁ బ్రేమమీఱ
మాణిక్యమాంబయు మఱియును లక్ష్మినరసమాంబ సూరాంబ రంగనాయ
కమ్మ యనఁ గూఁతుళ్ళఁ గని యష్టపుత్రభాగ్యంబు గలాఁ డని ఖ్యాతిఁ గాంచె
తే. అతఁడు కొనియాడఁ దగఁడె జగ్గయ్యనాముఁ, డర్థికల్పక మార్యవంశార్ణవోది
తాబ్జుఁ డైశ్వర్యనిర్జితయక్షరాజు, సర్వజనవర్ణనీయుఁడై జగతిఁ దనరె. 28
తే. జగ్గయాఖ్యునిపుత్రు లైశ్వర్యవంతు, లార్యసన్నుతసుచరిత్రు లమలమతులు
దానశౌండులు మువ్వురీధరణియందు, నలరుచుండిరి మూర్తిత్రయంబు నాఁగ. 29
క. అందగ్రజుఁ డగు రెడ్డయ, పొందుగ సూరమ్మయనెడు పూవుంబోణిం
బొందె మహైశ్వర్యమ్మొగిఁ బొందుపడం బొదలుచుండె ముద మెదఁ బొదలన్. 30
ఉ. తాతలు తండ్రులుం జనినదారి మెలంగుచు దానధర్ముల్
ఖ్యాతిమెయిం బొనర్చుచు నఖండధనంబును సంగ్రహించి ధా
త్రీతఁ యక్షరాజు నని తెల్పఁగ నై సుఖసౌఖ్యసాంద్రుఁడై

పూతచరిత్రుఁడై తనరు బూజ్యుఁడు రెడ్డెయనాముఁ డున్నతిన్. 31

ఉ. శ్రీదుఁడు నాఁగఁ బేర్పడిన రెడ్డెయ శ్రీ నరసాపురంబునన్
భూదయితుల్ బళీ యనెడుపోలికఁ గేశవునాలయంబులో
శ్రీ దయివాఱ గా ధ్వజవిశిష్టమునై నునుపాఱుస్తంభమున్
బ్రోదిగ నిల్పె సర్వజనపూజ్యముగాఁ బరమార్థదృష్టిమై. 32

క. పేదలకు వస్త్రదానము, మోదమునం జేయు నన్నపూర్వకముగ నా
శ్రీదుఁడు రెడ్డెయ పుణ్య, ప్రాదుర్భావంబు గాఁగఁ బాల్కొలను పురిన్. 33

తే. ప్రతిథమైఁ గాంచె నాతఁడు రామచంద్రు, నవల వేంకటనారాయణాఖ్యసుతుల
సుబ్బవల్లితాయారమ సుతను సూర, మానసీమణియందు సంతోస మెసఁగ. 34

తే. రామచంద్రరాయుఁడు సూర్యరత్నమ యను,తనయ జగ్గయారెడ్డెయయనుతనయులఁ
గాంచి మాతరపితృసేవ లెంచి చేసి, సుజనసంస్తవనీయుఁడై సొంపుమీఱు. 35

శా. పూతాత్ముం డగుజగ్గయాఖ్యునకు సత్పుత్రిందు శ్రీపానకాల్
సీతారత్నమఁ బెండ్లిఁగూడి గరిమన్ జెన్నారుచున్ దాతయై
తాతల్ తండ్రులు వోలె బీదలకు వస్త్రంబుల్ నంతంబిచ్చి వి
ఖ్యాతిం గాంచుచు నుండెఁ బాలకొలులో నార్యాన్వయశ్రేష్ఠుఁడై. 36

ఆ. పానకాలురావు పానకాల్ రాయని, భక్తిగలిగుకతనఁ బ్రీతిఁ గాంచి
పాలకొల్లులోనఁ బ్రజలకై పురమంది. రమ్ముఁ గట్టి యొసఁగె సమ్మతమున. 37

తే సారిద నప్పానకాల్ గాంచె శోభనాద్రి, రావుఁన్ జగన్మోహనరావుఁ గృష్ణ
రావు నాఁబనుమువ్వుర రమ్యమూర్తు, లైనపుత్రులఁ దొల్లిట నత్రియట్లు. 38

తే. మఱియుఁ దేఁడురత్నమాణిక్యమయుసుభద్రి,మయుమహాలక్ష్మితాయారమయును రాజ
రత్నమయును సావిత్రియన్ బ్రథిత లైన, పుత్రికలఁ గాంచె నంతయుఁ బొలుపుమీఱ.

మ. ముగు రాజగ్గయపుత్రులందు నదుమన్ బొల్పొందె మాణిక్యమన్
దగునాముంబున నొప్పువానికను నాఁ దళ్కొత్తి వంశంబునన్
జగతీనాథులు మెచ్చుమచ్చునను శశ్వద్వర్తకవ్యాప్తిచే
నొగి విత్తంబు గణించి పెంపెసఁగె జుండూర్యన్వవాయుం డిలన్. 40

మ. తనవిత్తంబును ద్యాగభోగములకున్ దా నొప్పఁగాఁ జేయుచున్
ఘనుఁడై మాణెము నాఁగ నొప్పుగరితన్ గైకొంచు నారాయణా
ఖ్యుని సత్పుత్రము వేంకటేశ్వరుని నోర్కుల్మిఱఁగాఁ బుత్రిలం
గని యాంజాళ్ళమ రత్నమాల యన నొ కన్యాద్వయంబుం గనెన్. 41

తే, ధరణి నేలూరుపురి జమీన్దారుఁ డగుమఁ,బరఁగు శ్రీమోతె వేంకటస్వామినాను
నకును సీతమ్మకుం గూఁతు రగుటిం మతి,యైన మాణ్యాను మాణిక్య మనఁగఁ జెల్లె.

క. మాణిక్యనాముఁ డాతఁడు, మాణెము యొక్కింతిలోన మహి విడిచినఁ గ

గళ్యాణముగఁ బెండ్లియయ్యెన్, నామెము గావించి రంగనాయకి నవలన్. 43

ఆ. రంగనాయకమ్మ రంగనాయకి నాఁ బ్రశస్తి కెక్కి తనదు సవతి కన్న
బిడ్డ లైనఁ దనదుబిడ్డలనలెఁ గాంచి, పెంచె నెల్లనాఁడు ప్రేముడించి. 43

ఉ. మా మెము కన్న వారెపుడు మానసమం దలరంగనాయకిన్
పూనెము గాఁ దలంచుచును మాతను బాసినచింత లేక లో
రాణ లెసంగ నైక్యమున రాజిలుచుండి రటంచుఁ జెప్ప నా
మానెము సద్గుణంబులను మాటికిఁ మాటికిఁ జెప్పనేటికిన్. 44

శా. ఆ మాణిక్యసుపుత్రియుగ్మమున భవ్యఖ్యాతికిన్ మూలమై
శ్రీమంతుండు కీర్తిమంతు డగుచుం జెన్నొంది నారాయణుం
డామాన్య ప్రభవుండు నై సుకవిలోకాత్యంతసంకీర్తితుం
డై మానొందుచునుండుఁ బాలకొలునం దార్యుల్ ప్రశంసింపఁగన్. 45

సీ. యాచకోహం దేహి యనువానిఁ గనుఁగొని, నాస్తివాదము సేసి నసుపఁ డెపుడు
దీనోహ మనువానిఁ దేఱిపాఱం జూచి, యుపకృతిం బొనరింప నుల్ల మిచ్చుఁ
బండితోహ మ్మని పరతెంచువానిని, నురక పొమ్మని పల్కియుండఁ డెపుడు
కవి రహ మ్మనువాని కవనంబునకు బహూ, కృతి యొనర్చుం గాని విత మొనర్ప

తే. డతఁడు సత్యసంధుఁడు దయాస్వాంతుఁ డమల, వర్తనుఁడు త్యాగభోగార్థవర్ధితార్థుఁ
డర్థిజనకల్పకమ్ము నారాయణాఖ్యుఁ, డార్యసంస్తవనీయుఁడై యలరుచుండు. 47

మ. సుకలుండై సుగుణుండునై తనరుశ్రీచుండూరినారాయణుం
డకలంకప్రతిభన్ దలిర్చుచుఁ గవీంద్రాగ్రేసరుండై కృతుల్
ప్రకటింప న్నిజకీర్తి నింపెనఁ గుమాపామర్తి సూర్యప్రకా
శకవిన్ మెచ్చి గృహస్థలం బొసఁగి నిచ్చల్ మైత్రి మన్నించెడున్.

తే. అతఁడు శ్రీమోతెవేంకన కచ్చమకును, బుత్రికారత్నమై జగత్పూజ్యచరిత
మైన యషసూయఁ బెండ్లియైనఁ గామెయందుఁ గనె సుగుణమణియనుకన్యకామణి నిల.

మ. మనుజుం డాత్మవశంబునం దగుమహామాణిక్యం బాసిన
ట్లనసూయామణిఁ బాసివాసి చెడనై వ్యాపారముల్ రోసి క
ర్మనిబద్ధుం డయి దేశముల్ చని సుఖప్రారంభముల్ మాని కొ
న్ని నెలల్ పూనివర్తిన్ మెలంగె నతఁ డెన్నే బన్నముల్ వొందఁగన్. 50

తే. అవ్వలం గొన్నినాళ్ళకు నతఁడు దైవకృప గలుగ శాంతుఁడై రాజమహేంద్రపురవ
రమున మాజేటి వేంకటరత్న పుత్రి, యైన వేంకటరత్నాంబ నాడెఁ బెండ్లి. 51

వ. ఇట్లు పరిణయంబై సకలసౌఖ్యంబులం దులఁదూఁగు శ్రీనారాయణరావున కభ్యుద
యపరంపరాభివృద్ధి యగున ట్లాశీర్వదించి యీసంపుటము ముద్రించి సఫలీకరిం
చుచున్నాను.

శ్రీ

బాలాత్రిపురసుందర్యై నమః.

# శ్రీకృష్ణభారతము

## కర్ణపర్వము — ప్రథమాశ్వాసము.

---



పాదజలజయుగసే
వాపరతంత్రుండ నగుచు భారతరచనా
వ్యాపారమంద యుండిన
నాపై దయఁ జూపకుంట న్యాయ్యమె దేవా. 1

వ. అక్కథకుండు శౌనకాదిమహామునుల కిట్లనియె నట్లుభయ బలంబులును విడిదల కుం జనియె నని వైశంపాయనుండు జనమేజయునిదిక్కు మొగంబై యిట్లనియె. 2

సీ. ఆచార్యుఁ డగ్గిహుతుఁడైన పిదపఁ, దుర్యోధనాదులు దుఃఖితు లయి
గురుపుత్త్రు నంతయు దరిసి యాశ్వాసించు, చును గౌరవులకుఁ జనిన వెనుకఁ
గర్ణదుశ్శాసన గాంధారవల్లభు, లంతరేయి రారాజునవసథమున
నుండి పార్థులకుఁ దామొనరించినట్టిమొగ్గల నెల్లఁ దలఁపోసికొనుచు నంతఁ

తే. గార్యచింతాపరత్వము గ్రమ్ముకొనఁగ, నాఁటిరాత్రి నూఱువేలేండ్లట్లు గడపి
వేగుడును గాల్యకృత్యముల్ వేగ నొనర్చి, కర్ణు దళవాయిఁగాఁ జేసి కదలి రనికి. 3

తే. కర్ణుఁడును రెండునాళ్లు లుద్దీర్ణుఁ డగుచుఁ, బాండవానీకినులు చాలబడలుపడఁగ
భండనము చేసి ఫల్గునగాండివాగ్ని, కాహుతిగ నయ్యె నెల్లరు నరయు చుండ. 4

చ. అన జనమేజయుం డనియె నక్కట మాధృతరాష్ట్రుఁ డాపగా
తనయుఁడు ద్రోణుఁడుం దెగినదానికి నార్తి వెలార్చుచుండియుం
దనయునిఁ గెల్పఁ జేయు నని నమ్మినకర్ణుఁడు నట్లు వోవుటల్
విని మనమందు నెట్లుడుకు వీడనిశోకము నొందెనో కదా. 5

వ. మఱియు బాహ్లీకసోమదత్తభూరిశ్రవసులును బుత్త్రులు పౌత్త్రులును మిత్త్రులునుం బోకకు శోకించుచు నాతండు చాక యెట్లు బ్రదుకఁ గలిగెనో బవరం బెట్లు ప్రవర్తించెనో చెప్పు మనిన వైశంపాయనుండు వెండియును.

తే. కర్ణుఁ డీల్గినపదపడికలను విడిచి, వాతవేగతురంగమాన్వితరథము
నెక్కి హాస్తిపురంబున కేగి సంజయుండు ధృతరాష్ట్రునిం గాంచి యొద్దికమెంయి. 7

— సంజయుండు ధృతరాష్ట్రునకుఁ గర్ణాదుల తెఱంగు చెప్పుట. —

ఉ. ఆతనిపాదపద్మముల నౌదలఁ జేర్చి నమస్కరించి యో
క్ష్మాతలనాథ! వచ్చితిని సంజయుఁడన్ భజియించుచుంటి నీ
చేతల నైనకష్టములఁ జేసి తపింపక సౌఖ్యముంటివే
నీతలపోఁత లన్నియును నీళ్ళలు గారఁగ నయ్యె నయ్యయో. 8

తే. నిదుహిత మొంచి విదురుండు నేను గుంభ,సంభవుండును భీష్ముండు శౌరి మఱియుఁ
గణ్వనారదరామాదిమునులు సెప్ప,నిచ్చ విన వైతి విటు చేటు తెచ్చుకొంటి. 9

క. నీకై ఘోరాహవముం గైకొని తెగినట్టిభీష్మసుటజాదిసుహృ
ల్లోకము తలంపు వచ్చినఁ, గాకుండునె నీకుఁ జింత కౌరవనాథా. 10

వ. అనిన నాంబికేయుండు పెద్దయుం బ్రొద్దు నిట్టూర్పు నిగిడించి దుఃఖార్తుం డై
యి ట్లనియె. 11

సీ. భార్గవరాముతోఁ బరమాస్త్రములు గొన్న,కురుపితామహుఁ డట్లు కూలుటయును
విల్లు వట్టినవారి కెల్ల గురుం డైన,గురు డట్లు రణభూమిఁ గూలుటయును
శతసహస్రము లైనసంశప్తకబలంబు,లెల్లనయ్యాని నట్లు త్రెళ్ళుటయును
ద్రౌణినారాయణాస్త్రము వృథావృథ యయి, పొల్లగా నిపు డట్లు పోవుటయును

తే. బలగము లవెల్ల వెల్లనై పాఱుటయును,గని మదీయులు శోకసాగరమునందు
మునిఁగియును గాందిశీకులై రని తలఁతు,వారిచేఁత లెట్టివొ యని లోనవగతు నిపుడు.

వ. ద్రోణప్లవంబు మునింగిన వెనుక రణార్ణవంబునంబడిన నాపుత్రకులును గృపకర్ణశల్యాకృత
వర్మాశ్వత్థామప్రభృతులు నేది దిక్కుగాఁ బారంబు ముట్టిరో సమరప్రకారం
బంతయుఁ జింత విడిచి వినెద నెఱింగింపు మనిన సంజయుం డి ట్లనియె. 13

క. నీయనయంబునం బుట్టిన,పై యెడ రిపు డావహిల్లె నందున వగవం
బోయెదవు తగదు దైవము, చేయఁగ నగుదాని కార్తి సెందరు విబుధుల్. 14

క. నావుడు ధృతరాష్ట్రుం డను, నేవగ పెట్లయిన వగవ నేటికి దిష్టం
బేవగఁ జేయం దలఁచెను, నావగ నగుఁ జెప్ప మట్టులయినఁ విందుఁ. 15

వ అనిన సంజయుండు. 16

సీ. అట్లు ద్రోణుఁడు వడ నస్వస్థచిత్తులై,నీపుత్రులును దొరల్ నెగులు గుడిచి
గతసత్త్వులై చేతికైదువుల్ జాఱంగ, మిన్నరయుచు నూరకున్నఁ గాంచి
నీసుతుఁ [illegible] నేను [illegible] కయ్యమునకుఁ గడకట్టినాఁడ

గురుఁడు ద్రెళ్లెనటంచుఁ గొదికి విషణ్ణులై, మీ రెల్లరి ట్లింత మేర గాదు
తే. పెనకువల కైనవారి కగును జయమ్ము, వధము దీన విచిత్రమ్ము వఱలఁ బోదు
లెండు పోరుకొనంగ నై గండుమిగిలి,కలఁడు చూడుఁడు దివ్యాస్త్రకలితుఁ గర్ణు.
సీ. ఎవ్వానిబలమునం జివ్వ కోడి నరుండు, బెగడె సింగమునకు మృగమువోలె
నెవ్వాఁడు పదివేలయేన్గులబలమునం, దనరుభీముని విషద్దశకుఁ దెచ్చె
నెవ్వానివరశక్తి యింతలో మాయావి, యగుఘటోత్కచు లీల నడఁచి వైచె
నెవ్వానికడ లోక మెల్ల వేల్మిడి నేర్చుఁ, గలమహాస్త్రంబులు గలవు పెక్కు
తే. లెవఁడు బాహుబలాఢ్యుఁ డై యెసక మెసఁగు,నట్టిదుర్వారవీర్యుఁ డై యలరుచున్న
కర్ణుఁడును ద్రోణపుత్త్రుఁడుఁ గలరు మనకుఁ,బెద్దప్రాపయి మీ రింతబెగడ నేల. 18
తే. విష్ణువాసవు లట్టులు వీరు కలుగ, మనకు రక్షకులై యుండ మఱియు మీర
లొక్కఁ డొక్కఁడ రిపుసేన నుక్కడంపఁ, జాలి యుండియు నిట్లుల జాలి నొంద. 19
వ. అని సర్వసమక్షంబున నయ్యంగపతి సర్వసేనాపతిం జేయుటయు నతండు రెండుది నంబు లుద్దండభండనంబు గావించి వేలకొలంది యోధులం గూల నేసి సవ్యసాచి చేతం గూలె ననిన ధృతరాష్ట్రుండు శోకవ్యాకులితాంతరంగుం డై సుయోధనుండును జచ్చెనకా దలంచి విహ్వలించుచు విగతసంజ్ఞుం డై భూతలంబునం బడి మూర్ఛం బొందినం గని వచ్చి గాంధారియు నంతఃపురాంగనలు నార్తనాదంబు గావించుటయు సంజయుండు వారి నూరార్చుచుండ విదురుండును వచ్చి భూధవుని సేదదేర్చిన నతం డెట్టకే లబ్ధసంజ్ఞుం డై లేచి కూరుచుండి పెద్దయుం బ్రొద్దు నిట్టూర్పు నిగిడించి మనంబునఁ బాండవుల నభినందించి తనవారి నిందించి తనబుద్ధిం గర్హించి నిధ్యాననిమీలితలోచనుం డై చింతించి చింతించి యెట్టకేలకు నింత ధైర్యంబు చిక్కఁబట్టుకొని సంజయునిదిక్కు మొగం బై యి ట్లనియె. 20
చ. వెడవెడ వింటి నీపలుకు వేఁడి వెలార్చెడుపిడ్గునాఁ జెవిన్
బడుట మనంబునం జొఱఁగఁ బాఱదు నాసుతుఁ డాసుయోధనుం
డడఁగ జయాశ సంయమని కైఁ జన లేదు గదా వచింపవే
కొడుకు యథార్థ మంతయును గొంతయుఁ దాపక యుండ వెండియున్. 21
తే. అనుడు సంజయుఁ డి ట్లను నతఁడు తెగఁడు,తెగియెఁ గర్ణుఁడు నాతనికగుకొమాళ్లు
నన్నదమ్ములుఁ దెగిరి నీయనుఁగుకొడుకు,దుస్ససేనుఁడునుం దెగె దురమునందు. 22
క. ఆదుశ్శాసనువక్షము, భూదయితులు సూచుచుండఁ బోరి వ్రచ్చి యమ
ర్షాదృతమతి యై భీముఁడు, సాదరముగఁ గ్రోలె నల్ల సంగ్రామమునన్. 23
తే. అనుడుఁ జీఁ కను శోకోపహతమనస్కుఁ, డగుచు నాయనఘుమ్మున నయ్యె నిట్లు

వనట విందును పేరిలో వారిలోనఁ, జచ్చి బ్రదికినవారిని నరగఁ జెపుము. 24

వ. అనిన సంజయుఁ డి ట్లనియె నట్లు పదిదినంబులు పోరి పాండవసైన్యంబున నర్బుదంబు వోకార్చి భీష్ముండును పాంచాలబలంబున నల్పావశేషంబుగం గూల్చి ద్రోణుం డును దండులో సాము గండడంచి కర్ణుండునుం గడతేరి రానర్తయోధుల వేలకొలం దిం గూలనేసి నీపుత్త్రులు వివింశతివికర్ణు లాభీమునిచేతం దెగి రావంత్యు లగువిందా నువిందులు దుష్కరకర్మం బాచరించి గతించిరి సింధురాష్ట్రాదిదశరాష్ట్రరక్షకుండు నేకాక్షౌహిణీపరివృఢుం డగు జయద్రథుండు ధనంజయునిచే హతుం డయ్యె యుద్ధ దుర్మదుఁ డగుదుర్యోధనసుతుండు సౌభద్రనిపాతితుం డయ్యె బాహుబలశాలి యగు దుశ్శాసనసుతుండు ద్రౌపదేయునిచేతం దెగియె దేవరాజప్రియుండును గిరాతాధి పతియు నగుభగదత్తమహీపాలుండు ఫాల్గునునిచేతం గూలెఁ గౌరవదాయాదుం డగుభూరిశ్రవుని సాత్యకి చెగఁగూల్చె క్షత్త్రధర్మరతుం డగుశ్రుతాయువు సవ్యసాచిం దాఁకి చచ్చెఁ జండశాసనుం డగుదుశ్శాసనుండు భీమసేనునిచే మడిసె బహుసహ స్రగజానీకపరిరక్షితుండగుసుదక్షిణుండు కిరీటిచే గీటడంగెఁ గోసలేశ్వరుండైనబృహద్బ లుండు సౌభద్రునిం దాఁకి యమక్షయంబు నొందె నీపుత్త్రుం డగు చిత్ర సేనుండు వృకోదరహతుం డయ్యె మద్రరాజాత్మజుం డగుశూరుం డభిమన్యుని మన్యువశంబునం ద్రెళ్లెఁ గర్ణపుత్త్రుఁ డైన వృషసేనుండును శ్రుతాయువును శ్వేత వాహనునిచే యమసాదనగతు లయిరి శల్యపుత్త్రుం డగురుక్మరథుండు సహదేవునిచేఁ జచ్చెఁ గేకయుం డగువృద్ధక్షత్త్రుండును భగీరథుండును దెగిరి భగదత్తసుతుండు నకులునిచే విహతుం డయ్యె నిపతామహుం డగుబాహ్లికుండు భీమసేనునిచేఁ బిలుకు మాలె మాగధుం డగుజయత్సేనుండు సౌభద్రునిచేఁ ద్రుంగె నీపుత్త్రు లగుదుర్ముఖ దుస్సహదుర్మర్షణదుర్విషహదుర్జయులు వృకోదరునిగదకుం బలి యైరి కళింగవృష కులును వృషవర్మయు భీమునిచేఁ గాలగతిం గాంచిరి నాగాయుతబలుఁ డగుపౌర వుండును శిబివసాతిశూరసేనాభీషాహకాళింగులును సంశప్తకులును నీమఱందు లైన వృషకాచలులును బీభత్సునిచే నిహతు లై రుగ్రకర్ముండును నోఘవంతుండును బృహంతుండును క్షేమధూర్తియు భీమునిచేఁ దెగటారిరి జలసంధుండు సాత్యకిహతం బడియె రాక్షసేశ్వరుం డగునలంబుసుండు ఘటోత్కచునిచేఁ నుక్కడంగెఁ గేకయు లును మాలవ మద్రక ద్రావిడ యౌధేయ లలిత్థ క్షుద్ర కోసీనర మావేల్లక తుండికేర సావిత్రీపుత్త్రకులును ప్రాచ్యోదీచ్యప్రతీచ్యదాక్షిణాత్యప్రముఖు లగు పెక్కండ్రును సవ్యసాచిచే సమసిరి మఱియు ననేకు లనేకులచేత మః బలంబు నం జచ్చిరి కుంతులును నారాయణులును బాలభద్రశూరులును గాంగేయునిచేతఁ

డెగిరి సత్యజిత్ప్రముఖపాంచాలురును విరాట ద్రుపదులును ద్రోణునిచేతం డెగిరి మహాప్రభావుండు సౌభద్రుండొక్కరుఁడు పెక్కురతోడం బోరి పోరి విరథుం డై దుశ్శాసనిచేతం డెగియె నంబష్ఠపుత్త్రుండు దుర్యోధనునిపుత్త్రుం డగులక్ష్మణునిచేతం డెగియె బృహంతుండు దుశ్శాసనునిచేతం డెగియె మణిమంతుండును దండధారుండును నంశుమంతుండును భోజరాజును ద్రోణునిచేతం డెగిరి సహపుత్త్రుం డగుసాముద్రచిత్రసేనుండు సముద్రసేనునిచేతం డెగియె నీలుండును వ్యాఘ్రదత్తుండును నశ్వత్థామచేతం డెగిరి చిత్రాయుధుండు వికర్ణునిచేతం డెగియెఁ గైకేయుండు కైకేయునిచేతం డెగియెఁ బార్వతీయుం డగుజనమేజయుండు దుర్ముఖునిచేతం డెగియె రోచమాను లిద్దఱును బురుజిత్కుంతిభోజులును ద్రోణునిచేతం డెగిరి యభిభువును గాశిరాజును వసుదానపుత్త్రునిచేతం డెగి రమితౌజసుండును యుధామన్యూత్తమౌజులునుం డెగిరి మిత్రవర్ధనుండును క్షత్రవర్మయును ద్రోణునిచేతం డెగిరి శిఖండితనయుం డగుక్షత్రదేవుండు లక్ష్మణునిచేతం డెగియె సుమిత్త్రుండును జిత్రవర్మయు ద్రోణునిచేతం డెగిరి వార్ధక్షేమియు సేనాబిందుసుతుండును బాహ్లికునిచేతం డెగిరి చేదీశ్వరుం డగుధృష్టకేతుండును సత్యధృతియు సేనాబిందుండును శిశుపాలపుత్త్రుం డగు సుకేతుండును ద్రోణునిచేతం డెగిరి సత్యధృతియు మదిరాశ్వుండును సూర్యదత్తుండును ద్రోణునిచేతం డెగిరి శ్రేణిమంతుండును మాగధుండును విరాటపుత్త్రు లగుశంఖోత్తరులును వసుదానుండును భీష్మునిచేతం డెగిరి మఱియు నబ్బలంబునం బెక్కురు పెక్కురచేతం డెగి రని చెప్పి యిప్పటి కున్నప్రధాను లగు వారిం జెప్పెద నాకర్ణింపుము మనబలంబునఁ గృప కృతవర్మాశ్వత్థామ శల్య సౌబల కేకయరాజపుత్త్ర వృషమిత్ర ప్రభృతులును దుర్యోధనాదు లగునీపుత్త్రులు కొందఱును వారిబలంబున ధర్మరాజభీమార్జుననమాద్రేయద్రౌపదేయసాత్యకిధృష్టద్యుమ్న ప్రభృతు లెందఱో బ్రదికి యున్నా రనిన శోకవ్యాకులితాంతరంగుం డై ధృతరాష్ట్రుండు. 25

ఉ. చిత్తము తత్తఱించె వినిచెప్పదు గాని యొకింత సేపు నీ
విత్తఱి నూఱకుండు మని యెంతయుఁ గంతిలి వెచ్చ నూర్చుచుం
దుత్తుము రైనధైర్యమున దొప్పలు దొరలు రా నశ్రువుల్
మిత్తికి నైనవానిగతి నిన్నక యుండి యొకింతలోపలన్. 26

వ. సంజయు దిక్కుమొగం బై కర్ణునిం దలపోయుచు ని ట్లనియె. 27

సీ. కర్ణుండు సింహవిక్రముఁడు వృషస్కంధుఁడును వజ్రకాయుండు ఘనయశుండు
జ్యాఘోషమున శత్రుసైన్య మల్లాడింపఁ, జాలినవీరుండు శౌర్యమూర్తి

గాండీవిఁ జీఁతికింగాని కొనండు భం,డనమున సింద్రునేఁజెనకుదు నను
నమ్మి వానిభుజాబలమ్ము నాపుత్రుఁడు,పాండుపుత్రులతోడఁ బగ వహించె
తే. నట్టి విలుకాఁడు పడినంతి నస్మదీయ,సైన్య మంతయుఁ బడినట్లు స్వాంతమందుఁ
జింత సేయుచు నుంటి నీచివ్వ నింక,విజయు మొందెద నను నాదు వెట్టికొడుకు. 28

—◆ ధృతరాష్ట్రుండు కర్ణమరణంబునకు పలవించుట. ◆—

తే. శార్ఙ్గగాండీవధన్వుల సమరమందు,నే నొకండన మడియింతునెఱుఁగు మనెడు
కర్ణవచనంబులన్ రాజ్యకాముఁ డైన,నాసుతుఁడు లోభమునఁజేసి నమ్మె నకట. 29
వ. అని మఱియును. 30
సీ. అరిగాపులం జేసె నంగనంగకళింగ,కేకయప్రభృతులం గెలిచి యెవ్వఁ
డెవ్వఁడింద్రాదుల కెత్తువచ్చి మహాస్త్ర,విదుఁ డయి సంగ్రామవిధులఁ బొదలు
రాజులలోన వైకర్తనుఁ డబ్లువఁ డ్ల,విలుకాండ్రలోఁ జేరు వెలసి యుండె
నెవనిబల్మిని లోక మేర్పుమాగధుఁడు కౌ,రవజాతిపైఁ గూర్మిఁ గ్రాల నుండె
తే. నతఁడు లోకైకవీరవిఖ్యాతబిరుద,విలసితుఁడు కర్ణుఁ డీరీతిఁబిలుకుమాల
వినిన నే నంబుధిఁ గం మవిసినయట్లు,లుండియుం దరిఁ గాన రాకుంటి నకట. 31
మ. చెలులుం జుట్టలు బందుగు ల్దెగ వినన్ జీవంబులం బాయ కే
నిల ని ట్లుండుటఁ జూడ నాహృదయ మెంతే వజ్రసారంబుగాఁ
దలఁతుం గా దన వ్రయ్య లై పడదె సూతా! యింక జీవించి యీ
పలుకష్టంబుల కోర్వఁ జాలఁ దెగుదుం బ్రాయోపవేశాదులన్. 32
ఆ. చేదు మ్రింగి చక్కఁ గా దేని చిచ్చునఁ,జొత్తుఁ గాక యున్న నెత్తుగలుగు
కొండనుండి క్రిందఁగూలుదు నవపుడు,సాంత్వనమున ననియె సంజయుండు. 33
చ. శ్రుతముఁ దమంబు నన్ యశము సూనృతవాక్యము శ్రీయునుం గులో
న్నతియును గల్గుటన్ నిను జనంబు దలంచెను నయ్యయాతికిం
బ్రతి యని యిట్టి నీ విటు లపారవిషాదము నొంది కుందుటల్
క్షితివర! పోలునే మనసుఁ జిక్కఁగఁ బట్టుము శాంతి పుట్టఁగన్. 34
క. నావుడు ధృతరాష్ట్రుం డను, దైవమె వర మంచు నెంచెదం బౌరుష మే
లా వమ్ము ననర్థము నగుఁ, గావున నత్యధికుఁ డయ్యుఁ గర్ణుఁడు నచ్చెన్. 35
చ. అకట బలారి దానవుల నట్టులు నెట్టనఁ బాండవేయులం
బ్రకటితశౌర్యసారమునఁ బట్టి వధించి నిజప్రతాపమున్
సకలజగంబు లెఱుంగఁగఁ బ్రశంసకు నెక్కునకర్ణుఁ డీల్గె నే
యిఁక వచియింప నేమిటికి నెల్లరు నీల్గిర కాదె సంజయా, 36

ఉ. కష్టము లందుపొందె విధి గల్గఁ జేసెను నాకు నెంతయే
నిష్టతతోఁ జిరాయు విటులే మని చెప్పెదఁ దొల్లి లోకసం
తుష్టికి నైననే నిపుడు దుర్దశ కై జనశోచ్యజీవి నై
భ్రష్టుఁడ నైతి నామనికి వ్యర్థము నా కెటు చావు వచ్చునో. 37

ఆ. కురుపితామహుండు గురుడును గర్ణుండు,పడినపిదప నాదుకొడుకు జయము
కోరుకొనుట తెలిసికొన దరిద్రమనోరథమ్ము నాఁగఁ బడుచు వమ్ము గాదె. 38

క. మనదుశ్శాసనకర్ణులు, ఘను లాలమునందుఁ బగఱఁ గడతేర్చి జయం
బొనగూర్తు రనెడునాసం, గొనియున్న కుమారుఁ డెట్లొకో యిపు డుండున్. 39

సీ. మన మెుందు దలఁచినఁ బనియు వేఱొం డయ్యె,బలవత్తరమ్ము దైవమ్ము తలఁప
దురతిక్రమము కాలమరయ ధర్మసుతుండు, వచియించి పుచ్చె పో ర్వలవ దనుచు
నామాట నాపుత్త్రుఁ డవఘళించె రోగి, పథ్యాపథము వోలెఁ బ్రజ్ఞ చెడఁగ
శరతల్పగతుఁ డైన శాంతనవుం డంతొ, బుజ్జగించుచు నాదుపుత్త్రుఁ బిలిచి

తే. పోరు వలదయ్య శాంతించి వారిఁ గూడి, భ్రాతృభావము నెఱపుచుఁ బాలొసంగి
యవని నేలుచు సుఖముండుమనియె దానిఁ, జెవఁ జెవిం బెట్టి యీరీతిఁ జెడియె వాఁడు.

ఉ. బాలకు లేక లూడ్చి యిలఁ జాఱఁగ వైచినపుల్గువోలె నే
నాలమునం గుమారకులు నాప్తులు మిత్త్రులు నిష్టబాంధవుల్
గూలినదాన నొండుకడకుం జనఁ జాలక దిక్కుమాలి యే
లీల మెలంగువాఁడఁ బరులే ననుఁ బ్రోచెడువార లింకిటన్. 41

వ. అని యనేకవిధంబుల దుఃఖించి ధృతరాష్ట్రుండు సంజయుచెస ముగంబు వెట్టి వెండియును. 42

క. నదిసుత భారద్వాజుల, సదమలయుద్ధమున గెలువఁ జాలెదు వారల్
త్రిదశులును లేరు మోసం, బదుకుచుఁ బాండవులు గెల్చి రని యంటికదా. 43

శా. ఆరీతి న్మనసూతపుత్త్రుఁ గపటవ్యాపార మేపారఁ గా
వారల్ ద్రుంచినవారు కారు గద భాస్వద్భాను తేజోయుతుం
డారాధేయుఁడు శక్రదత్త మగుశక్త్యస్త్రంబు వోకాఱినన్
ఘోరాకారభుజంగమాస్త్రమున సంకోచించునే పోరఁగిన్. 44

ఆ. పరశురాముఁ గొలిచిపడసెను బ్రహ్మాస్త్ర, మాదిగాఁగఁ బెక్కులస్త్రము లవి
తనకుఁ గలుగ నరులఁ దఱులుప కతఁ డిట్లు, తఱలి పోక వింత తెఱఁగు గాదె. 45

సీ. ద్రోణాదియోధులు దోర్బలం బఱి వీఁగ, నభిమన్యువిలు ద్రుంచి యతని నొంచె
హాస్యయుతప్రాయుఁ డగుభీమసేనుని, విరథుఁ గావించియుఁ బరిహసించె

సహదేవు నిర్జించి చంప నొల్లక ధర్మ, చింతాపరుం డయి సెనకి విడిచె
మాయాసహస్రసమంచితుం డగుశకునుటో, త్కుచు నింతలో శక్తిఁ దఱిగి వైచె
తే. నట్టిజగజెట్టి యగుకర్ణుఁ డట్టి చచ్చె, నేమి వచ్చెను రథభంగ మేని శరశ
రాసనచ్యుతి యే నమ్మెనయ్య! లేక, యెట్లు కర్ణుఁడు సచ్చెనో యెఱుఁగఁ జెపుమ.

శా. ఇం కేదేని పొసంగ కుండినను నొండేకారణం బైనను
గుం డెందు ప్రతిమానశక్తి యగునక్కోదండవిద్యాసునిన్
మ్రందింపం గలవాఁడు లేడు త్రిజగస్సమర్థ్యంబునన్ ఫాల్గునున్
మ్రందం జేయక కాల్చెఁ గర్ణ ననుచుం బో సాఁడె నాతం డయో. 47

మ. మది రాధాసుతభక్తి బట్టుటము మట్లన్ మా నేది ధర్మాత్ముఁ డ
ప్పదుమూఁడేడు లరణ్యమధ్యగతుఁడై వర్తించుచుం గంటిపై
నిదురం గాంచఁడు వానిప్రాపుకలిమిన్ నిక్కంబుగా నమ్మి నా
హృదయప్రోద్భవుఁ డిట్లు పాండవులతో నెంచెన్ సువిద్వేషమున్. 48

తే. పక్షపాతంబునం జేసి పార్థుల మన, ద్రోణభీష్ములు వధియింపఁ దొడర కున్న
నేన వధియింతు గాండీవ మేమి సేయు, నక్షయేషుధు లవి బ్రాఁతి యగునె నాకు. 49

చ. అని పలుమాఱు నాతనయుఁ డారయఁ బల్కెడు నమ్మహారథుం
డనిశముఁ గృష్ణపార్థుల నహంకృతి మీఱ నలక్ష్యవృత్తిమైఁ
గనుఁగొను నింద్రుఁ డెత్తినను గాని తెగం డనిఁ గర్ణుఁ డంచు నె
మ్మనమున నెంచుచుంటి నిటు మానక పోవుట లెంచ నక్కటా. 50

తే. సోమసూర్యప్రభల ధర శోభిలినను, సర్వశస్త్రాస్త్రవిదుఁడును శౌర్యమూర్తి
యైనరాధేయునకు సమరాంగణమున, నోటమి లభింప దని యెంతు నుల్లమందు. 51

చ. వల దని మిత్రు లందఱును వారక చెప్పిన నొప్ప కాత్మజుల్
తులువతనంబునం బనరి ప్రోడయు నాథునిసంధి కియ్యకో
ల్లలుపక వారికెగ్గులఁ బొసంగఁగఁ జేసిర కాదె దానికిన్
ఫల మయి వచ్చె నిట్లు తమ నమ్మినయల్లరు నెల్లి రయ్యయో. 52

వ. సంజయా! కర్ణదుశ్శాసను లిట్లయినంతఁ గృపకృతవర్మశకుని శల్యులునుం దక్కిన
రాజులు నేమి యగిరి సుయోధనుం డెట్లుసమరం బమరఁ జేసె నని మఱియును. 53

చ. గురునియనంతరంబున నకుంఠితవిక్రముఁ డైనకర్ణునిం
గురుబలనాథుఁ గా నిలుపుకో నగు నెట్లు లతండు భండనం
బరిదిగఁ జేయుచో రథనియంత యెవం డగు దెంచె దక్షిణో
త్తరములఁ జక్రరక్షు లయి దా నగునా నెన రెల్లఁ జెప్పవే. 54

క. సర్వముఖాద్యస్త్రంబులు, దర్పం బుడివోవ సూతతనయుఁడు దెగిపో
నేర్పడి పోరిన దెవ్వం, డేర్పడ విన నిచ్చగింతు నే నిపు డెడఁదన్. 55

—♦ సంజయుండు కర్ణునియుద్ధప్రకారము చెప్పుట. ♦—

వ. అనిన సంజయుం డి ట్లనియె నట్లు ద్రోణుండు దెగినపదంపడి ద్రోణపుత్త్రుండును విత
థప్రయత్నుం డై యుండ సుయోధనుండు సంధ్యాసమయంబున సేనలం దివియిం
చుకొని శిబిరంబునకుం జని మంత్రిసామంతాదులతోడం గొలువుదీరి సమరప్రసం
గంబు ప్రసక్తంపం జేయుచు ననంతరకరణీయం బెట్టిది చెప్పం డనుటయు నింగితజ్ఞుం
డును మేధావియు నగునశ్వత్థామ యెల్లవారలసమరోత్సాహంబు చక్కఁ బరీక్షించి
రారాజుంగాంచి యి ట్లనియె. 56

క. అనురాగంబును యోగం, బును దాక్ష్యము నయము ననఁగఁ బొసఁగెడు నాల్గున్
బనులు ఫలింపం జేసెడి, ననిరి బుధుల్ దైవబలము ననుకూలింపన్. 57

మత్త. నీతిమంతు లుపాయశాలులు నిత్యరక్తులు దక్షులున్
బ్రీతి నిన్ను భజించుచుండిరి పెక్కు రిక్కడ నిట్టి స
త్త్వాతిశాయివి నీవు గెల్చిన కాస సేయక రిత్త వో
నీతి గా దొకయోధుఁ డగ్గిన నెంచలెం గొని యుండుటల్. 58

మ. అభిషేకం బొనరించి కర్ణుఁ బతిగా నస్త్రచ్ఛమూరాకం
బ్రభవం బర్పెడి వైరులన్ గెలుత మప్పార్థుండు ముఖ్యుఁడు ప్రస్తు
త్రిభువ విఖ్యాతపరాక్రముం డని యునన్ వైవస్వతుం బోలి దో
ర్విభవం బొప్ప సమస్తశాత్రవుల నిర్జించున్ నిమేషంబులోన్. 59

వ. అని యాచార్యాత్మజుండు చెప్పిన నాకర్ణించి భవదాత్మజుండు కర్ణుండు తన్ను గెలి
పించు నని మనంబునం బద్ధయాశం బ్రతిష్ఠించుకొని భీష్మద్రోణులు వోయి రను
చింతం దిగఁద్రావి సంతసించుచు నతనిం జేరి యి ట్లని యె. 60

ఉ. మిత్త్రమ! నీపరాక్రమ మమేయము నాపయి సౌహృదం బనె
మాత్రము నాఁగ నేమిటికి మానవలోక మెఱుంగు నంతయున్
ధాత్రి భవత్సమానుఁ డగుధన్వియు దంటయు లేదు నేను నీ
గోత్రము నీవు నాదయిన గాత్రమువుం గతియుం దలంపఁగన్. 61

శా. భీష్మద్రోణుల నాదరించితిని నీ పేర్కొలుల వారునుఁ
గ్రీష్మాదిత్యుల యట్టు లయ్యుఁ బగఱం బ్రేమించుచు న్వారి క
ర్పిష్మచ్ఛస్త్రముఁ జూప రెప్డు తుది నా రే కోరుచున్ ముక్కునం
దూష్మంబు న్వడి నట్టిరే రనఁగ నే ముందున్ నయస్యాగ్రణీ. 62

మత్త. ఆదినుండియు నీవ నాకు జయంబొసంగఁ గలాఁడ వ
న్మేదురాశయ మున్న దానికిఁ మేర గాఁ బడవాల వై
నీదుసేనల నెల్ల నడ్పుము నీక నీ వభిషేకముం
బ్రోదిఁ గైకొని వేల్పుమూఁకలఁ బ్రోచునగ్నిభవుం డనన్. 63

సీ. సేనాని వై నీవు దానవులఁ మహేంద్రుఁ, డట్లరులం దోలు మాఱుమందు
విలు పూనియున్ననిన్ వీక్షింపఁ బాండవుల్, తెగుదురు హరిఁ గన్నదితిజు లట్లు
ప్రాగ్దిన కిరు లెల్ల సద్దుమణఁగినట్లు, నీ తేజు శత్రుల నెఱి హరించు
నినుఁ జూచి రణరంగమున నర్జునుఁ డోర్కింత, నిలునఁ జాలఁ డటంచు నేఁ దలంతు

ఆ. ననిఁ గర్ణుఁ డనియె మును చెప్పితిని బొందు, సుతుల నేన గెలుతు హితులు మెచ్చ
సైన్యవిభుఁడ నగుదు సంశయింపకు మయ్య, సుస్థిరుండ వగుచుఁ జూడు మిపుడు. 64

—♦కర్ణునకు సర్వసేనాధిపత్యము గట్టుట♦—

వ. అని రాధేయుఁడు పలికినం గులుకుచు గాంధారేయుండు శాతకుంభమయకుంభంబుల విమలజలంబులు దెప్పించి పుణ్యగంధౌషధీమణిముక్తాఫలకలితంబు లగువాని మంత్రపూతంబులు గావించి సకలసంభారసంభృతం బగునొక్కసమస్థలంబున క్షౌమసంవృతం బగునౌదుంబరాసనంబున సూతసూను నాసీనుం జేసి పుణ్యాహవాచనంబులును దూర్యనినాదంబులును జెలంగ నభిషేకించుటయు నతండు రౌడవమాత్రాండుఁ డనం దేజరిల్లుచు భూసురోత్తములకు గోభూహిరణ్యాదిదానంబు లొసంగి వారియాశీర్వచనంబులం బొంది పుండరీకాక్షసహితు లగుపాండవులఁ గెలువు మనువందిమాగధస్తోత్రపాఠంబులు చిత్తగించుచున్నం గని భవత్పుత్రుండు తన్నుఁ గృతార్థునిఁగ భావించె నిట్లు సర్వసేనాధిపత్యంబు వడసి కర్ణుండు సముదీర్ణుండై ప్రభాతంబైనపదంపడి పడవాళ్ళం బుచ్చి సేనల సమకట్టించుమనంత దంతావళాశ్వరథసంభ్రమస్వనంబులును యోధుల పరస్పరాహ్వాన నిస్వనంబులును శంఖభేరీమృదంగాదిధ్వానంబులును బదఘట్టనసముద్ధితరజశ్చయంబును నేకీభూతంబై నభంబు ముట్టె నట్టియెడ నయ్యంగమహీవల్లభుండు. 65

సీ. శ్వేతకేతనసముచ్ఛ్రితనాగకక్ష్యాభిరామంబు హేమపింజితంబు
బకకంఠకావర్ణవిస్ఫురజవనాశ్వ, యోజితం బర్కప్రభోచితంబు
తూణీరశతపూర్ణతుంగబాణసహస్ర, సంభృతంబు శతఘ్నిసంచితంబు
నుత్తాలతాలసమున్నతకార్ముక, చయసముదీర్ణంబు సమరజైత్ర

తే. మైనదివ్యరథంబున నధివసించి, కాలసర్పంబు కరకేలఁ గ్రాలఁ బట్టి
[illegible] ముదాత్త గతిని. 65

తే. అట్టులుండఁగ రథయుగనాధిరథునిఁ గని మునుపడి మనవారు ధునిజఘటజ
ముఖులు లేనట్టికొఱఁతను బోకడంచి, నాకు నొత్తిరి మొత్త మై చదలు నిండ. 67

వ. అంత నంగమహీకాంతుండు సర్వసేనాసమేతుం డై రణరంగంబునకుం జని మకరవ్యూహంబు పన్ని యందుఁ దుండంబునఁ దానును నేత్రంబుల సౌబలోలూకులును శిరంబున గురుపుత్త్రుండును గంధరంబున దుశ్శాసనప్రభృతు లగుభవత్పుత్త్రులును నుదరంబున మహాబలాన్వితుం డగుదుర్యోధనుండును ముందటివామపాదంబున నారాయణగోపాలయుతుం డైనకృతవర్మయు దక్షిణపాదంబునఁ ద్రిగర్తదాక్షిణాత్యసంవృతుం డగుగౌతముండును వెనుకటిసవ్యచరణంబున మద్రసేనతో మద్రేశ్వరుండును నపసవ్యచరణంబున రథసహస్రదంతిశతత్రయంబుతో సుషేణుండును బుచ్ఛంబున మహాసేనతోఁ జిత్రచిత్రసేనులునుగా నమరించుటయు నంతకు మున్న చతురంగచమూసమూహంబుతో నరుదెంచి యున్నధర్మజుండు మనసైన్యసన్నాహంబు గన్నారం గాంచి గాండీవిం బిలిచి యి ట్లనియె. 68

మ. కనుఁగొంటే హతశేష మ్ముబలమ్ము గైకొంచుఁ గర్ణుండు నే
ర్పునఁ దా నొడ్డన మాచరించుకొనుచుం బోరంగ నేతెంచెడిన్
గొని నీనిన్ భవదీయబాహుబలముం గొంటాట కెక్కంగ వ
ల్మని గాండీవగుణచ్యుతోచ్ఛ్రితపృషత్కాసారపూరంబుగన్. 69

క. విను పంద్రెండేఁడులు గా, ఘనతర మై నాదహృదయగమ్మగుశల్య
మ్మును వెలికివేయసమయము, ఘనభుజునకు నీకు నిపుడు కలిగెం జూవే. 70

తే. ఇపుడు తోఁచినగతి నిటనీవు నొక్క, మొగ్గరంబు రచింపు పెంపగ్గలముగ
ననవుడును సవ్యసాచి యట్లగుత మనుచు, నర్ధచంద్రాకృతిన్ వ్యూహమమరఁ జేసె.

వ. దానివామపార్శ్వంబున భీమసేనుండును దక్షిణపార్శ్వంబున ధృష్టద్యుమ్నుండును మధ్యభాగంబున ధర్మరాజధనంజయులును ధర్మజునిపిఱుంద నకులసహదేవులును ధనంజయునిపిఱుందఁ జక్రరక్షకు లగుయుధామన్యూత్తమౌజులును దక్కినవారు దక్కినంగలభాగంబులందును మహోత్సాహంబున నిలిచి రిట్లిరువాఁగునుం బన్ని కయ్యంబునకుఁ గట్టాయితం బై యున్నయప్పుడు. 72

మత్త. సూతపుత్త్రవినిర్మితం బయి సొంపుమీఱెడువ్యూహమున్
నీతనూజుఁడు సూచి పార్థు లనిం బడంగల రంచు నా
శ్వేతవాహను వ్యూహమున్ నరుజ్యేష్ఠుఁ డెంచి కురుక్షయం
బై తలిర్చెడు నంచు సంతస మంది రాత్మగతంబుగన్. 73

వ. అంత నుభయసైన్యంబులందును. 74

—◆శకుని పరాక్రమ యుద్ధము◆—

సీ. శంఖనాదములతో ఝర్ఝరంబులు వియ్య, మంద సింహధ్వను లానకములు
పణవదుందుభులతోఁ బంతమాడఁగ డిండిమంబులు భేరులు మచ్చరింప
ఘంటానినాదముల్ కరిబృంహితములతో, హేషాస్వనములతో భాష లిడఁగ
ఖురఘట్టనధ్వనుల్ శరపాతశబ్దముల్, రథనేమిరుతులకు రవళిఁ గూర్పఁ

తే. గూడి యిన్నియు బ్రహ్మాండకుహర మెల్ల, నిండుకొనునట్టులై నింగి నేల వ్రీలి
పగిలిపోయెడు ననఁ బర్వె భయద మగుచు, భూతలంబునఁ గలయెల్ల భూతములకు. 75

క. ఇట్లిరువాఁగుం గలపడి, పోట్లాడం జొచ్చి రిచ్చ పొంపిరిపోవన్
జట్లిపడు తలలు నాయువు, పట్లం దెగి కూలుకాలుబట్లుం గలుగన్. 76

ఆ. చదలనుండి పడెడు జలజంబులన వద,నములు గరుడపాతితములు సర్ప
ములన బాహువులును బాలికలనం గప్పె, నెడము లేనియట్టు లెందు నేని. 77

తే. శరపరంపరలం దెగి హరులనుండి, కరులనుండియు స్యందనాగ్రములనుండి
పడిరి జోదులు పుణ్యంబు సడలినంతఁ, గ్రిందఁ బడుస్వర్గవాసులచందమునను. 78

వ. మఱియు నరదంబులు నరదంబులును ద్విరదంబులు ద్విరదంబులును దురగంబులు దురగంబులును గాల్వురు గాల్వురునుం గలపడి మడియుటయ కాక రథికులతోడ రావుతులును రావుతులతోడ రథికులును రథములతోడ నాగంబులును నాగంబులతోడ రథంబులును బత్తులతోడ నాశ్వికులును నాశ్వికులతోడఁ బత్తులును రథపత్తిద్విపంబులతోడ గుజ్జంబులును గుజ్జములతోడ రథపత్తిద్విపంబులును మఱియు ననేకప్రకారంబుల నిర్మర్యాదంబుగం బోరి తలలు గాళ్ళు నేతులు తుండంబులు గండంబులు దెగి పెక్కుబలం బుక్కుమడంగ నక్కరిణి ఘోరసంగ్రామంబు సెల్లుచున్నంత ధృష్టద్యుమ్న శిఖండి ద్రౌపదేయ సాత్యకి ప్రభృతులు పాంచాల పాండ్య చోళ చేది ప్రభద్రక ద్రావిడ కాశ కరూశ కేకయ కోసల మాగధాదిబలంబులతో మనబలంబులపైఁ బడి తాఁకుచున్నసమయంబున. 79

—◆క్షేమధూర్తి భీమునితో యుద్ధము చేసి చచ్చుట◆—

మ. వరరత్నస్థగితార్జునాయసమహావర్మంబు మైఁ దాల్చి భా
స్వరతారాపరిసద్ధశారదనభోభాగంబు నా నొప్పి భా
సురభూషాంచితగంధసింధురముపై శోభిల్లి పూర్వాచలో
పరిభాస్వద్ధరిదశ్వుఁడో యన నభస్వత్పుత్రుఁ డత్యుద్ధతిన్. 80

క. తోమరహస్తుం డగుచున్, సామజసంఘములతోడ సంగ్రామభువిన్
భీమాకృతిఁ జూపట్టిన, భూమీశుల కెల్ల వెగడు పుట్టె నరేంద్రా. 81

సీ. అపుడు కులూతేశుఁ డగుక్షేమధూర్తి మ, త్తేభంబుపై నెక్కి యెదిరి వాని
నిలు నిలు మని దంతిఁ గొలుపుటయును రెండు, మదపుటేన్గులు రేచి మాఱుకొనియె
నా రొకళ్ళ నొకళ్ళు వడిఁ దోమరంబులఁ, బ్రహరించుకొనుచును బ్రహరిఁ దిరిగి
వచ్చుచుం బోవుచు హెచ్చి పోరుచు వర్మ, ములు చించుకొనుచు నార్పులు సెలఁగ
తే. విండ్లుఁ గొని శరములు విడుచుకొనుచు, క్ష్వేడితాస్ఫోటితంబులు చేసికొనుచు
నిగుడఁ గొనిచలంబునఁ బెద్దసేపు, నిగుడియక పోరి రిద్దఱుఁ బెచ్చుపెరిగి. 82

వ. అంత క్షేమధూర్తి క్రోధమూర్తి యై. 83

ఉ. భీమునివక్షభాగమునఁ బిమ్మట వుట్టఁగ నాఱు నొండు నేల్
తోమరముల్ నిగిడ్చి తనతోయము వారలు మెచ్చ నార్చె నా
భీముఁడు నస్తనస్థి యగు నేఁడివెలుం గన నొప్పి వానిపైఁ
దోమర మొండు వైచె రవితోఁ దులఁ దూఁగుచు మాడుదానిసన్. 84

వ. అంతం గులూతపతియు. 85

మ. పది వాలమ్ములఁ దోమరంబు చిదురై పర్వంగఁ గావించి య
ర్వది బాణమ్ములు భీముమేన నినిచెన్ బ్రత్యర్థు లల్లాడ న
య్యదనన్ వి ల్గొని వాయుసూనుఁడు మహోగ్రాకారుఁ డై వేనవేల్
ప్రదరంబుల్ నిగిడించి నొంచెఁ గడిమిం బ్రత్యర్థిశుండాలమున్. 86

తే. అది శరార్దిత మై నృపుఁ డాఁగ నిలక, గాలితాఁకున మేఘంబుగతిని దెలఁ
దటిమె భీముఁడు నెన్నంటి ధరణిపతియు, నట్లకే నిల్పి బాణముల్ బెట్టువఱపి. 87

సీ. అనిలనందనుశరాసన మొక్కక్షురమునఁ, దెగ నేసి గజముపైఁ దిగిచి పెక్కు
నూపు లేసిన వాని కోప కయ్యాది కొంత, వడికి నేలం బడె వడముడియును
వడి గదాపాణి యై పుడమికి డిగి కులూ, తాధినాథునిదంతి నడఁచె కెట్టు
పాటునని నేలపాలుగా నాయుధ హస్తుఁ డై యక్కులూతాధిపతియు
తే. నెదురుకొన వానిఁ దనచేతి గదకు నప్పు, నముగఁ జేసిన నాతఁ డా నాగముకడఁ
బడిమె వజ్రాహతం బైనపర్వతంబు, పగ్గఁ దెగి పడ్డసింహంబు పగిది దోప. 88

తే. అక్కులూతానసేనాధుఁ డట్లు పడిన, నరసి కౌరవసైన్య మంతయు వ్యథిత మగుచుఁ
దైలబరియు నగఁ గర్ణు డుర్దీర్ణుఁ డగుచుఁ, బాండవానీకినిం దాఁకి బదలుపఱచె.

క. అఱచునవి వెఱచునవి యున్, విఱిగెడునవి తెఱలునవియు విచ్చెడునవియుం
బఱచునవి పడెడునవియై, నెఱి దప్పెం గరులు కర్ణుని శితాస్త్రములన్. 90

వ. ఇట్లు పాండవబలంబు లెల్ల నల్లకల్లోలంబు పడుచుండ నకులుండు రాధేయుని భీమసేనుం
డశ్వత్థామను శ్రుతకర్మ చిత్రసేనునిఁ బ్రతివింధ్యుండు చిత్రుని ధర్మరాజు రాజరాజును

సవ్యసాచిసంరక్షకులను ధృష్టద్యుమ్నుండును గౌతముని శిఖండి కృతవర్మను శ్రుతకీర్తి
శల్యుని సహదేవుఁడు దుశ్శాసనుం దలపడి రప్పుడు. 91

—విందానువిందులు సాత్యకిచేఁ జచ్చుట.—

క. విందానువిందు లాయదు, నందనుని దాఁకి నిశితనారాచములన్
గ్రందుకొని మదగజంబులు, చందంబున నొప్పి రణము సలిపిరి పెలుచన్. 92

ఉ. నవ్వుచు నాశినిప్రభుఁడు నల్గడ నిండఁగ బాణవర్షమున్
నివ్వటిలంగఁ జేసి కడు నేర్పున వారల వింట్లు రెండునుం
ద్రెవ్వఁగ నేసి వారిపయిఁ దీక్ష్ణశరంబులు పర్వఁ జేయుడున్
రివ్వున వేఱువింట్లు గొని రేఁచి సహోదరు లుగ్రమూర్తులై. 93

క. కరలాఘవంబు మెఱయన్, శరములు నిగిడించి మించి సాత్యకివిల్ ద్రుం
చి రయంబున దశదిశలన్, బరఁగించిరి గాఢతమము పయిపయిఁ గ్రమ్మన్. 94

ఆ. కటకదుర్మదుండు యదువీరుఁ డుగ్రుఁడై, వేఱొకండు విల్లు వెసగ్రహించి
గనయమునను గొనయము నమర్చి యనువిందు, తల క్షురప్రమునను దఱిగివైచె. 95

తే. కనకకుండలమండితగండ మైన, తమ్ముతల శంబరాసురుతల తెఱఁగున
నేల వ్రాలంగఁ గని క్రోధనిర్భరహృదయుఁ, డైనవిందుఁడు కార్ముకహస్తుఁ డగుచు.

పంచ. శిలాశితమ్ము లైనపత్త్రజిహ్మగమ్ములన్ శినీ
కులప్రభూతు నొవ్వ నేసి కో యటంచు నార్చుచున్
దలంక నేల నిల్చి నిప్రతాప మార్తు నంచుఁ బె
క్కు లమ్ము లేసె వానిబాహుకోటిపై నురమ్ముపైన్. 97

మ. క్షతసర్వాంగుఁడు సత్యకాత్మజుఁడు వాసంతాగమోద్యత్సుమ
ప్రతతిం బొల్చెడు కింశుకం బనఁగ నై ప్రత్యర్థిపైఁ బంచవిం
శతి శాతాశుగముల్ నిగిడ్చి నగుచున్ శౌర్యం బవార్యంబు గాఁ
బ్రతిలే కా మొనర్చెఁ గైకయుఁడు కోర్వన్ రానిచందంబునన్. 98

వ. అంత విందుండును బాహాబలగర్వంబునం బ్రతిఘటించి పోరె నవ్విధంబునం
బోరు ప్రవర్తిచుచున్నంత వా రన్యోన్యంబు కార్ముకంబులు ఖండించుకొనియు సార
థుల జంపుకొనియుఁ దురంగంబులం ద్రుంచుకొనియు విరథు లై కరవాలశరపాణం
బులం గొని ధరణికిం డిగి దేవాసురసంగ్రామంబున జంభవాసవు లట్లసియుద్ధంబు
నకుం దొడఁగి వివిధవిధమండలాదిప్రచారంబులు గావించుచు నొకళ్లొకళ్ళ వఱపుళ్ళ
త్రోడం బలుకలు పఱిగాఁ జేసికొని పరస్పరవధాభికాంక్షు లై యున్నంత
శైనేయుం డనువెఱింగి. 99

తే. వ్రేటు తప్పించుకొని వెడవ్రేటు దోఁప, నేపునం ద్రిప్పి కరవాల మేసి విందు
శిరము ఖండించుటయు వాఁడు ధరణిఁ బడియె, నశనిపాతంబున మహీధ్రమనఁ గదొచి.

వ. ఇట్లు విందాను విందులం గడతేర్చి శైనేయుండు యుధామన్యునరదం బెక్కియు
నొక్కింతలోన వేఱొక్కరథంబు సన్నద్ధంబు చేసికొని కేకయానీకంబులం దఱిమిన
వారు వానిమునుసుసుకున నిలువం జాల కాలంబు వీడి పఱచి రంత. 101

సీ. శ్రుతకర్ముఁ డభిసారపతిఁ జిత్రసేనునిఁ, దాఁకి యేఁబదిపృషత్కములు విసరె
నతఁ డాతనిం దొమ్మిదమ్ముల నొప్పించి, సూతు నైదింటన సొగియ నేసె
నీసున నాద్రౌపదీసుతుం డెగిచి మేల్మార్గణంబుల వానిమర్మదేశ
మాడ నేసిన నతం డోడి మూర్ఛాసమన్వితుఁ డయి కశ్మలావిష్టుఁ డయ్యె

తే. నంతలో శ్రుతకీర్తియు నరుగుదెంచి, మూర్ఛితునిఫాలదేశముఁ జేర్చి నవతి
శాతశరములఁ గప్పె నాసమయమందుఁ, దెలిసి యభిసారపతి క్రోధకలితుఁ డగుచు.

ఆ. వాఁడితూపు లేఁడు వడి నేసి శ్రుతకీర్తి, విల్లు విఱిచె నతఁడు వేఱువింట.
శితశరంబు లేసి జిత్రసేనునిఁ జిత్ర, రూపధరునిఁ జేసె నేపుమీఱి. 103

తరళము. సరకు సేయక వాని నయ్యభిసారుఁ డాశ్రుతకర్ముపే
రురము గాఁడఁగ నేసి నారస ముక్కఁ డెక్కడి కేగుదో
నరవరాత్మజ! నిల్కు నిల్కని నవ్వు ... మునఁ జూపె నె
త్తురులఁ బూచినకింశుక మ్మన నొప్పె ... శ్రుతకీర్తియుఁన్.
104

చ. పగతునిచేతివి ల్విఱిచి బాహుబలంబు చలం బెలర్పఁ గాఁ
దగి త్రిశతాంబకంబులను దత్తను లెల్ల ముసుంగువెట్టి బె
ట్టుగ నొకవాలుతూపునఁ గడుంగడు వేఁడివెలార్చి తచ్ఛిరం
బగు నని చూప తెన్ను ధరయందుఁ బడం దెగ నేసె నీసునన్. 105

వ. అట్లు యదృచ్ఛాచ్యుతం బైనచంద్రమండలంబు వోలెం నేలం బడినచిత్రసేనుని
సశిరస్త్రాణశీర్షంబు గాంచి తత్సైనికు లెల్లరు నొల్లంబోయియుఁ బెల్లురేగియు
నున్నం గని శ్రుతకర్ముండు క్రుద్ధుండై పరేతరా ట్టంతకాలంబున భూతంబులం
బోలెఁ బాఱదోలుటయు వారు దావదగ్ధంబు లగుద్వీపంబులో యన నలుగడం
బఱచి రంతఁ జిత్రుఁ డెదిరించుటయును. 106

—ప్రతివింధ్యుండు చిత్రుం జంపుట.—

మ. ప్రతివింధ్యుండు నవంధ్యవిక్రమమునన్ భాసిల్లి భాస్వన్మహో
చ్ఛ్రితశాతాశుగపంచకంబు వడి తచ్ఛీర్షంబుపై నేసి స
న్నతపర్వంబులు మూఁడుసాయకములం దత్సైంధ నొప్పించి మిం

చి తదీయధ్వజ మొక్కనారసమునన్ భేదించె నంచద్గతిన్. 107

సీ. చిత్రుండు తొమ్మిదిశితభల్లముల వాని, భుజములు నురమును బొంద నేసెఁ
బ్రతివింధ్యుఁ డలిగి తద్ధృతచాపమును దున్మి, వాని నేనమ్ములఁ బూని యేసె
నేసిన నీ సెక్కి వాసి నాతం డగ్ని, కెత్తు వచ్చినశక్తి నెత్తి వైచె
వడి వచ్చుదాని నాప్రతివింధ్యుఁ డకీలించి, రెండుతుండెములుగాఁ జెండ నదుము

తే. నది యుగాంతమునం బడునశని పోలె, నేలఁ బడుటయు గని రుక్మజాలభూష
తం బయినగదాదండంబు బాల్చి చిత్రుఁ, డయ్యుధిష్ఠిర నందనునంట వినఁ. 108

క. అది గుఱ్ఱములను సారథి,సదమద మొనరించి రథము జర్జరితము గా
నొదవించె నంతలో ద్రౌపదిపుత్రుఁడు తేరు డిగ్గి బరవస మెసఁగన్. 109

ఉ. బంగరుదండముం గలిగి భాసులుశక్తిని బూని చిత్రుమై
సంగతి గాఁగ నేయుటయు సాహసి మేర్పడ నాతఁ డుగ్రభం
గిం గడ తేర్పఁ గా నెదుటికిం జనుదెంచెడుదానిఁ బట్టి కొ
ట్టెం గురువంశభూషు గడిందిమగంటుమి మింట మ్రోయఁగన్. 110

వ. ఆశక్తియుఁ బ్రతివింధ్యుని దక్షిణభుజంబు భేదించి పడుగువలెఁ బుడమిం బడి పొడ
వడంగె నంత నంతకపాత్రుండు చిత్రుం జంప నెంచి క్రుద్ధుం డై. 111

మత్త. హేమభూషితమైనతోమర మెత్తి యేయుటయు న్వడిన్
దోమరం బది చిత్రువర్మము దూఱి శత్రునిపతిముక్
భీమపాతమునం బగిల్చినఁ బిమ్మటం బడి చిత్రుఁ డు
భూమిపైఁ బడి బాహుయుగ్మము పూఁచి చాఁచి గతాసు డై. 112

వ. ఇట్లు నిహతుం డైనచిత్రునిం జూచి యేచి సైనికు లాప్రతివింధ్యుం జుట్టుముట్టి
తట్టులు గిట్టునట్లు నానావిధబాణంబు లేయుచు నభ్రగణం బాదిత్యునిం బలె
ముసుంగు వెట్టిన నతండు బాణజాలంబున వజ్రహస్తుండు దైత్యదానవసైన్యంబుం
దోలినపోలికం దోలుటయును నీవారు వాతనున్నవారిదమ్ములు పోలె విఱిగి పఱచి
రాసమయంబున నశ్వత్థామ భీమసేనుం దాఁకుదెంచి. 113

—అశ్వత్థామ భీమునితో యుద్ధము చేయుట—

మ. ఉరలిదొడ్డ దులతేంద్రశస్త్రము మన నొత్తరంపునారాచ ము
డలఘుప్రక్రియ నేసి నెంబడి నవత్యత్యంత ఘోరాశుగం
బులు మర్మంబులు హస్తలాఘవము పెంపుం జెందఁ గా నేయుఁడున్
బలభిత్తుల్యపరాక్రముం డతఁడు భాస్వంతుండు నా భాసిల్లెన్. 114

ఆ. అంతశరసహస్ర, మడరించి పాండుపుత్రుండు ద్రోణపుత్రుదొడ్డరథము

ముసుఁగు వెట్టి బెట్టుపస సింహనాదంబు, ఘోషఁగఁ జేసె దెసలు బూరటిల్ల. 115

**తే.** భీమశరములు శరములు వెస నడంచి, ద్రౌణి వానిలలాటము దాఁకనేసె.
నారసం బొక్కఁ డద్దాన మారుతభవుఁ, డొసఁగెశృంగసంయుతమగుఖడ్గమృగమురీతి.

**చ.** వడముడి మూఁడుబాణములు వానిలలాటమునందుఁ గ్రుచ్చి పెం
పడరఁగ నవ్వుడుం గడు నహంకృతి మీఱ నతండు వానికిం
దడిసినమూఁడుశృంగముల ధాత్రిధరం బన నొప్పి భీమునిన్
బిడుగుల కెత్తు వచ్చు కడు భీమశరంబుల నొంచె నొచ్చఁగన్. 117

**వ.** ఇట్లిద్దఱు నుద్దవిడి నస్త్రప్రత్యస్త్రంబులం బోరి పోరి మహామారుతంబు పర్వతంబులం బోలె నొకళ్లొకళ్లం గదలింప నేరక వా రన్యోన్యశరసంఛన్నరథులై ప్రతాపాతపంబు గాయుచు లోకసంతాపకరులైన దివాకరులునుం బరస్పరంబు దపింపఁ జేసి కొనుచుఁ గృతప్రతికృతప్రయత్నులై శరదంష్ట్రలును శరాసనవక్త్రంబులును గలవ్యాఘ్రంబులునుం జెన్నొప్పి బాణజాలసంఛన్నులై మేఘజాలసంఛన్నులైన చంద్రాదిత్యులుం జందంబునం జొందుపడి ముహూర్తమాత్రంబున వారివాహవిముక్తాంగారకబుధులవిధంబునం బొదలి యొండొరులం బ్రజ్వలించి శరసంచయంబు నిగిడించికొనుచు మండలవిభాగగతప్రత్యాగతాదిమార్గంబులం బరిభ్రమించుచు నన్యోన్యవధాభికాంక్షులై మహాస్త్రప్రత్యస్త్రంబులం బ్రళయకాలగ్రహంబులక్రమంబున మహాయుద్ధంబు సేయుచున్నంత నంతరిక్షం బంతయు బాణసంవృతం బయ్యె బాణప్రహారసంజాతోల్కాపాతంబు లుభయసైన్యదాహకంబు లయ్యె నయ్యెడ నంతరిక్షచరులైన సిద్ధచారణు లిద్దఱయ్యు నిట్టి బెట్టిదంబగుయుద్ధం బెన్నఁడుం గని విని యెఱుంగ మీయుద్ధంబున కేయుద్ధంబులును షోడశాంశమున కైన సాటిరా వీబ్రాహ్మణక్షత్రియు లెంతకైనం జాలినవారు వీరిజ్ఞానంబును శౌర్యంబును బరాక్రమంబును గృతాస్త్రత్వంబునుం జలంబును బలంబు నింత యొప్పవే వీరు కాలాంతకయమోపములు వీరిద్దఱును రుద్రులు నిద్దఱు నాదిత్యులు ననుమాటలతో మాటిమాటికిని సింహనాదంబులు సెలంగ హాహా భీమసేన! హాహా ద్రోణనందన! మేలు మే లని ప్రశంసించుచుండి రయ్యవసరంబున. 118

**శా.** శూరాగ్రేసరులైనవా రరుణచక్షుష్మంతులై యొండొరుల్
క్రూరాస్త్రంబుల నొంచుకొంచుఁ బడగల్ కోదండముల్ ముక్కలై
షో రథ్యంబులు డయ్యఁ జేసికొనుచుం బోరాడు చన్యోన్యమున్
నారాచంబులు దాఁకి తేరులపయిన్ గ్రాలైరి మూర్ఛాకలిన్. 119

**క.** వారలనిప్పుర నిప్పరు, సారథులును దెలిసి సర్వసైన్యము సూడన్

బోరునకుం గా కుండఁగ, దూరముగం దొలఁగి పోవఁ దోలిరి రథముల్. 120

వ. అనిన విని ధృతరాష్ట్రుండు సంజయునిదిక్కు మొగంబై సంజయా! సంశప్తకులతో సవ్యసాచి కెట్లు సమరంబు సల్పె మఱియు నన్నరునితో నశ్వత్థామప్రభృతియోధాగ్రగణ్యు లెదిరించిరే కదనం బె ట్లయ్యెం జెప్పు మనిన నతం డద యంతయుం జెప్పెద నాకర్ణింపు మని యిట్లనియె న ట్లర్జునుండు సంశప్తకబలంబునం జొచ్చి మహావాతం బర్ణవంబునుం బోలెఁ గలంచుచు. 121

సీ. శితశరంబుల వీరశిరముల వేగ నేసి, మోహనాస్త్రమ్ముల నేల గూలఁగ వెట్టి
సాయుధాయుధదిగ్ధహస్తోరగంబులఁ, ద్రుంచి భూషణప్రోవు లెంచ నిలిపి
సాదులతో హయసామజాదులఁ ద్రుంచి, నిర్వక్త లై యరదముల్ సెదరఁ జేసి
గొడుగులుఁ బడగలుఁ గూల్చి విం డ్లమ్ములు, వాములై పడఁ జేసి వాసిఁ గాంచె

తే. నపుడు అంకెలు వేయుచునాముకొనుచుఁ, గొమ్ములంగ్రమ్ముకొనువృషభమ్ములనఁగ
నీదుయోధులు శస్త్రాస్త్రనిచయములను, బాదివి పోరి నరునితోఁ బూన్కిఁ జేసి. 122

క. వానికి వారికి జన్యము, మానని దై పెద్దప్రొద్దు మాన్యం బగుచున్
గానఁ బడె వేల్పు జేనికిఁ, బూనికఁ గొనునసురపుంగవులకున్ బోలెన్. 123

వ. అట్లు పోరుచున్న సమయంబున నర్జునుం డరిలోకదుర్జనుం డై నిజాస్త్రంబులం జేసి ద్విషదస్త్రంబు లెల్ల నల్లన వారించి నారాచపరంపరల నరిశిరంబులం ద్రుంచియు యుగాక్షాదులతోడ రథంబులు విశకలంబు గావించియు హత్తుల మొత్తియు గుఱ్ఱంబుల నిర్జీర్ణించియుఁ గాలుమానిసుల ఖండించియు ఛత్త్రచామరంబులు విఱిచియుఁ దూణీరంబులు దునియలు సేసియు భూషణంబులు రాల్చియు కేతనంబులఁ గూల్చియు మహామారుతంబు నారివాహంబులం బలెఁ జతురంగసైన్యంబుల దైన్యంబు నొందించి మహారథసహస్రంబునకు సమం బగు కార్యంబు నద్భుతయుం గాంచి దేవర్షిసంఘంబు లగ్గించె దేవదుందుభులు మ్రోసెఁ బుష్పవర్షంబు గురిసె. ఇంద్రాగ్న్యనిలసూర్యుల కాంతిదీప్తి బలద్యుతులు గలయాకృష్ణార్జునులు నరనారాయణులు బ్రహ్మేశానులుం బోలె నవిజయ్యులు నని యశరీరవాణి పలికె నమ్మహదాశ్చర్యం బెల్లఁ గని విని యశ్వత్థామ సుసంయత్తుం డై శస్త్రబలంబునం దఱియ వచ్చి శరంబుల నటులం జించి చెండాడునరుం గాంచి బాణసహితం బగుపాణిచే సంజ్ఞ చేసి పిలిచి నవ్వుచు నిట్లనియె.

—♦అశ్వత్థామ కోరి యర్జునునితో యుద్ధము సేయుట♦—

మ. అతిథిన్ వచ్చితి నిట్లు నీకడకు యుద్ధాతిథ్యముం గోరి నీ
మతి నర్థిం డని యెంతు వేనియు ననున్ మన్నింపు మన్నన్ మహో
న్నతికిన్ మెచ్చుచు నర్జునుండు నొగల న్నల్పొందునారాయణున్

గతగర్వుం డయి కాంచి పల్కె జలముగ్గంభీరవాగ్గుంభనన్. 125

తే. అనఘ! సంశప్తకులు వధ్యు లైరి నాకు, గురుసుతుఁడు నన్నుఁ బిలిచెడు దుర మొనర్ప
నెడి వెనుక నొంద నగు దాని నెఱుఁగఁజెప్పు, మఱుఁ బూజన మొప్పెడు నందువోటు.

వ. అనినం గృష్ణుం డధ్వరంబునఁ జైత్రవిధిసమాహూతుం డగుపురహూతునిమహావాత
ముం బోలె శ్వేతవాహనునితే రాచార్యాత్మజుసమ్ముఖంబు గావించి వానిం బిలిచి
యి ట్లనియె. 127

కరువోజ. గురునందనా! కోరుకొనుచుంటి వార్చుకొనుము తాఁ కరి నేయ గుదరి నిల్మనికి
నరయంగ నుపజీవు లగువారి కెలు, నన్నము దిన్న యప్పంతయుఁ దీర్ప
వరకాల మిది వచ్చె వసుధలో విప్ర,వరులవివాదంబు వఱలెడు సూక్ష్మ
తరగముగ నగుచు తెస్త్ర జయాజయములు, తెసరు స్థూలము లయి తథ్యంబు వినుమ.

క. ఈ విప్పుడు మోహంబున, నేనరసత్కార్యమందు నిచ్చ నిలిపితో
భీపమున దాని నొందుము, దేవేంద్రాత్మజుని ఓనిఁ దివిరి తెగఁడ ప్తై. 129

వ. అనిన నాద్విజపతియు నట్ల గాక యని. 130

ఉ. అర్వది నారసంబుల జనార్దను నర్జును మూఁడు తూపులన్
గర్వ మడంగ నేయుటయుఁ గవ్వడి తీవ్రునఁ ద్రెస్సి వానివి
ల్లుర్విఁ బడన్ శరత్రయము నుగ్గుగ నేసిఁ గృత్తచాపుఁడై
గుర్వభిమానుఁ డింతటన కొండొకచాపము పూని పూనికన్. 131

మత్త. వాసుదేవుని మూఁడుమూఁడుల వాసవిం బదిమూఁడులన్
ఏసి రోసము రేఁగ [illegible]కు వేలుకోలలు [illegible] గాఁ
జేసి పచ్చడువారి నిర్వురఁ జేయి కోలలు గప్పుచు
న్నేసునన్ సమరం బొనర్చె మహీసురోత్తముఁ డత్తఱిన్. 13

తే. ద్విజునిపోటుములవింటనునారిఁ ధ్వజమునరథ,మునను నశ్వజములఁ గరములముక్కున నురి
మున శిరమునఁ గన్నుల మొగంబునను జెవుల,నిగుడుచున్నట్లు శరములు నెఱిఁ దలిర్చె.

అట్లశ్వత్థామ కృష్ణార్జునుల శరజాలంబున నొవ్వనేసి మహామేఘాఘనిస్వనంబున
సింహనాదంబు చేయుటయు నర్జునుం డానినాదం బాలించి కృష్ణునిం గాంచి
యి ట్లనియె. 134

మ. గురుపుత్త్రుండు పృషత్కముల్ మనపయిం గోటానఁగోట్లేసి గ
చ్చిరి నాయందు దురాత్ముఁడై యిపు డిటుల్ చేవాఁడి సూపించి నా
పరశస్త్రంబుల పీనిగర్వ ముడుగన్ వర్తించెదం జూడు మో
హరి [illegible] వెగ నేసె నొక్కొక్కఁడు మూఁడై కూలె నక్కోలలన్. 135

వ. ఇట్లు చేసి మారుతంబు నీహారంబునుం బోలె నగ్గురుతనయు నగ్గలిక యుడిపి మాఱు
మలయ లేకున్నం గనుచు నన్నరుండు వెండియు సంశప్తకులపయిం గవిసి కసిమ
సంగి గాండీవధనుర్విముక్త కాండజాలం బెదురం గ్రోసుదూరంబున నున్నచతురంగ
బలరూపంబులకు నిజరూపంబు నిరూపింపం జేయ బిట్టేచె నట్టియెడం బరశుధారా
నికృత్తంబు లగుమహాద్రుమంబుల తెఱంగున శుండాదండంబులు తెగినంత వజ్రి
వజ్రప్రమథితంబు లగుమహీధ్రంబుల చందంబునం గూలినశుండాలంబులును గండ్రి
కలై పడినగంధర్వనగరాకారస్యందనసందోహంబులును గడికండ లైనఘోటకంబు
లును భూతలాలంకృతంబు లై కూలినకాలుమానిసిసమూహంబులును గలిగి
దైన్యంబు నొందినసంశప్తకసైన్యంబు యుగాంతార్కుండు మహార్ణవంబునుం బోలె
శరగభస్తిచయంబున నొడించుచుం ద్రోణపుత్త్రాచలంబు వజ్రబాణంబుల నిర్భే
దించినం గని క్రుద్ధుం డై యుద్ధదుర్మదుం డగునాద్రౌణి సాశ్వసూతుం డగుశ్వేత
వాహను నెదిరించి శరసంచయంబు నిగిడించుటయు నతం డాశరంబులు ప్రతిశరం
బులం బరిహరించి సంశప్తకులం గ్రేడించి రూపాచార్యపుత్త్రునిం గూడం జనె నప్పుడు
వారిపోరు భీకరం బై నాకంబున శుక్రాంగిరససంగరంబు పోలె లోకసంత్రాస
కరం బయ్యె నయ్యెడ. 136

సీ. పురుహూతపుత్త్రుండు భ్రూమధ్యమున నొక్క, నారసం బడరింప నీరసమున
నొప్పి యశ్వత్థామ మూర్ఛాప్రభాభాస,మానుండు భాస్కరుమాడ్కి నెగిచి
కృష్ణునిం శరశతాకీర్ణుం జేయుడు, వారు యుగాంతప్రభాకరయుగ
మనం బొల్చి రపు డట్లు హరి నేయుటకు నగ్గి, నరుం డొక్కనారస మరసి యేసి
తే. నలుగడకు శరమయము గాం జలిపె ద్రౌణిం, గాలదండోపమను లైన కాండములను
నొంప గురుసూతి మృత్యువు నొంపం జాలు,మార్గణము లేసెం గృష్ణునిమర్మములను.
తే. నడుమ నాద్రౌణితూపుల నరుండు ద్రుంచి,వాని కినుమడిగాం గడువాండితూపు
లమ్మహారథురథముపై నడరం జేసి,కడిమి సంశప్తకులమీందం గవిసె మరల. 138

వ. కవిసి వారివిండ్లు ఖండించి కాండంబులు తుండెంబు లొనరించి తూణంబులం
దుమురు సేసి శస్త్రంబులతోడ హస్తంబులు దునిమి ఛత్త్రంబులం జెక్కలు గావించి
ధ్వజంబుల రజంబుచేసి వస్త్రమాల్యాభరణంబుల ధరణీతలంబున నడవోడంగించి
గుఱ్ఱంబులం గూల్చి దంతావళంబుల రాల్చి రథంబులం బెల్చి కాలుమానుసులం
గడతేర్చి పేర్చి వీరనికాయోత్తమాంగంబు లుత్తరించుచున్నం గని యంగవంగకళిం
గనిషాదపతు లవ్వీరవరేణ్యుం జుట్టుముట్టిన నతండు వారి నెల్ల నొక్కుమ్మడి నుక్కు
[illegible] సూర్య

ప్రభాభాసమానంబులగుమార్గణంబుల వానిం గప్పిన నప్పిఱిమైనకోపంబున నతండును.

మ. నడుమన్ గ్రీడి శరంబులన్ శరములన్ ఖండించి ప్రాంచద్గతిన్
జలదం బభ్రమునం దపాంతమున భాస్వత్తోయములం బోలెఁ బె
న్వడి వాలమ్ముల మాధవార్జునులఁ గప్పం జాలి పెల్లార్చె న
ప్పుడు గాండీవియు వాని నట్టిషువులన్ ముంచెన్ జగం బెచ్చఁగన్. 140

మ. శరసంధానవిమోక్షణాదు లెపుడుం జర్చింప రానట్లు స
త్వరుఁడై జిష్ణుఁడు చీఁకటుల్ జగతి సాంద్రప్రక్రియం గ్రమ్మఁ గో
వరవిద్యావిభవంబుఁ జూపుచుఁ జమూవారంబు సర్వాంగమున్
శరసంస్యూతముగా నొనర్చి చల మెచ్చ న్నొంచె ద్రోణాత్మజున్. 141

తే. గురుసుతుం డగ్గి పదియూఁపు లరసి తీసి, పడిగ నైదింట నైదింట వాసువార్జు
నులను నొగిలించె నస్సృగంచితులను వారిఁ, గాంచి మృతి నొందిరంచుఁ దలంచె జనము.

వ. అంతఁ గొంతవడి కచ్యుతుం డర్జునున కిట్లనియె. 143

ఉ. ఒప్పరికించె దేటి కిటు లోయిధనంజయ! యోధముఖ్యు ని
విప్పు డుపేక్ష చేసితవయే నితఁ డింతటిలోఁ బ్రతిక్రియం
జొప్పడఁ జేయకున్నపుడు జొచ్చినరోగము నా నసాధ్యుఁడై
ముప్పు ఘటిల్లఁ జేసెడిని ముందు లెఱుంగవు సందడింపుమా. 144

ఆ. అప్రమాది యగుచు నర్జునుం డట్లయ్యె,నని గుహూద్భవునిఁ బ్రయత్నమున భు
జము లురంబు మస్తకము నూరువులు గాఁడఁ, గాండచయము లేసె గాండీవమున.

వ. అప్పుడు వివ్వచ్చునిబాణంబులఁ బగ్గంబులు దెగుటం జేసి నొచ్చియున్న గురుపుత్త్రుని రథ్యంబులు వాయువేగంబున రథం బెడ్చుకొని రణంబునకు దవ్వుదవ్వుగం బోయె నయ్యాచార్యసూతియుఁ బార్థశరాభిభూతుండు గావునఁ గ్రమ్మఱ వచ్చి వాని హయంబుల నాశ్వాసించుచు రథాశ్వనరసంకులం బగు నంగరాజబలంబు దఱియం జనియె నట్లు మంత్రౌషధక్రియాయోగంబుల దేహంబునుండి రోగంబునుం బోలె వారువంబు లశ్వత్థామ నీడ్చుకొని పోయిన యనంతరంబ మాధవార్జునులు వాతోద్ధూతపతాకంబై మేఘనాదబంధురంబైన స్యందనంబుతో సంశప్తకుల దక్కు ముగింపఁబై పోవునప్పు డప్పుండరీకాక్షుం డుత్తరంబునం బాండవబలంబున నార్తనాదం బాలించి వారువంబుల నదలించి రథంబు మరలించి నరుం గాంచి యి ట్లనియె. 146

మ. భగదత్తుం బుడమించుశికీయు బలప్రాబల్యముం గల్గుటన్
[illegible] యస్మత్సైన్యముం [illegible] మ

త్తగజేంద్రంబును గొల్చి పోరెడిని దొల్తన్ వానినిం గూల్చి పో
వగ నౌ నంచును మాటలోన నటఁ బోవం దోలె వార్వమ్ములన్. 147

వ. అంత నక్కడ. 148

తే. అంకుశగ్రహదక్షుఁ డత్యంతశత్రుదుస్సహుఁడు దండధారుఁ డాధోరణద్వి
తీయుఁ డై దానవేభసదృశుఁడై మహాభ్రనిర్హ్రాద మొనరించుహస్తి నెక్కి. 149

క. కేతుగ్రహ మాగ్రహమున, భూతలమును బోలె మగధముఖ్యుఁడు పాండు
క్ష్మాతలపతిసుతసైన్యం, బాతతగతిఁ జొచ్చి కలఁచె నాశుగవితతిన్. 150

ఉ. మాగధుఁ డుగ్రమూర్తి యగు మత్తకరీంద్రము నెక్కి కొల్చినన్
వీఁగక శత్రుసేనఁ బడి విశ్రుతసత్త్వముతోడ నగ్గజం
బాగుమిఁ గాళ్ళ మట్టియును హస్తమునం బెనవెట్టి కొట్టియున్.
నాగరథాశ్వపత్తులు కనంబులు గాఁ గెడ తేర్చె నొప్పుచున్. 151

వ. అంత. 152

—అర్జునుండు మగధపుత్రుల మడియించుట—

ఉ. జ్యాతలనేమినిస్వనము శంఖమృదంగముఖస్వనంబునున్
భూతల మల్లఁ గ్రమ్ముకొన భూరిరథాశ్వసహస్రయుక్తుఁ డై
శ్వేతహయుండు గాండివము చేకొని చెచ్చెర వచ్చి హెచ్చి సం
జాతరయంబునం బెనఁచె సెల్లెను మాగధదంతి మార్కొనన్. 153

మ. కని యల్లంతన దంతిఘోటకము గాఁడం బోవ వాఁడిగాఁ బొంపునం
దను బంధ్రుండు శిరోత్రముం గొని జగన్నాథుం బడద్రొబ్బుమ్ములన్
మును మున్నేచి తురంగమంబుల నొగిన్ మూఁడింట మూఁడింట నం
చి నితాంతంబుగ నార్చుచుం బరిహసించె న్మాటికి న్మాటిమై. 154

మ. నరుఁ డంతన్ సగుణేషుకోటికి మొకంతం జెక్కి యొక్కండునున్
ధరపై వ్రాలిచి పాదగోష్ఠిఁ వియంతం గూల్చినం గ్రోధసం
భరితాంతఃకరణుండు దండధరుఁ డుర్వం జాల క్రుద్ధాకృతిన్
బరివర్తించెను భగ్నగండగజముం బైఁ బాఱఁ గొల్పె న్వడిన్. 155

క. కరిఁ బుఱికొలుపుచు బహులతరఁ, శరములు ఫల్గునునిమీఁద మాధవుమీఁదన్
బరఁగించి మించి యార్చినఁ, గరములుకం గెంపుగన్నుఁగవఁ బొడసూపన్. 156

శా. అర్ణోరాశిగభీరుఁ డానరుఁడు మూఁడేవాఁడివాలమ్ములన్
ఘూర్ణత్కృష్టధనుర్గుణంబునను సంప్రోహంబు గావించి సం
కీర్ణాశీకనిలోక మహోన్నతిములై కీర్తిల్లు తద్బాహువుల్

పూర్ణేందురూపమ మైనవానిమొగమున్ మున్ గాఁడఁగా నేయుచున్. 157

క. చేయార్పనీక నూఱుగు, సాయకములు దిగిచి మగధసామజముఁ బయిన్
స్థాయత్తేజుఁడు పార్థుఁ, డాయెడ నడరించె దేహ మంతయు నిండన్. 158

చ. కనకమయాంకుశాంచితము కర్బురవర్మవిరాజితంబు నై
ఘనరదమాగధద్విపము దానవహంతృశాసన మంటినన్ నిదా
ఘునికల నోషధిద్రుమనికాయసమంచిత మైనపర్వతం
బనఁగ వెలుంగుచుం బడియె నార్తనినాదముతో భ్రమించుచున్. 159

తే. పవిదారిత మగుగిరిపగిది నెల్ల, యేనుఁగ గది దండధారునితో నిలాత
లమున కొఱగిన లో నమర్షమునఁ జేసి, వానితమ్ముఁడు దండుఁడన్ వాఁడు ప్రబలి.

మత్త. సామజంబున నెక్కి కృష్ణునిసమ్ముఖమ్మును బొంది మేల్
తోమరంబులు మూఁడు నైదును దోయజాక్షునిమీఁద సు
త్రామసూనునిమీఁద నేసి కరంబు డంబున నార్చినం
దామ సింపక త్రుంచె జిష్ణుఁడు దండుచేతులు రెండునున్. 161

తే. చందనాంగదభూషిత చారుదంత, హస్తయుగ్మము నేల పడె హస్తిమస్త
కమునునుండి మహాహియుగ్మము మహీధ్రకూటమునునుండి క్రిందికిఁ గూలినట్లు.

తే. అర్ధచంద్రాశుగంబున నంత వాని, మస్తకంబును దునిమె సమ్మానధనుఁడు
మస్తకం బది శోణితనిస్తులమయి, యస్తగిరిఁ బడు నర్కున ట్లవనిఁ బడియె. 163

ఉ. శ్వేతవరాశ్రమముం బొరుడు సేయఁగఁ జాలెడువాని యేనికన్
శాతము లుగ్రభానుసదృశంబులు దివ్యశరంబు లేసి యా
శ్వేతహయుండు చాపుటయుఁ బీనుఁగ యై యది నేల వ్రాలె వ
జ్రాతపహత వెుందినహిమాచలశృంగ మనంగఁ జెంగునన్. 164

వ. ఇవ్విధంబున నాని త్రైవిరులు పెక్కు ద్రుక్కులుగిలి పెక్కుగజంబులతోడఁ గ్రీడిం
బట్టుగ బట్టిన నాని నెల్ల నొక్కపెట్ట యక్కిరీటి గీటడంచి చతురంగంబుల నుగ్గు
నూచంబు గావించి మునుమొల్లఁ గనుపుగొట్టుటయు నట్టియెడ బృందారకబృందంబు
లిద్రుంబలె నందున్నతమనా రింద్రనందను వేష్టించి నీమూలంబున మే మెల్లరము
శత్రుబారిఁ బడక బ్రదికితిమి శాత్రవుఁడు హతుం డయ్యె నిది మాభాగ్యం బని
ప్రశంసింప నాకర్ణించి యథానురూపంబుగ వారి నభినందించుచు నర్జునుండు వెండి
యు నక్రాతిన క్రమనంబున నంగారకగ్రహంబు పోలె సంశప్తకులం దఱిసి నరాశ్వ
రథకుంజరంబులం దాఁకి వీకం జూపియు రథరథ్యసూతకేతువ్రాతంబులం ద్రుంచియు
రావుతుల చేతులు నఱకియుఁ దలలు గోసియు భీభత్సంబు చేసిన నమ్మూఁకలు

విఱిగియుం దిరుగుడువడియు బడలువడియు మరలియు గెల్లియు నొంచబడియుం
బొఱిచియుం బోయినం గని పెక్కండ్రు యోధు లాయోధనదుర్ముఖులై వాసితా
గ్రంబు వృషభంబులు వృషభంబును బోలె నరుం దాఁకిన వారిపోరు ఘోరం బయ్యె
నయ్యెడ నుగ్రాయుధసుతుం డుగ్రుండై దందశూకంబులం బోని మూఁడువాఁడిబాణంబు
లేసినం గ్రీడి వానిశిరంబు శరీరంబునుండి వేఱు గావించుటయుం దదీయు లెల్లఁ బెల్లు
రేఁగి వీఁగనిపరాక్రమంబున మరుత్వత్సూను మరుత్ప్రేరితమేఘంబులు నిదాఘంబున
హిమవంతుం బోలె మూర్కొని బాణవర్షంబు గురిసినం గినిసి యతం డాశరంబు
లెల్లఁ బ్రతిశరంబుల సంహరించి వారి నుక్కడంచి రథంబులు చెక్కలు గావించి టెక్కి
యంబులు ద్రెక్కలించి పార్ష్ణిసారథులను నశ్వంబుల హరించి బాణచయంబులతో
దూణీరంబులఁ దూలించి యేనుంగులఁ బీనుంగులం జేసి కాలుమానుసులం గాలు
ద్రోలి కంచి మించి విహరించినం జతురంగబలంబు బడలువడియుఁ జిడిముడిపడియుఁ
దిఱుగుడు వడియు నాక్రందనంబు గావించె రక్తంబు సువ్యక్తం బై ప్రవహించె రణాం
గణంబు ఘోరరూపం బయ్యె నయ్యెడ నట్లు వీరలోకంబునకుఁ బుణ్యలోకం బొసంగు
నర్జునున కోహటించియు నోహటింప కోహరిసాహరి నందుఁ గలరాజు లెల్ల రథంబు
లధిరోహించి వచ్చి విస్వచ్ఛ నెదిరించి శరవర్షంబు నిగిడించిన వారి నెల్లం ద్రుంచి చెం
డాడుచున్న నరుం గాంచి నారాయణుం డిట్లనియె. 165

ఉ. ప్రుక్కడిమూఁకతో ననికి ముంగలిపై యిరు లేటి కాటగా
నిక్కడఁ గాలముం గడువ నీఁ దగ నాకృతవర్మసైన్యముం
దక్కఁగ నీక చెక్కి ప్రధనంబునఁ గన్గొని గూల్చు కార్యముల్
నెక్కొనసిమ్ము నెమ్మదిని నీవిసుమంతయు నిల్వకుండఁగన్. 166

తే. అనుడు నరుఁ డట్లు సూఁ గాతమనుచు నచొట్టు, వాసి సంశప్తకులపయి వానవుండు
సురవిరోధులపైఁ బడు చొప్పదోఁపఁ, గవిసి హరి కచ్చెరువు గాఁగఁ గలనొనర్చె 167

వ. ఇట్లు కడంగి శరగ్రహణసంధానమోక్షంబు లెఱుంగపడ నట్లొక్కక్షణంబులో జన
క్షయంబు గావించినం గాంచి సంతసించుచు నాశ్చర్యభూతచిత్తుం డగునచ్యుతుండు
హయంబుల మనచమూచయంబునం జొరఁ దోలుచు నర్జునుదిక్కు మొగం బై
యిట్లనియె. 168

మ. అతిరౌద్రంబుగ రాజసంక్షయము హాహా వృట్టగా నయ్యె దు
ర్మతి దుర్యోధనుకారణంబునను సుత్రామాత్మజా! చూడు మీ
క్షితిపైఁ గుండలమండితాననములం జెన్నొందు శీర్షంబులున్
స్తుతిపాత్రాభరణాంచితాంగకములుం జొత్తిల్లు మొత్తంబులై. 169

సీ. స్వర్ణపృష్ఠంబులు చాపముల్ విఱిగియుఁ, దూపులతోఁ బొదుల్ దునియ లయ్యు
హేమభూషితములు తోమరమ్ములు వ్రగి,యును వాలుఁ బాకలు తునియ లయ్యుఁ
గలధౌతచిత్రగదలు చూర్ణితము లయ్యు, శక్త్యాయుధమ్ములు సన్నగిలియు
గజవాజియూథముల్ గడికండ లయ్యును, బొడిపొడి యై రథంబులు చెడియును
తే. మఱియుఁ గనకాతపత్రముల్ పఱియ లయ్యు, మెఱుంగువులెల్ల నఱవఱ లై మసలియు
నలుగడం గల్గి యీపోలికలను రౌద్ర,మై భయంకర మై చెప్ప నయ్యె కంటె. 170
తే. చారుకుండలములు బుకుసముదయంబు, శ్మశ్రువిలసితవదనముల్ చంద్రమండ
లంబులు గా నీరణాంగణ మమరుఁ బ్రళయ,కాలపునఁ జూడ నొప్పునాకాశ మనఁగ.
క. పోలికల నిట్టులు సేయఁగ, బలు నీకుచు దివమునందు నింద్రునకుం గా
కలఁతు లగుసోదరుల కలవి మె, తెలియవె లోకంబు నీదు తేజం బనఘా. 172
వ. అని ప్రశంసించుచుం బోవునప్పుడు దుర్యోధనుబలంబున శంఖదుందుభినిర్ఘోషంబును భేరీపణవనిస్వనంబును రథాశ్వగజనాదంబును నానావిధాయుధపాతశబ్దంబును విని వాయువేగంబున వారువంబులం బోవ నిచ్చి యచ్చటఁ బాండ్యరాజుకోల్తల కోహటించి సైన్యంబు నొందినభవదీయసైన్యంబుం జూచి విస్మయంబు నొందె నప్పు డప్పాండ్యమహీవల్లభుండు భల్లుకాంతకరల నింద్రుండు దైత్యేంద్రులం బోలె నీవారి చేంపాలు గావించె ననిన ధృతరాష్ట్రుం డప్పాండ్యునివిక్రమవిశేషప్రభావవీర్యప్రమాణదర్పంబులు చెప్పు సవిస్తరంబుగం జెప్పు మనిన సంజయుం డి ట్లనియె నారాజేంద్రుండు సమస్తవిద్యలైనభీష్మద్రోణకృపాశ్వత్థామకర్ణాదులు తనకు సాటి రా రనియుఁ గృష్ణార్జునులకుం దాను దీసిపోవు వాఁడ గా ననియుఁ దలంచుచుండు నట్టివాఁ డాకర్ణింపు మశాంతకాకారంబునఁ గర్ణుం దొంపడి తదీయచతురంగబలంబు కులాలచక్రంబుం బలెఁ బరిభ్రమింపం జేసి మహావాతంబు మబ్బులం బోలెఁ దెఱలించియు హస్తుల హస్తిపకులతోడఁ గూలనేసియు నశ్వారోహకులతోడ నశ్వంబుల నడంగించియు రథంబుల రథికసారథులతోడ నడవాషంగం జేసియు నాయుధజాలంబులతోడఁ గాలుమానుసులం దూలించియు నాలంబునం దఱుమ వచ్చినపుళిందఖసబాహ్లీకనిషాదాంధ్రకుంతలభోజాదియోధుల నెల్లఁ బ్రేళ్ళ నేసియుం గపిమసంగుచున్నవానిం జూచి యాచార్యసూనుండు సంభ్రమింప కతని మార్కొని స్మితపూర్వంబు గా ని ట్లనియె. 173

—♦అశ్వత్థామ పాండ్యుని సంహరించుట♦—

సీ. పాండ్యభూమీశ్వర! ప్రఖ్యాతబలశౌర్య,సంచిత! చేతులయందు విల్లు
పూని త్రిప్పుచు దృఢముష్టి నాయతహస్త్ర,మోయించుచును మేఘమో యనంగ

శరవర్షమొలుకుచు నరుల నోర్చెడు నిన్ను, మార్కొన నేఁ గాక మానధనుఁడు
లేఁ డన్యుఁ డొక్కఁడు నేఁ డీవు సింగము, మృగసంఘమును బోలెఁ దగిలి తగిలి

**తే.** బాగములఁ దోలుచుంటి నీబాహులరథను, ఘోష మెల్లెడ మ్రోసెడి భీషణ మయి
నీవు ఘోరాస్త్రములు దాల్చి నిలిచి నన్నొ,కని నఱిమిపోరుచూత మెక్కరణినగునొ.

వ. అనిన నేఁ గాక యని మలయధ్వజుం డొక్కకర్ణినారాచంబున నశ్వత్థామం బ్రహరించిన నతండు నవ్వుచు నస్త్రభేదములు నగ్నిశిఖోపమంబులుఁ దీక్ష్ణాగ్రంబులు నగు ప్రక్ష్వేడనంబులు దశమగతిం బరఁగించుటయుఁ బాండ్యుండును. 175

క. నడుమన వాని నన్నిటిని నారసముల్ నిగిడించి త్రుంచియున్
వాడిబడఁ దొమ్మిదమ్ముల ద్రోణసుతు నొగిలించి నాల్గిటన్
వడిగలవారువంబులను నాల్గిటఁ గూల్చియు నారి దుల్చినన్
గడిమి గురూద్భవుండు వడిఁ గార్ముక మొక్కఁడు సక్కఁ జేయుచున్. 176

గీ. సేవకానీకరథ్యయోధవ్రజంబు,నందఁ బెంపొందె దేవవేదమ్ము లేసి
దివియు భువియును నిండింపఁ దెలిసి పాండ్యుఁ,డతనిపూపుంఖయములయనినుతించి.

క. జతనమున వాని నన్నిటిఁ, బ్రతిబాణము లేసి తునిమి బాహుబలాఢ్యుం
డతఁ డతనిచక్రరక్షులఁ శితశరములు నొవ్వ నేసి చివ్వ యొనర్చెన్. 178

క. అరికరలాఘవ మెంచుచు, గురుతనయుఁడు కార్ముకంబు గుడుసులు వారన్
బరఁగించుచుఁ బర్జన్యుని, కరణిన్ శరవర్ష మెల్ల కడలం గురిసెన్. 179

క. ఎనిమిదివృషభంబులఁ బూన్చిన యెనిమిదిబండ్ల నున్న శితశస్త్రము లా
దినమున నష్టమభాగంబున నీసునఁ బగతు నేసి పో రొనరించెన్. 180

**తే.** అంత కాంతకుఁ డోయనునట్లు కినిసి,గురుసుతుఁడు పాండ్యభటులను గూల్చుచుండ
నలుక నతఁడు వాయవ్యాస్త్ర మడరఁ జేసి,ప్రదరవర్షము చల్లార్చి ప్రబలి యార్చె.

సీ. అయ్యార్జునకు సైఁప కాచార్యతనయుండు, చందనాగురుసారచర్చితంబు
మలయప్రతిమముఁ దన్మహిత కేతువుఁ ద్రుంచి, నాల్గుగుఱ్ఱంబుల నీల్గఁ జేసి
సూతు నొక్కమ్మున భూతలమ్మునఁ బెట్టి, ధను వర్ధచంద్రాస్త్రమున హరించి
యరదంబు తిలలంత యగునట్లు తునిఁగించి, సర్వాయుధంబుల సమయఁ జేసి

తే. తనకు నైవస మగుపాండ్యధరణివిభుని, జాప నొల్లఁడు యుద్ధేచ్ఛ పెంపుఁ జేసి
కర్ణుఁ డంతటిలోఁ గరిఘటలఁ గూల్చి, పాండవానీకినుల బడల్పడఁగఁ జేసె. 182

వ. అంత మలయధ్వజుండును. 183

**ఉ.** భూరిధరాధరంబుపయిఁ బొల్చు మృగేంద్రుఁడు బొబ్బరించు నా
వారణయుద్ధకోవిదుఁడు వారణరాజము నెక్కి కొల్పుచున్

నారసముల్ నిగిడ్చుచు ఘనం బగుతోమర మొండు ద్రోణిపై
బోరన నేసి చచ్చితివి పొ మ్మని యార్చె ఘనస్వనమ్మునన్. 184

తే. తోమరం బగ్నికీల నా వ్యోమమునను, మండుచునుబోయిమణిమాల్యహాక్తికాంశు
కాంచితం బగుద్రౌణిశీర్షాభరణము, దాఁకి పడ నేసె వడిగఁ జూర్ణీకరించి. 185

మత్త. తోఁకఁ ద్రొక్కినఁ బాము కైవడి ద్రోణపుత్రుఁడు క్రుద్ధుఁ డై
పోకు పోకని కాలదండముఁ బోనిమేటిశరంబులన్
వీఁకమైఁ బదునాల్గు గైకొని ప్రేల్చె నే నిట నేస్గుగా
శ్యాకరంబును మూఁట భూపతి హస్తయుగ్మము శీర్షమున్. 186

క. మిగిలిననాఱుశరంబుల, నగపడురాజానుచరుల నార్వురఁ దోరలం
బెగ నేసె వీరలోకము, పొగడం దద్బలము లెల్లఁ బొంగఁగ పార్థున్. 187

సీ. అపు డలంకృతపాండ్యహస్తముల్ తెగి పడఁ, దార్క్ష్యహాస్తోరగద్వయ మనంగఁ
గుంపుకుంచితగండమండితానన మొప్పె, నవని విశాఖనుధ్యాహ్నుఁ డనఁగ
నాలుగంస్త్రిక లయి హస్తయు నాలుగఁ, ఖండంబు లై మహీమండలపతి
దంష్ట్రాంకిదశ దైవతిను పురోడాశము, విభజింపఁ బడినట్లు వెలయఁ నమ్మె

తే. దానమున కైత్తయినపాండ్యధరణీవిభుఁడు, శాంతుఁ డయి సంత రారాజు నరగ వచ్చె
బలిజయమునాఁడు హరి సంద్రుపగిది గుసుగుసు, మాకుఁ బూర్పుచె నెంతయు గౌరవముఁ.

వ. అట్లు పాండ్యవల్లభుండు ద్రౌణిచేత దండంపడి వాసుదేవుండును పాండవపాంచాలబలంబు
లెల్లఁ గన్గొన్న శ్వత్థామలచే నోటువడి పాటి దప్పుచున్న వని విన్నవ్వుచుండు జెప్పి
యప్పు డతిరయంబున రథంబు దోలుటయు నట సూతపుత్త్రపురస్సరు లయిన
మనవారికిని భమనేనపురస్సరు లైనవారికిని ఘను పంబోణకిరి ఘుటిపి పట్టిన ముసల
ముద్గర పరశ్వధ గదా ప్రాస కుంత బందివాలకరవాలాంకుశ కశాది సాధనంబు
లంజేసి యమరాష్ట్రవివర్ధనం బైన ఘోరసంగ్రామం బయ్యె నయ్యెడ వీరయోధసిం
హనాదంబులును శంఖనినాదంబులును జ్యాతలఘోషంబులును నేమినిస్వనంబులును
నానావిధాయుధసంపాతధ్వానంబును గుంజరబృంహితారవంబులును దరంగహేష
ఘతరవంబులు నొక్కటి యై యెక్కటుల్లి దిక్తటంబులం బూరటిల్లె నట్టిసంకులపు
పులంబున నేన్నం బుదీర్ణదోర్దండపటుప్రతాపరథరథ్యసూత పటువుంతోడం గూడి
నేవురం బదునేవురం గాఁ బాంచాలరథికులం గూల నేసి చుట్టుముట్టి బిట్టేయు
పాండవసైనికుల గండడంచి మృగరాజుబు మృగగణంబులం బోలెఁ బైకొంపరవ్వం
బడరించియు శిరంబులు దతిగియు మైమఱుపు లజనజలు చేసియుఁ జాపంబులు
రూపుమాపియు గజరాజంబుకమలాకరంబు వలెఁ దచ్ఛైన్యంబుఁ దైన్యంబునొందఁ గలఁ

గించి భీభత్సంబు గావించిన నవి యెల్ల నొల్లక బోయి వెఱచఱచిపఱచె నంత ధృష్ట
మ్నసాత్యకులును నకులసహదేవులును ద్రౌపదేయులును గగ్గుఱపయిం గవిసి కసిమ
సంగుచున్నం గని మసబలంగంబులును వారి మాఱుకొని మాఱుమసంగె నప్పు
డుభయసైనికులు నన్యోన్యంబునుం బొడివి పోరి పోరి నెత్తురులు గాఱ నేలం గూలి
రపుడు పుడమిం బడినసిడంబులును దెగినతలలును దునిగినగొడుగులును
గడికండలైనశుండాదండంబులును విశీర్ణంబు లైన స్యందనంబులును విదీర్ణంబు
లైనతురంగాంగంబులునుం గలిగి సంగరాంగణంబు భీభత్సం బై భయం
కరం బయ్యె నయ్యెడ దుర్యోధనచోదితు లగుసంగ వంగ కళింగ పుండ్ర మాగధ
తామ్రలిప్తక మేఖల కోసల మద్ర దశార్ణ నిషధ ప్రాచ్య దాక్షిణాత్య ప్రముఖ
గజయోధులాయోధనలంపటు లై ధృష్టద్యుమ్నునిపై నడరి శరవర్షంబు నిగిడించి
ముంచుచుఁ బ్రమత్తమగజంబులం గొల్పుటయు నప్పార్షతుండు గిరినిభంబు లగు
నయ్యిభంబుల నడుమ మేఘజాలపరివృతుం డగుదివాకరునికరణిం బెనరి యొక్కొ-
క్కదానిం బదింట నాలింట నెనిమిదింట బిట్టేసి మట్టుపెట్టుచున్నంత నకులసహదే
వులును ద్రౌపదేయులును బ్రభద్రకులును సాత్యకిశిఖండిచేకితానులు నయ్యేనుం
గులం దాఁకి వీఁకం జూపుచుండ మ్లేచ్ఛప్రేషితంబు లగునమ్మాతంగంబు లరిబలం
బులం జతురంగంబులఁ గాల్ల ఱాసియుఁ జేతుల నేసియుఁ గొమ్ములఁ గ్రుమ్మియు
భీకరాకారంబు లయ్యె నయ్యవసరంబున. 189

సీ. సాత్యకి తనప్రక్క నృత్యం బొనర్చెడు, సంగునేనికఁ గూల్చి సంతలోన
నుర్వికి లంఘింప నుంకించుసంగుని, యురము వ్రియ్యలు నేసె నురుశరమున
సహదేవుఁ డెదుటఁ బ్రచండతరం బగుపుండ్రు, శుండాలమును మూఁట గండడంచె
నతనిపైఁ బంగరాజాత్మజుం డడరిన, నకులుండు తుమ్మని సమయ నాఁగి
తే. వానిపైఁ గాలదండముఁ బోనిమూఁడు,నారసంబుల నిగిడించి నాగముపయి
శరశతం బడరింప నబ్బిగదుమగఁడు, తోన నిడె నూటయెనిమిదితోమరములు. 190
క. అలుకక నకులుఁడు తోమర,ములు నొకఁడొక్కండు మూఁడుముక్కలు గా న
మ్ముల నఱకి వానిశిరముల్, జలమునఁ దెగ నేసె నర్ధచంద్రాస్త్రమునన్. 191
వ. అట్లు మహాప్రళయకాలాగ్నిశిఖాకరాళం బగుసంగపుత్త్రునిమాతంగంబు తోడ నేలఁ గూలినంతఁ
కళింగాంగవంగమేఖలోత్కలతామ్రలిప్తలోకంపెట్ట చెలరేఁగి గజయూథంబుతో
నకులుఁ జుట్టుముట్టి చిట్టుముట్టుము వారిదముల జడినరంబులం గప్పఁబడినభాస్క
రునిభాతి భాసిల్లునకులుం జూచి పాండవపాంచాలసోమకులు లెదరించి తోమరసహ
స్రంబులతో శరవర్షం బడరించి కుంభంబులు నగలించి మర్మంబులు చించి తుండం

ములు గండరించి యనేకపానీకంబులఁ జీకాకుపఱచుచున్నంత సహదేవుం డఱువది నాలుగు వాలమ్ముల శుండాలాష్టకంబు సాదులతోడం గూల నేసె నంత నకులుం డును దక్కటివారును బాంచాలప్రభద్రకసైన్యంబులతోడుపాటున శరపరంపరలం జేసి వజ్రపాతంబున నచలంబులం బోలెఁ గూలనేసి భిన్నకూలం బైనప్రవాహంబు వోలె నీసేనం గలంచి మించినపరాక్రమంబునఁ గర్ణుం గదియ నరిగి రంత. 192

—దుశ్శాసనుఁడు సహదేవునితోఁ బోరి మూర్ఛిల్లుట.—

మ. భవదీయాత్మజవాహినిం గినుకమై బాణాగ్నిపాల్సేయుపీ
రవరేణ్యుల్ సహదేవునిం గయిప కుగ్రంపశ్యుఁడై నీదురెం
డవపుత్త్రుండు మహారథుల్ గని మృగేంద్రధ్వానముం జేయువోఁ
గవియం వచ్చి శరత్రయంబునను వక్షం బాఁడ వేసెన్ వడిన్. 193

ఉ. పాండవుఁ డంత దెబ్బదినవప్రదరంబుల దుస్ససేనునిం
గండడఁగించె మూఁ డయినకాండముల న్నొగిలించె సూతు నా
తండును వాని వి ల్విఱిచి తద్భుజయుగ్మము బాహుమధ్యముం
గండలతోడి నె త్తురుల గంటెఁ ద్రిసప్తతిసాయకమ్ములన్. 194

ఉత్సాహము. మాద్రిపిన్నకొడుకు కినుక మానసమున కెక్కఁగా
నద్రిధీరుఁ డగుచు ఖడ్గ మట్టె త్రిప్పి వేయ ని
ర్నిద్రశక్తి నది తదీయ నిభృతధనువుఁ ద్రుంచియున్
మాద్రి లేనిరవముతోడ మహిఁ బడెన్ బొఱుం గనన్. 195

సీ. సహదేవుఁ డొండొక్కచాపంబుఁ గొని దుస్ససేనునిపై నొక్కశితశరంబు
వాఱంగ నేయుఁడు ప్రధ్వనుజుఁడు దాని, ఖడ్గంబునన్ రెండు గా నొనర్చి
ఖడ్గంబు విసరియు గాస్మకంబుం గొని, శర మొక్కఁ డరివోయుసమయమందుఁ
బాండవుఁ డవ్వాలు పఱియలు గావించె, నవ్వుచు మేల్వాలు నారసముల

ఆ. నంత నీకుమారుఁ డఱువదినాలుగు, వాలుఁగోల లతని పాల నేయ
నతఁడు నొక్కఁ డొకఁడు నైదేసితూపులఁ, ద్రుంచి పైచెఁ బెక్కుతూపు లవల. 196

శా. ఆవాలమ్ముల నొక్కఁ డొక్కఁడును మూఁ డేనాఁడి నారాచపుంజ
బోనం జేసి సధనంబు ప్రమోదము సంపున్ ఘట్టించి ఛేదించి నూ
ద్రీవామాత్మజు నొవ్వఁ జేసి నవపత్త్రశ్రేణిఁ దత్సారథిన్
బ్రావీణ్యంబున నేసి నీసుతుఁడు గర్వస్ఫూర్తి వర్తించినన్. 197

శా. క్రుద్ధుండై సహదేవుఁ డంతకసమక్రూరాశుగం బొక్కఁ డా
బద్ధద్వేషముఁ గి [illegible] నేసె [illegible]

య్యథాస్త్రంబు తదీయకంకటము నంతే వ్రచ్చి లోఁ జొచ్చి హృ
న్నష్టం బై వెలివచ్చి దూఱె ధరణిన్ వల్మీకముం బా మనన్. 198

తే. దాన దుశ్శాసనుఁడు మూర్ఛలోన మునుఁగ, నఱిసి సూతుఁడు తద్రథ మనికి నవలఁ
గాఁగఁ దోలెఁ బాండుపుత్రుఁడును గౌరవబలము, మును మథించెఁ బిపీలికపుటము నట్లు.

—♦కర్ణుండు నకులుని విరథుం జేసి యవమానించుట.♦—

వ. అంతఁ గర్ణుం డుదీర్ణకోపదీపితుం డై తనమూఁకం దఱుముచున్న నకులుం దాఁకు దెంచుటయు నాతండు నవ్వుచు నవ్వైకర్తనున కిట్లనియె. 200

మ. చిరకాలంబున కిట్లు దైవము ననుం జేర్పార వీక్షించె నో
దురితాత్మా! యిటు లీవు గన్నుఁగవకుం దోపంగ నై తిప్పు న
న్నపదారంగ వియ్యంగ ర మ్మనికి నీపై తన్న మూకంబ వి
క్కురురాజప్రతి కియ్యనష్ఠమున ఘోరాహవప్రాంగణన్. 201

ఉ. ఇంతలు పుట్టు నీవలన నిట్టిఖలు న్నిను నేఁడు జంపి యం
దంతకుఁ గొల్వఁ బంచి కలహంబున నేఁ గృతకృత్యుఁ డై నిజ
స్వాంతము నేచుతాపమును బాపుకొనం దలఁచి యుంటి నా
నంతయు నంతసించుచు దినేశ్వరసూనుఁడు వాని కిట్లనున్. 202

మ. సదృశం బయ్యెద రాచబిడ్డ కటుపై శస్త్రాస్త్రవిస్ఫూర్తిగాన్
మదిం బెన్నె వ్యగుఁ బెంచె నిట్లనుటకున్ మాబోంట్లు నీపై రుషం
బద వీక్షింతురె గాని యెన్నఁడును నెమ్మిం గ్రొవ్వు గావించి చె
ప్పదు పే నొప్పుగఁ జెప్పకోరు ఘను లెప్డుం దార ము న్మన్నగన్. 203

వ. శక్తి గల దేని నీవు నాతోడం బోరి మేను నీవల్లఁ బుడిగించెద నని పలికి కర్ణుండు.

సీ. నకులు డబ్బదిమూఁడు నారసంబుల నేయ, నతఁ డాతని నశీతిశితశరముల
నో నేయుటయు నంగభూనాథుఁ డతనివిల్, విఱిచి శిలాశితవిశిఖములును
మూఁడుపదుల్ మేను గాఁడ నేయుటయును, మాద్రీసుతుం డొండుమహితధనువు
గైకొని యిర్వదికాండంబులం గర్ణు, నొంచి సారథి మూఁట నొగులఁ జేసి

తే. యొకక్షురప్రము వైచి కార్ముకము దునిమె, నూఱుమునాడులసాయకముల నిగిడ్చెఁ
జూప అచ్చెరువడ సూతసుతుఁడు నంత, నంటు వి ల్లెత్తి కోపంబు ముందుకొనఁగ.

చ. నకులుని జత్రుదేశమున నాఁటె శిలాశితతీక్ష్ణబాణపం
చక మతఁ డర్కనందనుని సాయకసప్తకవిద్ధుఁ జేసి కొం
చక మఱియుం దదీయ మగుచాపము కోపును ద్రుంచె ద్రుంచినన్
ఒకమక నొండ కంగపతి దేఁకుప నేఁడు కార్ముకంబునన్. 206

తే. మాద్రినందనునరదంబు మగ్గుణత్తి, ముసుఁగు వట్టు నొంతలోఁ గసిమసంగి
పాండవుఁడు కర్ణుశరములఁ జెండివైచి, వేనవేలుశరమ్ములు పూని నైచె. 207

శా. ఆమాద్రేయునిమార్గణంబు లవి వ్యోమావాప్తఖద్యోతసం
స్తోమం బట్లు పతంగసంఘ మటు లొప్పారెఁ బాణక్రౌంచంబుల
ట్లామైఁ బర్వి దవాకరద్యుతుల మాయం జేసి పై నాడు నేత్రపాళికిన్
భూమిం జేరఁగ మార్గ మీక దళమై పొల్పారె నప్పోరునన్. 208

వ. అయ్యవసరంబున నయ్యుభయవరు లిద్దఱును గాంగసూర్యు లనం గ్రాలుచు బాణజాల మ్ములుండొరులపయి ప్రయోగించుకొనుచున్నంతఁ గర్ణబాణవధ్యమాను లగుసోమకులును నకులబాణహన్యమాను లగుకౌరవులును నాతనున్నవారిదంబుల తెఱంగునం దెఱలి బాణపాతదూరంబుఁ దొలంగఁ బాఱి వారిపోరు చూచుచుండ రథ్యు దప్పుడు పసింహులు దివ్యాస్త్రశాలంబు నెఱపుచు శరనికరంబులం బరస్పరంబు గప్పికొనుచు ఘనాఘనచ్ఛాద్యమాను లగుసూర్యాచంద్రమసులచందంబునం బొలుపొంది రాక్రందునఁ గర్ణుం డుదీర్ణరోషదీప్తుండై ఘోరాకారంబునం బేర్చి వేనవేలుశరంబుల గుప్పిన నొప్పె యెఱుంగ కప్పాండునందనుండు గండపాటయు నధిరథాత్మజుం డధికక్రోధంబున నలంతినవ్వు నవ్వి. 209

చ. విలు విఱుగంగ నేసి రథపీఠముల సూతునితోఁ బరేత—
ణ్ణిలయము నొందఁ జేసి ధరణిం బడఁ ద్రోసి సితంబు హయంబులం
బలఁతి యలంతి తున్కలుగ నై చెడిపోవఁగఁ జేసి చక్రర
క్షులఁ దెగఁ గోసి మై మఱువు చూర్ణమ యై పడ రాసి యాసునన్. 210

వ. పెనంగుచున్నంత మాద్రేయుండును. 211

మ. విరథుం డై డిగి క్రిందికిం బరిఘుఁ గొనెన్ వేఁ బూని రా దానినిన్
హరిదశ్వాత్మజుఁ డింతలింతలుగఁ జేయన్ ఖడ్గఖేటంబులన్
గరిమం దాల్చిన వానిని న్దునిమి వేడ్కన్ వ్యాయుధుం జేసి యుం
గరుణం జేసి వధింపఁ డయ్యె నకులుం గర్ణుం డుదీర్ణప్రభన్. 212

క. బలవంతుండు కృతాస్త్రుం, డలఘుపరాక్రముఁడు కర్ణుఁ డటు చేయఁడు వ్యా
కులచిత్తుఁడగుచు నకులుఁడు, జలముం దిగఁద్రావి పఱచె నడి కోర్చి వడిన్. 213

తే. పఱచినం బోవనీయక నడి వెనుకొని, సూతజుఁడు సజ్యచాపము నాతనిమెడఁ
దగిలిచి పాసించె నతఁ డప్డు తగిరె గగన,మందుఁ బరివేషవృత్తుఁ డగుని జ్జ్వలించె డట్లు.

వ. అప్పు డప్పాండుపుత్త్రుం దిలకించి సూతపుత్త్రుం డి ట్లనియె. 215

చ. పలికితి రిత్తపల్కు లొకపాటిగ నెంచుచు మేటి వోలె నై

తెలియఁగ వచ్చె నీ యితనిదివ్యశరంబుల వేఁడి యంతయున్
బలుకుము మాత మిన్న మనుపల్కినయన్న ప్రహృష్టచిత్తతం
గలిగి తలంకఁ బోక భుజగర్వ మఖర్వము గాఁగఁ జూపుచున్. 216

వ. అని మఱియును. 217

చ. సదృశులతోడఁ బోరుకొన సమ్మతిసేయుదు గాని యెప్పడున్
గదనములన్ మహీంద్రులగుఁ గౌరవచంద్రులతోడఁ బోర్కొనన్
మది యొనరింపఁ బోకు మది మాటలఁ గీరదు మేటిసిగ్గునన్
గదురక యింటి కేగు మఱి కా దనఁ గృష్ణులచెంత కేగుమా. 218

వ. అని యుల్లసం బాడి కర్ణుండు కుంతీవాక్యంబు స్మరించుచుం గైవసం బైనను వానిం జంప నొల్లక విడిచిపుచ్చె నతండును వ్రీడాభరంబున విన్నఁబోవుచుం బోయి యుధిష్ఠిరు నరదం బెక్కి కుంభనికుంభకుంభీనసంబు చందంబునం గుందుచు వెట్ట నిట్టూర్పు నిగిడించు చుండెఁ గర్ణుండు నట్లు నకులుం జయించి చంద్రహాసువిరాజితం బగుశతాంగం బధిష్ఠించి పాంచాలవాహినిం దఱియం జొచ్చి విచ్చలవిడి విహరించు నప్పట్టపవలింట. 219

సీ. తుండముల్ గండముల్ తుండెతుండెము లైన, గుంభినిం గూలినకుంభిచయము
మోరలుం గాళ్ళును ముక్కముక్కలు గాఁగ, సాదులతోఁ గూలుసైంధవములు
చక్రంబు లిరుసు లపుధ్వజంబులు తునా, తునియ లైనం గూలుఘనరథములు
కాలు సేతులు తలల్ గండ్రికలై పోవ, మహిఁ దొరంగినకాలుమానుసులును

తే. గుప్పతిప్పలు గాఁ గర్గి ఘోర మగుచు, సంగరక్షితి గన నయ్యె సాంద్రరక్త
సాగరము నాఁగ సృంజయసైన్యసమితిఁ, జొచ్చి శస్త్రాస్త్రములనేర్మిఁ జూపునపుడు.

వ. అట్లు మధ్యందినమార్తాండునిమూర్తి ననుకరించి విజృంభించుమార్తాండనందను స్యందనంబుచక్కిం గాలు నిలువం ద్రొక్కఁ జాలక హతశేషులు యథాయథ లై విఱిగి వాఱి రట్టియెడ మనమూఁకలం దోలుసీపుత్త్రుం డగుయుయుత్సుం డాఁకియు లూకుండు నిలు నిలు మని యదలించి ప్రదరంబులు ప్రయోగించుటయు నతండును.

క. శితధారం బగుకొండొకప్రతి లేనిపతత్రి సుబల పౌత్త్రుని నేసెన్
శతమన్యుఁడు శతకోటిం, బ్రతిపక్షుం డగుచు నెమరుబలునిం బోలెన్. 222

సీ. క్రుద్ధుఁ డై శకునిపుత్త్రుండు వైశ్యాపుత్త్ర, కుని వి ల్లొకక్షురప్రమునను దునిమెఁ
దునిమిన నతఁడొండు ధను వెత్తియఱువది, ఘనశరంబుల నులూకుని నొగిల్చి
సూతుని మూఁడింట స్రుక్కఁ జేయుటయు నా, శాకుని వింశతిసాయకముల
నీసుతు నొ నేసి భాసురధ్వజయష్టి, వెడఁదవాయమ్మున విఱుగ నేసె.

తే. దాన నలిగి యుయుత్సుఁ డామానధనుని, వఱుమున నైదుతూపులు వైచుటయు శ
కునిసుతుఁడు వాని సూతుని గొంతుఁ గోసి, వంతు మీఱ రథ్యంబుల వడిగ దునిమె.

ఉ. ఏ దగువాఁడినారసము లేడ్తెఱఁ జూపుచు నీకుమారుఁడై
గాఁడఁగ నేయ నాతఁ డధికవ్యథఁ బాఱి రథాంతరంబుతోఁ
గూడుకొనెన్ జయంబుఁ గొని కోరిక లీరిక లెత్త నక్కెఱిన్
గూడినసృంజయానీకముఁ గూర్చి నులూకుఁ డలూకుఁడై చనెన్. 224

వ. అంతలో నీపుత్త్రుండు శ్రుతకర్ముండు నకులపుత్త్రుం డగుశతానీకుం దాఁకి. 225

తే. సూతునిన్ వీతులం ద్రుంచెఁ జూచుచుండ, నతఁడుసంక్రుద్ధుఁ డగుచు నయ్యరదమీఁద
నిలిచి గద వైవ నది వడి నీసుతురథ, తురగసారథులం గూల్చి ధరణి బడియె. 226

వ. ఇట్లక్కురువీరు లిరువురును విరథులై యొండొరులం జూచుకొనుచుఁ బోరికిం గాక
తొలంగి పోయి నీకొడుకు వివింశతిరథంబును శతానీకుండు ప్రతివింధ్యునిరథంబు
నెక్కి రంత సౌబలుండు సుతసోము నడిచి నిశితశరంబులు నిగిడించుటయు
నాభీమనందనుండు ప్రవాహవేగంబునకుఁ బర్వతంబువలె. జలింపక తనశాత్త్రవుం
కత్యంతశాత్త్రవుం డైనవాని ననేకశతసహస్రసాయకంబులం గప్పె నవ్విధము. 227

చ. శకునియుఁ దచ్ఛరావళులు జర్జరితంబులు గాఁగఁ ద్రుంచి కొం
చక సుతసోముమేనున నిశాతశరత్రయమును న్నిగిడ్చి హో
టకములు సూతు కేతువు నిటం దిటంబులు గా నొనర్చి సా
యకపటలిం బొదవి కుహర మంతయు నింపె జనుల్ నుతింపఁగన్. 228

మ. హతరథ్యుం డగుటన్ వృకోదరసుతుం డాస్యందనం బేఁగి భూ
గతుఁ డై కార్ముకముం గ్రహించి ప్రదరౌఘంబులం బ్రయోగించి సం
తతరీతిన్ సుబలాత్మజన్మురథమున్ దక్కింపఁ దాకుండు న
ట్లతివేగంబునఁ గప్పెఁ గప్పిన నతం డత్యంతరోషంబునన్. 229

క. అరదము దాఁకక ము న్నా, శరములఁ జక్కాడి పోరు సల్పుచునుండన్
ధర నిలిచి రథి నెదిర్చెను, బిరుదుం గని మెచ్చి రెల్ల వీరులు వేల్పుల్. 230

తే. అంత సౌబలుఁ డతనిశరాసనంబుఁ, దూణములు భల్లములఁ జేసి త్రుంప భీము
కొడుకు గజదంతపుంబిడి నడలువాలు, వెఱికి త్రిప్పుచు నార్చె లో వెఱవ బగరు.

వ. శిక్షాబలసమన్వితుం డగుసుతసోముండు ఖడ్గహస్తుం డై భ్రాంత ముద్భ్రాంత
మావిద్ధ మాప్లుతము సృతము సంపాతము సముదీర్ణము లోనగుచతుర్దశమార్గంబులం
జరించుచుఁ గాలదండోపమం బగుకరవాలంబున సౌబలుశరపరంపరలఁ దెఱలించుచు
గరుడరయంబున మండలావర్తగతులం జూపుచున్నంత నీమఱంది విక్రమించి. 232

క. సుతసోముచేత నాఁడెదు,శితఖడ్గము రెండు గాఁగఁ జేయుడు నతఁడం
చితరీతి నెగిచి కరతల,గతశకలము విసరి వాని కయివిలు విఱిచెన్. **233**

వ. ఇట్లు చేసి సుతసోముండు పోయి శ్రుతకీర్తి తేరెక్కి సాబలుండు నొండుకోదండముఁ గొని పాండవానీకినిపయి నురవడించి భండనంబు గావించె నంత శారద్వతుండును ధృష్టద్యుమ్నుపయిం గవిసి సింహంబు శరభంబునుం బోలె శరపరంపరల బొదివిన నతం డొక్కఁడు నైనం గదల నేరకున్నం గని సర్వభూతములు నతని హతునకాఁ దలంచె నంత నయ్యభ్యామర్దంబునం గలధనుర్ధరు లెల్లరును. **234**

—♦ ధృష్టద్యుమ్నుఁడు కృపాచార్యునితోఁ దలపడి పోరుట ♦—

శా. ద్రోణాచార్యవధంబున న్మిగుల సంక్రుద్ధాత్ముఁ డీగౌతమ
క్షోణీసుర్జుఁ డస్త్రవిద్వరుఁ డనిం గోదండపాండిత్యముల్
రాణింపం బొనరించుఁ బార్షతున కీబ్రాహ్మణ్యతేజంబునం
బ్రాణాపాయము దప్పఁ గాక బలముల్ స్వస్తిం బ్రవర్తిల్లుఁ గా. **235**

ఉ. అంతకసన్నిభం బగుభయంకరరూపముతోడ నేఁడు దు
ర్దాంతదురంతవిక్రమధురంధరుఁ డై పయికొన్న యెల్లరన్
గంతు గొనంగఁ జేయుఁ జులుకన్ గురుమార్గము వట్టి యీకృపుం
డెంతకు నైనఁ జాలు ధ్వజినీశుఁడు దా వెనుదీయ నట్లగున్. **236**

వ. అని పలుకుచున్నంత శారద్వతుండు క్రోధంబున నిట్టార్పు నిగిడించి ధృష్టద్యుమ్నుని సర్వమర్మంబులును నిశాతసాయకసంచయంబుల నించి నొంచుటయు నతండు చెయ్వు దక్కి మోహనశంబునం గర్తవ్యం బెఱుంగక మిన్నకుండె నయ్యవసరంబున సూతుం డాతని క్షేమం బడిగి యిట్లనియె. **237**

చ. వ్యసనము లిట్టి వెన్నఁడును నాహవభూముల నీదుపాల నై
పొసఁగుట చూచి నే నెఱుఁగఁ బూరుషసింహ దైవయోగ మి
ట్లసదృశ మై యెసంగు నన నోఁ గృపునమ్ములు మర్మభేదు లై
వెసఁ బడుచుండె నీద్విజునివిక్రమ మెన్న నవక్రమయ్యెడిన్. **238**

క. ఈతఁ డసాధ్యుం డని నా,చేతంబునఁ బోలఁ దోఁచెఁ జెచ్చెర రథ మీ
పాతమునకుఁ దొలఁగించుట, నీతి యనం బార్షతుండు నెఱి చెడ ననియెన్. **239**

చ. వివశత నొందె నామనము స్వేదజలంబులు జాలు వాఱె మై
నవిరళరోమహర్షవివహం బగుదెంచెఁ జలాచలత్వముం
దవులుకొనెన్ ద్విజన్మునకు దవ్వు తొలంగుట లెస్స యందు నీ
వపు ననఁ దోలు మర్వముల నర్జును చెంతకొ భీముచెంతకో. **240**

వ. అనుటయు నాసూతుండు. 241

ఉ. వాజుల వేగిరించుచును వాయుతనూద్భవుఁ డేచి నీచమూ
రాజి నడంచు చోటఁ గలిరంహగతిం జనఁ దోలెఁ దేరు ఘో
రాజిఁ బొనర్చుచుం గృపుఁ డహంకృతిఁ మీఱఁగ శంఖ మొత్తుచున్
రోజుచు వెన్నడించి బహురోషముల న్నొగిలించెఁ బార్షతున్. 242

—♦ శిఖండి కృతవర్మతోఁ బోరి మూర్ఛితుం డగుట ♦—

ఆ. అంత భీష్మమృత్యు వగుశిఖండినిఁ గృత,వర్మఁ దాఁకి బాణవర్ష మొలుక
నలుక ద్రుపదసుతుఁడు హార్దిక్యుజత్రుదే,శమున నినిచె నైదు సాయకములు. 243

ఉ. ఆతఁడు క్రుద్ధుఁ డై యఱువదాశుగముల్ ద్రుపదాత్మజన్ముపై
నాతతి నేసి కేతన మొకమ్మునఁ ద్రెంచి హసించెఁ జేడియున్
జేత గ్రహించి లీల్లొకఁడు చిత్తము మొత్తన గామి నవ్వి వి
ఖ్యాతము లైనతొంబదిమహాంబకముల్ నిగిడించె వానిపైన్. 244

క. అవి యెల్లన్ హార్దిక్యాన్వయ,భవువర్మము దాఁకి మిట్టిపడి విఫలము లై
భువి కైనఁ గని శిఖండియు, జవమునఁ దద్ధనువు దునిమె శాతశరమునన్. 245

ఆ. భగ్నశృంగ మైనభద్రవృషము వోలె, భిన్నధన్వుఁ డైనవార్ష్ణివరుని
భుజములందు వతుపడు నేతినిశాత,సాయకములు నినిచె సరభసమున. 246

సీ. కుంభవక్త్రమునుండి ప్రమ్మరించినయట్లు, కృతవర్మమే నెల్ల క్షతజ మొలికె
నలుక నాతఁడు రుధిరాప్లుతగాత్రుఁ డై, వర్షాక్తగైరికశైలంబు
పగిది భాసిలి సహాబాణబాణాసన, మొండొక్కఁ డంద సమున్నతుఁ డయి
కదిసి ద్రుపదసూతి స్కంధదేశమ్మున, మేటిబాణగణమ్ము నాటుటయును

తే. దాన నాభీష్మవిద్వేషి జానుమీఱె, శాఖ లుపశాఖలును గ్రిగ్గి నవ్వఁ బర్వ
దర్శనీయ మైనవిశాలధరణిరుహము,పోలుపు చూపఱ కప్పుడు పొంది దోఁచె. 247

వ. ఇట్లు వారిరువురునుం బరస్పరప్రహారంబుల నొచ్చియు రుధిరంబు వెలిగ్రచ్చియుఁ గొమ్ములం గ్రమ్ములాడుమహోక్షంబులచందంబునం బొంగి పడి యితరేతరవధాభికాంక్షు లై రథంబు వివిధమండలాదిప్రచారంబు గలిగించుచున్నంత హార్దిక్యుండు గుపుమిగిలి. 248

ఉ. ఎంచి శరంబు లేడుపదు లేకముఖంబుగఁ జేసి యేసియుం
గాంచనపుంఖదీపితము కాలభుజంగమసన్నిభంబు నై
మించినసాయకం బొకఁ డమేయపరాక్రమ మేర్పడంగ సం
ధించి శిఖండిపై విసరె ద్వేషణ మొల్లను దల్లడిల్లఁగన్. 249

తే. తాఁకుపెల్లున మూర్ఛిల్లి ద్రౌపదీస,హోదరుఁడు కేతుదండము నూఁతగొనుచుఁ
దేరు సారథి తొలఁగించెఁ బోరి కెడగ,నవల హార్దిక్యుఁ డరిసేన నఱిమి తఱిమె. 250

వ. అయ్యవసరంబున సవ్యసాచి కోపారుణితలోచనుం డై యేచి వినుచూలి తూల
రాశిం బోలె మనమూఁకలం దూలించి తెఱలించుచున్నం గని త్రిగర్తేశ్వరుం డైన
సుశర్మ త్రిగర్త శిబి కౌరవ సాల్వ సంశప్తక నారాయణగోపాలబలంబులతో సత్య
సేన చిత్రసేన చంద్రదేవ మిత్రదేవ సుతంజయ సౌశ్రుతి మిత్రవర్మ సుశర్మ
వసుధర్మ సువర్మ లనుతమ్ములుం దనయులుం దోడు సూప నాక్రీడిం దాఁకి పేఁక
మొయి శరపరంపరలం బరఁగించుచు మించి పోరు గావించె నాసంచునం గొంచ
కర్జునుండు ప్రయోగించిన సాయకసంచయంబునఁ ద్రిగర్తసైనికులు సాగరంబునం
జొచ్చుప్రవాహంబులతెఱంగున నడంగియు గరుడుం గన్నపన్నగంబులపెన్నున
నడంగియు మహాగ్నిం బడుమిడుతలచందంబున బాడవడంగియుం బోవుచున్నం గని
కనలి సత్యసేనుండు మూఁడును మిత్రదేవుం డఱువదిమూఁడును జంద్రసేనుం
డేడును మిత్రవర్మ డెబ్బదిమూఁడును సౌశ్రుతి యేడును శత్రుంజయుం డిరువదియును
సుశర్మ తొమ్మిదియు శరమ్ములం బరఁగించి నొంచుటయు నర్జునుండును సౌశ్రుతి
నేడింటను సత్యసేను మూఁడింటను శత్రుంజయు నిరువదింటను జంద్రదేవు నెని
మిదింటను మిత్రదేవు నూఱింటను శ్రుతసేను మూఁడింటను మిత్రవర్మం దొమ్మి
దింటను సుశర్మ నెన్మిదింటను నొం నేసె యంతఁ బంతంబున. 251

సీ. శత్రుంజయుని శితసాయకంబులఁ గూల్చి సౌశ్రుతిఁ బరిమార్చి సరభసమునఁ
జంద్రదేవుని యమక్షయమునకుం బుచ్చి,మిగిలినవారలు మిగుల రేఁగి
పై బడం గని వారి వరుస నందఱను నై,దేసితూపుల నొవ్వ నేసి యంత
సత్యదేవుఁడు క్రోధసంరక్తనేత్రుఁ డై, వాసుదేవునిగుఱి చేసి చూచి

తే. హేమదండము నాయసతోమరంబు, విసరి సింహనాదము చేసె వెస నది హరి
సవ్యబాహువు పైఁ బడి చాఁ నొంచి, యుమకటిలోఁ బ్రవేశించె వసుధ. 252

ఉ. తోమరవాతవేగమునఁ దోయరుహాక్షుని చేతిపగ్గముల్
హేమమయప్రతోదము నొకించుక జాఱిపడెన్ ధనంజయుం
డామెయిఁ గాంచి క్రోధకలితాననుఁ డై హరిఁ జక్కఁ నెమ్మొగం
బై మధుసూదనా! పఱపు మశ్వములం గొన సత్యసేనునిన్. 253

క. అనవుడు నవ్వుఁ గా కని హరి, ముసికోల మఱొండు పట్టి మునుబడువాగెల్
గొని సత్యసేనురథముం, గనుగంటిలోనఁ దరియఁ గడపె రథమ్మున్. 254

చ. నగుఁడును సత్యసేనుపయి నారసముల్ నిగిడించి నొంచిన

చ్ఛిరము సుకుండలాంచితము చెచ్చెరఁ గాయమునుండి వేఱునై
ధరఁ బడఁ జేసి భూరిశరధారల గగ్గము గాఁగ మిత్రవ
ర్మరథసుతుం బినిం జలిపి మచ్చర మెచ్చఁగ పెంచి క్రచ్చఱన్. 255

ఆ. గణము లగుచు నడరి కవిసిన సంశప్తకులను వేలకొలఁదిఁ గూల నేసి
రజతపుంఖ మగుక్షురప్రమునన్ మిత్రసేనభూమివిభుని శిరముఁ దునిమె. 256

క. వడి గలనారస మొక్కఁడు, కడుపడి సంధించి కార్ముకమ్మున నార్పుల్
దడ మగుచు నింగి ప్రమోయఁగ, నడరి పడి సుశర్మకొంకు లాఁడగ నేసెన్. 257

వ. అట్టియెడఁ ద్రిగర్తసైన్యంబు లెల్ల దైన్యంబు దక్కి యుక్కుమొగ నక్కిరీటిం జుట్టుముట్టి బిట్టార్చుచుం జెర్చి తెట్టలుగట్టు నట్లు శరంబులం బరఁగించి రంతఁ గొంతేయుఁడావరజుండును. 258

శా. ఇంద్రాస్త్రం బరివాసి యేసిన సివేషార్థంబునన్ వేనవేల్
సాంద్రంబై శరముల్ జనించి వెస నెల్లన్ గప్పె నప్పట్టునన్
జంద్రాభంబులు ఛత్త్రచామరములుం జాపంబులుం గేతువుల్
సంద్రావస్థితి మిన్ను ముట్టి తఱి నేల న్వ్రాలె శీర్ణంబులై. 259

సీ. సర్వాంగములతోడ నుర్వీస్థలి న్నస్త్రసూచమై కూలెడు రౌచ తేసు
లశనిపాతంబున నఱవఱలై పడు, కొండలో యనఁ గూలు కుంజరములు
నారోహకులతోడ నంగసంఘులు త్రెవ్వ, గుప్పకూలెడు మహాఘోటకములు
నఖిలాంగములు తిలలంతలై వింతలై, మహిఁ గూలి పడు కాలుమానుసులును

తే. దునిఁగి శకలంబులై నేలఁ దొఱఁగునాయు, ధములు పొడిపొడియై భూతలమునఁ గవియు
భూషణమ్ములు గలుగి నప్పాలికలను భ, యంకరాకృతి నయ్యె నయ్యవసరమున.

తే. కనకకుండలమండిత గండములును, బూర్ణచంద్రనిభాననములును గలిగి
ధరణిఁ బొరలాడు శిరములం బరమునందుఁ, దారకాజాలములకీలఁ దనరె నపుడు.

తే. మెదడు మాంసము నెత్తురు మెదగి మెదగి, సాంద్రకర్దమమై రథచక్రములు ము
నుఁగ రథంబుల రథ్యముల్ తవిలి పెలుకఁ, జాల కట బమ్మరించె నిశ్వాస మడర.

వ. ఇట్లతిఘోరంబై గంధర్వనగరాకారంబై ససంభ్రమంబుగాఁ గానంబడు నమ్మహాప్రతిహత ప్రచారంబు సేయుచు నారాచపరంపరలఁ బరఁగించి సర్వసైన్యంబును దైన్యంబు నొందఁ జేసి విఘూర్ణమానాగ్నివిధంబునం దేజరిల్లె నయ్యవసరంబున. 263

చ. శరములవర్షముం గురిసి శస్త్రము లస్త్రములు న్నిరంతరం
బరమర లేక శాత్రవచయంబులపై నిగిడించి నొంచుచున్
దాని మొనసి చుసర్మయానితో నెనరించి ధనంజయుండు న

త్వరుఁ డయి రా నతం డతనిఁ దాఁకి వడి న్నిలు మంచు నొంచుదుర్న. 264

తే. కనలి దుర్యోధనుఁడు నవకాండముల యు, ధిష్ఠిరుని మేనఁ గీలించి దివ్యశర మొ
కండు గొని సూతు నొంప నాతండు వాని, మేనఁ బదుమూఁడు కాండముల్ పూనియేసి,

ఉ. నాలుగు వారువంబులను నాలుగు తూపులఁ ద్రుంచి సూతునిన్
గూలిచి పంచమంబయిన కోలను షష్ఠమున న్నిశంబునన్
వ్రీలిచి సప్తమంబునను విల్ దెగటార్చి యష్టమంబునన్
వాలును బల్కయుం దునిమెఁ దాని నడంచె నొకైదుతూపులన్. 266

—♦ దుర్యోధనుఁడు ధర్మరాజుతో యుద్ధము చేసి విరుగఁ బడుట ♦—

వ. ఇట్లు ధర్మరాజేట్లాడుచున్నంత నత్యంతవ్యసనసంతప్తచిత్తుం డగుసీపుత్త్రుండు హాతా
శ్వసారథికం బైన తేరు డిగి భూతలగతుం డై కష్టదశం బొందియున్నవానికిం బాస
టయి కృపకర్ణాశ్వత్థామాదులు తెరలించినం గాంచి పాండుకుమారు లెల్లరు నయ్యుధి
ష్ఠిరునకుం దోడై వచ్చి రంతఁ దూర్యసహస్రంబులును గిలకిలారవంబులును జెల్లు
బ్రేయఁ బాంచాలురును గౌరవులునుం గూడి పేశనిపోడమిం బెనంగి రప్పుడు
నరుల నరులును వారణంబుల వారణంబులును రథంబుల రథంబులును హయంబుల
హయంబులును ద్వంద్వంబులై తాఁకివీఁకం జేసి చిత్రలాఘవప్రచారంబులు మెఱయఁ
బరస్పరస్పర్ధాతిరేకంబునం బోరినపోరు క్రమక్రమంబున నతిమాత్ర మధురదర్శనం బయ్యె
నయ్యెడ నిర్మర్యాదంబుగం బోరుచున్నచోట రథికులు నేనుంగులను గూలనేసియు
నేనుంగులు హయంబుల నరిదంబుల విదారించియు హయారోహకులు హయోత్త
మంబులం గాక మత్తమాతంగంబుల మొత్తియుఁ బత్తు లుత్తమాయుధంబులఁ బొడి
చిన వడి చెడి ఘోరం బగునార్తారవం బెసంగ దశదిశలం బాఱువారణంబులును
గొమ్ములపోట్లను దంతంబులవ్రేట్లను రాహుతులబాణంబులయేట్లనుం దగిలి పగిలిన
సర్వావయవంబులఁ గీలాలంబు స్రవింప నొచ్చియు విచ్చియుం బాఱువారువంబులకాళ్ళ
సందులం బడి నలిగినలుగడఁ బఱవ నొంచియుఁ బఱవఁ జాలక జాలిం బడికూలుకాలు
మానుసులును మహారథులశరంబులవ్రేటులం బడియుఁ గీటడంగక ప్రతియోధులం దగి
లి పిడికిళ్ళం బొడిచియు గేశంబులం బట్టి పడ నీడ్చియు భుజంబులం బట్టి యెత్తి
నేలం బెట్టి కొట్టియును బహుప్రచివాదంబుల నుదంబులం దన్నియుఁ గత్తుల మొత్తియు
బాహుయుద్ధంబును బాణయుద్ధంబునుం జేసియుఁ జిత్రవధంబునం బొంది ప్రమందిన యో
ధులును దనవారుఁగు లాతివారు డనక చిడిముడిపాటున నేపఱి రూపడంగువారును నై
సంగ్రామరంగంబు కబంధసీరంధ్రం బై నెత్తురేరులు ప్రవహింపఁ బరమదారుణం బై
కానన య్యె నయ్యెడఁ గర్ణుండు పాంచాలబలంబులను శీఘ్రతుండు త్రిగర్తసైన్యంబులను

భీమసేనుండు కౌరవవాహినులను గజానీకంబులనుం గనుపుగొట్టుచుండు నంతఁ గురు
పాండవధ్వజినులు లాయపరాహ్ణంబున నెంతయు క్షయం బయ్యె ననిన ధృతరాష్ట్రుండు
సంజయున కి ట్లనియె. 267

మ. అతితీవ్రంబులు దుస్సహంబు లగుదుఃఖాధిక్యముల్ నీవు సె
ప్పితి వే వింటిని బుత్రసంక్షయము పృథ్వీం గౌరవుల్ సెల్లిన
ట్ల తలంతున్ మది సంగరంబు విధ మెల్లం జెప్పి నాపుత్త్రుఁ డ
గ్గతి నై కై చేసిన దేమి చెప్పుము వినం గా నాకుఁ జిత్తం బగున్. 268

వ. అనిన సంజయుండు వాని కి ట్లనియె నట్లు విరథుండైన సుయోధనుం డాయోధనంబున
సమర్థుం డైన వేఱొక్కరథం బెక్కి క్రోధోద్రిక్తమానసుం డై విషోరగంబుచందంబున
రోఁజుచు నెదుట శ్వేతాతపత్త్రదంశితుం డైన ధర్మపుత్త్రుం బ్రతీక్షించి త్వరితుం డై
వానిపరిసరంబున రథంబు నడుపు మని సూతునకుం జెప్పుటయు నతం డట్ల చేయు
నంతఁ గౌంతేయాగ్రజుండును సారథికిం జెప్పి తన తేరు వానికభిముఖంబు గావించె
న ట్లిరువురు నొండొరువుల నెదిరించి ప్రదరవర్షం బడరింపుచున్నంత దుర్యోధనుండు.

సీ. ధర్మనందనునికోదండంబు రెండు గా, ఖండించె నొకభల్లకమున నపుడు
కనలి కొండొకవిల్లు గైకొని యతఁడు నీ, కొడుకు కార్ముకమును ధ్వజముఁ దునిమెఁ
దునిమినం గ్రుద్ధుఁ డై దుర్యోధనుఁడు వేఱు, చాప మూని యజాతశత్రు నొంచెఁ
గోదమసింగము లట్లు కొదగ కయ్యిద్దఱు, నితరేతరజయేచ్ఛ మెసక మెసఁగ

తే. సంకు లొత్తుచు నార్చు చాస్ఫాలనము లొ, నర్చుచును భేరి పణవాదినాద మెల్ల
కడలు నిండంగ వాలంపగములు గురిసి, కొనుచుఁ జూచిన మోదుగ లనఁగ నైరి.

క. అంత యుధిష్ఠిరుఁ డెంతయుఁ, బంతంబున రాజరాజు బాహ్యాంతరమం
దింతలు గాని శరంబులు, కొంతఱిలో మూఁడు చొనిపెఁ గో కొమ్మనుచున్. 271

ఉ. అందులకుం భవత్తనయుఁ డగ్గి శిలాశితబాణపంచకం
బందికఁ గా నిగిడ్చి శమనాత్మజుపై జ్వలదగ్నితుల్యమై
పొంది పొసంగు శక్తిఁ గొని పూర్ణబలంబునఁ బూని వైచినం
బొందకమున్న దాని నొకమూఁడుశరంబులఁ జెండి వెండియున్. 272

ఆ. పాండవాగ్రజుండు కాండపంచకమునఁ, గౌరవాగ్రజన్ము గండడంచె
శక్తి యట్లు సూక్ష్మశకలంబు లగుటకు, నాగ్రహించి నీదు నగ్రసుతుఁడు. 273

చ. నవనవభల్లముల్ దిగిచి నాఁటగ నేసిన నొవ్వ గ్రమ్మఁ బాం
డవుఁ దరివోసి యొక్కప్రకట మ్మగుచు మ్మడరింప నమ్మహే
షువు వడిఁ దాఁకి నీకొడుకు సొమ్మసిలం బొనరించియు న్మహా

రవ మెసఁగన్ వసుంధరఁ గరం బరుదారఁగఁ జొచ్చెఁ గ్రచ్చరన్. **274**

చ. గద గొని నీసుతుండు లయకాలునిలీలఁ బరఁగ రథస్థుఁడై
గుది యగుడెంచుఁ బోరి కవి దోర్బల మేర్పడఁ ద్రిప్పి యేయఁగా
మదిఁ దలపోయునంత నృపమాన్యుఁడు ధర్మసుతుండు వానిపై
వదలె మహోగ్రశక్తి సురవర్త్మము నగ్గడ మంట లంటఁగన్. **275**

తే. అమ్మహాశక్తి వక్షమునందుఁ దాఁకి, మర్మభేద మొనర్చిన మా టెఱుఁగక
నీసుతుఁడు తేరిపై నుండి నేల వ్రాలి, చచ్చె నో యన మునిఁగె మూర్ఛాభరమున.

క. అది చూచి భీమసేనుఁడు, మది నెంచుము నాదుప్రతిన మనుజేశ్వర నీ
కిది తగదు వీఁ డవధ్యుఁడుఁ వదలు మనఁగ ధర్మజుండు వాని న్విడిచెన్. **277**

వ. అంతలో నతిత్వరితగమనంబునఁ గృతవర్మ వ్యసనార్ణవమగ్నుం డగునీకొడుకున కెడ సొచ్చుటయు భీమసేనుండు గదాపాణి యై వాని మాఱుకొనియె నాపోరునఁ గర్ణుం బురస్కరించుకొని మనవారు చతురంగబలంబులతో నడరి పరశుపట్టసముసలముద్గరభిందివాలకరవాలాదిసాధనంబుల నరిసేనం గనుపుగొట్టి కరచరణాద్యవయవంబులు ఖండించి శిరంబుల ధరణిం గప్పి యప్పట్ల రుధిరప్రవాహంబు ప్రవహింపం జేసి సంగరాంగణంబు సంవర్తసమయపరేతరాడ్రాష్ట్రంబు నా నొప్పె నప్పుడు ముప్పిరిగొనుపరాక్రమంబున గురువృషభు లెల్ల మహాబలపురస్సరు లై శినివృషభుం దాఁకి పేఁకం జూపుచుండ సురేంద్రసమవిక్రమక్రముం డైనకర్ణుండు త్రిదశవరావరజోపముం డగు శైనేయు నతిమి శరపరంపరలు వఱలించిన నతండును భుజగవిషసమప్రభంబు లగుప్రదరసహస్రంబులు సరథవాజిసారథి యగునాధిరథిం గప్పి నీవారి నొప్పించుటయు వా రెల్ల శినిప్రవరనారాచపీడితు లై కన్నుమాఱువు పొచ్చియు నిలువ నోపక నొచ్చి విచ్చియు మహోదధిసమనిస్వనంబున నభంబు మ్రోయ రథాశ్వేభభటాళి తోడ నూడనిం బాఱి రాలో ధృష్టద్యుమ్నప్రభృతులును మనవారివెన్నడించితఱిమిన మనబలంబు లెల్లఁ జిందఱవంద రయ్యె నయ్యెడ. **278**

మ. కృతమాధ్యాహ్నికకృత్యు లై భవుని భక్తిం గొల్చి కృష్ణార్జునుల్
ప్రతిపక్షు ల్విన మస్కు లై కనఁగ గర్జానిస్వనంబుల్ సితా
న్నతగంధర్వచతుష్టయంబు పవమానప్రోద్భవాంచద్ధ్వజ
ప్రతిపాద్యంబు రథంబు నెక్కి యెదుటం బ్రత్యక్షమై రాక్షితిన్. **279**

సీ. అంత నక్కౌంతేయుఁ డత్యంతజవమున, గాండీవగుణము మ్రోగం బొనర్చి
దివియును భువియును దిక్కులును విదిక్కు, లును నిండుకొనఁ దూపు లొనర నేసి
రథిసారథులతోడ రథములను దెరల్చి, రౌతులతోఁ గూల్చి వీతిచయము

సారోహకులతోడ హస్తులఁ బరిమార్చి, భటసమూహములను బకలుపఱచి
తే. ఘోరముగఁ బోరొనర్చె నుగ్రుండు నాఁగ, నంతలోఁ దెప్పిఱిలి కౌరవాగ్రజుండు
శ్వేతవాహను మార్గణాళి శితశరముల, ఖలవఁ జేసె మహీశులు ప్రస్తుతింప. 280
చ. అలుక మనంబునం గదుర నాహవదోహలుఁ డర్జునుండు దో
ర్బల మెసఁగన్ సుయోధనుని రథ్యములన్ రథ సారథిన్ సము
జ్జ్వలదురగేంద్ర కేతనము ఛత్రము చాపము నుత్తరించి య
వ్వల నవమాశుగం బొకఁడు వానిశిరంబు గుఱించి యేయుడున్. 281
క. ఘోర మయి వచ్చుదానిన్, భారద్వాజాత్మజుండు పరికించి పడన్
దారిన యేడు తునియ లై, ధారుణిఁ బడ నేసి ధరణీధవు నలరించెన్. 282
తే. దాని కలిగి నరుఁడు ద్రౌణిరథ్యములను, దునిమి విలు ద్రుంచి కృపునియుఁ గస్సనేను
విండ్లు దునుమాడి కృతవర్మవిండ్లు ధ్వజము,తురగములఁ గూల్చి కర్ణుపైఁ దొడర నతఁడు.

— కర్ణుని రెండవ నాఁటియుద్ధము. —

మ. తనపై బాణపరంపరల్ పఱపుచున్ దా పైనఁగోపాలమి
త్రుని నల్లంతన చూచి యేచి తనతోఁ దుల్యక్రియం బోరునా
శినివీరు న్వడనాడి వాని వెస నై చేవాఁడి మూఁడమ్ముల
ర్జునుపై నిర్వదితూపు లచ్యుతునిపైఁ బొప్పించి నొప్పించియున్. 284
క. ముప్పిఱి యగుశౌర్యమ్మున, నప్పురుషవరుండు డయ్యె కచ్యుతునిం పెం
పుప్పతిల బహుళశరములఁ, గప్పుచు నరుతోడ సలిపె ఘోరాహవమున్. 285
తే. అర్జునున కంత శినివరుఁ డడ్డపడుచుఁ, దొంబదియుఁదొమ్మిదియునూఱుతూపులంగ
విభునిసర్వాంగములు నొవ్వ వెస నిగిడ్చె, రిచ్చపడి నీదుమూఁకలు పిచ్చలింప. 286
వ. అట్టియెడ యుధామన్యూత్తమౌజసులును శిఖండిధృష్టద్యుమ్నులును ద్రౌపదేయులును నకులసహదేవులును చేకితానయుయుత్సులును ప్రభద్రకచేదికరూశులున్ కేకయవీరులును ధర్మనందనుం బురస్కరించుకొని చతురంగబలంబులతో నసరి సూతసూనుం జుట్టుముట్టి నానావిధాస్త్రశస్త్రంబులం దెట్టలు గట్టం గొట్టుటయు సవ్వీరవరేణ్యుండును. 287
ఉ. ఆశరవృష్టి సంతయు నిజాశుగసంహతి సంహరించి ఘో
రాశుగ మేచి భూజముల నంకట వింతగఁ గూల్చునట్లు భూ
మీశులఁ బత్తులన్ హయరథేభములన్ వికలించి పుచ్చుడున్
క్లేశముతో విశస్త్రు లయి లేటమొగంబును బెట్టి రెల్లరున్. 288
వ. అంతలోన. 289

మ. నగుమో మొప్పఁగ నప్పు డర్జునుఁడు తన్నారాచవారం బడం
చి గుణధ్వానము మిన్ను మ్రోయ ముసలశ్రేష్ఠప్రతీకాశ మా
శుగబృందంబును బర్వఁ జేసి యెడ మెచ్చో లేనిచందంబునన్
గగనోర్వీతలమధ్యభాగము నొగిన్ గప్పెన్ రయం బొప్పఁగన్. 290

మ. నరబాణార్చులు నగ్గడం గవిసినంతం గౌరవానీకినుల్
పరమార్తధ్వని పర్వఁ బర్వు లిడుచున్ బాణాసముల్ బాణముల్
గరముం బాయఁగ బీతున న్వడకుచుం గన్మోడ్చి నిట్టూర్చుచున్
దురము న్వీఁగి పరాఙ్ముఖం బయి చనెన్ దూరంబు దూరంబుగన్. 291

వ. అట్టియెడ నంశుమంతుం డస్తంగతుం డగుటయు ధరణీపరాగంబునకుం దోడు నీడ
యై వీడనితమంబు మించి చెడ్డ లెఱుంగ నీకుంటఁ జేసియు నీసైనికులు రాత్రియుద్ధం
బున కోహటించి సేనలం దివియించు కొని శిబిరంబులకుం బోయినంతఁ గౌంతేయ
సైనికులును విజయంబు గాంచి సింహనాదంబులును శంఖాదినినాదంబులునుం గ్రాలఁ
గృష్ణార్జునులఁ బొగడుచు మనవారిం దెగడుచు నిజనివాసంబులకుం జని పాండు
పుత్త్రుల నాశీర్వదించుచు నారేయి పరమోల్లాసభాసమానమానసు లై సుఖంబుండి
రనిన ధృతరాష్ట్రుండు. 292

ఉ. ఎంతకుఁ జాలఁ డాసరుఁ డహీనపరాక్రమ మేర్పడంగ మా
కౌంతేయు వంతగా బలగ మెల్ల యథాయథ లై చనంగ నొ
క్కింతన చేయ వింటి నతఁ డేత్తెఱఁ జూపన నంతకుండు నేఁ
గొంతయు వీడి పోఁగలఁ డొకో యన రాదు రణాంగణంబునన్. 293

సీ. వృష్ణివీరుల గెల్చి వనిత హరించె సుభద్ర, ఖాండవము మగ్నికిఁ గలికిఁ బెట్టె
నవనీపతుల గెల్చి యరిగాపులం జేసె, మాయాగిరాతుని మట్టుపెట్టెఁ
గాలకేయనివాతకవచుల ఖండించె, ఘోషయాత్రం గాంచెఁ గురుబలంబు
గోగ్రహంబునఁ జూపె నాగ్రహం బంతయు, దిగ్విజయము చేసెఁ దివిరి తివిరి

తే. తలఁప నసహాయశూరుఁ డాదైవతాధినాథనందనుఁ డమ్మహాయోధవరుని
తోఁ బెనఁగుట మనవారు స్తోత్రపాత్రు లగుదు రే కాని కారు నిందాపాత్రు లరయ.

వ. కాని మ్మవ్వల దుర్యోధనాదు లేమిచేసిరి చెప్పు మనిన సంజయుం డిట్లనియె. 295

చ. విని హతవాహనాయుధులు వీరవరేణ్యులు దూయమానులై
పనివియు భగ్నదంష్ట్రములు పాదహతంబులు పన్నగంబు ల
ట్లనువరి కార్యమాత్రణాకు నందఱుఁ గూడి పొనర్చుచుండ నీ
తనయుని సేయుఁ జేరఁ గొని తా నగణ్యం గని కర్ణుఁ డిట్లనున్. 296

తే. దిట్టతనమును నేర్పును ధృతియుఁ గలఁడు, నరుఁడు వానికిఁ దఱుల నమ్మురహరుండు
హితవు బోధించుచుండు నమ్మతకరి గదమున వంచించి యింద్రశక్తిని హరించె.

ఆ. అయిన నేమి యయ్యె నలవును వెరవును, జలము బలము మెఱయ మెలఁగి వాని
తలపు లెల్ల నెల్లి ధ్వంసంబు గావింతుఁ, జూచుచుండు డెల్ల శూరవరులు. 298

వ. అనిన నాఁగాత మని వీతనయుం డగుసీతనయుండు వారి నందఱ వారివారిశిబిరంబు
లకుం బోఁ బనిచి తాను దనమందిరంబున సుఖసుప్తుం డయ్యె నని నైమిశారణ్య
వాసు లవ్వాలివృత్తాంతంబు చెప్ప మనుటయును. 299

ఆశ్వాసాంతము.

మ. దయ యొక్కింతయు లేకపోయెఁ గదవే దైవంబ! నీయుల్లమం
దయయో! నే నిటు లెంత వేఁడినను గాసం బైన నామొఱ్ఱఁ
బ్రియ మొప్పం జెవిఁ బెట్ట వైతి వకటా! నే నింక నెవ్వారితోఁ
గుయి వెట్టం జనువాఁడ ది క్కెవరు నీకుం దక్క సర్వేశ్వరా. 300

క. తనజన్మము సార్థక్యము, నొనరించుకొనంగఁ దివురుదు నుత్తముఁ డే నీ
జననము నిరర్థకంబుగఁ, బొనరించితి ననుచు నగతుఁ బో మునిమాన్యా. 301

గద్యము.

ఇది శ్రీమద్రఘునాథనోభయకవిమిత్ర వేంకటయజ్వాగ్రపుత్ర
సమారాధితవిబుధరాజ శ్రీపాదకృష్ణమూర్తి కవిరాజ
ప్రణీతం బయిన శ్రీకృష్ణభాగవతము నందుఁ
గర్ణపర్వంబునఁ బ్రథమాశ్వాసము.

శ్రీ. శ్రీ. శ్రీ.



శ్రీ

బాలాత్రిపుర సుందర్యై నమః.

# శ్రీకృష్ణభారతము

## కర్ణపర్వము-ద్వితీయాశ్వాసము.



శ్రీగలవా రని పెక్కుర
భోగతుల సమాశ్రయించి పోయితి వితమై
సేగతియు లేక పోయెను
యోగేశ్వర! నన్నుఁ బ్రోవు మొకగతి గలుగన్. 1

వ. అక్కథకుండు శౌనకాదిమహామునుల కిట్లనియె నట్లారేయి వేఁగి నంత రేపకడ నుభయబలంబులును భండనంబునకుం జనియె నప్పుడు ధర్మరాజు బృహస్పతిమతం బైనదుర్జయవ్యూహంబు నిర్మించినం గని సుయోధనాదులచిత్తంబు దానికిం బ్రతిపన్నుఁ జాలినవీరుండును వీర్యంబునం గార్తవీర్యసముండు నగు వైకర్తనునిపయిం బాఱె ననిన ధృతరాష్ట్రుండు. 2

తే. అందఱును మందు లెన్న శీతార్తు లెపుడు, భాస్కరోదయముచు గోరుపగిది వారు
సూతసుతుఁ గోరుకోఁ బోరె నాతఁ డెట్లు, పాండవులు దాఁకి రెట్టు లాదండిమగని. 3

శా. ఇంద్రోపేంద్రసమప్రభావుఁడు తదీయోద్ధాస్త్రముల్ దివ్యముల్
సాంద్రం బాతనివిక్రమం బొకఁడ యీసంఖ్యంబునం బాండుభూ
మీంద్రప్రోద్భవులన్ జయించు నని యెంతే నమ్మి రారాజు లోఁ
దాద్రం గర్ణుని నాశ్రయించి యిటు మంత్రజ్ఞుఁ డమ్యోం గటా. 4

ఉ. నమ్మినబాటు కర్ణుఁ డని నమ్మెను దా నటు ధర్మసూతిచే
సొమ్మసిలంగ నుండె గడ శూరులు వారు పరాక్రమింపఁ గా
నెమ్మి దొలంగి పోయె నిది యెల్లఁ గనుంగొని మందబుద్ధియై
సమ్మతి సేయు నాసుతుఁడు శత్రుల నోర్చు నటంచు నాకికన్. 5

క. ఎడ రావహిల్లె నింతయుఁ, బడి కర్ణుఁడు పాండుసుతుల భండనమం దో
ర్చెడువాఁడు నాఁగఁ జాలము, నోడు లేమిటి కింకఁ జెప్పను న్విన నకటా. 6

మత్త అడ్డసాళులనాఁటికూట మదాంతయుం గడువింత గా
గొడ్డగం బగునాల మై సమకూడ నయ్యె సుదుఃఖ మా
చెడ్డబుద్ధి సుయోధనుం డటు చేయుదాన ఫలించె ని
ట్లడ్డుపాటు మెలంగుసొంపుఁ జయ్యెఁ గారణ మింతకున్. 7

తే. సౌబలునినీతి కర్ణునిశాతహేతి, దనకు సామ్రాజ్య మీఁ జాలు నని తలంచి
బేల నాకొడు కీరీతి జాలి నొందుఁ, బాండవుల నాఁగుమగఁ డొక్కఁ డుండఁ డకట. 8

క. చేవమెయి వారు మనసై, న్యావలి మెఱసెదరు మొలఁతలందున్ మగ లై
ట్లేవరుసఁ దలఁతు మింకిట, దైవము బలవత్తరంబు దగఁ బరికింపన్. 9

చ. అనవుడు సంజయుం డనియె నాధృతరాష్ట్రునకున్ నరేశ్వరా!
వినుము గతార్థముల్ గుఱిచి విన్నఁడు చింత యొనర్పఁ జెప్పుదుర్
మనమున నైనచింత యది మానరఁ జేయు నరుం దలంప నీ
యనునది మున్న కా నగు నదంతయుఁ బాకము దప్పె నింతకున్. 10

తే. వలవ గని యందుఁ బెక్కురీతుల వచింప, మోహమునఁ జేసి విన వైతి మున్న నీవు
ప్రాప్త మప్రాప్తమును జూడ వాప్తులైన, వారి కరచార మొనరించి తారయంగ. 11

క. దానజనకుయ మిప్పుడు, కా నయ్యెం గాన నయిన కార్యంబునకున్
మానసమునఁ జింతింపక, భూనాథ నచింతు వినుము పోరిత మెల్లన్. 12

వ. అట్లుభయబలంబులుం గట్టాయితం బయి ప్రభాతంబునఁ బోలికలనికిం బోవునప్పు
డాధిరథి దుర్యోధనుం దరియ వచ్చి యిట్లనియె. 13

—కర్ణుండు దుర్యోధనునితోఁ దనకు శల్యుని సారథి గాఁ జేయు మని చెప్పుట—

తరువోజ. కలన నేఁ డప్పార్థుఁ గడతేర్ప లేక, కడ తేరెదను మున్న కర్జముల్ పెక్కు
గలుగుట మాఱొక్కలు గలుగదు లెస్స, కవ్వడికిని నాకుఁ గలహ మి ప్డొక్క
చలమున నగు నింద్రశక్తి లే దనియు, సర్వవీరులును నాశము నొంది రనియు
దల కేగి నరుఁడు నన్ దలకొని పోరఁ, దలలివచ్చెడు నిది తప్పదు నిజము. 14

క. దురమున వానిం దునుమక, మరలం డీకర్ణుఁ డింక మానవనాథా
పరికింపుము మాయిరువుర, కరయఁగ నగుతారతమ్య మది యీ వెల్లన్. 15

తే. అస్త్రవీర్యమునందు శౌర్యమ్మునందుఁ, గార్యభేదమునందు లాఘవమునందు
జ్ఞానయోగమునందు సౌష్ఠవమునందు, నన్నుఁ బురడింపఁ జాలఁ డానరుఁడు వింటె. 16

క. బలమునఁ జలమున శరమున, నలవున వెరవునను విక్రమాటోపమునం
దెలియఁగ నా కక్కవ్వడి, యలఁతియ యని తోఁపకుండునా నరనాథా. 17

చ. అలఘుఁడు విశ్వకర్మ విజయాఖ్య నెసంగెడువి ల్లొనంగె వే

ల్పుదార కాతఁ డందునఁ బూర్వసుపర్వులఁ జెర్చి చెర్చి దో
ర్బలకలితుండవు రామునికరంబులఁ బెట్టె నతండు గాన ని
య్యిలఁ గలరాజులం దునిమె నిర్వది యొక్కఁడు మాఱు లుక్కునన్. 18

ఉ. ఆతఁడు నాపయిం గలుగునక్కటికంబున దానిపేర్మికిం
బ్రీతి వహింప నాకొసఁగెఁ బృథ్వీప! దానికి గాండివంబు నేఁ
బ్రాతియె తచ్ఛరాసమున ఫాల్గుననిం బరిమార్చి బాంధవ
వ్రాతముతోడ నీ వలర రాజ్యము నీభుజపీఠి నిల్పెదన్. 19

ఆ. నీకుఁ బ్రియము సేయునెడ నున్న నా కశక్యం బొకండు లేదు కార్యసిద్ధి
సిద్ధ మతఁడు నన్నుఁ జెనకఁ జాలం డగ్ని, సాక్షిమి కొన్నన్యృక్ష మట్లు తలఁప. 20

వ. సంవిధానం బింతయు నిట్లున్నను నే నిపు డానరుని కన్న నలంతి నని చెప్పుచుంటి నాకర్ణింపుము. 21

సీ. అతనిధనుశ్శ్రేష్ఠ మజిత మగు గాండీవ, మల్లియ సారవత్సల్లలితము
రథ మగ్నిదత్తము రథ్యములు మనోజవము లవధ్యములు దివ్యప్రభములు
ధ్వజము వానరరాజదర్శనీయము ద్యుతి, మంత మత్యంతవిస్మయకరంబు
సారథి లోకైకసంరక్షకుం డమ్మ, ఐంద్ర వాయవ్యాదు లగ్రియములు

తే. తెలియ నిన్నియు నాకంటె దేవరాజసుతున కెక్కుడ యగు నైన స్తోత్రపాత్ర
పత్త్రినివహంబులం జెక్కుబంప్ల నించికొని రథంబులు పెక్కులు గూర్చికొందు. 22

క. ♦ ఇటు లైనఁ గొఱంత గీటెడు, నటు నావిజయంబు గాండివాదులకంటెన్
స్ఫుటసారాంచిత మై యొప్పట నేనే మేటి ననుచుఁ బోలుం జెప్పన్. 23

ఉ. శౌరికిఁ బాటి మేటి యగుసారథి లేనికొఱంతఁ దీర్పఁగాఁ
గోరును నిప్ప డప్పని కొకొండగు నిందు నతండు మద్రభూ
దారుఁడు సూతకృత్యమునఁ దా హరి మించెడి నే శరంబునన్
శూరత మింతు నిట్లొనరఁ జూతువ యేని జయంబు నీకగున్. 24

చ. అదరమునంద మద్రవిభుఁ డర్వముల న్నడపించువాఁడ మై
పరఁగిన దేవదానవులు భండనమం దెదిరింపలే రనన్
నరులను జెప్ప నేమిటికి నాపొనరించెడునెల్లఁ జూడు మో
నరవర శల్యునిం దెలిచి నారథచోదకుఁ జేయ గోరితిన్. 25

వ. అనిన నొఁ గాత మని సంతసించుచు నీకొడుకు రాధకొడుకుం బ్రశంసించి నీకోరిన ట్లనేకసోపాసంగాశ్వశతాంగంబులు గార్ధ్రపత్త్రనారాచసంచయంబులను నీవెనువెంట

♦ విజయంబు, కాలపృష్ఠము-కర్ణునివింటిపేళ్లు.

నంటి యుండు నట్లు నియమించి మే మెల్లరము నీపఱుదం ననుసరింతు మని చెప్పి
యప్పు డమ్మద్రమహీజానిపాలికిం బోయి సవినయంబుగా ని ట్లనియె. 26

—దుర్యోధనుఁడు శల్యునిఁ గర్ణునకు సారథ్యముచేయు మని ప్రార్థించుట—

సీ. ఓయి సత్యవ్రత! యోమహాభాగ! శాత్రవతాపవర్ధన! రాజచంద్ర!
వింటి కదా కర్ణువివరించునంతయు, దాన నీరాజమధ్యమునయందుఁ
దల వంచి వినయంబు దళుకొత్త నిన్ను నే,యాచింతు శత్రుక్షయార్థి నగుచు
విత సేయ కీవు నాహిత మెంచి ప్రణయంబు, నను గర్ణునిరథంబు నడప వలయు
తే. వాసుదేవునిఁ బోలినవాఁడ వీవు, గాక రథచోదకుఁ డొకండు గానఁ బడఁడు
త్రిపురవధమున హరుని విరించి యట్లు,నీవు దోడ్పడి వసుషేణుఁ బ్రోవు మయ్య. 27

క. మాధవుఁ డిపు డర్జును నా,యోధనమున నోమునట్టు లో మద్రమహీ
నాథా! మనవసుషేణుని, బోధింపు నియంత వగుచుఁ బూని హయముల్. 28

వ. మనబలం బెల్ల ద్రోణకృపకర్ణులుఁ నీవును గృతవర్మాశ్వత్థామసౌబలులును నేను ననుతొమ్మండ్రపై తొమ్మిదివిధంబుల విభక్తం బయి యున్న దందు భీష్మద్రోణు లిద్దఱును వృద్ధు లయ్యు నుద్దవిడిం బోరి పోరి స్వర్గంబునకు నిర్గమించి రస్మదీయు లైనపెక్కండ్రు రాజులు నుక్కుమిగిలి వారిశక్త్యనుసారంబు సుదుష్కరకార్యం బొన రించి ప్రాణంబులు త్యజించి రరిబలం బల్పం బయిన ననల్పం బయిన మనబలం బిట్లు నిహతం బయ్యె నింక నైన బలవంతు లైనకౌంతేయులచేతం బడకుండ మనబలంబుం గాపాడుకొనుట పాడి యని తలంచుచుంటి నాకర్ణింపుము. 29

శా. నిన్నుం గర్ణుని నమ్మి కార్యభరము న్నీమీఁద రాధేయుమీఁ
ద న్నిల్వం బొనరించి యుంటి నిపు డోధాత్రీశ! కర్ణుండు శౌ
ర్యోన్నత్యంబున నేఁడు క్రీడి నఱుమన్ యత్నించుచున్నాఁడు సం
పన్నం బయ్యె జయాశ వాని కని నేఁ బ్రార్థింపఁ గా వచ్చితిన్. 30

తే. కృష్ణసారథ్యమునఁ జేసి జిష్ణుఁ డిపుడు,కౌరవవానీకినుల నెల్ల గాల్చుచుండె
వానిఁ గని నంత నే మనవార లెల్లఁ, బఱవఁ జొచ్చెద రేమన వచ్చు నయ్య. 31

చ. అరుణునితోడ నున్నరవి నారసినంతన చిమ్మచీఁకటుల్
విరిసినయట్లు నిన్నుఁ గలవీరునిఁ గర్ణునిఁ గాంచి శాత్రవుల్
దురమున నుండి గాల్కొలఁది దూఁటెద రోనరనాథ! మీ కరిన్
బరఁగినభాగ మిట్లు సలుపం దలపోయుఁడు నీవుఁ గర్ణుఁడున్. 32

తే. రథివరేణ్యుఁ డతండు సారథివరేణ్యుఁ, డీవు మీయిద్దఱును గూడుఁ డెన్న యిది య
భూతపూర్వము నభవిష్య మై తలిర్చి, వేల్పులకుఁ బిచ్చలించెడువిధము దెచ్చు. 33

వ. కావున నీవు నావచనంబు శంకింప కంగీకరింపు మనినఁ గులైశ్వర్యబలదృప్తుం డగుఁ
నతండు క్రోధమూర్ఛితుం డై కటకటం బడి కుటిలభ్రూకుటి యై కటంబు లదరఁ
గన్నుఁగవఁ గెంపు పెంపారఁ గరంబులు విదిర్చుచు ని ట్లనియె. 34

మ. అవమానించితి సూతకృత్యమును జేయం బూనుకొ మ్మంచు న
న్నవనీనాథునిఁ గర్ణకం టెఁ గోలఁ గా నాలించితే? సూతసం
భవునిన్ వాని దురంబులందు పోరఁగా భావింప న న్నొద్ద యే
దవుకర్ణంబున నిల్పు మార్గణమునన్ దానిం దగం దీర్చెదన్. 35

సీ. ఇంతేల పలుక నా కిది యని పా ల్వెట్టు, మది యెంత దైన నే నాథ్యుఁడ నయి
యొకరుంప యోర్చెద నోల మాసింపక, పురముప నాపేర్మ మరయు మీావు
మనుఁబోట్లు తగునభిమానంబునం బ్రవర్తింతురు గా కొందు తెలుఁగు వారు
శంకింపకుము నన్ను సారథ్యమునఁ గట్టి, పరిభవించుట నీకుఁ బాడి గాదు
తే. బలిసి వృత్తము లగునాదు బాహువులును, భాసురమ్ములు బాణబాణాసనములు
శ్వసనవేగాశ్వయోజితస్యందనంబు, తీక్ష్ణగదయును గని యునఁ దెలయ వైతి. 36

వ. అని యంత నిలువక. 37

ఉ. భూవలయం బగల్చెదను భూరిసముగ్రము లింకఁ బట్టెదన్
గ్రావములం బగిల్చెదను గట్టుపకా నయి యిట్టిమేటి న
న్నీ వెఱుగంగ లేక యొకహీనునకున్ హయచోదకుండు గాఁ
బోవ వచించుటల్ తగునె భూవర! నిన్నిపు డేమనం దగున్. 38

తే. నీచపరిచర్య సేయ నే రాచవాఁడ, నె ట్లనుమతింతుఁ జెప్పెద నేను నీకు
వశగతుఁడ నైతి రాజ నీవపున నన్నుఁ, బలికి తిట పాపకార్యము తెలియ వినవొ.

వ. మఱియు విను మాబ్రహ్మముఖంబున బ్రాహ్మణులు బాహువుల క్షత్రియులు
నూరువుల వైశ్యులును బాదంబుల శూద్రులును బుట్టి రాచాతుర్వర్ణ్యసాంకర్యం
బునఁ బ్రతిలోమానులోమజాతు లుత్పన్నంబు లయ్యె నందు బ్రాహ్మణులకు యజ
నయాజనాదులును క్షత్రియులకు దుష్టశిక్షణశిష్టరక్షణంబులును వైశ్యులకు గృషిగో
రక్షణంబులును శూద్రులకుఁ బరిచర్యయు వృత్తు లయ్యెఁ గావున సూతులు క్షత్రి
యులకుఁ బరిచారకులు గాని క్షత్రియులు సూతులకుఁ గా నోప రేను మూర్ధాభి
షిక్తుండ రాజర్షికులోద్భవుండ నగుటం జేసి సూతకులసంభవుం డగునంగరాజునకు
సారథ్యంబు సేయ నుత్సహించువాఁడం గా నిట్టియవమానంబునకుఁ బాత్రుండ నై
యిట నుండి పోరు సేయం దలంపక యింటికిం బోయి వచ్చెద నని కోపించుచు
లేచి శల్యుండు రాజమధ్యంబునుండి వెడలి చనుచున్నం గని పట్టువఱచుచు

సుయోధనుండు బహుమానపురస్సరంబుగా నతని నిలువరించి సామం బనుసంధం చుచుఁ బ్రణయమధురంబు గా ని ట్లనియె. 40

సీ. అనఘ! నీచెప్పినదంతయు నిక్కంబ, మైన వాక్రుచ్చెద నాలకింపు
మేను గర్ణుండు నొక్కింతయు నీకన్న, మిన్నలు మని చెప్ప మెన్నఁడేని
యీవు నీపూర్వులు బుధవాదు లగుట నా, ర్తాయని యనుపేరు దనరె నీకు
శల్యుఁడ వైతివి శత్రులకుఁ శల్య,భూతుండ వై నిన్నుఁ బొగడ నేల

తే. తొల్లి నీవు వచించిన ట్లెల్ల నగుత, నరుని కన్నఁ గర్ణుఁడు మేటి శరమునందు
శౌరికన్న నీ వశ్వశిక్షణమునందు, బలమునందును మేటివి తెలుప నేల. 41

వ. కర్ణునకు సారథివై కార్యంబు సక్కఁబెట్టు మని ప్రార్థించితిం గాని నిన్నవమానింపఁ గా దాకర్ణింపుము. 42

క. నరునకుఁ బ్రతిపీరుం డై, సరిగొన మనకర్ణు నాజిఁ జాలించితి మా
నరునకు హరి సారథి యీ, దొరకిక్కడ నీవు గాక దొరకునె చెపుమా. 43

చ. అనవుడు శల్యుఁ డి ట్లనియె నాహరికన్నను సన్ను మిన్న గా
మనుజపతుల్ వినం బలికి మన్నన నేసితి గాన నీపలుకుల్
మనమునఁ బ్రేమునుడించితిని మానవనాథ! భవన్మనఃప్రియం
బనువుపడంగఁ గర్ణునకు నయ్యెద సారథి నై రథంబునన్. 44

క. నాకును వైకర్తనునకు, నీకరణిన్ సమయ మగుఁ జె యిసెపు డెల్ల
వాకొనిన దాని కూరటఁ, గైకొనఁ దగు రథము గడుపు కాలమునందున్. 45

వ. అనిన నమ్మనుజేశ్వరుండు మద్రదేశ్వరునిమతంబు కర్ణున కెఱింగించి నీ వనిన ట్లగుం గాక యని వాని నొప్పించి వాని నోడంబఱిచి మఱియు మద్రపతిమనం బుఱియా డునో యని శంకించి యతనిం గాంచి తొల్లి మార్కండేయమునీశ్వరుండు మాకుం బ్రీతిం జెప్పినపురాతనేతిహాసం బొకండు గల దాకర్ణింపు మది నీయనుమానం బెల్లఁ బోకార్చు నని యి ట్లని చెప్పం దొడంగె. 46

—సుయోధనుఁడు శల్యునకుఁ ద్రిపురాసులవృత్తాంతము చెప్పుట—

సీ. దేవదానవరణోద్దేశంబునన్ మున్ను, తారకాసురుఁ డీల్గి తదనుచరులు
[illegible] యష్టు వెడలి తారకునిపుత్రకులు విద్యున్మాలి తారకాక్ష
కమలాక్షు లనువారు కడునియమంబునఁ, దపము గావించి రత్తపమునకును
మది మెచ్చుకొని పితామహుఁడు ప్రత్యక్ష మై, వరము [illegible]

తే. దయ యొసంగుకు సర్వభూతములు [illegible]
డిట్లు సర్వామరత్వ మేనిచ్చఁగ రాదు, వరము వేఁడొ [illegible]

వ. అనిన వా రది యట్ల యగు నేని మే మభేద్యంబులు కామగమనంబులు నగుమూఁడుపురవరంబులం బడసి నీప్రసాదంబున నెల్లలోకంబులం దిరిగి వచ్చునట్లును వేయి వర్షంబుల కెన్నఁడే నీమ్మూఁడు పురంబులు నేకభావంబు నొంద వాని నొక్కమ్మునఁ గూల నేయ జాలినవాఁడు మాకు మృత్యు వగునట్లును వరం బొసంగు మనినం బితామహుఁ డట్ల యగుం గావుత మని దివంబునకుం జనియె దనుజేంద్రులు నట్లు వరంబు వడసి సంతసించుచు దానవవిశ్వకర్మ యగుమయుం బ్రార్థించి కార్యంబు నివేదించిన నతండు నిజతపఃప్రభావంబునఁ ద్రిపురంబుల వినిర్మించె నవి కాంచనరౌప్యకార్ష్ణాయసంబుల నై యొండొక్కఁడు నూఱు యోజనంబుల విస్తారాయామంబుల నిష్టంబులై గృహాట్టాలకసంయుక్తంబులును బహుప్రాకారద్వారతోరణాదివిభూషితంబులును వివిధప్రాసాదవిరాజితంబులును జనసంబాధమహాపథంబులునుం గలిగి కన్నులపండువమై యుండె నందు దివంబునఁ గాంచనపురంబునఁ దారకాక్షుండును నంతరిక్షంబున నైన రాజతపురంబునఁ గమలాక్షుండును భూతలగతం బైన యాయసపురంబున విద్యున్మాలియు నధిష్ఠితు లై యప్రమేయప్రభావంబున భాసిల్లుచు నిట్లు ముల్లోకంబులం బ్రమించి పీడించుచుండి రక్కాలంబున నిర్జరనిరాకృతు లగు దైత్యదానవబృందంబులు ప్రయుతంబులు కోటు లర్బుదంబులు న్యర్బుదంబులుగ వచ్చి త్రిపురదుర్గంబు లాశ్రయించి నిర్భయులై సుఖం బుండిరి మయుండును వారియోగక్షేమం బరయుచు నెల్లకోర్కులుఁ దీర్చుచుండెఁ దారకాక్షుపుత్రుండు హరి యనువాఁ డతితీవ్రతపంబునఁ బితామహునిఁ బ్రీతుఁ జేసి మృతు లైన వారిం బ్రతికింపఁ జాలునీళ్ళుగల నిం డొక వాపి యొక్కం డునట్లు వరంబు వడయుటం జేసి త్రిపురవాసులు నాశనం బెఱుంగక వరదానదర్పితులును లోభమోహాభిభూతచేతస్కులును నై లోకంబు లెల్లఁ జీకాకుపడఁ జేయుచు దేవతల దళించి దివ్యోద్యానంబులును ఋష్యాశ్రమంబులును రమ్యజనపదంబులును జెఱుచుచుండఁ బురందరుండు త్రిపురంబులపై దాడి వెడలియు విరించి వరప్రభావంబున వాని భేదింప నోడి భీతుండై దేవర్షిగణంబుతోఁ బరమేష్ఠిపాలికిం జని నమస్కరించి సురాసురవిప్రకారం బంతయు విన్నవించి పగోపాయం బడిగింపు మనిన నతం డింద్రాదిబృందారకబృందంబులం గాంచి యి ట్లనియె. 48

శా. మీకుం గీడు పొనర్చుచుం ద్రిజగమున్ మేదించు నాదుర్మతుల్
నాకుం గీడు పొనర్చుచుండి రనుచు న్వాపోవ నేలయ్య నే
నేకాలంబును సర్వభూతహిత మొందే నెంచి వర్తించెదన్
లోకద్రోహుల నేర్చు టే వ్రతము గా లోఁ బూని యుండెదం జూడుఁడీ. 49

మ. ఒకకోలం దెగనేయఁ జాలినబలాఢ్యుం డున్న యా దుష్పుర
త్రిక మొక్కింతన త్రెళ్లు నట్టిఘన కీర్తిం బొందఁ జేర్పొందు గా
కొకఁ డెవ్వాఁడును లేఁడు ముజ్జగములం దూహింప మీ రిప్పు డా
సకలేశున్ శరణంబు వేఁడఁ జనుఁ డీ సర్వాధులుం దీరెడిన్. 50

తే. అనుడు నింద్రాదు లొఁ గాక యనుచు నప్పి,తామహుని మున్న కొని తారుతరలిభక్తి
నభవు పాలికిఁ జని నియతాత్ము లగుచుఁ, బ్రస్తుతించిరి ప్రవినుతవాక్యగతుల. 51

మ. స్తుతివాక్యంబు లెసంగఁ గాంచి యెదుటన్ సుత్రామముఖ్యామరుల్
శితికంఠున్ గిరిశున్ గిరీశు నభవున్ శీతాంశురేఖావిభూ
షితశీర్షున్ సకలాత్ము నాత్మవిదు సుశ్రీవైభవోపేతు స
న్నుతచారిత్రుని సాంఖ్యయోగవిదుని న్సద్దస్వభావోదయుల్. 52

వ. ఇట్లు గాంచి మఱియు ననేకవిధంబుల వినుతించి భగవంతుండును సర్వభూతమయుండు నగుట నశ్వేశ్వరు నేకమూర్తియందుఁ గల్పితంబగు ననేకమూర్తు లాత్మప్రతిమూర్తులు గ నిశ్చయించి పరస్పరావలోకనంబులం జేసి పరమానందపరవశు లై. 53

మ. భవసింధుప్లవ! పార్వతీధవ! కవిప్రస్తూయమానోత్సవా!
భవ! గోసైంధవ! దేవబాంధవ! సమద్యద్భూరిపాపాటవీ
దవ! సత్త్వోద్భవ! బద్ధమాధవ! సుధాంధశ్శ్రేణిసంస్తూతోద్భ
రవ! లోకప్రభవా! జితాత్మభవ! సంరక్షింపు మమ్మీశ్వరా!. 54

వ. అని మఱియుఁ బ్రస్తుతించి పరమేశ్వరుని పాదంబులు ఫాలతలంబుల సోఁక సాష్టాంగదండప్రణామంబు లాచరించి పూజించుటయును. 55

ఉ. అప్పుడు స్వస్తివాక్యముల నందఱ ముందుగ లేవ నెత్తుచుం
జెప్పుఁడు చెప్పుఁ డేమిపని చెప్పఁగ వచ్చితి రింక లంచుఁ దా
నప్పరమేశ్వరుండు నగ వాసన సీమ నలంకరింపఁ గా
నొప్పినమాటలాడుడు సురోత్తము లంతటి స్వస్థచిత్తు లై. 56

ఆ. అప్రమేయనాముఁ డఖిలేశ్వరుఁ డనాది,నిధనుఁ డవ్యయుండు నీలకంఠుఁ
డభవుఁ డక్షయుండు నైననీ కివె యేటి,కోర్కు మమ్ముఁ బ్రోచికొనుము దేవ. 57

వ. అనినం బ్రసన్నుం డై పన్నగాభరణుండు స్వాగతంబు వలుకుచు నభయం బొసంగి నే నేమి చేయుదుం జెప్పుఁ డనిన నప్పితామహుం డతని కిట్లనియె. 58

మ. సకలాధీశ్వర! నీదుపంపునను బ్రాజాపత్యమేఁ గల్గి తా
రకపుత్రత్రయికిం బురత్రయవరప్రాప్తిం బొనఁగించి కా
నకపోతిం గనుగాన రాక్షసులు లెదర్ గర్వించి నన్నెంచ కూ

దక లోకంబుల నేఁచుచుండిరి యతిక్రాంతాతిమర్యాదు లై. 59

ఆ. కావు గాక వారి యేపుమాపఁ జేయ, నోప రెవరు గాని యోపురాణ
పురుష మేము నిన్ను శరణుఁ జొచ్చితి మిట్లు, జగము లుద్ధరింపఁ జాలు మయ్య. 60

సీ. అనుడు మృడుం డను నరుల నేర్చుటపోలు, నైన నా కొక్కని కది యశక్య
మగు బలియుర వార లగుట నా తేజోర్ధ, మీరలు కొని వారి నేయ వలయు
నన విని సురలు మాయంగకతేజోబ, లము కన్న వారిబలము మది రెట్టి
కాన మే మవ్వారి గండడఁగింప నీ, యుగ్రతేజము దాల్ప నోప మభవ

తే. గావున మాదగు తేజోర్ధ మెల్లఁ బొంద, పగఱఁ బరిమార్పు మనిన నట్లగున యేని
యేన చేసెద నని భవుం డెల్లవారి, బలము సాఁబాలు గొని కడుం బలియుఁ డయ్యె.

వ. ఇట్లద్దేవుం డెల్లదేవతలకన్న మిన్నయై బలాఢ్యుఁ డై మహాదేవుండనం బడి వెలుం
గుచు నవ్వేలుపులం గాంచి త్రిపురదాహకుఁడ నగు నాకు నొక యుత్తమహారథం
బును ధనుర్బాణంబులును సంఘటించు నది యని శాసించుటయు వారును. 62

తే. పను త్రైలోక్యమూర్తుల నెల్ల నేర్చి, రథము గల్పించెదము సువర్ణమును గాఁగ
శరశరాసనములు దివ్యతరము లేరి, తెత్తు మని విశ్వకర్మకుఁ దెలుపుటయును. 63

చ. అతఁడు నిజప్రభావమున సాద్రివనాబ్ధినదీనదోక్త మీ
క్షితితల మెల్లఁ దేరుగుచుఁ జెల్లఁగఁ జేసి తురంగమాదు లం
చితముగఁ గూర్చి దిట్టమునఁ జేసి శరాసనమున్ శరంబునున్
హుతవహసోమవిష్ణులసమున్నతిఁ జేసి యొసంగె శూలికిన్. 64

తే. ఆశరంబునకున్ శృంగ మగ్ని యయ్యె, భల్ల మయ్యెను సోముండు పరమకుట్మ
లమ్ము నారాయణుం డయ్యె నమ్మహేశు, గమ్ముఁ గని మెచ్చె లోకశంకరుఁడుహరుఁడు.

వ. అమ్మహామహీస్యందనంబునకు మందరం బక్షంబుగను నక్షత్రరేఖ యీషాదండం
బుగను కృతయుగంబు మహాయుగంబును భోగీశ్వరుం డగు వాసుకి కూబరంబుగను
హిమవద్వింధ్యపర్వతంబు లవయవంబులుగను నుదయాస్తాచలంబులు బండికన్నులు
గను సప్తర్షిమండలంబు రథపరిష్కారంబుగను గంగాదినదు లహోరాత్రంబులుగను
గలాకాష్ఠాదులు రథోపస్కారంబులుగను గ్రహంబులుం దారకలు ననుకర్షంబులు
గను ధర్మార్థకామత్రయంబు త్రివేణుకంబుగను పుష్పఫలోపగంబు లగు నోషధులు
ఘంటికలుగను సూర్యచంద్రులు చక్రంబులుగను దివారాత్రంబులు పూర్వాపరపక్షం
బులుగను ధృతరాష్ట్రప్రభృతులు పదుగురు నాగపతులు యోక్త్రంబులుగను
దివంబు యుగంబుగను సంవర్తకబలాహకంబులు యుగచర్మంబులుగను గర్కోటక
ధనంజయకాలపృష్ఠాదులు హయవాలబంధంబులుగను దిక్కులును విదిక్కులును

సంధ్యాధృతి మేధాస్థితిసన్నతులును సత్యధర్మార్థంబులును హయరశ్ములుగను నక్ష త్రగ్రహతారాదులు చిత్రచర్మంబులుగను సినీవాల్యనుమతికుహూరాకాదులు రథ రజ్జువులుగను మనం బధిష్ఠానంబుగను సరస్వతి పరిరధ్యగను విద్యుదింద్రధనుఃకలిత మేఘంబులు నానావర్ణపర్ణిపతాకలుగను వషట్కారంబు ప్రతోదంబుగను గాయ త్రి శీర్షబంధంబుగను మేరుమైనాకంబులు ధ్వజయష్టిగను ఋగ్యజుస్సామాథర్వణవే దంబులు హయంబులుగను నింద్రయమవరుణకుబేరులు హయప్రతిపాదకులుగను సముద్రమ్ము లమ్ముంపొదులుగను గల్పించి తొల్లి పవనసమయంబునం దగురథంబు కన్న మిన్న యగునట్లును సర్వలోకతేజంబు లేకస్థంగతంబు లగునట్లును సన్నద్ధంబు చేసి తెచ్చిన తేరిం జూచి వియచ్చరు లచ్చెరువడి దాని నమ్మహాదేవునకు నివేదించిన నతం డమ్మహారథంబు నరసి యందు వృషభకేతనం బెత్తించి బ్రహ్మదండకాలదండ రుద్రదండంబులును జ్వరంబులు నంబుగడం బరిస్కందంబులుగ నెలకొల్పి యథర్వాం గిరస్సులు చక్రరక్షకులుగను బురాణంబులు పురస్సరులుగను ద్రయీతిహాసంబులు పృష్ఠరక్షకులుగను దిశలు విదిశలును బరివారంబుగను సకలవిద్యలు నోంకారవష ట్కారములును బార్శ్వచరులుగను నిలువ నియమించి కాలరాత్రి నాఁబడునాత్మ చ్ఛాయ యల్లెత్రాడై గ్రాలఁ గాలమయశరాసనంబును సోమవిష్ణ్వగ్నిసంభవం బగు శరంబును మట్టినంత నం దతిదుస్సహం బై క్రోధాగ్ని సముద్భవం బయ్యె నయ్యెడ నాకృత్తివాసుండు సూర్యాగ్నిసంకాశుండును జ్వాలమాలాన్వితుండు నై జ్వలించుచు జగం బెల్ల నిజాంగంబుల నాశ్రయించి యుండ నద్భుతదర్శనుం డై గండుమిగిలి దేవ ర్షికల్పితంబును దివ్యగంధబంధురంబు నగుగంధవహు నంగీకరించుచు మహర్షిస్తో త్రంబు లాలించుచు నప్సరోనృత్యంబు లాదరించుచు గంధర్వగానంబు లంగీకరించుచు వందిసందోహవంద్యమానుండును మాగధసంస్తూయమానుండు నై శరియు శరాస నియు ఖడ్గియుం గవచియు నై పరామయం బగునమ్మహారథం బనుమంత్రించి మంద హాససుందరవదనారవిందుం డై బృందారకబృందంబులం దిలకించి నాయీరథంబునకు సారథి యెవ్వం డతండు నన్ను మించినవాఁ డయి యుండ వలయు నరయుం డనిన వా రెల్లరును వారిజాసనునిపాలికిం జని ప్రార్థించుచు నిట్లనిరి. 66

ఉ. ఈవు వచించినట్లు దనుజేంద్రవినిగ్రహమందుఁ గర్జముల్
దేవమేయిం బొనర్చితిమి చిత్రమహాయుధసంభృతంబు తే
రావటిలంగఁ జేసితిమి స్వాంతమునందుఁ బ్రసన్నుఁ డై మహా
దేవుఁడు దేజరిల్లుచు రథిత్వము నొందఁగ సల్పె సమ్మతిన్. 67

ఉ. సారథి లేమి నింతపని సాఁగ దనన్ వలె నయ్యె నీవు మున్

గారుణికత్వ మేర్పడఁగఁ గిన్గొని మమ్ము మదీప్సితార్థముల్
దీరుతు నంటి వానుడి ఫలింపఁగఁ జేయుచు శూలపాణికిన్
సారథి వై జగద్ధితము సల్పుము వేల్పుల ప్రార్థనంబునన్. 68

చ. అరదము భూతలం బఁట హయంబులు నాల్గఁట నాల్గువేదముల్
తరణిశశాంకు లిర్వు రఁట తద్వరచక్రము లుగ్రుఁ డీశ్వరే
శ్వరుఁ డఁట యోధుఁ డట్టితఱి సారథి యోధుని మించినట్టి వై
పరఁగిన గాని చాలఁ డని ప్రార్థన సేయుచు నుంటిమీ క్రియన్. 69

తే. నీవు గా కారథము నెక్క నేర్చినట్టి, సారథి యెవండు చూపట్టఁ డారయంగ
నేఁడుగడ నీవ వేల్పుల కెక్కురథము, జయ మొసంగుము హరునకు జగము లలర.

వ. అని ప్రార్థించినం బ్రసన్నుండై సారసగర్భుండు సారథ్యంబున కొడంబడినచిత్తంబున వారిచిత్తం బిగురొత్త ని ట్లనియె. 71

క. వృషలాంఛ నేను వేల్పుం, బిషయమునన్ దేరికేని వెనుకంజె యిఁకన్
విషమేక్షణునిహయంబులు, మిష లేక వహింతు పగలు మ్రాతి గోరుమతిన్. 72

చ. అనుచు ననుగ్రహించి జలజాసనుఁ డాసమయంబునన్ మహే
శునకయి కల్పితం బయినసూర్యనిభం బగు తేరిమీఁదికిం
జని నొగ లెక్కె నంత రథసైంధవముల్ ధర ప్రమొగ్గతిల్లుచున్
గని మునికోటిఁ బగ్గములుఁ గైకొని వానిని లేవ నెత్తుచున్. 73

క. అగజేశ్వరునిం గనుఁగొని, జగదీశ్వర లెమ్ము రమ్ము స్యందన మెక్కన్
నొగ లెక్కి నేను సార, థ్యగతిం దగఁ బ్రస్తరింపఁ దనరితి నీకున్. 74

వ. అనిన నౌఁ గాక యని మహాదేవుండు ధనుష్టంకారంబున ధరణీతలంబుఁ గంపింపం జేయుచు దేవర్షిస్తోత్రంబులును గంధర్వాప్సరోగాననృత్యంబులును జెలంగ నద్దివ్యరథం బధిష్ఠించి దేవతలం గాంచి పురత్రయంబు నాకాడ దని శోకింపకుఁడు నేఁ డీనారాచంబునఁ బోడిమి చెడి నీఱయ్యెనని నిర్ణయించుకొనుండు నాచేతిబలుపు సూడుం డని గంభీరస్వరంబునం బలికిన వారెల్లరు నీవచనంబు సత్యంబ యగుం గాక యని సంతసించుచుం బరివేష్టింపఁ బరమేశ్వరుండు పారిషదాది పరివారపరివృతుం డై కగలి మనోమారుతరంహంబు లగురథ్యంబులబలంబున త్రిపురాభిముఖంబుగఁ బోవుచున్నసమయంబున సిడంబునం గలవృషరాజంబు ప్రళయకాలవారివాహగర్జాదుర్జయంబుగ ఖణిల్లుమని ఱంకె వేయుటయు నమ్మహారవంబు. 75

ఉ. దిక్కులఁ బిక్కటిల్ల నతిదీర్ఘతరం బయి బీతు గొల్పుచున్
బక్కునఁ బోయి దైత్యులశ్రవఃకుహరంబులు వ్రక్కలింపఁ గై

పెక్కు-సయట్లు సొమ్మసిలి యెల్లరిదే మని సంశయించుచుం
ద్రొక్కటపాటుతో నటకుఁ దూకున వచ్చిరి విచ్చలించుచున్. 76

వ. అయ్యవసరంబునం గ్రోధమూర్ఛితుం డగుమృత్యుంజయుండు శరం బనుసంధింపఁ బోవునంత ముల్లోకంబులుం గంపించె ఘోరంబు లగునిమిత్తంబులు మొత్తంబు లై తోఁచె నమ్మహామయశతాంగంబు గ్రుంగం బడియె శరభాగంబునుండి నారాయణుండు వినిస్సృతుం డై వృషరూపంబున దాని నుద్ధరించె నప్పు డప్పురాణపూరుషుండు వృషమూర్ధంబునందు హయపృష్ఠంబునందును నుండి పేర్చి యార్చిన సంప్రమర్దంబున వెలార్చి విహ్వలంబు లైనహయంబుల స్తనంబులు గోసి వృషఖురంబులు విదళించె నాఁటం గోలె హయంబులకు స్తనరాహిత్యంబును వృషంబులకు ద్వైధీకృతఖురత్వంబునుం గలిగె నంత. 77

ఉ. సజ్యము చేసి కార్ముకము శర్వుఁ డఖర్వబలాత్తగర్వుఁ డై
పూజ్యమహాశుగంబు నరివోయుచుఁ బాశుపతాస్త్రయోగసా
మ్రాజ్యము గల్గఁ జేసి గరిమంబున గెల్వు మటంచు దేవలో
కేజ్యులు వల్కుచో విడిచె నేకతఁ గొన్న పురత్రయంబుపైన్. 78

తే. విడుచునంతన నిర్దేశ్యపరపురుష, విగ్రహ మొకండు పొడగట్టి వెలుఁగఁ జొచ్చె
శరము గ్రచ్చఱఁ బాఱి త్రిపురముఁ గాల్చి, నీఱుగాఁ జేసి వెనుక వార్ధిఁ గలిపె. 79

తే. త్రిపురహరుఁ డగుహరునిరుద్వీప్తులవహ్ని, లోకములఁ గాల్పఁ దొడఁగినాలోన వెడఁకు
డని శివుఁడు శాంతుఁ డయినఁ జల్లాఱె నగ్ని, ప్రకృతిఁ బొందె జగంబులు సకలజనము. 80

వ. అంతఁ బితామహప్రముఖబర్హిర్ముఖులు కృతకృత్యు లై కృత్తివాసుం బ్రణామపూర్వకంబుగం బ్రస్తుతించి తదనుమతంబున నిజనివాసంబులకుం జని రిట్టిమంగున దేవకార్యతత్పరుం డైనహరునకుఁ బరమేష్ఠి సారథ్యం బనుష్ఠించి లోకహితం బాపాదించె నీవు నట్లు కౌరవరక్షణార్థము కర్ణునకు సారథ్యంబు గావింపు మని కౌరవేశ్వరుండు మద్రేశ్వరుం బ్రార్థించి మఱియును. 81

సీ. ఈవు కర్ణునికన్నఁ గృష్ణునికన్నఁ గిరీటికన్నను మేటి వేటికి నొడి
యు ప్రకల్పింపు కర్ణుండు నీ వంబ్రహ్మ, దేవుఁ [illegible] పత్త్రి తేజమునను
త్రిపురాసురులఁ బోలె నిపుడు నాశత్రుల, గెలిపింప నేవు [illegible] వెలమి [illegible]
కృష్ణసారథి యైన జిష్ణుని రాధేయుఁ, డలంబునను గెల్చు నను పరయుయు

తే. మేముఁ గర్ణుండు నీ వార మేమి చెప్ప, జీవితాశయు రాజ్యాశ నీవలనన
గలిగి యున్నది మా కిష్టు కరుణఁ జేసి, జయ మొసంగుము మా కర్ణసారథి వయి.

వ. అని పలికి మఱియు నొక్క ప్రతిభాసురం బగు నట్టి మహాత్మునికి శల్యునిదుం జెగు

నొక్కవిప్రుండు సెప్పుచుండ వింటి హేతుకార్యార్థసంహితం బయినదాని విని నీ
వొండువిచారింపక కార్యంబు దెసవాఁడవు క మ్మని వెండియును. 83

—దుర్యోధనుండు శల్యునకు భార్గవరామునిప్రభావంబు చెప్పుట—

సీ. భార్గవకులమునఁ బ్రఖ్యాతిఁ గాంచిన, జమదగ్ని కుదయించెఁ గొమరుఁ డగుచు
రాముఁ డాతఁడు నిష్ఠ వామదేవునిఁ గొల్చె, సన్మార్గ మతిసంయతాత్ముఁ డగుచు
నభవుండు సంతుష్టుఁ డై పొల్చి రామ నీ, హృద్గతేప్సిత మెల్లఁ నెఱిఁగికొంటి
ననమర్థుఁ డపాత్రుఁ డగువాని కస్త్రము, లీరాదు వాని దహించు నవ్వి
తే. నీవు పరిశుద్ధుఁ డవు గమ్మ నీకు నవల, నస్త్రములు లొసంగెద ననంగ నతఁడు మ్రొక్కి
తగుదు నని తోఁచినపుడ నీ కగు నొసంగ, నంత దనుక శుశ్రూష నే నాచరింతు. 84

వ. అని విన్నవించి నియమనిష్ఠాగరిష్ఠుం డయి పూజోపహార బలివిహారాదులను బరమ
తపఃపరికారంబులను బహువర్షగణంబు లాత్రిణయను నారాధించిన నతండు ప్రస
న్నుం డై దేవతలయుఁ బితృదేవతలయు సమక్షంబున సర్వమంగళ విన నీరాముండు
నాకుఁ బరమభక్తుండు రక్షుండు నని వానిగుణగణం బగ్గించె నక్కాలంబున. 85

మ. తత బాహాబలదర్పితుల్ దనుజులున్ దైత్యుల్ మహామోహాక
ల్పితు లై వేల్పులఁ బొండిపెట్టుటయుఁ దాల్మిం జేయ క ద్ద్వారల్
శితకంఠుం గని వచ్చి వేఁడ నతఁ డే శిక్షింతుఁ బాపించు దే
వతలం బుచ్చి భృగూద్వహుం బిలిచి సంభావించి భూషించుచున్. ౮6

తే. లోకహిత మెంచి మత్ప్రీతి లోఁ దలంచి, విబుధవైరులఁ దునుమాడ వెడలుమనుడు
రాముఁ డే నశక్తాస్త్రుఁడ నేమొగి మున, దనుజులఁ గృతాస్త్రులం గెల్తు నభవ చెపుమ.

చ. అనుడు మహేశ్వరుం డను మదాజ్ఞ యి టయ్యె జయింతు శత్రులన్
జను మెద సంశయింపకుము సర్వగుణంబులు నిన్నుఁ బొందుఁ బొ
మ్మనిన మహాప్రసాదమని యాభృగురాముఁడు ధీరచిత్తుఁ డై
చని సురవైరులన్ రణము సల్పెడు దానికిఁ జీరి యిట్లనున్. 88

తరళము. అని యొసంగుఁడు నాకు నీశ్వరు నంతవాని మనోబలం
బునన పంపక మై జయంబును బొంద వచ్చితి నెల్ల మి
మ్మును నెదిర్చ యనన్ సురారులు పోరఁ జొచ్చి గశాసుపై
పునన వారల నొర్చె వారల పోటు లాటులు నోర్చియున్. ౮౯

వ. ఇ ట్లెల్లవారిం జయించి జమదగ్నినందనుం డానందంబున నంధకాసురారిపరిసరం
బున కేతెంచినం గాంచి కరస్పర్శనంబునం గపర్ది వానిమేనివ్రణంబుల నొవ్వవాపి
వానిచేతకుం బ్రీతుం డై బహువిధవరంబు లొసంగి శస్త్రనిపాతంబునం జేసి నీమేను

నకు మానుషకర్మంబు వదలె నీవు పాత్రుండ వయితివి నీ కస్త్రంబు లిచ్చెదఁ బుచ్చు కొమ్మని యభిమతాస్త్రంబు లన్నియు నిచ్చి యంపిపుచ్చినం గృతాస్త్రుం డగునతం డనుజ్ఞాతుం డయి నిజనివాసంబునకు నిర్గమించె నని వింటి సోమకులమహేంద్రా! మహామహుం డగునాభృగూద్వహుండు మనకర్ణునకు ధనుర్వేదంబు సాంగోపాం గంబుగ నొసంగెఁ గర్ణునం జేయుంత వృజినం బున్నను భార్గవరాముం డస్త్రంబు లనుగ్రహించువాఁడు కా డాకర్ణింపుము. 90

ఉ. కర్ణములన్ సుకుండలయుగంబును మైఁ గవచంబుఁ బుట్టుతో నిర్ణయ మయ్యె బాహువులు నేత్రములున్ వెడఁదల్ దలంపఁగాఁ గర్ణుఁడు రాజవర్ణమునఁ గల్గిన దేవసుతుండు గాని దు ర్వర్ణసముద్భవుం డయినవాఁ డొకఁ డందుఁ దలంచు పొల్పునే. 91

క. ఏతాదృగ్విధసుగుణాన్వితుండు సూర్యాగ్నిసదృశవిస్ఫురతేజుం డేతీరున సూతకులోద్భూతుం డగు చెపుము లేడి పులినిం గనునే. 92

తే. కవచకుండలమండితకాయు విపులవక్షు నాజానుభుజు విశాలాక్షు రామ శిష్యు శత్రునిబర్హణుఁ జెప్ప నగునె, మనవృషునిఁ బ్రాకృతుం డని మద్రనాథ. 93

ఉ. ఇట్టిది నాదు నిర్ణయ మహీనపరాక్రమ నీకు వేఁడికోల్ గట్టిలి నాలకింపు రథి కన్నను సారథి మిన్న నన్నిఁకో నెట్టియెడన్ సమర్థ మగు నీ వల శూలికి ధాత సూతుఁడై యిట్టులు యంతయైన సహింపు మహావదోషాలుఁ జేసె కర్ణునికిన్. 94

వ. అనిన శల్యుం డతని కిట్లనియె. 95

తే. అధిప! నే వింటి నీయుపాఖ్యానము లిట్టు, హరి యొకండె యెఱుఁగు పరమేష్ఠి హరునకు బలె నరునకు నియంత యయ్యె నీదురమునందు, నట్టిజగజెట్టి లోకత్రయమునఁ గలఁడె.

మ. ఎటులే సూతసుతుండు పాండుసుతునిన్ హింసించినం గొంచ కు త్కటతేజుం డగుశౌరి చక్రధరుఁడై గన్పట్టి కయ్యంబునన్ బటుబాహాబల మొప్ప లోకము నుతింపం గ్నీదుర్నసైన్యంబులన్ విటతాటంబు బొసరించి త్రుంచు నతని స్వీకింపవే కేరునున్ 97

వ. అనిన నీసుతుండు మద్రపతిదిక్కు మొగం బై నీ విట్లు సర్వశస్త్రాస్త్రపారంగతుం డై శస్త్రభృద్వరిష్ఠుం డగుకర్ణు ని ట్లవమానింప నొప్పదు భీషణం బైనవాఁజ్యాశనిఘో షంబు విని నంతన కౌంతేయులబలంబులు పలువెంబడిగులం బడి పలాయనంబు నొందు నాలకింపు మమ్మహారథుండు. 98

సీ. మాయావియై ఘోరమార్గంబులం బోవు, నసుర ఘటోత్కచు నడచుటయును

నరుఁ డిన్ని నాళ్ళు నెదురలేనియట్లు బా, హాశక్తియుక్తమై నడరుటయును
వింటి కోపున భీము నంటుచు నోరోరి, తిండిపోతా యని తిట్టుటయును
మాద్రేయుల జయించి మఱి యేకతమునవో, పాడవడంగింపక విడుచుటయును
తే. సాత్యకిని గెల్చి విరథుఁగా సలుపుటయును, బార్థతపురోగను లగునప్పాండవబల
ముల ననిం బెక్కుమాఱులు గెలుచుటయును, నీకుఁ బ్రత్యక్షములుగావెన్నపలలాము.
క. కులిశాయుధహస్తుని నేఁ, గలనం గెలువంగఁ జాలు కర్ణుం డన నీ
తులుపలు పాండవు లాతని, గెలుచుట కలలోనిమాట కృతముఖ వింటే. 100
వ. నీవు సర్వాస్త్రవిదుండవు సర్వవిద్యాపారంగతుండవు భుజవీర్యంబున నీకుఁ దుల్యుం
డీలోకంబున లేడు శత్రువులకు శల్యభూతుండ వగుటం జేసి శల్యుండ వైతివి నీబాహు
బలంబున సర్వసాత్వతులును వినాశనంబు నొందఁ గలరు నీకంటెఁ గృష్ణుండు బలా
ధికుండు నా నొప్పఁడు నీమూలంబునం జేసి మే మాలంబునం గూలినభూపాలుర
ఋణంబు దీర్చి కృతకృత్యులము గా నున్నవార మనిన శల్యుం డల్లన నిట్లనియె.

—శల్యుండు దుర్యోధనవాక్యంబునఁ గర్ణునకు సారథ్యము సేయ నంగీకరించుట—

చ. హరుసము వచ్చె నీయెడల నందఱముందఱ నన్ను దేవకీ
వరసుతుకన్న మిన్నగను బల్కితి కావునఁ సూతసూతి కే
నరదము దిప్ప నప్పనికి నయ్యెద నెయ్యెడ నట్లు వల్కినన్
దొరయును గర్ణుఁడుం గినుకఁ దోఁగఁగ రా దని మున్న చెప్పెదున్. 102
వ. అనిన నీతనయుం డట్లకా యని సంతసించుచుఁ గర్ణుం గౌఁగిలించుకొని నీవీశల్యసార
థ్యంబున నింద్రుం డింద్రారులం బోలె భండనంబునం బాండునందనుల నెల్ల మదింపు
మనిన నతం డతనిదెస మొగంబై మద్రేశ్వరుండు మన కిష్టుం డయ్యెఁ గాని ప్రహృ
ష్టుండు గానిచందంబునం దోఁచుచున్నవాఁ డతని మఱియు మధురవచనంబులం దేర్చ
వలయు ననిన దుర్యోధనుండు మందియుం జని కర్ణుం డిప్పుడు కవ్వడిం దొడరఁ బోవు
చున్నవాఁడు నీవు ప్రగ్రహంబులం బట్టి హయంబుల నడపుచు వాసుదేవుండు వాస
విం బలె వీనికిం గావలి గా వలయు నని మాటకం జెప్పుచుంట నని యుప్పఁ బలికిన
మద్రేశ్వరుండు కౌరవేశ్వరుఁ గౌఁగిటం జేర్చి నేను బ్రీతుండ నయితి నీకుఁ బ్రియం
బయినదాని నట్లులైనం జేసెద మీ చేసినసమయంబు మఱవక హితకాముఁడ నైన
నాప్రియాప్రియవచనంబులకు నీవును గర్ణుండును సైఁచునది యనినవైకర్తనుండును.
క. భూతేశునకు స్వయంభువు, శ్వేతతురంగునకు వృష్ణివీరుఁడు వలె నీ
వీతఱి నారథమునకున్, సూతుఁడ వై హితము, గూర్పఁ జూడుము శల్యా. 104
వ. అనిన నతం డతని కి ట్లనియె. 105

తే. తగ దటం బ్రాజ్ఞులాత్మనిందయును నాత్మనుతియుఁ బరనిందయును బరస్తుతియు నయినఁ
బ్రత్యయార్థము నీ కేను బలుకుచుంటి, నాత్మనుతి యని తలఁకఁ బో కంతరాత్మ.106

తే. అప్రమాదప్రయోగము లనువుపడఁగ, జ్ఞానవిద్యాచికిత్సిత స్థానములను
మాతలికిఁ బోలి శక్రునిమహితరథము, గడపఁ జాలుదు నీతేరుగడపు టరుదె. 107

వ. నీవు విజ్వరుండ వై నరుం దవిలి పోరు మనుచున్నంత ధరణీకాంతుండు సంతోషిం
చుచుఁ గర్ణుం గని యి ట్లనియె. 108

మత్త. వాసుదేవుని కీడఁబోవనివాఁడు మద్రవిభుం డనిన్
వాసవాత్తరథంబుపైఁ గననచ్చి మాతలిమ న్ననన్
వాసవాత్మజు నోర్చు నీరథవాజు లన్నడపింపఁ గా
బాస చేసెను గాన గెల్పుము భండనంబునఁ బాండవున్. 109

క. అని పలికి మఱియు శల్యునిఁ, గనుఁగొని నీతోడుపాటు గలుగుటకతనన్
జననాథ కర్ణుఁ డాజిం, గొని పార్థుల నెల్ల గెలుచుఁ గొఱలే కుండన్. 110

వ. అనంతరం బాసూతసూనుండు ప్రీతుం డై నిజసూతుం బిలిచి నీవాక్కరథంబు విధి
వత్కల్పితంబు చేసి తె మ్మనుటయు నతం డట్లు గంధర్వనగరోపమంబును జైత్రంబు
నగుదివ్యరథం బొండు సంతరించి తెచ్చి జయింపు మని దీవించి యిచ్చిన నతండు
వేదవిత్పురోహితమంత్రాభిమంత్రితం బగుదాని మఱియు నభ్యర్చించి భాస్కరోప
స్థానపూర్వకంబుగం బ్రదక్షిణంబు గావించి సమీపస్థితుం డైనశల్యుం గాంచి రథం
బధిష్ఠింపు మని సవినయంబుగం బ్రార్థించుటయు నతండును. 111

క. సింగము గిరిశృంగమునకు, లంగం గొనురీతి నధికలాఘవ మెసఁగన్
సింగారించినకర్ణ,శతాంగమ్ముపై కుఱికి నొగల నధివసియించెన్. 112

తే. అంత శల్యాశ్రిత మ్మగు నమ్మహారథమ్ముపై కెక్కె రాధేయుఁ డెమ్మె మీఱ
మెఱుఁగుతోఁగూడు మేఘంబుమీఁది కేగి, మెఱయు బాలార్కబింబంబు తెఱఁగుదోఁప.

తే. ఏకరథగతు లగువారలాకసమున, మొగులపై సూర్యుఁ డగ్నియు మొనసి వెలుఁగు
పగిది నొప్పిరి భూభుజుల్ ప్రస్తుతింపఁ, గౌరవాళికి నానంద మేరుపడఁగ. 114

వ. అప్పుడు. 115

క. పరివేషమధ్యగతు డగు, తరణి నలెన్ శరగభస్తితతు లొప్ప రథాం
తరమందు వెలుఁగుకర్ణునిఁ, బరికించి భవన్నుతుండు పలికెఁ బ్రియమునన్. 116

శా. భీష్మద్రోణులు భీమపార్థుల ననిం బ్రేల్చి గిట్టింతు రం
చూహ్యంబుల్ వెలిపుచ్చినాఁడ నది యిట్లాఁగాడె వ్యర్థంబ యై
గ్రీష్మాదిత్యునిరీతి నీ నలరి వైరివ్రాతముం గూల్చి రో

చిహ్నత్వంబున వారు సేయనిపనిం జేయంగ నర్థించెదర్. 117

తరళము. అమరవజ్రధరుండు నాసమరాంగణంబున నొప్పి నీ
విపుడు బాడుదలర్ యుధిష్ఠిరు నేచి పట్టుము ఫాల్గునున్
గృప యొకింతయు లేక కొట్టుము కే ల్వడిం గొని భీమము
ఖ్యపరచక్రమదెల్లఁ ద్రెళ్ళగఁ గాల్చిపుచ్చుము గ్రచ్చఱన్. 118

వ. అని పలికి నీకు భద్రం బయ్యెడు మనుచు దీవించుచున్నంతఁ దూర్యాయుతంబులును భేరీసహస్రంబులును నొక్కపెట్ట మ్రోగ సురతాపస్తోమ రాధేయుండు శల్యుం జూచి యిట్లనియె. 119

చ. రణమున విక్రమింపఁ దలఁచి గర్వమునన్ నశింపు మస్మనుం
గణక వగింపు నొంపఁ గుతకమ్మున ధర్మజభీమముఖ్యులన్
బణితము గా సుయోధనునిపాల జయంబుగఁ గంకపత్రమా
ర్గణగణమున్ బరంపరలు గా నిగిడించెద నెంచఁ గా నృపుల్. 120

వ. అని పలికిన శల్యుండును. 121

—శల్యుండు కర్ణునుత్సాహంబు చెడ మాటలాడుట—

తే. సర్వశస్త్రాస్త్రవిదులును సర్వవిక్రముులు మహోత్సాహులునుఁ మహాబలు లజయ్యు
లసఘు లగుపాండవులు నేఁ డవమతిగను, బలి కెదవు వారి కిం దెడు నలుగురు.

సీ. అశనిపాతంబున గర్జించు గుగాండివారవముల్ విని చెవుల యపుడు
భీమసేనునిచేత భీమమై చనుగద, గజఘటలం దూల్చ గాంచినపుడు
యమరాజసుతుని నేత్రము లెఱ్ఱనై చూడ్కు, లంతటఁ బర్వ పై కేగినపుడు
కవలబాణంబు లంకస మెల్లఁ దామగ్నై, సొమ్మ రా నెన్మిన సోఁకినపుడు

తే. సత్యకాత్మజముఖ్యసుక్షత్త్రియచయ, మెల్ల కడ నెత్తువాకలు దెల్లముగను
బాఱఁ జేయుచుఁ బైపయి వచ్చినపుడు, పలుకఁ బో వింత చులుకఁగాఁ బలువవీవు.

వ. అనిన వానివాక్యంబు లాదరింపక పెడచెవిం బెట్టి పొద పొద పొమ్ము పొమ్మను చున్నకర్ణునిం గని కౌరవులు హర్షోత్కర్షంబున సింహనాదంబులును శంఖనాదంబులునుగావించిరి భేరీప్రముఖనానావిధవాదిత్రంబులు పెల్లు మ్రోసె నయ్యవసరంబున.

సీ. కంపించె మొఱయుచు గహ్వరి యంతయు, రాలె నుల్కలు మహాభీలముగను
దిగ్దాహ ముదయించెఁ దెఱపి, లే కశనులు, పడఁ జొచ్చెఁ బెనుగాలి పట్టె వినరె
కురిసె నెమ్ములవాన ఘోర మై మృగపక్షిగణము లం దసవ్యగతులఁ దిరిగె
మొగ్గతిల్లెం గుఱ్ఱములు నాహనము లెల్ల, విడిచెఁ గన్నీళులు విశ్రుతముగ

తే. శస్త్రములమంటలెసఁగె గెన్నజములువడకెఁ, బొడమె నెన్నేనియుత్పాతములుమతిభ్రమ

సారథికులనాశసూచకమ్ము లగుచుఁ, గగనభూమికిఁ గప్పంచు గదలె నపుడు. 125

క. కౌరవు లయ్యుత్పాతము, లరసి యును దైవమోహితాత్ములు గానన్
సారమతి నరసి కైకొన, కూరక జయ మెంచి పొగడి రొయ్యనఁ గర్ణున్. 126

వ. అనంతరం బారాధేయుండు రథాంతరంబున బాలసూర్యప్రభాభాసమానుం డై కూరుచుండి భీష్మద్రోణపరాక్రమంబు దలంచి ధనంజయకర్మాతిశయం బెంచి మానదర్పదహ్యమానమానసంబునఁ గ్రోధానలంబు ప్రజ్వరిల్లం బెల్లు విశ్వసించుచు శల్యుం గాంచి యి ట్లనియె.

చ. అడిదము చేతఁ బూని రథమున నధినాథుఁ గాంచి యున్న నే
జడియను వజ్రహస్తుఁ డయి శత్రుఁ డనక్రపరాక్రమంబునన్
వడినడిఁ గిన్కమై ననికి వచ్చినఁ గాని నరేంద్రచంద్ర నన్
వెకలిన దస్థిగత్వము ధునీసుతకుంభజులపాటు గాంచుటన్. 128

సీ. విను మవధ్యులు ద్రోణభీష్ములు వధ్యులై, రని యంత సాధ్యస మగునె నాకు
గురుఁ డస్త్రవిదుఁ డిట్లు కూలినతనవారిఁ, గనియుఁ బగఱ చేయఁ గలుగఁ డయ్యె
శౌర్యధైర్యంబులు శస్త్రాస్త్రసంపత్తి, గాంగ్రేయుఁ దలఁచి నేఁ బలుకుచుంటి
నట్టిమహాశూరుఁ డిట్టిమిత్రికి నగ్గ, మాయెఁ జెల్లర నేఁడు నాకు గలుగఁ

తే. వెలివి పెంపున నెతచిరించి కనియుఁ, గర్మమునకంటె దైవయోగంబుకంటె
నించుకేనియు ధ్రువము లే దంచు నిట్టి, యుంచుకొనకుండఁ గీడదు నృపవరేణ్య.

చ. బలము పరాక్రమంబు శరవాసము లస్త్రము లాయుధమ్ములున్
గలిగి సుఖం బొసంగుటకుఁ గావు మనుష్యున కంచుఁ దెల్లమై
తెలియఁగ వచ్చె నచ్చాయము తేజము గల్గి ధనుర్ధరుండు నై
వెలసినద్రోణుఁ డి ట్లిలఁ దిరోహితుఁ డాయెఁ బాటులఁ గయ్యో నా విసన్. 130

తే. గురుఁడు పడినప్డు పాండవవరబలంబు, తోడి పోరున కెవ్వఁడు తొడరు ననుచు
సందియంపడునట్టిద సమకు రె నిటు, మగఁడు నాయినలాగు లి ట్లగును గాదె. 131

క. వీఁక మెయి నేను గాక, పాకారికుమారు ధాటిఁ బడి పోరుటకున్
దేకువఁ జూపుటకున్ మగఁ, డీకడ నొక్కరుఁడు లేడ యిది నిక్కము నాఁ. 132

ఉ. బాలుఁడ నంచు బెంగలిడఁ బాడియుపౌరుష మొప్పఁ బోవఁ బెం
జాలికి నై నయిట్టితఱి సంతమసంబున వచ్చి యుండ నే
నేలిక కార్తి వాపుటకు నేగుట కృత్యము గాన నిప్డు పాం
చాలురఁ బాండవుల్ మొనయుచక్కటికిం జన నిమ్ము తేరొగిన్. 133

ఉ. ఓపుదు నేని మాతులుర నొక్కఁడ నుక్కడగించి వత్తు నే

నోపన యేని ద్రోణపథ మోయన ముట్టెద నింతె కాని యీ
భూపతు లెల్లఁ జూడ వెఱపుం గల నై యెదుగంగ నేర నీ
పాపము ద్రోహరూప మయి పట్టెడు మిత్రునివంకఁ గట్టనై. 134

తే. చచ్చుఁ బ్రాజ్ఞుఁడు మూఢుండుఁ జచ్చు నల్లి, యెపుడునన్నిహితంబయిమృత్యువెసఁగు
విధివిధానము దాఁటంగ వెరవు లేదు, దేనికేఁ జింత సేయుట కానిమాట. 135

మ. చిరమిత్రుం డయి పుత్రునిం బలెఁ గడుం జెల్వార వీక్షించుచున్
గురునాథుండు బహూకరించెడి ననుం గోత్రాతలాధీశ! నే
వరదుం డాతనికిన్ హితార్థ మయి సంవర్తించుచున్ భోగముల్
పరివర్జించుట కాక ప్రాణములు నేఁ బాటింప నొక్కింతయున్. 136

సీ. వ్యాఘ్రచర్మాస్తరణావృతంబు నకూజ, నాటము కనకధ్వజాంచితంబు
శాతకుంభత్రికోశసమేతమును రజ, తత్రివేణుకభూషితము రథమ్ము
తురగప్రబర్హముల్ శరశరాసనములు, ఖడ్గఖేటములు శంఖమును గదయుఁ
బరమాయుధంబులు బహ్వస్త్రశస్త్రముల్, పరశురాముఁడు నాకుఁ గరుణ నిచ్చె

తే. నిన్నియు సముజ్జ్వలంబులై మొనక మెసఁగు, చుండ నే నిమ్మహారథస్థుండ నగుచుఁ
బోరి మృత్యువు దా వచ్చి ప్రోచె నేని, సమరమున నేఁడు చంపెద సవ్యసాచి. 137

వ. యమవరుణకుబేరవాసవులు నిజాయుధగణంబులతో వచ్చి రక్షించినను వివ్వచ్చుని నేఁటిసంగ్రామంబున సహబాంధవంబుగ మ్రందించుట నిక్కం బని వికత్థనంబుగఁ బ్రగల్భవచనంబులు పలుకుచున్నకర్ణుం గని మద్రేశ్వరుండు పకపక నవ్వి యుపహసించియు నవమానించియు నిరసించియు నిట్లనియె. 138

—శల్యుం డర్జునుం బ్రశంసించి కర్ణుఁ దూలనాడుట.—

చ. అతిరభసంబునం బలికి తడ్డోకయింతయు లేక చాలు చా
లతిశయ మయ్యె నియ్యెడల నంత వికత్థన మేల చేసి కో
నతగుఁడ! నిన్నెఱుంగనినరాధిపుఁ డుండునె భూతలంబునం
గృతముఖుఁ డర్జునుం డతనికిం బ్రతి యే నినుబోటితూటరుల్. 139

వ. అర్జునుం డలంతి యనుకొనుచుంటి వాకర్ణింపుము. 140

క. యదుపతిరక్షిత మగుపురి, సదమద మొనరించి భద్రఁ జయ్యన గొనియెన్
ద్రిదశేంద్రతనయుఁ డ్క్రియ, నొదవింపఁగ నతఁడు దక్క నొడ్లకు వశమే. 141

క. మృగవధ కలహముకారణ, ముగఁ ద్రిభువనవిభునితోడఁ బోరి జయించెన్
జగదేకవీరుఁ డానరు, మగఁటిమి పాటింప కుంటి మనుజాఁడ వగుదో. 142

సీ. ఎఱుఁగవో యింద్రాదు లెదిరింపఁ గా నోర్చి, ఖాండవ మగ్నిలోఁ గలిపినాఁడు

తెలియవో కాలకేయుల నెల్లఁ ద్రెళ్ళఁడిఁ, గదనరంగంబునఁ గాల్చినాఁడు
తలఁపవో ఘోషయాత్రకుఁ బోయి గర్వించు, కౌరవావళి నెల్లఁ గాచినాఁడు
మఱచితో గోవుల మరలించి మి మ్మెల్లఁ, బందలవందలు చేసినాఁడు

తే. నాఁడు నాఁడును నీవీర మెందుఁ బోయె, నుండ ని మ్మిష్ణు నీకయి భండనమ్ము
పస్థిత మ్మయ్యె వె న్నిచ్చి పాఱకుండు, వేని సరిచేతఁ గూలుదువే నిజంబు. 143

వ. ఇ ట్లతిపరుషంబుగం బలికిన నలుక నడంచుకొని కర్ణుం డతని కి ట్లనియె. 144

చ. చవులకుఁ గానిమాట లివి చాలఁగఁ బల్కితి క్రీడివాఁడ వై
యవు నవు నిన్ను నేమియన నౌ నివు డీ వనినట్టు లింతలోఁ
దవులుఁ గదా రణం బచట నాభుజశక్తియు లాఘవంబు నీ
వవగతిమై నెఱింగి యను మప్పుడు చెప్పెద నిప్డు యేటికిన్. 145

వ. అనిన మద్రేశ్వరుం డట్లయగుం గాక యని మాఱుపలుక కూరకున్నఁ గర్ణుండు యుయుత్సుండై రథంబు వోవని మ్మనిన నతం డట్ల కావించుటయు నిమ్మకలో గర్ణుండరిబలంబు డాయం జని ధనంజయుఁ గానం జాలక తన రాక కానందించు మనబలగంబువారల నొక్కొక్కని దిలకించి నా కర్జునుం జూపినవారికిఁ గోరిన ధనం బొసంగెదఁ గాదేని రత్నసంపూర్ణం బైనశకటం బిచ్చెద నది కాకున్నఁ గాంస్యంబు పిదుకునూఱుగోవులును గాం నూఱుగ్రామంబులును నొక్క శ్వేతాశ్వతతి రథంబును వలయు నన్న నాఱుకసకగజంబులను నృత్తవాద్యగీతవిశారద లగు నూర్గురు స్త్రీరత్నంబులును నూఱునాగంబులను నూఱుశతాంగంబులును నూఱు గుఱ్ఱంబులును మఱియు సువర్ణశృంగంబులు సవత్సంబు లగునన్నూఱుధేనువులును మఱియు నభిలషించిన హేమభాండపరిచ్ఛన్నంబు లగునేనూఱుహయంబులును గాంభోజవాజియోజితం బగుజాతరూపరథంబును నింతియ కాక రత్నకాంచనభూషాభూషితంబు లగునన్నూఱుకుంజరంబులును వంశియుం గోరినఁ బ్రత్యాసన్నవనోదకంబులును ధననాధ్యసంపన్నంబులు నగునూఱునాలుగువైశ్యగ్రామంబులును రాజభోజ్యంబు లగుపదునాలుగుయుత్తమగ్రామంబులును సభనపరిపనాధిరామ లగునూఱు గురుమాగధదాసులును మఱియు ననేకవరంబులును నాకుఁ గలధనంబంతయును గృష్ణార్జునులం జంపి వారి విత్తం బంతయు లిచ్చెద మఱియుఁ గృష్ణార్జును లున్నచో టెఱింగించిన వారి కభిమతార్థంబు లెల్ల నొడఁగూర్చెద నని పలుదెఱంగులం బలుకుచు శంఖంబు పూరించిన నాకర్ణించి సానుజుం డగుదుర్యోధనుఁ డు సంతసించె నప్పుడు నిస్సాణాదితూర్యనిస్వనంబులును సింహనాదంబులును శంఖనాదంబులును మిన్ను ముట్టె నట్టియెడ మద్రేశ్వరుండు వికత్థమానుం డగుసూత

సూనుం గాంచి హాసన్ముఖుం డయి యి ట్లనియె. 146

ఉ. వారికి వీరికిన్ ధన మవారిగ నిచ్చి ప్రయత్నపూర్వక
స్ఫారకలాకలాపము నొసంగ నటం గన నేని కిమ్మహా
వీరుఁడు విగ్రహప్రియుఁడు వేడుక లొప్పిక లెత్తి నిత్తికిన్
గోరుచుఁ దాన వచ్చెఁ గనుఁగొని నిను నీవును జూతు వాలినన్. 147

చ. తెలియవు మోహపాశములఁ బ్రేమ్కఁ దలంచి కుబేరు నట్లు ని
క్కలి ధనమిత్తు నంచు విద కేవల దూష్య మపాత్రదానముల్
సలిపిన దాన దోసము లెసంగు ధనం బది మ్రగ్గుచుండినన్
నిలుపుము పుణ్యకార్యములు సజ్జను లెన్న లభించుఁ బుణ్యముల్. 148

వ. అని యింతం బోక. 149

క. ఎఱుఁగవు కృష్ణుల నిర్వుర, మఱుకుప నోడింతు నంచు మహ నందేని
బిఱుసువడి నక్క సింగము, నెఱుఁగుట కని విని యెఱుఁగనది కల దొక్కో. 150

చ. ఇది తగ దంచు నిన్నెవఁడు నేని సుహృద్వరుఁ డాఁగి నుండెఁడే
విదితము గాఁగ నగ్నిఁ బడ వేఁడుచునుంటివి వేఁడ రాసిడ
య్యాద యన నయ్యె నీకు నిట కారయఁ గాలము తీఱ గావునన్
గదలిక సేయుచుంటి విటు కార్య మకార్య మటంచు నెక్కటా. 151

తే. బ్రదుక నెంచినవాఁడు నీవల నవంచు, చెప్పలకుం గానినోడు విల్లు చేయఁ డకట
కుత్తుకకు గండశిల గట్టుకొని మహాబ్ధి, గల నీదుట నీదుచిర్మిత మగు. 152

తే. ఒంటిఁ గాండీవి మాక్కొడ కోటగలిగి, పోరుకొనఁ జమ్మువ్యూహమ్ము నొసరఁ బనిచి
బ్రదుకఁ దలఁతేని నామాట బడ నెపుడును, ధార్తరాష్ట్రార్థ మిట్లు నీదుఁ దవిలితవిలి.

క. నీపైఁ గోపంబునఁ గా, దీపగిదిం దవిలి పలుకు టీశుని కార్యం
బేపగిది నయిన లెస్సగ, నైపరఁగుట కనుచు నెఱుఁగు మమరపతనయా. 154

వ. అనుటయుం గర్ణుండు కటకటం బడి యి ట్లనియె. 155

ఉ. నాదగు బాహువీర్యమును నమ్మి ధనంజయు తోడఁ బోరుటో
గాదన కుత్సహించెదను గాని మఱొక్కఁడు గాదు శల్య! నీ
వీదరి మిత్రరూపమున నేర్పడి యుండిన శత్రుమూర్తి వే
దేదియొ పల్కెద న్నరయ కిట్లరితిన్ వెఱపించె దక్కటా. 156

ఆ. వజ్ర మెత్తి వచ్చి వాసవుండును నాదు, నాశయంబు మానునట్లు సేయ
నోపఁ డనఁగ మర్త్యు నొక్కనిఁ జెప్పంగ, వలయు నొక్కొ యిట్టిపలుకు లేల. 157

వ. అనుడు మద్రేశ్వరుండు వానికిఁ గోపంబు దీపింపం జేయ మఱియు నిట్లనియె. 158

ఉ. కవ్వడి నెవ్వడిం గలిగి గాండివచాపమునుండి కాండముల్
ఱివ్వఱఁ బాఱ నేఁ డుఱుతఱిన్ భవదీయచమూసమూహముల్
ద్రెవ్వఁ దఱుంగ నీయుడుకు లుద్ధతుఁ డంతటి తొల్లి యింత కై
నెవ్వగ నివ్వటిల్ల మది నీ వనుతాపము నొంద కుందువే. 159

తే. తల్లికుఱువెక్కి చదల జాబిల్లిఁ బట్టఁ, జేతు లాడించు బాలునిరీతి నీవు
మోహమునఁ జేసి నరుఁ బిల్చి యాహవమున, గెలుతు నే నని పలుకుచుఁ గేరడములు.

ఆ. తీక్ష్ణధార మైనదివ్యత్రిశూలము, మీఁదఁ దనువు సేర్చి మిట్టిపడఁగ
నూహ సేయునట్లు సాహసంబునఁ గ్రీడి, దాఁక నెంతు చేయు దలఁప నకట. 161

సీ. క్షుద్రమృగం బేచి క్రుద్ధమృగేంద్రముఁ, బెల్చఁ గయ్యమునకుఁ బిల్చినట్లు
కుందేలు బేలయై కొని తనబల మెల్ల, మదగజంబును దాఁకఁ గదిరినట్లు
నెఱఁగ మైనసృగాల మెఱఁద గర్వించుచుఁ, గోలుపులిం ద్రోయఁ గోరినట్లు
పుల్లెలన్ నాకుటఁ జెల్లుబడిం గుక్క, ముట్టుగుచుఁ బట్టపై మొనసినట్లు

తే. భోగి పతగేశ్వరునిఁ బోరఁ బోవునట్లు, లేగ వృషభేంద్రు మార్కొన లేచినట్లు
మొఱసి చిఱుకప్పయురుముతో మొనయునట్లు, నీవు నర్జునునకు మాఱుగఁ బోవుటరయ.

క. పిలగత మగుసర్పముపైఁ, దెలియక బాల్యమున జనుఁడు తెగి పాఁకినయ
ట్టులు నీవు మోహవశమునఁ, దెలియక బివ్వచ్చుఁ దాఁక దివిరితి వకటా. 163

తే. వనులఁ గుందేళ్లతోఁ జిప్పి వలస నలరి, చియ్యగొని నక్క తను దాస సింగమనని
చెప్పుకొని గంతు లిడునట్లు నెప్పుఁ గృష్ణు, నరయునంతకు నీ విట్లు లాడుచుందు. 164

మ. పులి నే నందువు గాండివధ్వని చెవిం బూరింప రా నంతకుం
బులిసం బోనికిరీటి కేళిరథ మీపాంతంబుఁ బ్రనర్తించి క
న్నులకుం గానఁగ వచ్చినట్టితఱి నీనూల్కోలు లీపల్కు లె
ట్టులొ పోవున్ బరికింప నక్కవయి గోడ్డుం బోతు వౌ దాఁపియన్. 165

వ. అని మఱియు నోయి కర్ణా! నీవును సవ్యసాచియు సృగాలశార్దూలంబులు మూషిక
బిడాలంబులు శ్వానసింహంబులు శశకుంజరంబు లను ప్రఖ్యాతిం గాంచి యుందు
రని యధిక్షేపించినం గోపించి కర్ణుండు శల్యుం గాంచి యి ట్లనియె. 166

—♦కర్ణుండు శల్యునివాక్యంబులకు మాఱు పలుకుట♦—

సీ. గుణవంతు లగువారి గుణములు గుణవంతుఁ, డెఱుఁగును గుణహీనుఁ డెఱుఁగఁ డెట్లు
గుణహీనుఁ డవు నీవు గుణమును నగుణంబు, నెఱుఁగఁ జాలినవాఁడ వెట్టు లగుదు
వే నెఱుంగుదు నరు నిద్ధాస్త్రశస్త్రముల్, వీర్యంబు క్రోధంబు విక్రమంబు
నీ వెఱుంగవు వాని లావును నాలావు, నే నెఱింగియె పోర నెంచితి నిటు

తే. తడవులం బట్టి పూజింపc బడి మదీయ, శరధి నున్నది నాగాస్త్ర మరయ మేరు
శైలమును నైనc గూల్పంగc జాలు దాన, జిష్ణునో కృష్ణునో కూలc జేయుదు ననిన.

వ. వృష్ణివీరుల లక్ష్మియుc బాండుపుత్రుల విజయంబును గృష్ణార్జునుల పైc బ్రతిష్ఠితంబు లట్టివారితోడం బోరుటకన్న మేలొండు లేదు వారి చక్ర గాండీవంబులును గరుడ కపిధ్వజంబులును భీరుజనభీషణంబులు గాని నాకుc బరితోషణంబులు నీవు యుద్ధ కోవిదుండవు గామిం జేసి సంత్రాసంబున నిట్లు ప్రేలుచుంటివి గాని యొండు గాదు విను మే నయ్యిద్దఱ వధించి యెదప నిన్ను సహబాంధవంబుగ వధించెద నోరి పాపదేశ సంభవా! దుర్బుద్ధీ! 168

ఉ. శత్రుఁడ వీవు మిత్రుఁ డనఁ జాలి సనుం వటువంప వచ్చితి
మాత్రపునీచమాటలకు మాదృశధీరులు భీరు లౌదురే
క్షత్రియపాంసనా! వినుము చంపెదc జెప్పెద నింతకాని యీ
ధాత్రి చలించె నేనియు నెదన్ బుదమ మదc జలింప నింతయున్. 169

క. వేవురు గోవిందులు నడి, వేవురు ఫల్గునులు గూడి వెసc బన్నిన నే
జేవ మెయి నే నొకండన, పోవక వెనకువ జయంబు వొందనె కుమతీ. 170

వ. మీమద్రదేశంబునం గల దురాచారంబు లన్నియు నాబాలవృద్ధంబుగ నందఱు లోకులెల్లం బాడుచుందు రాగాథ లన్నియుం గొందఱు బ్రాహ్మణులు రాజసన్నిధిం జెప్ప వింటి నవి నే నిప్పుడు నీవు వినం జెప్పెదc జెప్ప నేర్చితివే నుత్తరంబు చెప్పుము లేదేని మూకీభావంబు వహింపు మని యిట్లనియె. 171

—♦కర్ణుండు మద్రదేశదురాచారంబు లుగ్గడించుట.♦—

సీ. మద్రదేశీయుండు మదిరాత్తకలహుండు, మిత్రునకుం గీడు మిగుల చేయు
దుర్వాక్యములకుc జొచ్చునాతని పొత్తు తగ దెవ్వనికి నట్టి తెలుగు లైన
ఖలుండు నన్నృతవాది గర్వి మద్రకుండు చ, చ్చెదుదాక దురాత్ముండు ముదమగ కుండు
ధర్మశూన్యుం డైన తద్దేశజునితోడి, చెలిమియుc బగయును జేయ రాదు

తే. తల్లి దండ్రియుc గొడుకు నత్తయును మామ, కూతును నన్నయుc దమ్ముండు కోడలిష్ట
బంధు లితరులు నాక సంబంధు లగుచు, స్త్రీలు పురుషులు రమియింతు రోలి నచట.

ఉ. శిష్టులు గాని మద్రకులు చేపలు వేల్పులు గోగ్రమాంసముల్
బుట్టికి నైన మెసంగు చోకపోద్దును మానక కల్లు ద్రావుచున్
దుష్టు లనంగc బేర్వడసి దోరుదు దొగ్గుచుc బగ్గి ప్రేలుచున్
గట్టగతిం బ్రవర్తిలుచుc గాలము పుత్తురు మత్తచిత్తులై. 173

ఉ. ఆరయ మద్రదేశభవు లంగనలు మందులును స్మరణేమనుల్

వారలం గోడిపోత్తు గొన వచ్చినయట్టివుడు నేని సౌవీరసం
స్కారకుఁ డైనబ్రాహ్మణునిచందమునన్ మఱి బ్రాహ్మవైరమున్
గూరినవారిచందమునఁ గూలుఁ బరాభవ మొంది కుందునన్. 174

క. క్రూరు లగుమద్రజనులకు, నారయ సాంకర్య మెట్టు లమరెనొ ధర గా
ధారకులు కట్టు శౌచము, తిరిసమై యమరెఁ దేటపెల్లం బసుచున్. 175

ఉ. వృశ్చికదష్టుఁ డై విషము వేగమునన్ హతుఁ డైనవాఁడు తే
జశ్చిత మైనభేషజము చర్చ నధర్వణమంత్రసంగతిన్
నిశ్చలశాంతిఁ గొన్నగతి నిత్యమలీమసు లైనమద్రకుల్
దుశ్చరితుల్ తదాత్మ మగుదోష మెడఁబనియుఁ బాపుకోఁ దగున్. 176

వ. అని యింకం దనివోక. 177

తరువోజ. మఱియును వినుమువిూమద్రదేశమున, మగుపలుకలు ద్రావి మానంబు లేక
మఱచి గొబ్బిడల్ కామమహితాత్ము లగుచు, మఱియుపుట్టములు వీడ మగలాగు లెసఁగఁ
దఱి వేచి నృత్యంబు తగఁ జేయుచుండ్రు, తగ వేది నిల్చుండి దారి [illegible]యుం
పెనఁగుస మూత్రంబు విగవిప్పుచుండ్రు, [illegible]సుతు లెట్లు తీర్పరుల్ చెపుమ.

వ. మద్రదేశ్వరా! విూమద్రకాంగనలు సువీరకాసక్తచిత్తలై నితంబకర్షణసంభోగనిరతలై
మే మిూసురవీరకంబు వీడఁ జాలము గాని మాపతిపుత్త్రాదుల నైన వీడఁ జాలుదు
మనువా రై సురాపాననిరతలై నిరతమైథునాసక్తలై కంబలావృతలై నష్టశౌచలై
తిష్ఠన్మూత్రలై నిర్లజ్జలై యుండువారికిఁ బుత్త్రుండ వైననీవు ధర్మంబు పలుకుటకుఁ దగ
వ్వారకుండు గుని వెండియును. 179

తే. ఇంక నాపాదమస్తక మెన్ని యేని, దుర్గుణంబుల కలవడి దుష్టు లైన
మద్రకులదోషములు పెక్కు మాద్రిశులకుఁ, జెప్పశక్యము గాదని చెప్పుచుంటి. 180

వ. మద్రకులును సింధుసౌవీరకులును బాహ్యదేశోద్భవు లైనమ్లేచ్ఛులును ధర్మబాహ్యు
లని లోకవిశ్రుతంబు కావున. 181

ఉ. ఆలమునందు నాయుధము నంది హతుం డగునంతకంటె నీ
పోలినరాజలోకమున ముఖ్యము ధర్మ మొకండు లేదు నీ
వేల యెఱుంగఁ జాలెదవు హీనబలుండవు వచ్చి స్వర్గమున్
దాలిమి నొందఁగాఁ దలఁచునా కిది వృత్తము గాదె మద్రకా. 182

తే. కూర్చుచెలికాఁడు నాకు సకురవిభుండు, వానికై నాదుప్రాణమే వదలు కొవ్వ
శత్రుఁడవు నీవు మిత్త్రునిచందమునను, వచ్చి మ మ్మిట్లు దూషింపఁ జొచ్చి తౌర. 183

క. నిను బోలినట్టిమూర్ఖులు, నన్నుఁ గలచినఁ గాని రణమున న్విముఖుఁడనై

చనువాఁడ నొట్టు ఘర్మంబున నవసిన జింక పోలె మొఱఁగకు మింకన్. 184

చ. నను వెఱపింప రాకు నొకనాఁటికినే వెనుదీయ నాహవం
బున మృతి నొందువారలకుఁ బుణ్యము వచ్చెడు నంచు భార్గవుం
డనియెఁ దదర్థము న్మనము నం దిడి పోరెద వైరిఁ జంపఁగాఁ
జనియెద నన్నుఁ ద్రిప్పఁటకుఁ జాలవు ప్రేలక మిన్నకుండుమా. 185

వ. మద్రనాథుఁడా! యిట్లున్న నిన్ను జంపి క్రవ్యాదగణంబులకుం బెట్టఁ దలంచియు మిత్రప్రతీక్షయు స్వకార్యప్రచింతనంబును సహవాదతితిక్షయు ననుమానంబుం జేసి సహించితి వినుఁ నిన్ను ప్రతిక్షేపింప నగు నన్ను నీతల ప్రయ్య సేయుదు నాగ కులశిరధర్ములు వినవలె మ్మనిన నమ్మద్రనాథుండు కర్ణా నీను రణంబున వేస్నియని వీరాగ్రేసరులును యాయజూకులును మూర్ధాభిషిక్తులును నగు మహారాజులవంశంబునం బుట్టి ధర్మపరాయణుండ నయి యున్నవాఁడ నిట్టి నన్ను నీవు మద్యంబునం జేసి మత్తుండవై యుచితానుచితంబు లెఱుంగక వమానించి తిది నీప్రమాదంబుగాఁ బరిగణించి సుహృద్భావంబునం బ్రతివిధానంబుం గావింపం దలంచితి నాకర్ణింపుము.

తరళము. అరయ నే నొకయింత కిల్బిష మైనఁ జేసి యెఱుంగఁ బో
నిరపరాధిని నన్నుఁ జంపెదు నీతలం పది యేది యో
స్థిరమతుల్ హిత మెంచి యుండియుఁ జేష్టయుఁ బదియింతు నే
నరదమంద నియంతఁ గావున నాడు చెప్ప హితార్థముల్. 187

శా. సారథ్యంబున నైనవాఁడు రథికిన్ శ్రేయస్సం బెంచు నే
నారథ్యంబులసారమున్ రథికబాహాశక్తియుక్తుల్ శరో
ద్ధారంబున్ మృగపక్షికూజితనిమిత్తంబుల్ రణప్రక్రమం
బారం గాంచి వచించుఁ జెప్ప రథికిన్ భారం బభారంబునున్. 188

వ. దానంజేసి నీ కిట్లు చెప్పవలసె నీనికిం దార్కాణంబుగా నొక్క పురాతనేతిహాసంబు గలదు చెప్పెద నాకర్ణింపుము. 189

—శల్యుండు కర్ణునకు హంసకాకోపాఖ్యానము చెప్పుట—

సీ. అంభోధిమధ్యమునందు ధర్మప్రధానునిరాష్ట్రమెుక్కఁడు దనరు నందు
వైశ్యుఁడు ధనధాన్యవంతుఁడు బహుపుత్త్రవంతుఁడు శాంతుఁడు వఱలు చుండు
నొకనాఁడు వానిపుత్త్రకులచెంతకుఁ జేరె, వాయస మొక్కటి వడిగ వచ్చి
వారు మాంసక్షీరపాయసాన్నాదులు, పెట్టి పెంచిరి దానిఁ బెరిమదోప

తే. నదియు నయ్యోంగిళులు మెక్కి యనుదినంబు,బలిసిపొగరెక్కి తన కెట్టిపులుఁగు గాని
పురుడు రా దని గరువంబు పొంగి పొరల, వఱలెఁ గోమటిబిడ్డలనెఱి గలుగుట.

క. ఏకగతి రాజహంసము, నాకంబున కెగయుచుండ నాకాక మనే
కాకారగతుల నెన్నఁ, బోకళ్ళం బోయె నులివు పొడు గై సాఁగన్. 199

ఉ. ఆవ్వలఁ బోవు ము న్నయి నెఱిం గొను బిల్చును బెల్చఁ బల్లటీ
ల్నివ్వటిలంగ లంగఁ గొను నిక్కు వెలార్చును తెక్క లార్చు లో
నవ్వుచు వెన్కకుఁ మరలు నట్టువ మాడును దోడు సూపెడుఁ
దైవ్వక ర మ్మనుఁ దిరుగుఁ గ్రిందికి మీఁదికిఁ గాక నిక్రియన్. 200

వ. ఇ ట్లాకాశం బనేకప్రకారంబులఁ బరవళ్ళం ద్రొక్కుచు మిక్కిలి దవ్వుపోయి యున్నం గని కాకి పగుఁను ముదితంబై హంస నధిక్షేపించి నవ్వుచు అవ్వల నెగిరి పడుచు తెక్కలు ముక్కులం జగుముచు మాటిమాటికిం దనజాతిజయం బగ్గించుచుఁ గాకా యని కూయుచు నుండె రాయంచయుఁ దన్నుఁ బరిహసించు కాకిని మాటలు వాకోక యేకప్రకార మగుమృదుగమనంబునం గ్రమక్రమంబునఁ బశ్చిమసముద్రంబుపై పొతవున నెగసి మీఁదిమీఁది కతిరయంబునం బోవం బోవఁ గాకంబును. 201

చ. వడి వడి ముందు ముం దగుచుఁ బాఱియుఁ బాఱియు వెన్క వెన్క గై
పొడ వడఁగార డస్సి శ్రమఁ బోకడఁ బెట్టుకొనంగఁ జెట్టులుం
బుడమియుం గాన రామి వెఱపుం గల వై యిపు డెట్లు పోయినన్
గడలియ కాని వే ఱొకఁడు గాన నిఁ కేమి యొనర్తు దైవమా. 202

తే. పులిసె గఱుపోయి దగయును బాడుగువాతె,నూరుపులు హెచ్చె నయ్యుకలారవచ్చె
నన్నగిల్లెను మెయిశక్తి మిన్న కిట్లు, పెట్టుకొంటిని వా దింక నెట్టు లొక్కొ. 203

మ. అని చింతాకులమానసంబున భయం బవ్వారిగా కూరఁ జే
రినసామ్మన్ దిగనాఱి క్రిందిగతి కై రెక్కలు లేకుండె నం
త నితాంతత్వర మీఁదిమీఁది కగుకాదంబంబు గన్నెత్తి క
న్గొని కాకంబు నతిక్రమించి చన మైకో ల్పేయ నమ్యో న్మదిన్. 204

వ. అక్కలహంసంబంతకంతకుఁ జలంబును బలంబును సన్నగిల్ల దిగుచు దీనదశకువచ్చిన పికవర్ధనంబు నుద్ధరింపం దలంచి దానిదాపునకు దిగునంతలో నది సొలసి నదిగావున నింగి నిలువం జాలక మున్నీటినీటం బడి మునిఁగి తేలి తెక్కలును ముక్కులునుం దడియఁ గొట్టుకొనుచు మృత్యుదేవత మునిపంటి కంటికొన నున్నసమయంబున రయంబునం జని రాయంచ తనకాళ్ళలం దానిఁ గఱచి పట్టి లేవ నెత్తి సేద దేర ని ట్లనియె. 205

చ. ఎగయుచుఁ గ్రిందికిం దిగుచు నీజలపూరమునందు మున్గియున్

మొగమును ముక్కు చెక్కులును ముంచుచు మాటికి నాటలాడు దీ
వగు నగు నీపునూటయొక పైసగతంబుల నిద్దియెద్ది యో
తగ నెఱిఁగింపవే యనిన ధ్వాంక్షము దీనత దాని కిట్లనున్ 206

ఉ. కావుము కావు మం చరచుఁ గాకుల మే మని కాన లేక నే
నేవియు దుష్టవాక్యము లనేకము లంటిని దప్పు సైచి నన్
గావుము కావు మోపరమకారుణికాగ్రణి! నిన్ను భక్తిమై
భావన సేయుచుం గొలుతుఁ బ్రాణము లుండినయంతకాలమున్. 207

తే. కుడిచి యుచ్ఛిష్ట మెంతయుఁ గ్రొవ్వి నాఁడు, నంచ జేర్వఁగ నేపాటి యనుచు నడిచి
పడుచుఁ గాకాపసక్షులఁ బరిహసించి, నాఁడు నాదోష మిాఱితిఁ గూడ నయ్యె. 208

మ. ఇఁక నాప్రాణము నీయధీనము విహంగేంద్రా! కృపాద్రాంతరం
గకృతిం జేసి స్వదేశబంధుజనసంఘంబందు నన్ జేర్పు మి
ల్లోకనాఁడే నవమానమున్ నలుపఁ బోకుందు న్నినుం బోంట్లకున్
సకలావస్థల సేవ సేయుచు మనన్ స్వాంతంబు గావించెదన్. 209

వ. అని ప్రార్థించినం బ్రసన్నచిత్తంబున సమ్మరాళోత్తమం బప్పాతక్లిన్నం బై దుర్దశం బడి వివశం బైన కాకంబు నెత్తి పిపుసంబెట్టుకొని పోయి యెప్పటిచోటం బెట్టి తాను దనమరాళంబులతో నిజనివాసంబునకుఁ జనియెఁ గాకంబు నాఁడుమొదలు గరువం బంతయు దిగద్రావినభావంబున శమంబు వహించి యుండె వసుషేణా! నీవు నావై శ్యనింట నెంగిలిఁ దిని పొంగు మిాఱిన కాకంబు వలె ధార్తరాష్ట్రోచ్ఛిష్టభోక్తవై గర్వించి యుర్విం గలవారి నెల్ల నవమానించెదవు నిన్ను నీ వెఱుంగ వాకర్ణింపుము.

ఉ. గోగ్రహకాలమందుఁ గడుఁ గోల్తల సేయుచు నున్నక్రీడిపై
నాగ్రహ మేల సేయ వపు డాతఁడు నీయనుజన్ముఁ జంపఁ ద
ద్విగ్రహ ముర్విపైఁ బడఁగ వీక్షణముం బ్రసరించి నీ వతి
వ్యగ్రుఁడ వై పలాయనము ప్రప్రథమంబునఁ జేసి తేలొకో. 211

ఆ. అట్లు ద్వైతవనమునందు గంధర్వులు, కలనఁ బట్టఁ గౌరవులను బెట్టి
సురిగి తిప్పు వారి నటుఁ డ్దలు విడిపించెఁ, జిత్రసేను నోర్చి చెప్పులు లేవా. 212

మ. నరనారాయణు లిద్ధతేజు లనుచున్ రాముండు వాక్రువ్వఁడే
పరిషన్మధ్యమునందు నెల్లరు వినన్ భాషింపరే భీష్ముఁడున్
గురుఁడు న్వ్యార లజేయు లంచు వినమే క్రుద్ధుండ వై వారినిం
దురమం దోర్తు నటందు వెంత వెడఁ గాదో కాని నీ వక్కటా. 213

చ. తెలియఁగ సజ్జనాచ్యుతులు పఫ్యులతి భవ్యలి రాత్రిశత్రుసం

కలితులు సర్వభూప్రజలకంటె బలాఢ్యులటంచు నెంచి వా
రలను సమాశ్రయించి మును రాజమురారిపు కూర్మిఁ గాక మ
ల్లలపము మేనఁ బ్రాణముల కాస యొనర్చినవాఁడ నేనియున్. 214

క. శరశతముల నీదర్పము, నరుఁ డణఁచినయపుడు నీకు నరునకుఁ గలయం
తర మీవ యెఱుఁగఁ జాలుదు, వరు దుండువు సట్టిమేటి నగునే యనయున్. 215

క. నరనారాయణు లిద్దఱుఁ, బరికింప నహర్నిశాధిపతులౌనఁ దేజ
స్స్ఫురణమున నొప్పుచుండ్రు, వరుదార మిముఁ గొలుతు రగు దద్బోటన్. 216

వ. అనుటయుం గటకటంబడి కర్ణుండు. 217

—♦కర్ణుండు శల్యునితోఁ దనకుఁ గలిగిన శాపంబుల తెఱంగు చెప్పుట♦—

తే. వాసుదేవార్జునులకైన వారి యుల్ల, మి వెఱుఁగ నే నెయ్యంగుదు నెఱిఁగి కావె
సందియంబేల కవ్వారిసంగరమున, మారొక్కనంగఁ గెలంగితి మద్రనాథ. 218

వ. అయిన నాకు జామదగ్న్యశాపంబును బ్రాహ్మణశాపంబును సంతాపంబు గలిగించు చున్నవి చెప్పెద వినుము. 219

సీ. తొల్లి యే నస్త్రవిద్య లభ్యసింపఁ గోరి, బ్రాహ్మణక్షత్రియ భృగురాముకడకుఁ
జని తత్ప్రసాదమునఁ గాంచి దివ్యాస్త్ర, శస్త్రములు లేనున్న సమయమందు
నొకనాఁడు గురుఁడు నా యుత్సంగమునఁ దల, పెట్టి నిద్రించుచుండ నంత
శతముఖుం డర్జునుహితము దలంచి నావిద్య, కంతరాయము సేయ సభిలషించి

తే. కీటమై నాదు క్రిందఁ దొడ క్రిందఁ దొలిచఁ, దొలిచినన్ నెత్తురొల్గిన పలికిఁ బాఱ
గురుని నిద్రకు భంగంబు గూరు ననుచు, సైఁచి కదలక యుంటి నాసమయమందు.

ఆ. గురుఁడు మేలుకాంచి గుఱుతు ధైర్యమునకు నెఱిఁ, గాంచి ద్విజుఁడ వీవు గావు దబ్బ
చెప్పు మనిన నేను జెప్పితి సూతుఁడ, నని యసత్యపుమాట నాడుకొని సెంచ. 221

వ. అమ్మహాతపస్వి రోషకలితచేతస్కుండై నాపైఁ గటకటంబడి కపటంబునం జేసి నాకడ దివ్యాస్త్రంబులు వడసితివి కావున నవి నీకు వలయుకాలమ్మునం దోఁపక మృత్యుకాలమ్మునం దోఁచుటయుం గలుగుత మని శపించె నింక బ్రాహ్మణశాపంబు తెఱం గెఱింగించెద వినుము మఱియు నేను భార్గవునివలన నస్త్రంబులు వడసి వాని సఫలతకొఱకు తలంపున విజనం బయినవనంబునకుం జని వింట బాణంబులు సంధించి యేయుచుండ నం దొక్కబాణంబు ప్రమాదవశంబునం బోయి యొక్కబ్రాహ్మణునిహోమధేను వత్సంబునకుం దాఁకి ప్రాణంబులు దీయుటయు నంత నట కా బ్రాహ్మణుండు పఱ తెంచి నన్నుం గాంచి నాహోమధేనువత్సంబు వధించితివి గావున నీ వేకాగ్రచి త్తుండవై సమరంబు సేయుచున్నసమయంబున నీరథచక్రంబు భూచక్రంబునం

స్త్రీంగేహముఁ గావుత మని శపించిన నే నాశాపంబునకు భీతుండ నై వానిం బ్రార్థించి పట్టుపడుచుచు. 222

మ. మదిలో నీయపరాధముల్ సయిచి ప్రేమం బాపవే శాపముల్
బదినూర్లా వులు నాలునూఱులు బలీవర్దంబులు న్వేండియున్
బదియు న్నాలుగువేలు మేలుకపిలల్ పద్మాల్గునూ ల్లేనుఁగుల్
సుదతుల్ నూర్గురు స్వర్ణపూర్ణగృహముల్ శోధించి నీ కిచ్చెదన్. 223

వ. అని ప్రార్థించుటయు. 224

తే. దాని కంగీకరింపఁ డపహ్నానివరుఁడు, తప్ప నేరదు నామాట తథ్య మగుచు
ననుభవమునఁ బ్రాయశ్చిత్త మట్టిదగుచుఁ,బరము సెడనీదనుచుఁబల్కి-తరలి చనియె.

వ. ఇట్లు శాపంబులు సంతాపకరంబు లైన నిప్పుడు నాకు బ్రహ్మాద్యస్త్రంబులు ప్రస్ఫు రించుచున్నయవి గావున. 226

మ. నేఁడు కార్యమ బవరంబునందు హరునిన్ నేర్పొప్ప నోడింప నై
నెత్తి మీఱిన నర మండపట్టెసరునిన్ నేఁ గాక యెుండొక్కరుం
డలుమం జాలెడు నే జగత్త్రయమునం దమ్యూర నే నియ్యెడం
గలకుం గోలలఁ గూల నేసి యనము ముకొందుఁ బ్రకోలుగన్. 227

సీ. శరసంచయంబున నరుల కుంచెడునస్త్రవార్ధి నే వేల నా నాఁగఁ గలను
గాండకాంతుల రవికరణి వెలుఁగునరు, మబ్బునాఁ గప్పెద మార్గణముల
ఖడ్గద్యుతుల వహ్నిగతి మండువివ్వచ్చు,నంపతుంపురఁ జేసి యార్పి వైతు
నురుతరారిబలంబు నుల్లాసత లూఁచువి,జయవాయుపును గొండ నయి తెరలుతు

తే. నస్త్రమున కస్త్ర మేయుచు నణఁమి తత్తిమి, మదనిజనుమస్త్రగజమును మాడ్కి నేను
సవ్యసాచితో దివ్యాస్త్రశస్త్రములను, బెనకువం జేసి గెలిచెదఁ గనుము నీవు. 228

ఉ. మూఢుఁడ నీ విదేమికతమో వెలపించుచు నన్ను నొంచుచున్
బాఢముగా ధనంజయునిపౌరుష మెంచుచు నుంటి నిన్నుఁ బో
ల్పాగనులు నూర్గు రైన నను ముట్టఁగ నేరరు పండితెట్టఁ నేఁ
గ్రోధనుఁడఁ గాని కావుమును బట్టి సహించితి నిట్లని న్నదన్. 229

శా. మిత్రద్రోహము సేయు మింటి పదను ప్రేమించి న న్నింటిమున్
మిత్రత్వం బరయంగ సప్తపదసంపృష్టంబు నా నెన్న నీ
ధాత్రీనాథునితోడి బాస కెడగా ధర్షించి ఘర్షింతు వే
నాత్రం బందుచు నర్థసిద్ధికి విఘాతార్థంబు చింతింతు నే. 230

వ. మఱియు నాలకింపుము స్నేహ సంతోష ప్రీణన సంత్రాణ ప్రతీక్షణాదుల మిత్త్రం

దును హింసన శిక్షణ నిరసనావసాదనాదుల శత్రుండును సార్థకత్వంబు నొందుదురు
నీ వెట్టిండ వయిన నే నిట్టియెడ దుర్యోధనార్థము భవత్ప్రియార్థము యశోర్థ
మాత్మార్థము నీశ్వరార్థముం గపంగి కృష్ణార్జునుల మాఱుకొని పోరు గావించెద
నా బ్రాహ్మమానుషాదిదివ్యాస్త్రప్రభావము నీవ యెఱుంగుదువుగాక దండి యగు
వైవస్వతుండును బాశి యగువరుణుండును గది యగుగుహ్యకేశ్వరుండును వజ్రి
యగువాసవుండును మఱి యెవ్వరేని తొల్తివచ్చినను నేను వెఱచఱచువాఁడం గాను
పార్థుం డన్న వెఱతునే యని మఱియును. **231**

మ. ఎదియో యో చెప్పెద నంచుఁ గాకిగను న న్నెంచి భాషించుచున్
బెదరింపం జనువెంచి తే బెదరిపో జేహారినే బేల నే
త్రిదశేశుం డెదిరించె నే నని మొనం దీపింతుఁ గోపింతు నీ
త్రిదశేంద్రాత్మజుఁ డేమి లెక్క యగునో తల్లంబు గాకుండు నే. **232**

క. నీచులనోటికిఁ బరుసము, లే చవి యగుఁ గాసఁ బ్రేలితి తెల్లికర్ణుం
డేచి ధర విక్రమింపం, దోఁచును గా కరికి వెఱవఁ దోఁపఁడు వింటే. **233**

వ. మఱియు సఖిభావసుహృద్భావమిత్రభావంబు లనుమూఁడుకారణంబులు కలిమిం
జేసియు సుహృద్వయం డగుసుయోధనునికార్యంబు నిర్వహించుట నాతలం బడి
యుండుటం జేసియుఁ బ్రియాప్రియవచనంబులు సైతు నని చేసినసమయంబునం
జేసియు నీవు బ్రదుకఁ గలిగితివి నీయట్టివారు నూఱుగురు వోయిన నే నొక్కరుండఁ
గార్యనిర్వాహకుం డగుదుఁ గాని మిత్రద్రోహపాతకం బరయమి పాడిగాదని యుంటి
నని పలికిన నలుక గదురనచిత్తంబున మెత్తన విడి శల్యుం డిట్లనియె. **234**

తే. ప్రల్లదంబులు పలికినపగిది గాదు, పలికినట్టులు పగతుఱ గెలిచి కాక
బీర మొలుకుట తగదు నే బిరుదుమగఁడఁ, గర్ణ శత మేఁగినన్ శత్రుగణము నొంతు.

—కర్ణుఁడు బాహ్లీకమద్రదేశములదురాచారము లెన్ని శల్యుం దెగడుట—

వ. అనినం గ్రోధాతివిధేయుం డగురాధేయుండు వెండియు మద్రపతి పెన మొగంబై
తొల్లి ధృతరాష్ట్రునికొలువుకూటంబున నొక్కనాఁడు దేశాటనంబు చేసినబ్రా
హ్మణుం డొక్కరుండు వచ్చి దేశచరిత్రంబులుం జెప్పుచు బాహ్లీకమద్రదేశంబులఁ
దిరస్కరించి చెప్పినపిఫలంబు చెప్పెద నాలకింపు మని యిట్లనియె. **236**

సీ. హిమవత్కురుక్షేత్రయమునాసరస్వతీ, భాగీరథులచేత బహిఃపడి యును
సింధుషష్ఠము లయి చెల్వారుపంచాప, గలమధ్యమునయందుఁ బాలుపుమీఱి
ధర్మబాహిరము లై దర్శనీయము లైన, బాహ్లీకదేశముల్ పరఁగుచుండు
రాష్ట్రములు నచ్చట రాజగృహద్వార, మందు నొకనగ్గస మనువటంబు

తే. భద్ర మనుచత్వరంబు నాబాల్యముగను, నేను దలపోయుచుందు బాహ్లీకములకు
గూఢ మగుకార్యమునఁ బోయికొంతకాల, మధివసించితి నెఱుఁగుదు నచటికతలు.

తే. శాకలం బనుపేరునఁ జనునగరము, నాప గాఖ్యనెసంగునే ఱమర జర్తి
గము లనియెడుబాహ్లీక దేశములు నుండు,జనులవృత్తంబు నిందిత మని వచింతు.238

సీ. జర్తిగంబులు నుదుజలబాక్షు లెప్పుడు, ధానాగుడాసవ మాని లశున
ములతోడ గోమాంసమును దిని శీలంబు, గట్టు పుట్టంబులతో నట్టె విడిచి
పట్టణాగారవప్రమ్ములందును రచ్చ,పట్టులందును జేరి ప్రతిదినంబు
మాల్యానులేపనమహిత లై మత్తావ,గీతములు ఖరోష్ట్రనినదు లెసఁగఁ

తే. బాడి యాడుచు మత్తుపఁ గూడి మాడి, మైథునాసక్తి ప్రేరేప మఱచి యోసి
భర్తృఘాతిని! యోసి యోస్వామిహంత్రి!, యనుచు నాక్రోశ మొనరింతురతిరవమున.

శా. ఏతాదృగ్విధవర్తనంబులను బాహ్లీకాంగనల్ కాముక
వ్రాతం బెప్పుడుఁ గామతంత్రపరతన్ వర్తింపఁ దమ్మింటి రాఁ
బ్రీతిం జేయుచునుందు గద్దెకతఱిన్ బాహ్లీకదుష్టుల్ ప్రకాం
జేతెంచెన్ గురుజాం ... దన్నీక్షింప వామేక్షణల్. 240

వ. అట్లేతెంచినదుష్ట ... మ్మఁ బైకొన్నయన్నుమిన్నం గని నాతిహృష్టమానసుం డై
సూక్ష్మకంబళవ ... బృహతియు గౌరవర్ణయు నగుసీబాహ్లీకాంగన నన్ను
వలచి స్మరింపుచు నగె శయించి యున్నయది నేను దీనిం బ్రోసిరా జని యిరావతీశ
తద్రువులం దాఁటి నాదేశంబునకుం జని మనశ్శిలోజ్జ్వలాపాంగలు స్థూలశంఖలు
గౌరవర్ణవర్ణితలు కంబలాజినసంవీతలు మృదంగానకశంఖనిస్వనలు ప్రియదర్శనలు
నగునాస్త్రీలతోడం గూడిమాడి శమీపీలు కరీర వనంబుల సక్తుపిండంబులు
నపూపంబులు దిని ఖరోష్ట్రాశ్వతరంబుల నెక్కి సంచరించుచు దారులు గాచి పథి
కులం బ్రహరించి చేలాపహారంబు గావింతు నని పలువురు వినం బలికె నిట్లు దుష్టా
త్ములయినబాహ్లీకులు వ్రాత్యులు నిత్యపాపులు మఱియు నందలిశాకలనగరంబున
నొక్కరక్కసి కృష్ణచతుర్దశినాఁటిరేయి దుందుభి మ్రోయించి గోమాంసంబును
గొఱ్ఱెలను బలాండుఖండంబులును దిని కల్లు ద్రావి గౌరవర్ణవర్ణిత లగువరవర్ణినులతో
నెల్లప్పుడు గ్రీడించుచుండు నట శీధుపానప్రమత్తు లగుశాకలులు వరాహమాంసం
బును గుక్కుటమాంసంబును గోమాంసంబును గొఱ్ఱెమాంసంబును గార్దభమాం
సంబు నుష్ట్రమాంసంబును దిననివాని జన్మంబు నిరర్థకం బని పలుకుచుందు రని
చెప్పె-నంత మఱియొకబ్రాహ్మణుండు వచ్చి యచ్చోట నైరావతి శతద్రువు విపాశ
చంద్రభాగ వితస్త యన్ననైదునదులును సింధునదియుం బ్రవహించు ననియుఁ బీలు

వనవిరాజితంబు లయిప్రణష్టధర్మంబు లగునాదేశంబు లారట్టంబు లనియు నం దుత్త
ములకు బోనొప్ప దనియు నట వ్రాత్యులును దాసమీయులు నయజ్ఞులు నగువారియ
న్నము దేవతలుఁ బితృదేవలు భూదేవతలు గ్రహింప రనియు నిర్దయు లగువారు సక్తు
మద్యానలిప్తంబులు శునకావలీఢంబులు లగుకాష్ఠపాత్రములందును మృణ్మయపా
త్రంబులందును భుజింతురు రనియు నావిశ్రేష్ఠికగార్దభక్షీరంబులు త్రావుదు రనియుఁ
కర్త్రద్వికాగమాంసంబులు భుజింతురు రనియుఁ బుత్త్రసాంకర్యమునకు సంశయింప
రనియు నప్పాపుంగా శీసంగతి పాపపేత్రు నగు ననియుం జెప్పె నప్పుడు మఱి
యొక విప్రుండు. 241

సీ. ధనయు గంధరమునఁ ద్రావి పయ స్సచ్యుతోత్తమస్థలమున నుపవసించి
భూతిలయంబునం బొసఁగ జలం బాడి,జనుఁడు స్వర్గమునకుఁ జనెడునట్లు
పంచాపగామధ్యబాహ్లీకదేశము,లందు రెణ్ణా శ్లిన్న నఘము లందు
నట విపాశానదియందుఁ బిశాచముల్, బహిబహ్లీకము లనఁ బరఁగు రెండు
తే. తన్నిఘనము నపత్య మై తనరుచుండె, నిపుడు బాహ్లీకసంగ నిది విరించి
సృష్టిగా దందు ధర్మంబు నష్ట మయ్యెఁ, గష్టజననిపా... కృష్ట మయ్యె. 242

వ. దేశాచారం బిట్లున్నది కావునఁ దైర్థికులు తీర్థయాత్ర... బాహ్లీక కార
స్కర మాహిషక కాళింగ కేరళ కర్కోటక వీరక ...కములు వర్జించునది
యని యేకరాత్రము శయించునలూఖలమేఖలు యనునొక్కరాక్షసి చెప్పె నని
చెప్పి మఱియు. 243

శా. ఆరట్టంబులు మద్రముల్ ఖశవసాత్వ్యాఖ్యాకముల్ సింధుసౌ
వీరప్రస్థలనామదేశములు భావింపంగ నింద్యంబు లం
దారూఢస్థితి నున్నబ్రాహ్మణులు వ్రాత్యవ్రాతసంకీర్తితుల్
వా రేనాఁడును వేదవేదికల కేవం బోనివా రారయన్. 244

తే. అధమవిప్రనివాసయోగ్యంబు లైన, దేశము లవి సృష్ట్యాదిగాఁ దెలియ వచ్చు
నచటివారలపాపమం దార్ద్రపాలు, పొందుచుండెదు నీ వెంతపుణ్యమతివో. 245

వ. మఱియు నొక్కవిప్రుండు మాయింటి కతిథి యై వచ్చి గాంధార మద్ర బాహ్లీకులు
వ్యభిచారదోషంబు పరిగణింప రనియు నట బ్రాహ్మణుం డై పుట్టినవాఁ డవల
క్షత్త్రియుం డై పుట్టు ననియు వణిక్శూద్రు లగువారు నాపితు లగుదు రనియు నాపి
తులు బ్రాహ్మణులై పుట్టి దాస్యంబునం జేసి దాసనీయు లగుదు రనియు నిట్టిధర్మవి
ప్లవం బక్కడ న తక్కఁ దక్కిన దేశంబులం దెక్కడను లే దనియు మఱియు. 246

సీ. గడిదొంగ లారట్టకమున సాధ్వి నొకర్తు, గొని పోయి నప్పు డావనిత వారిఁ

గసి నన్ను గరితను గనికరింపక యిట్లు, నెఱి దప్పి చెఱుపఁ బూనితిరి గానఁ
గులట లై మీదేశకులకాంత లొప్పెద, రీపాప మెపుడు మి మ్మేచుచుండు
భాగహరుల్ మీకు భాగినేయులు కాని, కారు పుత్రకు లొక్కకాలమునకు
తే. ధర్మసాంకర్య మెసగు మీధరణియందు, నని శపించెను గానఁ దదాదినుండి
మద్రకారట్టకము లిట్లు మహితగతికిఁ, దప్పి యి ట్లయ్యె నని చెప్పి తరలె నతఁడు.

వ. కురు పాంచాల సాల్వ మత్స్య నైమిశ కోసల కాశి పౌండ్ర కలింగ మాగధ చేది దేశంబు లెట్టిధర్మధన్యంబులో మీదేశంబు లట్టిధర్మశూన్యంబు లిట్టిదేశంబుల కధినాథుండ వైననీ వెట్టింతవు మీ పాంచనదధర్మం బెట్టిదో నీవ చెప్ప నర్హుండవు తొల్లి కల్మాషపాదతీర్థంబున మునుంగుచు నొక్కరాక్షసుండు బ్రాహ్మణున కస్నానంబు మలము క్షత్రియునకు భృత్యము మలము భూమికి బాహ్లీకదేశము మలము స్త్రీలకు మద్రస్త్రీలు మలము మనుష్యులకు మ్లేచ్ఛులు మలము మ్లేచ్ఛుల కౌష్ట్రికులు మల మౌష్ట్రికులకు షండులు మలము షండులకు రాజయాజకులు మలము రాజయాజకులకు మద్రకులకును బాలకుండ వగుటం జేసి వారిమలంబు నీ వని చెప్పె నని వింటి నాలుకిఁ బ్రష్టము పాంచాలురు బ్రహ్మనిష్ఠులు కౌరవులు ధర్మతత్పరులు మత్స్యులు సత్యవాదులు శూరసేనులు యాయజూకులు ప్రాచ్యులు దాసులు దాక్షిణాత్యులు వృషలులు బాహ్లీకులు స్తేనులు సురాష్ట్రులు సంకరులు పాంచనదు లగు నారట్టజులకుఁ గృతఘ్నత పరవిత్తాపహారము మద్యపానము గురుదారావమర్దము వాక్పారుష్యము గోవధము రాత్రిచర్య బహిర్గేహము పరస్త్రీసంభోగము లోనగు నవి పరమధర్మంబులు కురు పాంచాల మత్స్య మాగధ నైమి శాంగకోదీచ్యాదులు ధర్మోపజీవులు మాగధు లింగితజ్ఞులు కోసలులు ప్రేక్షితజ్ఞులు కురుపాంచాలు రర్ధోక్తజ్ఞులు కృత్స్నానుశాసనులు శిబులును పార్వతీయులును విషమములు శూరులు యవనులు సర్వజ్ఞులు మ్లేచ్ఛులు స్వసంజ్ఞానియతులు బాహ్లీకులు మద్రకులు ప్రతిబద్ధులు శీధుపానంబును గురుతల్పావమర్దంబును భ్రూణహత్యయును బరవిత్తాపహారణంబును బాంచనదారట్టకులకుఁ బరమధర్మంబు ధర్మశూన్యుండ వైననీ వింక వా యెత్తకూరకుండుము కృష్ణార్జునులం జంపక మున్న నిన్నుఁ జంపు నట్లుచేసికొనకు మనిన శల్యుం డి ట్లనియె. 248

—శల్యుండు కర్ణునకుఁ బ్రత్యుత్తరంబు చెప్పుట—

మత్త. అంగదేశమునందు నాతురు లైనవారల వీడి కో
లంగడిన్ సుతదారవిక్రయ మాచరించుట గల్గు న
య్యంగదేశము రాజ వీవు రథాదినిర్ణయకాలమం

దుం గణించె నెఱింగి నీదగు దోష మానదిసూతియుక్. 249

వ. నీ విప్రుఁడు చెప్పినదోషంబు లెల్ల దేశంబులం గలిగియుండు నెల్లదేశంబులందు నుత్తమ
బ్రాహ్మణులును స్వధర్మపరు లై దుష్టనిగ్రహంబును శిష్టానుగ్రహంబునుం జేయు
నుత్తమక్షత్రియులును సువ్రత లగుపతివ్రతలునుం గలిగి యుందురు దేశసామాన్యం
బునం జేసి గుణం బొందదె దోషం బొందెఁ జెప్పనొప్పదు సర్వజనంబునునిజదోషంబెఱుంగఁ
జాలక పరదోషంబు పలుకుచుండు నని ప్రతిఘటించి చెప్పుచున్నంత దుర్యోధనుండు
గ్రచ్చర వచ్చి సఖిత్వపథనంబున రాధేయుని నంజలిఘటనంబున శల్యుని వారించిన
వా రొండు వలుక కుండి రంతఁ గొంతవడికి రాధేయుండు మందహాసంబున మద్ర
పతిం గని రథమ్ము నో నిమ్ము పో నిమ్మని పలికిన నతం డట్ల సేయుటయు నితండు
రథఘోషంబును సింహనాదంబును వాదిత్రనినాదంబునుం బోరుకలుగ ధారుణిం
గంపింపంజేయుచుం జని యసురసేనాసమూహంబుపైఁ గవియునాఖండలునివిధం
బున ధృష్టద్యుమ్నాభిరక్షితం బగుపాండవవ్యూహంబుపైఁ గవిసె నర్మరాజుం దాఁప
లించె ననిన ధృతరాష్ట్రుండు సంజయా! మనరాధేయుండు దేవదానవాజయ్యుఁ డగు
ధృష్టద్యుమ్నాదిపాండవవీరుల నెల్ల మోహరించి మాఱుకొనియె నతనిసవ్యదక్షిణ
పక్షంబుల రక్షకు లెవ్వ రగ్గుసుం డపు డెవ్వో నున్నవాఁడు వా రెట్లు మోహరించి
ప్రతిఘటించిరి భండనం బెట్లు సెల్లెం జెప్పు మనిన నతం డతని కి ట్లనియె. 250

క. మనవారిమొనయు మొగ్గర, మును వారల మొగ్గరంబు మొద లనుసరించెన్
వినిపించెద నిరువీళ్ళం, బొన రెడుపోటరులపో రభూతం బయ్యెన్. 251

వ. ఆలకింపు మట్లు సంగరరంగంబునకుం జని యంగనాథుండు సనాథం బగుచతురంగ
సైన్యంబున బార్హస్పత్యవ్యూహంబు వన్నించె నందుఁ గృపకృతవర్మ మాగధులు
దక్షిణపక్షంబును శకునియు నులూకుండును వారువంపుదడంబులతో నగ్రపక్షం
బును గాంధారపార్వతీయపరివృతు లై యిరువదినాలుగువేలరథంబులతో సంశప్త
కులు వామపక్షంబును నీపుత్రులతోడ గూడి శకయవనకాంభోజు లాప్రపక్షంబునుం
గొని నిలువ భాస్కరానలప్రభాభాసమానుం డగుభానుజుండు పుత్రమిత్రబంధుపరి
వృతుం డై నడుమ వాహినీముఖంబున నిలిచె దుశ్శాసనుం డొక్కమత్తమాతం
గంబు నెక్కి సారవత్సైన్యసమేతుం డై పృష్ఠభాగంబునం దనరె వానిపిఱుంద సోదరు
లును మద్రకేకయులుం గావలియై యుండ సుయోధనుండు దీపించెఁ గురుప్రవీరు
లును మ్లేచ్ఛమాతంగగణంబులును దన్ననుసరింప నశ్వత్థామ రారాజు ననుసరించి
యుండె నిట్లు సన్నద్ధం బై యుద్ధంబునకు సిద్ధం బై సముద్రంబుపలెం జూపట్టినదాని
ముఖంబున శతమఖుండు నా నుద్దీప్తం-సపుకర్ణుం గాంచి యుధిష్ఠిరుం డర్జునుదిక్కు-

మొగంబై. 252

ఉ. సూతసుతుండు శాత్రవులు సూచి వెఱంగుపడంగ ముగ్గురం
బీతతి సంఘటించ నిటు లీవరశక్తులుం బ్రశక్తముల్
ఖ్యాతి నెసంగు మోఘపరకల్పితముల్ గనుగొన్న సాధ్వసో
ద్భూతము నాఁగ నామదికిఁ దోఁచెడిఁ జూచితి వయ్య తమ్ముఁడా. 253

తే. ఎట్లు చేసిన మనకు నొక్కింత యేని, భయము గదురక యుండునప్పగిది నీతి
నీ వొనర్పను నాపుడు నృపవరేణ్యుఁ, బలికె నర్జునుఁ డిట్లని ప్రాంజలియయి. 254

క. దేవా! యీ యెట్లు నతి, నావంకకు నీయుఁ దలఁచి నన్నడిగితో నీ
భావం బెనతి యిమ్మా, నీవచనము వేద మనుచు నే నొనరింతున్. 255

వ. అనినన్ ధర్మరాజు తమ్ముని మన్నించి నీవు రాధేయుని భీమసేనుండు సుయోధనుని నకులుండు వృషసేనుని సహదేవుండు సౌబలుని శతానీకుండు దుశ్శాసనుని శైనేయుండు హార్దిక్యునిఁ బాంచాల్యపుత్త్రుండు ద్రోణపుత్త్రుని శిఖండి గూడి ద్రౌపదేయులు ధార్తరాష్ట్రులను నేను శారద్వతుని దక్కనుం గలవారు దక్కినవారిం దలపడి ధైర్యస్థైర్యంబులం బిఱుతీక పీఁకం బోరు నొప్పు నని చెప్పినయొప్పున సేనలం బన్నించి తాను బన్నగతల్పకల్పితంబు నగ్నిదత్తంబు నగునుత్తమరథం బధిష్ఠించి యుధిష్ఠిరు ననుమతంబున నర్జునుండు సేనాముఖంబునకు సమ్ముఖంబు చేసి వచ్చుచున్నం గని శల్యుండు కర్ణున కిట్లనియె. 256

ఉ. చూపుఁడు ఎవ్వనిఁ జూచెను జూడఁగోరెనో ఘను మిత్త్రు నంతసి
చూ పటు చాచి చూడు మదె చొచ్చుచు నచ్చటనీదుమూఁకలన్
రూపఱఁ జేయుచుండె వరరోపములన్ నిగుడంగఁ జేయుచున్
దాఁ పయి కృష్ణుఁ డోపఁగ ధనంజయుఁ డల్లధనంజయుండు నాన్. 257

క. జలదధ్వానము వోలెన్, వెలియుచు రథఘోషము మిఫుడు వెస లల్లాడన్
దళ మగుచు మ్రోయు నదె మన, బల కర్మవిపాక మనఁగ వచ్చు నతిఁ డిటన్. 258

—శల్యుఁడు కర్ణునితో నపుడు పొడచూపు దుర్నిమిత్తంబులు నప్పుడు—

సీ. శ్వేతాశ్వరథవేగపాతమ్మున న్నేల, కంపించుఁ బుదూళి కడలఁ గప్పె
మన సేన కెదు రయి ఘనమారుతము వీచుఁ, గ్రవ్యాదగణములు గడక నార్చు
మిను వంక మోమయి మృగచయంబులు మ్రోయుఁ, గాకులు గ్రద్దలు కలయ నాడు
సిడములు వడకాడుఁ బడు జాతి విండులు, విడుచుఁ గన్నీళులు వీతు లెల్ల

తే. మఱియుఁ గలనిమిత్తంబుల తెఱఁ గెఱుంగ, మనబలంగము నశియించు ననుచుఁ దోచు
శంఖభేరీరవాదులనన్నలరయుఁ, బోటుపృల లెల్ల బయలు మఱుపగటఁ దోచు. 259

చ. సురలవిమానముల్ బలెను జూడఁగ నొప్పెడు శత్రుసైన్యమం
దరదము లెల్ల గాండివమహాధ్వజకాంతులు కౌస్తుభప్రజల్
నిరతము నింగి నేలయును నిండి వెలుంగుచు నెల్లవారికిన్
వెరఁగు పొనర్చుచుండెడిని వేఁడివెలుంగువెలుంగు లోయనన్. 260

మత్త. అల్లవాఁడె గదాగ్రజుండు రథాగ్రమందు నియంత నై
తెల్లవార్వములన్ రయంబునఁ దేజి పాఱఁగఁ దోలు దో
విల్లు చేకొని మ్రోయఁ జేయుచు విస్ఫురద్గుణుఁ డర్జునుం
డెల్లరాజుల నేరి చంపెడి నేచి చూచితె సూతజా. 261

మ. మనసంశప్తకసైన్యమున్ వడి వడిన్ మార్కొంచు విష్వచ్ఛఁ డం
జనభూధ్రంబుల కెత్తువచ్చు కరులన్ జక్కాడి యుక్కుమ్మడిన్
ఘనవాహంబుల గండరించి రథసంఘాతంబులం గూల్చి త
జ్జనులన్ మిత్తికిఁ బెట్టుచుండె నదిగో సాఁగించి కన్గొంచుమా. 262

తరువోజ. ఉదితార్కుఁ డబ్దంబు లాసరఁ గప్పంగ, నొప్పెడుగతి సేన నోరయంగ నుండె
నదె ధ్వజాగ్రము దోచు నల్లియమ్రోఁత, లమ్ములపాతరలాడుటం జెల్పు
విదితంబు గా నిద్ద వీరాగ్రగణ్య, వృష్ణివీరుకోడ వీక్షింతు వినుము
కదనమున న్వానిఁ గడతేర్చి తేని, కర్ణ మారాజవు గానె నీ వెన్న. 263

వ. అని పలికిన నలుకవొడమిన చిత్తంబున మెత్తన గొంకక కర్ణుం డిట్లనియె. 264

క. అగు నగు సంశప్తకులకుఁ, దగులంబునఁ దగిలె నంటి తథ్యము దీనం
దెగె ననియెఁ దలఁపు మర్జును, నిఁక నిక్కడఁ గాంచు మాట యెక్కడిది నృపా. 265

వ. అనిన శల్యుండు పెండియు. 266

ఉ. నీళ్లల నప్పతిం దునుమ నెక్కొనునట్లు తృణేంధనంబునం
జెల్లగునగ్ని నార్పుటకుఁ జేర్చినయట్లును గాలి చేతులన్
మ్రుళ్ళఁడగన్ గ్రహించికొనఁ దోగినయట్లును సంద్ర మీఁదయున్
జెల్లఁగ గ్రోలునట్లు నగుఁ జిష్ణునిఁ గృష్ణుని గెల్చుటారయన్. 267

మ. అమరేంద్రాదులు నర్జునుం గెలువ లేరాలంబునం గాసి
తుమ యెల్లం బయి కెత్తఁ జాలినను లోకవ్రాత మొక్కుమ్మడిన్
క్రమ మేదం బొనరింపఁ జాలినను స్వర్గం బందు లేకుండఁ జే
వ మెయి న్వేల్పులఁ ద్రోయఁ జాలినను గెల్వ న్వచ్చు విష్వచ్ఛునిన్. 268

క. నీకున్ సంతస మేనిన్, బాకారికుమారు గెలుతుఁ బగ నని రిత్తల్
వాకొనుచుఁ దృప్తి నొందుము, నాకుం గష్టంబు సిగ్గు వదలినఁ జాలున్. 269

వ. అని మఱియును. 270

సీ. అదె చూడు మధికబలాఢ్యుఁడు భీముండు, మేరువు నాఁ బొల్చి పోరి నిల్చె
నిదె చూడు ముగ్రమహేష్వాసుఁడు యుధిష్ఠిరుఁడు యుధిష్ఠిరుఁ డయి కడిమి వచ్చె
నదె చూడు మాయోధనాతిదుర్జయులు మాద్రేయు లేతెంచిరి తెఱనిపగ
నిదె చూడు మద్రిభీక్షచిత్తులు ద్రౌపదీపుత్రకులు పరవెంచి రనికి

తే. నదిగో చూడుము పార్షతుఁ డాటగ నగు,సమలతేజులు యజ్ఞసేనాత్మజన్ము
లల్లదిగో చూడు మపరికాలాంతకుండు, దానవాంతకు ననుజుండు మానధనుఁడు.

వ. అని శల్యుండును గర్ణుండును సంవాదంబు సాఁగించుచున్నసమయంబున నుభయ సైన్యంబులు నొండొంటిం దాఁకె నత్తాఁకు గంగాయమునాసంగమంబు తెఱంగునఁ గనుఁగొనం దగియె నని ధృతరాష్ట్రునకు సంజయుండు చెప్పె నని చెప్పిన విని నైమిశారణ్యవాసు లవ్వలివృత్తాంతంబు సెప్పు మనుటయును. 272

ఆశ్వాసాంతము.

ఉ. ఎట్టిముహూర్తమందు జనియించితివో [illegible] ముహూర్తమున నిం
కెట్టిగతిన్ మెలంగితివొ యేమి యొనర్చితివో ఘలంగ నేఁ
బుట్టినదాది కష్టముల పొందితి ఉందితి లేమ నిట్టినా
పుట్టువు సార్థకత్వమునఁ బొందఁగఁ జేయవె భారతంబునన్. 273

గద్యము.

ఇది శ్రీమద్రఘునాథనాభయకవిమిత్ర వేంకటయామాత్యపుత్ర
సమారాధితవిబుధరాజ శ్రీపాదకృష్ణమూర్తి కవిరాజ
ప్రణీతంబయిన శ్రీకృష్ణభారతమునందుఁ
గర్ణపర్వంబునఁ ద్వితీయాశ్వాసము.

శ్రీ. శ్రీ. శ్రీ.



శ్రీ

బాలాత్రిపురసుందరాసుందర్యై నమః.

# శ్రీకృష్ణభారతము

## కర్ణపర్వము—తృతీయాశ్వాసము.

---



కృష్ణభారతం బోరఁ
డే కృష్ణుఁడు చేసె న నెడునిర్ధయశంబున్
నాకుం దక్కఁగఁ జేయుము
నీకున్ మ్రొక్కెదను లోకనిచయాధారా. 1

వ. అక్కథకుండు శౌనకాదిమహామునుల కిట్లనియె నట్లుభయబలంబులు నభయప్రాకా రంబునం దాఁకి నప్పుడు సంశప్తకార్జునులకును గర్ణపాండవులకును భండనం బెట్లు సెల్లెం జెప్పు మనిన ధృతరాష్ట్రునకు సంజయుం డిట్లనియె. 2

తే. మన మొనలమోహరముఁ గాంచి తన మొనలను, మోహరించె నరుఁడు దానిమోమునందు
ద్రౌపదేయులు తన్నంటి రాఁ బడాలు, కడఁకఁ దనరారె మాఱుట కాలుఁ డనఁగ.

వ. అప్పు డప్పాండవావరజుండు పాంచాలనందనుం దలకడచి తన్నెఱుమ వచ్చుసంశ ప్తకుల నఱిమి తఱిమినంత నివాతకవచవధంబునాఁడుం బోలె నాభీలం బగునాలం బయ్యె నయ్యెడ సవ్యసాచి శతాంగంబుల భంగంబు గావించియు జక్కుల నుక్కడంచియు వేదండంబుల గండరించియుఁ గాల్వూరం గూల నేసియు నిడంబుల సడించియు శరశరాసనసంచయంబులం ద్రుంచియు బూరగొమ్ముల వమ్ముజేసియుఁ జక్రంబుల వ్రక్కలించియుఁ గైదువు లైదుపది చేసియుఁ గరంబులు కత్తిరించియు శిరంబు లుత్తరించియు సంశప్తకసైన్యంబు దైన్యంబు నొందించుటయును. 4

ఉ. వారలు సుట్టి ముట్టి కడు వాఁడి వెలార్చు వేఁడితూపులన్
దోరణ గట్టునట్లు వడితో నిగిడించుచు నొంచి మించినన్
ధీరుఁడు వీరవిక్రమము తేటపడం దన తేరు వాఱఁ దా
నారణభూమి నెందుఁ గన సం దయి తోఁచుచుఁ బోలె వారలన్. 5

వ. అయ్యవసరంబునఁ గృపకృతవర్మసౌబలులు రథానీకంబులతోడం గూడి కౌసల్యకాశ్య మాత్స్యకారూశకైకయులతోడం బాంచాలచేదిసృంజయులతోడం దలపడి దారుణ

రణంబు గావించి రంత ననుజాతసహితుం డగుదుర్యోధనుండు మద్రమహారథపరి
వృతుం డై కర్ణునకుం బాసట యయ్యె నంతఁ గర్ణుండును బాండవపాంచాలసైన్యం
బులతోఁ దన్నుఁ మాఱ్కొనిన శైనేయు మాఱ్కొని పోరుచు వేనవేలం గూల
నేసి యుధిష్ఠిరుం దాఁకుదెంచె ననిన ధృతరాష్ట్రుం డట్లు దాఁకుదెంచునాధిరథి
నెవ్వ రడ్డగించి రెవ్వనితో నెట్టిబెట్టిదంపుఁబో రయ్యెం జెప్పు మనిన సంజయుం
డి ట్లనియె. 6

మ. సమరప్రాంగణమందుఁ బొందుపడి ధృష్టద్యుమ్నముఖ్యారిసై
న్యమహోదారులఁ గాంచి కర్ణుఁడు రణవ్యాపార మేపారఁ జా
పము మ్రోఁగించుచు వారి మాఱుకొనియెన్ వారున్ వరారంభు లై
సముదాయోద్ధతి వాని మాఱుకొని రాశాచక్ర మల్లాడఁగన్. 7

—కర్ణుండు విజృంభించి పాండవసేనపైఁ గవియుట—

చ. ద్విరదరథాశ్వనిస్వనము వీరజనోద్ధితసింహనాదమున్
శరపతనారవంబు వరశంఖనినాదము భేరికారవం
బురుతర మై సముద్భవము నొంది నభోంతరమందు నిండె భూ
ధరములతోడ భూతలము దద్దఱిలెం దెఱలెం బయోనిధుల్. 8

తే. అమ్మహారావమునఁ బెక్కు లల్పసత్త్వ, ములు మృతము లయ్యె నపు డస్త్రములు వెలుంగ
నాధిరథి దైత్యసైన్యము నఱుము నింద్రు, పగిదిఁ బాండవసైన్యముఁ దగిలి పెనఁగె. 9

సీ. వైకర్తనుని వేఁడి వాలంపగముల డె, బ్బది యేడ్వు రైన ప్రభద్రకులును
బంచవింశతి వీరపాంచాలవీరులు, వేనవే ల్చేదికుల్ విడిచి రుసురు
లపుడు పాంచాలమహారథుల్ పెక్కు రా, కర్ణుని నడరిన గడఁక నతఁడు
భానుదేవునిఁ జిత్రసేను సేనాబిందు, శూరసేనతపనశూరవరుల

తే. ద్రుపదపుత్రుల నేవురఁ ద్రుంచు నంత, నొక్కపెట్ట హాహాకార ముప్పతిల్లఁ
బెల్లడరువీఁకఁ బాంచాలవీరదశక, మఱియు నింతలో వారిఁ గీటడఁచె నతఁడు. 10

వ. అంతఁ బృష్ఠగోపుఁ డై జ్యేష్ఠపుత్త్రుం డగువృషసేనుండును జక్రరక్షకు లై కనిష్ఠ
పుత్త్రు లగుసుషేణసత్యసేనులు నోల మాన గొనక కర్ణునకుం బాసట యై బవరం
బీసునఁ జేయుచుండ ధృష్టద్యుమ్నుండును సాత్యకియు ద్రౌపదేయులును భీమ
సేనుండును శిఖండియు జనమేజయుండును బ్రభద్రకులును జేదికైకేయమత్స్యపాం
చాలప్రముఖు లనేకులు నాకర్ణుం జుట్టుముట్టి బి ట్టేయుటయు నట్టియెడ. 11

మ. వసుషేణాత్మజుఁ డాసుషేణుఁడు వడిన్ వాతాత్మజుం దాఁకి వీఁ
క. షుమాళింపఁ దదీయకార్ముకము త్రుంగం జేసి తద్వక్షమం

దెసఁగం జొన్పి నిశాతసాయకము లే డింతింతనా కార్జునుఁ
వెస భీముండు మఱొండు విల్లు గొని దోర్వీర్యం బవార్యంబుగన్. 12

ఆ. వానివిల్లుఁ దునిమి వాలమ్ము లీరైదు, వానిమేన నిలిచి వానితండ్రి
నేడుపదులమూఁడువాఁడితూపుల నొంచి, భానుసేనుఁ గూల్చెఁ బదిశరముల. 13

ఆ. సుహృదు లెల్ల జూడ సూతాశ్వరథధనుః, కేతుయుతము గాఁగ సూతసూతి
సుతుని నఱ్ఱు కూల్చి చూప నగ్గింప నీ, వారిమీఁదఁ గవిసి వాయుసుతుఁడు. 14

మ. కృపహార్దిక్యులు కార్ముకమ్ములు దెగం గీలించి గుర్వాసనున్
సుపరిష్కారశరత్రయమ్మునఁ గముల్ నొప్పించి గాంధారధా
త్రిపుపై నేసి సుపత్రిపత్కమొక పత్రిం గై నులూకున్ రథ
వ్యపకర్షంబున నోర్చి చచ్చితి సుషేణా యంచు నె గ్గించుచున్. 15

క. వడి గలనారస మొక్కఁడు, వడముడి సంధించి వానిపయి నేయుఁడుఁ గ
ర్ణుఁడు దాని మూఁడుతూఁపుల, నడుమన్ ఖండించె నిజతనయరక్షకుఁడై. 16

ఉ. దానికి భీమసేనుఁ డెడఁదం గడు నల్గి సుషేణుపై శితా
నూనశరం బొకండు గొని యుద్ధతి చేయుఁగు నంగనాథుఁ డ
ద్దానిని దొంటియట్ల నఱి దారిన ద్రుంచి వృకోదరుం గరం
బానుకొనం ద్రిసప్తతిశితాశుగవిద్ధునిఁ జేసె నీసునన్. 17

ఆ. అంతలో సుషేణుఁ డపరి చేతికవిల్లు, పట్టి నకులు నేనుప్రదరములను
భుజభుజాంతరములఁ బొంద నేయుఁడు నతం, డతని నిరువదింట నడచి యార్చె. 18

వ. ఆర్చినం బేర్చి సుషేణుండును. 19

మ. పదిబాణంబులఁ జొప్పి చాపమును ద్రుంప నొప్పింప మాద్రీసుతుం
డుదితక్రోధత నొండువిల్లు గొని వీరోద్వృత్తి ముమ్మాఁడు మేల్
ప్రదరంబుల్ గొని మూఁటఁ గర్ణసుతునిన్ బైమూఁటఁ దత్సారథిన్
జెదియం జేసి తదీయచాపమును ద్రుంచె న్మాఁట నాటోపుఁడై. 20

చ. మఱియు నొకండు విల్లు గొని మానధనుం డగుకర్ణనందనుం
డఱువదితూఁపు లంనకులునంగముల న్నాఁగులంగ నేసి యా
డ్డెఱ సహదేవుఁ డాఁగుటయుఁ దెప్పున నేడిట వాని నొంచె గ
త్తఱిఁ గడు ఘోరయుద్ధము ప్రదర్శితమయ్యెఁ బరస్పరంబునన్. 21

సీ. సత్యకసుతుఁ డప్డు శౌర్యధుర్యుం డయి, మార్కొని వృషసేను మార్గణత్ర
యమున సూతునిఁ జంపి హయముల నేఁడింటఁ, జక్కాడి యొక్కొక్కసాయకమున
విల్లునుఁ బడగయు విఱిచి మూఁడమ్ము లా, తనివక్షమూఁడంగ ద్రోనుపుటయును

వివశుఁ డై క్షణమాత్ర వృషసేనుఁ డరదంబు,పయి వ్రాలి కొండొకవడికిఁ దెలిసి

తే. ఖడ్గఖేటంబులం గొని కడఁగునంత, సాత్యకివరాహకర్ణపృషత్కదళక
మునను వానిని నుగ్గాడఁ గని విరథుని,వానిఁ గొనిపోయె రాజరాజానుజుండు. 22

వ. ఇట్లు కర్ణపుత్త్రుండు దుశ్శాసనరథంబుపై నుండి కొండొకవడికి సేదదేరి యొండొక్క-తే రెక్కి- వచ్చి ద్రౌపదేయుల డెబ్బదిమూఁడింటను యుయుధాను నేనింటను భీమసేను నఱువదినాలుగింటను సహదేవు నైదింటను నకులుని ముప్పదింటను శతానీకుని నేడింటను శిఖండిని పదింటను ధర్మరాజు నూఱింటను నొనేసి తక్కు-నుం గలవారిఁ బెక్కు-నారసంబుల నుక్కు-నంచి మొప్పటియట్లు తండ్రి తేరివెనుక రక్షకుం డై నిలిచియుండె నయ్యవసరంబున. 23

శా. శైనేయుం డాకోపతాపకలితస్వాంతుండు దుశ్శాసనుం
గానం బోయి నవాశుగంబులను సంకర్షించి తత్సూతుఁ ద
త్థ్సానాశ్వంబులఁ దద్రథంబు ధర మీఁదం ద్రెళ్ళఁ గా నేసి స
న్మానం బేర్పడఁ దల్లలాటమున నెన్నఁగ నాఁటె మూఁడమ్ములన్. 24

క. విరథుఁ డయి దుస్ససేనుఁడు, ధరణికి డిగి సూతకల్పితం బగురథమొం
డరసి పయి నెక్కి- కర్ణుని,పరిసరమున బెం పెసంగ బవర మొనర్చెన్. 25

వ. అట్టిసమయంబున ధృష్టద్యుమ్నుం డైదను ద్రౌపదేయులు డెబ్బదిమూఁడును శైనేయుం డేడును భీమసేనుం డఱువదినాల్గును సహదేవుం డేడును శిఖండి పదియును యుధిష్ఠిరుండు నూఱును దక్కు-నుంగలవారు పెక్కు-లును బ్రదరంబులం బ్రయోగించి సూతపుత్త్రు నొప్పించిన నప్పురుషవరేణ్యుండు శరసంధానమోక్షంబు లెఱుంగ రానితెఱంగునం గరలాఘవంబు పొదుఁక సం దున్నవారి నందఱం బదేసి నారసంబుల నొనేసి చాపహస్తుం డై నృత్యంబు సేయునట్లు చూపట్టి భూమ్యంతరిక్షాంతరాళం బంతయు నిజనారాచంబుల నిండించి రణప్రదేశం బంతయు వరుణాస్త్రనిర్మితాకారంబునం బొదఁ జేసి మఱియుం దనపై నెవ్వ రెవ్వ రెన్ని యెన్ని బాణంబు లేసిరో వారిపై నంతకు మూఁడంత లెక్కు-డుగ నేసియు నంతం బోక శతంబులుగను సహస్రంబులుగను శరంబులు నిగిడించి చతురంగబలంబు సొచ్చి కరిఘటలం బరిమార్చి గుఱ్ఱపుదళంబులం గూల నేసి రథకదంబంబు నుగ్గునూచంబు గావించి కాలుమానులం గండడంచి ముప్పదుండ్రఁ జేదిపతులఁ గుప్పగూల్చి పెచ్చ నార్చుచుం జేర్చి యుధిష్ఠిరునిం దఱియఁ జేరుటయు సాత్యకిశిఖండిప్రముఖపాండవవీరు లప్పాండవాగ్రజుం బరిరక్షింపుచుఁ గర్ణుం దాఁకి వివిధాస్త్రశస్త్రంబులం బ్రయోగించుచుండ నీవారును గర్ణుం బరివేష్టించి రప్పు డిరువాగునందును శంఖనాదసింహ

నాదభేరీనాదంబులు బోరుకలుగం బోరు ఘోరం బయ్యెనయ్యెడం గర్ణుండు సముదీర్ణ పరాక్రమక్రముం డై పాండవపాంచాలచమూసమూహంబులపై నానాయుధశతసహస్రంబులం బఱపి తెఱపి లేకుండ శిరంబులు ద్రుంచియుఁ గరంబులు త్రెంచియుఁ దొడలు పొడిచేసియు మెడలువిఱిచియుఁ బక్షంబులు వ్రచ్చియు వక్షంబులు వ్రచ్చియు నిచ్చ వచ్చినమచ్చునం జేతులతీఁట వోవ నేటులాడుచున్నంత. 26

క. వెఱ చఱచి పఱచె సేనలు, నెఱి దప్పిన వగుట నపుడు నెగు లరసి కడున్
గఱ కెక్కి సత్యకాత్మజుఁ, డఱుకుఁడ యని పుచ్చె ద్రావిడాదుల ననికిన్. 27

వ. అట్లు పుచ్చుటయును. 28

ఉ. ద్రావిడులు న్నిషాదులును దద్వచనంబునఁ జోదితాత్ము లై
చావునకుం దలంక కతిసంభ్రమ మేర్పడఁ గర్ణుఁ దాఁకినన్
జేవ నతండు వారలను జిందఱ వందఱఁ జేయ నెల్లరున్
బ్రోవులు గాఁగఁ గూలి రిలఁ బూరువులో యనుబుద్ధి దోఁపఁగన్. 29

ఆ. అట్లు యోధశతసహస్రముల్ వెగునంతఁ, బాండవబలమందు దండిమగలు
కడఁగి యెక్కి పెట్ట కర్ణునిపైఁ బడి, విసరి రస్త్రశస్త్రవిసరములను. 30

వ. కర్ణుండును బ్రహ్మవిదులను మృత్యువుం బోలె వారిఁ గడవ నేరకున్నంత నంతికగతుం డైనవానిం గని కౌంతేయాగ్రజుండు క్రోధసంరక్తలోచనుం డయి యిట్లనియె. 31

—కర్ణుండు ధర్మరాజుతో ఘోరయుద్ధము సేసి యోడించుట—

మ. ధృతరాష్ట్రాత్మజు దుర్మతంబునఁ గడుం దీండ్రించి మాక్రీడితోఁ
బ్రతియోగంబున స్పర్థ సేయుచు మమున్ బాధింపఁగా నెంతు స
తత మోరోరిజఘన్యజాధమ! భవద్బాహాబలాధిక్య ము
ద్ధతియున్ వీర్యముఁ జూపు మోపితివ తత్సర్వంబు ఖర్వం బగున్. 32

క. అని పలికి పాండునందనుఁ, డనిశరసాధ్యోన్నతాయసాశుగదశకం
బున నొడలు గాఁడ రవినందను నేసెం గ్రోధఘూర్ణితస్వాంతుం డై. 33

క. రాధాసుతుండు నవ్వుచుఁ, గ్రోధంబున వత్సదంతరోపము లీరై
దాడిఁ జనింపఁగ ధర్మజుపై ధాతువు లాఁడ నేసెఁ బ్రద్వేషమునన్. 34

ఉ. ఆజ్యము వేల్వఁ బ్రజ్వరిలునగ్ని తెఱంగున నుగ్రమూర్తి యై
పూజ్యుఁడు ధర్మనందనుఁ డపూర్వపరాక్రమ మేర్పడన్ వడిన్
సజ్యము చేసి కార్ముకము శాతశరం బరివోసి యాశలం
బ్రాజ్యతరారవంబు పఱపై దివిఁ బర్వఁగఁ జేసె నీసునన్. 35

ఉ. కొండలఁ బిండి సేయుశతకోటికి దీటగునమ్మహాశుగం
బుండినయట్టు లుండి కనుచుండఁగఁ గర్ణునివామపార్శ్వ మొం
డొండఁ జొఱంగఁ బాఱుటయు నోజ సెడంగఁ బ్రకంపితాంగుఁడై
బెం డయి వ్రాలెఁ దేరిపయి వీడి శరంబు శరాసనంబునున్. 36

తే. సొమ్మ సోలినకర్ణునిఁ జూచి నీదు, సేన హాహారవంబునఁ జెన్ను దఱిగె
రాజవిక్రమ మరసి యరాతిసేన, సింహనాదము గావించెఁ జెన్నుమీఱి. 37

సీ. అంతఁ గొండొకవడి కాసొమ్మ విడ, దేఱి, రాధాసుతుం డతిక్రోధ మెసఁగ
విజయనామక మైనవింటి నారిని సారె, సారెకు సారించి క్రూరశరము
లాకుసువీరుపై వీఁక నేయుచు వాని, చెంతఁ జంద్రుని చెంతఁ జెన్నుమీఱు
నలపునర్వసుబుతకములఁ బోలు నిసుపురం, జక్రరక్షకులను జంద్రదేవ

తే. దండధారులఁ జా నేసి దండి కెక్కు, దండధరసూతి కాలరుద్రక్రమమున
మండిపడి క్రోధమునఁ జేసె మార్గణాళి, గుప్పె రాధేయురథమును గప్పె మఱియు. 38

వ. మూఁడు మూఁడు వాఁడితూపుల సుషేణసత్యసేనుల నోనేసి తొంబదియంబకంబుల మద్రనాథు మర్దించి డెబ్బదిమూఁడువాలమ్ముల నంగపతి యంగసంధు లెపలించి మూఁడేసినిశాతసాయకంబుల వారికిం బాసట యగువారినెల్ల నొల్లఁ బోఁ జేయుటయు నల్లన నవ్వి యవ్వైకర్తనుం డొక్కభల్లంబునఁ బాండవాగ్రజు విల్లు విఱిచి యఱువదివాలికతూపు లతనిపై నేసి సింహనాదంబు చేసినంతఁ గౌంతేయరక్షాతత్పరులై సత్వరంబున యుయుధానుండును యుయుత్సుండును జేకితానుండును బాద్యుండును ధృష్టద్యుమ్నుండును శిఖండియు ద్రౌపదేయులును బ్రభద్రకులును నకులసహదేవులును భీమసేనుండును జనమేజయుండును శిశుపాలనందనుండును గారూశమత్స్యకైకేయకాశికోసలవీరులును వసుషేణుం దలపడి వరాహకర్ణనాళీకవత్సదంతవిపాఠక్షురప్రచటకాముఖనానావిధశిలీముఖంబులఁ జుట్టుముట్టి తెట్టలు గట్టునట్టు కొట్టుటయు నతండును. 39

మ. అతికోపంబునఁ దాప మేసపడ బ్రహ్మాస్త్రంబు సంధించి సం
తతశాతాశుగసంతతుల్ చెసల నిండం జేయుచుండం గ ను
న్నతబాణార్చుల పేర ముష్టమును గా నల్వొంది కర్ణానలం
బతిమాత్రంబుగ నీఱు చేసె నరిసైన్యారణ్యభాగంబులన్. 40

తరలము. అలఁతినవ్వు తురంగలింపఁగ నంగభూవిభుఁ డుగ్రుఁడై
జ్వలదయోమయసాయకంబునఁ బాండవాగ్రజు చేతివి
ల్లలుక జర్జరితంబు సేసియు నక్కతొంబదితూపులన్

మీఁదట నిటుపో రుడుగుము, మాదృశులం దొడరు టరయ మల్లడిక యగుఁగా. 48

వ. అని చెందనాడి విడిచి పుచ్చి తా నప్పాండవబలంబు సొచ్చి వజ్రహస్తుం డసురులం బోలె మేటిపోటరులం గీటడంపం దొడంగె నజాతశత్రుండును వ్రీడాభరంబునం జేసి విన్నఁ బోయిన మానంబుతో జన్యంబు వీసి పరాఙ్ముఖుం డయి పోవం గని మాద్రేయద్రౌపదేయసాత్యకిప్రముఖులు చేదిపాంచాలపాండవసైన్యంబులతో దైన్యంబు నొంది కాందిశీకు లైరి కర్ణుండునుం గౌరవవీరసమన్వితుండై భేరీమృదంగారవంబులు సింహనాదంబులు శంఖధ్వానంబులుం జెలంగఁ బొంగుచు వారి వెన్నడించె నంతఁ గాంతేయాగ్రజుం డట్లు వోయి శ్రుతకీర్తిరథం బధిష్ఠించి రాధేయునికోల్తలకు నోహటించి కాల్యమానం బైననిజసైన్యంబుం గని తమవారిం బురికొల్పుటయు భీమసేనప్రభృతు లెల్లఁ బెల్లుఱేఁగి మూఁగి మనవారిం బోరఁ దాఁకుదెంచుటయు నిరువాఁగునందును లెండు గండుమిగులుఁడు ముట్టుఁడుకొట్టుఁడనునులివుతుములంబుగా శరవర్షంబునుం దుములం బయ్యె నయ్యెడ. 49

చ. కరులు దెగెఁ హరుల్ సమసెఁ గాల్వురు వ్రాలిరి తేరులుం ధరం
బొరలెఁ బతాకలుం బడియెఁ దోమరశక్తిగదాముఖాయుధో
త్కరములు గుప్పగాలె రథికవ్రజముల్ విగతోత్తమాంగమై
నరథకుటుంబి యై సమసె నంతత మయ్యె నసృక్ప్రవాహముల్. 50

క. భువి నట్లు వీరయోధులు, రవ ముత్కట మగుచు నపుడు రవరవ వడినో
దివి నట్లు నాకవాసులు, రవళియు విన నయ్యెఁ బ్రథుతరంబై పదుచున్. 51

చ. హతు లగువీరయోధులసహస్రములం గొని పోవ వేల్పురా
మతమున వచ్చి వారలవిమానములం దిడికొంచు వేలుపుల్
నతతము వోవుచో నరసి స్వర్గసుఖంబున కాసఁ జేసి స
న్నుతగతిఁ బోరి శూరులు గనుంగొను చుండఁగఁ గూలి రెందఱున్. 52

సీ. పత్తులుం బత్తులు హత్తులుం హత్తులు, రథికులుం రథికులు రభసమునను
గదిసి పోరెడునప్పు కలిగి పరాగము, నేలయు నింగియు నిండికొనిన
నెదిరిఁ ద మ్మెఱుఁగక యెదు రైనవారలఁ, దలపడి మల్లయుద్ధమ్మునకును
మొనసి కచాకచియును నఖానఖియు దం, తాదంతి గాఁ బెద్దతడవు పెనఁగ

తే. శకలములు గాఁగఁ జతురంగసైన్యములను, నెత్తురేఱులు వాఱ న మ్మొత్తమందు
మునిఁగి తేలియుఁ ద్రావియుఁ బుక్కిలింత, లయ్యు నిరువాఁగునుం జోదు లైరి యిట్లు.

క. వసనంబులు వర్మంబులు, వసుమతియుం దెసలు దివియుఁ బరికింపఁ గ న

మీఁదట నిటుపో రుడుగుము, మాదృశులం దొడరు టరయ పల్లడిక యగున్. 48

వ. అని చెండనాడి విడిచి పుచ్చి తా నప్పాండవబలంబు సొచ్చి వజ్రహస్తుం డసురులం
బోలె మేటిపోటరులం గీటడంపం దొడంగె సజాతశత్రుండును వ్రీడాభరంబునం జేసి
విన్నఁ బోయిన మానంబుతో జన్యంబు వీసి పరాఙ్ముఖుం డయి పోవం గని మాద్రే
యద్రౌపదేయసాత్యకిప్రముఖులు చేదిపాంచాలపాండవసైన్యంబులతో దైన్యంబు
నొంది కాందిశీకు లైరి కర్ణుండునుం గౌరవవీరసమన్వితుండై భేరీమృదంగారవంబులు
సింహనాదంబులు శంఖధ్వానంబులుం జెలంగఁ బొంగుచు వారి వెన్నడించె నంతఁ
గౌంతేయాగ్రజుం డట్లు వోయి శ్రుతకీర్తిరథం బధిష్ఠించి రాధేయునికోల్తలకు
నోపాటించి శాల్యమానం బైననిజసైన్యంబుం గని తమవారిం బుజ్జిగొల్పుటయు
భీమసేనప్రభృతు లెల్లఁ బెల్లుత్తేఁగి మూఁగి మసవారిం బోరఁ దాఁకుదెంచుటయు
నిరువాఁగునందును లెండు గండుమిగులుఁడు ముట్టుఁడుకొట్టుఁడనునులివ్రుతులంబు
గా శరవర్షంబునుం దుములం బయ్యె నయ్యెడ. 49

చ. కరులు దెరలెన్ హయుల్ సమసెఁ గాల్బరు వ్రాలిరి తేరులున్ ధరం
జేరఁగెఁ బతాకలుం బడియెఁ దోమరశక్తిగదాముఖాయుధో
త్కరములు గుప్పగూలె రథికవ్రజమున్ విగతోత్తమాంగమై
వరథకుటుంబి యై సమసె నంతత మయ్యె నసృక్ప్రవాహముల్. 50

క. భువి నెట్లు వీరయోధుల, రవ ముత్కట మగుచు నపుడు రవరవ వడెనో
దివి నట్లు నాకవాసుల, రవళియు విన నయ్యెఁ బృథుతరంబై పడుచున్. 51

చ. హతు లగువీరయోధులసహస్రములం గొని పోవ వేల్పురా
మతమున వచ్చి వారలవిమానములం దిడికొంచు వేలుపుల్
నతతము వోవుచో నరసి స్వర్గసుఖంబున కాసఁ జేసి స
న్నుతగతిఁ బోరి శూరులు గనుంగొను చుండఁగఁ గూలి రెందఱున్. 52

సీ. పత్తులుం బత్తులు హత్తులున్ హత్తులు, రథికులున్ రథికులు రభసమునను
గదిసి పోరెడునప్డు కలిగి పరాగము, నేలయు నింగియు నిండికొనిన
నెదిరిఁ ద మ్మెఱుఁగక యెదు రైనవారలఁ, దలపడి మల్లయుద్ధమ్మునకును
మొనసి కచాకచియును నఖానఖియు దం, తాదంతి గాఁ బెద్దతడవు పెనఁగ

తే. శకలములు గాఁగఁ జతురంగసైన్యములను, నెత్తురేఱులు వాఱ న మ్మొత్తమందు
మునిఁగి తేలియుఁ ద్రావియుఁ బుక్కిలింత, లయ్యె నిరువాఁగునుం బోదు లైరి యిట్లు.

క. వసనంబులు వర్మంబులు, వసుమతియుం దెనలు దివియుఁ బరికింపఁ గ న

స్థితిమెసంగఁగ లోహిత, వివరంబున నెల్లరకును వెక్కస మగుచున్. 54

వ. అతిరథుల నమరంబున భీమసేనసాత్యకిప్రభృతు లురవడించి బరవసంబు నేయ సింహార్దితం బయినసింధురకులంబు పోలె లోద్యమానం బై నీవారిబలం బెల్ల వెఱచఱచి పఱచిన నగ్గి సుయోధనుండు వా యెత్తి యడ్డమగుచు నిలుం డని వారించి నను నిలువ కున్న సౌబలప్రముఖులు పెల్లు రేఁగి వృకోదరునాఁగఁ దమకించు నంతఁ గర్ణుం డుదీర్ణక్రోధుం డై మద్రనాథుం జీరి మనరథంబు భీమసేనరథపరిసరంబునకుం బోవనిమ్మనిన నతండట్లయగుం గావుశమనిహాంసవర్ణోత్తమాశ్వంబుల నట్లొప్పఁ ద్రిప్పుటయు నప్పవమాననందనుం డాసూతనందనుం బిలకించి ధృష్టద్యుమ్నసాత్యకులం జే వీచి పిలిచి యి ట్లనియె. 55

—భీమసేనుండు కర్ణు నోడించి విరథుం జేయుట.—

ఉ. సూతసుతుండు నేఁ గనులఁ జూచుచునుండఁగ ధార్తరాష్ట్రునిం
బ్రీతునిఁ జేయుపొంటె మనపెద్దను బట్టెను బెద్దనందియుం
బాఁతము వాయ నట్టివిషాదము నాకుఁ దీఱఁగా
సి... జేసి కోఁ దలంచు ...కయ్యమునందు వింటిరే. 56

క. ఇతని కర్ణువిరణము ... నాతఁడు ననుఁ జంపు టొండెఁ గలుగు
... పిల్లడపట్టిరి ... గావలి యగుఁడు మీరు. 57

...లికిన యనంతరంబ 58

ఉ. దిక్కులు పిక్కటిల్లెడుగతిం బచరించుచు సింహనాద మా
నక్కటికిఁ రయంబునను స్యందనముం జవ నిచ్చి పేర్చి పెం
పెసఁ భీమసేనుని సమీపతలమ్ము బొనరించి మద్రరా
జిక్కరణి న్వచించె గివసేంద్రకుమారునితోడ వేడుకన్. 59

మ. తగ నీక్షించితె వాయుపుత్త్రు నృపమిత్రా! దీర్ఘ కాలాగ్నితం
బగుక్రోధంబును నీపయి న్విడుచునీహ న్వచ్చుచున్నాఁడు వేఁ
డిగ వీక్షించుచు నర్జునాత్మజుఁడు హైడింబుండునుం బోరునం
దెగి నష్టేనియు నిట్టిబెట్టిదపు మూర్తిం గల్గుటం గంటిమే. 60

క. ముల్లోకంబుల సేనియు, నల్లన గెలువంగఁ జాలు నత్యంతబల
ప్రోల్లసి తూపుఁ డీతం, డెల్లవిధంబులను మిత్త్రి కెత్తగు నగయన్. 61

వ. అమ్మద్రేశ్వరుండు పలుకుచున్నంత నంతకాంతకుం డన నంతికగతుం డగుచున్న ... జూచి నవ్వుచు నవ్వసుషేణుండు శల్యున కిట్లనియె. 62

చ. అగు భగ్న నీవు శాకాసునిన దంతయు నెంతయు నిక్కువంబ యి
య్యగణితబాహువిక్రముఁ డనంతబలప్రథితుండు భండనం
బగునటు లైన నిశ్చలమునఁ గాన రొనర్చెఁడు వీనిచెయ్దముల్
జగతి నెఱుంగనట్టి దొకజంతువు నేనియు లేమిఁ జెప్పెదన్. 63

చ. బిరుదుమగం డితండు గడుబీరము చేసి విరాటుపీట నె
వ్వరికి నెఱుంగ రానిగతి వర్తిల నర్తనశాలఁ గీచకుం
గర మరుదార జాచియును గాలునిప్రోలికిఁ ద్రోచె దత్సహో
దరులను జెఱికిం గొనక ద్రౌపదికోర్కి భుజాబలంబునన్. 64

క. కింకరపరివృతుఁ డగుచున్, బింకంబున దండపాణి పేరిసునఁబై
నుంకించి పోర వచ్చిన, జంకఁడు పిఱుతివియఁ డితఁడు సంగరమునకున్. 65

వ. అని మఱియును. 66

మ. నరునిం జంపుటకో లేక చేనతని చెంతం జచ్చుటో కోర్కియై
చిరరాత్రంబున నుండి నామనమునం జట్టాడు నేఁ డీవృకో
దరునిం బట్టి వధించిన న్విరథుఁడై తర్లంగఁ గావించినన్
గర మల్కన్నరుఁ డెత్తి వచ్చు ననుఁ దాఁకం గోర్కి సిద్ధింపఁగన్. 67

తే. కావునం జేరు వో నిమ్ము నావుడు విని, శల్యుఁ డిట్లను నీప్రభంజనకుమారు
గెలిచి పదపడి ఫల్గుసుఁ గదిసి నీమనోరథము దీర్చుకొనుమని తేరు వఱపె. 68

ఉ. అర్యమనందనుం డటు రయంబున వచ్చుటఁ గాంచి భీముఁడున్
ధైర్య మెసంగఁ గా నదిరి తాఁకెను వారిసమాగమంబునం
దూర్యనినాదముల్ సెవులు తూఁటులు గట్టఁగఁ బుట్టె దిక్కులన్
స్థైర్యముఁ గాంచెఁ బిక్కటిలి నింగియు నేలయు నిండె మెండుగన్. 69

మత్త. భీముఁ డంతట శత్రుసైన్యము బీఱువోవఁగఁ జేయుచున్
దీమసంబున సూతపుత్రునిఁ దీక్ష్ణసాయకపంక్తులన్
సోమ మేర్పడ నేయ నాతఁడు సూచి యేచి తదీయవ
క్షోముఖంబున నేసి యుల్లులసోన లెల్లెడ నించినన్. 70

తే. కనిసి భీముఁడు తొమ్మిదిసునిశితాశుగములఁ గర్ణుని నేయ నాఘనభుజుండు
భీమసేనునివిలుఁ ద్రుంచి భీమశరము నొక్కం డురం బాఁడఁ గా నేసె గంతుమిగిలి. 71

సీ. అంతట నొండువిల్లాతఁడు గొని కర్ణుమర్మముల్ నొవ్వనేసి మార్గణములఁ
బెలుచ నార్చుటయు నవ్వృషుఁ డిర్వదియు నైదు, తూపులఁ దాపత్సు నేసి పసంచె

నాశుగభిన్నాంగుఁ డగుట నతిక్రోధమూర్ఛితుం డయి పాండుపుత్త్రుఁడపుడు
కన్నులింగలములఁ గనుచుండఁ గొండలఁ బిండి సేయఁగఁ జాలు కాండ మొకఁడు
తే. వింట నరిబోసి యీపున వ్రేయుటయును, వజ్రసమనిస్వనమున నబ్బాణవరము
కొండ నగిలించునట్లు మార్తాండసుతుని, కాయమున దాఁకి వేధించె ఘనతరముగ.
ఉ. అమ్మహనీయబాణ మటు లాయువుపట్టున బెట్టు తాఁకినన్
సొమ్మ మునింగి తేరిపయి సోలెఁ జమూవిభుఁ డెంతయేని య
ట్టమ్మయి యున్నవానిగతి నారసి మద్రమహీధవుండు శీ
ఘ్రమ్మున నర్రథమ్ము తొలఁగం గొని పోయె రణోర్విదవ్వుగన్. 73
ఆ. కర్ణుఁ డట్లు సోలి కాండశీర్ణుఁడైన, నగ్గి గాడ్పునట్టి బెబ్బులి యనఁ
గవిసి కురుబలంబుఁ గలఁగింప నరయుచు, దెఱలి పఱచె నాల్గు దిక్కులకును. 74
వ. అని చెప్పిన నాంబికేయుం డక్కటా యని యొక్కింత పొక్కి సంజయుదిక్కు మొగంబై యిట్లు భీమసేనుండు దుష్కరం బైన కార్యంబు గావించెఁ గర్ణుం డొక్కరుండె ఖండఖండంబులుగ బాండవపాంచాలబలంబులం బరిమార్చు నని మాసుయోధనుండు మాటిమాటికిం జెప్పుచుండు నట్టి జెట్టి యిట్లయిన పదంపడి యెట్టు లయ్యెం జెప్పు మనిన సంజయుం డిట్లనియె నట్లు రణవిముఖుం డయిన రాధేయుం గని మాసుయోధనుండు తనతమ్ములం బిలిచి భీమసేనభయ మ్మనునగాధసముద్రమ్మున మునింగిన కర్ణుం గావుం డని నియోగించుటయు శ్రుతవంతుండును దుర్ధరుండును క్రాథుండును వివిత్సుండును వికటుండును సముండును నిషంగియుఁ గవచియు బాశియు నందుండు నుపనందుండును దుష్ప్రధర్షుండును సుబాహుండును వాతవేగుండును సువర్చసుండును ధనుర్గ్రాహుండును దుర్మదుండును జలసంధుండును శలుండును సహుండును నను కౌరవకుమారులు రథంబు లెక్కి పెక్కురథంబుల వారితో నొక్కమొగి నెదుర్కొనులు పావకుం బోలె గాలింపం జుట్టుముట్టి బెట్టంప సోనఁ గట్టియలు నిట్టవాడుచుటయు నతండును గడు మిగిలి యేనూట యేబండ్రు రథికులం బిలుకుమార్చి పెచ్చి వివిత్సుకుండలమండితగండస్థలశస్త్రాననమస్తకం బొక్కభల్లంబున డొల్ల నేసి కినిమసంగి వికటుల సముప్రాణంబులం దీసి త్వరితుం డై క్రాథునిం గాలతురయంబునకుఁ బుచ్చి పిచ్చలివిడిం బెట్టు నన్నందోపనందుల మ్రందించి

* కర్ణుండు మూర్ఛవోయియున్నప్పుడు భీమసేనుఁడు వాని రథంబు మీఁదకిం జని వానినాలుక కోయఁ బోవుటయు నట్లు చేయఁ దగదని శల్యుఁడు వారించుటయుఁ జెక్కుప్రతులయందు గానిపించుట లేదు కావున నిట వ్రాయఁ బడలేదు.

నీనందనులు తక్కటివా రుక్కుదక్కి పిక్కబలంబు చూపి రంతఁ గొంతలోన
మూర్ఛం దేలి కర్ణుండు నీకొడుకు లార్వురుం దెగటార్చుటకును బెంగంబునొచ్చివిచ్చు
మొగ్గయగుటకును వెచ్చనూర్చి వారువంబులం దోలించుకొని గాలిపట్టిపాలికిం జని
కీలిం బోలి వాలంపగములు తుమురులంబులుగా నడరించుటయు. 75

— భీమసేనుండు గదాపాణియై కౌరవబలంబు నుగ్గుసేయుట —

శా. కయ్యం బియ్యెడ నెట్టులయ్యెడినో వీఁకం గిట్టి రియ్యెక్క రం
చయ్యెచోట్ల నుండి చూపఱు గనన్ హుంకార మేపాఱ నొ
య్యొయ్యన్ డాసి వృకోదరుం డతనిపై నుగ్రాశుగశ్రేణిఁ మేన్
ప్రయ్యన్ వైచె భవత్కుమారు లెడలన్ వాపోవుచుం జూడఁగన్. 76

సీ. క్రుద్ధుఁడై తొమ్మిది క్రూరభల్లంబులఁ, గర్ణుండు భీముని గాఁడనేసె
భీమవిక్రముఁడైన భీమసేనుఁడు సప్తసాయకంబులఁ గర్ణుఁ బాయ నేసె
నేసిన నతఁడు పెల్లిసున నాశీవిషంబు నా రోఁజుచు సంభ్రమమున
శరవర్షమున భీము నరదంబు గప్పెడు, నతఁ డాతనిం గప్పెఁ బ్రతిశరములఁ

తే. గౌరవేయులు విన నార్చెఁ గర్ణుఁ డలిగి, పదిశరంబుల నాతని బడలుపఱిచి
కార్ముకము లస్త్రకమ్మున ఖండరించి, సింహనాదము గావించె రంహముగను. 77

వ. అంతఁ గొంతవడికి. 78

మత్త. హేమపట్టవిభూషితంబును మృత్యుదండసమంబునై
భీమ మగుపరిఘంబు గైకొని బెట్టుత్రిప్పుచుఁ గర్ణుపై
భీమసేనుఁడు వైచి యార్చెఁ బృథ్వి దద్దఱి దాని నా
భూమిభృత్ప్రియుఁ డాశుగంబులఁ బోకడంచె నడించుచున్. 79

మ. పరిఘం బట్లయిపోవఁ జేవ చెడ కాపాంచాలమాపల్లభే
శ్వరపుత్త్రుండు శరాసనం బొకఁడు పెంపొందాల్చి పెక్కుల్ మహా
శరముల్ గుప్పి రథంబు గప్పె నపు డాశౌర్యోజ్జ్వలోన్మూర్తు లి
ర్వురు హర్యక్షము లట్లు రూక్షగతిఁ బోరుం జేసి రీ సేర్పడన్. 80

ఆ. అపుడు మూఁడుకోటికుటమ్ములు గొనయమ్ము, చెవికి దాఁకఁ దిగిచి జవము మెఱయ
నంగభూమినాథుఁ డనిలాత్మజునికాయ, మాడ నేసెఁ జూప ఱొ నసంగ. 81

చ. కనుఁగవ జేవురింప నిజకార్ముకమం దొక ఘోరసాయకం
బనుగతిఁ గూర్చి గాడ్పుకొడుకు కార్చుచు నత్తఱిఁ బేర్చి యేసినం
జని యది వానిమైమఱువు జర్జరితంబుగఁ జేసి కోడత్రాఁ

చనువుగఁ బుట్టలోఁ బడినయట్లు పడెం ధరణీతలంబులోన్. 82

మ. ధరణీకంప మనంగ భూప్రియుబలేశ దానాస్త్రహారంబులన్
గరిమం దప్పినయట్టి [illegible] ఘుఁ డొగిం గదిసించి కిం పస్త్రముం
దురలం [illegible] గ్రాసుగంబుల్ వ్రేకో
దరుమ [illegible] గాద్రు [illegible] గాణంబుగన్. 83

ఆ. మఱియు నొక మొకంట మహా. సూతుఁగాఁ జేసి, సారథిని నధించి నారసమున
విల్లు ద్రుంచి భీము విరథుని గావించి, పిన్న [illegible] వ్రేయ [illegible] దప్పుడు. 84

సీ. నవ్వుచు నవ్వాయునందనుం డరదంబు, డిగి గదాపాణియై డెగ్గరముగ
బలగంబునం బడి ప్రబలమూవిలను మేఘఘటలంబులం బలె భద్రకరుల
సప్తశతంబుల సమయించుటయు నశ్వ, పాదముల్ దెగియుఁ గంధరములు దెగియుఁ
దుండముల్ దెగియును గండముల్ దెగియును, దంతముల్ దెగి యుగాత్రములు దెగియు

తే. నొఱిగె ధరణికి బెడగొండ లో యనంద, నమచు నాగోపాకులతోడ నాయుధాళి
తోడ రత్నాంబరంబులతోడ వివిధ, కేతనంబులతోడ ఘంటికలతోడ. 85

వ. భూమిస్థుండై భీమసేనుం డిట్లు గదాహస్తుండు గానుపర్వేశ్వరుండు ధాత్రీధరంబులం బోలె దంతావళంబుల నురుముసేయుచు సుబలపుత్త్రప్రేరితులై గదయు వచ్చిన యేబదిరెండేనుంగులను నూఱుశతాంగంబులును బెక్కునూఱులు కాల్బమానుసుల నుక్కడంచి ప్రతాపాతపంబు గాయుచున్నయత నీటలం బగ్గలం బడవేయుచర్మంబు వలె ముడింగి పోడ వడంకి పోరు విడిచి వెఱచఱచి పఱవినం గని యేనూఱు మహారథంబులవారును మూఁడువేలగుఱ్ఱపురాహుత్తులు నెదిరించిన నించుకయుఁ జలింప కెఱుంగ కయ్యానిలపుత్త్రుండు నిజగదాదండంబునకు వాని నన్నింటిం బలి వెట్టి తనకు మాఱునులయువారు లేమిం గోలుమసంగి మఱియొక్క. శతాంగం బెక్కి మొక్కలీఁడై కర్ణునిపైఁ గవియుటయు నతండు నంతలోఁ గాంతేయాగ్రజుం బొదివి సారథిం జంపి పరాఙ్ముఖుండైన వానిస్యందనంబు వెన్నంటి శరవర్షంబు గుఱియుచున్నం గని కనలి యనిలతనయుం దశప్రఖ్యంబు లగుప్రృషత్కజాలంబు లతనిపై నడరించుటయు నాసూతసూనుండు క్రమ్మఱి మగుడ్పూను మాఱుకొని ఘోరనారాచంబులం గప్పుచుండఁ బార్ష్ణిగ్రహణకారణంబునం జేసి వార్ష్ణేయాను జుండు ధర్మరాజానుజుం దలకడచి. 86

ఉ. సూతతనూభవుం బొదివి సూనరియో యనఁ జూడ నొప్పుచున్
శాతశరంబులం గురిసి శౌర్య మవార్యము గా మెలంగుదో

సలలితమూర్తిఁ బట్టుకొని స్యందనవర్యము నిగ్రహించి పె
రలుకఁ బొనర్చి రద్రు లవియం గడు రౌద్రపుసింహనాదముల్. 93

తే. మూఁగి పెక్కండ్రు వసుదేవపుత్త్రుభుజయుగమ్ముఁ బట్టఁగఁ బార్థుని ముట్టనైన
శౌరి సేయార్చి పడఁద్రోచె వారి నెల్ల, హస్తములు హస్తిపుల దుష్టహస్తిపోలె.

వ. అంతఁ గౌంతేయాపరబాహుండు మహారథసంవృతుండును నిగృహీతరథుండు నయ్యెం
గ్రుస్సం పై తనరథంబు పై సమారోహించి తన్ను నిగ్రహింప నాసన్ను లయినపదా
తియోధుల నెల్ల నెల్లను గూలుచుచు తూపులు నేపించి శౌరిం గాంచి కౌంతయా
రుపు వో నిట్లనియె. 95

ఉ. నేలకొలంది మూఁగికొని పేరలు దారుణకార్యధుర్యులై
కాలము తీఱ నేము యిటు గట్టిపగన్ నను గట్టి నారథం
బీలలిఁ బట్టి రిట్టికతి నెవ్వఁడు సైఁచెడు నేను గాకనిం
జాలక పోను బాడు మని చయ్యన నొత్తెను దేవదత్తముల్. 96

మ.స. మురాంతకుండు పాంచజన్యముల్ రయంబు నూఁది భూ
ధరంబు లెల్ల ఘోషింగఁ దన్ను నొత్తె నట్లతే
జరావము న్విని సుశర్మసైన్య మెల్లఁ బాఱి యా
ధరాతలంబునం జరింపఁ దామరాకునీరు నాఁక. 97

తే. అంతలోపల సరుఁడు నాగాస్త్ర మేసర, నేయుటయు నది పదబంధ మై యరులను
గుదెవడం జేయఁ జేష్టలు గోలుపోయి, వారు భూముల నుండి రారణమున.

వ. ధనంజయుండును దారికొనుబిసంగ్రామంబున నసురసమూహంబునుం బోలె నాసం
శప్తకులనెల్ల భల్లంబుల నొల్లఁ బోఁ జేయుచున్నంత వారు రథంబు పట్టు విడిచి
నడచి పో నడుగు నెట్టఁ జాల కుడివోనిచలంబున నానావిధాయుధంబు లాతని పై
విసరం జొచ్చి రంత సలవంత సైన్యవాహినిం గని సుశర్ముండు. 98

శా. సౌపర్ణాస్త్రము నారిఁ గొని విలసద్వార్యం బవార్యంబుగాఁ
గోపోగ్రపతమూర్తియై విసరిసం గోనాసఁ గోలల్ మహా
వ్యాపారింబుఁ బన్నగాశనము లుత్పన్నంబులై బంధమా
పోవేతోగ్రభుజంగమాళి మెసఁగెం బ్రోద్యన్మహాప్రౌఢిమన్. 100

క. ఆగరుడులవేగంబున, నాగంబులు నొచ్చి విచ్చి నలుదిక్కులకుం
బోఁ గని బంధవిముక్తుల్, వీఁగక నరుమీఁదఁ బడిరి వివిధాస్త్రములన్. 101

చ. అతఁడు తదస్త్రశస్త్రముల నస్త్రపరంపరఁ ద్రెళ్ళనేయుచుం

సలలితమూర్తిఁ బట్టుకొని స్యందననర్యము నిగ్రహించి చే
రలుకఁ బొనర్చి రద్దు లవియం గడు రౌద్ర పుసింహనాదముల్. 93

తే. మూఁగి పెక్కురు వసుదేవపుత్రుభుజయు,గమ్ముఁ బట్టఁగఁ బార్థుని ముట్ట నైన
శౌరి నేయార్చి వడఁద్రోచె వారి నెల్ల, హస్తమున హస్తిపుల దుష్టహస్తివోలె.

వ. అంతఁ గౌంతేయావరజుండు మహారథసంవృతుండును నిగృహీతరథుండు నయ్యుం గ్రుస్థం డై తనరథంబు పై నధిరోహించి తన్ను నిగ్రహింప నాసన్ను లయినపదాతియోధుల నెల్ల నల్లసం గొలుచుతూపుల నే పడంచి శౌరిం గాంచి కౌంతేయూరుపు వో ని ట్లనియె. 95

ఉ. వేలకొలంది మూఁగికొని వీరలు దారుణకార్యధుర్యు లై
కాలము తీతె నేమొ యిటు గట్టిపగన్ నను గట్టి నారథం
బీలలిఁ బట్టి రిట్టితఱి నెవ్వఁడు సైఁచెడు నేను గా కనిం
జాలక పోను జూడు మని చయ్యన నొత్తెను దేవదత్తముల్. 96

పంచ. మురాంతకుండు పాంచజన్యముల్ రయంబు మీఱ భూ
ధరంబు లెల్ల భేదలంగఁ దన్పు నొత్తె నట్లలే
జరావము న్విసల్ సుశర్మసైన్య మెల్లఁ బొల్లు నై
ధరాతలంబునం జలించెఁ దామరాకునీరు నాల్. 97

తే. అంతలోపల నరుఁడు నాగాస్త్ర మేసర, నేయుటయు నది పదబంధ మై యరులను
గదెవడం జేయఁ జేష్టలు గోలుపోయి, వారు లొహామ్మలన నుండి రారణమున.

వ. ధనంజయుండును దారకాసురసంగ్రామంబున నసురసమయంబునుం బోలె నాసంశప్తకులనెల్ల భల్లంబుల నొల్లఁ బోఁ జేయుచున్నంత వారు రథంబు పట్టు విడిచి నడచి పో నడుగు వెట్టఁ జాల కుడివోనిచలంబున నానావిధాయుధంబు లాతని పై విసరం జొచ్చి రంత పలవంత కైనతనవాహినిం గని సుశర్ముండు. 98

శా. సౌపర్ణాస్త్రము నారివోసి విలసన్మార్యం బవార్యంబుగాఁ
గోపోద్దీపితమూర్తి యై విసరినం గోరాసఁగోటుల్ మహా
వ్యాపారంబునఁ బన్నగాశనము లుత్పన్నంబు లై బంధమూ
పోపేతోగ్రభుజంగమాళి మెసఁగెం బ్రోద్యన్మహాప్రౌఢిమన్. 100

క. ఆగరుడులవేగంబున, నాగంబులు నొచ్చి విచ్చి నలుదిక్కులకుం
బోఁ గని బంధవిముక్తుల్, వీఁగక నరుమీఁదఁ బడిరి వివిధాస్త్రములన్. 101

చ. అతఁడు తదస్త్రశస్త్రముల నస్త్రపరంపరఁ ద్రెళ్ళ నేయుచుం

బ్రతిఘమునన్ ధనుర్ధరులఁ బట్టి వధించుచున్నఁ గాంచి కో
పితుఁడు సుశర్ముఁ డన్నరుని పేరురమం దొకతూపు నాఁటియున్
శితవిశిఖత్రయంబు మెయి చేష్పడి పోవఁగ నేస నేసినన్. 102

ఆ. గాఢవిద్ధుఁ డగుచు గాండీవి వ్యథితుఁడై, స్యందనంబుమీఁదఁ జదికిలఁ బడి
మూర్ఛ మునిఁగె నపుడు మొన లెల్లఁ బార్థుండు, చచ్చెఁ జచ్చె ననుచు సలిపె రులివు.

వ. అంతలో నంతయేనియు సింహనాదంబులును శంఖభేరీమృదంగాదివాదిత్రనిస్వనంబు
లును మనబలంబునం జెలుచ నపారె నంతఁ గౌంతేయుం డొకింతసేపునకు తెప్పిఱి నిప్పు
వోలె మండుచు. 104

శా. ఐంద్రాస్త్రం బరివోసి యేయ నది ఘోరాకారమై సర్వతి
స్సాంద్రోగ్రాశుగసంతతిం గనుచు మీసంశ్రీకశ్రేణిపై
మంద్రారావము మూఁత్రమోయ వెసలన్ మాఱ్మ్రోంచుఁ గార్మ్రోంచు ని
స్తంద్రంబై చతురంగసైన్యసమితిం జక్కాడె నక్కాంతలోన్. 105

క. పదివేవురు గోపాలురు, సదమద మొనరించె నైంద్రసాయక మపు డ
క్కదనమున నరుని మార్కొన, మది నేయఁడు వెగడి యుక్కుమాసిరి యేనిన్. 106

మ. హతశేషుల్ పదునాల్గువేవురు రణవ్యాపారమున్ మాని ని
ర్గతధూమాగ్ని తెఱంగున న్వెలుఁగునాకౌంతేయుచెంతన్ భయో
న్నతిఁ జేష్టన్ విడి చిత్రరూపులగతిన్ శస్త్రాస్త్రముల్ వెట్టి యు
న్నతి వోనున్నతఱిన్ జమూపతులఁ గ్రన్నం జేరి ప్రేరేచుటన్. 107

తే. అయుతసంఖ్యాకు లగురథికాగ్రసరులు, మూఁడువేలేనుఁగులవారు మొనసి నరునిఁ
జంపుదుము లేక వానిచేఁ జత్తు మింక, కాని మఱియొండు లేదని కడఁకఁ జేసి. 108

వ. మరల మొనకట్టి కష్టంపుఁ గదని పోయకొనిన న్వారిపోరు ఘోరం బయ్యె నియ్యెడఁ
గృపకృతవర్మాశ్వత్థామసౌబలోలూకులును దుర్యోధనాదు లగునీపుత్రులును గిం
డరి పాండుపుత్రభయార్దితం బయినభవచ్చమూసమూహంబు మహార్ణవంబున నవి
సినకలంబు చందంబున వికలం బైనం గని బరవసంబు చేసి కవిసి కసిమసంగి పతంగ
జాలంబులభంగి శరజాలంబు నిగిడించి భీరుజనత్రాసంబును శూరజనోల్లాసంబును
గా సంగరం బెసంగం జేయుచున్నంత శిఖండి శారద్వతుం గదియ వచ్చి. 109

సీ. శరవర్ష మడరించి సాధ్వసం బెసఁగించి, మించినఁ గృపుఁడు వారించి వానిఁ
బదిసాయకంబులఁ బ్రహరించుటయు నేడు, కంకపత్త్రముల శిఖండి ద్రోణుని
నో నేయుఁడు నతండు వాని సారథిఁ గూల్చి, రథ్యంబులం ద్రుంచి రథము ద్రుంచి

విరథుఁడై పాంచాలవరకుమారుఁడు వాలుఁ, బలకయుఁ గొని తేరు చులక డిగ్గి

తే. బ్రాహ్మణునిమీఁదఁ బడునంత బహుశరాళిఁ, గుప్పి గౌతముఁ డాతనిఁ గప్పుటయును
నతఁడు దానికి నిశ్చేష్టుఁ డయ్యె నాలు, దేలి నట్లుగఁ దలఁచుచు బేల యగుచు.

వ. అట్లున్నశిఖండినిం గాంచి యగ్గలించి యగ్గౌతముం దలఁపడ ధృష్టద్యుమ్నాదు లడరుటయు నందు ధృష్టద్యుమ్నునిఁ గృతవర్మయు సపుత్త్రుం డగుధర్మపుత్త్రుని ద్రోణపుత్త్రుండును నకులసహదేవులను సుయోధనుండును గరూశకేకయసృంజయులతోడి భీమసేనుని సేనానాయకుం డగుకర్ణుండును మార్కొని నిలువరించి రాసమయంబున నించుక తెలిసి గాంచి శిఖండి శారద్వతుని శాతసాయకంబు లెల్లఁ గరవాలంబున ఖండించినం గృపుండు వానిఫలకం బఱియలు గావించె నంతఁ బాంచాలరాజపుత్త్రుండును. 111

మ. కరవాలంబు కరంబు ద్రిప్పుకొనుచుం గాండంబులం గుప్పి డె
ప్పరముం గూర్చెదు గౌతమద్విజునిపైఁ బాఱం గృపాచార్యుఁ డా
తురునిన్ మృత్యువు పోలికన్ స్వవశమందుం బొందఁ గా వానిపై
శరజాలంబు నిగిడ్చెఁ దజ్జనులు నిశ్శ్వాసించుచున్ నివ్వెఁగన్. 112

వ. ఇట్లు క్లిశ్యమానుం డై శారద్వతునకుం జిక్కియున్నశిఖండిం గాంచి చిత్రకేతుపుత్త్రుం డగుసుకేతుండు త్వరితుం డై వానిం దలకడచి నారాచాసారంబు పాతించుచు శారద్వతు నడిమి వానిశరాసారంబువారించుటయు సన్నాహపిం దత్తఱించుచు ద్రుపదపుత్త్రుండు దొలంగి చనియె సుకేతుండును. 113

—♦కృపాచార్యుఁడు సుకేతుం జంపుట♦—

ఉ. తొమ్మిదివాలుతూపులను దోర్బల మేర్పడ గౌతమద్విజున్
గ్రమ్మఁగ నేసి సప్తతిశరమ్ముల నురమ్మున నాటి మూఁడుకాం
డమ్ముల నెల్లకాయము వడంకఁగఁ జేసి శరాసనమ్ము నొ
క్కమ్మునఁ ద్రుంచి సూతునొడ లాడ నొకమ్మున నొంచె నొంచినన్. 114

ఉ. ఒండొకకార్ముకంబుఁ గొని యుద్ధతిఁ జూపుచుఁ గ్రుద్ధుఁడై కృపుం
డొండొడ తారసించి ద్రుపదోర్విపసూనుని సర్వమర్మముల్
మెండుగ గాఁడ మూఁడ్పదు లమేయశరమ్ములు నాటె నాట నా
తండు చలించె విహ్వలత ధాత్రి చలింపఁ జలించుచె ట్లనన్. 115

వ. అంత నంతకాకారుం డగుకృపాచార్యుండు. 116

చ. తనువు చలింపఁ దేఱిపయిఁ దార్పడుచున్నసుకేతుమస్తకం

బనుగతకుండలంబును సమంచితవేష్టన మై మహీతలం
బునఁ బడఁ గత్తివాతిశరముం గొని రింగున నేసి త్రుంచెఁ ద్రుం
చినఁ గని తద్బలం బనికిఁ జేరక పాఱె భయంబు పెంపునన్. 117

వ. అంత. 118

—ధృష్టద్యుమ్నుఁడు కృతవర్మ రథముమీఁదికిఁ జని విజృంభించుట—

తే. నిలుము నిలు మంచుఁ గృతవర్మ నిలువరించి, పార్షతునిమీఁదఁ గవిసినఁ బార్షతుండు
నతని దాఁకెను వారిపో రామిషార్థ, మగిగ డేగలు పోరిన ట్లతిశయిల్లె. 119

సీ. పాండవవాహినీపతి మొత్తెఁ గొమ్మది,శరములు హార్దిక్యునురమునందు
నతఁ డల్గి పార్షతు సాశ్వసూతస్యందనము గాఁ బృషత్కవర్షమున ముంచె
మొగులు గప్పినప్రొద్దుపగిదిఁ బాంచాలపుత్త్రుఁడు గానఁగా రాక పొడవడఁగియుఁ
గనలి యొక్కింతలోఁ గనకభూషణశరంబుల నాశరంబులు పొడవడంచి

తే. హార్దికపుత్త్రునినారాచవృష్టి ముంప, నతఁడు తత్సాయకౌఘము నడఁచి వాని
నొంచె నాతఁడు కోపించి మించి వృష్ణివరుని సారథితలఁ ద్రుంచె భల్లధార. 120

వ.♦ ఇట్లు త్రుంచి పాంచాలవీరుండు గదాపాణి యైనవృష్ణివీరునిం గాంచి రథంబు రథంబు
దాఁకఁ దోలించి కృపాణపాణి యై వాని రథంబుమీఁదికి లంఘించునంత నతం డిలకు
దాఁటుటయు నితండు నందుఁ గృతవర్మఁ గాన కెందుఁ బోయి నాఁ డున్నవాఁడ
వని పలుక రించిన నాహార్దిక్యుండు క్రిందు చేరి యున్నాఁ డిం దని ప్రతివచనం బిచ్చె
నంతలో నితండు మగిడి తనవాహనంబునకు వచ్చి వానిం దాఁకి వీఁకం జూపు
చుండ గండశరి కౌరవవీరు లెల్ల మేదురసింహనాదంబు రోదోంతరంబు నిండ మెండు
కొని వారించిన వారిపోరు దారుణం బయ్యె నయ్యెడ నశ్వత్థామ శైనేయద్రౌపదే
యాభిరక్షితుం డైనయుధిష్ఠిరు నతిమి హాస్త్రలాఘవంబున వివిధమార్గంబుల సనర్గళ
ప్రచారంబు సూపుచు దివ్యాస్త్రాభిమంత్రితంబు లైనమార్గణసరాసరంబు గుప్పి
నభోమండలంబు గప్పె నప్పుడు. 121

తే. చాపగురుపుత్త్రకల్పితస్వర్ణభూమి, తామ్రజాలపరిచ్ఛన్న మైనసభము
కనకజాలవిభూషితమును ఘనసమగు, మేలుకట్టు తెఱంగున మెఱయుచుండె. 122

క. అమ్ములు ముసుంగు వెట్టుట, నెమ్మోము గవిసి పడుట కెడ గలుగక మే
ఘమ్ములనీడలు నలుగడఁ, గ్రమ్మినగతిఁ జూడ నయ్యెఁ గడుసచ్చెరువై. 123

తే. అల్లిబిల్లిగ బాణము లల్లుకొనిన, కతన నంతరిక్షంబున స్థితివహించు

---

♦ ధృష్టద్యుమ్నుఁడు హార్దిక్యునిరథముమీఁది కుఱికినట్లు కొన్నిప్రతులలో లేదు.

చ. తలఁపఁగ నీకుఁ బ్రీతియుఁ గృతజ్ఞతయుం లవ మైన లేనియ
ట్టులు తెలియంగ వచ్చెడి నిఁకన్ ననుఁ బట్టి వధింప నుంటి వో
చెల యిది క్షత్త్రధర్మ మనఁ జెల్లదు విప్రుఁడ వీవు తన్మహో
జ్జ్వల మగుధర్మముం విడిచి వాసి దొలంగితి వేమి చెప్పఁగన్. 130

క. నీ వెంతయడిచి పడినం, గావింపఁగ లే వొకంచు కనుచుండఁ గురు
త్సైన్యవరముఖ్యుల గెల్తుము, చేవం జూపెదవు గాక చెన్నఁటివగుచున్. 131

ఆ. అనిన గురుకుమారుఁడలతినవ్వ మొగంబు, నందుఁ జెంగలింప నతనితత్త్వ
మెఱిఁగి యుక్త మరసి యేమియుఁ బలుకక, పిఁక నతని నంప వెల్లి ముంచె. 132

క. కాలాంతకునివిధంబునఁ, గ్రాలెడుగురుపుత్త్రు కెలనఁ గయ్యము సేయం
జాలక కేరిడించి సమిల్లాలసుఁ డై యతఁడు శత్త్రులం బొదువఁ జనెన్. 133

వ. అంత వైకర్తనుండు వాయుపుత్త్రు నంకెలు వానికి బాసట యయిన చేదికైకయకా
రూశసృంజయపాంచాలాదుల వేలకొలందిగం బొలియించుచున్నం గాంచియు గాద్ప
పట్టి కౌరవబలంబులపయిం గవిసి కనుపుగొట్టుచుండె నట ధనంజయుండును సంశప్త
కుల రూపుమాపుచుండె నీదుర్మంత్త్రంబున నయినకయ్యంబు కారణంబున నిల్లీ
నాఁడు మూఁడుమొసలందు నింతింతనరానిప్రజాక్షయం బయ్యె నయ్యవసరంబున. 134

సీ. మాద్రీసుతులు నల్లు మార్కొన్నకౌరవ, నాథుండు క్రుద్ధుఁ డై నకులుమేన
నవశరంబులు గ్రుచ్చి నాల్గుగుఱ్ఱంబులఁ, గూలిచి యొకకుప్పికోలఁ బడగ
బడమిఁ బడం జేయ నదరి నకులుఁడేడు, సహదేవుఁ డేడును సాయకములు
పరఁగించినం గ్రోధపరివృతాత్ముండయి, భవదాత్మభవుఁ డంతఁ గవలమేనఁ
తే. బంచపంచాశుగంబులఁ బరఁగఁ జేసి, వారివిండులు రెంటను వడిగఁ దునిమి.
వారిపై డెబ్బదియు మూఁడువాఁడిటూపు, లొక్కమొగి నేసినొప్పించెనుక్కుమెఱసి.

ఉ. అన్నయుఁ దమ్ముడుం గడు సహంకృతి మీఱఁగ శక్రచాపసం
పన్నము లైనచాపములఁ జయ్యనఁ గైకొని దేవపుత్త్రు లి
ట్లున్నతిఁ గాంచి వారిదము లుర్విధరంబును బోలె నీదుపు
త్త్రు న్నిశితాశుగప్రతతితోడ ముసుంగిడి రంగవించుచున్. 136

వ. అనంతరంబ. 137

తరళము. కొఱవిఁ ద్రిప్పినరీతిఁ ద్రిప్పుచు గుండ్ర నై తగుకార్ముకం
బఱమరల్ గొన కాసుయోధనుఁ డంపవెల్లి వెలార్చుచున్.
దశదిశావారల నెందునుం దినినాథ దీప్తులు వ్యాప్తిమై

పఱయునట్లు నిజాశుగంబులు వాఱఁ జేసె సవారిగన్. 138

వ. అట్లు నీకొడుకు కవక్రపరాక్రమంబు నెఱపుచుండం గాంచి మహారథు లెల్లరు మాద్రేయుః మృత్యుముఖాంతికప్రాప్తులం గాఁ దలంచుచుండి రాసమయంబునఁ బాండవ సేనానాయకుండు పార్షతుండు వడివడిం బఱతెంచి వారిఁ దలకడఁచి దుర్యోధనుం దాఁకి వీఁకం జూపుచు సాయకాసారంబు వఱగించుటయు నగుమొగంబుననతండును

చ. ఇరువదియేను నారసము లేసియు సర్వదియేను వెండియుఁ
బరఁగఁగ జేసియుం బృషతపౌత్రునిచాపము సత్తును న్మహా
ఖురములఁ దున్మి సవ్వటయు సారథి లేమ్యఁ పతండు నొంచువిల్
గిరమునఁ బూని సత్వగము క్రొవ్వఁ గెంపుల సీసఁ బెంపుగన్. 140

ఉత్సాహము. కొసరి కొసరి నిశ్వసించు కోఁతాఁకు మలసఁగఁ బం
పెసక మెసఁగునిశితశరము లేనుఁ బడియు నిప్ప్పియ
వ్యసుమతిను నేయ నవియు వానిమఱుపు ప్రచ్చియున్
వెస మహీతలంబు సొచ్చి విక్రృతి నొంద నెత్తుటన్. 141

క. పూచినమోదుగు కైవడి, రాచూలి దలిర్చి రాగరంజితనయనుం
డై చెర్వి విల్లు వదినా,రాచంబులు వానినుదుట రయమున నాటన్. 142

క. అలికగతాంబకదళకో,జ్జ్వల మగుపాంచాలవరుని వదనము మధులి
ట్కలితప్రఫుల్లజలజము,వలెఁ జూడఁగ నొప్పె నపుడు వసుధాధీశా. 143

సీ. అంత ధృష్టద్యుమ్నుఁ డెంతయుఁ బంతంబు, మీఱ వేఱొకవిల్లు మెచ్చుచుఁ గొని
వడిఁ బేర్చి పదియాఱు వాలమ్ము లఖరించి, కురురాజువార్వముల్ గూల నేసి
సారథి నేసింటఁ జక్కాడి యొక్కడ, ల్లము వైచి విల్లుక్కడముగఁ దునిమె
పదమార్గణముల నొకస్కంధరథగదా, శక్తిఖడ్గధ్వజచ్ఛత్రములను

తే. నుఱుము చేసిన మఱిమియానునాసనాగి, కేతనము గూలుటయు గాంచి భూతలాంతు
లనుజులును గావ రా వాని నపుడు దండ, ధారుఁ డెఱకొని తేరిపైఁ దరలి చనియె.

—కురుపాండవయోధుల సంకులసమరము—

మహాస్ర. శినివీరుం గెల్చి రాజాశ్రితుఁ డగుఘనుఁ డాచిత్రభానూద్భవుండు
య్యాని ధృష్టద్యుమ్నుపైఁ బ్లోఁడరినఁ గని వెన్నంటి కృష్ణానుజుం డా
తనిపృష్ఠాంతంబునన్ మత్తగజము ప్రతిమాతంగముం గొమ్ములన్ గొ
ట్టినయ ట్లుగ్రాస్త్రము ల్లోడిగి యెదువడిఁ గొట్టుం గనుం బట్ట గాఁగన్. 145

వ. ఇట్లు వాఁగుసు గిటయోధులమ్ముఫ్యాహ్నంబున గర్ణపార్థతులుమధ్యంబున నొక్క

గాయిం బెట్టఁగ గిట్టి చూపెడి మహాకోదండపాండిత్యమున్. 147

మత్త. ఈ వెలుంగుదు వాని నెవ్వరు నేయ నోపరు సృంజయుల్
దేవురించుచు నున్నచోటికిఁ దేరు వోవఁగ నిమ్ము నా
భావ మిట్టిది నీతలం పెటు వచ్చునో యన నవ్వుచుం
దేవకీతనయుండు కవ్వడి దిక్కు మోమయి యిట్లనున్. 148

క. ఇప్పటికిఁ గురుబలంబులఁ, జక్కడచుట పాడి యట్లు సలుపు మటంచుం
గ్రక్కున జైత్రరథం బా,చక్కటికిం బోవఁ దోలె జవనాశ్వములన్. 149

—అర్జునుండు కురుబలంబులపైఁ గవియుట—

శా. శ్వేతాశ్వంబులు కృష్ణఫాల్గునులతో వేవేగఁ దే రక్కురు
వ్రాతంబుం గలచోటికిం గొని చనన్ వాంఛించు నంత న్మహా
భీతి న్నాలుగుదిక్కులన్ బలఁగముల్ భిన్నత్వముం బొంది వి
ఖ్యాతార్తిం గొన నయ్యె నయ్యెడల హాహాకారముల్ పుట్టఁగన్. 150

తే. స్తనితనిర్హ్రాదమేదురమును గపిధ్వజాంచితమ్ము సముత్పతాకాభిరామ
మైనకృష్ణార్జునులతే ర్వ్యోమాన మాక, సమ్మనుం బలె మనబలగమ్ము సొచ్చె. 151

చ. విధివిహితంబుగా సవనవీథికి రం డని సోమయాజు ల
త్యధికరవంబునం బిలుచునంతన వచ్చినవేల్పువెజ్జులన్
విధమునఁ గేశవార్జునులు వీర్య మవార్యము గా రణాధ్వర
ప్రథితమహీతలంబునకు వచ్చిరి వైరులు విచ్చలింపఁగన్. 152

ఆ. అపుడు పాశహస్తుఁ డైనపరేతరా, ట్టనఁగ నర్జునుండు కనుల నగ్ని
కణము లొలుక నీదుఘనసేనలో నతి,రథులనడుమఁ జొచ్చె రభస మెసఁగ. 153

వ. అట్లురవడించినకవ్వడిం గాంచి దుర్యోధనుండు సంశప్తకులం బురికొలిపినంత వేయి యరదంబులును మున్నూరు ద్విరదంబులును బదునాలుగువేలవారువంబులును రెండులక్షల కాలుమానుసులును గండడరి గాండీవిపైఁ గవిసి శరవర్షముం గురియుటయు నతండు కాలాంతకుండో యన మండిపడి నింగియు నేలయు నిరంతరనీరంధ్రమ్మగునట్లు పాములంబోనిశరపరంపరలం బరఁగించుచు నిజతలనిస్వనంబు విని జనులు భువియు దివియు దిక్కులు విదిక్కులును గొండలుం బగులు చున్న వని తలంచునట్లు సేయుచుఁ బదివేలపార్థివులం గూల నేసి కాంభోజబలంబులపై నడరి శిరంబులు కరంబులు కవచంబులు కార్ముకంబులు ఖండించుచుఁ బ్రతికూలవాతంబు భూరుహవ్రాతంబులం బోలెఁ జతురంగంబులఁ జిందఱవందఱం జేయుచుండఁ గొండొకనడికి

నెల్లవారు నాకర్ణింప నశరీరవాణి యీకృష్ణార్జునులు నరనారాయణమునులు వీరిం
బోర జయించు వేరికినిం గా దని ఘోషించుచున్న నాకర్ణింప కంతఁ గాంభోజసుదక్షి
ణానుజుండు గండుమీఱి కాండవర్షంబు గురియుటయుఁ గుంతీనందనుండును. 154

సీ. అర్ధచంద్రశరద్వయమున బాహులు క్షురప్రమున శిరంబును వడిగఁ దునిమెఁ
దునిమినంత సుదక్షిణునితమ్ముఁ డిలఁ బడె, గులిశాహతంబైనకుధర మట్లు
కాంభోజయవనశకప్రభృతులు రేఁగి, చతురంగబలముతో నతని నదిమి
రపుడు పార్థుఁడు వారి నందఱ బ్రమందించి, రక్తప్రవాహము వ్యక్తపఱచె

తే. మొనలు చిందఱవందఱై పోడ వడంగి, పోవఁ గని ద్రోణి మృత్యువు పోల్కిఁ గ్రుద్ధుఁ
డయి గుణధ్వని నిగుడంగ నరుగు దెంచి, బాణవర్షము గురియుచుఁ బార్థుఁ దాఁకె.

—అశ్వత్థామ యర్జును నెదిరించి పోరుట—

ఉ. తాఁకి మహోగ్రబాణసముదాయపరంపర లెన్నియేనియున్
వీఁక నిగిడ్చి కృష్ణునిను వేగతులం బ్రహరించి తద్రథం
బాఁక వడంగ ముంచుటయు నాఘను లూపిరి పుచ్చుకోఁగ లే
కూఁకువ వో రథంబుపయి నుండిరి చేష్టలు దక్కి బెండులై. 156

క. గురుతనయుని మునుమున నొక్కరుఁ డేనియు నిలువ లేక కవ్వడివారల్
దూర మేఁగి వెఱచి పఱచిరి పరిపరి భంజింపఁ బడినవారై పోరన్. 157

శా. హాహాకారము పెల్లురేఁగె నపు డాయోధోటులం దెల్లెడన్
స్వాహాకారము సేయుచున్నఘను నశ్వత్థామ వీక్షించి సం
దేహం బందుచు సిద్ధచారణులు స్వస్తిం బల్కి రీలోకసం
దోహం బం దభయంబు కోరుచు మహోద్యోగంబు సంధిల్లఁగన్. 158

వ. అప్పు డాసంగ్రామంబున నశ్వత్థామ చూపినపరాక్రమం బెప్పుడు నెవ్వరుం జూప
రోప రది యదృష్టపూర్వంబు నశ్రుతపూర్వం బమ్మహాధనుర్ధరుండు సవ్యాపసవ్యం
బుగ ద్రిప్పుచు నొప్పించినమౌర్వీనినాదంబు దారుణంబైన దానికిం దాళఁ జాలక
పెక్కండ్రు దిక్కు దిక్కు పో రేఁగి పాఱం జొచ్చి రట్లంతకంత కగ్గలం బగునగ్గురు
పుత్త్రపరాక్రమంబు కడఁ నదపరాక్రమంబు వక్రం బగుటయుం జూచి సవ్యసాచి
విషణ్ణహృదయుం డై యున్నం దెలిసి రోషంబున నిట్టూర్పు నిగిడించుచు నీరజాక్షుం
డరుణాక్షుం డై హెచ్చరికగాఁ బొందు నశ్వత్థామార్జునుల మాటిమాటికిం
జూచి చూచి యర్జునుం బిలిచి ప్రేమానుబంధబంధురంబుగా నిట్లనియె. 159

ఉ. అచ్చెరు వయ్యె నిన్నిగతులన ట్లగుదెంచు గురూద్భవుండు చే

వెచ్చనఁ జూపె నీదుభుజవీర్యము తొల్లిటియట్ల లేదొ వి
వ్వచ్చుఁడ వీవ కావొ కయి వర్తిలుచుండదొ గాండివంబు నీ
కిచ్చట లేదొ చిత్త మిటు లేమిటి కూరక యుండు ఫల్గునా. 160

క. గురుపుత్త్రుఁ డనుతలఁపున, నురకుంటివొ గౌరవించి యుల్లమ్మున ని
ట్లురకుండ రా దుపేక్షకుఁ, దరుణము గా దిది యితండు తద్దయు నడరున్. 161

మ. అని దాశార్హుఁ డనన్ ధనంజయుఁడు కోపాటోప మేపారఁ గై
కొని పద్నాలుగుభల్లముల్ గురుసుతక్రూరాస్త్రముల్ వమ్ము లై
చనఁగాఁ జేయుచుఁ దద్ధనుర్ధ్వజగదాశక్త్యాతపత్త్రాదులం
దునుఁగం జేసి మఖించె జత్రువునయందున్ వత్సదంతంబులన్. 162

తే. దానఁ బీడితుఁ డయి గురుతనయుఁ డపుడు, తనరథంబుపయిం గేతుదండ మూఁత
గొనుచు మూర్ఛిల్లె సూతుఁ డాతనిఁ గిరీటి, బారినుండి తొలగించె దూరముగను. 163

స్రగ్ధర. అంతం గౌంతేయుఁ డంతే నడరి కురుకుమారాదులున్ జోదులున్ ద
త్ప్రాంతంబం దుండిచూడం బరవసము కడున్ బర్వ సర్వప్రకారా
త్యంతప్రాబల్యకల్యత్వమున మన మొనన్ దాఁకి లోకోత్తరాజో
వంతుం డై కొంతలోనన్ వసుధ కిడె జనవ్రాతమున్ వేనవేలన్. 164

క. కను మూసి తెఱచునంతన, మనమొన లెల్లం గలంగె మహితల మెల్లం
గన నయ్యెఁ బీన్గుపెంటలు, ఘనుఁ డాఫల్గునునివిల్లు గడు నాడంగన్. 165

వ. అయ్యవసరంబున దుర్యోధనుండు కర్ణశల్యసమక్షంబున నెల్లరాజులు విన నిట్లనియె.

మ. మనకుం గోరక యుండ నీరణమునం బ్రాపింపఁగాఁ జొప్పడిం
గనుఁగో నిప్పు డపావృతం బయినస్వర్గద్వార మోక్షత్రియుల్
వినుఁడీ యుత్తముఁ డైనక్షత్త్రియుఁ డెదన్ వీక్షించు యుద్ధంబునం
దనువున్ వీఁగి నితాంతసౌఖ్యముల కై తళ్కొత్తఁ గా నెత్తుటన్. 167

క. వె న్నీక మీరు మీశౌర్యోన్నతికిం దగినరీతి యుద్ధావనియం
దెన్నుకొని ననతు వచ్చిర, మన్నినిం దాఁకఁ దగు సమాఘాతమునన్. 168

తే. పాండవులఁ జెండి భూలక్ష్మి బడయుఁ డొండె, భండనంబున వారిచేఁ బడుట యొండె
క్షత్త్రియుం డయిపుట్టినజనుల కెల్ల, రెండు తెఱఁగుల చూపట్టియుండె నిపుడు. 169

వ. అని సుయోధనుండు పలికినపలుకు లాలించి భూపాలు రెల్లరు నుల్లంబులు పల్లవింప
హర్షోల్లాసంబు పెల్లైనంగ సింహనాదంబులును శంఖనాదంబులును గావించి రంత
లోనన్ దేరివచ్చినభారద్వాజాత్మజుండు సుయోధను కుఁ బ్రమోదం [illegible] గావించు
వాఁ డై యి ట్లనియె. 170

మ. సకలక్షత్రియులుం గనుంగొనఁగ ధృష్టద్యుమ్నుఁ డింతేని కా
నక విప్రుండు గురుండు నాక ఖలుఁడై న్యస్తాస్త్రుఁడై యున్న మా
మకతాతం దల ముట్టి కోసెఁ గుతికన్ మంద్రాదునే వానిఁ జం
పక మైమర్వును విప్పఁ దప్పితినయో స్వర్గస్థితిం దప్పుదుం. 171

వ. ఇట్లు శపథంబు చేసిన నేను భీమార్జునాదియోధు లడ్డుపడినవారి నెల్లం జంపినంతన వానిం జంపుద నని బాసచేసిన రాజు లెల్లరు సంతోషిల్లుచుఁ బాండవవీరులం దాఁకుటయు వారు వీరిం దాఁకి రత్తఱిఁ బ్రళయకల్పం బై ప్రజాక్షయకరం బయ్యె నయ్యెడ. 172

సీ. ఆసమరముఁ జూచునాసమై దివి దేవ,వరులు క్రిక్కిరిసిరి వరుస లొనర
నచ్చరల్ దివ్యమాల్యానులేపనరత్న,ములు చల్లి రయ్యోధముఖ్యులపయి
మలయానిలము వీఁచె మహితలం బెల్ల సు,గంధబంధుర మయి కలయఁ బ్రాఁకి
స్వర్ణపుంఖశరప్రకీర్ణ మై భువి యొప్పె,మెఱయుఱిక్కల నొప్పుమిన్ను వోలె

తే. మఱియు జ్యాఘోషరథనేమిమహితఘోష,వివిధవాదిత్రనాదముల్ దివి దివిజుల
సాధువాదంబులుం గూడి సాంద్రమగుచు,దెసలమ్రోయఁగ సంగ్రామ మెసఁగె నపుడు.

వ. అట్లర్జునుండు పరాక్రమోపార్జనుం డై ద్రోణపుత్త్రప్రభృతిమహారథులం జయించి వాసుదేవుం గాంచి యి ట్లనియె. 174

చ. పఱచెడు నస్మదీయ మగువాహిని యంతయుఁ గర్ణుఁ డెంతయే
మఱకువమై మహారథుల మార్కొని చంపుచునున్న వాఁడు వాఁ
డుఱియ యజాతశత్రు వెట నుండెనొ కాని తదీయకేతువుం
మఱు వయి కానరాదు విను మా మన మల్లడతల్లడం పడుం. 175

చ. ఇపుడు త్రిభాగశేషముగ నీదివసం బగు ధార్తరాష్ట్రులం
దపగతభీతి నొక్కరుఁడు నాహవదోహలమత్తచిత్తుఁడై
నృపు డెదిరింప రాఁడు నను నీవు ప్రియంబునఁ జూచువాఁడవే
నుపగతిగా మదగ్రభవుఁ డున్నెడకుం నడపింపు తేజులం. 176

తే. సానుజుం డగుపాండుపుత్త్రాగ్రగణ్యు,కుశల మారసి వచ్చి యిక్కొదవ దీఱఁ
బోరుకొనియెద నరులతో సారసాక్ష, కోర్కి దీర్పుము నా యదుకుంజరుండు. 177

వ. అట్ల యగుం గావుత మని సృంజయాదులం గూడి మన సేనలతోడం బోరుచున్న ధర్మరాజునొద్ద కరదంబు వఱపుచు సంగ్రామరంగంబునం దగుజనసంక్షయంబు పరీక్షించుచు సవ్యసాచిం జూచి యి ట్లనియె. 178

—శ్రీకృష్ణుం డర్జునునిచేఁ దెగినకురుబలంబు నభివర్ణించుట—

ద్విపదము. అక్కటకట చూచితయ్య సంగ్రామ, మెక్కటియై సెల్లు నిపుడుదుర్యోధ
నునికారణంబుననుం గాలవిక్రృతి, జననాశనం బిట్లు సమకూర నయ్యె
విఱిగి ప్రోవులు పడె విండ్లు నమ్ములును, దొఱఁత్రొక్కునఁ ద్రాలెఁ దొడవులవెల్లఁ
బఱియలై పడియెఁ గృపాణబాణాదు, లఱవఱలై కూలె నఖిలాయుధాళి
వివిధాస్త్రశస్త్రముల్ విడువక వీరె, భువిఁ బడి చచ్చియుం బోలుపు వోకుంటఁ
జావనియట్టులు చర్చింప నగుచు, జీవకళం గల్గి చెలఁగుచున్నారు
వీరశేఖరులైనవీరిగాత్రములు, వీరిమస్తకములు వీరిబాహువులు
వీరియూరువులును వీరికంఠములు, వీరిపాదంబులు వీరిజంఘలును
ముసలాదిసాధనముల జతురంగ, విసరసమ్మర్దనవిధుల నింతింత
తునియలై యిలఁ గప్పెఁ దొండముల్ దెగినఁ, గనకకంబళములు ఘంటలు వీడి
నలుగడం బడ నార్తనాదంబు నిగుడఁ, బలుగతులం బడి పడి చచ్చి వెలికి
నాలుకలం బెట్టె నాగంబు లవ్వి, పోలింపఁబడుచుండె భూధ్రంబు లట్లు
నులినులియై కింకిణులతోడ కేతు, వులతోడఁ దేరులు ప్రోవులు వడియె
మునికాళ్ళు మోఁకులు ముక్కలై పోవ, వెనుపల్లములు వ్రీలి వ్రేలాడ రత్న
కాంచనస్రజములు కళ్యాలు వీడ, నంచలగతి నాడి యాడి గుఱ్ఱములు
కుప్పలై తిప్పలై కూలె నెల్లెడల, నిప్పుడు శోణితం బెంతయుఁ బేఱి
కర్దమంబై యిందుఁ గాలూఁడి రాయి, దుర్దశపాలయి తుదిఁ గాంచ లేక
మొఱ్ఱో కుయో యని మొఱవెట్టువార, లఱ్ఱులలోఁ బ్రాణ మాడంగ రోద
నము సేయుచు నలంతినాదు పై రాఁగఁ, దమచుట్టములఁ బిల్చి తగఁ జెప్పువారుఁ
బ్రాణోత్క్రమణమందుఁ బ్రజ్ఞ గల్గుటను, బ్రాణదప్పియును నారాయణస్మరణ
మాచరించెడువారు నస్త్రాహతులకుఁ, గోచరింపకయుండఁ గోరెడువారు
నటు నిటుఁ బొఱఁగా నాసించువారు, లెటు పోయినం జావ దెప్పటికైన
దప్పనిదే యని తఱలియు మరలి, మెప్పటిఁ బోరుకో నెంచెడువారు
మది రోషమునఁ జేసి మఱిమఱి వేగ, నది సేయుటకుఁ గాని యేడ్తెఱ లేక
మొగము బిగించుచుఁ బొమముడివెట్టి, మొగి నౌడు గఱచుచుమును జూచు వారుఁ
గలదినై యరిసేన కలగుండు వడియెఁ, దెలియ నింతయు భవద్విక్రమక్రమము.
వ. అని పొలికలనెల్లఁ దేటతెల్లంబుగఁ దెలియఁ జెప్పుచు నప్పురాణపూరుషుండు
పోవుచున్నంతఁ గాంతేయుం డగ్రజదర్శనార్థియై రయంబున రథంబు వోవని మ్మనిన

నతం డట్లు చేసి ధర్మరాజుం దరియ నరిగి నరుం గని మఱియు నిట్లనియె. 180

మ. కనుఁగొంటే మనధర్మనందనుని వేడ్కం బార్థివుల్ గొల్వఁగ
న్గొనుచున్నాఁ డని వాఁడె చూడు వసుషేణుం డగ్నినా వెల్గుచున్
మనభీముండును బార్షతప్రముఖులున్ మాఱ్కొంచుఁ గౌరవ్యవం
శనిరోధం బొనరింప నడ్డుపడునశ్వత్థామతోడ్పాటునన్. 181

క. గురుపుత్త్రుఁ డదర ద్రుపదుని,వరపుత్త్రుఁడు వాని నఱుమ వచ్చెదుఁ గంటే 182
దుర మొనరించుచు సృంజయ,వరు లెందఱొ మడిసి రరయ వచ్చెనె పార్థా.

వ. అని సంగ్రామంబు తెఱం గెఱింగించుచున్నంత యుధిష్ఠిరప్రభృతు లైనపాండవవీరులును రాధేయప్రముఖు లైనకౌరవవీరులును సింహనాదంబు లెసంగం దలపడిన దారుణరణంబు ప్రవర్తిల్లె నందు నుభయబలంబులందును బహులప్రజాక్షయం బయ్యె నయ్యెడఁ బాండవపరివారపరివృతుం డై పాంచాల్యుండు గన్నెఱ్ఱచేసి కర్ణుం దాఁకి.

ఉ. ఆనతపర్వ మైననిశితాశుగ మొక్కఁడు పూని వానిపై
నే నని చెప్పి యేసె నిలు నిల్మని పల్కుఁడు నల్కఁ జేసి ది
వ్యానక మట్లు మ్రోయ విజయాఖ్యశరాసన మెక్కుపెట్టి మే
లైనశరంబునం దునిమె నాతనిచాపము నాతఁ డాతఱిన్. 184

తే. కాలసర్పంబులం బోని నాలు గైదు, వాలుతూఁపులు గలింప వానిమఱువు
వ్రచ్చి యవి నెత్తుటం దోఁగి వచ్చి వెలికి, పరఁగె నారుద్రపురుగుల పగిది నపుడు.

చ. విఱిగినచాపమున్ విడిచి వీరవరేణ్యుఁడు పార్షతుం డటన్
వఱలెడునొక్కవిల్లు గొని వానిని డెబ్బదినారసంబులన్
దెఱలఁగ నేయఁ గర్ణుఁడును దివ్యశరంబులఁ దచ్ఛతాంగమున్
గుఱు తరయంగరానిగతిఁ గొట్టెను బెట్టుగ వెట్ట వుట్టఁగన్. 186

క. వాలికతూపుల ద్రుపదుని,మూ లాతని నొంప నతఁడు సునిశితశర మొం
డాలక్షించి నిగిడ్చిన, లీలన్ శినివరుఁడు దాని లేఁత నడంచెన్. 187

మ. యమదండోపమ మైననైజశర మ ట్లావృష్ణివీరుండు మా
ర్గమునం గండ్రిక లై పడం జలుప నుగ్రంపశ్యుఁ డై కర్ణుఁ డు
త్తమనారాచపరంపరం బొదివి న స్త్రప్రోజ్వలాస్త్రంబు లొ
క్కమొగిన్ సాత్యకి నేయ నేసె నతఁడున్ గర్వించి ప్రత్యస్త్రముల్. 188

క. కన విన భూతభయంకర,మును ఘోరము దర్శనీయమును జిత్రము నై
తనరినకదనము కర్ణున,కును శినివీరునకు నయ్యెఁ గొంతటిలోనన్. 189

—అశ్వత్థామ పాంచాల్యుం దాఁకి ఘోరయుద్ధము చేయుట—

సీ. అయ్యంతరంబున నాచార్యనందనుం, డడరి పార్షతునిపై వడి పొసంగ
నోరోరి బ్రహ్మఘ్న! యోరి నరాధమ! నిలు నిలు మేఁ బ్రాణములను గలిగి
యుండ నీ వెటు వోవుదో చూచెదను గాక, యని శితశరముల నతనిఁ గప్పెఁ
బార్షతుండును వానిఁ బరికించుచుం దన, మృత్యు వతండు గా నెదఁ దలంచి
తే. నాతిహృష్టమనస్కుఁ డై యతఁ డొకింత, లో ననిన్ శత్రువధ్యుండు దాను గామిఁ
దెలిసి గం డడరుటయు భూదేవసుతుఁడు, కినుక నాతని మార్కొని యనియె నిట్లు.

శా. పాంచాలాధమ! ద్రోణుఁ జంపితి మహాపాపంపుఁ జేపింపఁ గాఁ
గించిచ్ఛాంతికి దానికిం బ్రతిగ నిన్ గీలూడినం గూలున
ట్లంచత్సాయకపంక్తిఁ గూల్చి యమలోకావాప్తి గల్గింతు నే
నంచుం జెప్పెద నీకుఁ ఫాల్గునుఁడు తోడై రాక యున్నంతలోన్. 191

వ. తొలంగక కీవు సంగరంగంబున నిలుతు వేని నామాట తప్ప దనిన ధృష్టద్యుమ్నుం డతని కి ట్లనియె. 192

శా. ఓరీ బ్రహ్మకులాధమా! యెఱుఁగరాదో నన్ను నిశ్శంకనిం
బారం బందగఁ జేసినట్టిఁ డ భుజాప్రావీణ్యముం గల్గు నే
నీకూ పాటుఁ బొనరింతు నీజనకునిన్ బ్రేమించుఖడ్గంబ నిన్
గారా మారగఁ జూడ వచ్చెడిని శంకాతంకము ల్లే కికన్. 193

సీ. అని పల్కి నిశితసాయక మొండు ద్రౌణిగా, త్రమునందు నాట నాతండు కనలి
దశదిక్కులం దననిశితాశుగంబు లే, తోచునట్టులు చేసి ద్రుపదసుతుని
తేరు ముసుఁగఁ జేసె భూరమఁ బలు వేల, కొలఁది బాణాసారముల ములిగిరి
పార్షతుం డావెల్లిఁ బరిహరి భంజించి, ద్రోణపుత్రునిఁ గప్పెఁ బాణసమితి
తే. నప్పుడటయుధామన్యుసాత్యకులు ద్రౌణి, దేయులును దోడుపడ రాఁగఁ దెలిసికర్ణు
డాగ వారి ధృష్టద్యుమ్నుఁ డడరి ద్రౌణి, కార్ముకము త్రెంచుగాఁ జెందుఁ గాంపసమితి.

చ. గురుసుతుఁ డొండువిల్లు గొని గొబ్బున నబ్బలశాలి శక్తియున్
గురుగదయున్ శరాసనము గుఱ్ఱములున్ రథసూతకేతువుల్
ధరఁ బడ నేసి రాసిన నతండు హతాశ్వరథుండు గానఁ జె
చ్చెరఁ గరవాలముం గొనినఁ, జెండెను వానిని రెండుతూపులన్. 195

మ. విరథుండున్ విగతాయుధుండు నయి నిర్వేదించుపాంచాల్యుపై
శగవారంబు ననాలిగాఁ బురిపియున్ శౌర్యోజ్జ్వలు న్వాసిని

బరిమార్పంగ నశక్తుఁడై ద్విజుఁడు కోపం చేపు చూపంగ వి
ల్లరదంబం దిడి పాముఁ బట్ట గరుడుండై నట్టు బిట్టేచుచున్. 196

తే. తేరు డిగ్గ నుఱికి బోరున పార్థుఁ బట్ట నేగుచున్న పట్టునందు
వాసుదేవుఁ డరసి వాసవాత్మజుతో వచించె నిట్లు వేగిరించి కొనుచు. 197

ఉ. చూడుము చూడు మట్లు రిపుసూదన! పార్థుఁ బట్టి చంపఁగా
వేడుక చేసి ద్రౌణి కడువేగముతోఁ బఱదెంచుచుండె నా
బాడబుచేతఁ జిక్కికొని ప్రాణము మిత్తికిఁ బెట్ట నోచు న
ల్లాడెడునీచమూవిభుని నాపదనుండి తొలంగఁ జేయుమా. 198

వ. అని పలుకుచు నతిత్వరితగమనంబునం బోవ వారువంబులం గొలుపుటయు నవి గగ
నంబు గబళించునవియుం బోలె వాయువేగంబునఁ బార్థునిరథంబు పరిసరంబున
కుం బఱతెంచునంత నంతకాకారుం డైనభారద్వాజతనూజుండు కృష్ణార్జునులం జూచి
సంభ్రమించి పాంచాల్యుం బట్టి కర్షించి ధర్షించుచున్నం గని నరుండు. 199

సీ. కదసిసకొలఁది బెట్టిదముగా గురుసూతి,యొడ లాడ వాలమ్ము లడరఁ జేసె
గాటంబు నొచ్చి యక్కడక మాని యతండు, మరలఁ దనరథంబు దరిసి యెక్కి
వి ల్లంది పార్థునిఁ బెల్లేయుచో నహా, దేవుఁడు పార్థుఁ దిగిచికొనుచుఁ
దన తేరిపై నిడి కొని తొలంగం జనె, నరుఁడంపఱిన్ ద్విజవరునిఁ బొదివి

తే. పెనఁగిన నతండతనివక్షమునను బాహు,యుగమునం బెక్కుతూపులునిగుడుచుటయుఁ
గాలదండంబునుంబోని వాలుటమ్ము, వెఱికి పార్థుఁడు క్రుద్ధుఁడై వ్రేసె నతని. 200

వ. అది వజ్రపాతంబు వోలె నశ్వత్థామమోముపయిం బడినదాన నతండు విహ్వలుం
డై వైక్లబ్యంబు నొంది రథోపస్థంబునం బడెఁ బడునంత నతనినియంత యెంతయుం
ద్వరమాణుం డై రణాజిరంబునుండి రథంబు తొలంగం దోలుకొని చనియె నాలోఁ
బాంచాలు రెల్లరు నుల్లంబునఁ బార్థుండు మోక్షితుం డగుటకును ద్రోణపు
త్రుంపు పీడితుం డగుటకును సంతసించుచు శంఖధ్మానంబులును సింహనాదంబులును
గావించి రయ్యెడరు సూడం జాలకకర్ణుండు గాండీవిపై విజయకార్ముకంబునఁ గాండం
బులు గుఱియుటయు నతం డతని గాండీవంబున గండడంచి వాసుదేవుం గాంచి
సంశప్తకానీకంబు మీఁదికిం దేరు వోని మ్మనిన నతం డట్ల యని కొంత చని
యటనుండి ధర్మరాజుం జూపుచు నతని కిట్లనియె. 201

సీ. ధార్తరాష్ట్రులు వీరె దర్పించి మీఁయన్నఁ, బట్టవచ్చుచునున్నవారు చూవె
యనలేంద్రు లమ్మహార్థు లగుదైత్యులం బలె, నాగిరి భీమసాత్యకులు వారి

నాఁగక పెక్కండ్రు రగుట వా రతని ముట్టఁగ నైరి సంద్ర మాపగలు వోలెఁ
దూర్యముల్ మ్రోసెడు దుర్యోధనునిబాఁతి, కగుతేఁడు మిత్త్రికి నైనవాఁడె
**తే.** వీరికిం జిక్కి శక్రుఁడే వెడల నోపఁ, డలిగి రారాజు ద్రోణికర్ణాదు లద్రి
నైనఁ బగులింప నేతు రి ట్లుంద తేక, మయిన నోర్చెదువారు లే రయ్య జగతి.**202**

—శ్రీకృష్ణుం డప్పటియుద్ధంబు బకివర్ణించుట—

మ. బలవంతుండు యుధిష్ఠిరుండు సమరప్రావీణ్యముం గల్గియుం
గలన న్నేఁ డొకసూతనందనుఁడు దాఁకం గాండివీకుండ నై
తొలఁగె న్వానికి ధార్తరాష్ట్రబలముల్ తో డయ్యెఁ దా నెంత కెం
తలకేఁ జాలెదు నిప్డు తద్భయ మిఁకం దర్కింప సామాన్యమే. **203**

క. ఉపవాసకృశుం డగుచున్, నృపవర్యుఁడు బ్రహ్మబలసునిష్ఠితుఁ డై తా
త్రపుబలముఁ గలుగఁ డందున, నిపు డావృషుఁ డఱుమ సంశయింపఁగనయ్యెన్.**204**

చ. కురుబలనాదముల్ విని వృకోదరుఁ డిట్లు సహించి యున్కిచొ
ప్పరసిన రాజుజీవితమునం దొకసంశయ మయ్యెడిం బరం
పరలుగఁ గర్ణుఁ డమ్ములను వైచుచు నుండఁగ సృంజయాదు ల
ద్దొరఁ బయి కుద్ధరించుటకు దోరుచు నుండిరి చూడు మర్జునా. **205**

సీ. మనరాజకేతువు గనరా దొకింతయుఁ నట భీమసేనాదు లరయుచుండఁ
గర్ణుండు దానిని గండరింపఁగ నోపుఁ, గాకున్నఁ గాన రా దేకతమును
జేదిపాంచాలాదిసేనలఁ గర్ణుండు, కమలాకర మిభంబు గలచునట్లు
కలఁచి బాణపరంపరలప్రయోగంబునఁ, దెఱలించి వెనుదన్ని పఱవఁ జేసె
**తే.** నదిగొ రథికులు వె న్నిచ్చి పదిదెసలకు, నార్తనాదము లిచ్చుచు నరుగఁ జొచ్చి
రకట చతురంగములు నిట్టి వయ్యె మనవృకోదరాదులు శినిముఖ్యు లుండి రురక.

చ. అరయుము హాస్తికతన్ మెఱయన్ వసుషేణుఁడు భీషణాకృతిన్
బరఁగి వృకోదరుం బొదువ వచ్చెడి హెచ్చినవానిచెంగటం
దొరలును నిల్వ నేర కొకతూఁకున వీఁక దొఱంగి సంగతిన్
సరగున వెచ్చఁ బెట్టి నడ సాఁగిరి కన్గన విచ్చి చూచితే. **207**

**తే.** పాండుసృంజయపాంచాలవరుల నిట్లు, గెలిచి కర్ణుఁ డిట్టిటు చూపు మెలపి చూచుఁ
జూడ నిన్నుఁ దలంపఁడు వేడుకమెయిఁ నేమొ లేకున్న నిం కొకహేతు వేది. **208**

**ఉ.** అక్కట! యేమి చెప్పెద నృపాత్మజ! కర్ణుఁ డుదీర్ణకోపుఁ డై
ముక్కున నావి యుండఁ బెరమూకలఁ బోవఁగ నీక పోరుఁ డీ

చక్కని రాజధర్మ మది సన్నుతి కెక్క యశంబు దక్క మీ
రెక్కటిరాజులార! యని యెల్లరఁ గొల్పుచునుండెఁ గంటివే. 209

సీ. కపికేతనంబున నిపుడు నిన్నెఱిఁగిపో, నర్థించె గర్ణుఁ డల్లదిగొ చూడు
మూర్వీధ్రములు మ్రోయ పూర్వీనినాదంబు, సేయుచు నేయుచు సాయకములు
నరుదెంచుచుండె దీప్తాగ్నిపైఁ బడుమిడుత విధంబు తనచాపు తాఁ నెఱుఁగక
యేకాకి యగువాని నెల్లకౌరవ్యులు, ననుసరించిరి రథికాగ్ర్యు లగుచు

తే. నీవు యశమును రాజ్యము నిత్యసుఖము, గోరితేనియు వీనితో వీరిఁ గూల్పు
మపుడు ధర్మజుకడఁ గర్ణుఁ డాచరించి,నయపరాధమునకు గురునాథుఁ డడలు. 210

వ. ఇపుడు దుర్యోధనునిపంపున నైదునూఱులరథంబులును నైదువేలయేనుంగులును బదివేలగుఱ్ఱంబులును బదిలక్షలబదాతిజనంబు నక్కర్ణునకుం గావలి యై నిన్ను మార్కొన వచ్చుచున్న వనిచెప్పి చెప్పునంత మఱియు నోకొంతేయా! చూడు మిట్లు కూడినసేనాసమూహంబుతో రాధేయుండు మనమీఁద రాక మాఱుమొగంబు వెట్టి పాంచాలబలంబుపై నడరఁ బోవుచున్న వాఁడు వానికేతువు ధృష్టద్యుమ్నరథంబున కై దుముకులాడుచున్న దని యూహించుచున్న వాఁడ నని కొంచెము విశ్రమించి మఱియుం బలికించి పార్థా! నీకుం బ్రియం బెఱింగించుచుంటి ధర్మపుత్రుండు కుశలియై యున్న వాఁ డదె చూఁడు మని మఱియును. 211

సీ. సాత్యకిసహితుఁడై సామీరి పాంచాల,బలమునకుం దోడుపడుచునుండె
వడముడి బెడిదంపువాలంపగములకు, గౌరవానీకముల్ కాలుకొలఁదిఁ
బాఱుచున్నవి చూడు పార్థ! తద్బలముల, నెక్కడఁ జూచిన నిడిసిపడిన
ఛత్రచామరములు చాపధ్వజంబులు, కుప్పలై తిప్పలై గొప్ప లయ్యె

తే. విఱిగిపడుచుండెఁ దేరులు వికలము లయి, నిట్టనీల్గుచు నున్నవి గుఱ్ఱములును
భిన్న లగుచుండె నేన్గులు బెలుకుమాలి, కాలుపురి కేగుచుండిరి కాలిబంట్లు. 212

వ. ధృష్టద్యుమ్నాదు లుక్కుమిగిలి శంఖంబులు పూరించుచుఁ బరబలంబుల నేలకుం గోలకుఁ దెచ్చుచున్న వారు రింరింగం బంతయు రక్తపాతం బగుచున్న యది విఱిగి పరాఙ్ముఖు లయిపఱచుతమబలగంబుల వారిం గృపకర్ణాదు లాఁగఁ జాలకున్న వారదిగో మనభీముండు భీముండై సింహంబు నా రంపహోగతి సింహనాదంబు సేయుచుఁ దనమీఁద గజానీకంబుతో గదియవచ్చిననిషాదనాథనందనుని బాహుయుగంబు బాణయుగంబునం ద్రుంచి శిరంబు పదిశరంబులం దెగ నేసి పద్దేసి ప్రదరంబుల నొక్కకదానిగా వానియేనుంగుల నెల్లఁబీనుంగులం జేసి పురందరవిక్రముం డై పరా

పరాక్రమించి ధార్తరాష్ట్రబలంబుల నార్తనాదంబు లెగయ నీక్షణంబున మూఁడ
క్షౌహిణులం దీనదశకు దెచ్చె నని యచ్యుతుం డెఱింగించిన విని ధనంజయుం
డాదంతం జాలి గాలిచూలి గ్రాలుచుండె నని తాను సంశప్తకులపైఁ గవిసి కసిమ
సంగుటయు వారును వానిమునుమునఁ గాలూనం జాలక కాందిశీకు లయి రనిన
ధృతరాష్ట్రుం డట్లు మనసైన్యంబు దైన్యంబు నొందినంత మనవా రేమిచేసి రనిన
సంజయుం డతని కి ట్లనియె. 213

—కురుపాండవయోధులద్వంద్వయుద్ధము.—

చ. బలగము లెల్లఁ బ్రెళ్ళఁబడ బాహుబలంబు చలం బెలర్పఁగాఁ
కల నొనరించుగాడ్పుసుతుఁ గన్గొని కన్గవఁ గెంపు నింపఁ బెం
పలరి దివాకరాత్మజుఁ డహంకృతి మీఱఁగఁ బాఱువారికిన్
నిలుకడఁ జెప్పి యప్పు డతనిన్ శరసంతతిఁ దాఁకెఁ దాఁకినన్. 214

వ. శైనేయశిఖండిజనమేజయధృష్టద్యుమ్నులును ధర్మరాజార్జుననకులసహదేవులును
యుధామన్యూత్తమౌజసులును ద్రౌపదేయులును బాంచాలప్రభద్రకులునుం
గలియ వచ్చినం గని దుర్యోధనదుశ్శాసనాదులును గృపాశ్వత్థామకృతవర్మలును
వృషసేనసౌబలోలూకులును లోనుగా నగుమనవారును వారిపైఁ గవిసి రప్పు డాలం
బాభీలం బయ్యె నందు శిఖండి భీముం దలకడచి కర్ణుం దాఁకె ధృష్టద్యుమ్నుండు
దుశ్శాసనుం దలపడియె నకులుండు వృషసేను నడిమె ధర్మరాజు చిత్రసేను నెదిరించె
సహదేవుం డులూకుం దాఁకె సాత్యకి శకుని మాఱ్కొనియె ద్రౌపదేయులు
కౌరవులం బొదివి రర్జునుం డాచార్యనందనుం దలపడియె యుధామన్యుండు కృపాచా
ర్యు మాఱుకొనియె నుత్తమౌజసుండు కృతవర్మ నాఁగె భీమసేనుండు దుర్యోధనాది
కురుకుమారుల నెల్లం బోరుకొనియె నయ్యవసరంబున. 215

సీ. సూతపుత్రుని శరవ్రాతంబున శిఖండి, గాఁడ నేసిన నతం డౌడు గఱచి
మూఁడమ్ములన్ వాని భ్రూమధ్యమునఁ గ్రుచ్చె, నతఁడప్డు శృంగత్రయాద్రి యనఁగఁ
దొనరి తొంబదియమ్ములను వానిఁ బ్రహరించె, నతఁడు శిఖండిరథ్యములఁ గూల్చి
సారథి మూఁడింటఁ జక్కాడి యొకకుప్పెకోల సిడంబును గూల నేసె
తే. హతహయరథంబు డిగి ద్రుపదాత్మజుండు శక్తి వైచినఁ గర్ణుఁడు సాయకత్ర
యమ్మునన్ దాని ఖండించి తొమ్మిదమ్ము, లేయఁగ శిఖండివివశుఁడై యేగె దొలఁగి.
క. సూతతనూజుం డంతట, వాతూలము తూల మట్లు వడిగలఁడై వి
ఖ్యాతమహాశస్త్రాస్త్ర,వ్రాతంబున నెగుర నేసెఁ బాండవసేనన్. 217

శా. ధృష్టద్యుమ్నుఁడు పీడితుం డగుచు నెంతే నల్గి దుశ్శాసనున్
ధృష్టుండై శితసాయకత్రయమునన్ ది మ్మెత్తఁగా మొత్తినన్
స్పష్టామర్షుఁ డతండు వానిభుజమున్ భల్లంబున న్నొంచి యు
త్కృష్టోజోగరిమంబు చూపె తెఱుఁగిం దీపించె సంచద్గతిన్. 218

క. కనుఁగవ నసలం బొలుకన్, ఘనుఁ డాపార్షతుఁడు కనలి గాఢశరం బొం
డొనరంగఁ దిగిచి దుశ్శాసనునిపయిన్ బడఁగ వైచె సరభస మెసఁగన్. 219

క. మూఁడమ్ముల దుశ్శాసనుఁ, డోడక పయిఁ బడెడుదాని నుక్కడఁచి యురం
బాడఁ బదునేడుకోలలఁ, గ్రీడకు బలె ద్రుపదసుతునిఁ గినుక నొగిల్చెన్. 220

తే. క్రుద్ధుఁడై పార్షతుం డొక్కకుప్పెకోల,నీతనయువిల్లు దునిమిన నాతఁ డొండు
పూని తూపులవెల్లిలో ముంచె వాని, ఖేచరులు విక్రమం బది చూచి రిచ్చ. 221

వ. అట్లు ఱిచ్చపడియున్నపార్షతునకుం బాసటలై పాంచాలసైనికులు పెక్కం డ్రొక్క
మొగి డాయ వచ్చినం బోరు ఘోరరూపం బయి సెల్లె నంత. 222

చ. నకులునిఁ గర్ణపుత్త్రుఁ డిరునాలుగుతూపుల నే పడంచి తం
డ్రికడ మెలంగినం గని కడింది మగంటిమిఁ బూని మాద్రిపె
ద్దకొడుకు నవ్వమోమున నెదం బడ వానిని నొక్కతీక్ష్ణసా
యకమున నొవ్వఁ జేయుటయు నావృష సేనుఁడు రోషభూషితుఁడై. 223

క. ఇరువదిశరముల నకులునిఁ, బరిమర్దించుటయు నతఁడు పంచాశుగముల్
పరువడి నేసెన్ వా రిరువురు శరములఁ గప్పు కొనుచుఁ బోరిరి పెలుచన్. 224

వ. అట్లు వారిరువురుం గప్పికొని పెనంగుచున్నం గని మనచతురంగబలంబు లంగవింపం
జాలక పలాయనంబు సేయుటయుం గర్ణుండు వాని ననుసరించి నిలువరించు చున్నంత
నకులుండు వృష సేనుం గ్రేడించి కౌరవుల నఱుమ నరిగె వృష సేనుండును నకులున్
విడనాడి తండ్రికిఁ జక్రరక్షకుం డయ్యె నాలోన. 225

మ. సహ దేవుండు నులూకునిం బొదివి దోస్సారంబు తోరంబుగా
బహుబాణంబుల నేసి వానిఁ దురగవ్రాతంబులం ద్రుంచి సు
స్పృహతో వానినియంత నంతకపురిన్ సేవింపఁగాఁ బంపుడుం
గుహనాత్ముం డయినన్ భయంబున నులూకుం డోడి పాఱె న్వడిన్. 226

ఉ. సత్యకసూనుఁ డాశకునిసాయకవింశతి విద్ధుఁ జేసి సం
స్తుత్యముగాఁ దదీయరథశోభితకేతువుఁ గూల నేసినన్
సత్యపరాక్రముం డతఁడు సాత్యకికత్తళ ముత్తఱించి తే

జోత్యధికప్రభావనిధి యైనపతాకఁ బగిల్చెఁ బెల్చనన్. 227

**తరువోజ.** అరికి దానికి సత్యరాత్మజుఁ డతని, యంగ నూడఁగ నేసె యవలఁ దత్సూతు
తలఁ ద్రుంచి హరులను దగిలివధింప, ధరణికి లంఘించి తనయుతేఁ రెక్క-
తలఁగి పోవుటయు సాత్యకి మాఱుమలయు,ధానుష్క లట లేమి తవిలి సైనికుల
గలఁగించుటయు వారు గడుబీఱు నొంది, కడ లంటఁ బఱచిరి కా లూన లేక. 228

**సీ.** భీమసేనుండు నీపెద్దకొడుకుతోడఁ, బోరుచు త్రేళ్ళిడి వారువములఁ
గూల్చి సూతునిఁ బిల్కుమార్చి కేతువుఁ ద్రుంచి,తేరు సాంగముగ మర్దించుటయును
వారి కుల్లాసంబు వీరికిఁ ద్రాసంబు, గూడ సుయోధనుఁ డోడి పాఱెఁ
బరమప్రతాపాతపము గాయభీసూర్య,మును మ్రొల్ల నీ అయి పోవునపుడు

**తే.** ప్రబలి కురుసైన్య మతని నొంపఁగను జూపఁ,గను దలంచుచునొకపెట్ట గవిసి యులివు
పుట్టఁ గడలంట మార్కొని పోఁగ నలిపె,భీషణం బని వేల్పులు పిచ్చలింప. 229

**తే.** గౌతముని యుధామన్యుఁడు గవిసి విల్లు,విఱుచుటయు నాతఁ డొండొక్కవిల్లు పూని
ద్రుపదపుత్రుని సూతునిం దునిమి కేత,నాతపత్రంబులం గూల్ప నతఁడు తొలఁగె.230

**మత్త.** ఉత్తమౌజసుఁ డత్తఱిన్ వివిధోగ్రబాణపరంపరన్
హార్ది మీఁకృతవర్మఁ గప్పిన నద్భుతాహవ మయ్యె న
య్యుత్తరిన్ యదువీరుఁ డాతని నొర్చి వక్షము గాఁడఁ గా
నెత్తి భల్లము నేయ మూర్ఛిలె నెంతయో నతఁ డార్తుఁడై. 231

**వ.** సారథియు వానిరథం బాయోధనంబునకు విముఖంబు గావించె నంతఁ గీచకాంత
కుండు దుర్యోధనుని విముఖుం జేసి గంధసరినం గాంచి సౌబలదుశ్శాసనులు బహుల
భద్రగజానీకంబుతో నెదిరించిన నతండు ప్రచండకాండంబులు నిండ్రుండు కొండ
పిండుం బోలె నవ్వేదండంబులఁ బిండివెట్టుటయు సువర్ణజాలపిహితంబు లగునవి
మెఱుంగులతోడ మేఘంబులచందంబునం బొందుపడియు బొందళంబులతో నంగం
బులును దుండంబులును గండంబులునుం దెగ విగతప్రాణంబులై క్షీణపుణ్యంబులైన
గ్రహంబులవిధంబున వేనవేలు నేల పాలయ్యె నాకర్ణింపుము. 232

**సీ.** నల్ల కాయం బెల్ల వెల్లువమై పాఱ, ధాతుభూ ప్రము లనఁ దనరునవియుఁ
గండాగ్రములయందుఁ గాండముల్ నాఁటిన, నార్చి చిట్టునఁ దిరుగాడునవియుఁ
జిచ్చుటంపఱమేను వెచ్చగిలం దిక్కు,తోఁచక త్రొక్కుటఁ దోఁగునవియుఁ
బిడుగున కెత్తైన నడముడి విల్లుమ్రోఁత, కడలి విణ్మూత్రముల్ విడుచునవియు

**తే.** మఱియుఁ బెక్కు తెఱంగులఁ దెఱలునవియు,నడచు దుశ్శాసనుని మొన నదరునేన్గు

గుములు కూలియు వ్రాలియుఁ గొంతలోన, గినదశ కయి నశియించె మానవేంద్ర.

క. అగ్గలిక భీముఁ డిభముల, నుగ్గాడుచునుండ నర్జునుఁడు బడబను సా
బగ్గు మని మండి వార్ధికిఁ, దగ్గనికురుబలముఁ గెలిచె దర్పోద్ధతుఁడై. 234

వ. అయ్యవసరంబునఁ గురుకుమారాధ్యక్షుండు కోపాటోపదీపితుండై చతురంగబలంబుతో
యుధిష్ఠిరుం దాఁకి. 235

ఉ. డెప్పర మైన తేజు గలడెబ్బదిమూఁడుక్షురప్రముల్ రయం
బొప్ప నజాతశత్రుపయి నుద్ధతి నేయ నతండు క్రుద్ధుఁడై
ముప్పదిభల్లముల్ తిగిచి భూపతికాయము గాఁడ నేసినన్
ముప్పన కై సుయోధనుఁడు ముందు లెఱుంగక యుండె మందుఁడై. 236

—ధర్మరాజు కర్ణునితోఁ బోరి విముఖుం డగుట.—

వ. అట్టియెడఁ గౌరవు లెల్లరుం గూడి ధర్మరాజుం బట్టుకొనం దలంచి తఱిమి వచ్చు
చున్న నన్న యెఱింగి నకులసహదేవులును భీమసేనధృష్టద్యుమ్నులు నేకాక్షౌహిణీ
సేనాసమేతులై పఱతెంచి నీవారి నణఁచుచున్నం గని రాధేయుండు రయంబున
వారికెల్ల నడ్డుపడి దొడ్డనారసంబులును దోమరంబులును శతసహస్రంబులుగం బఱ
గించుచు నెరికిం దేరిచూడరాక వీఁకం జూపుచుండె నాలోన సహదేవుఁ డిరువది
శరంబుల దుర్యోధనుని వేధించుటయు నతండు రుధిరాప్లుతగాత్రుం డయ్యె నయ్య
వస్థం గని కనలి కర్ణుం డుదీర్ణపరాక్రమక్రమంబున ధృష్టద్యుమ్నాదులం గనుపు
గొట్టుచు బెట్టంప సెలకట్టియల నిట్టబొడుచు చున్నంతఁ బాండవబలంబులు వెఱ
చఱచి పఱచె నంతఁ గౌంతేయాగ్రజుం డుగ్రమూర్తియై కర్ణుం బొదివి. 237

చ. ఇరువదియైదుతూపు లొగి నేడ్తెఱఁ జూపుచు నేసి కర్ణుపై
శరములవర్షముం గురిసి శౌర్య మవార్యము గాఁ దలిర్చుచున్
బారిపారి నీచమూచయము పొల్లులు వోవఁగఁ జేసె నప్డు చూ
పరయగ నెందు నెందుఁ జను నందును నందును గుంది డిందఁగన్. 238

శా. రోషప్రస్ఫురితాననుం డగుచుఁ గర్ణుం డర్ణవోదీర్ణుఁడై
యూపాదండసమున్నతాశుగశతుల్ హెచ్చిల్లి యిష్వాసము
ద్ఘోషింపన్ యమనందనాంగకములందుం బొందుకోఁ జేసి ప్ర
ద్వేషింపం బ్రహరించె రాజు పదు లైదింటన్ రవిప్రోద్భవున్. 239

మ. అలుకం గర్ణుఁడు గర్ణపూర్ణముగ నిష్వాసంబు కర్షించుచున్
జులుకన్ శాతశరత్రయుం బతనివక్షోభాగ మాడంగ నే

సి లలిఁ గవ్వెను నొవ్వనం బడి నృపశేఖరుండు మే న్వ్రాల్చి తే
ర్దొలఁగం దోలు మటంచుఁ జెప్పటయు సూతుం డట్లు చేసె న్వెసన్. 240

ఉ. పట్టఁడు ధర్మపుత్త్రు సని పల్కుచుఁ దమ్ములతో సుయోధనుం
డట్టియెడన్ నభస్థలము నంతయు నెంతయు మ్రోయ నార్పు ల
ట్టిట్టును మెట్టుచుం దఱియ నేగుటయుం బదునాల్గునూర్లపై
బెట్టినసృంజయోత్తములు బెట్టుగ నాఁగిరి వారి నందఱన్. 241

వ. ఇట్లు సంకులసంగ్రామంబు సెల్లుచున్నంతం గిమ్మీరాంతకుండు దుర్యోధనుం దలఁ
పడి ఘోరయుద్ధంబు గావించెఁ గర్ణుం డట్లు ముట్టడించిన కేకయపాంచాలాదివీరులం
బిట్టేయుచు నేనూఱుతేరులవారిం బారంబు నొందించెఁ గర్ణబాణపీడితు లెల్ల వృకో
దరునిమఱువు సొచ్చి రప్పు డొప్పరికింపక నకులసహదేవసహితుండై శిబిరంబునకుం
బోవ జతనించిన ధర్మపుత్త్రుం గాంచి సూతపుత్త్రుండు ధార్తరాష్ట్రపతికిం బ్రియంబు
సేయువాఁడై సరయంబునం జనుదెంచి శరాసారంబునిగిడించుచు నడ్డగించి. 422

సీ. మూఁడుతూపుల మేను గాఁడ నేయుటయున, కౌంతేయుఁడును దత్క్షణాంతరమున
మూఁడమ్ము లడరించి మూఁట సారథి నొంచి, నాల్గింట హయముల నవయఁ జేసె
నపుడు మాద్రీసుతుఁ డదరి యన్నకు నెడ, రెసగించు రాధేయు నెడఁద గాఁడ
శరవర్ష మొలికినఁ గర మల్గి కర్ణుండు, గవల రెండమ్ములఁ గడఁగి యేసి

తే. కాలవాలమ్ములై దంతకాంతి నెసఁగు, రాజహంసముఁ దునిమి శిరస్త్రాణ మూఁడి
పుడమిఁ బడ నేసి నకులుశత్తుల నట్లు, చేసి విలు ద్రుంచి కాడియుం జెడగఁ జేసె.

—శల్యుం డర్జునునితో యుద్ధంబు సేయు మని కర్ణునకుం బరికొల్పుట—

చ. విరథులు గాన నిద్దఱును వీతమనోరథులై ధరిత్రికిన్
దెరలుచు డిగ్గిపోయి సహదేవునిస్యందన మెక్కి రంతలోఁ
గరుణ దలిర్ప మద్రపతి కర్ణునిదిక్కు మొగంబు ద్రిప్పి యో
పురుషవరేణ్య! యేమి యిటు పోరుచు నుంటివి కోరి వీనితోన్. 244

తే. క్షీణశస్త్రాస్త్రుఁడై శాంతిఁ జెందియున్న, ధర్మనందనుతోఁ బోరఁ దలఁపు నేఁత
మేటివిలుకాఁడ వగునీకు మేర గాదు, కలఁడు గద వాఁడె పార్థుఁడు గండుమీఱి.

క. ని న్నపహసించు ఫల్గునుఁ, డన్నం బెడచెవులఁ బెట్టి యమ్ముగుర శర
చ్ఛన్నాంగులఁ గాఁజేయుచు, నున్నం గర్ణునకు శల్యుఁ డొయ్యన మఱియున్. 246

క. ఎందులకు నిన్నుఁ గురురా, జుం దమ్ములు గౌరవించి చూచిరొ దానిం
డెందమునఁ జేయ నెంచక, సందడికయ్యముల కగుట చనునే కర్ణా. 247

ఉ. ఈతనిఁ జంపి యేమిఫల మీవు గొనం గల వల్లవాఁడె వి
ఖ్యాతయశుండు ఫల్గునుఁడు కౌరవసైన్యము చిందువందు గా
శాతశరంబులం బఱపి జర్జరితం బొనరించుచుండెఁ దో
డై తనముఖ్యబంధు లగునందఱు పొందుపడన్ రణంబునన్. 248

ఆ. అతనిపృష్ఠరక్షులై యుధామన్యూత్తమౌజసులును జక్రమోజఁ గాచి
ద్రుపదపుత్త్రశినివరులు నిల్వ శంఖ మొత్తుచుఁ బెనంగు నతని దొడరు మిపుడు. 249

వ. అని మఱియును. 250

శా. క్రీడార్థం బిట వీరితో నిటులు పోర్వెంనంగ నే మయ్యె న
వ్వాఁడే భీముఁడు భీమవిక్రముఁడు భూపాలు న్వడిం దాఁకి పై
దోడుల్ సూడ నొకండు సేయుటకు నై దోశ్శక్తిఁ జూపించు న
గ్గోడుం దీర్పుము తేనికిం బ్రజలకున్ గొబ్బిళ్ళకుం గాల మే. 251

క. అనినన్ విని రాధేయుం, డని భీమగ్రస్తుఁ డైనయవనీశ్వరునిం
గని వానిఁ గాచుబుద్ధిం, జనియె వడిన్ వడిగ విడిచి శమనాత్మజునిన్. 252

వ. అట్లు రాధేయుండు చనిన నిదంపడి పాండవాగ్రజుండు నకులసహదేవసహాయుండై వ్రీడాభరంబున నిర్వేదించుచు నిలువక నిజశిబిరంబునకుం జని రథావతరణంబుచేసి లోనికిం జని మేను శయనంబునం జేర్చి నిపుణానీకశల్యుం డయ్యు హృదయశల్యాని పీడితుండై మాద్రేయులం గనుంగొని మీరు సామీరికిం దోడుపడం బొం డనిన వారు రథాంతరంబు నధిరోహించి రణరంగంబునకుం జని రయ్యవసరంబున నాచార్యనందనుండు బహులసేనాపరివృతుండై సహం దాఁకిన నతండు వేల మకరాలయంబునుం బోలె నాగుడుం గోపించి చాపాచార్యనందనుండును. 253

తే. వాసుదేవార్జునుల శరవ్రాతమునను,మునుఁగు పెట్టుటయును గని మొనయుకురువ్ర
షభులు విస్మితులై రంత సవ్యసాచి, యేచి నవ్వుచు దివ్యాస్త్ర మేసె వెసను. 254

శా. ప్రత్యస్త్రంబున దానిపై ల్లడఁచి విప్రశ్రేష్ఠుఁ డంత న్నరుం
డత్యంతప్రభ నెన్ని యేసిన నతం డన్నింటి నస్త్రంబులన్
సత్యప్రజ్ఞ యెసంగఁ దున్మడు మహాస్త్రజ్వాలలం గ్రక్కుచున్
బ్రత్యర్థుల్ మది పెచ్చలింప నడరెన్ బ్రత్యక్షకాలుం డనన్. 255

చ. దివి భువియు న్దిక్కులును దిక్కులు నిండఁగఁ గాండజాలమున్
జవమున నేయుచున్ నిశితసాయకముల్ నిగిడించి మూఁడు మా
ధవునిభుజంబు నొంచుటయు దాని సహింపక సవ్యసాచి గాం

డీవగుణనిక్వణంబునను నింగియు నేలయు బూరటించుచున్. 256

—అశ్వత్థామార్జునుల ఘోరయుద్ధము—

చ. గురుసుతపక్షపాతు లయి కోపము సూపుచుఁ బోరువీరులన్
సరథనియంతృవాహముగ శాతశరంబుల భూతలంబునం
దొరఁగఁగఁ జేసి నెత్తురులు దొప్పలు దోరలు వఱ్ఱు వాఱఁ గాఁ
గరములుకం బొనర్చెఁ దనకైవడికిం దొర లెల్ల మెచ్చఁగన్. 257

వ. అట్లు సవ్యసాచి సాయకాసారంబున సర్వజనక్షయం బగుచున్న సమయంబున నశ్వత్థామ ధనుష్టంకారము సేయుచు నర్జునుం దరియ వచ్చి చిత్రజల్లు పెల్లురేగి నట్లు నిశితశరపరంపరల నల్లెడం జల్లి పెల్లురేఁగి యొక్కవాఁడితూపు క్రీడిఱొమ్ము గాఁడ నేయుటయు నతండును. 258

మ. శరవర్షంబున ద్రౌణిఁ గప్పి వడిఁ దచ్చాపంబు కోపంబునం
బరిశాంతం బొనరించి మించుటయు నాబ్రహ్మాన్వయుం డుగ్రుఁడై
బరిఘుంబుం గొని యేయ దానినడుమన్ బాణత్రయిం ద్రుంచె న
న్నరుఁ డుర్విం బడె నద్ది వజ్రమునఁ గొండం బోలి ఖండంబులై. 259

సీ. కినిసి శారద్వతీతనయుండు రౌద్రాస్త్రవేగంబున న్నరు వీఁగఁ జేసి
యాసునం గల్పించె నింద్రజాలము దాని, నీక్షించి భీభత్సుఁ డాక్షణమున
నింద్రసృష్టం బగునిద్ధాస్త్ర మొక్కఁడు, సంధించి యేసి తజ్జాల మెల్ల
మాయించి బహువిధమార్గణగణముల, ద్రోణాయనిరథంబుఁ దొడరి ముంచెఁ
తే. బార్థబాణాభిభూతుఁడై బ్రాహ్మణుండు, బెగ్గడిల్లక పేర్వాడి బిగిసి నూటఁ
గృష్ణునిఁ గలంచి మున్నూట జిష్ణు నొంచి, హెచ్చి యార్చెను వేల్పులు పిచ్చలింప.

ఉ. అంత బకాంతకానుజుఁ డహంకృతి మీఱఁగ మాఱుకొంచు దు
ర్దాంతదురంతసాయకశతమ్మున నమ్మహితాత్మమర్మముల్
వింతగ వ్రయ్య నేసి రథవీతులు సూతుఁడు విల్లు దూలఁ గా
నింతలు గానితూపు లెలయించియు సూతునిఁ ద్రుంచెఁ ద్రుంచినన్. 261

క. ధృతి దూలక గురుసుతుఁ డప్రతిహతశౌర్యమునఁ దాన రథచోదకుఁడై
మితిమీఱ నేస నాశుగ,తతు లర్జునుమీఁద దొరలు దన్నగ్గింపన్. 262

మ. ఎలన వ్యాననసీమఁ దోప నరుఁ డంతే నశ్వరశ్మల్ తెగన్
జలిపెం జొప్పడుకుప్పెకోలలు తగన్ సంధించి బంధంబు వోఁ
బొలుపుం దప్పి శతాంగ మీడ్చుకొని మావు ల్పెద్దద వ్వేగ నీ

బలమం దార్తనినాద మెంతయును సంప్రాప్తించె నప్పట్టునన్. 263

క. చెలరేఁగి సింహనాదము, లొలయించుచు రిపుబలంబు లోహటిలక నీ
బలములఁ దఱిమిన నయ్యావి, నిలఁ జాలక పఱచె దొరలు నిలిపినయేనిన్. 264

వ. అట్లు పలాయనపరాయణం బయిననిజ సైన్యంబు దైన్యంబు గనుంగొని నీతనయుం
డంగపతిం గాంచి ప్రణయపూర్వంబుగ ని ట్లనియె. 265

శా. పాంచాలార్దితమై బడల్పడి కదుర్ పాఱన్ బలంగంబుఁ గ
న్గొంచు న్నీ విట నుంటి వి ట్లగుట నాకుం జూడ నాశ్చర్య మే
మంచుం జెప్పెద నిప్పు డార్పులు నభం బంటంగ నీపైఁ బగం
గొంచున్ వే గురుయోధముఖ్యు లదె గర్గో ల్వేటుచున్నా రయో. 266

వ. అనిన దుర్యోధనునివచనం బాకర్ణించి కర్ణుండు కోపఘూర్ణితనయనుండై నవ్వుచు
నంత నమ్మద్రనాథు నాలోకించి యి ట్లనియె. 267

—కర్ణుండు విజృంభించి పాండవబలంబుపైఁ గవియుట—

మ. భుజశౌర్యంబును నస్త్రవీర్యము జనంబుల్ సూచి మెచ్చంగ నేఁ
బ్రజవిత్వంబున నిష్ఠ పాండవులతో బాంచాలురం దున్మదన్
విజయం బేర్పడు ధార్తరాష్ట్రునకు నీనే ర్పొప్ప నశ్వంబులన్
ధ్వజనీమధ్యముఁ జేరఁ దోలుము వడిన్ ధాత్రీతలాధీశ్వరా. 268

వ. అని పలికి సూతపుత్త్రుండు విజయం బనుతనధనుశ్శ్రేష్ఠంబు పుచ్చుకొని సజ్యంబు
గావించి దాని నగ్గించుచు సత్యశపథవాక్యంబుల నిజయోధుల నెల్ల నిలువరించి
మించినవేడ్క భార్గవాస్త్రం బభిమంత్రించి సంధించి ప్రయోగించుటయు నమ్మహ
నీయాస్త్రప్రభావంబున. 269

మ. అయుతంబుల్ ప్రయుతంబు లద్భుతసహస్రానేకకోటుల్ మహో
గ్రయశస్త్రంబులు పుట్టి పాండవచమూసందోహమం దెందు నే
నియు నొక్కింతెడ లేని యట్లు ముసుఁగు న్వేయంగ హాహాకృతుల్
భయదాకారముతోడ నుప్పతిలె నవ్వంకం గడు న్నెవ్వ గన్. 270

మ. కరులుం ద్రెళ్లె రథంబులుం దెగెఁ దురంగవ్రాతముల్ మ్రొగ్గెఁ గా
ల్వురునుం గూలిరి నెత్తురుట్టు వఱలెన్ భూకంపముం గల్గె వె
ల్గరయన్ రానిది యయ్యె నార్తనినదం బావిర్భవించెం గదున్
హరుసం బయ్యెఁ బిశాచకోటులకు నం దాభార్గవాస్త్రోన్నతిన్. 271

క. పొగ లేనినిప్పువోలెం, దగ వెలుగుచుఁ గర్ణుఁ డొకఁడు తద్బల మెల్లన్

రగిలించి పుచ్చెఁ బోటరు, లగువారును వెఱచి పఱచి రార్తరవమునన్. 272

వ. అట్లు సూతపుత్త్రాస్త్రహతులై పాండవపాంచాలసైనికులు వనదాహంబున వేదండం
బులుంబోలె నాక్రోశించుచుఁ గృష్ణార్జునులం బేర్కొనుచున్న నరుం డాకర్ణించి
కృష్ణుం గాంచి. 273

మ. అదిగోఁ జూడుము భార్గవాస్త్రమహిమం బయ్యస్త్రరాజంబు పె
ల్లదుమం జాలము సూతపుత్త్రుఁ డిపు డత్యంతప్రతాపోన్నతిం
బొదలున్ వ్యాత్తముఖాంతకుం డనఁగ నేపుం జూపుచున్నాఁడు నా
దుదెసన్ వచ్చెడు వానితోఁ బెనఁకువం దోఁగన్ సమర్థుండ నే. 274

తే. బ్రదికియుండినఁ బురుషుండు కదనమందు,జయపరాజయములు నొందఁ జాలుఁ గాని
కడచనినయంత భంగంబు గాక యేమి,యుండు జయ మేమి సుఖ మేమి యో మహాత్మ.

వ. అనిన దేవకీనందనుండు తనమనంబున నితండు కర్ణునిపైఁ గవియకమున్న కొంత సేద
దేరుట సమంజసం బని తలంచి ధనంజయుం గాంచి మీయన్న కర్ణబాణపరిక్ష
తుండై యున్నవాఁ డతనిసేమం బారసి వచ్చి కర్ణుం జంప వచ్చు నని యుధిష్ఠిరుం
జూచుతలంపు గొలిపి రథంబు నడపుటయు నర్జునుం డాసేనాసమూహంబున నెందును
ధర్మజుం గాన కట నాచార్యపుత్త్రునిం గాంచి వానితో నించుక సంగరంబు గావించి
పరిత్యజించి పోవుచుఁ బృతనాముఖస్థు లయినశూరులం జూచి సంభాషించుచు
నొక్కచో వృకోదరునిం గని సంతసించుచు నగ్రజుఁ డెందున్నవాఁ డతనివృత్తాం
తంబు సెప్పు మనిన నతం డతని కి ట్లనియె. 276

— అర్జునుండు భీమసేనుం గని ధర్మరా జెందున్నవాఁ డని యడుగుట —

సుగంధి. కర్ణబాణపీడితుండు గాన నగ్రజన్ముఁ డ
ధ్యర్ణమందు నేను లేనిపట్ల నిందు నుండి తాఁ
దూర్ణ మేగె నెందొ కాని తోఁప దెట్టు లుండునో
నిర్ణయింప నేర నుర్వినేతజీవితం బయో. 277

వ. అనిన సోదరుండు వృకోదరున కి ట్లనియె. 278

క. సూతసుతశితశరంబుల, కాతఁడు సంతప్తగాత్త్రుఁడై వీడు సనం
జేతము సేయం బోలు నీ, వీతఱిఁ గని రమ్ము వాని వృత్తం బనఘా. 279

మ. అకటా! ద్రోణునిసంప్రహారముల కాపంతైన వెన్నియుఁ డిం
తకు నాతండు జయార్థియై నిలిచె జన్యంబందు నేఁ డిట్లు ఘా
తుకుఁ డాసూతునిచేత సందియము నొందుం జూవె నీ వేగి య

న్నకు సౌఖ్యం బగు నెంచి ర మ్మిట నరిన్ వారింతు నే నేర్పునన్. 280

వ. అనిన నమ్మరుననందనుండు మరుత్వన్నందున కి ట్లనియె. 281

ఆ. నీవ యెఱఁగిరమ్ము నృపతి ప్రవృత్తిని, బోవ నొల్ల నేను బోతి నేని
పగఱు నన్ను భీరునిగ నెంతు రనవుడు, నర్జునుండు మఱియు నన్న కనియె. 282

క. అదె సంశప్తకు లఱుముచు. నద నెఱఁగి దడంబు లగుచు నడరి కడుం బె
ట్టిదముగ నాతోఁ బోరం, గదలికఁ జనుదెంచుచుంట కంటె మహాత్మా. 283

ఆ. నేను వారినెల్ల నేపడంపక యుండ, నిచోటు వాసి పోవ నెట్లు నేర్తు
ననిన భీమసేనుఁ డనియె నెల్లర నేన, క్రమ్మఱింతుఁ బోయిరమ్ము నీవ. 284

—కృష్ణార్జునులు ఘర్మరాజు సేమం బరయ శిరంబునకుఁ బోవుట—

వ. అనిన నర్జునుం డట్ల యగుం గావుత మని దేవకీనందనుదిక్కు మొగంబై నే
నయ్యజాతశత్రుం జూడఁ గోరితిం గావున నిబ్బలార్ణవంబునుండి రథంబు రయంబునం
బోవ నిమ్మనిన నమ్మహాభావుండు మావులం ద్రిప్పి భీమసేనుం బిలిచి యి ట్లనియె.

ఆ. భీమసేన నీదుబిరుదుమగంటిమి, కెంతయేని మెత్తు నిప్పు డెల్ల
పనికి నొక్కరుండ వనక నిన్ జాలించి, పోవుచుంటి మరులఁ బొడిచి గెలుము. 286

వ. అని పలికి వాసుదేవుం డచ్చటి కర్జుం బెల్ల భీమసేనున కప్పనంబు వెట్టి రథంబు
శిబిరాభిముఖంబు నేసి రథ్యంబుల రయంబునం బోవఁ దోలునంత నింతలో
రాజాంతికంబునకుం జేర నరిగి వా రిరువురును రథావతరణంబు జేసి యేకాకియై
శయనించియున్న శమనాత్మజుం దరియ నరిగి వానిసేమం బునికికి సంతసించుచుఁ
బాదాభివందనం బొనరించుటయు నతం డభినందించుచు వారు రాధేయు మ్రందిం
చి వచ్చిరకా తలంచి సంతోషించుచు స్వాగతం బడిగి మీదర్శనంబు నాకత్యంత
ప్రియదాయకం బయ్యె నని స్మితపూర్వంబుగం బలుకుచు హర్షగద్గదస్వరంబున
ని ట్లనియె. 287

ఉ. రామునితో మహాస్త్రముల రాణ నెఱింగి సమిద్ధతేజుఁడై
భూమిధనుర్ధరప్రవరభూషణుఁడై సమరాంగణంబులన్
భీమపరాక్రముం డగుచుఁ బేర్వడి యుండినకర్ణు నోర్చి మీ
రేమియుఁ గాక వచ్చితి రఁటే యిటు నాదగు వంత దీఱఁగన్. 288

మ. అని నాశీవిషతుల్యుఁడై పగఱ నేయం జాలి దుర్యోధన
ప్రణయం బెంచుచుఁ బుత్రపౌత్రయుతుఁడై ప్రాల్మాలి కుగ్రాకృతిం
జని సేనాముఖమందు నిల్చినమహాశౌర్యోన్నతుం గర్ణునిం

దునుమాడం జముఁడేని చాలు నని యెందుం జెప్పవాఁ డొప్పనే. 289

సీ. అతఁడు సర్వధనుర్ధరాగ్రేసరుఁడు సమ,రాభిరాముఁడు సకలాస్త్రవిదుఁడు
పరబలార్దనుఁడు వైశ్వానరతేజుఁడు, వాతజవుండు విఖ్యాతయశుఁడు
నిర్జరాజయ్యుఁడు నిభృతధైర్యస్థైర్య,గాంభీర్యనిధి యుద్ధకర్కశుండు
శక్రతుల్యబలుం డనక్రవిక్రముఁడు మ,హారథశ్రేష్ఠుఁ డత్యధికమూర్తి

తే. యయినరాధాసుతుని బోర నణిమి మీరు,సిరముపహావాడకుండ నసురుని సురలు
చెండి నట్లు చెండాడి వచ్చితిరె తమ్ములార! నాభాగ్యమేమనియందునిపుడు. 290

మహాస్ర. తనవారిం గూడి కాలాంతకుఁ డనఁ దగి యాతండు శైనేయముఖ్యుల్
గనుచుండఁగ నాపయిం దాఁ గవిసి కడువడిఁగ గాండముల్ గుప్పి నాకే
తనముం ఖండించి సూతుం దఱిగి హయములన్ ధారణిం గూల్చి పెల్చన్
గొని నన్నుం గెల్చి నాకుం గొఱవడఁ బరుషోక్తుల్ గడుం బల్కె నల్కన్. 291

—ధర్మరాజు కర్ణుండు తన్నుఁ బరాభవించె నని చెప్పుట—

చ. గెలిచి పరాభవించె నను గేరుచు వాఁ డట నున్నపార్షతుం
గెలిచె శిఖండినిం గెలిచెఁ గేశవసోదరు గెల్చె ద్రాపదే
యులఁ దొగి గెల్చె నెల్లర నొకుమ్మడి గెల్చె వృకోదరుండె నా
కెలన మెలంగకుండిన మొగి న్ననుఁ బట్టి వధింప కుండునే. 292

వ. అట్లు వానిబాఱిం బడి పులివాతికండవోలె నే నెట్లో చావునకుం దప్పి వచ్చితి
నని వివ్వచ్చు నుద్దేశించి వెండియును. 293

మ. పదుమూఁడేడులు నిద్రయుం సుఖమునుం బాయంగ నై నేను నా
హృదయాగ్రంబునఁ గర్ణునిం నిలిపి యేయేరీతి సంతాపముం
గదురం గాలము పుచ్చుచుండితినో శక్యంబే వచింపం బగం
దుద ముట్టించుట యెట్టులో యనుచు నెంతో చింత నన్నేచెడిన్. 294

శా. జాగ్రత్స్వప్నములందుఁ గర్ణభయముం శంకించి తచ్ఛాంతికై
వ్యగ్రాత్ముం డగునాకు నెం దొదుగఁ బో నందంద కర్ణుండె శీ
ఘ్రగ్రాహ్యంబుగఁ దోపఁ గర్ణమయమై కన్పట్టె నీలోక మ
త్యుగ్రప్రక్రియ నెల్లరుం బ్రదుకు టెట్లో యంచు శంకింపఁగన్. 295

క. అరసావు సంపి నన్నుం, గరుణించి యతండు విడిచెఁ గద తమ్ముఁడ త
త్పరిభవమున బ్రదికిననా. కరయఁగ నుసు రేల రాజ్య మది యేల యిఁకన్. 296

క. పడరానిపాటు పడితిన్, గడుసరి యగుకర్ణువలనఁ గయ్యంబున ము

న్నడరినభీష్ముఁడు గృపుఁడును, గురుఁడును నన్ని ట్లలంచి కొన రేమందుఁ. **297**

చ. అలఘుపరాక్రమంబున సురాసురకోటుల నైన నోర్వఁగాఁ
గలఁడు మహారథుం డయినకర్ణుఁ డుదీర్ణపరాక్రమంబునం
దలరి నిను న్వధించు నని తాఁ గొని యుండెను గాదె వాని నీ
వలయిక లేక యెట్లు తునుమాడితొ నా కది యెల్లఁ జెప్పుమా. **298**

చ. నరునకు మిత్తి వీఁ డనుచు నమ్మి సుయోధనుఁ డాదరింపఁ బొం
పిరివడి సూతపుత్త్రుఁ డనిఁ బెచ్చిలు నిచ్చ నిను న్వధింప నెం
చి రణముఖంబున న్నిలిచి శ్వేతహయుం గనుపించు వారికిం
బరిమితి లేనివిత్త మిడఁ బల్కిన వాఁ డిటు చావ నయ్యెనే. **299**

సీ. కొదమసింగము లేటికొదమతలం బలె, రాధేయుతల నేల రాల్చి తట్టె
నక్కలుం గుక్కలు నమలి యీడ్చుటకు నై, వృషలసంభవుమేను పృథ్విఁ బడెను
ఫాల్గునుం జంపక పదధావనము సేయ, ననుబాస చెల్లించుకొనక తెగెను
కురుసభలో నాఁడు గరిత నాడినదాన, ఫలముగా రణభూమి బడలువడెను

తే. షండతిల లని మనల నాసభ హసించు, నతఁ డవని నేన శూరుఁడ ననెడు నాతఁ
డిపుడు మన కిన్నిపాట్లకు హేతు వయిన, యతఁడు కడతేరిపో విన నయితి నటవె.

తే. కుండలోల్లసితం బయి గొనబుమీఱు, కర్ణమస్తక మిలఁ బడఁ గాంచి యున్న
ధార్తరాష్ట్రునిచేతులు దఱిగి వైచి, నట్లు గాకుండు నఁటె వాని కట్టెమెడల. **301**

చ. అకలుషకీర్తి కీర్తితమహాప్రతిఘారణిసంప్రభూతమున్
నిష్కృతిసమీరణేరితము నిశ్చలమున్ హృదయస్థితంబు నై
సకలశరీరమున్ వెలుఁగ సత్స్వేదువహ్నిని గర్ణుఁ డీల్గె నన్
ప్రకటితవాగ్జలం బిపుడు పర్వఁగఁ జేయుచు నార్పిపుచ్చుమా. **302**

తే. ఖలుఁడు కర్ణుండు దెగె ననుపలుకు లీవు, వినిచితేనియఁ జెవులార వినియు నాఁడు
వృత్రవధ మైనవెనుక దేవేంద్రుఁ డెట్లు, సంతసించెనొ నే నట్లు సంతసింతు. **303**

వ. అనిన శంకించుచు నయ్యజాతశత్రునకుఁ బురుహూతపుత్త్రుం డి ట్లనియె. **304**

—కర్ణుఁడు బ్రదికి యుండె నని యర్జునుఁ డన్న కెఱింగించుట—

శా. ఏ సంశప్తకసేనతోఁ బెనఁగుచో నేపారి భూపాలసే
నాసందోహముతో నెదుర్కొని ధనుర్నాదంబు రోదోంతర
వ్యాసంగంబును బొంద ద్రోణతనయుం డాశీవిషాభాశుగ
ప్రాసాసి ద్రుఘణాదిసాధనములన్ బాధించెఁ గ్రోధించుచున్. **305**

స్రగ్ధ. ఏ నా సేనాసమూహావృతుఁడ నయి వడిఁ బెచ్చుసేనానితేరుల్
బీనుంగుం బెంట లై పోఁ బృథులశరములన్ జేర్మిఁ బెల్లార్చుచుండన్
దా నంతే నల్గి నేత్రాంతముల మిడుగుఱుల్ దద్దయున్ రాల నాగ్నే
యానేకానూనబాణాహతుల హరిని న న్నాని నోనేసె నీశా. 306

సీ. మండలీకృతకార్ముకుం డయి సవ్యాప, సవ్యముల్ తెలియని చందమునను
సంధానమోక్షాదిసమయవిభాగంబు, లేనట్లు గాలాబ్దపూ ననంగ
నాతఁ డాకర్ణపూర్ణాయతవిప్రముక్తాశుగాసార మవ్యాహతముగ
నడరించి ముంచె మ మ్మవి యెన్ని దేసియె, ట్లాన నెన్మిదినూర్ల కయ్యో బండ్లు.

తే. వాని నన్నింటి నే మేఘపటలములను, మారుతమువోలెఁ దెఱలింప మడిపడుచు
నన్ను నీహరి నైదైదు నారసములఁ, బిట్టు నొప్పించె నెల్లరు పిచ్చలింప. 307

తే. వజ్రకల్పము లయిన ముప్పదిశరమ్ము, లపుడు నే వాని మేనునయందు నాట
నేదు వెఱఁగినచందాన నేర్పడి యతఁ, డంగముల నెత్రు గక్కుంగ నార్తుఁ డగుచు.

వ. వెన్నిచ్చి సూతపుత్రరథానీకంబునం జొచ్చె న ట్లతండు కాందిశీకుం డయినంతఁ
గౌరవానీకంబు లెల్లం గలంగి తొలంగిపోవు చున్నం గని రాధేయుం డేబండ్రు రథిక
వరులతోడం గసిమసంగి నన్ను మార్కొన నే నయ్యేబండ్రం బరిమార్చి కర్ణుం
గ్రేడించి నిన్నుం జూడ వచ్చితి నాకర్ణింపుము. 309

శా. సింగంబుం గనుఁ గొన్న లేళ్ళపగిదిన్ జెల్వొది యస్మద్బలం
బంగాధీశ్వరుబాఱి కగ్గ మయి ధర్మాసక్తి మైఁ బాఱిపో
వం గాంక్షింపక పోరుచున్నతఱి నవ్వైకర్తనుం డేచునూ
ర్లం గైకొంచు వధించె వీరవరులన్ బ్రత్యక్షరక్షఃక్రియన్. 310

ఉ. డయ్యక క్రుయ్యఁ గాతఁడు గడంక నెసంగుచు నుగ్రమూర్తి యై
ప్రయ్యలుగా బలంగముల వ్రాల్చుచు నుండుటఁ జూచి నీవు ము
న్నొయ్యన ద్రౌణితో నలసి యుండియు వెండియు వీని చూడ్కి కై
కయ్యము సేయుచుం దొలఁగి కాల్నడ కౌట యెఱింగి వచ్చితిన్. 311

క. ఆకడ నిప్పుడు కర్ణుని, వీఁక న్మార్కొనుచు గెలుచువీరుఁ డొకఁడున్
లేకుండ స్వర్గదీక్షితు, లై కడఁగి ప్రభద్రకవరు లని కైరి నృపా. 312

వ. నే నిప్పుడ పోయి సాత్యకిధృష్టద్యుమ్నులు చక్రరక్షకులుగా యుధామన్యూత్త
మౌజసులు పృష్ఠరక్షకులుగా నేపు సూపి సూతనందనునితో నాస్కందంబు
గావించి పుత్రమిత్రపరివారసమేతంబుగా వానిం జెగటార్చెద నట్లు కానినాఁడు

సద్గతికిం దప్పినవాఁడ నగుదు నిది యెల్ల నుల్లంబు పల్లవింప నీవునుం జూడరా నను గ్రహింపు మిప్పు డట భీమసేనుం డొక్కరుండ యక్కురువీరులతోఁ బోరుచున్నవాఁడు నే నిటఁ దడయుం దగ దంపిపుచ్చు మనిన విని యుధిష్ఠిరుండు రాధేయుండు బ్రదికి యుండె నని యెఱింగి తదీయశరాభితప్తగాత్రుం డగుటం జేసి మెత్తంబడ నిచిత్తంబునఁ దత్తఱిల్లుచు సుత్రామపుత్రుని దిక్కు మొగంబై యి ట్లనియె. 313

—ధర్మరాజు కర్ణుండు బ్రదికి యున్నవాఁ డని విని యర్జునుం గినిసి పలుకుట—

చ. కటకట సేన లెల్లఁ గలగం గనుఁగొం చభిమానమానముల్
దిటముఁ దొలంగి కర్ణుని వధింపఁగఁ జాలక వానిభీతునం
దటుకునఁ బాఱివత్తె ప్రధనంబునఁ బావని నొంటిఁ బెట్టి నీ
కిటు తగునయ్య కుంతికొడు కింత నికృష్టపుచెయ్దు కర్జునుఁడే. 314

ఉ. ద్వైతవనంబునం దటులు దబ్బరగా నొకరుండ నే ననిన్
సూతసుతున్ జయింతు నని సూరెలవారు వినంగ సత్యవి
ఖ్యాతిఁ బొనర్చి యిప్పు డిటు కర్ణభయంబునఁ జేసి పాఱి రా
నీతియె భూతలంబునను నిన్ను నవ్వని వార లుందురే. 315

క. నాఁ డట్లు బాస సేయని, వాఁడవయే నేను గౌరవవిరోధమునం
బోడిమి యిట్లు చెఱచుకొను, వాఁడను గా కుందు గాదె వలసినరీతిన్. 316

తే. పాఱిఁ జంపుదు నని బాస సలిపి యట్లు,శత్రుమధ్యమునకు దెచ్చి సకలజనులు
నవ్వ న న్నిట్లు చేసితి విర్విధంబు,పయిపయికి నెత్తి యిల వైచు పగిది గాదె. 317

ఉ. భూరిపరాక్రమక్రమము పొంపిరివోఁ దగు నీకతంబునం
గోరిక లెల్లఁ దీరు నను కొంటిమి కంటిమి సన్నిమిత్తముల్
బూరువుపూవు పోలె వృథవోయె న దంతయు నిట్టి నిష్ఫలా
చారపరాయణుండ వయి సాల్వడిపో దని యెంచ మక్కటా. 318

తే. ఎఱచి గప్పినగాలము తెఱఁగునఁ బర,మాన్నమున మెత్తిన గరళం బట్లు రాజ్య
రూపమగు ననర్థము మాకుఁ జూపి యిట్లు,నిన్ను నే మన వచ్చునో నే నెఱుంగ. 319

తే. కాలమున విత్తి ఫలము నాకాంక్ష సేయు,నట్టు లీపదుమూఁ డేండ్లు నిట్టి నీవు
మేలు సేతను నడియాస మెలఁగు మమ్ము,నిరయమున ముంచి తేమందు నిన్నుఁ బార్థ.

సీ. ఖాండవదహనంబు గారణంబుగ వీఁడు,బర్హిర్ముఖుల నొంచి ప్రతిభఁ గాంచు
నింద్రపరాక్రముఁ డితఁడు మద్రకళింగ,కౌరవముఖ్యులఁ గండడంచు
వీనిమించిన మేటి విలుకాఁ డిలం గల్గఁ, బోఁ డెవ్వఁడును వీని పురుడు గాఁడు

విద్యలన్నియు నేర్చె వీని వశంబున, భూతజాలము లెల్లఁ బొదలు చుండుఁ
**తే.** గాంతిఁ జంద్రుని జవమునం గాడ్పు స్థైర్య,మునను మేరువు క్షమ క్షమ ధనమున ధన
దునిబలంబున హరి శౌర్యమున బిడౌజు, భూరితేజమునన్ సూర్యుఁ బోలు నితఁడు.
**క.** అరుల వధించెడువిష్ణువు, కరణిం దనవారి కెల్లఁ గలిగించు జయం
బరయంగ నీకుమారుఁడు, కురువంశోద్ధారకుండు కుంతీ వింటే. **321**
**మ.** అని నీవుట్టినయేడునాళ్ళపుడు సర్వారణ్యవాసుల్ మునుల్
వినఁ బల్కెన్ శతశృంగపర్వతమునన్ విన్వాకు తత్సర్వమున్
వినివృత్తం బయి పోయె దేవమునులున్ దేవళ్ళునుం బొంకి రి
ట్లని నీ వావృషభీతి కొ టెఱుఁగ లేనైతిం గదా తమ్ముఁడా. **322**
**సీ.** విశ్వకర్మవినిర్మితేశ్వరవాహము, వాడివత్తలు గానివాహనములు
కపిరాట్సమావృతకాంచనధ్వజమును, హేమపట్టావనద్ధదఖడ్గ
ముచ్ఛ్రితతాళమాత్రోత్తమగాండీవ, మక్షయతూణీర మస్త్రశస్త్ర
సముదయంబును గల్గి సర్వేశ్వరుఁడు రథ,సారథి యై నిన్నుఁ జేరి యుండ
**తే.** సూతజుని కోడి పిఱికివై బీతుఁ జెంది, కలవరంపడి కల నీగి వలియఁ బాఱు
దెంచి తిట్లల్ల మమ్ము దేవురించి కొనఁగఁ, జేసితివి బంధు మిత్రులు చెల్ల నగుట. **323**
**మ.** కలరాజ్యం బది పోయి సౌఖ్యమునకుం గాకున్నమ మ్మిట్లు చి
క్కులపా ల్సేసితి నీనిమిత్తమునఁ బెక్కు ల్వచ్చె ని ట్లియ్యెగా
ధలయాబ్ధిం బడి కుందుచుందు మిది సిద్ధం బయ్యె యుద్ధంబునం
గలగం బాఱుట రాజధర్మ మని యాకాంక్షించితి వయ్యయో. **324**
**చ.** సమరమునందుఁ గర్ణునకుఁ జాలనిచందమ యేని గాండివ
బమరగఁ జేసి కేశవున కారథచోదన మీ వొనర్పఁ జి
త్తము వొనరింప గాదటె యితం డతని న్వడి దాఁకి వజ్రి వ
జ్రమునను వృత్రునిం బలెను జర్జరితం బొనరింప కుందు నే. **325**
**క.** కాకున్న లోకమందున్, నీకంటె మ ఱెవ్వఁ డైన నృపతికి దీనిం
గైకొనగం జేసితివే, నాకర్ణు నొకింతలోన నఱఁడు దునుమఁడే. **326**
**తే.** కొడుక వై నీవు మాకుంతికడుపునందుఁ, బడక యుంటయ తగు నెట్లొ పడితయేని
పంచమం బగునెలన యప్పుడుచూలు,వీడి దిగఁ బడెనే నింత మూఁడదు గద. **327**
**క.** సీ! నీగాండీవము సీ!, సీ! నీసుచిదత్తరథము సీ! నీశరముల్

సీ! నీకపికేతువు సీ!, సీ! నీభుజవీర్య మెల్లఁ జెడె వ్యర్థములై. 328

వ. అని పరుషంబుగం బలికినపలుకుల కలుక వొడమఁ గవ్వడి వడివడి నడిదంబు పెఱికొనినం గని వనజాక్షుం డతనికోపం బుపలక్షించి యిట్లనియె. 329

—అర్జునుండు ధర్మరాజుపైఁ గత్తిఁగొనఁ గృష్ణుండు నివారించుట—

ఉ. ఏ మిది కేల వాలు గొన నేటికి వచ్చె సపత్ను లిచ్చటం
దామరతంపరై పడెనుదారియు నారయ మా దుదగ్రుఁడై
భీముఁడు కౌరవావళిని బిట్టడచె న్మన మీమహీపతి
క్షేమ మెఱింగి పో నిటకుఁ జేరితి మీతఁడు లెస్స యుండెఁ బో. 330

సీ. సంతోషమున కిది సమయమై యుండంగ, మోహకార్యమునకు మొనయు దేల
చిత్తవిభ్రమ మేమొ చెర్వ నెంచితి వేనొ, కత్తి వట్టుటకును గత మదేమి
నీచేయుపని నేమి దాచక చెప్పుము, నావుడు నరుఁ డన్నఁ గ్రేవఁ గనుచుఁ
బాముననా ఱోఁజుచుఁ దామసంబున వనజాక్షునివంక మోము ఘుగుచుఁ బలికె

తే. నితరులకు నాదుగాండీవ మిచ్చివేయు, మనుచు నెవ్వఁడు ననుఁ బల్కు నతనిశిరము
ద్రయ్య నేయుదు నని నేను బ్రతిన వట్టి, యున్నవాఁడను నాలోన మున్న వింటె. 331

ఉ. ఈవు వినంగ నీతఁ డిపు డిట్టులు బెట్టిద మాడె గాండివం
బావలఁ బెట్టుమంచుఁ విని నంత సహింపనివాఁడనై ప్రతి
జ్ఞావిధి సక్కవెట్టుకొన సజ్జనుఁ డైనను వీనిఁ జంపఁ గా
భావము చేసి ఖడ్గమును బట్టితి నిట్లు త్రిలోకవల్లభా. 332

ఆ. చంపి వీని నేను సత్యప్రతిజ్ఞుఁడ, నయి యసత్యభీతి నవలఁ ద్రోచి
విజ్వరుండ నగుచు వెలసెద నిట్టిచో, నేమి తలఁచుచుంటి వీవు దేవ. 333

చ. జగము గతాగతార్థములు సర్వ మెఱుంగుదు వీవ యిప్పు డె
ట్లగు నని తోఁచి చెప్పుటకు నయ్యెడ వట్లు పొనర్ప నెంచెదన్
దగఁ గరుణింపవే యనినఁ దామరనేత్రుఁడు దత్క్షణంబునన్
దగిలి హిహీహిహీ యనుచు నవ్వి నరుం గని రోసి యిట్లనున్. 334

ఆ. అదనుదప్పి నీదునడచిపాటునఁ జేసి, యే నెఱింగికొంటి నిపుడు నీవు
వృద్ధసేవ చేసి యెఱుఁగ వెన్నం డని, యెఱింగియున్న నిప్పు డిట్టు లగుదె. 335

చ. అడఁచిడదండు నీవలె నొకప్పుడు నేనియు ధర్మతత్త్వపుం
గడిమి నెఱింగినట్టికృతి కార్య మకార్య మెఱుంగకుండు నె
వ్వఁడు పురుషాధముం డనఁగ వచ్చును వానిని ధర్మవేత్తలై

నిడుచనువారినిశ్చయము నీ విను మెఱుంగ వెస్న్నఁగన్. 336

సీ. నిఖిలకార్యాకార్యనిశ్చయ మెఱుఁగని,వాఁడు నీవలె మోహవశుఁడు సూవె
శ్రుతము లేకుండినఁ జెప్పడ నేర దా,ధర్మసూక్ష్మజ్ఞానతత్త్వ మెల్ల
నెఱుఁగ వీ వాతత్త్వ మెఱిఁగిన సత్యము,నడప యహింసను . . ను వే
ధార్మికుం డగువాఁడు తలఁకు నెప్పుడు ప్రాణి,హింసకు నీ వింత యెఱుఁగ వైతి

తే. వ్రత మెదేని మానిన మానవచ్చుఁ గాని,ధర నహింసావ్రతము మానఁ దగదు సర్వ
మునకునదిపెద్దయగుఁజువ్వేయనృత మైనఁ,జెప్ప నగుఁ గాని పరహింస చేయరాదు.

తే. ప్రాకృతుం డగునన్యునిపగిది నీవు,సత్యమును గాచుపొంతె విజ్ఞానఘనుఁడు
జ్యేష్ఠుఁడున్ శ్రేష్ఠుఁడున్ భ్రాతృశేఖరుండు,ధార్మికుఁడు రాజితఁడు వీనిఁదగునె చంప.

వ. మఱియు నయుధ్యమానుండును బరాఙ్ముఖుండును బాలువాఁడును శరణంబు నొంది నవాఁడును గేలు మోడ్చినవాఁడును బ్రసన్నుండును బ్రమత్తుండు నగువాఁడు శత్రు వైనం జంపుట ధర్మపథంబు గా దని చెప్పుచుండ ధర్మావతారుం డగునీగురునిం ధర్మరాజుం జంపుట ధర్మం బెట్లగు నాకర్ణింపుము. 349

ఆ. పట్టినాఁట నీవు పట్టినవ్రతమును, జెల్లఁ జేయనలయు నుల్ల మెసఁగ
నింతలేసి పనుల కీవు దొడంగుట,మూర్ఖ మనుట కింతమాత్ర మేల. 340

వ. నీప్రియంబు గోరి భీష్ముండును యుధిష్ఠిరుండును విదురుండును గుంతియు నెఱింగించి నట్లు నేనును నీకు ధర్మరహస్యంబు తెఱం గెఱింగించెద నాకర్ణింపుము. 341

క. సత్యమ పలుకన తగియెడు, సత్యమునకు మించి యొకఁడు జన దక్షినన్
నిత్యమును సత్య మొప్ప ద,సత్యంబును నొప్పుచుండు సమయములందున్. 342

తే. ఋతము కొన్నియెడల క్షితి ననృతం బయి,పాతకంబులందుఁ బొఱ వైచు
ననృత మరయఁ గొన్నియవసరంబుల ఋత,మగుచుఁ బుణ్యమందు నదుకఁ జేయు.

ఆ. పరిణయంబునందుఁ బ్రాణాత్యయమునందు,సర్వధనవినాశసమయమందు
బ్రాహ్మణార్థమందు రతిసంప్రయోగమునందు బొంకి పాప మొంద దెపుడు 344

వ. ఇట్లు సత్యాసత్యంబులతత్త్వ మెఱింగి కాలోచితంబుగం బ్రవర్తించువాఁ డుత్తమ గతిం బొందుఁ గృతప్రజ్ఞుం డగుపురుషుండును గొన్నియెడల దారుణకర్మం బొనర్చి యంధవధంబు చేసినబలాకునట్లు పుణ్యంబు నొందు నపండితుం డగుధర్మకాముండు ధర్మసూక్ష్మం బెఱుంగఁ జాలక కౌశికునిచందంబున నిరయంబు నొందు ననిన వర్ధనుం డాబలాకకౌశికులకథ లెట్టివి చెప్పు మనినఁ గృష్ణుండు నెండియు నిట్లనియె. 345

సీ. మున్ను బలాకనామకుఁడు వ్యాధుఁ డొకండు, ధర్మపరుం డయి తనరుచుండు

నతఁడు కుటుంబయాత్రార్థము మృగముల, వధియించు నిచ్చలు వనములందు
వృద్ధులౌమాతరపితరుల నితరసం,శ్రితులను బోషించు సతతభక్తి
సత్యవాది స్వధర్మనిత్యనిరతుఁ డన,సూయకుఁ డగునాతఁ డేమెడలను
తే. మృగయఁ దిరుగుచు నొకనాఁడు మృగమునెందుఁ,బొందఁజాలకనలుగడఁబోయి వెదకి
కొనుచు నొకచోట నీరానుగ్రుడ్డిమెకముఁ, గాంచి చా నేసె దానినిఁ గాండసమితి.
వ. ఘ్రాణనేత్రం బగునాశ్వాపదంబు భూపదంబునం బడినంత నంతరిక్షంబునుండి పుష్పవర్షంబు గురిసె నప్సరోనృత్యంబును గంధర్వగానంబును నానందం బొసంగ దివ్యయానం బరుదెంచి మృగవ్యాధునిం గొని స్వర్గంబునకు నిర్గమించె విను మాశ్వాపదంబు. 347
క. అది తొల్లి యెల్లభూతము, లదవదపడి త్రెళ్ళునట్టు లర్థించి తపం
బొదవింప నజుఁడు కినుకం, బొదవించె జీకుపులిగఁ బుట్టం దాన్నిన్. 348
వ. అప్పాపపశువుం జంపుటం జేసి హింసాపరుం డయ్యు మృగావ్యాధుండు స్వర్గంబునకు నిర్గమించె నింకఁ గౌశికునిచరిత్రంబు చెప్పెద వినుము. 349
సీ. కలఁడు కౌశికుఁ డనుఘనతపస్వి యొకండు, సత్యంబ పలికెడిసన్నవాఁడు
నదిసంగమగ్రామపదముచేరువఁ దప, మున్నయమ్మునికడ కొక్కనాఁడు
దస్యుభయార్తులై తత్తఱిల్లుచుఁ గొంద, అరుదెంచి డాఁగి రయ్యాశలు గీఱ
నంతఁ దెక్కలికాండ్రు నరయుచు నట వచ్చి, తెరువరు లెందైరి తెలుపు మనిరి
తే. సత్యమే వల్కు కౌశికసంయమీంద్రుఁ, డనృతవాదభయంబున నల్లపొదల
నొదిగి రని చెప్పటయు దొంగ లదయు లగుచు,వారలం బట్టిచంపితద్వసువుఁగొనిరి.
వ. అక్కారణంబున నక్కౌశికుండు సత్యంబ పలికినను ధర్మసూక్ష్మం బెఱుంగమిం జేసి నిరయంబులం బొందెఁ గావున నేవాఁడును ధర్మవిభాగంబు చేసి హింసారూపంబు గాని కార్యంబు ప్రవర్తిల్లఁ జేయ వలయు వృద్ధసేవం గాని ధర్మసూక్ష్మం బెఱుంగుట దుర్లభంబు దుష్కరంబగునట్టిపరమజ్ఞానంబు కేవలశుష్కతర్కంబున నిర్ణయింతు మన రాదు ధర్మప్రవచనంబంతయు భూతప్రభవార్థ మేఱుపడినది గాని మఱి యొక్కటి కా దహింసయే పరమధర్మంబు భూతధారణమ్మునం జేసియే ధర్మ నామమ్ము సార్థకం బయ్యె నాకర్ణింపుము. 351
ఉ. ధారణయుక్తమై తనరు ధర్మమునం దలరారువార లీ
ధారణి భూతకోటుల నెదన్ దయఁజూచుచు సత్యవాచకో
చ్చారణ మాచరించుటయొ సన్నకసన్నగ బొంకివేయుటో

యూరక చూచుచుండఁగా సమయోచితరీతి నొనర్పఁగాఁ దగున్. 352

క. భూతద్రోహము పొసఁగెడు,నాతఱి సత్యం బసత్యమై యెవ్వనికిం
బాతకమునకై కష్టము, లాతతగతిఁ గూర్చు నట్టి దగు నెయ్యెడలన్. 353

ఉ. మ్రుచ్చులచేతఁ జిక్కికొని ముక్తికిమార్గము లేమి నెట్టు లే
నచ్చగఁ జెప్పి యొట్టని యనంతర మందటు సేయకున్నచో
నొచ్చెము లేదు లే దనృత మెంచగ రా దొకపాతకంబు ని
ట్లిచ్చల మైనధర్మపథ మారయఁగా దగు సత్యవాదికిన్. 354

తే. సమయయనఁ జేసి పాపులౌ జనులకు ధన, మిత్తు మనియును బిమ్మట నీయరాదు
దాన మయ్యది పీడించు దాత నెప్పు, డనృతదోషము లే దట్టియవసరముల. 355

క. అంతయు వింటి యధావిధి, కింతయు నెడ లేని ధర్మ మెటు లెంతువు నీ
స్వాంతమున ధర్మజమహీ,కాంతుని వధ్యునిఁగఁ జెప్పఁ గలవో యింకన్. 356

వ. అనిన నర్జునుం డచ్యుతున కి ట్లనియె. 357

సీ. ప్రాజ్ఞుండ వగునీవు ప్రజ్ఞాబలంబున, హిత ముపదేశించి తెఱుఁగ నాకు
నీవె తల్లివి తండ్రి వీవె దిక్కవె ప,రాయణం బవు జగత్త్రయమునందు
నీ వెఱుంగనియర్థ మింతయు లే దెల్ల, ధర్మతత్త్వము నిన్నుఁ దవిలి యుండు
నీధర్మనందను డిపు డవధ్యుం డని, తెలిసికొంటిని నీకుఁ వెలిసె వ్రతము

తే. పరులకుం గాండివం బీయఁ బలుక నేను, దూవరక యన్న భీముండు చావ నేయ
బ్రతిన వట్టితి మది భంగగతికిఁ బోక,యుండెడునుపాయ మూహింపు మోమహాత్మ.

చ. ప్రతినకుఁ బోల ధర్మజుఁడు పల్కెను నీవు వినంగ నందునన్
వ్రత మని యొందు చూడ కొకవాసిగఁ జేసితి నేని నేను నీ
క్షితిపయి నల్పకాలమును జీవనమున్ ధరియింప నోమహా
మతి! బ్రదికింపవే ప్రతినమార్గము దప్పకయుండ నగ్రజున్. 359

వ. అనిన వాసుదేవుండు వాసవి కి ట్లనియె. 360

ఉ. ఆలమునందు సూతసుతుఁ డాశుగసంతతి కెంతయేనియున్
సోలి యితండు జాలిఁబడి సొంపఱి యుండినవాఁడు గావునన్
గూలనికర్ణునిం దెలిసి కోపము తాపము నేపఁ జిత్త మీ
లీల వచించెఁ గాని నిను లేకి యటంటకుఁ గాదు వింటివే. 361

ఆ. కర్ణుఁ డొకఁడు గూలఁ గౌరవు లెల్లరుఁ, గూలుదు రనుబుద్ధి గూర నీర
ణమును జూదమందు నమరుకర్ణపణంబు, గెలిచికొనమి నిట్లు పలికెఁ గాదె. 362

—అర్జునుండు ప్రతిజ్ఞాభంగంబు గాకుండఁ గృష్ణునిపంపున ధర్మరాజుం దూఱినాఁడనుట—

క. అది గావున ధర్మజునిన్, సదమద మొనరింపఁ బూనఁ జనునే నీకున్
దుది నీదు ప్రతిన సెల్లిన, మది సేయఁగ వలయు నెఱుఁగుమా తద్విధమున్. 363

తే. మానవార్హుఁ డై యుత్తముఁ డైనజనుఁడు, జగతి నవమానమును బొంది చాకచచ్చి
నట్టిఁ డగు నని తగ నథర్వాంగిరస సను,శ్రుతివచించు నెఱుంగుదే శూరవర్య. 364

ఉ. నీవును భీముఁడుం గవలు నిచ్చలు భక్తి భజించుచున్ మహా
భావుని ధర్మనందనుని బాల్యమునుండియు గౌరవింతు రి
ప్డీ వవమానముం గలుగ నిట్టిఁడ వంచును జెంద నాఁడు మీ
భూవరుఁ డందునన్ మృతునిఁ బోలినవాఁ డగు నీవదోహలిన్. 365

తే. ఇట్లు చేసితివేఁ జంప కితనిఁ జంపి,నట్టిఁ డగుదువు చెల్లు నీకైన ప్రతిన
యవల క్షమియింపు మనుచుఁ బాదాభివంద,నమ్ము సాంత్వవాక్యమ్ము నొనర్పనొప్పు.

వ. ఇట్టు లైనం గార్యంబు సెడదు ప్రాజ్ఞుఁ డైనమీయన్నయు ధర్మం బపేక్షించి నిన్నుఁ గినియం బో డవ్వల నన్నృతంబునుండియు భ్రాతృవధంబువలనుండియు ముక్తుండ వైననీవు గర్ణుం జంపు మనిన నాఁ గాతి మని శ్వేతవాహనుండు తద్వచనంబు ప్రశంసించుచు ధర్మరాజుదిక్కు మొగంబై యనుక్తపూర్వంబు లగుప్రల్లదంబులు సంధిల్ల ని ట్లనియె. 367

శా. అక్షీణోగ్రగదాభిఘాతములఁ బ్రత్యర్థాంతకుండో యనన్
రూక్షప్రక్రియ సర్వసైన్యసమితిన్ నుగ్గాడుచు న్నిల్చి హ
ర్యక్షుం బామ్మృగకోటినిం బలెను దెర్లం జేయుభీముండు న
న్నాక్షేపించినఁ జెల్లుఁ గాని పెర కెట్లాడంగనుం జెల్లునే. 368

ఉ. క్షత్రియధర్మమున్ విడిచి కయ్యపునేలకుఁ గ్రోశమాత్రమం
దాత్రము నొందుచున్ నిలిచి నట్టిఁడ వై ద్విజునట్లు వాగ్బలం
బే త్రప లేక పూనుకొని యిట్లు ననుం దెగనాడుదానికిం
బాత్రుఁడ వీవు కా వనుచుఁ బల్కెద బాహుబలంబుపెంపునన్. 369

సీ. నే దారపుత్రుల నే కాదు నాజీవి,తమును నీ కర్పించి ప్రమనుఁడ నయి
నీప్రీతి గావింప నే యుంటి నట్టిస, న్నీరీతి నోనాడ నీకుఁ దగదు
నీవలనసుఖంబు నే నెఱుంగ నొకింత, నీకుఁ గాఁ బెక్కండ్ర నేఁ దునిమితి
నెక్కి ద్రోవదితల్ప మి ట్లాడినం జెల్ల, దీవు చేసినదింత యేని లేదు

తే. మునుద్రుపదపుత్రు నిడికొని ఘనుని గురుపి,తామహుని నీకుప్రీతికై ధరణిఁ గూల

నేసితి నిఁ కెన్నో చేసితి నెట్టులైన, నీవు మెచ్చవు దూషింతు వేమి చెప్ప. 370

మ. సహదేవుం డిది సర్వనింద్య మనుచుం జాటించుచుం జెప్పెనన్
గ్రహయాళుండవు గాక జూద మది వేడ్కం జేసి సర్వస్వమున్
దహనజ్వాలల వైచి కష్టములకుం దార్కొల్పి మ మ్మెల్లరన్
సహజప్రేమ భజించుచున్న మిమ్ములన్ శాసింతు తీవ్రోక్తులన్. 371

ఆ. ఓల మాన గోనమి నాలంబున న్మేము, మడమ దిరుగకుండ నడరి పోరు
చున్నఁ దూల నాఁడుచున్నవాఁడవు నీ విఁ, కింతకన్నఁ గష్ట మేది గలదు. 372

శా. నీదోషంబున నైనసంగరమునన్ నే నీప్రియం బెంచి నా
నాదేశాధిపులన్ వధించి ధరకున్ బల్యర్పణం బిచ్చితిన్
గాదం చింతయుఁ జింత సేయ నయితిన్ గష్టంబు పాలైతి నీ
ప్రాదుర్భావమె సర్వనాశమునకున్ బ్రాలంబ మయ్యెం గటా. 373

ఆ. అడచిపడక యుండు మంతయుఁ జూచుచు, నిడుమ పడినవార లెప్పుడేని
వాక్ప్రహారములను బడుటకుఁ గాఁ బోరు, కినుకఁ బెనిచి సేగిఁ గొనుట తగదు.

—అర్జునుండన్నయమాటకృష్ణునిపంపున నాత్మనశంబుగాఁ దన్నుందాన పొగడుకొనుట—

వ. అని యిట్లు భీభత్సుండు రూక్షాక్షరంబులం బలికియు ధర్మభీరుండు గావున విమ
నస్కుండై గురుతిరస్కారంబునంజేసి తనకు మహాపాపంబు దాపరించె నని పశ్చా
త్తాపంబునం దపించి నిట్టూర్పు నిగిడించుచు వాలు వెఱికుచున్నం గని వాసు
దేవుం డిది యేమికార్యంబు కరవాలం బెత్తుచుంటి వని యడిగిన నుడుగనిదుఃఖం
బున నతం డన్న దూఱినదోషంబు వోఁ బ్రాయశ్చిత్తంబుగఁ దలం గోసికొన
నిశ్చయించితి నన విని జనార్దనుండు వెండియు. 375

ఉ. నీ వని ధర్మరాజు నిటు నిందితుఁ జేసినమాత్ర నోపతే
కీవిధి నాత్మహత్య యని యేనియుఁ జూడక గొంతుఁ గోసికో
నీవు దలంచె దిట్లు బుధు లెవ్వరు సేయరు పీనికుత్తుకం
బోవఁగఁ జేసితే నెటులు వోవుదువో కద శ్వేతవాహనా. 376

వ. ధర్మసూక్ష్మంబు దురవగాహం బది వృద్ధోపసేవనంబునం గాని నెకూర దని మున్న
చెప్పియుంటి నీ విపుడు ధర్మవిచారంబు సేయ కాత్మహత్యకుం బొడంగి తిది
భాతృవధపాతకంబునకుం దక్కువ కాదు కావున నే నింత విచారించి నీ కొక్క
యుపాయంబు సెప్పెద నట్లు సేయుము నీ విపు డితనిసమక్షంబున నాత్మప్రశంస
చేసికొను మది మరణతుల్యంబై నీగొవరెల్లం దీర్చు ననిన నతం డట్లకాక యని

ధనుష్టంకారంబు సేయుచు ధర్మరాజుదిక్కు మొగంబై మొగంబు బిగియఁ బెట్టి
కొని యి ట్లనియెఁ 377

సీ. త్రిపురాంతకుఁడు తక్క నిపుడు నాసరి వచ్చు,నొంటొక్క ధానుష్కుఁ డుండఁ బోఁడు
నే నమ్మహాదేవునానతి నింతలో, జగ మెల్ల నీకు గా సలుపఁ గలను
దిగ్విజయము చేసి తెచ్చి నాయిచ్చిన, సొమ్మున రాజసూయ మ్మొనర్చి
తీ వోలగంబుండు నిద్ధసభయు నాదు,నోజోగరిమఁ గాదె యొడవె నీకు
తే. నేను శరశరాసనములు పూని నిలువ,నెదిరి నిలఁ జాలు జోదొక్కఁ డొదవఁ బోఁడు
ప్రాచ్యులును దాక్షిణాత్యు లుదీచ్యులును బ్ర,తీచ్యులును నాదు బాణకిఁ దెఱలఁబడరె.
ఆ. మిగుల లో కింత గాఁగఁ దెగిమె సంశప్తక,ప్రజ మదెల్ల దేవవాహినికిని
వంతు వచ్చు శత్రువార మంతయు నాదు,వలనఁ దెగి ధరిత్రిఁ బడియెఁ గంటె. 379
వ. అని యవ్వల మొగం బై. 380
శా. విల్లుం బట్టినవారి నెల్ల సమరోర్వి న్మహాప్రస్ఫురద్భా
వోల్లాసంబునఁ ద్రెళ్ళనేయుటకు నే నున్నాఁడ నోకృష్ణ! నీ
విల్లిగ్గుల్ గొనకుండ వేగమునఁ దే రేగింపు మక్కర్ణునిం
ద్రెళ్ళం జేయుదు నొక్క వ్రేల్మిడిన యీదీనుండు మే లౌనన్. 381
ఆ. నేఁడు రాధ గాని నిర్మలచారిత్ర, కుంతిగాని కొడుకుఁ గూలఁ జాలి
నొంద కుండ రిట్లు పొందఁ జేయకయుండ, బొందవళంబు విడువ కుందు నేను. 382
వ. అని సత్యప్రతిజ్ఞం జేసియుఁ గ్రీడి స్త్రీడాభరంబున శిరంబు వాంచి కరంబులం గల
గాండివాదిసాధనంబు లవలం బెట్టి మోడ్పుఁగేలు ఫాలంబునం గీలించి నమస్కరిం
చుచు ని ట్లనియె. 383
ఉ. నే నిదె నీపదంబులకు నిర్భరభక్తి నమస్కరించెదం
గాననికాలపుంగడిమిఁ గల్గిన నావచనప్రసక్తికిం
బూనక కిన్క నన్ గరుణ పొంపిరివోవఁ బ్రసాదదృష్టి సం
ధానము గాఁగఁ జూడు మని తత్పదయుగ్మముఁ బట్టి నెట్టనన్. 384
క. నను వేఱుగాఁ దలంపక, మనమున సైరించి యెల్ల మనుపుము నాయీ
తనువున బ్రాణము నీప్రియ,మునకే యని సత్యవచనమును బానరింతున్. 385
క. అని భీమసేనుఁ డొక్కఁడ, పెనఁగెడు తద్భరము కొంత పేడెత్తింపం
బనుపుము కరుణామతివై, యన జనపతి పాన్పు డిగ్గి యను ఖిన్నమతిన్. 386
సీ. నాయవివేకంబునన మీకు నిట్లు ఘో,రవ్యసనంబు సంప్రాప్త మయ్యె

నది యట్లుగానఁ గులాంతకుండును వ్యసనాభిరతుండు నత్యనమపురుషుం
డగునాదుశిరము శాతాసిధారం దెగ, నేయు మేటికి దయ యిట్లు గలుగఁ
గాదంటివే నిష్ఠ కాన కేగెద మద్వహీనుండనై సుఖయింపు మీవు

తే. క్లీబుఁ డగునాకు నీరాజ్యకృత్యమేల,నీపరుషవాక్యములు విన నేను జాల
గాద్పుపట్టికి రాజ్యంబు గట్టు మేను, గలుగ నది తప్ప గాన నేఁ గదలు బోవ్వ. 387

వ. అని లేచి వనంబునకుం బ్రయాణంబు సేయ నెంచుచున్న ధర్మరాజుపాదంబులకుఁ
బ్రణమిల్లి వాసుదేవుం డల్లన నిట్లనియె. 388

—ధర్మరాజు కృష్ణునివాక్యములచేఁ బ్రసన్నుం డగుట—

క. ఒరులకు గాండివ మిమ్మని, పురుషుఁ డెవం డైనఁ బలుకఁ బోయినవానిం
గరవాలంబునఁ దునుమఁగఁ, బరికించినవరునిప్రతిన పరికింతు గదే. 389

వ. నీవు వీని నట్లు పలికితివి గావున నితండు సత్యపాలనంబు సేయు పొం దెను నిట్లు
గురుతిరస్కారంబు గావించె గురుతిరస్కారము వధతుల్యం బని బోధించి నేన
యిక్కార్యంబునకుం బుచ్చితి సత్యసంరక్షణార్థ మైనయీయుద్ధంబు వ్యతిక్రమంబును
సైంచి రక్షింపు మని శరణంబు వేఁడి ప్రార్థించుచున్నవాం డని యుతియుడు. 390

క. రాధేయుని నెత్తుగ నేఁ, బేరణ కనుపాటిఁ ద్రొప్పు నట సక్కటము న
క్రోధమునఁ జేసి సూతజుఁ, డోధర్మజ! నాగి యొ సనుసు సూహించు మింకన్. 391

వ. అని పలికి శ్రీకృష్ణుండు మఱియుం బ్రణమిల్లిన వాని ధర్మనందనుం డల్లన లేవ
నెత్తి కృతాంజలియై యి ట్లనియె. 392

చ. అగు నగు నీవు చెప్పినది యంతయు నిక్కువ మే నెఱుంగమిన్
దెగువ నతిక్రమంబునకుఁ దెచ్చితి నచ్యుత! నీదుబోధనం
దగిలినమేము మాన్యులము ధన్యుల మైతిమి మామనోవ్యథల్
తెగియె మహోన్నతం బగుగతిం గన నైతిమి నీదుసంగతిన్. 393

వ. అని పాండవాగ్రజుండు పలుకుచున్న గదాగ్రజుండు విషణ్ణవదనుండై యున్ననకు
లాగ్రజుం గాంచి యి ట్లనియె. 394

శా. వీరాగ్రేసర! వీని నిట్లనుట కే విత్రస్తచిత్తుండ నై
యీరీతిన్ వగఁ గుందుచున్ మృతునియ ట్లీక్షించుచున్నాఁడ పే
క్రూరాసిం దెగ నేసి యె ట్లగుదు వాక్కోప ఘోరపాపాబ్ధిలోఁ
బారం బందనివాఁడ వై పడుట తప్పం గంటి పుణ్యంబునన్. 395

తే. కావునన్ సంతసించెదు కాల మనుచు, నెంచి యుకనిఁ బ్రసన్నుఁ గావించి యూజ్ఞ

వడసి మన మేగి రాధేయుఁ గడపు మగిడి, వచ్చి వీనికి సంప్రీతి దెచ్చు టొప్పు. 396

వ. అనిన ధనంజయుండు లజ్జావనతివదనుండై ధర్మరాజు కాళులం బడి ధర్మకామంబునం జేసి వాసి వోఁ బలికిననాపరుసంపుఁబలుకు లెల్ల నల్లన సైరించి నన్నుఁ గరుణార్ద్రదృష్టిం జూచి రక్షింపు మని ప్రార్థించుచుఁ గంట నీరువెట్టుకొను చున్నం గని ధర్మనందనుం డతని లేవనెత్తి బాష్పపూరితలోచనుండై పరిరంభణంబు చేసి రోదనంబు గావించె నిట్లు వా రిరువురు నొండొరువులం గట్టుకొని బెట్టు వాపోయి పోయి ముఖప్రక్షాళనంబుగావించుకొనిపరస్పరప్రేమానుబంధబంధురంబులగుకటాక్షవీక్షణంబులు ప్రసరింపం జేసికొనుచుండి రంతఁ గొంతేయాగ్రజుండు నకులాగ్రజుం బునఃపునరాలింగనంబులం దనియఁ జేసి శిరంబుకరంబులం బుడుకుచుఁ బ్రణయపూర్వంబుగ ని ట్లనియె. 397

ఉ. ఎల్లరుఁ జూచుచుండ నిను నేడ్తటుఁ గైకొని కేతనంబును
న్విల్లును ద్రుంచి సూతుతల వీతులతోఁ దెగనేసి బొందళం
బల్లన ద్రక్కలించి తను వట్టిటుగా నొనరించిపుచ్చె నేఁ
డ్రెళ్ళియుఁ డెళ్ళనైతిఁ గద దేవురుపాటున నోహటిల్లఁగన్. 398

తే. వానిఁ దెగఁజూడ వేని నాప్రాణముల నొకింతలోనన విడిచెద నేను బ్రదికి
యున్న ఫలమేమి నావుడు నన్న కనియె, నత్తఱి ధనంజయుఁడు గడు దత్తఱిల్లి. 399

—అర్జునుండు ధర్మరాజుం బ్రార్థించి వేఁడుకొనుట—

ఉ. నీదు పదంబులాన ధరణీధవ! కర్ణుని నేఁడ చంపెదన్
గాదన వానిచేఁ దెగదఁ గాని మఱొక్కఁడు లేదు నమ్ము నేఁ
మూదల చేసి చెప్పెదను ముట్టి కృపాణము చింతదక్కి పే
వాదట నంపిపుచ్చు మము నాహవభూమికి దోహలంబునన్. 400

తరువోజ. అని చెప్పి మాధవు నరసి భీభత్సుఁ డనియె నీచిత్తమునందు సూతజుని
దునుమాడ నొసని తోచినయేని దునిమెద వాఁడును దునిఁగినవాఁడ
యనఁగఁ గృష్ణుండను ననఘ నీశక్తి యంతటిదగు మాకు నదియె ప్రియంబు
నని రాజుదిక్కుమో మయి నీవు వీని నాశ్వసించుచుఁ బంపు మక్కర్ణుగెలువ.

తే. కర్ణశరపీడితుఁడ వయి కష్టికైన, నిన్ను విని చూడ వచ్చితి మెన్న నీవు
దైవవశమునఁ గుశలివై తనరుచుంటి, వంపిపుచ్చుము దీవించి యనుజు నితని. 402

వ. అనిన విని ధర్మనందనుండు పురందరనందనుం గని యి ట్లనియె. 403

క. లె మ్మోయి వత్స! నన్నున్, సమ్మదమునఁ గౌఁగిలించి చను మే ననువా

క్యమ్ములకు నలుగకుండుము, నెమ్మనమున నీకు జయము నే నర్థింతున్. 404

వ. అనుటయు నయ్యర్జునుం డన్నపాదంబులం బడిన నతం డతని లేవ నెత్తి బిగికౌఁగిటం జేర్చి మూర్ధాఘ్రాణం బొనరించి నీవు నన్ను మన్నించితివి నే నెంతయు నంతసించితిని నీకు విజయంబగుఁ గాక పోయి రమ్మనిన నతం డేను నిన్నుఁ బీడించి నరాధేయుని సానుబంధంబుగ వధించి పునర్దర్శనంబు గావించెద నే నిదె నీపాదంబులు ముట్టి చెప్పుచుంటి ననిన యుధిష్ఠిరుండు వెండియు నీకు విజయంబును రిపుక్షయంబును లభించుత దేవతలు నీకు సముచితబుద్ధిం బ్రసాదింతురు గాక పోయిరమ్ము పురందరుండు వృత్రునిం బోలె నీవు రాధాసుతులం బరిమార్పు మని యాశీర్వదించుచు నంపెపుచ్చె నని చెప్పుటయు నైమిశారణ్యవాసు లవ్వలివృత్తాంతంబు సెప్పు మని సూతు నడుగుటయును. 405

ఆ శ్వా సాం త ము.

మ. నను నెవ్వారలు నాదరింప రెవరుం నావంకకుం జూడ రెం
దును నే సాయము వేఁడఁ గోరఁ బరు నేనుం జూడ వాంఛింప న
వ్వనిలక్ష్యంబును నాకు లే దెపుడు దేవా! నీవ నాదిక్కు ని
న్ననయంబుం భజియింతు నన్నుఁ గరుణాస్వాంతంబునం జూడుమా. 406

క. కాచము సేయనివానిని, నీచుని నే నాశ్రయించి నీయాశ్రయముం
ద్రోఁచుటకు నిచ్చగింపను, నాచక్కిం గరుణఁ జేసి నను నేలు మయా. 607

గ ద్య ము.

ఇది శ్రీమదధునాతనోభయకవిమిత్ర వేంకటయజ్వాగ్రిపుత్ర
సమారాధితవిబుధరాజ శ్రీపాదకృష్ణమూర్తి కవిరాజ
ప్రణీతం బయిన శ్రీకృష్ణభారతము నందుఁ
గర్ణపర్వంబునఁ దృతీయాశ్వాసము.

శ్రీ శ్రీ శ్రీ.



శ్రీ

బాలాత్రిపురసుందర్యై నమః.

# శ్రీకృష్ణభారతము

## కర్ణపర్వము-చతుర్థాశ్వాసము.



నాయురాణ్మహేంద్రపు
రీవరమున గౌతమీపరిగృహీతజలాం
తీరేశుఁ గొలుచుఁగన్నిను
సేవించెద నీపదంబు జేర్పుము దేవా. 1

వ. అక్కథకుండు శౌనకాదిమహామునుల కిట్లనియె నట్లగ్రజునిచే నాశీర్వాదపురస్సరంబుగ ననుజ్ఞాతుం డయిన శ్వేతవాహనుండు హర్షోత్కర్షసమాహితాంతఃకరణుండై హృషీకేశుం గాంచి మనరథంబు సవిశేషసన్నాహబంధురంబు గావింపం బంపుమనిన నతండు దారుకుం బిలిచి చెప్పుటయు నాసూతుండు వీతులఘాతంబులం దవిశల్యంబు లపనయించి సలిలంబులు ద్రావించి ఘాణంబు గల్పించి పూంచి సర్వాయుధసంభరితం బయి కపికేతనాభిరామం బైనదివ్యరథంబు సన్నద్ధంబు చేసి తెచ్చి విష్వచ్చునకు నివేదించిన నతండు ధర్మరాజున కెఱింగించి బ్రాహ్మణస్వస్తిపుణ్యాహవాచనపూర్వకంబుగా వాసుదేవసహితుండై దానినధిరోహించి కర్ణరథంబు దిక్కు మోహమై చనుచున్నసమయంబున నెల్లభూతంబులును సూతసూనుండు హతుం డయ్యెనకాఁ దలంచె నయ్యెడల దిక్కులు వినిర్మలంబు లయ్యె శతపత్త్రచాష క్రౌంచాదిపక్షులు ప్రదక్షిణంబుగం బాఱెఁ గాక కంక గృధ్ర శ్యేన బకాదులు మాంసలోలుపంబు లై విజయుని వేగిరించునవియుం బోలెఁ బెల్లఱచుచు నగ్రభాగంబునం బఱచె మఱియు నెన్నియే శుభనిమిత్తంబులు నిజవిజయంబు నరిసైన్యాపజయంబును సూచించుచుండం జూచి కార్యచింతాకులస్వాంతుం డైనకౌంతేయునికాయంబునఁ బ్రస్వేదకణంబులు గ్రమ్మినం గని జనార్దనుండు గాండీవి నుపలక్షించి యిట్లనియె. 2

—శ్రీకృష్ణుండు కర్ణుం బ్రశంసించి యర్జునున కుత్తేజంబు గలిగించుట—

సీ. సంగ్రామమున నీవు సమయఁ జేసినవారి, నేమర్త్యుఁడును సమయింప లేఁడు
శక్రతుల్యపరాక్రమక్రముల్ కౌరవులు, నినుఁ దాఁకి పర మందుకొనిరి గాదె
ద్రోణభీష్మాదయోధులను మాఱ్కొని గెల్వ, నీకు గా కొక్కవానికి వశంబె
నీదుశస్త్రాస్త్రముల్ నిశితముల్ దివ్యముల్, బలము లాఘవము నీకలరుచుండు
తే. యుద్ధవిజ్ఞానమును లక్ష్యయోగ మొరుల, కలవడవు నీకు బలె లోకముల సదేవ
దానవంబుగ నడఁగింపఁ దగుదు నీవ, యొరు నిను బోలుజోదు లే డిది నిజంబు. 3

చ. నలువ సృజించె గాండివము నాఁబడువిల్లది సాధనంబు గాఁ
గలిగిననీ కసాధ్య మొకకాలమునాఁటికి లే దొకింతయుం
గెలుపుగలాడవీ వయిన నేనొకకొంతహితంబు సెప్పఁ గాఁ
దలఁచితి నాలకింపు మడఁదం గరువంబున కీక తానమున్. 4

క. సామాన్యుఁడు కర్ణుం డని, నీమనమునఁ దలఁచి వానిని సమరమునం
దేమెయినే నవమానము, గామొంగుట పాడిగాదు గదె కౌంతేయా. 5

సీ. వినుము చెప్పెద బలవీర్యసంపన్నుఁడు, కృతియుఁ గృతాస్త్రుఁడు కృతముఖుండు
దేశకాలజ్ఞుఁడు దివ్యాస్త్రకలితుండు, చిత్రయోధుఁడు ధన్విశేఖరుండు
కర్ణుండు జవమున గాలికి దొర తేజమున వహ్ని కెన క్రోధమునను జముని
పురుషుఁడు మహాబాహుఁ డరయ నష్టారత్నిమాత్రకాయుఁడు జగన్మాన్యయశుఁడు
తే. వాఁ డలంతులఁ బోయెడివాఁడు గాఁడు, పెక్కు లేటికిఁ జెప్పెద నొక్కమాట
నీకు సముఁ డగు లేకున్న నిన్ను మించు, నట్టివాని నుపేక్షింప నయితి గాదు. 6

ఉ. కౌరవపక్షపాతమునఁ గ్రాలుచు మీ కపకార మెప్పుడుం
గోరుచు వైరభావమునఁ గోపము సూపుచు నుండెఁ గర్ణుఁ డా
శూరవరేణ్యునిన్ గెలుచుశూరుఁడ వీ వొకరుండ గాక యీ
ధారుణియందుఁ గా దమరధామమునందును లేఁ డొకండునున్. 7

శా. నేనే వీరుఁడ నంచు నెంచుకొనుచున్ నీపై మహాద్వేషముం
దానై పూని త్వదీయులం గలఁచుసూతప్రోద్భవుం డాతనిన్
గానిమ్మంచు నుపేక్ష సేయక వడిన్ ఖండించి తచ్ఛీర్షమున్
భూనాథుం డగుధర్మసూతికి ముదంబుం గూర్పుమా నేర్పునన్. 8

తే. ఖడ్గజిహ్వము శరదంష్ట్రకము శరాసనాస్యమును గల్గి దృప్త మానట్టికర్ణ
సింహమును గూల్చి నీవారిచిత్తములకు, శాంతి యొనరింపు మని చెప్పె శౌరిమఱియు.

మత్త. నేఁటికిం బదునేఁడునాళ్లును నింక నయ్యెను గయ్య మిం
దోటమిం గొని రెండువాఁగుల నున్నసైన్యము లన్నియుం
నాఁటినాఁటికి సన్నగిల్లి కనంబడు న్నిపుడుఁ దాఁకుటం
మేటు లాకురువీరు లెందఱొ మేదినిం బడి రర్జునా. 10

సీ. పాంచాలపాండవప్రముఖవీరులు పోరు,చుండిరి నీదగునండఁ జేరి
జగము లన్నియు గెల్వఁ జాలిననీ కీకు,రుబలంబు గెల్చు టేమి బరుసియౌ కొ
బాహుబలాఢ్యు నాభగదత్తుని జయింప, నీకుఁ గా కొకనికి నేర్చ గలదె
భవదభిరక్షితం బవునీబలంగము, గన్నెత్తి చూడంగఁ గలఁడె యొకఁడు
తే. నీదుబలమునఁ జేసియ గాదె ద్రుపద,పుత్త్రకులు ద్రోణభీష్ములపొడ వడంచి
రీవు గా కట్లు సైంధవు నేపడంగఁ, జేయఁ జాలినజో దుండు నోయి పార్థ. 11

క. కురుపతికిఁ దోడుసూపిన,నరవరు లిట్టిట్టివారు నాఁ జాలము నీ
పరిసరమున వారెల్లరు, మెరలిరి దివటీకి క్రిందిదీపము లనఁగన్. 12

వ. మఱియు నీయుద్ధంబున ధార్తరాష్ట్రులకు దోడువడి సేనాపతు లైనభీష్మ ద్రోణ కర్ణ కృప కృతవ ర్మాశ్వత్థామ భూరిశ్రవ సైంధవ శల్య ప్రభృతులుం గాక గోవాస దాశమీయులును వసాతీయులును ప్రాచ్యులును వాటధానులును భోజులును దుషారులును యవనులును ఖసులును దార్వాభిసారులును దరదులును శకులును రామఠులును కొంకణులును నంధకులును బుళిందులును గిరాతులును మ్లేచ్ఛులును పార్వతీయులును సాగరానూపవాసులును లోనగునానాదేశాధివాసులు సుయోధనార్థము సంగరరంగంబున సాగరంబు వోలె నభంగతరంగంబులం బొంగి మిన్నుముట్టి యున్నయట్టియెడ నీయట్టివానికిం గాక మఱి యెట్టివానికిని గిట్టింప శక్యంబుగామి నిక్కువంబని మఱియును. 13

సీ. నీప్రాపునం జేసి నేఁటికి నేఁడునా, ళ్ళపుడు సౌభద్రుఁ డాహవమునందు
మగధాధిపతి యయి మహిమ గాంచినజయ,త్సేనుని వధియించి తేజు గాంచెఁ
గదిసి భీముఁడు వానిపదివేలదోస్సుల, సదమద మొనరించె గదను బూని
యాపవలింట నీ వేపు చూపుచు బహు,శాక్షోహిణులఁ గూల్చి తచ్చెరుపడఁ
తే. బదిదినంబులలోఁ గోటిపరిజనులను, నైదుదినములలో బహుశారిబలముఁ
గూల నేసిననదిసుతకుంభభవుల, నేపుమాపిన దీవు గా కెవరు చెప్పుము. 14

తే. ద్రోణభీష్ములు పడుటఁ జంద్రుడును రవియు, లేనిదివిమాడ్కి కురురాజు సేనసొంపు
దక్కెఁ గర్ణుఁడు శల్యుఁడు ద్రౌణియుఁ గృత,వర్మకృపులును మిగిలిరీవఱకుఁ దెగక.

ఉ. వీరుల పేరి చేవ్రతను వే తెగటార్చి నీవు దైత్యులన్
బోర వధించి స్వర్గపదముఁ హరి శక్రున కిచ్చినట్టు లీ
ధారుణి సప్తవార్ధిసహితంబుగ ధర్మజు బాహుపీఠిపైఁ
జేరఁగ నిమ్ము నేఁడు వడిఁ జేరి వియచ్చరు లిచ్చ మెచ్చఁగన్. 16

తరువోజ. గురుసుతుం డని ప్రేమ గూరంగ ద్రౌణి గురుఁ డని కృపునిమేల్గూర్చెదు తల్లి
వరబంధువని కృతవర్మ మామ యని, వఱలెడుమతి మద్రవసుధాధినాథుఁ
గరుణించి వధియింపఁ గడగవ యేని, కడగకుండుదువు గాక కర్ణునిమాత్ర
కరుణింప నోపదు కడతేర్ప నోపు గాండీవనిర్ముక్తకాండజాలమున. 17

సీ. తల్లి యంత్వర మిమ్ము దరికొల్పి తలఁపున, కును ద్యూతకర్మంబు కొలుపుటకును
గర్ణుఁ డేమూల మాకర్ణుండె కురురాజు, పేర్మి కెక్కాలము పెద్దప్రాపు
సంధి కేగిననన్ను బంధింప నెంచిన, మొఱకులలో వాఁడె మొదటివాఁడు
వాఁడు పాండవులను వధియించు నని యెంచి, కయ్యంబునకు నేఁడు గాలు ద్రవ్వె

తే. గౌరవులు మీకు నేయపకారములను, నిగుడఁ జేసిరో వాని కన్నిటికిఁ గర్ణుఁ
డే ముఖం బని యెఱిఁగి సుత్రామపుత్ర! పాపి యగువానిఁ బరిమార్పనోపుమిపుడు.

మ. పరనాగాశ్వరథావళుల్ దుమురుగా నారాచముల్ రువ్వి మా
ర్తర నోనేయుసుభద్రపట్టి నట నార్వు ర్మట్టి బిట్టేయుచో
దురితాత్ముం డగువాఁడు వంచనమెయిం ద్రుంచెం దదీయాశుగో
త్తరకోదండము నంతలో నతని ద్రుంచం జేసి రయ్యందఱున్. 19

క. నిక్కతిం దెగి కూలినబాలకునిం గని [illegible]
బకరాక నవ్వెం గర్ణుఁడు, పతుహూద్వ [illegible]. 20

మ. సతిఁ బాంచాలినిఁ దెచ్చి సభ్యులు వినం జార్వంగి! సి వింకటన్
ధృతరాష్ట్రాత్మజుదాసి వొందుమగనిం బ్రేమింపు మోసీ! భవ
త్పతు లెల్లం గతవీర్యులై రనియె నప్పాపాత్ముఁ డప్పాపసం
గతికిం బోలఁ దదీయరక్తమున నీకాండంబులన్ నాన్పుమా. 21

వ. మఱియు మీకనేకాపకారంబు లొనరించినవాని నేఁడు నీగాండీవనిర్ముక్తకాండజాలంబున గండడరించి యమక్షయంబునకుం బుచ్చుము చచ్చిపడినవానికళేబరం బరసి వానివా ర్లెల్లఁదల్లడిల్లుచు హాహాకారంబు సేయుచుండ విషణ్ణవదనుం డై శల్యుండు ప్రమోషువడినతేరుం దోలుకొని పోవం జూచుభాగ్యంబు మనవారి కిప్పుడ పట్టవలయు నట్టియెడ సుయోధనుం డాయోధనంబునం బడి నెత్తుట నత్తమిల్లినవానిం గని నిజ

జీవితంబున నిరాశుం డై పరిపరి పరిదేవనంబు సలుపవలయు నని పలుకుచు నదె పాంచాలురు కర్ణబాణపీడితు లై హాహాకారంబు సేయుచుం బాఱుచున్నవారు ధృష్టద్యుమ్నుండును శిఖండియు ద్రౌపదేయులును శతానీకుండును నకులసహదేవులును జనమేజయసుశర్మలును సాత్యకియు నయ్యాధిరథికిం దక్కియున్నవారు భీష్మద్రోణులవిక్రమంబునను నిట్టియెపరు పుట్టియుండదు. మనబలాంగంబుల నెల్ల వైశ్వానరుండు పతంగంబులం బలెఁ గర్ణుండు గాల్చుచున్నవాఁడు కర్ణార్ణవమగ్నులయినవారి కెల్ల నీవు తేప వై కాపాడుము కాకున్నఁ బాకంబు దప్పి కార్యంబు సెడు రామోపాత్తం బైనవాని భార్గవాస్త్రము ఘోరరూపం బై సర్వజనతాపకం బగుచున్నయది యదిగో భీముండు భీమపరాక్రముం డై కర్ణుం దాఁకి వీఁకం జూపుచున్నవాఁడు కర్ణచాపచ్యుతంబు లగుశరపరంపరలు భ్రమరపంక్తులుం బోలె మన సైన్యంబు పయిం గప్పుచున్న విష్వ డొప్పరికించిన నసాధ్యరోగంబు దేహంబునుం బలె నీసేనం దహించు నీవు గాకిప్పు డాసూతసూతిం దాఁకఁ జాలినవాఁ డీయూధిష్ఠిరబలంబునం గానరాదు కావున నీవు నీప్రతిన కనురూపంబుగఁ గర్జంబు గావించి కీర్తిం గాంచుకొ మ్మనిన సంతసించుచు సవ్యసాచి ధనుష్టంకారంబు చేసి కర్ణవధోద్యుక్తమానసుం డై మధుసూదనుం గాంచి యిట్లనియె. 22

—అర్జునుండు కృష్ణునివాక్యములచేఁ గర్ణవధంబున కుత్సహించుట—

మ. ఇల నీయొద్దడ గల్గి నీకరుణ కై యింపారు నేవారును
గెలుపుం గాంచుట కెట్టియచ్చెరు వగుఁ గృష్ణప్రభూ! నాకు నీ
బల మెంతేనియుఁ దోడుపా టగుట నేఁ బాటింప కొక్కింతలో
పల లోకత్రయ మేస్తు నన్న వృషలాపత్యం బ దేలెక్కయో. 23

ఆ. ఇంద్రుఁ డశనిఁ బోలె నిద్ధభార్గవమహాస్త్రప్రభావగరిమఁ దనకు మాఱు
మలయువారు లేమి మనమూకయుం దెందుఁ, జూడ దాన యగుచు వీఁడు దనరు.

ఉ. భూమి గలంత కాలమును భూతము లెల్లను జెప్పుకోఁగ సం
గ్రామ మొనర్చి సూతజుని గాండివముక్తశితాశుగాహతిన్
భూమిఁ బడంగఁ జేసెదను బుత్రుని ధాత్రిపుఁ జేయు నెంచువాఁ
డై మనుచీఁకు నాస లవి యన్నియు భిన్నములై నశింపఁగన్. 25

సీ. నమ్మినబం టిట్లు నడచినఁ గని సుయోధనుఁడు కృష్ణునిమాట వినఁగ నైతి
నని జీవితాశ వో మనమునం దనుఁ దాన, నిందించుకొని కుంది మ్రందఁ గలఁడు
సౌబలుండును నాదుశరశరాసనరథములఁ గాంచి యుద్ధసాధులును ద్యూత
ఫలకంబు తన్మాటపమును స్మరించుచు, సిగ్గున నెంతయు మ్రొగ్గతిల్లు

తే. నేఁటితో ధర్మనందను మేటిజాగ, రవ్రతము దీఱ సుఖయించు రాధసుతుని
నరునిఁ జంపక పదధావనం బొనర్ప, ననుప్రతిజ్ఞయు విఫలమై చనఁగఁ గలదు. 26

ఉ. షండతిలోపముల్ పతులు చచ్చినయట్టిర సూపె నీవు వే
ఱొండకని న్వరింపు మిట నూడిగముం బొనరింపు మంచు మున్
బాండవధర్మపత్ని నటు పల్కినపల్కులకున్ ఫలంబు గాఁ
జండశరాశుగంబులను జావఁగ నేసెద నేఁడు సూతజున్. 27

తే. పాండవులదాడివలన నే భండనమున, మిమ్ముఁ గాచెద నని యుభయ మ్మొసంగి
వీఁడు వారల కబ్బాస వితగ నేఁడు, వీని నెత్తుటఁ దృప్తిఁ గావింతు నిలకు. 28

ఉ. వేనిబలంబు సూచుకొని వేఱఁడులై ధృతరాష్ట్రనందనుల్
మానక మమ్మజస్రమును మాటలు నేటులు నొవ్వఁ జేసిరో
వానిని వానివారి నిల వ్రాలఁగఁ జేసినవారు భీరులై
కానలు వట్టి పోఁ గలరు గాంచి మృగేంద్రుని లేళ్ళకైవడిన్. 29

తరళము. ఇపుడ కర్ణునికాయఖండము లెన్నియేనియు నేలపై
సుపరితోషమొసంగుచున్ ఘనశోణితమ్మును గ్రక్కుచున్
బ్రపతనంబును బొందఁ గన్గొని పాఱఁజెంచి పలాదముల్
వ్యపగతార్తిఁ మెసంగి గ్రుత్రని వాయి వ్రేల్చుచు ద్రేమకన్. 30

చ. అనుఁగులతోడఁ గర్ణుఁ దెగటార్చి పుచ్చెద నేఁడు నేను నా
యనుజులు నన్నలున్ హితులు నాప్తులు బంధులు సంతసింపఁ గాఁ
బొనరిచి వానిచేతఁ దెగి పోయినవారిఋణంబు దీర్పనై
తను విధి సార్థకం బనెడుదానికి వచ్చెదఁ జూడు మచ్యుతా. 31

క. ఇదె సూతసుతుని మార్కొని, ప్రదరంబుల గూల నేసి బాహాశక్తిన్
బదుమూఁడేడులు మాకుం, గదిరినదుఃఖంబు లీఁగఁ గలిగెదఁ గృష్ణా. 32

ఉ. నీదెస నాత్మసంస్తవము నేఁ బొనరించుకొనంగఁ బోవుటల్
కాదని యూరకుండెదను గాని జనార్దన నా కిలన్ ధను
ర్వేదమునందు సాటి యగువీరుఁ డొకండును లేమి సెప్పెదన్
నాదగుగాండివంబునకు నాకులు గీకులు నేని లెక్కయే. 33

క. అసహాయుఁడ నై నే నొక్కఁడ సబాహ్లీకముగ నుక్కడంచి కౌరవులన్
వెస ననపత్యం బగుసీ, విస్మరధర భ్రాతృబాహుపీనినిజ మొనర్న. 34

వ. అని పలుకుచు నేకపేసుం డగునర్జునుండు క్రోధారుణితలోచనుండై భీమసేనునికిఁ జేయూ

ర్చుకొనం జేయ నెంచి సింహనాదంబున రోదోంతరంబెల్లఁ బూరటిల్లఁ జేయుచు
రయంబున రాధేయునిరథసవిధంబునకు రథంబు దోలించుకొని పోయె నంతకు మున్న
భేరీనినాదంబులు బోరుకలుగ నుభయబలంబులు నభయప్రకారంబునం గవిసి పోరం
దొడంగె నందుఁ గృపశిఖండులును దుర్యోధనసాత్యకులును ద్రోణపుత్త్రశ్రుతశ్రవు
లును జిత్రసేనయుధామన్యులును సుషేణోత్తమౌజసులును శల్యపుత్త్రసహదేవు
లును వృషసేనశతానీకులును గృతవర్మనకులులును గర్ణధృష్టద్యుమ్నులును
ద్వంద్వంబులై పెనంగుచుండ సంశప్తకసహితుం డగుదుశ్శాసనుండు భీమసేను
మాఱుకొనినం బోరు ఘోరం బయ్యె నయ్యెడ. 35

సీ. ఉత్తమౌజసునిచే నుత్తలఁ గర్ణపుత్త్రుఁడు సుషేణుఁడు వేగి పుడమిఁ బడియెఁ
బడినఁ గన్గొని కర్ణుఁ డడరి దుఃఖంబును, గ్రోధంబు నొకపరి గొమరుమిగులఁ
దద్రథ్యములు రథధ్వజములు ధరఁ బడఁ, జేయుటయు నతండు శితశరములఁ
గరవాలమున నొప్పు ధరకు లంఘించి కృపునివాహనంబులు దునిమి వైచె

తే. వడి శిఖండిశతాంగము పయికి నెక్కెఁ, విరథుఁ డగుకృపుని శిఖండి వేయఁ దలఁపఁ
డయ్యె నాలోన వడి నేగి యతని దౌఃశాసనరథముమీఁదికెక్కించుకొనిగమించె.

వ. అయ్యవసరంబున. 37

చ. అనిలజుఁ డభ్రమధ్యగతుఁ డైన దివాకరు మాడ్కి మండుచున్
సునిశితసాయకౌఘములఁ జుట్టును ముట్టినధార్తరాష్ట్రులన్
గనుకనిఁ బాఱఁ ద్రోలుచును గండడగించుచు గండడంచుచున్
మనమొనలం గలంచె గరిమం గరి తుంగమదంబుభంగిగన్. 38

వ. అట్లు మనబలంబులు వాతనున్నంబు లగువారివాహంబులతెఱంగునం దెఱలి పఱ
చుచున్నం గని వృకోదరుండు విశోకుం బిలిచి యిట్లనియె. 39

—భీముం డర్జునుం గోరి విశోకునితో విచారించుట—

మ. మనవా రెవ్వరు గాని నామునుముఁగన్ మట్టాడుచున్నట్టు నీ
కనుదోయిం బడియుండ లేదు గద నేఁ గయ్యంబు నెయ్యంబునం
గనుఁగోఁ జాలను శ్వేతయుగ్యంబులఁ గిన్కం గూల్చుచున్నాఁడ నో
యని సందేహము నొందమొం దగు విశోకా! చూచి వాక్రుచ్చుమా. 40

చ. విడిదల కేగె ధర్మజుఁడు వెన్నడి కర్ణుని చిచ్చుటంపఱన్
గడిమిచెడంగ తేనిగతి గన్గొన నేగిన ఫాల్గునుండు నె
మ్మొకకును రాఁడ యయ్యొ మనమేలిక ప్రాణముతోడ నుండె నో
కడచనె నో యెఱుంగమిని గాఢతరం బగుదుఃఖ మయ్యెడిన్. 41

తే. ఏది యెట్లైన మన మిప్పు డెల్లపగఱ, గెలిచి యే కాని క్రేడించి తొలఁగి పోవ
క్షాత్రధర్మము కా దని శౌర్యగరిమఁ, జయము బలు మేర్పడఁగఁ బోరఁ దలఁచినాఁడ. 42

క. మనయరదంబున నిప్పుడు, గనుఁగొన నేజాతిసాయకము లెన్ని దలి
ర్చునొ వాని దెలిసి నాకున్, వినిపింపుము తెలియునట్లు విన్నాణమునన్. 43

వ. అనిన విశోకుండు పరికించి పదివేలమార్గణంబులు రెండువేలనారాచంబులు మూఁడు వేలప్రదరంబులు నరదంబున మిగిలియున్న యవి మఱియు నాలువృషభంబులు మోచి తెచ్చినశరపూర్ణశకటంబు లొక్కఁడు మాత్ర మట్లు యున్నది యేది యెట్టు లున్న నన్నింటికిం జాలి నీబాహుదండమండితం బగుగదాదండంబు పరమధనంబై యెంతలెంత లయినను జేయఁ జాలుఁ గావునఁ బ్రాసముద్గరశక్తితోమరాదులు లే వని భయంబు నొందకుండు మనిన భీమసేనుండు వెండియు ని ట్లనియె. 44

చ. కనుఁగొను మయ్య భీమవిశిఖంబుల దిక్కులును న్విదిక్కులున్
ముసుఁగఁగ నష్టసూర్య మయి పొంపిరివోవుచు మృత్యులోక మో
యనఁ దగిసంగరాంగణ మిదంతయు నెంతయు భీకరంబు నై
వెఱుబడ నొకింతయును వేల్పుల కేనియు వెక్కసంబుగన్. 45

మ. విను మాబాలము గా జనం బెఱుఁగు దోర్వీర్యం బవార్యంబ మై
చనఁ గౌరవ్యుల నెల్ల ద్రెళ్ళఁ జనిం జానేసె ధర్మానుజుం
డని కానీ తమ రెల్లరుం గలిసి ప్రోవై వానిం జంపి రం
చని కానీ నుడి నేఁటినుండి జగతిన్ వ్యాపించెడి న్వింటి నే. 46

క. సురలెల్ల నాకు విజయము, దొరకొనఁ గాంక్షింత్రు గాక దోర్బలతేజ
స్స్ఫురణంబు మెఱయఁ బార్థుఁడు, దురమున కరుదెంచుఁ గాత తోడ్పడునాఁడై. 47

వ. అని యత్తఱి నీమొత్తంబులం గలయం గనుంగొని మఱియును. 48

క. కలగుండు వడియె నద్దెసఁ, గలఁగం బాఱెడినిమూఁక కనుఁగొంటె భుజా
బల మెసఁగఁ గదిసి శౌర్యో, జ్జ్వలుఁ డగుమనసవ్యసాచి సమయించునొకో. 49

మ. వనదాహంబునఁ బాఱువారణవరవ్రాతంబునా వైరివా
హినియెల్లం దెఱలంబడెన్ రథచయం బింతింతలై వోఁ దురం
గనికాయంబులు దంతిసంతతులు మ్రొగ్గం గాల్వుర్ రొండొక్కఁ జిం
గొని త్రెళ్ళన్ సిడముల్ వడిన్ విడివడన్ ఘోరార్తనిర్ఘోషముల్. 50

వ. అనిన విశోకుం డంతయుం బరికించి పావనిం గాంచి యి ట్లనియె. 51

సీ. ఘనవోటు గాండీవనినద మఖండమై, విన వచ్చెడిని నాదువీనులకును
నదె మేఘనిర్ఘోష మట్లగు దెంచెడు, ఘోర మై దేవదత్తారవంబు

గిరిగహ్వరంబుల భరిత మై మాఱ్మ్రోఁతయుఁ, జేయుచున్నది రథస్ఫీతరుతము
కేతనాగ్రంబున నాతతధ్వనితోడ, నృత్య మాడెడుఁ గపినేత చెలఁగి
తే. నరకిరీటద్యుతులు పర్వె నభమునందుఁ, గానఁబడు నదె నొగలఁ బగ్గములఁ బూని
కౌస్తుభముఁ జక్రరాజముఁ గాంతు లీన, వఱలు కృష్ణుని జూడవో వాయుతనయ.

చ. కులిశమునన్ మహాగిరులఁ గూల్చినయట్లు గజేంద్రబృందముల్
జలమునఁ గూల్చుచున్ నిశితసాయకపంక్తు లెసంగఁ జేయుచున్
సలలితశుక్లవర్ణహయసంఘటితం బగు తేరిపై మహో
జ్జ్వల మగుదీప్తితోడ నిటు వచ్చెడుఁ జూడుము వాసవాత్మజున్. 53

ఉ. చూడుము చూపు చాచి యదె సూర్యనిభం బగు తేరు వాఁడుచోఁ
గ్రీడి శితాస్త్రపాతమున గిట్టె జతుశ్శతముల్ శతాంగముల్
పోడిమి దప్పె సప్తశతముల్ ద్విరదంబులు గూలెఁ బెక్కునూ
ర్లోడి పదాతివర్గము మహోన్నతవాహనసంచయం బటున్. 54

తే. కనుము చిత్రగ్రహం బట్లు కౌరవులను, గాల్చిపుచ్చుచు నుండె మీకవ్వడి వడి
నీమనోరథ మీడేఱె నీఁగటకు, మూఁడె కాలము విశ్రాంతి గూడు నీకు. 55

వ. అనుటయు భీమసేనుండును. 56

తే. ప్రియ మొనరించితివి గానఁ బెరిమదోఁప, బదియునాలుగు గ్రామముల్ పదులు రెండు
వరరథంబులు నూర్వురు వరవృషులను, నీ కొసంగెద నని మనమారఁ జొచ్చె. 57

వ. అర్జునుండును భీమసేనుం డరిసేనం జొచ్చినప్పటి రథనిర్ఘోషంబును సింహనాదంబును విని తనతేరు మారుతికడకుఁ జేరఁ దోలించినప్పుడు కురుప్రవీరులు పెక్కురుక్కు మిగిలి చతురంగసైన్యంబులతో బాణపాతాదినిస్వనంబును రథనేమినిర్ఘోషంబును దిక్తటంబులు బీటలు వాఱ నప్పురుహూతసూతిం దాఁకు దెంచిన నతండు గండుమిగిలి త్రైలోక్యరక్షార్థము రక్షోగణంబులపైఁ గవియు నధోక్షజునిచందంబున వారిపైఁ గవిసి క్షురార్ధచంద్రభల్లాదిసాధనంబుల శిరంబులును గరంబులును ఛత్రంబులును జామరంబులును గేతుదండంబులును ఖండించి నరగజాశ్వరథంబుల మథించి మహావాతంబు వనంబులం బోలె మనబలంబుల నెల్ల నెగిరించి యెదురులేకున్నం గని మనవారు పెక్కువేలరథంబులవారు వానిం జుట్టుముట్టి బెట్టేసిన నీసునం జేసి వారి నెల్లఁ బ్రేతరాజపురంబునకుం బ్రయాణంబు సేయించి నడుమనడుమం దాఁకవచ్చిన వారి నమ్మార్గగుర వారికిం దోడుపుచ్చిన మనసైన్యంబు దైన్యంబు నొంది కుందుచు నార్తరవంబు రోదోంతరం బెల్లఁ బూరటిల్లం జేయుచు నలుగడం బఱవఁ జొచ్చె నట్లు విక్రమాటోపవిజృంభితుండై భీభత్సుండు కర్ణానీకాభిముఖంబుగ రథంబు దోలించె

నారథధ్వానంబు విని భీమసేనుండు సంప్రీతచేతస్కుండై ప్రాణభయమ్ము విడిచి వాయువేగమ్మున నీసేనపై నడరి బెగడంపుఁ గొంగల పెంపుఁ జూపింప నది కాలూన లేక కొండం దాఁకినకెరటంబు వోలె విరిగి పాఱిన సుయోధన దుర్యోధనుండు మహేష్వాసు లగుమహాయోధులం జేపీచి పిలిచి మీ రందఱు నొక్కమొగిం బొదివి వీనిం జంపుఁ డీతండు సచ్చినం బాండవు లెల్లరుం జచ్చిన ట్లని యెలుంగిచ్చిన నెల్లరుం బెల్లురేఁగి బహుళహయహస్తిరథభటసమూహంబుతో నాజగజెట్టిం జుట్టుముట్టి శరవృష్టి నిగిడించిన నతండు నక్షత్రపరివృతుం డగుచంద్రునిచందంబునం బొందుపడి మహామత్స్యంబు నిజపుచ్ఛంబున సముద్రోదకంబునుం బోలె నాసేనాసమూహంబు చిందువందు గావించి లక్ష మాతంగంబులను రెండులక్షల రెండువేల కాలుమానుసులను నైదువేల గుఱ్ఱంబులను నూఱు తేరులను భగ్నంబు గావించి హస్తిగ్రాహసమాకులంబును నగమత్స్యంబును నశ్వనక్రంబును గేశశైవాలశాద్వలంబును సంఛిన్నబాహుభుజగంబును నానారత్నవిభూషితంబు నూరుగ్రాహంబును మజ్జాపంకంబును శిరోపలనిషేవితంబును ధనుఃకాశశరాకారంబును గదాపరిఘమీనంబును రథావర్తంబును శోణితోదంబునుం గలిగి వైతరణిం బోని దుస్తరం బగుమహానది ప్రవహింపం జేసి వేనవేలయోధుల యమపురాతిథులం గావించె నప్పుడు సుయోధనుండు సౌబలు నొద్దకుం బోయి యి ట్లనియె. 58

—♦శకుని భీమసేనుం దాఁకి మూర్ఛితుండై పడుట♦—

ఉ. మాతుల! భీమసేనుఁ డదె మార్కొని మూఁకల వీఁక నోర్చెఁ బ్ర
వీతభయుండవై యిపుడు వీనిఁ బయిం గవియంగ నేగి నీ
శాతశరంబులం బఱపి చక్కడుపం దగు నన్న నాతఁడ
త్యాతతశౌర్యసంపదలు నా నని మెచ్చుచు నిచ్చ పెంపునన్. 59

తే. భీమసేనుని దాఁపడి భీమసాయకముల నాతనివామపార్శ్వము స్తనాంత
రమ్ము నొవ్వంగ నేయుఁడు రయము మెఱయ, వగిలె భీముని వర్మంబు వాలికలయి.

క. సరకుగొన కనిలతనయుం, డుగువడి సౌబలునిమీఁద నొక్కశరంబుం
బరఁగింప నతఁడు దానిన్, ధర నేడై పడఁగఁ జేసెఁ దలమొత్తుపర్ఘ. 61

మ. తనబాణంబులు రిత్త వోవుటయుఁ గ్రోధప్రస్ఫురద్వక్త్రుఁడై
యనిలప్రోద్భవుఁ డొక్కబాణమునఁ దద్ధస్తోచ్చలచ్చాపముం
దునిమెన్ సౌబలుఁ డొండువిల్లుఁ గొని తోడ్తో షోడశప్రజ్వల
ద్ఘనభల్లంబుల నల్లనల్ల నరి సంధానంబు గావించుచున్. 62

ఆ. నాలుగింట దక్షిణస్థు నేనింట వాయుజుని నాలుగింట యుగ్యములను
నొగులనేసి రెంటఁ దగుసిడంబు నొకంట, విల్లు విఱుగ నేసె విక్రమమున. 63

చ. అలిగి మహాబలాత్మజుఁడ హంకృతి మీఱఁగ శక్తి నెత్తి సౌ
బలునిరథంబుపైఁ బడఁగ వైచుడు దానిన పూని క్రమ్మఱం
బలిమి నతండు భీముపయిఁ బోఁగ వేసి హసించె శక్తియుం
బొలుపఱ వాని వామభుజము న్నొగిలించి యిలం బడె న్వడిన్. 64

ఆ. మెఱుఁగుదీఁగ వోలె మేదినిపైఁ బడ్డ, శక్తిఁ గాంచి నీదు సైన్యమెల్ల
నార్చు లెసఁగ హర్షమందె దానికి సైప, కనిలజుండు క్రుద్ధుఁ డగుచు నంత. 65

సీ. సత్వరంబుగ నొండు సజ్జకార్ముకమంది క్రేళ్ళిడి సుబలాత్మజున్
నంపవెల్లిన్ ముంచి యతని గుఱ్ఱంబులు, సూతునిఁ దెగటార్చి కేతనంబుఁ
గూల్చిన నాతండు వెచ్చ రథము డిగ్గి, నిట్టూర్పు నిగిడించి విభ్రతముగను
నారి సారించుచు నారసంబులు పెక్కు, లడరించెఁ గడునడి వడముడిపయి

తే. నతఁడు కడు నగ్గి నడి వానికడిమి యుడుగ, విల్లు దునుమాడి తూపులవెల్లిఁ దేల్చ
సౌబలుఁడు నేలపై వ్రాలె సామ చచ్చి, ధార్తరాష్ట్రులు వెఱగంది రార్తు లగుచు.

వ. అట్లు భీమసేనశరార్దితుండై ధరాతలంబునం బడి విహ్వలుండైన సౌబలుం గని
నీకొడుకు కలితత్వరితగతిం జనుదెంచి వానిం దనరథంబుపైఁ బెట్టుకొని తొలంగి చనియె
నంతఁ గౌంతేయుండును వెన్నుదన్నిన నీబలంగంబునం గలపోటుమానుసు లెల్లరు
లేటమొగంబు వెట్టి యప్పట్టునం గాలూఁదఁ జాలక జాలింబడి వడివడిం దెఱలి
కర్ణుమఱువు సొచ్చి రతండును గడలిఁ గలం బవిసినవారికిం జేరువ యగుదీవియుం
బోలెఁ బ్రాణరక్షకుం డయ్యె ననిన ధృతరాష్ట్రుం డట్లు భీమసేనునికోల్తల కోహ
టించిన బలంబు చలంబు విడిచి వెఱచఱచి పఱచినంత దుర్యోధనదుశ్శాసనాదు
లగు నాకొడుకులును కృపాశ్వత్థామప్రభృతియోధాగ్రగణ్యులు నేమిమైరి సౌబలుం
డెట్లయ్యె ధనుర్ధరప్రవరుం డగు కర్ణుం డేమిచేసె నెఱిఁగింపు మనిన సంజయుం డతని
కి ట్లనియె. 67

ఉ. ఆయపరాహ్ణకాలమున నాహవదోహలమత్తచిత్తుఁడై
స్ఫాయదనంత తేజమున భాసిలి కర్ణుఁ డుదీర్ణకోపుఁడై
వాయుతనూభవుండు నిజవాహిని యంతయుఁ జిందువందుగాఁ
జేయుటకుఁ సహింప కరిసేనపయిం జనఁ బల్కె శల్యునిన్. 68

తే. శల్యుఁడు కరూశచేదిపాంచాలసైన్య, సంచయంబుల నెదిరింపఁ జాలి రథికు
లున్నచోటుల కెల్ల మహోన్నతరవ, మలరఁ దోలెను శ్వేతాశ్వకలితరథము. 69

ఉ. మే లని మెచ్చి కర్ణుఁడు నమేయపరాక్రమ మేర్పడన్ వడిన్
వేలకు వేలు బాణములు వేయుచు దాయల నెల్ల నేలకుం
గోలకుఁ దెచ్చుచున్నతఱిఁ గోపపరీవృతచిత్తవృత్తులై
వాలికతూపులం గదియ వచ్చిరి హెచ్చి సపత్నసైనికుల్. 70

సీ. సాత్యకి కర్ణునిజత్రుదేశంబున, నిర్వదియమ్ములు పర్వఁ జేసె
సేనాని సప్తతిశితసాయకంబుల, నేసె శిఖండియు నిర్వదేను
శాతాంబకంబుల సూతజు నొప్పించె, నూఱింట నకులుండు నొవ్వ నేసె
సహదేవుఁ డేడింటఁ జదియ నేసెన్ ద్రౌపదేయుల్ చతుష్షష్టిసాయకములు

తే. భీమసేనుఁడు తొంబదిభీషణాశు, గములు పఱఁగించి కర్ణునంగములు నొగుల
నేయుఁడు నతఁడు నవ్వుచు నెల్లవారి, నొల్లఁబోఁ జేసె నైదేసి భల్లములను. 71

చ. ధనువు సితంబునుం దునిమి దానవవైరిసహోదరున్ నవా
తినవశితాంబకంబులను గ్రీవఁ దోఃప నురోంతరంబునం
గొనకొని యేసి నొంచియును గొంతలు గాని పృషత్కపంక్తులం
గనలుచు వాయునందనుని గంపఁడగించి చలంబు వెంచుచున్. 72

చ. సరగున మాద్రినందనునిసారథివక్షము మూఁటి లెక్క నా
శరముల నాడ నేసి యొకశాతశరంబున వానికేతువున్
ధరఁ బడఁ ద్రోసి చెంగటన దర్పము సూపెను ద్రౌపదేయులన్
విరథులఁ జేసె వ్రేల్మిడిని వీరుల కెల్ల మహాద్భుతంబుగన్. 73

వ. ఇ ట్లేకవీరుం డగుకర్ణుండు గండుమిగిలి ఖండనంబున నానావిధకాండంబులఁ బాండవ
పాంచాలాదిసైన్యంబు దైన్యంబు నొంది కాందిశీకంబై కయ్యంబునకుం గానియట్లు
గావించి మందహాససుందరవదనారవిందుండై గంధర్వసిద్ధచారణగణప్రస్తూయమా
నుండును ధార్తరాష్ట్రసంసేవ్యమానుండు నై మగంటిమిం బేర్చి కార్చిచ్చు కాననం
బుం బలె వైరివారంబున మండుచు శిరంబులు చిదుముచుఁ గరంబులు ఖండించుచు
నురంబులు పగులించుచు రథహస్తిపత్తితురంగంబులఁ గరంబు నీఱు సేయుచు నెత్తు
టేరు వాఱించి కయ్యంపునేల కర్దమప్రాయంబు గావించి మధ్యందినమార్తాండునిచం
దంబున మండుచుండం గని మనవారు సింహనాదంబులును శంఖనాదంబులునుం
జేసి రాసంచునఁ బంచవింశతిపాంచాలవీరు లాశూరశేఖరుం దాఁకువెంచిన నతం
డశ్రమంబున వారి నెల్ల వైవస్వతపురాతిథులం గావించి మించినపరాక్రమంబునఁ
బ్రవర్తించుచున్నం గాంచి పాంచాలు రొక్కమొగంబై కర్ణుం జుట్టుముట్టి రట్టియెడ

దుర్యోధన దుశ్శాసన కృపాశ్వత్థామ కృతవర్మ సౌబలులును గర్ణపుత్త్రులును మహా సేనాసమూహంబుతో నతనికిం దోడుపడుటయు ధృష్టద్యుమ్న శిఖండి ద్రౌపదేయ ప్రభృతులును దమవారికిం దోడుపడినం బోరు ఘోరం బయ్యె నయ్యెడ నర్జునుం డరిలోకదుర్జయుండై సూతపుత్త్రుం జూచి చూపోవనితనంబునం బోలెం జతుర్విధసైన్యంబు దైన్యంబు నొందించుచు మాంసమజ్జాస్థిపంకిలంబును మనుష్యశీర్షపాషాణంబును హస్త్యశ్వకూలంబును శూరాస్థిచయసంకీర్ణంబును గాకగృధ్రానునాదితంబును ఛత్త్రహంసప్లవోపేతంబును నుష్ణీషవరఫేనిలంబును జర్మవర్మభ్రమాంచితంబును రథోడుపసమాకులంబును శోణితోదంబు నగుమహానదిం బ్రవహింపం జేయుచు వాసుదేవుం గాంచి యిట్లనియె. 74

—అర్జునుండు కురుబలంబు నఱిమి పోరాడుట—

మ. కనుఁగొంటే గరుడధ్వజా! మన మొనం గర్ణధ్వజం బాఁడెడిన్
మనభీమాదులు నమ్మహారథునితో మాఱొడ్డి పోరాడుచు
న్నను బాంచాలురు భీరులై పఱచు చున్నా రెన్న దుర్యోధను
డును గర్ణాదుల ప్రాపునన్ బలములం దోలించు చున్నాఁ డయో. 75

క. గురుసుతకృపకృతవర్ములు, నరవరుఁడును దోడుసూప నన్యప్రతిభన్
దుర మొనరించెడిఁ గర్ణుఁడు, వెరవరియై మద్రనేత వీఁకుల నడుపన్. 76

ఉ. అచ్చోటు చేరఁ దోలుము హయంబుల నంబురుహాక్ష! కర్ణునిం
బచ్చడిసేయుకే మరలి వచ్చెదు వాఁడను గాను గా దటం
చిచ్చట నింతసేపు మన మిట్లురకుంటిమ యేని సృంజయుల్
సచ్చెద రెల్లరున్ వృషునిశాతశరానలఘోరకీలలన్. 77

వ. కావున నీవు వేగిరింపు మనిన నోఁ గాతముం పీతాంబరుం డతిత్వరితగతిం గర్ణరథాభ్యర్ణంబునకు నిజరథంబు పోవ వాపురంబులఁ దోలి పాంచాలాదిబలంబుల జాలివోఁ జేసె నా సమయంబున వాసవాశనిసమ మ్మగు నర్జునరథఘోషమ్ము నాలించి కేతుప్రచారంబుం బోలించి శల్యుండు కర్ణుం గాంచి యిట్లనియె. 78

మ. హరిసారథ్యము వానరధ్వజము శ్వేతాశ్వద్వయద్వంద్వమున్
పరశస్త్రాస్త్రవిభూషణం బయిన దివ్యస్యందనం బెక్కి భీ
కరుఁడై నీపయి వచ్చు చుండె నెవనిం గాంక్షింతొ నీ వమ్మహా
పురుషుం డర్జునుఁ డెల్లశాత్రవుల నున్మూలించుచున్ లీలమై. 79

మ. అదె గాండీవమహారవంబు దివముం దద్యంతమున్ మ్రోయ భీ
ప్రదుఁడై మూఁకల కెల్ల నొండొకనితోఁ బ్రత్యర్థియై పోరుకో

వ. మఱియు నమ్మహారథుండు. 87

ఉ. కైదువు చేతఁ బట్టు నెడఁ గల్గు దృఢత్వము లాఘవం బిలన్
జోదుల కెవ్వరికిం గలుగఁ జూడ మనేకశతాంబకంబులం
బ్రోదియ యొక్కతూపువలెఁ బోసి యరిన్ వ్వడె నేని క్రోశ మా
త్రాధ్వతదూరమందుఁ బడునట్టివగుర్ వ్యధ నోవ కెవ్వరున్. 88

చ. ఘనుఁడు నిజప్రభావమున ఖాండవమందు హుతాశనుం గడుం
దనియఁగఁ జేసి వానివలనన్ మురవైరికిఁ జక్రరాజముం
దనకు మహాశ్వయోజితరథంబును గాండివ మక్షయేషుధుల్
ఘనతరశస్త్రముల్ వడయఁ గల్గె మహాభుజుఁ డాతఁ డల్పుఁడే. 89

తే. లోకపాలురవలన ననేకములగు, నస్త్రముల నొంది కాలకేయాదిదైత్య
సమితిఁ దునుమాడి దేవలోకమున దేవ, దత్తమును బొందె ధన్యుఁ డతఁడు.

చ. పశుపతితోడఁ బోరి కొని పాశుపతాస్త్రము సంగ్రహించుటల్
విశదము సర్వలోకనుతవీరుఁ డతండు విరాటువీటిలోఁ
బశువులఁ బట్టినాఁ డొకఁడ వచ్చి మహాహవముం బొనర్చి యీ
దృశులను మమ్ము గెల్చి పసి యుల్ల మరల్చి గ్రహించెఁ జేలముల్. 91

సీ. కృష్ణద్వితీయుఁడై జిష్ణుని బోలిన, విలుకాఁడు లే డెల్లవిష్టపముల
నేవీర్యవంతుని యుద్ధగుణము లెన్న, ననువుగా దెవ్వఁడు పూనఁ జాలునఁ గాని
నేకరథస్థులై నేఁడు తామిక్కృష్ణు, లీరిఁ బొడిచిన నాకు చెఱుపు దోఁచు
నైన వీరల మార్కొన నేను గా కొక్క, పోటుమానిసి లేఁడు భూతలమునఁ

తే. గావున న్నేఁడు కాలాగ్నికరణి మిగులఁ, బార్థునితోడఁ బోరునఁ బ్రతిఘటించి
పౌరుషముఁ జూప నెంచితి పార్థివేంద్ర!, యిట్లు చిరకాలవాంఛిత మెఱుఁగు మీవు.

తే. నా మనోరథసిద్ధి యీనాఁటి కిట్లు, కాఁ గలదు లేఁ గృష్ణులఁ గండడంచి
యుర్విపైఁ బడఁ బెట్టెద నొండె వారు, నన్ను నట్టు లొనర్తు రొండె నీ వెన్న నిపుడ.

వ. అని పల్కుచుఁ జెప్పఁ దొడఁగి కాలమేఘగర్జానినాదమేదురంబుగ సింహనాదంబు
గావించి కర్ణుం డుగ్రవేగంబున నిట్లనుచు రణకౌతుకంబున జవంబున తదభినందితుండై సంభా
షించుచుఁ గృపకృతవర్మాశ్వత్థామశకునిప్రభృతులను దనతమ్ములను దక్కిన సైనికవ
ర్గంబును గని మీ రెల్ల మిమ్ముమున్న కృష్ణార్జునుల నతిమి శరపరం
పరలం గ్రుంపు డే నవశ్యమ్మాంబున వారిఁ జయించెద నని పలికిన వా రెల్లరు
నట్ల యగుం గావుత మని వానినిదేశంబునం జేసి విక్రమాటోపదీపితులై సేనానము

దాయసమన్వితంబుగా సత్వరించుచుం జని సవ్యసాచి నట్టిమి తట్టిమి నానావిధసా
యకాసారంబు నిగిడించుటయు నమ్మహాభుజుండు గండుమిగిలి జూపర్వారంబున నిండి
పంబుపయిం బొంటు వచ్చునదీనదంబులు నెల్ల నీరాకరంబు పోలెం దనలోన నడంచి
కొని మించి సంధానమోక్షణంబులు తెలియంగఁ దెలియంగ రాని తెఱంగున శరపరంపరలం
బరంగించి ద్విరదంబుల విదళించి తురంగంబులం దూలించి రథంబుల మదియించి
సారథుల సమయించి రథుల నధియించి మండలీకృతకార్ముకుండై యుగవిగమసమయ
మార్తాండునిచందంబున మండుచు నేరికిం జేరి చూడరాక కార్చిచ్చు కాననంబు
లంబోలె నచ్చతురంగసైన్యంబు సైన్యంబు నొందం బెట్టించి సేయుచు
న్నంతఁ గృపకృతవర్మాశ్వత్థామదుర్యోధను లెదిరి పేరుకొని చేర్చి ధారాధరం
బులు నీరధారల ధరాధరంబులను బోలె శరాసారంబుల గప్పి రంత పార్థుండు.

—అర్జునుఁడు పరసైన్యంబు చిందఱవందఱ సేయుట—

ఉ. ముప్పిరిఁ గొన్న శౌర్య మెద ముట్టఁగ ముమ్మొనవాలుదాల్పునా
నొప్పుచు నప్పరాశుగసమున్నతి యంతయు నింతలోఁ జెడం
గుప్పుచు దివ్యబాణములు గోఁకము సూపుచు నక్కు లుబ్బిపో
గొప్పుల మూఁడు మూఁడ పయిన క్రూరశరంబులు నేసె వారలన్. 95

వ. అప్పు డశ్వత్థామ. 96

సీ. పది నాఁడితూపులు పార్థునిపై మూఁడు, నారికోలలు వృష్ణినందనుమీఁద
నాల్గునారసములు నాల్గుగుఱ్ఱములపై, బెక్కమ్ము లక్కపిధ్వజముమీఁద
నడరించి వడి సూతునొడలిపై నగ్గి నా, గ్గురుఁడు మూఁడమ్ములు నాటి నొంచి
సారథితల నొక్కశాతాస్త్రమున,నం ద్రుంచి నాల్గింట నఱికి హయముల

తే. ధ్వజము మూఁడింట ముక్కలై పడఁగఁ జేసె, విల్లు విఱుగంగ వేయుచు విభుఁడు నగుచు
భూసురుఁడు భూగతుం డయి భోగిభోగ, సదృశ మగుదోర్దండముల గొనిసలిపెఁ గలను.

వ. అంతఁ గృపుండును గృతవర్మయు సుయోధనుండు నశ్వత్థామం దలకడచి
రణముఖం బలంకరించి వారిదమ్ములు దివాకరుం బోలె శరజాలంబుఁ గప్పించి నరుం
గప్పుటయు నప్పాకశాసనిసింహుండు సింహపరాక్రమస్ఫురణంబున బలిమిమీఁదం గవియు
పాకశాసనునివీఁక వారిమీఁదం గవిసి. 98

చ. కృపునిశరాసనంబు దునిఁగించి హయంబుల నొంచి కేతువున్
విపులఁ బడంగఁ ద్రుంచి రథనేతృజవం బుడిగించి వానిపై
నపరిమితాశుగంబులు రయంబున నేయుచు గౌతమాంగము
ల్లపుడు నదీసుతాంగ మగునట్లు ఘోనర్చెఁ బృషత్కపంక్తులన్. 99

—కురుకుమారులు పదుండ్రు నరుం దాఁకి మృతులగుట—

క. కరములఁ బైపై నేసిన, సరకుగొనక వారిఁ గృష్ణసారథ్యమునన్
సరయముగ దాఁపలించుచు, నరిగెన్ గాండీవి కర్ణు నతిమెదుబుద్ధిన్. 104

క. తమకుఁ బరాఙ్ముఖుఁ డయ్యెన్, సమరభయంబునను సవ్యసాచి యటంచున్
గ్రమమఱి వారలు వారిన్, దమకించుచు వెన్నుఁదన్ని తఱిమి రఱుముచున్. 105

ఉ. వారలఁ జూచి నవ్వుచును వాసవనందనుఁ డేచి చిత్తమం
దీరస మెత్త నెత్తి శిర మేడ్తెఱఁ జూపుచు వారిటెక్కెముల్
వారితురంగమంబులను వారిశరాసనముల్ శరంబులన్
ధారుణిఁ ద్రెళ్ళ నేసె భుజదర్పమున న్నలువంకతూపులన్. 106

ఆ. కన్నుఁగొనల కెంపు గదుర వెండియు నొడ్డు, గఱచి పదిశిలీముఖములు లోకంట
విడిచి వారితలలు పుడమిపైఁ బడ నేసె, నాటకాఁడువోలె నర్జునుండు. 107

క. కర్ణాలంకారములన్, వర్ణింపంబడిన వారివక్త్రములు రథా
భ్యర్ణావనిమీఁదంబడి, స్వర్ణాబ్జములనఁగ నొప్పె సదమలకాంతిన్. 108

వ. అట్లు కుమారదశకంబు గూలిన పిమ్మటం గదలి శ్వేతాశ్వుం డశ్వవేగం బభివర్ణించుచుఁ గర్ణరథంబుఁ దరియ నరుగుచుండ గండుకొని ఘోరం బగుపారలౌకికంబు సేయుచుం బాయక తొంబండ్రు సంశప్తకవీరు లద్దారి నెదిరించి క్రూరనారాచవర్షంబు నిగిడించుటయు నవ్విలుమగండు గాండీవవిముక్తకాండప్రకాండతండంబున ఖండించుటయు వారును గతాసులై పుణ్యావసానం బయినంతఁ ద్రిదివంబునుండి విమానంబులతోఁ గ్రిందం బడు సిద్ధపురుషులచాడ్పున రథంబులఁ జాఱి పడి రంత నింతలో నెంతయు బలంబున నింతలింతలు గానిదంతావళాశ్వరథసంతతులతోఁ గురుసైన్యంబు పైన్యంబు దక్కి యొక్కలంబుగా నక్కురువీరుం దాఁకి వీఁకమెయి శక్తితోమరప్రాసగదాసిసాయకంబుల నొప్పించుచు నంతరిక్షం బెల్ల శరమయంబు గావించి రప్పు డప్పురుషవరేణ్యుం డగణ్యపరాక్రమక్రమంబున నాశరవర్షంబంతయు నంశుమంతుండు నిజాంశుసంతతుల సంతమసంబునుం బోలె విఱియించినంతం దోడన పదమూఁడునూర్ల మదమాతంగంబులతోఁ గఱకుతురక లఱిముఱి నఱిమి పరిపరివిధంబులం గర్ణనాళీకనారాచతోమరప్రాసాసిశక్తిముసలముద్గరాదిసాధనంబులం బరఁగించి నొంచినం గాంచి కాంచనాంబరసఖుం డాశస్త్రవృష్టి నడఁగించుచు భల్లార్ధచంద్ర శిలీముఖంబుల ఘాటి వారివారణంబులను వారి సపతాకధ్వజాదిసాధనం

బలను గనుపుగొట్టె నట్టియెడ గాండీవమ్ము బిట్టు మ్రోయుచుండ హేమపుంఖశ
రార్దితంబు లగు నేనుంగులు పీనుంగులై వజ్రాభిహతంబు లైనసాగ్నిజ్వాలాద్రులం
బోలె నేలపయిం గూలెఁ గూలినం జూచి రావుతులం ద్రోచి పాఱువారువంబు
లును సారథులకుం జిక్కఁబడక దిక్కుదిక్కునకు రథంబు లీడ్చుకొని పఱచుర
థ్యంబులును రథులు సారథులుం దెగి మ్రోఁకువడిన తేరులును నానావిధాయుధం
బులును గుప్పలును దిప్పలైనం బోరుఘోరం బయ్యె నయ్యెడ నయ్యర్జు
నుండు కోలుమసంగి తనకు మాఱుమలయువారు లేక పేఁకం జూపుచున్నతఱి
నరసి మరున్నందనుం డానందంబునం దనమును మెల్ల నొల్లఁబోఁ జేసి తమ్మునిం
డాసి ప్రాకారాట్టపురద్వారదారణంబును దారుణంబు నై నరనాగాశ్వభోజనంబునం
జేసి కాళరాత్రిం బోని నిజగదాదండంబు బాహుదండమండితంబు గావించి
హతావశిష్టం బగుచతురంగబలంబును నుఱుమాడుచుండె నట్టియెడ దిట్టపడి భూరి
పరివారంబు తన్నుఁ బరివేష్టించుటయు నమ్మహాబలాత్మజుండు. 109

—భీమసేనుండు విజృంభించి కురుసేనం దోలించుట—

సీ. కాలకాలుం డనఁ గ్రాలి గదాదండ, మండితహస్తుఁడై గండుమిగిలి
సాగరోపమ మైనచతురంగబలమునఁ, జొచ్చి విచ్చలవిడి నిచ్చఁ దిరిగి
మకరాలయము మహామకర మట్లు కలంచి, కొండలం బోని వేదండములను
బిండిపిండిగఁ జేసి దండి కెక్కిన మేటి, గుఱ్ఱపుదడములఁ గుప్పగూల్చి
తే. స్యందనంబుల ప్రోవు లందందు నిలిపి, రావుతులతోడఁ గాలిబా ల్లొవలకునఁ
గానరాన ట్లొనర్చి సంగ్రామకేళిఁ, దేలె భయదారవం బెల్లదెసల నిండ. 110
తే. భగ్నమూర్ధాస్థి హస్తాంఘ్రిశకుదంత, సంతతులు గల్గి తనువెల్ల క్షతజమయము
గాఁగ నరగజాశ్వంబులు గానఁ బడియె, నవనిఁ గ్రవ్యాదభుక్తిపదార్థము లయి. 111
క. అత్తఱి మాంసాస్థులు దిని, నెత్తురు వసతోడఁ ద్రావి నెఱి గొని తృప్తిం
హత్తుకొన మిత్తి యోయన, గత్తరిలుచు భీమునిగద గట్టునఁ బ్రేచెన్. 112
వ. ఇట్లు పదివేలగజాశ్వపత్తులం నత్తఱి మిత్తికిం బెట్టి గాడ్పుపట్టి మఱియుం గ్రుద్ధుండై గదా
దండంబు నిజ భుజాదండంబునం గీలింపఁ గాలదండమండితుం డగు నంతకుండో యన
సాధ్వసంబు పుట్టఁ జేయుచు వేదండశుండంబులపయిం బడి తుండంబులు గండ్రించియు
గండంబులు పిండివెట్టియుఁ గుంభంబులు గూలనేసియుఁ డొక్కలు ముక్కలు సేసియుఁ
గాళ్లు వ్రెళ్లు నేసియు నారోహకులతోడ నడగొండలో యనం దగు వానిఁ బెక్కువేల
నుక్కడంచి రథం బధిష్ఠించి వెండియు నాఖండలనందను ననుసరించె నాతండును వాఁడి

వత్తులై యోటమి వాటించి లేట మొగంబు వెట్టి పరాఙ్ముఖులై పోవువారిం బోనీక
పొదివి ప్రదరపరంపరలం గుప్పి నొప్పించె నప్పుడు బలారాతిసూతి బాణపాతంబు
నకు గుఱి గాని ప్రాణియు రక్తసిక్తంబు గాని సత్త్వంబును దైన్యంబు నొందనిభూతం
బును లెక్క కొక్కటి యైన లే దయ్యె నయ్యెడ నీబలంగంబు వా రారఁ జూచిన
ప్రమోదగుప్రమాఁకుంజోక నార్తరవం బెసంగ నలాతచక్రంబు త్రిప్పిన చొప్పునఁ
బరిభ్రమించుచు మించినపార్థపరాక్రమంబునకు వెఱచఱచి సూతసూతిజీవితంబుపై
నాశ విడిచి విఱిగి పఱచుటయుఁ బార్థుండు గర్ధుండై భీమప్రముఖులకుఁ బ్రహర్షం
బాపాదించుచు వెన్నంటి తఱిమెఁ దఱిమినం జెదరి నిర్విషపన్నగంబులుఁబోలె
నూర్చుచు నీకొమారులు కుఱువీరులం గూడి కార్ముకులు మృత్యుభయంబున ధర్మంబు
నాశ్రయించినచందంబున సూతనందనుమఱుఁగు సొచ్చి కావు కావు మని మొఱ
వెట్టుటయు నమ్మహాభుజుండు విజయశరసాగరంబున మునింగినవారికి ద్వీపంబు
వోలె నై సముద్ధరించి నేను గల వెఱకుం డని యూఱడించుచు బరవసం బాపా
దించి ధనుష్టంకారంబు గావించుచు విఱిగినమూఁకం గూర్చుకొని పాంచాలసేనపైఁ
గవియుదెంచి. 113

—కర్ణుండు పాంచాలసేనపైఁ గవిసి పరాక్రమించుట—

తరువోజ. సరభసంబున సూతసంభవుఁ డుగ్ర శరపరంపరలఁ బాంచాలసైన్యముల
నరిమి మహావాత మంబుదపంక్తి నట్లు తూలించెను నవసరమందు
నరమర లేక తదాత్మసంజాతుఁ డగుజనమేజయుఁ డనువాఁడు వానిఁ
బరిహరివిశిఖముల భర్జించి నొంపఁ బ్రకుపితాత్ముం డయి ప్రబలి కర్ణుండు. 114

సీ. జనమేజయునిసారథినిఁ గూలఁగా నేసి, తురగంబులం గూల్చి తోడుపడఁగఁ
జొచ్చుశతానీకసుతసోములశరాసనమ్ములు దునుమాడి నాగసముల
పట్టంబు పఱపి ధృష్టద్యుమ్నుమెయి నొంచి, ఘోటకంబుల లీల గీటడంచి
సాత్యకిరథ్యముల్ సాల్వడ నొనరించి, కైకయసుతుని విశోకు నడఁచి

తే. యుద్ధతుఁ జూపుటయుఁ గైకయేశ్వరుండు, కొడుకుఁ జంపుట కెంతయుఁ గోపఘూర్ణి
తారుణేక్షణుఁ డై కర్ణు నాత్మజునిఁ బ్రసేనునిన్ నొవ్వనేసె నిశితశరముల. 115

చ. సుతు నటు నొవ్వనేయఁ గని సూతసుతుండు కరంబు నవ్వుచున్
మతి నొకయింతకోప మలమన్ నిశితార్ధశశాంకసాయక
త్రితయమునన్ గరద్వయము త్రెంచి శిరంబు బిఱానఁ ద్రుంచినన్
గుతలమునం దతండు వడె గొడ్డలి వెట్టునఁ జెట్టుకైవడిన్. 116

శా. పాంచాలాత్మజపంచకం బటులు సంప్రాప్తార్తి వర్తించుచుం
జంచత్కార్ముకుఁ డైనసూతసుతునిన్ సంఖ్యంబునం దాఁగియుం
బంచశ్రోత్రముఖేంద్రియార్థములు సంప్రాప్తాత్ము యోగిం బలెన్
గించిన్మాత్రమునేఁ గలంచుటకు శక్తిం గల్గ దై రత్తఱిన్. 127

ఉ. ఈగతి నోడి కర్ణునకు నెంతయు వంతకునై రణాబ్ధిలో
బాగతి మున్గుమాతులులఁ బాటఁ గనుంగొని ద్రౌపదీసుతు
ల్వేఁగి సముద్ధరించిరి కలం బవియన్ జలరాశిమగ్నులై
యేగెడుబేరులం గదసి యేలెడునావలవారలో యనన్. 128

సీ. అంతట సన్నద్ధుఁ డయి వచ్చి శినివరుఁ, డంగనాథునిమేను వాడ నేసి
సీతనూజునిమేన నిగిడించి యొన్మిద,తూపులఁ జేవాడిఁ జూపుటయును
గృపకృతవర్మలు నృపతియుఁ గర్ణుడు, నలువు రాతనిఁ దాయి నలుకఁ జేసి
శితసాయకంబులు చిలికి రత్తేఁడు దగ్గిశులఁ దాఁకున్నైత్యేశుకరణి
తే. నరయు నొప్పుచు మధ్యాహ్నార్కునివలె, దేజమున మించి బహుశరాధితులను
నొంచె నెల్లర నంతలోఁ బొంచి నల్గు, వచ్చి కవిసిరి పాంచాలవరులు వాని. 129

ఉ. ఆలము దేవదానవుల కప్పటిచొప్పున నొప్పి వారి కా
భీలమ యయ్యె నయ్యెడ విభిన్నశిరోపయవంబులై గరం
గూలినమానుసుల్ గరులు గుఱ్ఱములున్ రథముల్ నిజంబులం
గోలలు నొప్పెఁ దిప్ప లయి కుప్పలునై కడువెక్కసంబులై. 130

వ. అయ్యవసరంబున. 131

—♦దుశ్శాసనుఁడు భీమసేనునితోఁ బోరి వచ్చుట♦—

తే. వెఱ పొకింతయు లేక హంవీరుఁ డైన,దుస్ససేనుఁడు విల్లు వికచ్చుకొనుచు
ననిలజునిఁ దాఁకె నతఁడు సింహమ్ము రురువు,నట్టు లాతని నెదిరించె నాగ్రహమున.

మత్త. వారిపోరు భయంకరం బయి వర్తిలె న్నిమిషాంతర
స్ఫారమై యితరేతరాయుధభర్త్సనాదుల నెంతయే
దారుణం బయి మేను లొడ్డినదాన జూదము వోలె నై
వారణంబులకుం గరేణువువంకఁ బుట్టినయట్టి నై. 133

తే. శక్రశంబరు లట్టు లాశౌర్యనిధు, ల్వాకల్గ్రికల్లును విజయంబు గాంక్ష నేసి
సకలశస్త్రాస్త్రసముదాయసారమునను, బాహుబలమునను బోనర్చి రాహవంబు. 134

వ. అట్లు పోరాడుచున్నసమయంబున భీమసేనుండు దుశ్శాసనుం బిలిచి యిట్లనియె 135

ఉ. మాకుమహోపకారములు మాటికిమాటికినిం బొనర్చి లో
కైకయశంబు గాంచినమహాత్ముఁడ వీ విటఁ దారసించి తో
శ్రీకరమూర్తి! నీ కిపుడు చేయఁ గలంతటిపూజ సేయఁ గా
నాకు లభించె ధన్యుఁడను నాకొల మంతయు సంతసించెడున్. 136

వ. అనిన నతం డతని కి ట్లనియె. 137

క. ఏటి కిటురిత్త మాటలు, పోటరి వగు దీవు నిన్ను మున్న యెఱుఁగుదున్
నాఁటివలలుండ వీ వగు, దేటులఁ జూపెదవు గాక హిహిహీ! వెడఁగా. 138

తరువోజ. అనినఁ గందోవలందు నగ్నికణంబు, లంతట నురలంగ నరసి భీముండు
సునిశితంబు లయిన క్షురములఁ దంట, చుఱుకున నీనరసుతునిధ్వజంబు
ధనువును దునుమాడి తత్కాలమందుఁ, దగ నొక్కవాలమ్ము దాఁకంగ నాఁటి
కనుద్రిప్పనంతలోఁ గఱకుట మ్మొకఁడు గైకొని సూతునికంఠమ్ము దునిమె. 139

క. చులుక న్నీసుతుఁ డొంపక, విలు గొని రథ్యములఁ దాన వెలయించుచుఁ జే
రలుకం బ్రచండమ్ములఁ, నలయించె న్భీమసేను నచ్చెరు వొదవన్. 140

తే. మఱియుఁ బయిపయి శరములు పఱపుచు వడి, సూర్యసంకాశమగునొకసునిశితాశు
గమ్ము పవమాననందనుకాయ మ్మెల్ల, గాఁడిపోవంగఁ బరఁగించె వాఁడి మెఱసి.

ఉ. భీముఁడు గాఢవిద్ధుఁ డయి బిట్టు చలించుచు దానఁ జచ్చెనో
నామెయి సొమ్మ గ్రమ్ముకొన నాఁటినవేదన కోర్వ లేక తా
నామెయిఁ దేరిపైఁ బడియె నట్టిటు చేతులు బాఱసాఁచియున్
వేమఱు వెచ్చ నూర్చియును విహ్వలభావము నొంది డిందియున్. 142

క. కౌరవులు నచ్చె ననుచుం, గోరిక నార్వంగ నంతఁ గొంతటిలోనం
దేరుకొని లేచి యార్చె సమీరకుమారుండు మీఁదుమిక్కిలి గాఁగన్. 143

ఉత్సాహము. కురుకుమారుఁ డంతఁ బోక ఘోరతరము గా ననిన్
జరపుచున్ మరుత్కుమారుచాప మొంటఁ ద్రుంచి చె
చ్చెర నియంతమేన నాఁటుశితశరంబు లుచ్చి పోఁ
బరపి మఱియు భీము నొంచెఁ బమ్మి తొమ్మిదమ్ములన్. 144

చ. అలిగి మహాబలాత్మజుఁ డహంకృతి మీఱఁగ శక్తిఁ బూని పెం
జలమున నీతనూభవుసచాపు దలంచుచు నేసె నేసినం
బెలుచన మండుచుం దనదుమీఁదఁ బడం జనుదెంచుదానినిం
బలు కఱ దుస్ససేనుఁడును పట్టడచెం బదిమార్గణంబులన్. 145

క. ఆపనికి మేలు మే లని, చూపఱు మెచ్చంగ నీసుసుతుఁ డొకబాణం
బేపునఁ గైకొని మారుతి, కోపంబుడిగోవ నేసెఁ గోల్తెలెసంగన్. 146

ఉ. చిచ్చఱమాట లుప్పతిలఁ జిత్తమునం గను నర్ని భీముఁ డే
నొచ్చితి నంచు నుబ్బకుము నూర్పుల నాగరతాఁకు సైఁపు మే
వెచ్చనినీదునె త్రిప్పుము రేమకరుం బలెఁ దాఁపి త్రేఁచెదన్
జచ్చితి వీవు చూడు మని నవ్వుచుఁ బై గద నెత్తి వైచినన్. 147

క. నీకొమకు శక్తిఁ గైకొని, పోకార్చి విసరె వాయుపుత్త్రంమును బ
ల్యాకమెయి గదన్ విసరెన్, లోకులు కచ్చెగవుపాటు లో నుదయింపన్. 148

మ. గద వజ్రప్రతిమానమై చని మహోగ్రప్రక్రియన్ శక్తి పెం
పొడుగం బాఱఁగఁ జేసి నీతనయుపై నువ్వెత్తుగా వ్రాలినన్
మదసిక్తాంగమతంగజంబువలె సమ్యక్ప్రధానుం డటం
బడివిం ష్లంతటిదవ్వ నొంగి పోఁగిపోవం బొందియుం జేవమై. 149

క. తా నొక్కగదను గైకొని, పూని మహత్త్వమునమీఁదఁ బో నేయుటయున్
దానికి నింతయుఁ దునకక, మానసమునఁ గినుక వొడము మారుతి యుంతన్. 150

మ. గద వేఁడొక్కఁడు పూని ప్రాస్కమెయి నుగ్రంబుస్ఫురత్పై ప్రయు న
య్యది యుర్వీధముమీఁద వ్రాలుటయు నీయ వ్యగ్రపై వ్రాలి తే
ర్చియున్ సూతుఁ డడంగ గుఱ్ఱములు సంభిన్నంబు లై పోవఁ జ
ల్పెఁ దదాఘాతమున్ భవత్సుతుఁడు నూలె చ్చెంటకుం బేల్పయి. 151

తే. తనతనుత్రాణమును శిరస్త్రాణ మంబరములు నాభరణములు మాల్యములు చిందు
వంకలుగ నేలపైఁ బడి వడిగఁ దన్ను, గొనుచు వేదనఁ బడియె నీతనయుఁ డధిప. 152

క. ఆలలిఁ గని పాండవపాంచాలురు హర్షించి సింహనద్భృశారవముల్
పోలఁగఁ జేసిరి మనవా, రాలాపము లుంచరించి రాస్త్రిరవములన్. 153

వ. అంత. 154

ఉ. భీముఁడు భీమవిక్రముఁడు పెల్చ నొనర్చుచు సింహనాదముల్
భూమికి డిగ్గి నీసుతునిముందటికిం జని చూచి తొల్లి వాఁ
డామెయి ద్రోవదిం దిగిచి నట్టియు వల్వలనొల్చినట్టియున్
బూమెలు లోఁ దలంచుకొని పొంపిరివోయెడుకిన్క పెంపునన్. 155

ఆ. నేయి వేల్వ మండునిప్పు నా నొప్పుచుఁ, గృపునిఁ గర్ణు భోజు నృపుని ద్రౌణి
నరసి యోధులార! దురితాత్ము విూయువ, రాజుఁ జంపుచుంటి రండు కావ. 156

వ. అని పలికి యంత నిలువక. 157

మ. కరవాలంబు కరంబునం గొని కడుం గ్రౌర్యం బవార్యంబుగా
ధరణి న్మొట్టుచు బెట్టు ద్రిప్పుచు వెసల్ దర్పించుచుం గన్నులం
గురియ నిప్పులు గ్రొప్పుచుం గరివయిం గుప్పించి లంఘించు కే
సరి పోలెం జని కూలి తన్నుకొనుచుం జానున్నరా మొట్టుచున్. 158

—భీమసేనుఁడు దుస్ససేనునియురంబు వ్రచ్చి రక్తపానంబు సేయుట—

ఉ. ప్రక్కన యుండి కర్ణుఁడు నృపాలుఁడు సూచుచునుండఁ గ్రోధముం
గ్రక్కుచు గాలిపట్టి కడకాలునఁ గంఠముఁ దన్ని పట్టి నే
నెక్కడి వాఁడనో తెలియుచే యువరాజ! యటంచు వానిపే
రక్కును జీటి వెచ్చ నగుచుం బెటిల్చి నెత్తురు గ్రోవ దొడంగుటన్. 159

ఆ. త్రావి త్రావి వానితలఁ గోసియును ద్రావి, తనివి నొంద పొంది తని యటు నిటు
నెల్లవారు వినఁగ నిట్లని వాక్రుచ్చెఁ, గోపఘూర్ణితాక్షిగోణుఁ డగుచు. 160

చ. తలిచనుఁబాలు పాలు దధి ద్రాక్షరసంబులు పంచదారలున్
పలుచనిపానకంబులును బాయసముల్ విరితేనె లందిగాఁ
గలిగినరుచ్యపానములకంటె వరంబు సుధోపమంబు నై
యెలమి ఘుటిల్లఁ జేసె మది కీరుధిరామృత మింత యొప్పనే. 161

తరువోజ. అని పల్కుచు గతాసు వైనరాజానుజు గేజర మారసి కోప
మున నవ్వుచును మృత్యుముఖమున నిష్ఠ మొనరి రక్షకుఁడ వై మురియుచునుంటె
యనుచు మాటికి నెత్తు రానుచు మేన నలఁదుకొనుచు నుండు నతని నీక్షించి
కనులు మూసికొని రాక్షసుఁ డని యెంచి కదలి పాఱిరి ప్రజల్ కడు బీతుగుడిచి. 162

వ. అప్పుడు. 163

తే. వారితోఁ బాఱుకర్ణసహరజుఁ జిత్ర,సేనునిన్ యుధామన్యుఁడు సేనతోడఁ
దఱిమి యేడమ్ము లుపరింప మఱలి యాతఁ,డంటి మూఁడింట నతనినాటింటసూతు.

క. నొంచె న్నొంచిన మదిఁ గోపించుచుఁ బాంచాల్యుఁ డొక్కవిశిఖమ్మున న
ప్పంచజను శిరముఁ ద్రుంచెం, గాంచినకర్ణునకు వగపు గదిరె దురీతిన్. 165

వ. అట్లు తమ్ముఁడు సచ్చుటకుం గినిసి కర్ణుండు పాండవవాహినిపయిం బడి బడలుపడం జేయుచుండ నకులుండు వానిం బ్రతిఘటించి పోరుచుండె నిది యిట్లుండ వృకోదరుం డట్లు దుస్ససేనుం దునిమి తనివి వోఁ దదీయరక్తంబు సువ్యక్తంబుగఁ దోయిలించుకొని యెల్లవారు విన నిట్లనియె. 166

**తే.** ఓరి దుశ్శాసనా! యిదే పేరె నీదు, నెత్తు ద్రావెద మఱియును నీవు నమ్ము
పసు లనుచు నాడ నుందువే పసు లని మను, నాడునందఱుపశువులే యగుదుమేము.

**వ.** అని మఱియును. 168

**సీ.** విషము పెట్టుటయును విషసర్పములఁ బుచ్చి, కఱపించుటయుఁ బ్రాళ్లఁ గట్టుటయును
విషధిఁ ద్రోయుటయును మిష వన్ని జతులేశ్మ, మునఁ బెట్టి కాలిచి పుచ్చుటయును
నికృతిమై జూదంబు నెఱపిరాజ్యముఁ గొంటఁ, యునునరణ్యములపాల్పొనరుచుటయుఁ
దిగిచి ద్రోవది సభఁ బెగనాడుటయు విరాటునివీట శ్రమముఁ బెట్టుటయు మఱియు

**తే.** నెన్న మా కైనకీడులు కెల్ల శకుని, కర్ణదుర్యోధనులు నీవు కారణంబు
ఖలులు దుష్టాత్ము లైనమీనలనమాకు, నెన్నఁడునుసౌఖ్యమనుమాటసున్నయయ్యె.

**వ.** అని గర్జించి పలికి పరమానందకందళితాంతరంగుండై కన్నుఁదోయి జేవురింప దు
స్ససేనునెత్తుటం జొత్తిల్లినమేనితో వాసుదేవార్జునులపాలికిం జని కౌరవు లెల్లరు
నాకర్ణించుచుండఁ గంఠం బెత్తి యి ట్లనియె. 170

**శా.** ఏదుశ్శాసను ఱొమ్ము వ్రచ్చి రుధిరం బెల్లరుం జూడ నా
స్వాదింతున్ రణరంగమం దను ప్రతిజ్ఞం గీర్తితోఁ జేఁ జేకొ
మాదుర్యోధనుపెందొడల్ విఱిచి తన్మస్తంబుఁ దన్నంగఁ గృ
త్యాదిం జేసినబాసయు న్నెఱపి సత్యానందముం బొందెదన్. 171

**క.** అని పలికి వృత్రు నాఁడు, దునిమినసుత్రాము నట్లు దోర్బలి మెసఁగన్
వినుమూలిచూలు సంతస, మునఁ గైవడి సింహనాదమును బొనరించెన్. 172

**వ.** అట్లు దుశ్శాసనుం ద్రుంగ నేయుట కత్యంతరోషకషాయితాంతరంగులై ప్రతిఘ
టించి నీపుత్త్రులు నిషంగియుఁ గవచియుఁ బాశియు దండధారుండును ధనుర్గ్రాహుండు
నలోలుపుండును సహుండును షండుండును వాతవేగుండును సువర్చసుండును నను
పదుం డ్రొక్కపెట్ట గాడ్పువట్టిం జుట్టుముట్టి నానాయుధాయుధంబులం బ్రహారించు
టయు నతండు కాలుకాలుం దన మునుపటి వారిని మనవారల్లఁ జూచు
చుండ మార్గణదశకంబున సంయమనీమార్గంబు వట్టి పోవం జేసినంత మనబలంగంబు
భయార్దితంబై కాందిశీకం బయ్యెఁ గర్ణుండు నంతకాకారుం డగుసమీరాత్మజు
మాఱుకొనం జాల కూర కారయుచుండ నింగితజ్ఞుండు శల్యుండు సోల్లుంఠనం
బుగా వాని కి ట్లనియె. 173

**చ.** వెగడుపడంగ నేటికిఁక వీరవరేణ్యుఁడ విల్లు పోలునే
తెగువమెయిన్ వృకోదరుఁడు త్రెళ్ళఁగ వేసినదుస్ససేనునిం

దగఁ గని రాజులెల్లఁ బెడదారులు వట్టిరిఁ కెట్టుసేయనున్
మగఁటిమి చాల కార్తుఁ డయి మానవనాథుఁడు నాథిఁ గుందెడిన్. 174

క. హతశేషులుతమ్ములు కృప,కృతవర్మాదులును నృపతికిం బరిచరులై
మతిలేక మూఁగియుండిరి, కుతుకంబునఁ బార్థు లయిరి కోల్తలెసంగన్. 175

చ. నరునిఁ బురస్కరించుకొని నాల్గుకెలంకులఁ దామ నైమ మహో
ద్ధురగతిఁ బాండవేయు లతిదోర్బల మేర్పడ నిన్నె తాఁకఁ గాఁ
ద్వరపడుచున్నవారు భుజదర్ప మెలర్పఁగఁ బౌరుషంబునం
బరఁగుమ క్షత్రధర్మమును బాటిగఁ గైకొని తాఁకు మన్నరున్. 176

ఉ. పేరినబర్వ నీదుతలఁ బెట్టి సుయోధనుఁ డున్నవాఁ డెదం
గోరికి చేసి నీ కతనికోరిక దీర్చుట పాడి గావునన్
దేరి ధనంజయుం దఱిమి తెంపుఱిపై ఘోనరింపు మాఱు మొ
ప్పారెడునీకు నిందు విజయంబునఁ గీర్తియు లేక నాకమో. 177

తే. మోహవశమునఁ జెయ్వెద నాహసింప, కీవు సల్లింట తలపోసినీవరాత్మ
భవుఁడు వృషసేనుఁ డల్లదె పగఱ నొడుచు, చున్నవాఁ డటుచూడుముకన్నుదెఱచి.

వ. అని ప్రబోధించిన రాధేయుండు క్రోధవిధేయుండై యుద్ధసన్నద్ధుం డయ్యె నయ్యెడఁ గ్రుద్ధుం డగువృషసేనుండును గదాదండమునం జెకుండై భీమునిపై నురవడించుంటయు నకులుండు వాని నడ్డగించి దోడ్డనారసంబులు సిడంబు వడనేసి విల్లు విఱిచి కత్తళం బుత్తఱించి మించుటయును. 179

—♦అర్జునుండు వృషసేనుని వధించుట♦—

సీ. వృషసేనుఁ డొండొక్కవి ల్లెత్తి దుశ్శాస,నాత్మకు సంప్రీతి యగుదెఱఁగున
దివ్యాస్త్రతతుల మాద్రీనందను నొంచె, నొంచిన నాతఁ డోర్కించు కలిగి
ప్రత్యస్త్రముల వానిప్రతిభ యంతయు నడఁగారఁ జేయుటయు నక్కర్ణపుత్రుఁ
డాజ్యాహుతుల నొప్పునలనల మట్లయి వెల్గి,వానివనాయుజాశ్వములఁ దునిమె

తే. విరథుఁడై పాండుతనయుండు ధరకు డిగ్గి, వాలునుం బల్కయుం గొని వానియస్త్ర
శస్త్రముల రూపుమాపుచు సకలసైన్య,సమితిఁ జక్కాడెఁ జిత్రప్రచార మెసఁగ 180

తే. అశ్వమేధీయశామిత్రమందు శమిత,పశుగణంబుల నెట్టులు పట్టి చంపు
నట్టు లెగిచి యోధద్విపాహస్రములను, బట్టి చంపెను మాద్రేయుఁ డట్టియెడల. 181

మత్త. వానికోల్తల కోర్వఁ జాలనివాఁడయై వృషసేనుఁ డెం
తే నెఱిం గలవాలుఁ గోల లవెన్నియే నిగిడించుచుం

బూని పోరుచునుండఁ బాండునిపుత్త్రకుం డట భీముఁడో
డానికం గొని కత్తిమిత్తికి నప్పగించె బలావళిన్. 182

సీ. అట్లు విజృంభించి యర్జునానుజుఁ డామి, పార్థుఁడు గుంపుదోయి నట్టె సాఁచి
వ్రాలుశశాదంబు వలె సేనపై వ్రాలి, చతురంగబలములఁ జదుపుచుండ
నతనిపై వృషసేనుఁ డడరించి పదియు నేన్మిది ప్రదరంబులు మిసిమి మెఱసి
కురిసి తూపులజడి కొఱవివలెం దోచి, చిత్రప్రహారంబు సేయునతని

తే. వేయుధారల కేడెము వెస నడంచి, ఖడ్గ మాతఁ డొంట ఖండించి కనలుగుడిచి
మఱి క్షణాంతరమున నొక్క మార్గణమ్మున, త్రెచ్చ నచ్చెరువడి ప్రజల్ పిచ్చలింప 183

వ. నకులుండును గార్ష్ణికర్ణనారాచాభిభూతుండై సత్వరంబ సవ్యసాచి చూచుచుండ గిరిశృంగంబునకు లంఘించు సింగంబుచందంబున భీమసేనునిరథంబు మీఁదికి లంఘించి శరాసనంబు గ్రహించి శరప్రయోగంబు గావించుచుండె నంత సూతపౌత్త్రుం డేకరథస్థులైనయన్నదమ్ములపై బాణవర్షంబు గురిపించుచుండె వృకోదరుండును దమ్మునికి బాసటయై బాణాసారంబు పఱపుచు నరుం జేరి యి ట్లనియె. 184

ఉ. చూడుము నీదుతమ్ముఁ డని సూతకులాంతకుఁ డుండు వీఁ డనిన్
వీడక నొంచుచుండెడిని వీనిని నీ వెదిరింపకుండుటల్
కూడునె నా నతం డెదుటకుం జనుదెంచిన మాద్రిబిడ్డఁడున్
వేడుకఁ గాంచి నీ విపుడు వీనిని ద్రుంచుము వేగిరించుచున్. 185

వ. అని చెప్పిన నప్పార్థుండు తన రథంబు వృషసేనురథంబు డాయం దోలించుటయు నాలో ద్రుపదసుతపంచకంబును శైనేయుండును గరిఘటలతోఁ బెక్కండ్రు కుళిందవీరులును దోడుపడుచుండఁ గృపకృతవర్మాశ్వత్థామసుయోధనులు శకునిపుత్త్రపౌత్త్రాదులును వారి కడ్డపడి ఘోరయుద్ధంబు గావించి రయ్యవసరంబున. 186

పంచ. కుళిందరాజపుత్త్రులం దొకొండు గండుమీఱి తూ
పు లైదు రెండ్లు పూని గౌతమున్ సహాశ్వసూతునిన్
బలంబు పేర్పడంగ నేయ బాహువిక్రముం డతం
డెలర్చి కూల్చెఁ బెక్కుతూపు లేసి వాని హస్తినిన్. 187

ఉత్సాహము. వానితమ్ముఁ డధికరోషభరవశాత్ముఁడై వడిం
బూని పెక్కుతోమరముల ముట్ట నేసి యార్చినన్
దాసి కిల్గి సౌబలుండు తచ్ఛిరంబు త్రెస్సిపోఁ
గా నొనర్ప సంకు లూఁది గనిరి ముదము నీజనుల్. 188

తే. అప్పు డిరువాఁగునందు నత్యంతఘోర, మగుచుఁ జతురంగబలముల కాల మయ్యె
నట శతానీకు డట ద్రోణునాత్మభవుఁడు, కారణం బైరి బహుజనక్షయమునకును.

సీ. అంతఁ గుళిందానుజానంతరుఁడు నీకు, మారుని టెమ్మాడ మార్గణములు
నిగిడించుటయు నతం డిగి శాతశరములు, వానియేనుం గిలఁ బడఁగ నేసె
నీసున నతఁ డొండు నేనుఁగుం గొల్చిన, నది క్రాథునిరథంబు చిదియ జేసెఁ
గ్రాథుండు నల్గి తీవ్రశరంబునం దాని, వడిఁ జాపకట్టుగాఁ బడఁగ నేసెఁ

తే. బర్వతేశ్వరుఁ డా క్రాథపతినిఁ గూల్చె, నిభగతుం డగుపర్వతు వృకుఁడు దాఁకి
పదియురెండింట నొనేయఁ బర్వతుండు, నతనిఁ గరిఁ గొల్చి మట్టించి మృతునిఁ జేసె.

క. దేవావృధసూనుం డాగ్రావేశ్వరు నేర్గునొడ గండఁడగించెన్
దేవావృధసూనుని సహ, దేవునిసూనుండు చంపె దివ్యాస్త్రములన్. 191

క. మఱియొకకుళిందపుత్త్రుఁడు, నెఱి గలవాఁ డగుచు శకునినిం దాఁకుటయున్
నఱకె నతఁ డతనిశిరముం, దొఱఁగక వాఁ డెక్కుహస్తితో నిల నెఱఁగన్. 192

చ. పవిచే నింద్రుఁడు కొండలం బలె గజవ్రాతంబులం గూల్చువా
నివరామేయపరాక్రమక్రము శతానీకుం గుళిందుఁ డొకం
డు వడిం బేర్చి యెదిర్చి వాఁడిగలయొండున్ రెండు వాలమ్ములన్
నవయం జేయ నతండు వానిశిరమున్ ఖండించె గాండంబులన్. 193

సీ. అప్పుడు వృషసేనుఁ డాగ్రహంబున శతానీకుని మూఁడింటఁ దాఁక నేసి
మూఁడింట నర్జును మూఁడింట భీముని, నేడింట నకులు నొ నేసి మఱియుఁ
బదిరెండుతూపులు వసుదేవసుతునిపైఁ, బాఱించి సింగంబుపగిది నార్చె
మనవారు కొంద ఱాతని మెచ్చుకొనిరి కొంద ఱతండు నరునిచేనొఱఁగు ననిరి

తే. అట్లు పరవీరఘాతియై యడరు గాంచె, పుత్త్రుఁ డలకించి నకులుండు బడలువడుట
వృష్ణివరుఁ డతియును బాణవిద్ధుఁ డగుట, గలిసి వృషసేను నఱిమెన మ్ముల నరుండు.

చ. తనపయి దాఁడి వచ్చుభుజదర్పసముంచితు నేర్పుఱించిచిమిం
చినగరువంబునం గదిసి చేతులలావు జగం బెఱుంగనా
తని శరసంతతిం బొదిగి తద్భుజమూలము నొవ్వ నేసియున్
దనివి సనంగ నార్చుచును నవ్వుచు నెవ్వగ దోఁప వెండియున్. 195

చ. నవనవశాతభల్లముల నందననందనుఁ డొల్లఁ బోవున
ట్లవిరళరీతి నేసి నిశితాశుకపంచకయుగ్మ మమ్మరు
త్ప్రవరవరాత్మసంభవునిపై నిగిడించి కరంబు నొంచినన్
నవుమొగ మేర్పడ న్నరుఁడు నారసముల్ బను లేయుచు న్వెసన్. 196

వ. కుటిలభ్రూకుటియై కటంబు లదరఁ గన్నుఁగవఁ గెంపుసొంపార నలుగడం బాఱఁ జూచి వృషసేనుం జంప నెంచి దుర్యోధనాశ్వత్థామప్రభృతులు వినుచుండఁ గర్ణుం బిలిచి స్మితపూర్వంబుగా ని ట్లనియె. 197

శా. ఓరీ! సూతకులాధమా! వినుము నే నొండొక్కచో నుండ నీ
వారు న్నీవును గూడి నాసుతునిఁ జావం జేసి దుష్కీర్తికిన్
వారు న్వీరును దూఱఁ దా వయితి కీనాఁటన్ భవత్పూను నీ
వారు న్నీవును జూచుచుండ జగము ల్వర్ణింప నేఁ జంపెదన్. 198

ఉ. ఓపితివేని కాచికొను ముగ్రశరాహతి వీనిఁ గూల్చి నే
నాపయి నిన్నుఁ గూల్చెద మహారథు లిందఱు నాలకింపఁ గా
సీఁపలు కొప్ప సప్ప డగుసీకలహంబున కీవ కారణం
బై పొలుపొందుచుంటివి నృపాశ్రయజాతమహాభిమానివై. 199

మత్త. ఏను ని న్ననిఁ గూల నేయుట లెంచి నీవెనుఁ దన్నిపో
నేని దుర్ణయ మూఁకయంబున కెల్ల హేతువ యయ్యె నో
వాస సీన్మాని రాష్ట్రహీనునిఁ బట్టి నట్టిస మామకు
తొన్నరుఁ డీస పగించిపుచ్చెడిఁ జూచుచుండఁగ నిందఱున్. 200

వ. అని విజృంభించి. 201

స్రగ్ధర. గాండీవజ్యావిరావప్రకటము గయి వెసలం గ్రమ్ముకోఁ జేసి భాస్వ
చ్ఛండాంశు లుగ్రాంశుస్తుల్ చదలఁ బొదలఁగా జల్లుచుం గ్రొత్తకాలో
ద్దండోగ్రప్రౌఢి యనన్ సాధ్వస మొలుకుమ సూతప్రభూతప్రభూతున్
సింహారంగప్పి నిప్పుల్ నిలిచినటులు వర్ణింపఁగా వేపు చూపెన్. 202

ఉత్సాహము. తూఁపు లేసి యుక్కుమూయుఁ జూపు లైదు నైదు దో
ర్లీలఁ గ్రాలఁ జేసి వాని లేవ నీక మర్మముల్
చాల నొంచి నాల్గుక్షురములన్ శరాసనంబునున్
గేలుదుగయు శిరముఁ ద్రుంచి క్రేణి సేసె నవ్వుచున్. 203

తే. విజయబాణాభిహత మయి వృషకుమారు,శిరము కరములు లేంవిచిత్రగాత్ర
మవనిఁ బడె నప్డు మారుతాహతికి శైల,శృంగమునుండి కూలినవృక్ష మట్లు. 204

వ. ఇట్లు పాండుపుత్త్రపత్త్రాభిహతుండై ధాత్రిం బడిననిజపుత్త్రుం జూచి శోకవ్యాకులిత చిత్తుండై కన్నీ రొలుకఁ దత్తఱించుచు నత్తఱి నోర్చికొని వచ్చుకోపాటోపంబున వేలోద్వృత్తం బగుమహార్ణవంబు నాఁ బెఱ గర్జించుచుఁ గర్ణుం డుత్సాహాతిరంహంబునం

పెచ్చుపెరిగి విష్వక్సేనభ్యస్తంబునకు వచ్చుచుండం గని వాసుదేవుం డర్జునున కిట్లనియె. 205

—శ్రీకృష్ణుం డర్జునునకుఁ గర్ణుం జూపి ప్రబోధించుట—

మ. అదె రాధేయుఁడు వచ్చుచుండె నొగి మద్రాధీశ్వరుం డశ్వసం
పద సంధించుచు నుండెఁ గింకిణులశబ్దంబు బద్ధమార్గంబునం
బొదలం గేతనహస్తికక్ష్య మెఱయం బుంఖానుపుంఖంబుగాఁ
బ్రదరంబుల్ సగిడించుచు న్ముసవయుం గ్రౌర్యంబు వాటించుచున్. 206

చ. అరదము మేఘ మట్లు వివిధారవముల్ ఘనగర్జ లట్లు భా
స్వర మగు కేతనంబు మఘవద్ధను వట్లు శరాసనోత్క్షిప
చ్ఛరములు వర్ష మట్లు నిజసైన్యము చాతకబృంద మట్లు నై
పరఁగఁగ సూతసూనుఁడు సుపర్వజనేశ్వరుఁ డట్లు తోఁచెడిన్. 207

తరువోజ. వినిపించె నదె దుందుభిధ్వాన మఖిలభీషణోచ్చాపమౌర్వీనిస్వనంబు
ఘనసింహనాదంబు కంజస్వరంబు కర్ణపుటోద్భేదకం బగు దాని
విని మనసైన్యంబు వెఱగి సింహంబు విస్తృతారవమును వినినలేళ్లట్లు
కనుకని బాఱెడుఁ గనుఁగొంటె పార్థ కనియు నీ విట్లుంట కార్యంబు గాదు. 208

ఉ. కావున నీవు సుస్థిరతఁ గైకొని యిప్పుడ సర్వయత్నముం
జేవ ఘటిల్లఁ జేసికొని సింహపరాక్రముఁ డైన కర్ణునిం
జావఁగ నేసి నీదు యశశ్శౌర్యము స్థైర్యము శస్త్రవీర్యముల్
భూవలయం బెఱుంగునటు పొంపిరివోవఁగఁ జేయు మర్జునా. 209

తే. కర్ణుఁ డనఁగ సామాన్యుఁడు గాఁడు దేవ,దానవులతోడ లోకసంతతుల నెల్ల
నీఱుగాఁ జేయఁ జాలిననేర్పరి సుమి, నీవు గా కేఁ డతని చెంత నిలువఁ గలఁడు. 210

మాలిని. ఈవు సమస్థఁత వెతలు సేయఁగ నేని యెఱుంగుదు నే నదియున్
భూవలయంబున భూతమహేశ్వరుఁ బోర నదర్చినపోటరి వై
దేవత లెల్ల నుతించి యొసంగినదివ్యశరంబులు తేజరిలన్
జేవ నెసంగుదు చెప్పఁగ నేఁటికి సిద్ధియు బుద్ధియుఁ జేకుఱఁగన్. 211

ఉ. నీకు నసాధ్యము ల్గలుగ నేరవు కొండలు పిండి సేయఁగా
నీకరమంద సాధనము నిల్చెను బెల్చనఁ గర్ణు నోర్చుటల్
వాకొన నెంతవాటి యగు వాసవి! యీశవరప్రసాదముం
జేకొని పోరునన్ జయముఁ జెందుము నీ కగుఁ గాక శ్రేయముల్. 212

వ. అని గోవిందుండు మందహాససుందరవదనారవిందుండై పలికిన నర్జునుం డతని కిట్లనియె. 213

ఆ. లోకగురుఁడ వీవు వాకొనినప్పుడే, జయము నాకు ధ్రువ మసంశయమ్ము
తేరు వోవనిమ్ము దేవ! కర్ణునిఁ జంప, కినరుఁడు మరలఁ డెంత యైన. 214

ఆ. ఇపుడు నాశరాళి నీల్గినకర్ణునో, వానితూపుగములఁబడిననన్నొ
చూడఁ గలుగు దీవు మూఁడులోకములు మా, కలను బొగడ ముందఁ గలవు సరవి.

—కర్ణార్జునుల ద్వంద్వయుద్ధకాలమున దేవతలప్రశ్నోత్తరములు.—

వ. అని పలికి తత్తడులఁ దత్తరంబున నడపింపు మని ప్రేరేపించువిజయునకు విజయాశీర్వచనంబు వలికి వాసుదేవుండు నిమేషాంతరంబున శల్యాంగరాజాభిముఖంబు గావించుటయు నతండు పుత్రశోకసంజనితాస్రబిందుసందోహసంభరితంబు లైనకన్నుఁదమ్ములఁ గరాంబుజమ్ముల నొత్తుకొనుచు మెత్తనిగానిచిత్తంబున హస్తిరోషారుణితాక్షుండై సహస్రాక్షసంభవుని కెదిరి మార్కొనియె నప్పు డాదిత్యతేజు లగువారిద్దఱును నుత్తమచ్ఛత్రచామరాదిరాజచిహ్నాలంకృతులును నానావిధాయుధసంభరితులును దివ్యరథసమారూఢులును దివ్యహయాభ్యంతరధారులును దివ్యధ్వజలాంఛితులును సింహశంఖాదినాదమోదితులును నై గోవృషభంబులభంగిని మత్తమాతంగంబులతెఱంగునను నాభీలశార్దూలంబులలీలను సింహరాజంబులచందంబునను గాలసర్పంబులమాడ్కిని బరస్పరజయాకాంక్షం జేసి మిగులం దొప్పి యుగాంతచంద్రసూర్యులచాడ్పునను వృత్రవాసవులచక్కిని నెక్కొని పెనంగుచుండ నిరువాఁగుయోధులును నములోనిపోరు మాని భేర్యాదితూర్యారావంబులును సింహనాదశంఖనాదంబులును జయజయశబ్దంబులును బోరుకలుగఁ జేలాంచలవిధూననంబులు సేయుచు నమ్మేటిమగలం బూజించి హర్షించుచుండి రప్పుడు సిద్ధచారణసందోహంబు విస్మయంబు నొందుచుండె నంతరిక్షంబున నెల్లభూతంబులకు నక్కర్ణార్జునాంతరంబున మిథోభేదంబు లేర్పడి వివాదాక్షేపంబు లుప్పతిల్లె దేవదానవగంధర్వపిశాచోరగరాక్షసాదు లుభయపక్షంబు లాశ్రయించి జయాపజయంబు లుగ్గడించి రందుఁ గర్ణపక్షంబున నంతరిక్షంబును నసురులును గుహ్యకులును క్షుద్రసర్పంబులును సంకరజాతులును భూతప్రేతపిశాచాదులును బశుపక్షిమృగాదులును నర్జునపక్షంబున భూమియు మునులును సిద్ధచారణులును వైనతేయాద్యుత్తమఖగంబులును నిధులును నాఖ్యానపంచమంబు లగు వేదంబులును వేదశీర్షంబులును వాసుకిప్రముఖమహానాగంబులును వసువులు మరుత్తులుసాధ్యులు మొదలగువారును నింద్రాగ్ని

సోమప్రముఖులును దేవర్షిబ్రహ్మర్షిరాజర్షులును గంధర్వాప్సరోగణంబులును బొందియుండి యీశ్వరుండును బరమేష్ఠియు నింద్రాదిబృందారకులును విమానారూఢులై వారియుద్ధంబుఁ జూడ వచ్చి యచ్చట వియత్తలంబున విశ్రమించి రప్పు డర్జునుండు జయించు నని యింద్రుండును గర్ణుండు విజయంబు గాంచు నని సూర్యుండును బెద్దయుం బ్రొద్దు పెద్దవాదంబు పెట్టుకొనిన దాన దేవాసురులనుకు బక్షద్వయం బేర్పడియె నప్పు డెల్లవారును బరమేష్ఠిం జేర నరిగి కర్ణార్జునులలో విజయం బేరికగుం జెప్పి మాసంశయంబు దీర్పు మనుచున్నంత వాసవుండు వచ్చి విరించీ! తొల్లి నీవు కృష్ణులకు విజయంబు వివరించితి వది యట్లుగా ననుగ్రహింపుమని ప్రార్థించినం బరమేశ్వరసహితుండగుసరస్వతీశ్వరుం డింద్రుం దిలకించి దేవపక్ష మాశ్రయించిన విజయునకు విజయంబును దానవపక్ష మాశ్రయించినకర్ణునకుఁ బరాజయంబును సిద్ధంబు జగంబునఁ బరకార్యంబునకంటె నాత్మకార్యంబు విహితంబు గావున సత్యధర్మపరాయణుండై యీశ్వరానుగ్రహంబు వడసి కృతాస్త్రుండును దపోధనుండును మనస్వియు నై విష్ణుసారథ్యంబు గలవానికిఁ బరాజయంబుగలుగ నేర దింతియ కాక పాండవులు వనవాసాయాసకర్శితులై యున్నవారు వారిం కెన్నైన సుఖింప వలయుఁ గావున వారికి జయం బాశాస్యంబు మఱియుఁ గృష్ణార్జునులు పురాణము నులైన నరనారాయణు లగుటంజేసి వారికి జయంబ కాక పరాజయం బెట్లగును గర్ణుండు భీష్మద్రోణసహితుండై వసులోకమొండె మరుల్లోకమొండె ప్రాపించుం గాక యనిన సహస్రాక్షుండు సంతసించి సర్వభూతంబులకు నాబ్రహ్మశాసనం బెఱింగించె నది యిట్లగు ననుడు నెల్లవారును సునాసీరవచనంబు విని విగతసంశయులై పుష్పవర్షంబు గురిసి తూర్యంబులు మొఱయించి వారియుద్ధం బరయుచుండి రంత నిరువాగు నందును భేర్యాదితూర్యారవంబు లెసంగుచుండఁ గర్ణార్జునులకు శస్త్రశంబరులకుం బోలె భీరుజనసంత్రాసకరంబును ఘోరంబు నగుయుద్ధంబు సిద్ధించె నప్పుడు. 216

—కర్ణార్జునుల యుద్ధారంభ ప్రసంగము—

తే. శంఖభేరీమృదంగాదిసకలతూర్య,భూరిభాంకారశబ్దముల్ సారె కడఁ
రెండుసేనలయోధులగుండె లవియఁ, బ్రబలమై నిండుకొనె నభోభాగ మెల్ల. 217

చ. రథమురథమ్మున న్దొరసి రాసికొనంగఁ దదంతరమ్మునం
బృథు గలకర్ణపార్థులవిరాజితకేతనముల్ పరస్పర
ప్రథితరుచిప్రభావమున రాహువు కేతువు వోలె మండుచోఁ
బృథివి చలింపఁ నార్చుచుఁ గపీంద్రుఁడు పేర్చెను హస్తికక్ష్యపై. 218

తే. గుఱ్ఱములు గుఱ్ఱములు దాఁకి కొనుచునుండఁ, బురువులు హేషలు ఘోషలు హాథికేళ్క
స్పర్థ సేయుచు నాక్రోశభరితములయి, యుక్కు గ్రక్కుచుఁ బరవళ్లుద్రొక్కుచుండె.

ఆ. నయనసాయకముల నారాయణుఁడు మద్ర, నాథుమేనుగాఁడ నాఁటి గెలిచె
నతఁడు నతనిమేన శితదృష్టిశరములు, నిగుడఁ జేసి చేసి మగిడె నంత. 220

క. కుంతీపుత్త్రుఁడు కర్ణుని, నెంతయుఁ జుఱచుఱన చూచి హృదయాగ్ని కడున్
వింతఁగఁ దోఁపం జేయుచు, గొంతటిలోఁ జూచునతనికోల్త లడంచెన్. 221

వ. అయ్యవసరంబున నంగనాథుండు మద్రనాథుం గాంచి నవ్వుచు నిట్లనియె. 222

ఆ. మద్రనాథ! నన్ను మార్కొని విష్వచ్చుఁ, డడఁచె నేని వీఁక నగు నదెట్లు
సెప్పు మేమి సేయు దప్పుడు నీ వన, నతఁడు వాని నరసి యనియె నిట్లు. 223

ఆ. కర్ణ! రణమునందుఁ గవ్వడి నిన్నోర్చి, నట్టులైన నేను బట్టి యొకఁడ
విక్రమించి కృష్ణవిజయుల నిద్దఱ, నుక్కడించి పుత్తు నిక్క మిట్లు. 224

ఆ. కర్ణుఁ డడిగినట్లు కమలాయతాక్షుని, సవ్యసాచి యడుగఁ జాలు ననుచు
నలఁతి నవ్వి యతఁడు పలుకు నాతని సన్ని, తాస్యమందుఁ జూడ్కు లలర నిలిపి.

ఆ. ఏటిమాట లివ్వి యినుఁడు పదభ్రష్టుఁ, డయిన నగ్ని చల్ల నయిన నుదధి
వట్టె నేని యంతపని యేల పుట్టును, కర్ణుఁ డోర్చు మాట కలదె యొందు. 226

వ. అని మఱియును. 227

ఉ. అంత పొసంగె నేని వినుమా హవదోహలు మేగ్రహంగ నే
నంతకసన్నిభుండ నయి హస్తయుగంబునఁ గర్ణశల్యులం
గొంతులు వట్టి నుల్మియును గొంతటిలో నిల గెట్టి రాసి యుగ్
సంతన మంద నంతకుఁడు సంయమనీపురి కంపి పుచ్చెదన్. 228

ఉ. నావుడు నర్జునుండు నయనంబుల నవ్వుచు నూర కంటి గా
కీవృషలాధముం డపుడు డొంకించుక కొంచక నేలి గొట్టుచున్
ద్రోవది నన్నమాట లవి తోఁపఁగ వచ్చినఁ జిచ్చువోలె నై
నావపు వేఁచకుండునె జనార్దన! వీనినిఁ జంప కుండినన్. 229

ఉ. వీఁ డొకలెక్కవాఁ డఁటవె వీని సశల్యరథధ్వజంబుగా
నేఁ డగమున్ గజంబువలె నేలకుఁ గోలకుఁ దెచ్చి వ్రచ్చెదన్
వేఁడుకఁ జూడు మీ విపుడ వీనినెలంతలు ముండమోపులౌ
చాడుపుఁ గన్నఁ గాని మది శాంతి వహించునె మన్యువేగముల్. 230

ఉ. చల్లనిమాట నీ విపుడ జానుఁగులం బడవేసి కొంటకుం

చెల్లినపర్వకాల మది చేకుఱు నీశుభవార్త నీవ మా
తల్లికి నీదుచెల్లెలికి ద్రౌపదికిన్ మనతేనికి న్మనం
బుల్లసిలంగఁ జెప్పఁ గల వుప్పొంగుటపుచ్చుసుధాసమోక్తులన్. 231

వ. అని యిట్లు కృష్ణార్జునులు ప్రసంగించుకొనుచుండ నంతరిక్షంబునయక్షరాక్షసగరుడ గంధర్వకిన్నరకింపురుషాదులు విమానారూఢులై నిలిచి నృత్యగీతవాద్యంబులు నెఱపుచుండ నిరువాఁగుసంగ్రామజను లెల్లరుం గాంచి హర్షోత్కర్షంబునం దేలుచు శంఖభేరీప్రముఖవాద్యంబులు ఘోరుగలిగించుచుండె నాసమయంబునఁ గర్ణార్జునులు తమతమసేనాసమూహంబులకుం బెన్ప్రాపులై యుగవిగమసమయప్రద్యోతమానప్రద్యోతనుంగతిం బాణసహస్రప్రభాభాసమానులై మౌర్వీనినాదంబుదిక్కులఁ బిక్కటిల్ల నొండొరులు శస్త్రప్రత్యస్త్రంబులఁ బ్రతిఫలింపఁ జేయుచు శరపరంపరల రోదసీకుహరం బంధకారబంధురంబు గావించి చతురంగసైన్యంబుల నుగ్గనూచంబు గావించుచుండఁ గృపకృతవర్మశకునిదుర్యోధనులు కర్ణునకుం దోడుసూపి ధనంజయాచ్యుతులపై శరాసారంబు వరఁగించి నొంచినం గోపించి గోపాలమిత్రుండు వారిధనుర్ధ్వజహయరథసారథుల మథియించి పండ్రెండుశితకాండంబులఁ గర్ణు నొప్పించె సప్తంబు శకయవనులు కాంభోజవరులంగూడి నూర్వురరదంబులవారును ద్విరదంబులవారు బ్రతిఘటించిన వారినెల్ల నవ్వుచు నరుండు క్షురప్రహారంబులఁ దలలు నఱికె నఱికినం గని వియచ్చరు లచ్చెరుపాట మేలు మేలని ప్రశంసించుచుఁ దూర్యంబు లెసంగఁ బుష్పవర్షంబు పొసంగించి రెల్లభూతంబులును బరమాశ్చర్యంబునం బొందెఁ గర్ణదుర్యోధనులిద్దఱును వ్యగ్రయు విస్మయంబునం బొంద నేకనిశ్చయులై యుండె నాసమయంబున నశ్వత్థామ దుర్యోధనునికరంబు కరంబునం గీలించి సాంత్వనపూర్వంబుగా ని ట్లనియె. 232

—అశ్వత్థామ యుద్ధము మానుమని దుర్యోధనునకు హితోపదేశంబు సేయుట—

క. ఇఁక నైనఁ బ్రసన్నుఁడవై, ప్రకటింపుము శాంతి నీకుఁ బాండుతన్మాపా
అకపుత్రులతో వైరం, బకటా! తగు నెట్లు విడువు మని నింద్యమ కా. 233

మ. పరమేష్ఠిప్రతిమానుఁ డస్త్రగురుఁడున్ బ్రహ్మాదిదివ్యాస్త్రవి
ద్వరుఁ డాభీష్ముఁడు భీష్మవిక్రములు భూపాలాగ్రణుల్ పెక్కు రా
సురరాణ్ణాదను వీఁకఁ దాఁకి పడి రీసూతాత్మజుం డట్టిమొ
ల్లరకు న్మించినవాఁడె వీఁడు నిను గెల్వం జేయునే మాయురే. 234

క. మాఘుయు నేరు నవశత్యాల, మై మెఱఁగుదు మట్టు లయిన నాహవమందున్

మామీఁద నిడినమోఁపున, నీమది గెలుపానపడుట నేఁ డయిన నగునే. 235

సీ. ఉపశమించు ధనంజయుఁడు నేను జెప్పిన, నఖిలపూజ్యుండు హరి యచ్యుతుండు
సతతభూతహితుం డజాతశత్రుండును, సమముగఁ గవలు నాపలుకువారు
కావున నుడుగుము నీ విరోధము, సంధి సేయుము ప్రజాసౌఖ్య మెంచి
కలసిఁగి జోఁదులు కదలిపోవుదు రిప్డు, కింక నైన నామాట లెంచి వినుము

ఆ. వినక పోయితేని వెనుక హతుండవై, తాపతప్తుఁ డగుచుఁ దలఁచి నాకు
నధిపుసందుఁ గలుగున భిమానమున నింతె, నట్లు చెప్పుచుంటి నధిపతీశ. 236

తే. అరయ నింద్రాదులకు నశక్యంబు లైన, మేటికార్యము లమ్మేటి మిసిమి మెఱపి
యొన్న యూ చేసె నన్నియు నీజగంబు, లెఱుఁగు నీ వెఱుంగుదు దాని కింత యేల.

మ. అతిలోకప్రతిభాప్రభావనిధి యూనయ్యబ్జనుం డొప్పఁగాఁ
గృతహస్తుండు జగత్త్రయంబునను లేఁ డెవ్వాఁడు నే స్తేయు
ద్భుతభూరిక్రియుఁ డైనఁ దా నెపుడు నే బోధింపఁ గాదాడ డం
చితచిత్తంబున నాదరించి విని త్వత్సిద్ధిం బ్రవర్తించెడున్. 238

ఉ. నీయెడ శాంతిఁ గోరినను నే నిపు డాతని సుప్రసన్నుఁ గాఁ
జేయుదు నిట్లు కర్ణునకుఁ జెప్పకు నప్పుడు జెప్పె వానితో
నీయని నాఁగు మట్లయిన నిందును నందును నిల్చి యున్నవా
రాయువు గల్గి యుండెదరు హాయిగ నిన్ను భజించునట్టి రై. 239

తే. సహజును ధనార్జితంబును సామనంచి, శమ ప్రతాపోన్నతిము నై ధాత్రి మైత్రి
నలుదెఱంగుల నొప్పఁ బాండవులు నీకు, సహజమిత్రాంగులు సామసాధ్యులిపుడు.

తే. పాండవులతోడి మైత్రినిఁ బాదుకొలిపి, సామమునఁ జేసి సంధి పాసంగఁ జేసి
కొందువేనియు జగములకున్ హితంబు, గూర్చినట్టేడ వగుదు వోర్పువలయునే. 241

తే. అనిన దుర్యోధనుఁడు మనంబున నొకింత, చింత సేయుచు నిట్టూర్పు లేసి వాఱ
నతని కను నీవు చెప్పితి వట్లు నేను జెప్పెదను విన్మ నాయల్ల చిత్తగించి. 242

మ. మనదుశ్శాసను నేసి కోల్పులివలెన్ మంపల్లి విల్లిచ్చుచుం
గనులం జిన్నపనోక లుప్పతిల్లఁ గనుచున్ గర్వాంధుఁడై భీముఁ డా
డినమాట ల్విని యుంటి నీ వవి నను న్డీలించి నొంచు న్మనం
బున శాంతిం గొనియుండు మట్ల యెద వెడ్క బోధింప నిం కేటికిన్. 243

తే. శాంతిఁ బొందుదు రెట్లు నానలిపినట్టి, యొగ్గు లన్నియు మదులలో నగ్గలోలె
నొప్పుచుండఁగఁ బాండవు లెల్ల మఱచి, పగను బాటింప రనుట యేపాటిమాట.

చ. ఉడుగుము కర్ణ కయ్యమున నుండుట నీ కగునయ్య కర్ణుఁ గ
వ్వడి పెనకంగ నోపఁడు ప్రభంజనుఁ డుగ్రుఁడ యయ్యు మేరువుం
గడిమిఁ గదల్పఁ జాలెడినె కాకిపు డెంతయు డప్పియుండె న
వ్వడముడితమ్ముఁ డీవృషుఁడు వాడసివాఁ డని వానిఁ గూల్చెదున్. 245

వ. అని పలికి నీకొడుకు కాతని ననునయించుచు నిజసైనికుల నెల్లం జేయి వీచి పిలిచి సవ్యసాచిం గొట్టుఁడు ముట్టుఁడు పట్టుఁడు తఱుముఁడని యెలుంగెత్తి చెప్పుటయు మనయోధులు సమరసముత్సాహసంజనితసంరంభారంభులై శంఖభేరీమృదంగానకపటహాదివాదిత్రంబు లెసంగ సంగరంబునకుం గడంగి రంతఁ గర్ణార్జునులును వాశితార్థంబు సమస్పర్థం జేసి కైకొనుమత్తమాతంగంబులభంగి నొండొరువు లుత్తుంగపరాక్రమక్రమంబున బెచ్చుపెరిగినమచ్చరంబున. 246

—కర్ణార్జును లొండొరుపై దివ్యాస్త్రంబులు ప్రయోగించుకొనుట—

శా. కొండం గొండయు మబ్బు మబ్బును బలెం గ్రోధోల్లసన్మూర్తులై
యొండొండ న్వడిఁ దాఁకి కాఁకఁ దలకోద్దండమౌర్వీధ్వనుల్
మింటం బ్రోయఁగ బాణవృష్టి వెసల న్నించంగఁ గోదండపుం
బాండిత్యంబున వస్త్రవాసను లసన్ భాసిల్లి రీ నేర్పునన్. 247

క. వెలిమావులు వెలిగొడుగులు, వెలిఁగెడునరదములు వేఁడి పెలుఁగులు నా నిం
పలరెడునమ్ములు గలవా, రలయ త్తౌలి తాకు భీకరం బయి తోఁచెన్. 248

క. నేమిసమాఘట్టనమున, భూమియు జ్యాఘోషమున నభోభాగంబున్
భీమగతి నద్రుచి బ్రోయం, దీమసమునఁ బోరుకొనిరి దివ్యులు మెచ్చన్. 249

వ. అట్టియెడఁ బాంచాలయోధులు మాధవసారథిసవిధంబునకుం జని యిట్లనిరి. 250

మ. అఱు మోఘాల్గున! వల్గుభల్లముల నియ్యంగాధినాథుం గరం
బఱుగొట్టంబు లొనర్చు పీనిశిరముల్ హా పుట్టబి ట్టేఁచి పెం
పఱగం జల్చుచుఁ గోయు మానృపతి పేరాసల్ తుణార్థంబులోఁ
దొఱగం జేయుము మాకు నంతసము తోఁత్తోఁ గూర్పు మూర్పేర్పడన్. 251

వ. అవ్విధంబున మనయోధులు నాధిరథిం దఱియ నరిగి. 252

చ త్వరపడు మాలసింపకుము ధైర్యవినిర్జితమందరాద్రి వో
పురుషవరేణ్యా! లెమ్మనికిఁ బూనుము నిశితసాయకమ్ములన్
నరుని జయింపు మిం పటి చనం గల రాపృథగన్నబిడ్డ లా
తురపడి కాలుకొనలకుఁ దోరపుఁగీరితి నీకు వచ్చెడున్. 253

క. నిశితన రాజరాజు త్రిలోకేశ్వరమానసమ్మృద్ధి లోఁ గొని రాజ్యం
బేకాతపవారణముగఁ, జేకొని పాలించుఁ గాక కార్శ్యప మెల్లన్. 254

వ. అనంతరంబ. 255

సీ. తొలిదొల్లి స్వరదితూపుల గిడ్డంపు, బట్టైనె నడ్డను పేరరమున
నతఁ డన్నికోలల నాశసకయాంత్రరము నాఁట నేసి కరమ్ము నగియె
నవల నొంచరులు శితాగ్రసాయకములు, వెస మేనులు మునుంగు వెట్టికొనిరి
గొనయంబు సారించుచును నరుం డంత నా, రాచనాళికల రాహోకర్ణ

తే. ములు మొదలుగాఁగ వాలమ్ము లలుక నెత్తి, సత్వరమ్మున గుప్పె నాశరము లెల్ల
మొత్తమై సంజకడ నవాగ్ఖములుగు మ్మనగముఁజనుఁఝుళులు నాచ్చెనతనిరధము.

వ. రాధేయుండును వాని నన్నింటిసెఁ బ్రతిశరంబుల నుపసంహరించి నంత నివాతకవ
చాంతకుండు. 257

శా. ఆగ్నేయాస్త్ర మమిత్రసాదనము మంత్రోపంహితశక్తిఁ దన
ల్లగ్నంబుం బొనరించి సూతితనయుఁ లక్షించి యేసెం బ్రభా
మగ్నంబై యది మింట మంట లెగయ న్వ్యాప్తింపఁ బంపుల ను
ద్వగ్నంబై చనఁ జేయుచుం బగతు నుద్వేగింపఁ జొప్పింపుచున్. 258

మ. కురుయోధాళి విదగ్ధదేహ మగుచుం ఘోరాగ్నిసిఖ్యాన ము
ద్ధరమై పర్వఁగఁ గాండకీక మయి పోఁ చోఁ దూంచి సూతాత్మజున్
బరితఃప్రాప్తగ నావరించుటయు నాబాహాబలాఢ్యుండు త
ద్గరిమన్ మాన్చను వారుణాస్త్రము లోకంబుల్ ప్రశంసింపఁగన్. 259

మ. తినవహ్న్యస్త్రము వారుణాస్త్రమున న్వ్యర్థంబై పెనఁ గ్రుద్ధాత్ముఁడై
ప్రణుతప్రాభవుఁ డాధనంజయుఁడు వజ్రాస్త్రము న్నారిఁ బో
సి పయం బేర్పడ నేస నేసినఁ గడుం జీకట్లు గ్రమ్మ న్మహో
న్నతయుత్కృతతుల్ నభస్థలి సమస్తం బాక్రమించె న్మొగిన్. 260

ఆ. కన్ను మిన్నుఁ దెలియఁ గా రాక భయమిమ్ము, గాఢతిమిర మొల్లకడల నిండ
నంగపతియు వాని ననిలాస్త్రమునఁ జేసి, తొలఁగఁ జేసెఁ దెసలఁ దెలివి నేర. 261

ఉ. అప్రతిమప్రభావ మగునైంద్రమహాస్త్రము గాండివంబునన్
సుప్రతిభం బ్రవర్తిలెడుచో శ్వసుదే నభిమంత్రితంబు గా
క్షిప్ర మొనర్చి విప్రియులు చేష్టడి పోవఁగ నప్రశక్యుఁ డిం
ద్రప్రియనందనుండు భుజదర్పము పెంపున నేసె నేసినన్. 262

తరువోజ. అప్పుడా యదివ్యాస్త్రంబు మహిమ, నంజలికార్ధచంద్రాదికోలీము
ఖమ్ములు వేనవే గ్గాండీవకార్ముకమ్మువలనఁ బుట్టి కర్ణునివిగ్ర
హమ్మును సూతహయశరాసనధ్వజాదుల విదళించి యంత సరీసృ
పమ్ములు బిలమునఁ బడునట్లు భూమిఁ, బగిలించుకొని చొచ్చె బహువేగగతులు. 263

ఉ. నెత్తుట నత్తనిల్లి యొడలంతయు రోషవివృత్తనేత్రుఁ డై
మెత్తఁగ గాక సూతుఁ డమేయపరాక్రమ మేర్పడంగఁ దా
నత్తటి భార్గవాస్త్రము శరాసనమం దమరించి యేయుచుం
దుత్తుమురయ్యె నైంద్ర మది తూపుగముల్ వితలయ్యె నయ్యెడన్. 264

ఆ. మఱియు భార్గవాస్త్రమహిమంబునం గర్ణుఁ, డొరసి సోమకప్రవరుల నెల్ల
వివిధబాహుతులఁ బీడించుటయు వారు, గూడి వాని నఱిమి రీడఁ బోక. 265

వ. సూతసూనుండును. 266

సుగంధి. వారి నెల్ల సూతపతి వారణాళితోడఁ బె
ల్లిరపించి నారసంబు లేసి నొంచి త్రుంచ న
వ్వారు భిన్నదేహులై రణంబు మీఱి సింగపుం
బారిఁ బట్టువడ్డ లట్లు ప్రాఁకి రార్తి నోర్వకన్. 267

వ. ఇట్లు వక్రవిక్రమంబునఁ బాంచాలవీరులఁ జెక్కుచెక్కుచు నుక్కడంచి రంగమధ్యంబున
మధ్యందినమార్తాండునిమాడ్కి మండుచున్న మానధనుం డగుసంగమహీవల్ల
భుం దలకించి మనమారందంబును గృష్ణార్జునులు దగర కాసక్తుడ్చుంచి వానివిజ
యం బెంచి సంతసించుచుఁ సింహనాదంబులు గావించి రక్తైందవాస్త్రము ప్రతిహతం
బగుటయుఁ బాంచాలవీరులు వ్రాలుటయుఁ బ్రతీక్షించి వాయుపుత్రుండు క్రోధసంరక్త
నేత్రుండై కరతలాస్ఫాలనంబు సేయుచు నర్జునుదిక్కు మొగం బై నిట్టూర్పు నిగిడిం
చుచు నిట్లనియె. 268

— భీమాన్యుతు లజ్జయుం బురికొల్పుట. —

మత్త. పోలునే యిటు సెకు సేయను బుండరీకదృశుండునుం
బోలఁ జూచుచునుండ సూతునిపుత్రుఁ డీకడు పట్టి పాం
చాలయోధుల నేలపాలుగ సల్పెఁ బెక్కురణక్కటా!
కాలకేయులఁ గూల నేసినకర్మఠుండ వలంతివే. 269

క. ఎక్కటికాఁడం డీకొని, ముక్కంటిని గెల్చినట్టిపోటరివి నినున్

స్రుక్కడి యగువృషలుఁడు తా, నక్కట స్రుక్కించె నట్టి నైమై దైదిఁటన్. 270

క. నీయేసెడునస్త్రంబులు, వాఁయెడు నూఱకయ యిట్లు పోనుపడి యిట ము
న్నీయెడల నిట్లు కనుఁగో, పీయది చోద్యంబు వోలె నెఱుఁగఁగ నయ్యెన్. 271

వ. అని మఱియును. 272

చ. అలసభ ద్రౌపదిం దిగిచినప్పుడు వీఁడు దురాత్ముఁడై కడుం
జలమున నోసి! నీపతులు షండతిలోపము లంచు నవ్వుచుం
బలికినప్రల్లదంబులును బాటింపఁ జేసినయెగ్గులు స్మృతిం
దలఁచి యొకింతయుం దశ వోసర్పక త్రెళ్ళఁగ నేయు వీఖలున్. 273

తే. ఏల యొప్పఱికించెద విది యుపేక్ష, కదను గాదు ఖాండవదాహమునకు కలిగి
నట్టిధృతి నేఁడు గలవయి గిట్టు మితని.నెల్లవారికి సంతస మెసక మెసఁగ 274

క. అది యట్లు కాదయేని, దఁదిమాటగఁ జెప్ప మేను దోర్బల మెసఁగన్
గద ఫూని వీనిశిరముం, జిదుగుపలై పోవ నడఁచుఁ జిటుకుమనంగన్. 275

వ. అనుచున్నంత మురాంతకుండును. 276

సీ. ఇది యేమి సవ్యసాచీ! నీదివ్యాస్త్రము, లన్నియు నిపుడు ప్రత్యస్త్రములను
దూలపుచ్చెడు కర్ణుఁ డేల యీమోహంబు, మఱచిన ట్లుండెదో ప్రమాద మేమొ
మాదితులై కౌరవుల్ మొనసి మూర్ఛ్చనుండి, గితని మున్నాడి గర్వ మెసక మెసఁగఁ
బిఱుసనిపాంచాలు రఱిమిఱిఁ బడియును, గలగుండువడియును గడలు సనిరి

తే. యుగయుగంబునఁ బేర్చి దంబోద్భవు లగు,దుష్టరాక్షసులం ద్రుంపఁ దోచునట్టి
చక్రరాజను నీ కిత్తు విక్రమించి, వృషలుఁ బరిమార్పు మిపుడ తద్వీర్యమునను.

మత్త. మాయబోయకు మాఱు వన్నుచు మార్గణప్రతిమార్గణా
మేయశక్తిసమున్నతిం దఱిమిఱి దారుణసంఖ్యముం
జేయఁ జాలి జగంబులందుఁ బ్రసిద్ధిఁ గాంచినవాఁడ వీ
వీయెడం గొని తద్ధృతిం బడ నేయు మీవృషలాత్మజున్. 278

వ. అని యుత్తేజంబు గలిగించుచుం బలికిన వృకోదరదామోదరులపలుకు లాకర్ణించి కర్ణుం దలంచి సర్వంబునుం దిలకించి నిజాగమప్రయోజనం బెంచి జనార్దనుం గాంచి యి ట్లనియె. 279

మ. భువనక్షేమముఁ గోరి క్రూరుఁ డగుచుం బాంగారునీసాతి నే
ననలీలం దునుమాడువాఁడ నిదె బ్రహ్మాస్త్రంబు సంధించెదన్
భువనేశులు భవ్యులు నేఁడు లీవు నా కనుజ్ఞ ... ను
త్సవముం గూర్పఁ బటంచు ధాతకు నమస్కారంబు లర్పించుచున్. 280

తే. పక్షులుం బాఱ వయ్యె నప్పట్ల నంత,రిక్షమున వాని మెచ్చుచు నక్షయముగ
సురభివాతము వీఁచె నర్జునున కెలమి, గలుగునట్లుగ భూతసంఘంబు లెల్ల. 295

వ. అంత. 296

మాలిని. విజితవిబుధలోకద్వేషసంఘాతకుం డా
విజయుఁడు పదితూపుల్ వేసి మద్రేశుమీఁదన్
గజిబిజిపడఁ జేసెం గర్ణునిన్ ద్వాదశేషు
వ్రజమున మఱియున్ సప్తస్ఫుటాజిహ్మగాళిన్. 297

వ. సూతపుత్త్రుండు రక్తసిక్తగాత్రుండై రౌద్రముహూర్తంబున శ్మశానమధ్యంబునం గ్రీడించురుద్రునిమాడ్కి రౌద్రంబు వెంచుచుఁ గ్రీడిని మూఁడువాఁడితూపులను వాసుదేవు నేనుసర్పశరంబులం దూలించుటయు నవి వారివర్మంబులం బెట్టుతాఁకి మిట్టిపడినం గని తక్షపుత్త్రపక్షంబు లగువాని నవ్వాసవాత్మజుండు పదియు నైదు ప్రదరంబుల మూఁడు మూఁడు శకలంబులు గావించి శుష్కతృణపుంజంబునం దరికొను దవానలంబుచందంబునం బ్రజ్వరిల్లుచు నాకర్ణపూర్ణముక్తంబు లగుదివ్యశరంబులు రాధేయునిమర్మంబులు గాఁడ నేసి తుషారనీహారావృతం బగునవిహాయసంబు వోలె నాతనిరథంబు శరచ్ఛన్నంబు గావించి వానిచక్రరక్షకులను పార్శ్వరక్షకులను పృష్ఠరక్షకులనుం బిలుకుమార్చి మఱియు దుర్యోధనానుమతు లగు రెండువేలరథంబులవారి సరథాశ్వసూతంబుగాఁ బ్రేతరాజక్షయంబున కర్థక్షణంబునం బుచ్చుటయు హతశేషులు రాధేయరక్షణం బపేక్షింపక నిహతు లయినతమవారిం బ్రతీక్షింపక యథాయథలై విజయాస్త్రోద్దీపనంబునకు వెఱచి పఱచి బాణపాతమాత్రదూరదేశంబున నిలిచి చూచుచుండి రంతఁ గర్ణుండును. 298

సీ. ఉర్వీస్థలం బెల్ల నుర్రూఁతలూఁగంగ, మౌర్వీనినాదంబు పర్వఁ జేసి
గర్వవిస్ఫూర్జితగాత్రుఁడై జృంభించి, సర్వాశలున్ నిండుసరణి దోఁప
ధూర్వహం బగుతనదోర్వీర్యమునకు ను,పర్వవర్యులు దివిఁ బ్రస్తుతింపఁ
బర్వాంచితము లగుబహుళాశుగమ్ములు, సర్వతోముఖముగాఁ సాఁగ నడిపి

తే. యంతలో భార్గవానుగ్రహోత్తమగుచు, నడరునాథర్వణాస్త్రము నమ్మనందు
సంప్రదీపితము గాఁ జేసి సవ్యసాచి, సంధితోగ్రాస్త్రబల ముపసంహరించి. 299

చ. కునిశితభల్లమాల్ విసరుమన్ సురరాజకుమారు మాఱుకొం
చనితరసాధ్యవిక్రమసమంచితశౌర్యబలప్రదీప్తుఁడై
కొనకొని సూతనందనుఁడు కో యని యార్చుచుఁ బేర్చి తద్రణం
బున నిజపాణిలాఘవము ప్రకటించెను జూడ నెంచఁగన్. 300

చ. జ్వలనదివాకరేందురుచిజాలసమంచిత ముత్తరోత్తరా
ఖిలభువనప్రసిద్ధము ప్రకృష్టపరారిభయంకరాకృతి
జ్వలితము గంధబంధురము వాసవనందనశీర్షభూష మై
పొలిచెడురత్నరాజ మది భూమిపయిం బడె నద్భుతంబుగన్.

క. శరమథిత మగుచు మకుటము, కురుకులజుని శిరమునుండి గొబ్బునఁ గూలెన్
జరమగిరినుండి కూలిన, హరిదశ్వుఁడు నాఁగ మంట లడరఁగ మింటన్. 320

మ. చిగురుల్ పువ్వులు గల్గి చెప్ప నగుచున్ శృంగాగ్రభాగంబునం
దగువృక్షం బశనిప్రభిన్న మయి మాయన్ నీలశైలంబు నా
నగభిన్నుం డనుఁ డుత్తమాంగకలితం బాభూషణం బట్లు వో
వగఁ జెల్వేదియుఁ దెల్లయొల్లియ తలన్ వట్రిల్లఁ జుట్టె న్వడిన్. 321

క. శ్వేతోష్ణీషంబున వి,ఖ్యాతుం డై నరుఁడు పూర్ణిమాబ్జోదయసం
ప్రీత మగుపూర్వశైలము, భాతిం జెలువారె నపుడు పరికింపంగన్. 322

వ. అట్టియెడ నట్లు కిరీటికిరీటంబు నిర్దహించినసర్పశ్రేష్ఠంబు హుతాశనార్కప్రతిమం బై ప్రజ్వరిల్లుచు నుగ్రరూపంబునఁ గర్ణునకుం బొడసూపి నీవు లక్ష్యశుద్ధి నెఱుంగ కేయుటం జేసి నా కర్జునుశిరంబు హరింప వలను గాదయ్యె నిం కొక్కమాఱు పరికించి ప్రయోగింపుము నే నింద్రుం డడ్డపడినను నీపరిపంథిం బరిమార్చి వత్తు ననిన నతం డుగ్రరూపుండ వగునీ వెవ్వరు నీవృత్తాంతం బెట్టిది చెప్పు మనిన నప్పాపతేఁ డతని కి ట్లనియె 323

క. నే నైరావతకులస, మ్మానితుఁడను నశ్వసేనమహితాఖ్యుఁడ ము
న్నీనరుఁడు ఖాండవంబున, మాసని మాజననిఁ జంపె మా కె గ్గొదవన్. 324

వ. ఆవైరంబు మనంబునం బెట్టుకొని యిట్లు వచ్చినవాఁడ న న్నీయర్థంబునం దుపయోగించుకొమ్మనిన నతం డతని కిట్లనియె. 325

ఉ. నూర్వులు సవ్యసాచులను నొంచెదుపట్టున నైన నొక్కమా
ర్పర్వఁగఁ జేయునస్త్రమును బర్వఁగఁ జేయఁడు వెండి కర్ణుఁ డీ
యుర్వర నొడ్లప్రాపునకు నుల్లము చేసి జయంబు గోరఁ డీ
గర్వము మాను మే హతుఁడఁ గాచె భుజంగమశస్త్రసంగతిన్. 326

తే. చాలు పదివేలు వచ్చె నీసఖ్యమునను,సుముఖతం గాంచి నీయిచ్చవొం[illegible] నట్టి
కట్టి కడకేని మఱియొక్కకడకుఁ గాని, చనుము పెక్కులు పలుకక సర్ప[illegible]

వ. అని ప్రత్యాఖ్యానంబు చేసినసది చేయునది లేకరోషంబునం జేసి [illegible]

దాన తీర్చుకొన నెంచి ధనంజయవధం బెంచి శరరూపంబు ధరించి వచ్చుచు న్నం గాంచి కృతవైరం బగునిమ్మహోరగంబుఁ దెగ నేయుమనునచ్యుతున కర్జునం డి ట్లనియె. 328

—శ్రీకృష్ణుం డర్జునునకు సర్పవృత్తాంతము చెప్పుట—

ఉ. ఎక్కడిపా మొకో యిది యి ట్లేటికి వచ్చుచునుండెనో ననుం
దక్కక వైరముం గలిగి తాఁ కెడుబుద్ధి యదేల చేసెనో
మిక్కిలిమాట లేల యిది మీఁదు లెఱుంగని వేఁదు రయ్యెఁ దా
నిక్కడి కేగుదెంచుట ఖగేశ్వరువక్త్రము సొచ్చుటే సుమీ. 329

వ. అనిన నప్పుండరీకాక్షుండు. 330

ఉత్సాహము. ఖాండవంబు నేర్చుచుండుకాలమందుఁ బొంద ని
య్యండజంబుతల్లి వీని నడఁచిపెట్టి నట్టిచో
నుండె నొక్కఁ డనుచు దాని నుక్కడంచి నీవు నీ
కాండనమితి కెఱగ వీనిఁ గట్ట వట్టిపట్టునన్. 331

వ. అక్కారణంబునం జేసి వీఁడు నీపయిం బగవట్టి గగనచ్యుతం బగునుల్కగతిఁ గ్రాలుచు వచ్చుచున్న వాఁ డశ్వసేనుం డనువాఁడు వీనిం దెగటార్చు మనిన నప్పార్థుం డాఱు నారసంబుల నప్పాపజీవికాయంబు ఖండించి పుచ్చె నప్పు డప్పుండరీకాక్షుం డరదంబు డిగ్గి భుజంబులం బట్టి యెత్తి దాని నెప్పటి యొప్పుఁ జేసె రాధేయుండును. 332

సీ. ఓరచూపులఁ గోప మొలుక నర్జునుఁ జూచి, దశశిలాశితపృషత్కములు నించె
నరుఁడు వరాహకర్ణశరముల్ పండ్రెండు, తొడిగి కర్ణునిపయిఁ విడిచి మఱియు
నాశీవిషోపమం బగుదొడ్డశర మొండు, వీనుఁ దాఁకగ నీడ్చి విసరె నదియు
నసువు దీసెడునట్టి దై వానివర్మము, వ్రచ్చి తాఁ దనివాఱఁ ద్రావె నెత్రు

తే. కర్ణుఁడును దండతాడితకాలసర్ప, విధమునం గ్రోధవిష మెల్ల వెడలఁ గ్రక్కి
హరినిఁ బండ్రెండుతూపుల నడచి పాండు, పుత్త్రు నేకోనశతశరంబుల నొగిల్చి. 333

చ. వడి గలయొక్కనారసము వాసవనందను దేహ ముచ్చి పో
నడపి కడంక నార్చియును నవ్వెను నవ్విన నోర్వ కర్జునుం
డెడఁద నహంకరించుచు నొకింతటిలో వృషలాంగమర్మముల్
బెడిదపుఁ బాటునన్ నవయ వ్రేసెఁ బరశ్శతసాయకంబులన్. 334

ఉ. వ్రేసియు నంతబోవక సువిస్రుతముల్ నవతిషువుల్ వడిం
బోసి యరి న్నిగిడ్చె నవి పోయి తదంగము గాఁడఁ దాఁకినన్

వాసవశస్త్రభిన్నగిరి నా నతఁ డారయ నయ్యె నయ్యెడన్
భూనతిపాల వ్రాలె మణిపుంజిత కుండలముల్ కిరీటమున్. 335

మ. బలిమై నుండియు బెండు వోక కడిమిన్ భాసిల్లునక్కర్ణునిన్
నరుఁ డొండొక్కచతుష్టయంబున వడిన్ మర్దించె నద్దాన న
వ్వరథానుష్కుఁడు వాతపిత్తకఫసువ్యక్తజ్వరుం డట్టు లా
తురతం బొందుచు నుండ వెండియును సంధుల్ నొంచెఁ గాండంబులన్. 336

క. శరసంఛిన్నశరీరుఁడు, ధరణీధవసఖుఁడు రక్తధారలు వాఱన్
బరఁగెన్ గైరికధాతువు, లురలం దగునగమునాఁగ నూహింపఁగ నై. 337

తే. అపుడు వివ్వచ్చుఁ డెంతయునతిశయించి, బాహులేయుఁడు క్రౌంచాద్రి వ్రక్కలించు
నట్లు బెట్టుగ ఘోరశరాళి వాని, బాహుమధ్యము భేదించె బాహుశక్తి. 338

చ. పిడికిలి వీడ సూతజుఁడు వీడి శరాసనమున్ శరంబులున్
వడిచెడి సొమ్మసిల్లి రథభాగమునం బడి యొం డెఱుంగన
ట్టిడ యయి యుండె నట్టియెడ శేవ నెసంగియు సద్వ్రతస్థుఁ డై
కడఁగి నరుండు వానిపయి కాండము లేయుట మానె మానినన్. 339

చ. మురహరుఁ డేటి చైద మిది ముందు లెఱుఁగనివాఁడ వైతివో
వెరవరి యైనవాఁ డవని వీతబలుల్ వ్యసనప్రసక్తు లై
పరఁగెడుశత్రులం దెలిసి వారినిఁ జూచుచు మిన్నకుండు నే
యరనిముసంబునంద తెగటార్చి యశంబును ధర్మ మొందెమున్. 340

మత్త. ఏకవీరుని వీని నేయక యిట్టు లొప్పరికించుచున్
వీఁకఁ గైకొనకుండుటల్ తగవే యితం డొకయింతలో
మైక మేగఁగ నేచి నీపయి మాఱువన్నెడుఁ గాన మే
ల్సేకుఱ న్వడి నేసి చంపుము జిష్ణుఁ డానముచిం బలెన్. 341

ఉ. నావుడు సత్వరుం డయి ధనంజయుఁ డిత్వరవత్సదంతరో
పావళి నమ్మహారథు మహారథరథ్యరథాంగసారథి
ప్రావరణంబు గా నఱిమి పర్వఁగ నేసినదానఁ గర్ణికా
రావృతభూరిభూధరము నట్లతఁ డారయ నయ్యె నయ్యెడన్. 342

ఉ. నెత్తురు మొత్తమై పఱవ నెమ్మొయి నమ్మొయి సొమ్మ దీఱ రా
జోత్తమమిత్రుఁ డత్తఱిఁ గ్రమోచితరీతిఁ దలిర్చి పేర్చి వి
ల్లెత్తి శరాంశుజాల మెలఁగించుచు నస్తముఖార్కబింబసం

వృత్తికి నెత్తువచ్చి రిపుబాణపరంపర ద్రుల్చి వెల్చెనన్. 343

ఆ. ధైర్య మూని నరుని దశవిశిఖంబులు, దృఢ్లఁ దంచి కృష్ణుఁ డోడన యిరు
మూఁడు వేఁడివాఁడి ములుకుల నొప్పించి, మించె నలుక మేను గాంచె నరుఁడు. 344

వ. అయ్యెడ నర్జునుం డుగ్రనిస్వనంబును సర్వవిషానలోపమంబును నయస్మయంబు నగు రౌద్రమహాస్త్రంబు సంధింపం దలంచి యున్న కాలంబునఁ గాలుం డదృశ్యాకారుం డై పాడసూపి. 345

— కర్ణునిరథచక్రంబు భూమిం గ్రుంగుట —

తే. అధిరథిరథచక్ర మిప్పుడవనిఁ గ్రుంగు, విప్రశాపమునం జేసి వీని కిపుడు
భార్గవప్రాప్త మస్త్రము పట్టువడదు, కాల మాసన్న మయ్యె నీకునభుజునకు. 346

వ. అని యెల్లరు వినం బలికె నంతలో ఘూర్ణిల్లుచుఁ గర్ణునిశతాంగంబు డాపలికల్లు నేలం గ్రుంగెఁ గ్రుంగినంత భార్గవాస్త్రంబును బ్రస్ఫురితంబు గా దయ్యె నట్లగుటకును నాగాస్త్రమ్ము వమ్మగుటకు నమ్మహారథుం డుమ్మలించుచుఁ దన్నుం దాన విగర్హించుకొని విషాదమ్మునఁ జేతులు విసుర్చుచు. 347

క. ధర్మాత్ము లైనవారలు, ధర్మము పాలించు నంద్రు ధర్మవిదుల్ నే
నిర్మలమతి సతతంబున్, ధర్మమున న్నిలుతు నిట్టి దాకిట్లయ్యెన్. 348

కావున ధర్మము భక్తులం బాలించు ననుట కల్ల యని ధర్మంబు జెందనాడుచుఁ [illegible]ర్థబాణప్రహారపీడితుండును బ్రష్టహతాశ్వసూతుండు నై పెద్దయు నొచ్చి శిథిల[illegible]డయ్యు నొయ్యన మగఁటిమిం జెచ్చుకొని. 349

క. భీమశరేషుత్రయమున, దామోదరుకరతలంబు తద్దయు నొవ్వం
గా మెలఁగఁ జేసి వాసవిపై మూఁడును నాల్గు వాఁడిప్రదరము లనిచెన్. 350

క. ఇంద్రావరసుం డంతట, నింద్రాశనిసమము లైనయిద్ధాశుగముల్
సాంద్రముగ సప్తదశక మ్మతండ్రుండై విసరె సూతతనయునిమీఁదన్. 351

శా. శస్త్రాస్త్రజ్ఞుఁడు కర్ణుఁ డట్లగుచు నిశ్చాంచల్యుఁడై వేర్చి బ్ర
హ్మాస్త్రం బమ్మునఁ గూర్చి యేయుటయు నింద్రాత్మోద్భవుం డప్పు డైం
ద్రాస్త్రంబు న్నిగిడించె నందునఁ గలం బాసార మేతేర న
య్యస్త్రంబున్ వసుషేణుఁ డంతటన పోకార్చె న్నిజాస్త్రంబునన్. 352

ఉత్సాహము. అపుడు వాసుదేవుఁ డిట్టు లనియె నీదునస్త్ర మీ
నృపసభాస్త్రమున నడంగె నీ వికొక్క యస్త్రమున్
సుపరిశుద్ధముగ నొనర్చి సుడివడన్ నిగిడ్చు మీ

యిపుడు నాఁగ బ్రాహ్మ మస్త్ర మేసె నాతఁ డీసునన్. 353

సీ. అది మంట లెగయంగ నటిమి కర్ణాస్త్రప్రశమనం బొనర్చె నాసమయమందు
నరుఁడు తద్రథముపై నారాచవర్షంబు, కురిసెఁ గర్ణుఁడు కుపితుఁ డగుచు
శితశరంబుల వానిశింజినిం దెగనేసి, తగ నమర్చెడునంత దానిఁ ద్రుంచి
మఱియును సవరింప నఱకి రెండవదాని, నట్లు మూఁడును నాలు గైదు నాఱు

తే. నేడు నెనిమిది తొమ్మిది దేను బదునొ, కండునుం దొట్టి వరుస లెక్కగను నూటి
వఱకు సమకూర్చునారుల నఱకి వైచెఁ, గాని యొకకూర్చుచుం డెఱుంగఁడ యతండు.

ఉ. కైవడి నల్లెత్రాఁకుఁను గట్టుచునర్జును నేర్పు కూర్పునుర్
దేవత లంతరిక్షమునఁ దేఱి కనుంగొని విస్మయంబునం
బోవుచు వేయినోళ్ల స్తవము ల్పచరించిరి కర్ణుచేతకుర్
దేవకిపట్టి కట్టుకొని నిర్వాఱపాటును ఱిచ్చపాటునున్. 355

వ. ఇట్లస్త్రంబులు ప్రత్యస్త్రంబుల నుపశమిల్లం జేయుచు నర్జును నతిక్రమించుకర్ణుం
గాంచి కాంచనాంబరధరుండు కర్ణాస్త్రపీడితుం డగు కిరీటిదెస మొగంబై యి
ట్లనియె. 356

తే. కాలయాపనమున కిది కాదు కాలి, మురక చూచుచు నుండక యుగ్రశరము
తొడిగి విడువుము నా నర్జునుఁడు గడంగి, చక్క సవరించి గాండివజ్యాగుణంబు.

—కర్ణుండు కుంగినతనరథంబెత్త నుంకించుట—

వ. వైశ్వానరసదృశుం బగునొక్కరూక్షప్రక్ష్వేడసంబున రౌద్రాస్త్రం బభిమంత్రించి
గాండీవంబున సంధించి ప్రయోగింప నున్నసమయంబున నంతకు మున్న కొండొక
క్రుంగంబడినరాధేయురథచక్రంబు కుండ మునుఁగం గ్రుంగి నొడ్డగడమైన దాని
నుండి క్రిందికి దిగి యతఁడు భుజంబులం బట్టి చక్రం బెత్తం గడంగిన నది మీఁది
కింతయు నెగయ దయ్యెం గాని సశైలవనకాననం బైనసర్వసర్వంసహాచక్రంబు
చతురంగులప్రమాణంబుగ మీఁది కెగసె నట్టియెడ సంరంభసముద్రిక్తుం డగునవ్వ
సాచిం జూచి రోషవిషాదంబులఁ గన్నీరు చాలువాఱఁ గర్ణుం డి ట్లనియె. 358

సీ. ఓధనుర్ధరవర! యోపార్థ! నాబండి,క ల్లొండు దైవంబు కారణమున
నుర్విఁ గ్రుంగెం దాని నుద్ధరించెద నిప్డు, యొకముహూర్తం బేయు టుడుగు మీవు
రథసంస్థితుండ వేఁ బృథివీస్థితుండ ని,ప్పట్ల నేధించు టొప్పనివిధంబు
కాపురుషులు సేయుకార్య మియ్యది నీకుఁ, గాపురుషాచార మేపుగాదు

తే. దివ్య శస్త్రాస్త్ర వేత్తవు నీరవకుఁడ, వుత్తమక్షత్రియుండ వతూర్యార్జితుఁడవు

నీవు రణధర్మ విజ్ఞుఁడవ నెఱికి నైతి, ధర్మమును మీఱు టొప్ప దెంత లవి యైన.

వ. మఱియును. 360

చ. విరిదలవాని నాయుధము వీడినవాని వినష్టవస్త్రునిన్
శర ణనువాని బ్రాహ్మణుని శస్త్రవిహీనుని మ్రొక్కువానినిన్
విరథుని యాచకు న్విముఖు వీరులు పోరుల నేయ నొల్ల రో
వరమతి! నీవు ధీరవరవర్ణితవీరుఁడ వౌటఁ జెప్పితిన్. 361

తే. ఇంతియే కాని నీకు నీ కృష్ణునకును, వెఱచి కా దని యెఱుఁగు మీవిధము నాకుఁ
దల్లి గురుఁడును విప్రుండు ధరణి వీరి, వలన నైనది గాని మీ వలనఁ గాదు. 362

వ. అనుటయు జనార్దనుం డతని కి ట్లనియె. 363

క. హా హా! కర్ణుఁడ! నేఁటికి, నీహృదయము ధర్మమందు నిలిచెనె దిష్టా
పోహ మిది నీచు లెడరుల, ద్రోహము విధిఁ బెట్టి దూఱుదురు తమ దనరున్. 364

వ. ఆకర్ణింపుము. 365

సీ. విష మన్నమునఁ బెట్టి విషధరంబులఁ గఱ, పించి సోదరు నీట వేసినపుడు
జతుగృహంబునఁ బెట్టి జననితో నార్వురఁ, గొంచ కగ్నిం గాలి పించినపుడు
దుర్ద్యూతమున సిరుల్ దోఁచి రజస్వల, సభ కీడ్చి యవమతి సలిపినపుడు
పలువురు పోటరుల్ పట్టి బాలకు నొక్క, రునిఁ జేసి చాటునఁ దునిమినపుడు

తే. నీదుధర్మము నీతియు నీదుసత్య, మెందుఁ బోయెనో నో రెండ నేటి కిట్లు
ధర్మపన్నంబు లొలికెదు ధార్మికునకుఁ, బోలి ని న్నేఁ డెఱుంగఁడు చాలు కర్ణ. 366

క. నలుఁ డక్షవిజితుఁ డై కానలఁ బడియుం బిదప నరుల నలిపి విజయమున్
గలిగికొనినట్లు పాండవు, లలఁతులఁ గౌరవులఁ జంపి యందెదరు సిరుల్. 367

వ. అనిన సూతసూనుండు లజ్జావనతవదనుం డై నో రెత్త కత్తఱిఁ గటంబు లదర నౌ
దు గఱచి తత్తఱంబున వి ల్లెత్తి భల్లంబు లడరించె నపుడు హృషీకేశుండు గుడా
కేశుం గాంచి నీ వింక నుపేక్షింప కీక్షణంబున వీని నేలం గూల నేయు మనుడు
నతండు నోఁ గాత మని స్రోతోమార్గంబులఁ గ్రోధాగ్నిజ్వాలలు నిగుడ సూతసూ
తిదిక్కు మొగం బయ్యె నయ్యెడఁ గర్ణుండును. 368

సీ. బ్రహ్మాస్త్రమున బాణ వర్షము వరఁగించి, బండిక ల్లెత్తెదు పనికిఁ గడఁగె
నరుఁడు బ్రహ్మాస్త్రము నన దాని నుడిగించి, చిత్త జల్లుగఁ దూపు లెత్తి వైచి
పావకాస్త్రము కర్ణుపయిఁ బడ నేయుఁడు, నతఁడు వారుణమున నడఁచి దాని
జీమూతమునఁ జేసి చిమ్మచీఁకట్లను, మొంపించె దిక్కుల దళముగాఁగ

తే. మారుతాస్త్రమున న్మబ్బు మాయఁజేసి, విజయుఁ డలరారె దానికి విసివి వృషుఁడు
వానిఁ దునుమాడుతలఁపున వహ్ని వోలె, నెసఁగుశరమొక్కఁ డరివోసె నీసుఃజేసి.

చ. నహాగిరిసాగరాద్రిగను సర్వవసుంధర సంచలించె దు
స్సహముగ శర్కరానిలము సారెకు వీచె దెసల్ రజశ్చయో
ద్వహముల యయ్యె హా! యని దివంబున వేల్పులు తల్లడిల్లి రా
స్స్పృహ చెడి పాండవుల్ బెగడి రిట్లరి య మ్మరి వోసినంతటన్. 370

తే. కర్ణకరముక్తమైనయక్కాండ మపుడు, పుట్టలోఁ బడు పాము నట్టె వచ్చి
వచ్చి నరభుజాంతరమునఁ జొచ్చె నతఁడు, సోలెఁ జలియించి విలు జాఱఁ గేలనుండి.

చ. అది సమయంబుగాఁ గొని మహారథుఁ డావృషలుండు చక్రమె
త్తెద నని పూని రిత్తవడె దిష్టము దుష్టమ యయ్యెఁ గావునం
బదపడి కొంతలోఁ దెలిసి పార్థుఁడు ప్రాంజలికాశుగంబు కైఁ
బొదలఁగఁ జేసి కొన్నపుడు పూరుషసింహుఁడు కృష్ణుఁ డిట్లనున్. 372

తే. ఆలసింతకు మయ్యె వీఁ డరద మెక్క, కుండు నంతటిలో వీని గండడంచి
శిరము ఖండింపు మనుటయు, నరుఁడు వాని, వచనమునఁ జేసి వడి క్షురప్రమును బట్టి.

సీ. స్వర్ణముక్తామణి వజ్రపృష్ఠంబు న,నుత్తమశిల్పసంయుక్తతలము
తపనీయకలితచిత్రము చిత్రభానుప్ర,భాభాసమానము భారవహము
హస్తికక్ష్యాంచిత మమలార్కవర్ణము, సర్వలోకఖ్యాతసారయుతము
స్వర్ణ పుంఖము భవత్సైన్యజయాస్పద, మఖిలాభి ఘాతిభయంకరమ్ము

తే. సూతకేతువు లక్షించి చూప తెన్న, నేయుటయు నేటులో నరి యిఱిసి పడియె
నపుడు మనవారిదర్పముయశముప్రియము, స్వాంతములు గూలఁబడినట్టులయ్యెనధిప.

క. హాహాకారము సేయుచు, వ్యాహము లగునిదుర్ప్రియలు వోడిమి చెడి మం
దేహు లయి కర్ణజయనం, దేహమునన్ నిశ్చయంబు దెలిసిరి దానన్. 375

వ. అంతరయంబునం బేర్చి భీభత్సుండు. 376

—అర్జునప్రయుక్తంబగుశరంబునఁ గర్ణశిరంబు దెగుట—

మ. పురుహూతాయుధతుల్యవీర్యము జ్వల త్పూర్ణాంశుజాలాంచితం
బరుణాగ్నిప్రతిమానరూపము యమవ్యాత్తాననోగ్రాంగ మీ
శ్వరనారాయణచక్రసన్నిభము షడ్వ్యాజం బరత్నిత్రయో
త్తర ముత్తేజిత ముత్తమాంజలిక మస్త్రం బెత్తి మంత్రించుచున్. 377

క. సచరాచరజగమంతయుఁ, బ్రచలించెన్ ఋషులు స్వస్తి వలికిరి రణమం

దచలుఁ డయి కాలదండ,ప్రచురం బగునమ్ముఁ దొడుగు పార్థునిఁ గనుచున్. 378

వ. అట్లభిమంత్రితం బగునంజలికంబు నప్పాండవేయుండు గాండీవగుణంబునం దనుసంధించి ధనుష్టంకారంబు సేయుచు గాండీవంబు నుద్దేశించి. 379

ఉ. ఏ నియమవ్రతంబు వహియించి తపించినవాఁడ నేని నా
మానస మెప్పుడున్ గురుల మాన్యులఁ గొల్చెడునట్టిదేని సం
ధానము చేసినాఁడ మహితం బగుదివ్యశరంబు దీన నా
ప్రాణవిరోధి వీనిఁ దెగటార్చుతు గావుత దివ్యధన్వమా. 380

తే. అనుచుఁ దెగనిండఁ దిగిచి హుమ్మనుచు నార్చి, శత్రువధ మెంచి విడిచె నస్త్రంబు మృత్యు
వెసఁగ నొప్పునథర్వాంగిరసము నుగ్ర,విగ్రహం బైనకృత్యను విడిచినట్లు. 381

చ. అదియును భూనభోంతరము నంతర మింతయు లేక మంటలం
గదురఁగ జేసి మండుచు నఖండజవంబున నంబరంబు బి
ట్టదుముచు నార్చుచుం గదియ నైకను చుండెడునంతలోపలం
బాదివి ధనంజయారిగళముం దునుమాడె మహోగ్రభంగిగన్. 382

తే. సురవిభుఁడు వజ్రమున వృత్రుశిరము నట్లు, కవ్వడి నిజాంజలికమునఁ గర్ణుశిరముఁ
దునిమె నపరాహ్ణమునఁ గురుజనులు కుందుచుండఁ దనవారు సంతస మొందుచుండ.

మ. శరసంఛిన్నము రక్తసంభృతము భాస్వత్కుండలాలంకృతం
బురుదీప్తిస్ఫురితంబు కర్ణశిర మప్పుర్వీస్థలిన్ వ్రాలె న
చ్చరమాంద్రిమునుండి స్రస్త మగుచున్ సాంద్రారుణాత్మద్యుతుల్
తెరలన్ జండగభస్తిమండలము వార్ధిం గూలుచందంబునన్. 384

ఉ. అట్టియు నాఁడె యాశిమిపార్థములో నిలునెల్ల నెత్తురుల్
బెట్టి స్రవింప నార్చుచు గబ్బెలుదఁ గూలె నిలాతలంబునన్
జట్టుపలం బురందరుఁడు జర్జరితంబులు గాఁగ వజ్రపుం
బెట్టున నేయ గైరికసువిస్రుత మైసమహాద్రి యా యనన్. 385

వ. అప్పుడు. 386

క. ఇరువాఁగు యోధు లందఱుఁ, బరికించుచునుండ నంగపతిదేహమునన్
వరతేజ మొండు వెలువడి, పరిణతరవిలోనఁ జొచ్చెఁ బరమాద్భుత మై. 387

ఉ. పాతితుఁ డైనకర్ణుఁ గని పాండవసైన్యము సంకులూఁదుచో
శ్వేతహయుండుఁ గృష్ణుడును జిందము లొత్తిరి సోమకాదులున్
బ్రీతమనస్కు లై మురజభేరులు మ్రోయఁగ సింహనాదముల్
కౌతక మానహిల్లఁగ నఖండగతిం బొనరించి రేచఁగన్. 388

తే. సైనికులు తూర్యనాదముల్ సంఘటిల్లఁ, దెల్లముగఁ బుట్టములను విదిర్చికొనుచు
నప్పళించుచు భుజముల నంత నంత, నృత్యములు సేయుచును బొంగి రెంతయేని. 389

మ. వసుషేణాఖ్యుఁడు సాయకాంశువుల శేవ న్వ్రాల్గి బీభత్సకా
లసమావేశముకల్మి నస్తగతుఁడై లక్షింపఁగా నైనయ
ప్డు సమీరాత్మజుఁ డుల్లసిల్లి యెడ లుప్పొంగంగ బాహాస్ఫాళిం
చి సమీచీనగతిన్ జగం బద్రువఁ జేసెన్ సింహనాదార్భటిన్. 390

మ. అపరాహ్ణంబు పరార్థమందు నరశస్త్రాస్త్రప్రభిన్నాంగుఁడై
నృపతిప్రాణముఁ బోసి కర్ణుఁడు పడన్ వీక్షించి నీసైనికుల్
త్రప యింతేనియును లేనిదుఃఖమున సంత్రస్తాత్ములై బాణపా
తపరీతాంగులు గానఁ బాఱిరి వెఱం దర్కించి [illegible]. 391

క. ధరణీసురశాపము తన్మరణాంతము లేద యేమొ మహిఁ గ్రుంగినక
ర్ణరథం బెప్పటి యొప్పెం, దురగములకు వహనశక్తి తోడన కలిగెన్. 392

చ. రథికుఁడు కేతనంబు తెగి రాలుట మ్రాఁడయి యున్నతన్మహా
రథమున నున్న మద్రపతి రథ్యములన్ సవరించి మొండెమై
పృథివి నసృక్ప్రవాహమునఁ బెంపఱి క్రుంగిన యంగనాథునిం
బ్రథనపరాఙ్ముఖుం డగుచుఁ బాఱఁ గనుంగొని రాల్చె నశ్రువుల్. 393

మ. మనదుర్యోధనుఁ డస్త్రపూర్ణముఖుఁడై మ్రాగన్నుఁ గొన్నట్టు లుం
డి నితాంతార్తి మహాత్ముఁడై సుమనివాసిం బ్రీతిఁ బెన్నొత్తుటం
దను వాడం బడియున్నకర్ణుఁ గని సైన్యం బాస్యముం దున్నతిం
గొనఁ గన్నీరులు చాలువాఱ నొకచోఁ గూలె న్నిజాశ్వేర్వశన్. 394

—కర్ణవధానంతరము శల్యుండు దుర్యోధనుం గని సంభాషించుట—

వ. అట్లున్న సమయంబున మద్రేశ్వరుండు రథంబు దోలుకొని వచ్చి కంట నీరు
గ్రుక్కుకొనుచు గద్గదకంఠుం డై యిట్లనియె. 395

తే. కర్ణసూర్యుఁడు పాండవ గణమునందుఁ, దనప్రతాపాతపము గాచి సైన్యవనము
గాలగతి నొందె దాని కిగ్గతిని నీవు, జేల పై జాలి నొందుట పోలు. 396

ఉ. చూచితి నెన్నియో భయదసూచకముల్ సమరంబు లెందు నేఁ
జూచి యెఱుంగ నర్జునుఁడు సూతసుతుండు నొనర్చినట్టివి
ర్యోచితకార్యమై పొగడ నొప్పెడు నీసమరంబు సాటి రా
వో చెలి! ప్రాణికోటికి మహోగ్రమకాండము కల్పమట్లగున్. 397

క. వ్యాత్తాననుఁడై శమనుం, డత్తినగతి సూతసూతి యేస్తెల మెఱయన్

హత్తి పగఱ నేర్చె ననం, జిత్తము గడుఁ దత్తఱంబు జెందెడు నిపుడున్. 398

క. ఆతనివడికిఁ గా లోకులు, భీతిల్లిరి నాఁగ నేలఁ వృష్ణివరనరుల్
భీతిల్లి రేమి చెప్పెదు, నాతం డౌకప్రళయకాలుఁ డన నయ్యె ననిన్. 399

క. ఇట్టిఁడు కర్ణుం డైనం, గట్టిఁడి దైవంబుచేత గలిగినదానం
గిట్టించె నతని నర్జునుఁ, డట్టె మనుమా జెప్ప నేల యని యది యనదే. 400

శా. నీకార్యార్థము పూచి వచ్చి ధరణిం దీపించుభూపాలు రా
పాకారిప్రతిమానవైభవు లనిం బ్రాణంబు లాశింప కి
ట్లీకయ్యంబున నొద ఱ్రింగఁ బశిరో వీక్షింపు మీయంతకున్
లోకాతీతము దయ్యఁపుంజెయిది యేలో నీకుఁ జింతింపఁగన్. 401

క. అని చెప్పిన విని దుర్యోధనుఁ డంతయు మనమునంను దా సరసియు స
జ్జనకుం బోలె విసంజ్ఞుం,డును దీనుఁడు నార్తుఁ డై కనుంగడు నూర్చెన్. 402

వ. అనిన విని ధృతరాష్ట్రుండు సంజయునిదిక్కు మొగం బై కర్ణుండు వడినపదంపడిఁ గురుపాండవు లెవ్విధంబునం బ్రవర్తిల్లిరి చెప్పు మనిన నతం డతని కిట్లనియె. 403

సీ. కర్ణుండు దెగినంతఁ గౌరవుల్ దేవదత్తారావమాలించి యడలు గుడిచి
కడలిమధ్యమ్మునఁ గల మవియం బేరు, లట్లు సింగముఁ గన్నహరిణము లటు
శృంగముల్ విఱిగినవృషభంబు లట్లును, భగ్నదంష్ట్రము లైనపాము లట్లు
చెయ్వులు దక్కి వాసిం బాసి విత్రస్తు, లై జాఱఁ గవచంబు లాత్రపడుచుఁ

తే. పార్థుఁడో భీముఁడో వచ్చి పడుసు రనుచు, వెఱఁగుపాటున నటు నిటు బెగడి కనుచు
సర్పసంకీర్ణవనమందు సాఁతుఁ బాసి, నట్టిపాంథులు నాఁ బాఱి రనిఁ దొలఁగి. 404

వ. లోకం బంయుఁ బార్థమయంబు గా నాలోకించుచు నట్లు భయోద్రేకంబునం జేసి పఱచునిజసైనికులం గాంచి సుయోధనుండు సారథిం బిలిచి చూచితే మనమూఁక పార్థునిం బ్రతిఘటింపం జాలక భయార్దితం బై పాఱుచున్నది నే నిప్పుడు కృష్ణార్జునవృకోదరులం దొట్టిపాండవపక్షపాతు లగుశాత్రవులం దెగ నేసి మిత్త్రం బగుసూతపుత్త్రుని ఋణంబు దీర్చెదం గాక రథంబు వోవని మ్మనిన నతం డట్లు చేయుటయు నంతఁ బంచవింశతిసహస్రపాదాతవ్రాతంబును బెక్కువేలరథమాతంగతురంగంబులును వానికిం బాసట లై పోవుటయుం గని భీమసేనధృష్టద్యుమ్నులు చతురంగబలసమేతు లై చని వారిమార్కొనినం బోరు ఘోరం బయ్యె నయ్యెడ. 405

—కురుబలంబు భీమార్జునులబాఱి నిలువ లేక విఱిగి పఱచుట—

చ. అరదము నెక్కి నేల నగునట్టిరఁ గిట్టుట పాడిగా దటం
చరదము డిగ్గి భీముఁడు గదాయుధముం గొని సాలువంబునాఁ

దిరుగుచు నొక్కవ్రేల్మిడి మథించి మథించి వధించి నొంచె న
య్యొకవదినైదువేలజను లింతటిలో నశియించి రెంచఁగన్. 406

సీ. గాండీవి గాండీవకార్ముకనిర్ముక్త, కాండంబుల రథాళి గండడంచె
మాద్రేయసాత్యకుల్ మార్కొని శకునిరాజపుత్రుల నందఱఁ గూల్చి రతులశక్తి
ద్రౌపదేయులు చేకితానశిఖండులు, చేతఁ జిక్కినవారిఁ జెండి రేచి
పార్షతుండును భీమపరిసరవర్తి యై, వానితో నేటునఁ బాలు గొనియె

తే. విఱిగి మనసేన వెన్నిచ్చి పఱపఁ జొచ్చె, నపుడెలుం గెత్తి నీపుత్త్రుఁ డగునె పఱవఁ
బఱచి మీ రెడ్డఁ జావక బ్రదుకఁ గలరె, మరలుఁ డేఁ గలనరిసేన మాఱుకొందు.

ఉ. మిత్త్రికి డాగి యుందు మని మీరు దలంచుచు బోవఁ జొచ్చినన్
మిత్త్రికి నెత్తు వచ్చి మిము మీఁదట భీముఁడు వోవనిచ్చునే
మిత్త్రయశస్కరం బగును మీకు రణంబున మాఱుకొందు నే
నిత్తఱి నల్పసత్త్వు లగుకృష్ణులఁ ద్రుంచి జయంబు గాంచెదన్. 408

వ. అని నీకొడు కెంత చెప్పినను గాఢవిక్షతులు గాన మహీక్షితు లెల్లరును వాని
మాట పాటింపక పాఱం జొచ్చి రప్పుడు శల్యుండు దుర్యోధనుం జేర నరిగి యి
ట్లనియె. 409

సీ. పాఱఁ జూడుము రాజ! భండనావని యెల్ల, వైతరణిం బోలె వఱలుచుండెఁ
జతురంగబలగాత్రశకలంబులును ఛత్ర, చామరధ్వజశస్త్రశకలములును
వేలకు వేలయి పోలింప రానివై, కుప్పలై తిప్పలై కూడికొనియె
రక్తప్రవాహంబు వక్త్రమై ప్రవహించె, మృతకళేబరములు మీఁద నెక్కి

తే. స్వర్ణరత్నవిరాజితచారుమకుట, కవచకుండలాదివిభూషణవరరజము
రేఁగి సాంధ్యరాగభ్రమ రెక్కొనంగఁ, జేసె వీక్షింపు మయ్య యోక్షితితలేశ. 410

క. ఈరౌద్రముహూర్తమునన్, భూరిరజోరక్తపుంజభూషిత యగునీ
ధారణి ఘనరక్తాంబర, ధారిణి యగుతరుణి వోలెఁ దనరఁగ నయ్యెన్. 411

తే. కటకటా! కంటివే రాజ! కర్ణుఁ డిపుడు, గాండివచ్యుతశరసక్తగాత్రుఁ డగుచుఁ
గూలి నెత్తుటివఱ్ఱునఁ దేలుచుండి, యును దివాకరుగరిమఁ గన్గొనఁగ నయ్యె. 412

వ. అని చెప్పి దివాకరుండు నస్తమింపఁ బోవుచున్నవాఁడు గావున నేఁటి కీకయ్యంబు
సాలించి సైన్యంబు మరలించి శిబిరంబులకుం జను టుచితం బనుచున్నంతఁ గృపకృప
వర్మాశ్వత్థామసౌబలసుశర్మప్రముఖులును వచ్చి రారాజు నాశ్వాసించి శ్వేతాశ్వ
ధ్వజప్రజ్వలనంబుం బ్రతీక్షించుచుం జని రంత నంతరిక్షచరు లగునిర్జరులును గృష్ణార్జును
లం బ్రశంసించుచు స్వర్గంబునకు నిర్గమించి రనంతరంబ. 413

—కర్ణాస్తమయవర్ణనము.—

మ. ఖగవిద్ధం బయి రక్తసిక్త మగుచుం గప్పట్టుకర్ణాంగ మ
మ్మొగి రంగస్థలి ధూళి గ్రుంగి పడుటం బోలించి భక్తప్రియుం
డగుభానుం డరుణప్రభాభరితుఁ డై స్వాంశూన్నతిన్ ముట్టుటం
దగ నీరాడఁగ నో యనం జనె సముద్రప్రాంతముం జేరఁగన్. 414

చ. అరదము గ్రుంగి శస్త్రములు నస్త్రములున్ స్ఫురియింప కార్ముఁ డై
తిరపడ కున్న కర్ణ సముదీర్ణపగాత్రము సవ్యవాజ్ని ధీర్
దురమునఁ జంపెఁ శార్ఙ్గుఁ డని యోరపుఁ గిన్క ఖగుండు గాంచె నా
నరుణిమ దోఁచ నాకసమునందు సమంతత మాక్రమించు మన్. 415

తే. దాననిరతుఁడు ధర్మాత్ముఁ డైనవాఁడు, కొడుకు చచ్చినశోకంబు గుడిచి కుడిచి
దైవహతి నీగ్గె ననుచు వాపోవ ననఁగఁ, గొసరి యూర్పుచు ద్విజకోటి గూళ్లు సేరె.

సీ. అపుడు జీవించినయట్టు లున్న కర్ణుని, బడికిరాచి భూపతుల్ భయము నొందె
నమలభూషణభూషిత మగునాతనిమోము, పూర్ణచంద్రద్యుతిం బోలుపు మిగిలెఁ
గనకభూషాంబరకలితదేహుఁ డతండు, చివురు వెట్టినచెట్టుచెలువు గాంచె
నరునిబాణాబ్దమునను జ్వలించుట మాని, నృపుఁ డాఱునగ్నినా నరయ నయ్యె

తే. నర్థిపక్షిసమూహకల్పావనిజము, లేదొసంగుట కనుమాట లేనివాఁడు
తనదుసర్వస్వమును విప్రతతి కొసఁగిన, ఘనుఁడు తా నట్లు తెగి పడెఁ గాలవశత.

తే. కర్ణుతల భారతం బని నిర్ణయించి, వేని నమ్మి నీతనయుఁడు వేర మిట్లు
పెట్టుకొనియెనో నేఁడు నా నట్టిమేటి, పోకడం గాంచె మీయాశఁ బోకడంచి. 418

వ. అట్లు కర్ణుండు వడినప్పుడు ప్రభాకరుం డస్తమించె నేఱులు పాఱకుండె బుధగ్రహ
మ్మర్కవర్ణంబు గలిగి తిర్యగ్జ్వలనంబు నొందె బృహస్పతి రోహిణిం బీడించె నభం
బు వ్రేలినట్లు తోఁచెఁ బరుషవాయువులు వీఁచె భూమి కంపించె దిగ్దాహంబు దీపిం
చె నర్ణవంబులు ఘూర్ణిల్లె నుల్కాపాతంబులు ప్రస్ఫీతంబు లయ్యె నిశాచరభూతం
బులు సంప్రహృష్టంబు లయ్యె మఱియు ననేకోత్పాతంబులు భూతంబునఁ బొడ
కట్టె నంతరిక్షంబున దేవతలు హాహాకారంబు గావించి రప్పుడు నరనారాయణు లి
ద్దఱును భూమ్యాకాశంబులు మాఱుమ్రోయ దేవదత్తపాంచజన్యంబు లొత్తిరి నీ
సైనికు లెల్లరు నాస్వనంబు విని విత్రస్తులై సుయోధనాదులం బెట్టి చెట్టొకఁడు వట్టి
రట్లు తనబలంబు క్షతవిగ్రహంబై కాందిశీకం బగుటం గాంచి నీసుతుండు శల్యాను
మతంబున సేనలం దివియింపఁ బంపుటయు నవశిష్టనారాయణగోపాలపరివృతుం డై
కృతవర్మయు గాంధారసహస్రపరీతుం డై శకునియు నాగానీకపరివేష్టితు లై కృపా

శ్వత్థామలును సంశప్తకావశిష్టసమన్వితుం డై సుశర్మయు హతశేషు లయినదుర్యో
ధనాదికురుకుమారులును మ్రోడువడి యున్నరథంబు దోలుకొని శల్యుండును ద
క్కునుంగలసైనికులును భయశోకంబు లినుమడింప వేపమానులును విచేతస్కులు
నయి కొంద ఱర్జునుం బ్రశంసించువారును గర్ణు నగ్గించువారును విధివిధానం బను
ల్లఘ్యం బనువారును ధనదారరాజ్యంబుల నిరాశం జెందువారును బాండవుల నింక
జయించు టరిది యనువారును నై యున్నవారి నెల్ల దుఃఖాక్రాంతచిత్తుం డగుదు
ర్యోధనుం డుపశమిల్లం జేయుచు విడిదలకుం బుచ్చి తాను దనశిబిరంబునకుం జని
శోకసాగరమగ్నుం డై యుండె నంత నక్కడ. 419

ఉ. అంజలిశాస్త్రఘాతమున నావసుషేణుఁడు గూలినంత వి
శ్వంజయుఁ డైనకేశవుఁడు వాసవిఁ గౌఁగిటఁ జేర్చి గాఢయు
త్సంజనకోర్మిఁ మదికి సంతసము న్మొలపించుచుం బ్రియ
వ్యంజకపూర్వకంబుగ యథార్థవిధంబునఁ బల్కె విస్ఫుగన్. 420

శా. వృత్రుం ద్రొల్లి మహేంద్రుఁ డాహవమున న్వేటాడిన ట్లీవు నేఁ
డాత్రం బందక డింద కీవృషలవంశాచారునిం గూల్చి తా
వృత్రుం జీల్చుట కర్ణుఁ గూల్చుటయు నుర్విం దుల్యరూపంబుగా
స్తోత్రంబు ల్పచరింతు రెల్లపుడు నీశూరత్వ మగ్గించుచున్. 421

ఆ. నీపరాక్రమంబు నీసారు నీలావు, తేటపడెడురీతి మేటి వైన
కర్ణవధము దెలిపి ఘనుఁడు ధర్మజునకు, నప్పు డీన్సుకొనుట లొప్పు నీకు. 422

ఉ. రేలు బవల్లు కర్ణవధరీతియె చేతమునం దలంచుచుం
బోలనిశోకలం బడుచుఁ బొక్కుచునుండు నతండు నేఁడు నీ
యాలముఁ జూడ వచ్చియు శరార్దితగాత్రుఁడు గాన నుండ లే
కేలిద మైన నేగెఁ దనయింటికి వెంటన నీవు గంటివే. 423

—కృష్ణార్జునులు ధర్మరాజుపాలికిం జని కర్ణమృతిం దెలుపుట—

వ. అనుడు నర్జునుం డట్ల యగుం గావుత మనుటయు నతండు రథంబు మరలించి ధృ
ష్టద్యుమ్నయుధామన్యులను భీమసేననకులసాత్యకులం బిలిచి మే మిదె ధర్మరాజు
నకు నంగరాజవధం బెఱింగింపఁ బోవుచున్నవారము మీరిందుఁ గలచందం బెల్లఁ
జూచుకొని లేచిరం డని చెప్పి యప్పుడ కదలి రాజసదనంబునకుఁ బార్థసహితుం
డయి పోయి కాంచనశయనోత్తమంబున శయించినవానిం గాంచి వానిపాదారవిం
దంబులకుఁ దానును దనమిత్త్రుండును నభివాదనంబు గావించుటయు నతండు వారి
హర్షోత్కర్షం బుపలక్షించి రాధేయుండు హతుండ కాఁ దలంచిహర్షాస్రుపూర్ణలోచనుం

డై లేచి వారిం బిగియారఁ గౌఁగిలించుకొని మించినవేడ్కఁ నాదరించె నం
తఁ గౌంతేయావరజసహితుం డగుగోవిందుండు మందస్మితసుందరవదనారవిందుం డై
చేతులు దోయిలించుకొని యి ట్లనియె. 424

మ. మనభాగ్యమ్మున నిమ్మహారణమునన్ మాఱొడ్డి గాండీవి క
ర్ణునిఁ గాలక్షయ మందఁ జేసె నిపు డాక్రూరోత్తమాంగంబు మే
దినిపై వ్రాలెఁ దదీయరక్తమునఁ దృప్తిం గాంచె నీభూతలం
బని నేకీడును బొంద రీవు మఱి నీయాత్మీయులు న్వింటివే. 425

మ. చరితం గృష్ణఁ బరాభవించి సభలోఁ గాఱుల్ ప్రసంగించి మీ
కరి యై యెగ్గులు పుట్టఁ జేసినఖలుం డాసూతపుత్త్రుం డనిన్
శరపూర్ణాంగకుఁ డై శయించె ధరణీచక్రంబుపై నేఁ డనం
తరకర్తవ్యము సూడు మీవు దొర వేతద్భూమిభాగంబునన్. 426

వ. అనినం బరమానందభరితాంతరంగుం డై కుంతీపుత్త్రుం డాదేవకీపుత్త్రుం గాంచి యి
ట్లనియె. 427

చ. ఇది యొకవింతలోని దన నేమిటి కోమహితాత్మ! మాకు నె
య్యదనునఁ గూర్చు నేఁడుగడ వైనపుడే భవికంబు లన్నియుం
గదిరెడు నీవు సారథివి గా నెద నియ్యకొనంగఁ గాదె యి
క్కదనమునన్ జయంబు గొనఁ గల్గె ధనంజయుఁ డేల చెప్పఁగన్. 428

ఆ. అనఘ! నీయనుగ్రహమునకు నీనిగ్రహమున కెందు నేని యడ్డు గలదె
యీవు దలఁచితేని యెంత లెంతలు నైన, సమకుఱెడు నటంచుఁ జదువ నేల. 429

వ. అని వానికేలు కేలం గీలించి కృష్ణార్జునులం దిలకించి. 430

మ. అరయన్ మీరు పురాణమౌనివరు లుద్యత్తేజు లై యొప్పున
న్నరనారాయణు లంచు నారదుఁడు మున్వాక్రుచ్చె వ్యాసుండ మీ
పరగాథల్ వచియించెఁ బెక్కుపరు లో వైకుంఠమూర్తీ! భవ
త్పరమానుగ్రహమే ధనంజయజయప్రాప్తిప్రధానం బగున్. 431

ఆ. ఇట్టినీవు గలుగ నెపుడు మాకు జయంబు, యగును గాని కాద యపజయంబు
నీదుబుద్ధిమహిమఁ గాదె భీష్మద్రోణముఖ్యు లెల్లఁ బడుట మురవిదారి. 432

వ. అని పలికి పొలికలనం బడినకర్ణుం గాంచ నెంచి తదనుమతంబు వడసి కాలవాలంబు
లును శ్వేతాంగంబులు నగుతురగంబులం బూన్చినశతాంగం బెక్కి కృష్ణార్జునసహి
తుం డై కరదీపికాసహస్రంబులు వెలుంగ నిజపరివారంబు పరివేష్టింపం గదలి కయ్యం
పునేలకుం జని కేసరావృతం బగుకదంబకుసుమంబు పోలె శరశతాంచితుండును

విచ్ఛిన్నకవచుండును విభిన్నగాత్రుండు నగునాసూతపుత్రుకళేబరంబు సారెకుం జూచి సంజాతప్రత్యయుండై తన్నవ్వాడు వెండియుం బుట్టినవానిఁ గా మానసంబునం దలంచి వాసుదేవార్జునుల నెంతయుం బ్రశంసించి కృష్ణుం గాంచి. 433

సీ. ఓజనార్దన! యిప్డు రాజనైతిని నేను, నాతమ్ములును నీదు ప్రాపువలన
సామ్రాజ్యసుఖ మందఁ జాలి కృతార్థుల, మైతిమి లోకంబు రీతి గలుగ
నతిమాని యగుసూతసుతునిమృతి న్విని, ధార్తరాష్ట్రుఁడు జీవితంబునందు
రాజ్యంబునందు నిరాశుఁడై పోయెడు, నని నేఁ దలంచెద నంతరాత్మ

తే. నేను గనునిండఁ గూర్కును గానకయుత్ర, యోదశాబ్దము లెట్టేటులో కడపితి
నేఁడు సుఖనిద్ర చేసెద నీప్రసాద, గరిమయే దీని కంతకుఁ గారణంబు. 434

వ. అని ప్రశంసించుచున్నసమయంబున భీమసేననకులసహదేవులును సాత్యకిధృష్టద్యుమ్నశిఖండి ప్రభృతులును వచ్చి సముచితాలాపంబుల నయ్యుధిష్ఠిరునకు హర్షోత్కర్షం బాపాదించి వాసుదేవార్జునుల గీర్తించి వారునుం దామును సంతోషాయత్తచిత్తంబులు హత్తుకొన సేనాసమూహంబుతోఁ శిబిరంబులకుం జని రని సంజయుండాంబికేయుం గాంచి వెండియును. 435

క. నీవలన నిన్నిచేటులు, గావలసిన వయ్యె నీవ కారణ మైతో
భూవర ! వగచిననిప్పుడు, పోవునె ఫల మనుభవింపఁ బోలదె నీకున్. 436

వ. అని కర్ణవధప్రకారం బంతయు సవిస్తరంబుగ నెఱింగించె నని వైశంపాయనుండు వెండియును. 437

మ. అరుణాబ్జానిలవహ్నియాజ్ఞికము దైత్యారాతిరూపంబు భా
స్వరమోక్షప్రద మీమహాహవము విశ్వం బెన్నఁ గృష్ణార్జునుల్
పరఁగం జేసిరి భూతలంబునను మున్ బ్రఖ్యాతి కెక్కంగ భూ
వర! తద్భావన సర్వయజ్ఞఫలముం బ్రాపింపఁ జేయుం జమీ. 438

చ. ఇది వినినం బఠించిన నహీనయశంబు ధనంబు ధాన్యమున్
సదమలవైభవం బఖిలసౌఖ్యములుం జిరజీవితంబునుం
గదురు నిహంబునం బొదలఁ గల్గి యనంతరమందు ముక్తిసం
పదయును బొందు భక్తుఁ డగువాఁడు త్రిమూర్తు లనుగ్రహించుటన్. 439

నర్కుటము. ద్విజుఁడు పఠించి దీని శ్రుతిదివ్యఫలంబును బా
హుజుఁడు పఠించి సత్యమును యుద్ధజయంబును నూ
రుజుఁడు పఠించి భూరితరరుక్మచయంబును బా
దజుఁడు పఠించి సౌఖ్యమును దక్కఁగొనున్ ధరణిన్. 440

క. అని కర్ణపర్వ మంతయు, జనమేజయమనుజపతికి సాత్యవతేయో
  క్తినిరూఢిఁ వైశంపా,యనమానీంద్రుండు వినిచె నని చెప్పుటయున్. **441**

వ. నైమిశారణ్యవాసు లవ్వలివృత్తాంతంబు నెఱ్ఱవ మని సూతు నడుగుటయును. **442**

—ఆశ్వాసాంతము—

ఉ. తొల్లిట నే నొనర్చినద దోషమ మైనను దత్ఫలంబు సం
  ధిల్లఁగ బుత్రశోక మనుతీవ్రదవానలకీల వెట్టి నా
  యుల్లముఁ గాల్చివైచితి వయో యిఁక నైనను బుండు మానఁగాఁ
  జల్లనిమందు వేసి వెతఁ జాల్పడఁ జేయవె సర్వరక్షకా. **443**

క. శ్రమకోర్వఁ జాల భవబంధము వాపి భవత్పదాబ్జదర్శనమున నా
  కమితానందసుఖ మొసంగుము నే నీపాదసేవకుఁడ నో దేవా. **444**

మాలిని. నిరుపమగుణభూషా నిత్యసత్యప్రతోషా
  వరకలితమనీషా వాసుదేవాదివేషా
  సరసమధురభాషా శాసితాత్మీయదోషా
  భరితజగదశేషా భవ్యతేజోవిశేషా. **445**

—గద్యము—

ఇది శ్రీమద్రఘునాథనాభయాంకవిమిత్ర, వేంకటయజ్వాగ్రపుత్ర,
సమారాధితవిబుధరాజ, శ్రీపాదకృష్ణమూర్తికవిరాజ
ప్రణీతం బయిన శ్రీకృష్ణభారతంబునందుఁ
గర్ణపర్వంబున సర్వంబును.
జతుర్థాశ్వాసము.

శ్రీ శ్రీ శ్రీ శ్రీ శ్రీ

---

మ. భృగురామార్తమహాస్త్రశస్త్రవిభవావిర్భూతబాహాబలుం
  డగువైకర్తనుకారణంబునను బేరై యజ్ఞతుల్యంబు నై
  జగతిం బొల్చినకర్ణపర్వమును శశ్వద్గద్యపద్యంబులన్
  దగునాంధ్రంబునఁ గృష్ణమూర్తికవి సంధానించె నంచస్మృతిన్.

---

# శ్రీకృష్ణభారతము

## శల్యపర్వము - ప్రథమాశ్వాసము.



మత్కౌశికమునిసు
త్రామాన్వయమందు శంకరమతస్థుడ నై
ప్రామాణికుఁ డగునాకున్
నీమహిమం బెఱుఁగు తెఱుఁగు నేర్పవె తండ్రీ ! 1

వ. అక్కథకుండు శౌనకాదిమహామునుల కిట్లనియె నట్లు కర్ణుండు వడినపదంపడి నల్పా
వశిష్టం బగుబలంబుం గూర్చుకొని సుయోధనుం డేమి చేసె మాపూర్వులచరిత్ర
మెంత విన్ననుం దృప్తి గలుగ దయ్యెం గావున సవిస్తరంబుగ నెఱింగింపు మనిన
జనమేజయునకు వైశంపాయనుం డిట్లనియె. 2

సీ. జననాథ! రాధేయుఁ డనిమొనం బడినంత, మునిఁగి శోకార్ణవమున నృపుండు
హాకర్ణ! హాకర్ణ! యని మాటి మాటికి, వాపోవుచును బరివారశేష
మంటి రా విడిదల కరిగి సుహృత్సమా,శ్వాసితుం డయి కొంత శాంతి నొంది
భాగధేయము బలవత్తరం బని భవి,తవ్యముం దలపోసి ధైర్య మూఁది
తే. ప్రధననిశ్చయ మొనరించి బాహుశాలి, శల్యు సేనాపతిగఁ జేసి శల్యమందు
మిగిలి యుండినమూఁకతోఁ దగిలి యనికిఁ, జేరి పోరాడె నెంతయు ఘోరముగను.

ఉ. శల్యుఁడు శత్రురాడ్హృదయశల్యుఁడు శల్యము గోలె రెండుజాల్
శల్యపరంపరన్ విమతసైన్యము దైన్యము నొందఁ జేసి సా
కల్యము పేర్పడం దనకుఁ గల్గిననల్గురు వ్రేళ్లఁ దాను వై
కల్యము దోప భూపశరఖండితుఁ డై పడె నేమి చెప్పదుర్ణ. 4

సీ. అంత దుర్యోధనుఁ డనిపని సాలించి, హతబంధు వగుట భయంబు గుడిచి
వడిఁ బాఱి కడ నొక్కమడువునం బడి డాఁగె, డాఁగినఁ బాండవుల్ డాయ నరిగి
పరుసంబు లాలుకుచుఁ బరిపరిఁ బిలువంగ, వెలివచ్చి వడముడివలకుఁ దిరిగి
తఱుఁగనిపగ వట్టి తవిలి పోరుచు వాని, గదఁ ద్రెళ్లిపడె సంజ గదరి నంతఁ

తే. కృపుడు కృతవర్మ గురుపుత్రుఁ డపుడు రేయి, యరుగుఁ బాండవశిబిరంబు లందుఁ జొచ్చి
పాండుపాంచాలమత్స్యప్రభద్రకాది, సర్వసైనికులం జంపి రార్వ నార్వ. 5

వ. అంత సమ్మఱునాఁ డరుణోదయంబున సంజయుండు దుఃఖశోకసమన్వితుండు దీనాననుండు నై కురుక్షేత్రంబునం దుండి కరిపురంబున కరుదెంచి. 6

—సంజయుండు సమరభూమినుండి వచ్చి యుద్ధవృత్తాంతముచెప్పుట—

చ. కనుఁగవ నశ్రుపూరములు గాలువ గట్టఁగ నూర్ధ్వబాహుఁడై
కనుకనిఁ గాళ్లు దొట్రువడ గద్గదకంఠము మీఱఁ జేరి హా
జననుతనామ! హా నృపతిసత్తమ! హా ధృతరాష్ట్రనందనా!
పోనుపఱి పోయితే తనువు వోయిన నీవును గాలనిర్మితిన్. 7

తే. అకట నీ పోక మే మెల్ల నల్లతల్లడంపడఁగ నైతి మే మనుటకును నోరు
రాకయున్నది శక్రపరాక్రములకుఁ, జావు తప్పనిదయ్యె హా దైవబలము. 8

ఉ. అగ్గతి నార్తనాదముగ నప్పురవీథిని వచ్చుసంజయున్
దగ్గఱి చూచి భూవిభుఁడు తానును దమ్ములు నెల్లభూభుజుల్
మ్రగ్గుట లాలకించి నగరప్రజ లెల్లరు నుల్లము తల్లడిల్ల గాఁ
దగ్గనిదుఃఖభారమున దద్దఱి యేడ్చిరి చెయ్వు దక్కఁగన్. 9

వ. అట్లు పురం బంతయు సముద్రఘోషంబు వలె నార్తఘోషంబు నిండుకొనుచుండు నంత సంజయుండు దీనవదనుండును వివశుండు నై నృపతిక్షయంబుఁ జేరం జని లోపలికొలువుకూటంబున గాంధారియుం గోడండ్రును సుహృదులును హితులును జ్ఞాతులును విదురుండునుం బరివేష్టింపఁ గర్ణనిధనంబునకుం దురపిల్లుచున్న ధృతరాష్ట్రు నింగని బాష్పగద్గదకంఠుం డై తన్నెఱింగించి నమస్కరించి వెక్కి వ్రెంగుచు నిట్లనియె.

సీ. శల్యుండు హతుఁ డయ్యె శకునియుఁ బెగటారె, గీటడంగె నులూకుఁ డేటులోన
సకలసంశప్తకుల్ సమసిరి కాంభోజ, శకయవనమ్లేచ్ఛసైన్య మాఱెఁ
బార్వతీయులతోడఁ బ్రాచ్యులు దాక్షిణాత్యు లుదీచ్యులును బ్రతీచ్యులును దెగిరి
మఱియునుం గలరాజమండలియును రాజ, నందను లందఱు స్రుంది రాజి

తే. నకట భీముఁడు చెప్పినయట్లు వాని, పృథుగదాదండమునఁ దొడల్ విఱిగి నీదు
కొడుకు దుర్యోధనుఁడు నేలఁ గూలి పెలుచ, ధూళిదూసరితాంగుఁ డై త్రుంగె నధిప.

వ. మఱియు ధృష్టద్యుమ్నుండును శిఖండియు నుత్తమౌజుండును యుధామన్యుండును మున్నగు ద్రుపదపుత్త్రులును బాంచాలప్రభద్రకచేదిప్రముఖసైనికులునుం బొలిసిరి నీపౌత్త్రులగు ప్రతివింధ్యాదు లేవురును నిహతు లైరి రథహస్తిపత్తితురంగచతురంగబలంబు లన్నియు గీటడంగె నుభయస్కంధావారంబులును బాడుపడ దయ్యెఁ గాలవశంబున

జగం బంతయు వనితావశేషం బయ్యె మనపదునొకండక్షౌహిణులలోఁ గృపకృతవ
ర్మాశ్వత్థామలు మువ్వురును వారియేడక్షౌహిణులలో ధర్మరాజభీమార్జుననకులసహ
దేవవాసుదేవసాత్యకు లేడ్వురును నీసుతుం డైనయుయుత్సుండును శేషించి యు
న్నవారు తక్కనుం గలవా రందఱు దుర్యోధనునినిమిత్తంబున మిత్తివాతం బడి
రని చెప్పుటయు నాక్రూరవచనంబు విని ధృతరాష్ట్రుండు గతసత్వుం డై సత్వరం
బున నేలం బడి మూర్ఛిల్లె విదురుండు శోకవ్యసనకర్శితుం డై పుడమిం బడియె గాం
ధారి లోనుగాఁ గౌరవకులాంగన లవ్వాఁడిపలుకులు విని నేలం గూలి విచేష్టి
త లై చిత్రరూపంబులం దాల్చి రంతఁ గొంతవడి కతిప్రయత్నంబున నాంబికేయుండు
లబ్ధసంజ్ఞుం డై లేచి నలుగడఁ జూచి నట్లు మొగంబు ద్రిప్పి పుత్త్రశోకసంతప్తచి
త్తుండు గావున విదురుం బిలిచి దీనస్వరంబున ని ట్లనియె. 12

తే. పుత్త్రహీనుఁడ నొక్కఁ డంతమాత్ర మేని, లేక యుండిన నీవుఁడ నాకు నింక
నీవ గతి వైతి తమ్ముఁడ! నే నిఁ కెట్లు, తెర్చుకొనువాఁడ నగుదునో దేహయాత్ర.

వ. అని పలికి పయిపయిం గ్రమ్ము విషాదభరమ్మున వివశుం డై మఱియు మహీతలంబు
నం బడుటయు బంధుజనం బెల్ల శీతలజలసేచనంబునను శిశిరవ్యజనవీజనంబులను
సేద దేర్చిన నతండు పెద్దయుం బ్రొద్దునకుఁ జెప్పితెల్లి పుత్త్రవ్యసనకర్శితుండు గావు
నఁ గుంభనిక్షిప్తపన్నగంబుచందంబున రోఁజుచు నూరకున్నం గని సంజయుండును
గాంధారీప్రభృతిస్త్రీజనంబును రోదనంబు గావించ నంతఁ గొంతవడికి నవ్విచిత్రవీ
ర్యాత్మజుండు విదురుం బిలిచి. 14

—ధృతరాష్ట్రుఁడు శల్యాదులమృతి విని దుఃఖించుట—

ఆ. మనము వశము గాదు మానిను లెల్లరు, నంతిపురి వసించునట్టులు తమ
తమనివాసములకుఁ దరలంగఁ బలుకు మీ, వని వచింప నతఁడు నట్లు చేసె. 15

క. తనయునిచావున కేడ్చెదు, జనవల్లభు నెదుటఁ గాంచి సంజయుఁడు కడుఁ గ
నుఁగొనలఁ నశ్రు లొలుకఁగ, వినిపింపఁగ నున్నఁ దేర్చె విదురుఁడు వానిన్. 16

వ. అంతఁ గొండొకసేపున కవ్విచిత్రవీర్యాత్మజుండు చిత్తంబునఁ బుత్త్రశోకానలంబు
దఱికొన మాటిమాటికిం ధూమంబు వోని నేఁడినిట్టూర్పు నిగుడం జేతులు విదిర్చు
కొనుచు సంజయు దిక్కు మొగం బై. 17

సుగంధి. ఎంతకష్ట మెంతకష్ట మేవు రాపృథాసుతుల్
కొంత యైన నొవ్వఁ గల్గికోరు చాన రంచు నీ
వింతమాత్రఁ జెప్ప వింటి నెల్లి రాజపుత్త్రు ల
య్యంతకక్షయంబుఁ జేరి రయ్య! యేమి చెప్పఁగన్. 18

క. కొడుకులు నూర్వురు చెగుటం, బెడిదంబుగ వినియు నిపుడు పెక్కు పటియ లై
చెడని దగు నాదుహృదయము, కడిమిన్ వజ్రమున నయ్యెఁ గదె సూతసుతా. 19

ఉ. చీఁకయి నేను బుత్రకులఁ జెందియు రూపనిదర్శనంబు లోఁ
జేకొనలేక పోయినను జిన్నెలు వన్నె లెఱుంగ కుండినన్
వాకుల నాలకించుటలు వారలబాల్యవయోవిలాసముల్
నాకుఁ గడుంగడుం బ్రియ మొనర్చెడు నట్టివ యయ్యె నయ్యయో. 20

ఆ. అట్టికొడుకు లెల్ల నిట్టయి రని విన్న, యుల్ల మిపుడు తల్లడిల్లు చుండెఁ
దలఁపు రాఁగ నెల్లఁ దహతహ వొడమెడు, నింక నాకు శాంతి యెట్లొ చెపుమ.

వ. అని దుర్యోధనుం దలంచుకొని. 22

సీ. నాతండ్రి! రావోయి నన్నుఁ గౌఁగిటఁ జేర్చ, మీాయమ్మ మిడికెడు మేరలేక
మాకు ది క్కెవ్వరు రాకుమారక! మే మిఁక, కేగతిఁ బోవుదు మెఱుఁగఁ జెపుమ
పృథివీపతుల నెల్ల విడి యొంటిఁ గున్నపాలు, నట్లు భూతలమునయందుఁ బడితె
చీఁకుల మగుమాకు నీకంటె గతి లేదు, ముదుసళ్లమము వీడి పోయి తెందు

తే. మాపయిం గలప్రీతి సమ్మానము కృప, యెచ్చోటికిఁ బోయె లోఁకొకింతేని లేని
నీకు నిప్పాటు వచ్చెనే రాకుమార!, వేరు నన్నుఁ దండ్రి యని పిల్చువార లింక. 23

ఉ. ప్రేముడి నాదుకంఠమును బిగ్గ కవుంగిటఁ జేర్చి చేర్చి తా
తా! మహినేత! నాపయి దయం గలవై పని గొమ్ము నీవు నా
స్వామివి నేను భృత్యుఁడను సాఁకు మటందువు తొల్లి యిప్పు డా
నీమృదులస్వభావమును నెయ్యము తియ్యము నెందుఁ బోయె నో. 24

క. కురుభూము లెల్ల నేనే, పరిపాలించెదను నాకు బాహుబలాఢ్యుల్
పరికింపఁ గలరు పెక్కురు, పరిపంథుల గెలుతు నంచుఁ బలుకుదు తండ్రీ. 25

వ. అయ్యో దుర్యోధనా! కయ్యంపుమాట గలిగినప్పు డెల్ల నీవు నాకు భీష్మద్రోణకృపాశ్వత్థామాదులును బాహ్లికసోమదత్తభూరిశ్రవోభగదత్తాదులును దుశ్శాసనాదు లగునాతమ్ములును నాకు బాసటమై యున్నవారు నేను బాండవులన్ జయించుట దుర్లభంబు లోనిది కా దని తఱిమి చెప్పుచు. 26

మ. కృతవైరుల్ కృతహస్తు లెల్ల మనవా రిం దొక్కఁ డొక్కండె పో
రిత మైనన్ సబలంబుగాఁ బగఱ వారిం గూల్చు ని ట్లిందఱున్
జత యైనప్పుడు చెప్ప నేమిటికిఁ దత్సామర్థ్య మోతండ్రి! స
న్నుత చారిత్రుఁడు కర్ణుఁ డొక్కరుఁడె నన్నుం గెల్పఁ జేయుం జుమీ. 27

మత్త. కత్తి వట్టనివాసుదేవుఁడు గల్గె వారికిఁ బోరి క
త్యుత్తమోజుఁడ యైనవానిభయోద్ధతుల్ పొడసూపఁ బో
వెత్తిపోయి జయింతు నే నని యెన్నియో పరు లంటి వేఁ
జిత్తమం దది నమ్మి పార్థులచేతు లోనఁ దలంచితిన్. 28

క. హతవిధికతమున నంతయు, విత యయ్యె న్నాతలంపు విపరీతమ మై
సుతశతకం బనిఁ ద్రెళ్లెను, సుతుఁడా! కాలంబు గతికిఁ జోద్యము గలదే. 29

ఉ. సింగము గాక భీష్ముఁ డొక చెప్పెడుపాటిప్రతాపవంతుఁడే
సంగరరంగమం దయిన సంయమనీపతి కాలదండమున్
ద్రుంగఁగఁ జేసి వాసి చెడఁ ద్రోలఁగఁ జాలఁ డఁటే శిఖండిచే
భంగము నొందె నాఁగ మృగవల్లభు నక్క వధించుటే సుమీ. 30

సీ. ప్రథితశస్త్రాస్త్రపారగుఁడు ధనుర్గురుఁ, డలఁతి యే యతఁడు గీటడఁగె నట్టె
మత్తమాతంగముల్ మనసోమదత్తబా, హ్లీకభూరిశ్రవు లీల్గి రట్టె
గజయుద్ధనిపుణు లుగ్రంపశ్యు లగుభగ, దత్తజయద్రథుల్ తరలి రట్టె
శస్త్రభృద్వర్యులు జలసంధమాగధో, గ్రాయుధశకునులు వోయి రట్టె
తే. భూరికీర్తులు త్రైగర్త పౌరవ సుదంత పాండ్య శ్రుతాయు సుదక్షిణాచ్యు
తాయు రావంత్యముఖులు వోకాఱి రట్టె, యకట దైవంబుకన్న నన్యంబు గలదె. 31

క. నారాయణగోపాలురు, నారాయణచక్రతుల్యనానాస్త్రవిదుల్
భూరియశుల్ సంశప్తక, వీరులునుం దెగిరె కాలవిపరీతగతిన్. 32

క. అలఘుపరాక్రము లగున, య్యలంబుసాలాయుధు లకటా శకయవనా
దులు నీల్గిరె శల్యుండును, గలనం దెగిపడెనె కాలగతిపా లగుచున్. 33

ఉ. నమ్మినబంటు కర్ణుఁ డని నాకుఁ గలం డతఁ డొక్కరుండె శౌ
ర్యమ్మున నెల్లపాండవుల నాహవరంగమునం దెదిర్చి పా
రమ్మును ముట్టఁ జేయును ధరారమ యంతయు నాకుఁ దక్కు నం
చెమ్మెయిఁ జెప్పుచుండు నది యంతయు నింతయి పోయె నయ్యయో. 34

క. పుత్రులు పౌత్రులు భ్రాతలు, మిత్రులునుం దెగిన మీఁద మిడుకుచు నీవుం
ధాత్రిఁ బడి యెట్లుతలఁచితో, గాత్రోద్భవ! దైవఘటన గా కొం డగునే. 35

వ. అని పలుదెఱంగులం బలవించి. 36

మత్త. భాగధేయసమంచితుం డగు భద్రము ల్వడయంగ నే
భాగధేయము లేనివాఁడను బట్టు నెట్టులు భద్రముల్

స్వాగతం బిడ లేరు పుత్రులు శత్రుమధ్యమునందు నిం
కే గతి న్వసియింతు నంధుఁడ వృద్ధుఁడన్ గతబంధుఁడన్. 37

ఉ. ఱెక్కలు లేనిపక్షివలె ఱేపులు మాపులు దుఃఖభాజి నై
పొక్కుచు నున్ననన్నుఁ గని పోటరి యైనవృకోదరుండు నీ
వెక్కడిసంగడీఁడ విట నేమిటి కుంటివి నీదుపుత్రులుం
జక్కఁబడంగ నై రనుచు సారెకు నాడుచుఁ జూడకుండునే. 38

చ. కొడుకులు నూర్వురుం దెగుటకుం గడుఁ గుందెడునన్ను దెప్పుచున్
వడముడి నిచ్చచావ్రగను బల్కెడుపల్కులు నాలకించుచున్
జడమతినై యిటన్నిలువఁ జాల క్షణార్ధము నేని సంజయా
యడవుల కేగి యాకలము లానుచు జీవనయాత్రఁ దీర్చెదన్. 39

వ. అని నితాంతశోకసంతాపసంతప్తచిత్తుం డై మాటిమాటికిని మూర్ఛిల్లియుఁ దెప్పి
ఱిల్లియుఁ బెద్దయుంబ్రొద్దు పేరెలుంగున నేడ్చి రోడ్చి నిట్టూర్పు నిగిడించి నిగిడించి
గావల్గణిదిక్కు మొగం బై మఱియు ని ట్లనియె. 40

ఉ. ఆమరణాంతదుఃఖమున కాఱడి నొందుచు నుండుఁ గాని సం
గ్రామమునందు మామకులు కట్టడ చేసినయట్టి సైనిక
గ్రామణులం బృథాసుతులు గండడఁగించుచు నుండి రింతలో
నామెయి భీష్ముఁడున్ గురుఁడు నాన్నృపమిత్రుఁడుఁ ద్రెళ్లి రక్కటా. 41

చ. విదురుఁడు మున్న నా కెఱుగ విన్చె సుయోధనుకారణంబునన్
సదమద మై జగజ్జనము నాశన మౌ నని కొంద ఱమ్మహో
హృదయుని మాట పాటిగ సహింపక పోయిరి మూఢచిత్తతన్
గడిరిన నేనును స్వనశికట్టిఁడి నైతి నిఁ కేమి చెప్పఁగన్. 42

ఆ. ఎంత చెప్పి నాతఁ డంతయు నయ్యె దైవోపహతుఁడ నైతి నొరుల ననఁగ
నేల నాదుననయమే యిట్లు ఫలియించె, నింత కన్నఁ జెప్ప నేమి కలదు. 43

వ. గావల్గణీ! రాధేయువధానంతర మెవ్వం డనీకినీముఖంబై కృష్ణార్జునుల నెదిర్చె వా
నికిఁ జక్రరక్షకు లెవ్వరు పృష్ఠరక్షకు లెవ్వ రెవ్విధంబున నాయోధనంబు సెల్లె
శల్యుం డెట్లు ద్రెళ్లె దుర్యోధనుండు ద్రుంగుటకుం గతం బెయ్యది ధృష్టద్యుమ్నశిఖం
డిప్రభృతులును ద్రౌపదేయులు నెట్లు తెగటాఱిరి పాండవులును వాసుదేవసాత్యకు
కులు నెట్లు తెగకుండిరి కృపకృతవర్మాశ్వత్థామలు జీవించి యుండు టెట్టిది యం
తయు సవిస్తరంబుగ విన నెంచితిం గావునఁ దేటతెల్లంబుగం దెలియఁ జెప్పు మనిన
నతం డతని కి ట్లనియె. 44

సీ. సూతపుత్త్రుఁడు రణక్షోణీస్థలిం బడి, నంతఁ గౌంతేయసింహారవంబు
శ్రవణకఠోరమై చాఁగుదెంచిన నీదు, దళము లన్నియును విత్రస్తము లయి
సింగముం గన్నసారంగము లట్టులు, విఱిగి చెట్టొకఁడు గాఁ బఱచుటయును
నీసుతుం డెవ్వారి నిలువరింపఁగ లేక, శల్యానుమతమున సైన్యసమితిఁ
తే. దివిచి విడిదలకుం బోయి వివశుఁ డగుచుఁ, బరిజనులు తన్ను వేష్టింప బయల నిలిచి
వగచుచుండినతఱిఁ గృపాస్వాంతుఁడయిన, కృపుఁడరుగుదెంచి యూరార్చి యిట్టు లనియె.

—కృపాచార్యుఁడు దుర్యోధనునకు హితోపదేశంబు చేయుట—

క. ఏ నొకఁడు నీకుఁ జెప్పెద, దాని న్మది నాటునట్లు తగ విని తగు నట్ల
మానస మైనం జేయఁగఁ, గా నట్టుల యైన మానఁ గాఁ దలఁపు మెదన్. 46
ఉ. ఆలము కన్న శ్రేయ మగునట్టిది ధర్మ మొకానొకండు లే
దాలమునందుఁ దండ్రి కొడు కన్నయుఁ దమ్ముఁడు నాక చంపుటల్
చాలనికర్జ మైనను బలాయసమునం బొనరింప కుండుటల్
పోలును క్షత్రజీవి యగుపూరుషవర్యునకుం దలంపఁగన్. 47
మ. అది యట్లైనను జీవితార్థులకు దేహభ్రాంతి పోఁ జాల దే
పదమందున్మన మేరపై భరము మోవం జేసి రాజ్యంబు గో
రుదు మాభీష్ములు ద్రోణకర్ణులును బుత్త్రుల్ భ్రాతలుం గూలి ర
క్కదనంబం దిఁక నున్నరాజులును జాఁ గావించు టెం తొప్పనే. 48
తే. ఇపుడు బ్రదికి యుండిన మన మిందఱమును, నరునిఁ జెనయంగ నేరము నా వచింప
వలయునే కృష్ణసహితుఁ డవ్యగ్రవాత్మ, జుండు సురలకైన దుస్సహుండు సూవె. 49
సీ. వజ్రసారం బగువానరకేతూగ్రతఁ జూచి మనసేన చలన మొందె
దేవదత్తధ్వని దీవ్రమై పఱతెంచి, నంత మాఁగుండియ లవియుచుండె
కొఱవి ద్రిప్పినయట్లు వఱలుగాండీవము, మెఱసి చూడ్కికి మిఱుమిట్లు గొలిపె
వెలిమావు లాకాశవీధి నంటెడునాఁగఁ, బెరసి నీవారికి బీ తొసంగెఁ
ఆ. గారుచిచ్చువోలెఁ గవ్వడి గడుహెచ్చి, చొచ్చి మనబలంబు శుష్కకాష్ఠ
సమితి నట్లు కాల్చు సైనికుల్ పులిఁ గన్న, జింక లనఁగఁ బఱచి రంకిలి పడి. 50
క. నాలుగుశ్వేతాశ్వంబుల, నాలుగుదంతముల నొప్పు నాగము నాఁగన్
గ్రాలుచు నరుఁ డస్మద్బల,నాళీకవనంబు గలఁచి నలిచెం గదవే. 51
ఆ. ఏడుఁ బదియు దినములు లేగె నీనాఁటికి, ననిఁ బానర్పఁ దొడఁగి మనబలంబు

నాఁడునాఁట నరునినారాచముల గాలి, కెగిరిపోవ నయ్యె మొగులు వోలె. **52**

ఉ. అక్కట యేమిచెప్పుదు నృపాత్మజ! ద్రోణుఁడు శల్యుఁ డేను నీ
కెక్కినసూతనందనుఁడు నీవును నీయనుజన్ము లందఱుం
దక్కినయోధముఖ్యులును దగ్గనిపూన్కిన యుంటి మట్టిచో
నక్కపికేతనుండు దెగటార్పఁడె సైంధవు నీ వెఱుంగవే. **53**

తే. క్రీడి నోర్వంగఁ జాలి యెవ్వాఁడు లేఁడు, వానిశస్త్రాస్త్రములును దివ్యములు తలఁప
నాయకుఁడు లేనిమనసేన నష్టచంద్ర, మైనరాతిరి వలె నుండె నవనినాథ. **54**

ఉ. అందఱు నున్నకాలమునయందె మహోన్నతతేజుఁ డైన సం
క్రందనసూతి విక్రమ మొకానొకనాఁటికి నేని వక్రతం
బొందదు డింద దిప్డు మనపోటరు లెల్లరుఁ జెల్లిపోవుటం
గొందల మందు చుండుమనకొంచెపుమూఁక నతండు గాల్పఁడే. **55**

వ. ఇదియునుం గాక. **56**

ఉ. సాత్యకిభీమసేను లోకసామ్యము వారనిఁ జెప్ప నొప్పనే
సత్యపరాక్రమంబున నెసంగినమాత్రన గోత్రపంక్తులం
బ్రత్యయ మెప్ప నిప్పుడమి పాఁతరతోఁ బెకలించి వేయఁగా
నిత్యమహాసముద్రముల నీళ్లిగిరింపగఁ జేయఁ జాలరే. **57**

చ. కొలువున నెల్లరు న్విసఁగఁ గోయని యార్చుచు గాడ్పుపట్టి పే
రలుక వచించినట్టినుడు లన్నియు సత్యము లట్లు నల్పియుం
జలుపఁగ నుండెఁ బాండవులు సంకటపాటున కీ రొనర్చునె
గ్గులు ఫలియించువేళ సమకూడెను నేఁటికిఁ జెప్ప నేఁటికిన్. **58**

స్వాగతము. ఆత్మరక్ష దగు నన్నిటిలో న,య్యాత్మ లేక యవి యన్నియులే వీ
వాత్మఁ గాచుకొనునట్టిఁడ వై న,ర్వాత్మ దాని కగు మయ్య కుమారా. **59**

చ. తనకు బలంబుచాలనివిధం బగుడెంచిన సంధి సేయుటల్
తను బలవంతుఁ డైనతఱి దారసిలంగ రణంబు సేయుటల్
చను నని నీతిశాస్త్రము ప్రసంగఁగఁ జేసె గురుండు నీవు ని
య్యనువున సంధి చేసికొనునట్టిఁడ వౌ టుచితంబు చెప్పితిన్. **60**

క. కాలోచిత మగురీతిన్, మే లందం గోరునట్టి మేదినిపతి ని
త్యాలసుఁడు నాఁగఁ బేర్పడి, శ్రీలం బెఱ బాసి చెడుట సిద్ధము సూవే. **61**

ఆ. కాన ధర్మరాజుకాళులఁ బడి రాజ్య, విభవ మడిగికొనుట వెలయుఁ గాని
వెడఁగ వగుచు నిట్లు పడి పరాభవ మొందు, టనికి దిగుట మేల యనఁగ నగునె. 62

తరువోజ. కరుణాళుఁ డాపృథాగ్రప్రోద్భవుఁడు, కాదనఁ డెపుడు నీకన్నట్టితండ్రి
పరిసరంబునకు రాఁ బలికిన వచ్చుఁ, బాటించి విను వానిపలికిన వెల్ల
వారి నీకు రాజ్య మీ ననుమతి సేయు, నతనిమాటను భీముఁ డర్జునాదులును
నిరతంబు దాఁటరు నీతండ్రిమాట, నిలుచు నాహరియును నీ వట్లు నడుము. 63

తే. ఇట్లు నిక్షేమమును గోరి యింత గాఁగఁ, జెప్పితిని గాని కార్పణ్య మెప్పఁ జేసి
కొనియునోలమునాశించుకొనియుఁ గాదు, వినుమువినకున్నఁ జేటగునని యెఱుఁగుము.

వ. అని శోకాయత్తచిత్తుం డై వృద్ధుం డగుశారద్వతుండు వేఁడినిట్టూర్పు నిగిడించుచున్నం
గని దుర్యోధనుండు పెద్దయుంబ్రొద్దు నిట్టూర్పు నిగిడించి ముహూర్తమాత్రంబు చిం
తించి యవ్విప్రవరునిమోముపై దృష్టి నిలిపి యి ట్లనియె. 65

— దుర్యోధనుండు కృపాచార్యునకుఁ దనమనోనిశ్చయం బెఱింగించుట —

చ. హితుఁడు వచించినట్లు వచియించితి నాచెడిపోక కిష్టునన్
మతిఁ బొనరింపనట్టిఁడవు మాన్యుఁడ వోమ వొడల్ రణంబునన్
బ్రతిఘము వట్టి నాడగువిపక్షుల నోర్చితి వేర్చి లోకస
న్నుతులకు నైతి నీచుడ ననుం బ్రియతం గను నేమి చెప్పఁగన్. 66

తే. కారణము చూచి చెప్పితి కాని నీదు, హితవచోరచనము నాదుమతికి నెక్క
దమ్యో నయ్యో ముమూర్షున కౌషధంబు, పగిది నేమందఁ జెప్పెదఁ దగిలి వినుము.

సీ. మాయజూదము వన్ని మహిరాజ్యము హరించి, కాఱియంబడఁ జేసి కాననముఁ
జదురున నేకవస్త్రను రజస్వలఁ దెచ్చి, పరిహాసములఁ బరిభవించి
పొందు పొసంగించుబుద్ధి వచ్చినశౌరి, వాకుల నొంచి నిరాకరించి
పలువు రొక్కటి యయి పట్టి సౌభద్రుని, బాలకు నొంటరిఁ గూల నేసి

తే. చేసితిమి వారి కెన్నియేఁ జెడుగు లేము, వార లన్నియు మఱచి కోపంబు విడిచి
పాక మీరీతిఁ దప్పినపట్టునందు, సంధి కీకొందు రెట్టులో చాలనట్లు. 68

మ. తనమేనల్లునిఁ జంపినా రని పగన్ దామోదరుం డూనుఁ దా
మును గావించినబాస జేసి కొన భీముం డెంచుఁ బాంచాలికిం
జనుకీ డెంచుచుఁ బాండవేయులును ధృష్టద్యుమ్నముఖ్యుల్ మనం
బున నీ సెంతురు గాని మాపయి దయం బొందింతురే దేశికా. 69

తే. స్థండిలంబున శయనించి సద్వ్రతంబు, పట్టి పాంచాలపుత్రిక భర్తృకార్య

సిద్ధిగా మద్వినాశనస్థితిని గోరి, తపము గావించు నంట సుభద్రయును దాను. 70

క. స్థితిగతు లిట్లుండఁగఁ బాం, డుతనూజులు రాజ్య మెన్నఁడు న్నా కిడఁ గా
మతి నీయకోలు సేయుట, మతిమంతుఁడ వీవు తలఁతె మాన్యచరిత్రా. 71

ఉ. వారల యయ్యకో లటులు వర్తిలుచుండఁగ నిన్ను మున్న నే
సూరుఁడ నా జ్వలించుచును సూరెలరాజుల కెల్ల మీఁదనై
ధారణిరాజ్య మేలి కడుదర్పము పేర్పడ నుండు నిప్పు డే
దారిని బాండవేయులకు దాస్యము సేయఁ గలాఁడఁ జెప్పవే. 72

ఆ. ఒరుల కిచ్చి కుడిచి యురుతరభోగము, లనుభవించి యిప్పు డరులఁ గొలిచి
కృపణునట్లు నేను గృపణజీవనమును, జేయ నొల్ల సంక సిద్ధ మిట్లు 73

మ. హితముం గూర్చెడునీదువాక్యముల కే నింతేని గర్హింప నో
క్షితిదేవాగ్రణి! సంధిమాటలను జర్చింపంగఁ గాలంబు గా
దతిలోకార్థము లయ్యె నయ్యవి యిఁకన్ వ్యర్థంబుగాఁ బుచ్చ కి
గ్గతిఁ గాలంబు రణప్రవర్తనమునం గావింత మిం తేటికిన్. 74

సీ. బహుళయజ్ఞంబులు పచరించితిని భూరి, దక్షిణల్ భూసురతతికి నిడితి
ననుభవించితిఁ గోర్కు లన్నియు రాజుల, తలమానికంబ నై నిలిచియుంటి
భరియించితిని భృత్యవరుల దీనులఁ బ్రోచి, తిని బరరాష్ట్రముల్ తిగిచికొంటి
మనిచితిఁ స్వరాష్ట్రమును ద్రవర్గమ్ము సే, వించి పిత్ర్యాణ మేగించుకొంటి

తే. క్షత్రధర్మము నెఱపితిఁ గ్రమ మెసంగ, రాజ్యసౌఖ్యము లెల్లఁ దిరములు గావు
యశ మదొక్కఁడుసాధనీయంబయగును, దలఁపనదియనింగాని కాదొక్కదానివలన

ఉ. క్షత్రియుఁ డైనవాఁడు తనకల్గినరాజ్యభరం బదారతయుం
బుత్రులమీఁదఁ బెట్టి వనభూముల కేగి యటం దపంచుచున్
గాత్రము వీడుటో రణముఖంబున నీల్గుటయో లభించినన్
ధాత్రి మహాధ్వరంబుల నొసర్చినయట్లు పరంబు గాంచెడున్. 76

మ. జర బాధింపఁగ రోగి యై తుదకు మంచం బే శరణ్యంబు గాఁ
బరితాపంబుగఁ గ్లేశ మొందుకకు రా బంధువ్రజం బేడ్వ దే
హారతిం బాయఁగ లేక గేహమునయం దై ప్రాణముం బాయుటల్
పురుషుం డై తగువాని కొప్ప దని చెప్పన్ క్షత్రధర్మార్థముల్. 77

ఉ. కావున నేను యుద్ధమునఁ గాయము వాసి మఖప్రచారకుల్
పోవుమహోన్నతాధ్వమునఁ బోయి త్రివిష్టపమందు నప్సర

స్నేవల నందుచుఁ గ్షురలచెల్మినిఁ బొందుచు నుందు నన్నట్టి
దేవునిఁ బోలెఁ జూచి పితృదేవత లెల్లరు సంతసింపరో. 78

తే. కురుపితామహసైంధవుల్ గురుఁడు దుస్స, సేనుఁడును గర్ణుఁడును లోనిశ్రేష్ఠు లెల్ల
నాకు గాఁ ద్రెళ్లి యిట నుండి నాకమునకు, మంచిమార్గము గావించుకొంచుఁ జనిరి.

క. ఆమార్గమ్ము సుదుర్గము, మై మించక యుండ నేను నక్రమమున నం
గ్రామమున మేను విడి సు, త్రామపదం బండి ఋణము తద్దయుఁ దీర్తుఁగా. 80

వ. ఇదియుం గాక. 81

ఉ. తాతలఁ దండ్రులన్ గురుల దగ్గఱచుట్టములన్ వయస్యులన్
భ్రాతల బిడ్డలన్ రణమునం దెగునట్లుగఁ జేసి ప్రాణముల్
బ్రాఁతిగఁ గొంచుఁ బాండవులపంచకుఁ జేరిన బ్రుయ్యఁ దిట్టవే
భూతము లెల్ల నే బ్రదికి పొందఁ గలాఁడనె నింద లక్కటా. 82

తే. బంధుహీనుఁడ నగునాకుఁ బాండురాజ, పుత్రకులకాళ్లలం బడి పుడమి వేఁడి
కో లనుచిత మ్మనుచుఁ దోచె గురువరేణ్య!, పోరి చచ్చి యశమ్మునఁ బోవ నుంటి.

—♦ దుర్యోధనుండు సరస్వతీతీరంబునకుం జని కార్యాలోచనంబు సేయుట ♦—

వ. అనిన విని రాజు లందఱు మేలు మే లని యమ్మహీపాలునివచనం బభినందించి పరాజయశోకంబు పరిత్యజించి పరాక్రమించి ప్రధనంబు గావింప నిశ్చయించి సేన కుత్సాహంబు గల్పించి దుర్యోధనానుమతంబున నా రేయి శిబిరంబులం దున్న నేగి యగు ననుతలంపునం జేసి యచ్చటికి రెండుయోజనంబుల దూరంబులోనన యున్న హిమవత్ప్రస్థంబునకు బలంబులం గొని చని యట సరస్వతీజలంబుల స్నానపానాదు లొనరించి కృతాహారులై యున్నంత శల్యకృపాశ్వత్థామకృతవర్మశకునులును గర్ణపుత్రులగుచిత్రసేన సుషేణారిష్టసేన జయత్సేనులును గొంకొక విచారించి నీకొడుకుం గాంచి మన కొక్క సేనానాయకుని నియమించుకొను టొప్పు ననిన నతండు సర్వయుద్ధవిభావజ్ఞుండును సర్వలక్షణలక్షితుండును వైనతేయవాతజవబలసంపన్నుండును వేదవేదాంగాదివివిధవిద్యావిశారదుండును నయోనిజుండును భార్గవవరలబ్ధజన్ముండును నగునశ్వత్థామచెంగటికిం జని యి ట్లనియె. 84

ఆ. అడుగుచుంటి నిన్ను నాచార్యనందన!, నీవ మాకు గతివి నేర్పుమీఱ
నేర్పఱించి చెప్పు మెవ్వని సేనానిఁ, జేసికొనిన మనకు వాసి గలదొ, 85

వ. అనిన నతం డతని కి ట్లనియె. 86

చ. కులబలవీర్యశౌర్యములకుం గుదురై పరమోన్నతార్జవో
జ్జ్వలుఁ డగు శత్రుశల్యుఁ డగుశల్యుని నేఁడు చమూవిభుత్వసం
కలితునిఁ జేయు టొప్పెసఁగుఁ గాని మఱొక్కనిఁ జేయ నొప్ప దీ
వలఁతికతంబునన్ మన కవశ్యముగా విజయంబు చేకుఱున్. 87

చ. సకలగుణాభిరాముఁ డగుశల్యుఁ డితం డలభాగినేయులన్
బ్రకటముగాఁ దొఱంగి నినుఁ బట్టి మెలంగు నిటం గృతజ్ఞుఁ డై
వికృతివిహీనుఁ డున్నతుఁడు వీని విశాఖుని వేల్పులుం బలెన్
సకలవరూథినీపతిగ సల్పితి మేని జయంబు సేకుఱున్. 88

వ. అని చెప్పిన నప్పుడు మహారథు లందఱు జయజయశబ్దంబులు వలుకుచు శల్యుం బరి
వేష్టించి రప్పుడు దుర్యోధనుండు రథంబు డిగి రథస్థుం డైనశల్యునొద్దకుం జని ప్రాం
జలి యై యి ట్లనియె. 89

— దుర్యోధనుఁడు శల్యునిం బ్రార్థించి సేనానాయకుం జేయుట —

తే. మిత్రవత్సల! మిత్రు నమిత్రుఁ దెలియు, నట్టికాలము సంప్రాప్త మయ్యె నేఁడు
ద్రోణభీష్మసముండ వీదురమునందు, నీవు దళవాయి వై మమ్ముఁ గావ వయ్య. 90

చ. అనిమొన నీవు నిల్తు వటు లైనను బాండుచమూసమూహముల్
నినుఁ గని చెయ్వులం దొఱఁగి నివ్వెఱపాటును దిచ్చపాటునుం
బొనరఁగ నుద్యమంబు విడి పోయెదు నేను భవద్వచోగతిం
గొని మెలఁగం గలార మని కోరిక లీరిక లెత్తఁ బల్కుచున్. 91

తే. మాతులా! బాహులేయుఁ డేమాడ్కిఁ దొల్లి, దేవసేనాని యై పూర్వదేవసమితిఁ
జించి చెండాడె నామాడ్కి మించి నీవు, పాండవులఁ జించి చెండాడఁ బ్రార్థనంబు.

క. నావుడు శల్యుం డి ట్లను, నోవసుధానాథ! నాదునురుతరధనముల్
నావరరాజ్యము ప్రాణము, నీవశ మీ చెప్పినట్లు నే నొనరింతున్. 93

చ. అని మఱియున్ వచించు వసుధాధిప నేను జమూవిభుండ నై
కొనకొని పార్థసోమకులఁ గోల్తలఁ జేసి జయింతు మొగ్గరం
బును బొనరించి నీబలము పొంపిరివోయి మెలంగఁ జేయుదున్
ఘను లగునచ్యుతార్జునుల నాభుజశక్తి నడంచిపుచ్చెదన్. 94

వ. అని యనుమతించినంత మనసుయోధనుండు సువర్ణకలశంబుల జలంబులం దెప్పించి
సేనామధ్యంబున మద్రనాథుని భద్రాసనాసీనుం జేసి వివిధతూర్యంబులు సైనికసింహ
నాదంబులు జయజయశబ్దంబులును బోరుకలుగ సర్వసేనాధిపత్యంబునం దభిషిక్తుం

జేసినంత సంతసించుచు నందలిజనంబు లాశల్యు నుద్దేశించి జయాశీర్వాదంబులుం బొగడ్తలుం బొసంగం జేయుచు. 95

చ. జయజయ మద్రరాజ! ఘనశౌర్యసమాంచితమూర్తి వై ద్విష
చ్ఛయ మది నీదుబాహుబలసంపదక్రింద నడంగి పోవఁ గా
జయమును గాంచు మీ వని నెసంగినమాత్ర సురాసురాదులుం
భయకలితాత్ము లౌదు రనఁ బాండవసేనలఁ జెప్ప నేటికిన్. 96

వ. ఇట్లు సంస్తూయమానుం డగుశల్యుంను సంతసిల్లుచు నీసుతుం గని మఱియు ని ట్లనియె. 97

క. ఏ నిపుడు పాండుపాంచా, లానీకిని యెల్లఁ ద్రెళ్లు నట్లొనరింతున్
లేనియెడ హతుఁడ నై స్వ, ర్గానందం బనుభవింతు నవనీనాథా. 98

తరువోజ. ఇపుడు లోకులు నన్ను నీక్షింత్రు గాత, మొతయుసంతోష మెసకం బెసఁగ
ద్రుపదపుత్రులు ప్రభద్రులు ద్రౌపదీసుతులు పాండుసుతులు యదుప్రవరులును
ద్యుపరిస్థితులును నాదుధనుర్బలంబు, దోర్బలంబును గాంచి ద్రోణభీష్మాదు
లుపమింపఁ గా వీని కోపరం చెన్న, నొనరింతు నెల్లి పో రో రాజరాజ. 99

శా. చాపాచార్యునిశౌర్యధైర్యములు భీష్మగ్రీష్మభానుప్రభా
రూపప్రాభవ మంగరాజవిలసద్రాక్షేషుతైక్ష్ణ్యమున్
రూపింపం గని యుంటి మొక్కఁడును నీరుద్రోషమున్ మద్రధా
త్రీపాలుం బ్రతిహారు నా నరుల దోర్వీర్యంబునం దోలెదన్. 100

వ. అని పలికిన నీపుత్రుండును దక్కనుం గలధరణీకళత్రులును సంతోషాయత్తచిత్తంబులు వొత్తుకొనఁ గర్ణవ్యసనం బంత నంతరంగంబునం బరిగణింపక పాండవపాంచాల సైన్యంబు లెల్ల శల్యువశంబు లగు నని తలంచుచు స్వస్థచిత్తంబున నారేయి సుఖ సుప్తిం గాంచి రట ధర్మజుండు శల్యాభిషేకసమయసంజనితతూర్యారావం బాలించి చారులం బుచ్చి యంతయు నెఱింగి వార్ష్ణేయుం బిలిచి సర్వక్షత్రసమక్షంబున ని ట్లనియె. 101

—♦ శల్యసేనానాయకత్వమును విని ధర్మరాజు కృష్ణునితోఁ బ్రసంగించుట ♦—

మ. పడవా లయ్యెఁ గురుక్షమావిభుచమూప్రాగ్భారమం దెల్ల ని
ప్పుడు శల్యుం డని విన్నవాఁడ నెడఁదన్ బోలంగ నాలించి పే
ర్పడుకర్జం బెది సేయువార మెది యొప్పం జొప్పడున్ జెప్ప మే
ర్పడ దామోదర! నీవు చెప్పినటు లొప్పం జేయ నాచిత్తమున్. 102

వ. అనిన జనార్దనుం డతని కిట్లనియె. 103

శా. ఆయార్తాయని నే నెఱుంగుదును ధైర్యస్థైర్యమంథాద్రి తే
జోయుక్తుండు నదీసుతాదులకు హెచ్చుం దార్ఢ్యశుం డౌను గా
కేయింతేని కొఱంతగాఁ డతనితో నేవాఁడునుం బోరువాఁ
డీయుర్విం బ్రభవింప డిప్డు లయకాలేద్ధాగ్నితుల్యుం డనిన్. 104

సీ. భీమార్జునులు వానితో మాఱుకొనఁ జాల, రిక్కవల్ వానికి నెపుడు లొక్క
సాత్వతునకు వానిచక్కి నిలఁగ రాదు, పార్షతునకు వానిభయము మెండు
తలఁప శిఖండికిఁ దత్సోదరులకు వా, నినిఁ జూచిన వడంకు లని జనించు
యోధాగ్రగణ్యు లీయోజ నుందురు గాన, నన్యులఁ జెప్పంగ ననదు గాదె

తే. కాలకాలునికెత్తయి గ్రాలుమద్ర, భూమిపాలునిఁ జెనక నీభూతలమున
బల్లిదుం డెవ్వఁడును లేఁడు బాహుశక్తిఁ, బాండవాగ్రజ! నీ వొక్కరుండు దక్క.

క. ఒండొకఁడు వాని మార్కొన, నుండం డుండినను నాళు లోలిం గడచుఁ
దండు నశించెడు నెల్లియ, చండంగల వీవు మామచెలిమిని విడినన్. 106

తే. క్షాత్రధర్మము పూని నీ వాత్రిదివము, నందు నింద్రుఁడు శంబరు నట్లు శల్యుఁ
దునిమి విజయంబు చేకొని వనధికాంచి, నిజతపోవీర్యమునఁ గీర్తి నిలుపు మనఘ.

తే. కర్ణపాతాళము నుదీర్ణ మైన, ద్రోణభీష్మార్ణవంబును దొలఁగ నీది
శల్యగోష్పద మం దిప్డు సపరివార, ముగ మునుంగక విక్రమింపుము మహీశ. 108

—♦ కురుసైన్యంబు యుద్ధసన్నద్ధంబై వెడలుట ♦—

వ. అని పలికి ధర్మరాజు నామంత్రించి జనార్దనుండు నిజశిబిరంబునకు నిర్గమించె ధర్మ
జుండును దమ్ములం బాంచాలాదుల నంపిపుచ్చి తాను విశల్యకుంజరంబు పోలె
శయ్యాతలంబున సుఖనిద్రం గావించె నెల్లవారును గర్ణవధంబునం జేసి హర్షోత్కర్షం
బునం దేలుచుఁ దమతమశిబిరంబుల నారేయి సుఖనిద్రం బొంది రంత నిటఁ బ్రభాత
సమయంబున దుర్యోధనుండు పడవాళ్లం బుచ్చి సైనికులకుం బరవసంబు గల్పింపం
బంపిన నెల్లవారునుం దగినసవరణ లెసంగ శతాంగంబులను దురంగంబులను మాతం
గంబుల నధిష్ఠించి వివిధవాదిత్రంబులరవంబు నింగి ముట్టఁ జతురంగబలసమేతులును
సర్వసన్నాహసన్నద్ధులు నై మహారథులు శల్యు సేనాపతిం జేసికొని వారివారిబలం
బుల విభజించుకొనియు నేకీభావంబు గావించుకొని యనుజసహితుం డై యున్న మనుజ
పతిం బరివేష్టించి కదనంబునేలకుఁ గదలి చని రపుడు కృపకృతవర్మశల్యాశ్వత్థామ
శకునులును దక్కనుంగల యోధులును వేఱొక పోరాటంబునఁ బాండవులతో నొక్కఁ

డొక్కుండుగాఁ బెనంగ రాదు బెనంగువానికిం బెరవాఁడు తోడుపడుచుండ వలయు సుహృలకుం దప్పినవాఁడు పంచమహాపాతకంబుల నుపపాతకంబులం బొందినవాఁ డగు నని తమచేసినసంకేతం బొండొరులకుం జెప్పికొనుచు నడువ ముప్పొతిగొనుశౌర్యంబున శల్యుండు ముంగలియై నడిచి తనసైన్యంబున సర్వతోభద్రవ్యూహంబు వన్నించి దానిముఖంబున రథప్రవరం బధిష్ఠించి కార్ముకంబు విదుర్చుకొనుచు నభయుం బొసంగుచుఁ గర్ణపుత్రమద్రకసహితుండై తాను దక్షిణపార్శ్వంబున శకయవనానీకంబులతోఁ గృపాచార్యుండును సవ్యోత్తరపార్శ్వంబునఁ ద్రిగర్తసైన్యంబుతోఁ గృతవర్మయుఁ బృష్ఠభాగంబునఁ గాంభోజగాంధారబలంబులతో నశ్వత్థామసౌబలులును మధ్యభాగంబున బహులచతురంగబలంబు లనుజన్ములుం బరివేష్టింప దుర్యోధనుండును నిలువ నబ్బలగంబు చంద్రోదయసమయార్ణవంబుచందంబునం ఘూర్ణిల్లె నట్లు పాండవసైన్యంబులును మూఁడుతెఱంగుల మోహరంబులు వన్నుకొని వారలం దాఁకి రందు ధృష్టద్యుమ్నశిఖండిసాత్యకులు శల్యానీకంబుపై నిగిడిరి ధర్మరాజు నిజసేనాసమేతుండై మద్రరాజుమాఱుకొనియె నర్జునుండు హార్దిక్యుని సంశప్తకులందాఁకె భీమసేనుండు సోమకసహాయుండై గౌతముం గవిసె మాద్రేయులు సౌబలోలూకులపై వీఁకం జూపిరి ద్రౌపదేయప్రభృతులును దక్కినవారిం దాఁకి వీఁకం బోరి రని చెప్పిన నాంబికేయుండు సంజయున కిట్లనియె. 109

తే. చెవులు చిల్లులువోవంగఁ జెప్పె తీవ్ర, కురుపితామహుపతనంబు గురునిమ్నతియుఁ
గర్ణవధమును వింటి నక్కరణి నింకఁ, జెప్పు శల్యదుర్యోధనుల్ చెసినచొప్పు. 110

క. ఏవిధమున మద్రేశ్వరు, నావసుధాధవుఁడు గూల్చె నారారాజుఁ
బావని యెట్లు వధించెను, నావిధమంతయును దెలుపుమా సూతసుతా. 111

తే. అనుడు సంజయుఁ డిట్లను నఖిలలోక, సంక్షయం బగుసంగ్రామసరణి యెల్లఁ
దేటతెల్లంబు గావింతుఁ దెలియ వినుమి, యాశ బలవత్తరం బేరి కైనఁ గాని. 112

శా. గంగానందనుండుం గురుండు వృషుఁడుం గయ్యంబునం గత్తిచే
భంగం బందుట కన్నులారఁ గనియుం బ్రాల్మాలి శల్యుండు త
న్నుం గెల్పించెడు నంచు నాస మిగులం దుఃగాడ శేషధ్వజి
న్యంగంబుం గొని సంగరాంగణము డాయం బోయె తేఁ డయ్యెడన్. 113

ఉ. తమ్ములుఁ దాను నీసుతుఁడు ధారణినాథులతోడ శల్యునిన్
నెమ్మది నమ్మదిం గడుచు నేర్పును గూర్పును బేర్పడంగ ని

క్కుమ్మఁగ రాజ్యలాభ మగుఁ గా యని కర్ణుఁడు లేనియట్టిదుః
ఖ మ్మది వో దురాశమెయిఁ గయ్యము సేయఁ గడంగె వింటివే. 114

క. కర్ణుండు వడినపడఁపడి, నర్ణవమధ్యమునఁ నావ యవిసినయట్లై
జీర్ణింప నైనవారి కు, దీర్ణప్లవ మయ్యె మద్రదేశేశుఁ డనిన్. 115

తే. అనుడు ధృతరాష్ట్రుఁ డిట్లను నాపగాత, నూజముఖ్యులు వోవంగ నోజ చెడిన
మనబలమునందుఁ బాండవఘనబలమునఁ, గోలఁదులు వినంగఁదలఁచితిఁ దెలుపుమనఘ.

—◆ కురుపాండవుల పదునెనిమిదవనాఁటియుద్ధప్రారంభము ◆—

వ. అనిన సంజయుం డి ట్లనియె నాకర్ణింపు మ ట్లనికిం గడంగినమనవారికిఁ బదునొకండు వేల శతాంగంబులును బదివేల యేనూర్ల మాతంగంబులును రెండులక్షల తురంగంబులును మూఁడుకోట్ల కాలుబంట్లును వారికి నాలువేలరథంబులును నాలువేలగజంబులును బదివేలగుఱ్ఱంబులును నూఱువేలపదాతులును నప్పటికి శేషించి యుండె నిట్లు భండనంబు సేయ బలంబులు రెండును నొండొరులం గెలుచునుత్సాహంబున సూర్యోదయసమయంబునందుఁ దలపడుటయుఁ దొల్లి దేవదానవులకుం బోలె ఘోరరూపంబును భయానకంబు నగుమహాయుద్ధంబు సిద్ధించెఁ దత్ప్రకారంబు చెప్పెద నాకర్ణింపుము.

క. అరదం బరదము కరి కరి, హరి హరియుం బంటు బంటు నతిమియు వెనుకన్
గరి హరిని హరియు నరదము, నరదము బంటుం బెనంగె నతిముతి గాఁగన్. 118

ఉ. కొండలఁ బిండిసేయఁ గలకోపులు సూపుచు బృంహితంబులన్
మొదగుగర్జితంబులను మిన్నును మన్నును నిండఁ జేయుచున్
భండనభూమియెల్ల మదవర్షము నించుచుఁ బెల్లురేఁగి వే
దండచయంబు కాలజలదక్రియఁ ద్రోచి పెనంగె నత్తఱిన్. 119

సీ. నాగదంతాహతోన్నతరథంబులు రథి, రథ్యసారథులతో రసకుఁ దొఱఁగె
రథికుఁ లొక్కటఁ బాదరక్షులతో రావు, తులతో హయంబులు దునుఁగ సేసి
రాశ్వికుల్ ప్రాసయష్ట్యాదుల నరగజ, స్యందనంబులఁ గూల్చి రందు నందుఁ
గాలుమానుసులు పెక్కం డ్రొక్కరథికుని, మట్టుపెట్టిరి చుట్టుముట్టి పట్టి

తే. చలమునం బట్టి బిట్టయి చలుకఁ జూపు, పాదచారిసమూహంబుపయిని భద్ర
దంతిసంతతిఁ గొల్పి సమంతముగను, బోటరులు మెట్టి మట్టాడి రోటు వోవ. 120

ఆ. పదుగు రొకని నొకఁడు పదుగురం బొడువుచు, నొడలు క్షతజధారలొలుకుచుండ
మనగజంబు లట్లు మాఱ్కొని జోఁచుబు, చలము బలము మెఱయ నలిపి రాజ. 121

స్రగ్ధర. ధారాంచద్ఘోరభూరిద్రవదభినుతగంధర్వవారాతిరింఖా
స్ఫారోద్యద్విస్ఫులింగస్థగితగగనభూస్థాన మాస్థావిజృంభ
ప్రారంభప్రజ్వలత్సంప్రణుతసితమహోగ్రక్రియాఖడ్గభీమా
కారం బేకఘ్ని కీలాకలితము నయి సంగ్రామరంగం బెసంగెన్. 122

ము. నడగొండం దలపించునాగము కరన్యస్తాయుధం బై కడున్
వడి సేనం బడి మొత్తుచుండ రథికుల్ నల్మోలలుం జుట్టి పెం
జడిగా నంపగముల్ నిగిడ్చి పొదువం జా కేశకాలంబునన్
బొడిగా నెల్లర మెట్టి పోవునదియై పొల్పొందు నాక్రందునన్. 123

క. గుదె గొని యొక్కం డుర్కిన, మదనాగచయంబు నఱిమి మఱి మఱి డానిన్
సదమదము చేసి పైఁబడి, చిదురలు గావించె మునుము చికమక దీఱన్. 124

ఉ. నాగము నాగముం గదిసి నాలుగుదంతము లొక్కపెట్టునన్
జోగము గాఁగఁ గొట్టుకొనఁ జొబ్బిలునబ్బలువిస్ఫులింగముల్
భూగగనాంతరాళమునఁ బుట్టి జ్వలించెడునుల్కలో యనన్
వేగిరపాటునం బడియె విన్నబడం బెరవారిచిత్తముల్. 125

తే. ఎదుట నరిశతాంగము గని యెత్తి కాళ్లు, నొగలఁ బైఁ బెట్ట నీవల నగుతురగము
లవల నగునవి యట్లు సేయంగ నపుడు, గండభేరుండపక్షులకరణి నొప్పె. 126

చ. ఉభయబలంబులన్ హయము లున్నతచామరభూషితంబు లా
రభటికి స్థాయిగా లయఁ బరంగెడునట్లు ఖురాతిఘట్టనన్
శుభగతి శబ్దమేర్పడ వసుంధరఁ బాఱెడువేళ హంసముల్
ఋభువులకొండనుండి ధర కిట్లు ధ్వనించుచువచ్చె నాఁ దగెన్. 127

తే. వాజిఖురశబ్దమున నేమివరరవమున, ద్విరదబృంహితమునఁ బత్తివిక్రమరుతి
భేరిభాంకారమున శంఖభూరినిస్వనమున భూతల మఱచునా నలువు మీఱె. 128

సీ. కరికరోపము లైనకరములు తెగిపడి, వడి మిట్టిపడు నుసు రెడల నట్లు
రాలి శిరంబులు తాలువుల్ గదలంగ, మాటాడు నేమేమొ నోటినుండి
మొండెమై నెత్తుట నిండియుఁ గరవాల, ఘూర్ణించుచుం బోటు నాచ్చు లెసఁగ
నట్టియుం దలయు వే త్రెప నెఱుంగక, బాణంబు సంధించి పాఱ విసరఁ

తే. దాళఫలములు పడునట్లు తలలు వడిమె, తెఱచియుండినకన్నులు తేలఁ బడఁగ
మోముదమ్ములతో నేల పొల్పనయ్యెఁ, బ్రస్తుతాంభోజవనసరోవర మనంగ. 129

తే. సారమణిగణఖచితకేయూరభూష, కాంచితమహాభుజమ్ము లయ్యావని వ్రాలి

నలుగడన్ వేలకోలఁదినింద్రధ్వజములు, వెలసియుండెనొకో యనఁ దెలియనయ్యె. 130

శా. మాతంగాంగకముల్ తురంగతనువర్ష్మంబుల్ రథాంగంబులున్
స్ఫీతోగ్రాయుధఖండముల్ ప్రవిలసన్నిస్త్రింశముల్ భూషణ
వ్రాతంబుల్ గొడుగుల్ సిడంబులును గుప్పల్ తిప్ప లయ్యె న్సమా
ఘాతోర్వీస్థలమందు నాల్గుకడలం గ్రవ్యాదమోదంబుగన్. 131

క. ప్రేతారణ్యమున శవ, స్ఫీతం బగుచోట రక్తసిక్తాంగకులై
ఖ్యాతి గలయోధు లొప్పిరి, భూతలగతులై పలాశభూరుహము లనన్. 132

మ. గజశైలంబు హయోపలంబును బతాకావల్లినీరంధ్రమున్
ధ్వజవృక్షంబు గదోడుపంబును ధనుర్భంగంబు భూపాలస
ద్భుజనక్రంబును ఛత్రహంసమును మేదోమాంసజంబాలమై
సృజియింపం బడి నెత్తురువాక పఱచెన్ జేవట్టఁ గ్రవ్యాదముల్. 133

తే. పరిఘబాహులు వీరులు భయవివర్ధ, నంబు పరలోకవహ మగునమ్మహోన
దిని విహారంబు సల్పి వాహనము లనెడు, నోడలం జేసి తరియించి రుర్వినాథ. 134

వ. ఇట్లు చతురంగబలక్షయంబుగ నతిదారుణరణంబు ప్రవర్తించుచున్నంత భీమార్జునులు నలిరేఁగి నానావిధసాయకంబుల మన సైన్యంబు దైన్యంబు నొందించి పౌండ్రకదేవదత్తంబులొత్తి సింహనాదంబులు గావించుటయు నమ్మహారవంబు విని నెమ్మనమ్మున హర్షించుచు ధృష్టద్యుమ్నశిఖండులును నకులసహదేవులును ధర్మరాజుం బురస్కరించుకొని మద్రరాజుం దలపడి తదీయబాణంబులం బొదివి పోనీక నిలు మని యదల్చుచు వెన్నడించి తఱుముటయు నోటఱి మనవారు హాహాకారంబు సేయుచుఁ బ్రాణత్రాణపరాయణులై ప్రాణబంధువు నైనం జూడక వడిం బాఱఁ జొచ్చినం గని శల్యుండు సారథిం బిలిచి యిట్లనియె. 135

శా. సూతా! వీతుల నింతలో నడుపు మచ్చో ధర్మపుత్రుండు దా
శ్వేతచ్ఛత్రవిరాజమానుఁ డగుచు న్వెల్గొందుచున్నాఁడు నీ
ప్రీతిం జూపుచు నన్నుఁ బన్ను. మట కేరీతిం బ్రవర్తింతునో
నీతోఁ జెప్పఁగ నేల నీవ కనులన్ వీక్షింతు నాసత్త్వమున్. 136

క. నాయెదుట నిలువఁ బార్థుల, కీయెడ సామర్థ్య మింతయే లేమి నిజం
బీయెల్ల నీకుఁ దెల్లం, బై యుండెడు నెయిదు మటకు నతివేగమునన్. 137

వ. అనిన నతం డట్లు ధర్మరాజుసవిధంబునకుఁ దేరు పోవ నిచ్చుటయు నచ్చటి బలంబు రెచ్చి కయిపయి నచ్చిన శల్యుండును మహార్ణవంబు నేలవోలె వారిబలంబుల నెల్లఁ

జలంబున నాఁగియు నడ్డమై నిలిచినం గని విఱిగినమనసైనికులు మఱలి మరలం గూడుకొని మోహరించినం బోరు ఘోరం బయ్యె నయ్యెడ నకులుండును గర్ణపుత్త్రుం డగుచిత్రసేనుండును దలపడి కాలాంబుదంబులచందంబున నొండొరులపై శరవర్షంబు గురియుచుం బోరుసమయంబునఁ జిత్రసేనుండును. 138

—♦ నకులుండు కర్ణపుత్త్రులగుచిత్రసేన సుషేణ సత్యసేనులం గూల్చుట ♦—

మ. సితభల్లంబున మాద్రినందనునివిల్ చెండాడి మూఁడమ్ము లు
ద్ధతి ఫాలంబున నాఁటి ఘోటకములన్ ధాత్రీస్థలిం బెట్టి సూ
తుతలం గోసి సిడంబు గూల్చుటయు నార్తుం డయ్యె మాద్రేయుఁ డం
చితశృంగత్రయపర్వతంబుపగిదిం జెల్వొంది బల్వొందుచున్. 139

తే. ఖడ్గఖేటములను బూని కరయుగమున, విరథుఁ డగుట నహార్యశిఖరమునుండి
ధరకు లంఘించుసింహంబు కరణి నపుడు, స్యందనమునుండి లంఘించి చనెదునంత.

మ. జడివానం బలెఁ జిత్రసేనుఁడు కడున్ శాతాశుగవ్రాతముల్
వడిమై నేయుఁడు వాని నెల్ల బలకన్ వమ్మొచనం జేయుచుం
గడిమిన్ వానిరథంబుపై కుతికి ఖడ్గం బెత్తి తచ్ఛీర్షమున్
గడికండ ల్వెడలంగఁ గోసి డిగెఁ దత్కాయంబు గూలెం ధరన్. 141

ఆ. మేలు నకుల మేలు మే లనువచనముల్, సింహనాదములును జెలఁగె నపుడు
సూతపౌత్త్రు లట్లు భ్రాత ద్రెళ్లుటఁ గని, శోకరోషదూషితాకృతు లయి. 142

వ. సుషేణసత్యసేను లనువారు ప్రావృట్పయోధరంబు లట్లు శరాసారంబు నిగిడించుచు నకులుం బోనీక పొదివిన నతండు నంతలో వేఱొక్కతే రెక్కి కార్ముకాంతరంబు గ్రహించి కాలాంతకయమోపముండై వారి మార్గొనునంత వారు వానిరథంబు వితథంబు గావింప నెంచి వివిధప్రదరంబులు పరఁగించుచున్నం గని నవ్వుచు. 143

చ. నకులుఁడు నాల్గుబాణముల నాల్గుతురంగముల న్వధించి కొం
చక యొకవాఁడికోలఁ గొని దయ్యన నయ్యెడ సత్యసేనుచే
తికి నగువిల్లు ద్రుంచుటయుఁ దే రొకఁ డెక్కి యతండు గన్నులు
న్మోకమును గెంపు లీనఁ దనమున్న సుషేణుఁడుఁ గూడఁ గ్రుద్ధుఁడై. 144

ఆ. అఱిమి తఱిమె నకులు నతఁ డసంభ్రాంతుఁడై, రెండురెండు వాఁడికాండములను
గర్ణసుతుల వారిఁ గడు నొవ్వ నేయుఁడు, నలుకమై సుషేణుఁ డంది నడరి. 145

క. మాద్రీసూనునిధను వొక, క్షుద్రకమునఁ ద్రుంచి నవ్వెఁ గ్రోధము గ్రమ్మన్
రౌద్రరస మొలుక నకులుఁ, డద్రిసముం డగుచు నిలిచి హుంకారమునన్. 146

ఉ. ఒండొకవిల్లు గైకొని మహోద్ధతితోడ సుషేణుఁ డూఁగఁ గాఁ
గాండము లేను వైచి చులుకం ధను వొంటఁ బగిల్చి సత్యసే
నుండు దలంక నత్తఱి ధనుస్సును దత్తఱి రైపడ న్వడిం
గొండొక చూపెఁ జూపుటయుఁ గోపము దాపము నేపు సూపఁగన్. 147

సీ. సత్యసేనుఁడు భారసాధన మగునొండు, ధను వంది పాండవు మునుఁగ నేసె
నతఁ డీసున న్వాని నన్నింటిఁ దునుమాడి, రెండేసితూపుల రేఁచె వారి
వా రిర్వురు న్వాని సారథి నోనేసి, రంతలో సత్యసేనాహ్వయుండు
కృతహస్తుఁ డై పాండుసుతు నిరపేక్షయు, సిమ్హాసనును దెగ నేసె నపుడు

తే. కనలి నకులుండు రథమంద కాలు నిలిపి, నాలుగేలు గ్రోయుసర్పంబునకును దీటు
వచ్చురథశక్తి బిట్టెత్తి వైచె దాన, గుండె పవియఁడు సత్యసేనుండు గూలె. 148

ఉ. సోదరు నట్లు సేయుటకు శోకము పైకొన మీఁకఁ జేసి శా
ర్ద్యోదయసన్నివిష్టుఁ డయి యుగ్రతఁ జూపుచు నాసుషేణుఁ డా
భూదయితానుజుం బదివి మూఁడను నాలుగు నైదు తూపులన్
సారథియు వారువంబులు ధ్వజంబును గూలఁగ నేసె నార్చుచున్. 149

క. విరథు డగుతండ్రిఁ గనుఁగొని, సరయమ్మున భీమసుతుఁడు స్యందనసహితుం
డరుదేర నెక్కె నకులుఁడు, బిరబిర సుతసోమురథము బిరుదుమగం డై. 150

శా. కోదండంబు మఱొండు గైకొని కడుం గోపంబు దీపింపఁ గా
నాదాయం గొని యేయ నాతఁడు మహోగ్రాకారుఁ డై వానిపై
నైదమ్ముల్ సుతసోమువక్షమున దివ్యాస్త్రంబు లీరైదు నీ
రైదుం బాఱఁగ నేసి యుగ్రాసునను బెల్లార్చెం గడుం జేర్చుచున్. 151

తరళము. అలుక నానకులుండు కన్నుల నగ్నిమంటలు గ్రాయుచోఁ
జులుకఁ గోటులు మేఁటి లమ్ములు చుట్టుప్రక్కలు నిండఁ గా
మెలపుచున్ నిశితార్ధచంద్రము మీఁటి మీఁటినఁ దచ్ఛిరం
బిలఁ బడె న్నిమిషార్ధమందు మహీపతుల్ వెఱఁ గందఁగన్. 152

మ. వడి స్రోతస్వినిచెంత వృకుఁడు బలెన్ వ్యాలోలతం గాంచి కాం
చెడువారల్ వెఱగందఁ గర్ణసుతుఁ డాజిక్షోణిపై వ్రాలినన్
దడముల్ వాఱఁగఁ జొచ్చె తచ్చపడి మద్రక్ష్మావిభుం డంతటం
గడిమిం గైకొని నిర్వారించె బలముం గావించె సింహధ్వనిన్. 153

క. తెరలినమూఁకలు మరలం, దిరిగి సముద్దండవృత్తిఁ దెగి మద్రపతిం
బ్బరివేష్టించి భయం బఱి, దురమునకుం దిగిరి నరులతోఁ బెనఁగొనుచున్. 154

వ. అట్టియెడ. 155

మ. శినివీరుండును భీముఁడుం గవలునుం సింహధ్వనుల్ పంకజ
ధ్వనులుం బార్థివినాదముల్ సెలఁగ దివ్యవ్యూహసంపన్నులై
మును నాధర్మజునిం గ్రహించుకొని సంపూర్ణప్రభావంబునం
మనసైన్యంబులఁ దాఁకి వీఁకమెయి భీమప్రక్రియం బోరుచున్. 156

వ. కపిధ్వజుండును సంశప్తకులం గెలిచి ధృష్టద్యుమ్నప్రభృతులం గూడి వారికిం దోడుపడుటయు నప్పు డిరువాఁగునందును దొల్లి దేవదానవయుద్ధంబుం బలె భయవర్ధనం బగుదారుణయుద్ధంబు యమరాష్ట్రవివర్ధనంబై సిద్ధించె నాయుద్ధంబునఁ బాండవబలార్దితంబు లగుమనబలంబులు కలంగి తూలంగి ఆర్చ్చపడుచు హెచ్చుడిగి వర్షాకాలప్రవాహంబులట్లు వ్యాకులంబులై కార్చిచ్చు ముట్టినమృగకులంబు చందంబునం గోడిమి దప్పి రొంపిం గ్రుంగినమొదవులుంబోలెఁ బాముచావున వికలంబై యున్నం గని శల్యుండు వాని నుద్ధరించువాఁడై చేయంగలసైనికులం గూర్చుకొని పేర్చినపరాక్రమంబున మౌర్వీగుణక్వాణనంబు గావించుచు మార్తుఱ మార్కొని మార్గణాసారంబు వరగించుచున్నంత. 157

—♦ శల్యుండు పాండవసేనపై విజృంభించుట ♦—

మ. ధర గంపించె సపర్వతంబుగను శబ్దం బిమ్మ్చుచున్ హెచ్చి భా
స్కరబింబంబును దాఁకి రాలె గొఱ్ఱవుల్ కావ్యోగ్రిజుల్ సౌమ్యుతోఁ
గురుసేనాగ్రమునందుఁ దోఁచి మిగులన్ గ్రూరంబుగాఁ జూచి రం
బరమెల్లం గలుషప్రకారమునఁ జూపట్టెన్ ఘనార్థంబునన్. 158

వ. మఱియు మనసేనాంతంబున మహీపంబులు మృగంబులుఁ బక్షులు నపసవ్యంబుగం దిరుగుటయుఁ గైదువులు మండుటయుఁ గాకోలూకములు కేతనాగ్రంబుల వ్రాలుటయును లోనగునుత్పాతంబులు దోఁచెఁ దోఁచినం దలఁకక శల్యుండు శరాసారంబు వరఁగించుచుఁ బాండవవీరులం దలపడి ధర్మరాజభీమసేనులపై శరవర్షంబు నిగిడించి మాద్రేయ ద్రౌపదేయ శైనేయ ధృష్టద్యుమ్నశిఖండులపైఁ బదేసి బాణంబులు ప్రయోగించినంత వారిం దలకడచి సోమకులు బలంబులతో వేలకొలంది వచ్చి మద్రపతిం జుట్టుముట్టుటయు నతండును. 159

మ. క్షయకాలాంతకునట్టిఁడై పిడుగులం జాలించువాలమ్ములన్
భయదప్రక్రియఁ దోఁప నేయుటయుఁ దత్పాతంబునం బత్తులున్

హయములఁ హత్తులుఁ దేరులుం దెగుట భగ్నాకారమై పార్థసే
న యిట్లు దోఁగియు వీఁగియుం బఱచె నానారీతులం గూరియున్. 160

తే. వెగడుపడి యథాయథ లయి వెనుక కొదిగి, పాండవాగ్రజుమఱువున నుండ నతఁడు
దొరలఁబురికొల్పుకొనిశల్యుఁదొడరుటయునునాతఁడాతనిఁబొదివెఘోరాస్త్రసమితి.

క. చతురంగబలాన్వితుఁడై, యతిరయమున వచ్చి పడెదునమ్మద్రపతిన్
సితశరముల వారించెం, బతి మత్తద్విపమువడిని బరగోలబలెన్. 162

సీ. అలిగిశల్యుఁడు ఘోర మాశీవిషోపమ, మగుతూపు విడఁ బాండవాగ్రజుపయి
నది వానికంకట మఱవఱలుగఁ జేసి, వ్రచ్చి వేన్ బుడమిలోఁ జొచ్చె నంత
నంతకోపముఁ దగుననిలాత్మజుఁడు శల్యు, నేడుతూపుల మేను గాఁడ నేసె
నాలోన సహదేవుఁ డయిదును నకులుఁ డీ, రైదుఁ గ్రుచ్చిరి శల్యు నంగకముల

తే. ద్రౌపదేయులు పెక్కు లార్తాయనిపయి, నేయఁ గనివచ్చి కృతవర్మ కృపుఁడు ద్రౌణి
శకునియు నులూకుఁడును నీకొడుకులు మద్ర, భూపతికిఁ దోడుసూపిరద్భుతముదోప.

తరువోజ. కృతపుంఖుఁడై మించి కృతవర్మ మూఁడు, కత్తికోలల భీముఁ గెరలి నొనేసె
నతిబలుఁడగుకృపుఁ డంపఱన్ ద్రుపదు, నాత్మజు నఱిమె ఘోరాజి నాసుబల
సుతుఁడును ద్రౌపదీసుతుల మార్కొనియె, సునిశితాస్త్రమ్ములసోనలన్ ద్రౌణి
ప్రతిభమైఁ గవలకుం బ్రత్యర్థి యయ్యెఁ, బ్రభువు ధనంజయుపయి కేగి కవిసె. 164

వ. ఇట్లు ద్వంద్వంబులై పోరునెడ హార్దిక్యుండు. 165

చ. వడముడి ఋతువర్ణముల వార్వములం దెగ నేయుఁడున్ రయం
బడర నతండు దండధరుఁడై ధరకుం డిగి పోరొనర్చె నె
క్కుడువడి మద్రరా జెదురుకో సహదేవుహయాళిఁ గూల్చె నా
తఁడు కడిమిన్ నరాజిఁ గొని తత్సుతునిం దెగ నేసె నీసునన్. 166

సీ. కృపపార్థతులపోరు విపులమై వెలయువో, సౌబలుండు పదేసిసాయకముల
ద్రౌపదేయుల నేసె నేపున గురుసూతి, మఱియు భీమతురంగమములఁ ద్రుంచె
నతఁ డేచి గదఁ గొని కృతవర్మరథరథ్య, ములఁ ద్రుంప నాతండు తొలఁగి చనియె
మద్రేశ్వరుండు సోమకపాండవులఁ బోరి, పుచ్చు చమ్ముల ధర్మపుత్రు నఱిమె

— శల్యభీమసేనుల గదాయుద్ధము —

తే. నఱిమినం గ్రుద్ధుడై భీముఁ డవుడు గఱచి, కాళరాత్రికి నెనవచ్చుగదను బూని
శల్యునాల్గుహయంబులఁ జదియ మోదె, గంధమాదనమున గుహ్యకగణములభలె.

ఉ. మద్రవిభుండు వహ్నివలె మండెడుతోమర మెత్తి యొండొకం
డద్రిసమానధీరుఁ డగు నమ్మరుదాత్మజు పేరురమ్మునన్

రౌద్రమునం బడ న్విసరె రావముతో నది వచ్చి హెచ్చి ని
ర్నిద్రరయంబునన్ మఱువు నిల్వనఁ జింపగ భీముఁ డుగ్రుఁడై. 168

ఆ. దానిఁ బూని మద్రమానవేంద్రునిసాది, వక్షమందుఁ బడఁగ వైచుటయును
దాన గుండె లవియ దక్షిణస్థుఁడు గూలె, ముక్కుదోయి నెత్రు గ్రక్కుకొనుచు.

వ. శల్యుండు నట్టికృతప్రతికృతకార్యంబున కద్భుతంబు నొంది ధీరస్వాంతుండు గావున గదాదండంబు భుజదండమండితంబు గావించుకొని ధరణికిం డిగ్గి కొండవోలె నచలుండై నిల్చి ప్రళయానిలునిపగిదిఁ బ్రజ్వరిల్లి పాశహస్తుం డగునంతకునితెఱంగున భయంకరుండై వజ్రపాణి యగువాసవునివడువునం బ్రతాపించుచు వృకోదరుని మార్కొనుటయు నతండు నతని కభిముఖుం డయ్యె నప్పుడు శంఖభేరీమృదంగాది నిస్వనంబులును సింహనాదంబులును శూరజనప్రమోదసంపాదకంబు లయ్యె నయ్యెడ నిరువాఁగుయోధులును గదాయోధననిపుణు లగువారిపోరు చూచి మేలు మే లని మెచ్చుచు గదాయుద్ధంబున భీమసేనుం దాఁక మద్రేశ్వరుండును బలరాముండునుం గాక తక్కినవారు చాల రనియు మద్రరాజుగదావేగంబు సైరింప వృకోదరుండు గాక లే డనియుఁ బ్రశంసించుచుండి రనంతరంబ. 170

తే. వార లిరువురు నుడివోనిబీర మెసఁగఁ, జలము బలమును దళ మయి వెలయ మండ
లప్రచారము లొనరించి సుప్రసిద్ధ, వృషభములరీతిఁ గవిసి గర్జిల్లి రపుడు. 171

సీ. ఆవల్గితులు గదాహస్తులు మద్రరా, జవృకోదరులు పోరు సలుపుచుండ
మండలావర్తకమార్గంబుల గదాది, హారణంబుల స్ఫులింగభర మెసంగె
భీమసేనునిగద భీమ మై విద్యు ద్రు, భాభాసమాన మై పరఁగఁ జొచ్చె
మద్రేశ్వరునిగుదె మండు చలాతచ, క్రక్రమంబున భయప్రథిత మయ్యె

తే. సన్నిర్గాక ళ్యోకళ్ల జయించునాసఁ జేసి, వారు బెట్టిదముగ వ్రేయుఘోరగదలు
భూరినిర్ఘ్వానమునఁ దాఁకి పుష్కరమునఁ, గురిసె నంగారవర్ష మచ్చెరువు గాఁగ.

ఉ. కొమ్ములఁ గ్రుమ్మలాడుకొనుకుంజరయుగ్మము పోల్కి వార లు
గ్రమ్ముగఁ బోరి పోరి ఘనఘాతములన్ నిలువెల్ల నెత్తుటన్
గ్రమ్ముకొనం బొసంగి ననకారునఁ బూచినకింశుకావనీ
జమ్ములు నా నెసంగుచుఁ బ్రశంసకు నెక్కిరి యక్కజంబుగన్. 173

చ. కుడి యెడమల్ ప్రహారములకుం గుఱి సేయుచు వార లిద్దఱున్
విడువక పోరుకొం చెడరు వేచి గదావినిపాతనిస్వనం

చెడ మొకయింత లేక సభ మెల్లెడ నిండగ మెందుకోఁ గడుం
గడువడి ధాత్రి దద్దళిలఁ గానని నేచిరి తూచినట్లు గద. 174

ఆ. వెనుక వెనుక కొదిగి యెనిమిదిపదముల, కొలఁది యొక్క పెట్టఁ గూడ సిగిడి
గుదెల బెట్టడంచుకొని మండల ప్రచా, రములఁ జూపి రిర్వు రమితశక్తి. 175

— గదాయుద్ధమున మూర్ఛిల్లి శల్యుని కృపుఁడు దొలంగం గొనిపోవుట —

చ. అచల చలించునప్పుడు మహాగిరు లొక్కఁడు నొక్కఁ డూఁగి తాఁ
కుచు వడిఁ గొట్టుకొన్న గతి ఘోరగదాభిహతుల్ సెలంగఁ బో
రుచుఁ గడు నాగ్రహంబున మరుత్సుతమద్రమహీక్షితుల్ భయ
ప్రచురము గాఁగఁ గొట్టుకొని వ్రాలిరి నేలకు నిద్ద ఱద్దిరిన్. 176

తే. ఇట్లు లొంగొరువురు గదల బిట్టు దాఁకి, పడినవారలఁ జూచి యుభయబలములఁ
గలుగువారు హాహాకారములు పొసర్చి, రార్తనాదంబు రోదసి నంటుకొనఁగ. 177

తే. అంతలో వచ్చి గౌతముఁ డలసి పడిన, శల్యు నెక్కించుకొని తనస్యందనమున
ననికిఁ దొలఁగించె బలవంతు డగుట భీముఁ, డరసిమేషమునకు మూర్ఛ యరుగ లేచి.

వ. ఉద్దండగదాదండమండితకరుండై మద్రపతిం దలకించి పోకుపోకు మని పిలుచునంత
దుర్యోధనపురస్సరు లగుసైనికు లెల్లరు మొల్లంబై వివిధవాదిత్రంబులు మ్రోయు
కలుగఁ బాండవబలంబులపైఁ బడి కడిమిం జూపుచున్నం గని తత్సైనికులు చేకితాన
పురస్సరులై భీమసేనుం దలకడచి సింహనాదంబులు సేయుచు దుర్యోధనపురోగము
లగువారి మాఱుకొని పోరుటయును. 179

శా. ప్రాసం బెత్తి సుయోధనుండు భుజదర్పం బేర్పడన్ శాత్రవుల్
త్రాసం బంద నదర్చి పేర్చినబలప్రౌఢిన్ బ్రదీపించి య
త్యాసన్నుండగు చేకితానుహృదయంబందుం బడన్ వైచె వీ
తాసుండై రుధిరంబు గ్రక్కుకొనువాఁడై కూలె నుర్వీస్థలిన్. 180

వ. అట్లు చేకితానుండు గూలినం గని కోపాటోపదీపితులై పాండవవీరు లొక్కుమ్మడి
మాఱ్కొని మనబలంబులపై మార్గణాసారంబు గురియుచున్నంత మద్రరాజపుర
స్కృతు లగుకృపకృతవర్మసౌబలులు ధర్మరాజుం దలపడిరి దుర్యోధనుండు ధృష్ట
ద్యుమ్ను నెదిరించె ద్రోణపుత్త్రపురస్కృతు లగుమూఁడువేలరథంబులవారు కౌర
వేశ్వరచోదితులై సవ్యసాచిపయిం గవిసి రంత. 181

చ. తఱుగక వారికిం బరమదారుణమైనరణంబు సెల్లె న
త్తఱి ధరణీపరాగము తతంబుగ రేఁగి కడింది చీఁకటుల్

పటువడఁగ నామధేయములఁ బట్టి పెనంగిరి జోదు లంతలో
నెఱసిననెత్తు రొత్త మయి నిండినధూళి నడంచె నంతటన్. 182

ఉ. భీరుభయంకరం బగుచుఁ బేర్మికి నెక్కినతద్రణంబునన్
భీరుత యింతయుం గొనక బీరము తోరము గాఁగఁ బోరి రా
వీరులు స్వర్గలోకపదవిం గొనువారును బోలె నాలమున్
దీరుచుఁ జేయుఁ జేడ్పఱ మదిం గొనుఁ డంచు నెలుంగు లేర్పడన్. 183

సీ. శల్యుఁ డప్పు డజాతశత్రుని మార్కొని, నిశితసాయకములు నిగుడఁ జేసె
నీసునం బాండవుఁ డీక్షించి పదునాల్గు, నారసంబుల వాని నవయ నేసె
బహుకంకపత్రముల్ పరఁగించి మద్రేశుఁ, డొక్కతూపున రాజు నుక్కడంచె
నందుల కెంతయు నలిగి ధర్మసుతుండు, శతశరంబుల మద్రపతి నొగిల్చె

తే. వానికిం జక్రరక్షకు లైనచంద్ర, సేను డబ్బదింటను ద్రుమసేను నర్వ
దింటఁ దెగటార్చె తత్సూతు వెంటఁ దొమ్మి, దింట నొనేసె మెచ్చంగ మింట సురలు.

వ. దానికిం గోపించి మద్రనాథుండు. 185

—శల్యుండు ధర్మరాజు నొగిలించుట—

మత్త. పంచవింశతిచేదియోధులఁ బట్టి కూల్చియు సాత్యకిం
బంచవింశతిసాయకంబులఁ బావని న్నరుసప్తతిన్
నొంచి మాద్రికుమారులన్ శతనూత్నమార్గణపంక్తులం
గొంచ కేసి యదల్చి పుచ్చెను గో యటం జెలుఁగిన్పుచున్. 186

తే. ఇల్లు కోలుపునంగు మద్రేశ్వరుఁ గని, కోపఘూర్ణితనేత్రుఁడై గొంతికొడుకు
నవఁక నాశీవిషోపమకాండసమితి, నలుపశల్యుసదుక్కణున్ విఱిచె నధిప 187

చ. ధ్వజ మటు పాండవాగ్రజునిధన్వముఁ దెగి నేల గ్రుల్లఁగన్
ధ్వజనవిభుండు క్రుద్ధుఁ డయి వాలికతూపుల వాని శాత్రవ
వ్రజ తలఁకన్ నిగిడ్చి శినివర్యుని భీముని మాద్రిపుత్రులన్
నిజజన మెన్న నొక్కొకరిని న్వడి నొంచి పదేసితూపులన్. 188

తే. దిశలు ప్రదిశలు నిండఁగ దివ్యశరము, లొలుకుచును బాండవాగ్రజునురమునందుఁ
గొంచ కెన్నే శరములు గీలించుటయు న, తండు హతవిక్రముం డయి తత్తఱిల్లె. 189

వ. అయ్యవసరంబున. 190

ఉ. శౌర్య మవార్య మై పరఁగ సాత్యకి భీముఁడు మాద్రినందనుల్
భూర్యచలంబులో యనఁగ ముట్టడి పెట్టుచు బెట్టు నొంచినన్

ధైర్యహిమాద్రి మద్రపతి తద్రథికోత్తములం దెరల్చె నా
శ్చర్యము నొంది దేవతలు చాఁగు బురే యని సన్నుతింపఁగన్. 191

సీ. అపుడు శల్యప్రాయుఁ డైనశల్యుని భీముఁ, డొక్కవాలమ్మున స్రుక్క జేసి
మఱియు నేడమ్ములు పఱపె శైనేయుండు, నూఱమ్ము లతనిపైఁ బాఱ నేసె
నకులుఁ డైదమ్ముల నవయఁ జేసెన్ సహ, దేవుఁ డేడింట మర్దించి మఱియు
నేనమ్ము లదరించె నౌ నని జను లెల్ల, మద్రేశ్వరుండును మట్టుమీఱి
తే. సాత్యకిం బంచవింశతిసాయకముల, భీమసేను ద్రిసప్తతివిశిఖములను
నకులు సప్తాశుగమ్ముల నవయఁ జేసి, కోపఘూర్ణితనేత్రుఁ డై యేపుమీఱి 192

క. సహదేవునివిల్లొకభ, ల్లహతిం దునుమాడి శౌర్యలక్ష్మీవృతవి
గ్రహుఁడై ముయ్యేడింటన్, దహతహ వొడమంగఁ జేసెఁ దనమేనల్లన్. 193

వ. సహదేవుండు నొండువిల్లు సజ్యంబు గావించుకొని కొంచక మ్మాతులుని మార్గణ పంచకమ్మున నొంచి సూతు నొండును మూఁడు వాఁడికోలలం దూల నేసి కోలుమసంగె నంత వృకోదరుండు డెబ్బదియు వాసుదేవసోదరుండు తొమ్మిదియు ధర్మరాజఱువదియు శరంబు లామద్రపతి గాత్రంబునం గీలించుటయు నతండును. 194

ఉ. గైరికధాతుపూత మగుగ్రావము వోలె నసృక్ప్రదిగ్ధుఁ డై
వారల నైదు నై దయినవాఁడిశరంబుల గాఁడ నేయుచున్
గ్రూరశరం బొకండు గొని గొబ్బునఁ గూలఁగ నేసె ధర్మరా
జోరుశరాసనంబు తనయున్నతికిం బ్రజ యెల్ల నెన్నఁగన్. 195

మ. యమరాణ్ణందనుఁ డన్యకార్ముకకరుం డై శల్యభూనాథుదే
హమునం దూఱఁగ నేసి భూరితరశల్యంబుల్ శతాంగంబు ర
థ్యములున్ సారథియున్ ధ్వజంబు శరబృందవ్యాప్తి పుట్టంగ ద
ట్టముగాఁ గప్పుచు దృష్టికిం దెలియకుండం జేసెఁ జెల్లీసునన్. 196

ఆ. మునిఁగి యుండె ధర్మపుత్రునిశరముల, నింతమాత్రలోన నెసక మెసఁగి
మద్రభూవిభుండు మార్గణదశకంబు, ధర్మరాజుమేనఁ దవుల నేసె. 197

ఉ. వాఁడిమెఱుంగుటమ్ము లటు వాఱఁగ నేసిన నీసుమెంపునం
గూడినసత్యకాత్మజుఁడు కోటులు వేటులు మేటితూపు లా
ప్రోడపయిఁ బిగుడ్చుటయుఁ బ్రాఁకిడిపోయి యతండు వాని వి
ల్వేఁడుకకుం బలె న్విఱిచె విన్నను వొప్ప క్షురప్రసంగతిన్. 198

ఆ. అంతఁ బోక మారుతాత్మజముఖ్యులు, మూఁడు మూఁడు వాఁడిపోడిమి గల
కాండములను నొంపఁ గనలి సాత్యకి మద్ర, రాజుమీఁదఁ దోమరంబు వైచె. 199

—భీమసేనాదు లొక్కపెట్ట శల్యునిపయిం బడి పోరుట—

సీ. భీమసేనుం డొక్క భీమనారాచము, నకులుండు తా నొక్క ప్రకటశక్తి
సహదేవుఁ డొకశక్తిసంపన్నమగుగద, ధర్మరా జొకమహోద్ధతశతఘ్ని
శల్యునిపై నేయఁ జాలినం గృతహస్తుఁ, డగునతం డెంతయు నాగ్రహమునఁ
దోమరం బొకకోలఁ దూలించి నారాచ, మును రెండుగాఁ జెండి కసలుశక్తి
ఆ. నత్తమిల్లఁ జేసి యగ్గద నడఁచి శ, తఘ్నిఁ దూపుదోయిఁ దఱియ నేసి
వార లేవు రొల్లఁ బో రణమొనరించి, సింహనాద మపుడు చేసె నెగిచి. 200

మత్త. దానికిన్ మది సైఁప కాహరితమ్ముఁ డొండొకవిల్లు చేఁ
బూని శల్యుని రెండుతూపుల మూఁడుతూపుల సారథిన్
మేను లుచ్చిచనంగ నేసిన మించి మద్రవిభుండు క్రో
ధానుగుం డయి నేయి వేల్చిననగ్ని నా వెలుఁగొందుచున్. 201

ఉ. తోత్రములన్ గజంబులను ద్రుళ్లడఁగించినరీతి వారలం
బత్రిచయంబునన్ నవయ షక్కి నొనర్చిన వార లందఱున్
ధాత్రి నృపాగ్రభాగమునఁ దాళుకొనంగ నశక్తు లైరి నీ
పుత్రకుఁ డెంచె మద్రపతిపోడిమికిం దెగి రంచు శాత్రవుల్. 202

వ. అప్పు డప్పవమానపుత్రుండు ప్రాణంబులకుం దెగించి మద్రాధిపతిపయిం గవియుటయు
నకులసహదేవసాత్యకులును వానికి బాసటయై బాణపరంపరం బరఁగించిన నతండు
కొండొక సరకుగొనక వారల నందఱ మార్కొని పెనఁగుచుండె నంతఁ బాండ
వాగ్రజుం డొక్కక్షురప్రమున మద్రరాజచక్రరక్షకు నుక్కడించిన నుడివోనిబీరంబు
తోరంబుగా నమ్మహారథుండు సటాసముత్పాటనామర్షితహర్యక్షంబు చందంబునం
బొందుపడి పాండవసైన్యంబు దైన్యంబు నొందించుచుండం గని కౌంతేయాగ్రజుండు
గదాగ్రజు వచనం బెల్లు సత్యంబగునో యితండు నాబలంబుల నెల్ల నొల్లఁబోఁ
జేయుచున్నవాఁ డని మనంబునం దలపోయుచున్నంత నెంతయు సమంతంబుగ
మూఁగినమూఁకల నెల్ల ముసుంగు వెట్టి మద్రేశ్వరుండు నిజమార్గణాసారంబున నింగి
నీరంధ్రంబు గావించి సింహనాదంబు గావించుటయు ధర్మరాజపురోగము లగు భీమ
సేనప్రముఖు లందఱు నతనిఁ గడవ నేరకున్నంత నంతరాళంబునం గలదేవదానవు
లాశల్యుపరాక్రమం బగ్గించుచుండి రంత నక్కడ సవ్యసాచి త్రిగర్తసైన్యపరివృతుం
డైనయశ్వత్థామం దవిలి. 203

ఉ. మూఁడు శిలీముఖంబులను గుండఱ నట్టఁగ నీర్చి ద్రోణిపైఁ
గాఁడఁగ నేసి తద్ధనువు గాంపసముగంబున వేఁబునేయఁ జే

వాఁడి మొనంగ నేసి శరవర్షమునన్ మఱియు న్మునుంగఁగా
నోడక రేయుఁబుం దెఱలకుండిరియు భండనముం బొనర్చెచున్. 204

మ త్త. ద్రోణపుత్రరోగన ల్ రణదుర్మదుల్ భననీయు ౦ం
స్థాణు నోర్చినబల్లిదుం డగుసవ్యసాచిరథంబుపై
బాణవర్షము నోల్కుచుం గనువాఁడిపోడిమిఁ జూపఁ ద
ద్బాణపంక్తులఁ గప్పఁగాఁ బడెఁ దద్రథం బపు డెంతయున్. 205

క. సావయవంబుగ శరమయమై వెలయుచు శాకశాసనాత్మజు రథ ము
ల్కావృతదివ్యవిమానము, లేవం బంబుపొంచె నెఱ గనిందిగఁ దోఁచన్ 206

వ. అంత నయ్యర్జునుండు 207

ఉ. సన్నతపర్వదుర్విషహసాయకసంక్తుల నాలమేఘవ
ష్టి న్నిరసించుచండమునఁ జిక్కనయై భవరేయుసైన్యమా
దు న్నెఱయంగ నేసి కడు నూల్కొని కోల్కొని సాధ్వసాల సం
పన్నముగా నొనర్చె రణభాగమునం గలప్రాణికోటికిన్. 208

ఆ. పార్థపావకంబు బహుళబాణాసన, ప్రచలనావిలమునఁ బ్రజ్వరిల్లి
యురుతరాస్త్రకీల లొలయ నీసైన్యాంధ, నమ్ములన్ దహించె ముమ్మరించి. 209

వ. అయ్యవసరంబున నర్జుననామాంకితంబు లగునాశుగంబులం జేసి మనబలంబున నేనుం
గులు పీనుంగులై శతాంగంబులు వికలాంగంబులై వారువమ్ములు వమ్మై కాలుమాని
సులు నుసియై పోవం బోడి మొసలూఁశీరంబులును బఱియు లైనపతాకములును గడి
కండ లైనకైదువులును నఱవఱ లైనమైమఱువులును దుము రైన కేయూరకుండలాది
విభూషణంబులును దుత్తుము రైనచామరంబులును దెగినకాలు సేతులును దునిసిన
శిరంబులును గుప్పలై తిప్పలై యుప్పరం బంటుచొప్పున నొప్ప నప్పు డప్పుడమి యం
తయు మాంసశోణితకర్దమం బై ప్రళయకాలరుద్రాక్రీడనంబు వోలె భీరులకుం
ద్రాసజనకంబును శూరులకు హర్షవర్ధనంబు నై యొప్పె నప్పట్టున నప్పాకశాసనా
త్మజుండు ద్విషాహస్రరథికవరులం బరిమార్చి ప్రళయంబునఁ జరాచరజగంబుల
నేర్చువిధూమపావకుండు వోలె వెలుంగుచు నిరుపమానతేజోవిరాజితుండై యుండ
నాచార్యనందనుండు వానిం దాఁకి వీఁకమెయిఁ బ్రావృట్పయోధరంబు వోలె శరా
సారంబు వరఁగించుచు విజృంభించి. 210

శా. పం డ్రెం డమ్ములు ఫాల్గునాంగకముపైఁ బాఱించి శారించి వి
ల్కాం డ్రెన్నం బదితూపులన్ హరియెడల్ గాఁడం బ్రయోగించినం

దీంద్రంగల్గియు ఫాల్గుణుండు నగి గాండీవంబు సారించుచుం
దండ్రిం బోనిగురుండు గన్నసుతుఁడన్ తాత్పర్యముం జేయుచున్. 211

ఉ. ఒక్కముహూర్తమాత్ర మఱఁ దుండియు మెండుగ నేయ నొల్ల కీ
సెక్కినచిత్తముం గలిగి యింతటిలో మృదుపూర్వ మట్లు గా
నెక్కొని దేశికాత్మభవునిం గొని వానిరథాశ్వసూతులం
జక్కడఁచెన్ నిశాతశరసంతతులం బరఁగించి మించఁగన్. 212

తే. మ్రోడువడియున్న తేరిపై ద్రోణసుతుఁడు, నిలిచి యొలనవ్వు మొలకెత్త నలుకఁబూని
పరిఘమును బోనిముసలంబు పట్టి విసరె, భరకులదీపకుని తేరిపైఁ బడంగ. 213

చ. వడివడి వచ్చుదానిఁ గని వాసవనందను డింతలోపునం
గడిమిని సప్తఖండములుగా నొనరించి హసించినం గడుం
గడు నలుకం గ్రహించి పరిఘంబు గురూద్భవుఁ డూఁది వ్రేసెఁ గ
వ్వడియును దాని నేలఁ బడ వైచి శితాశుగపంచకంబునన్. 214

క. నృపు లెల్లఁ దల్లడిల్లఁగ, నపు డాగురుసూతి నడఁచె నమ్మొగి మూఁటం
గృప లేనియట్టి దగుచుం, గృపికొడుకమ్ముమును పేఁగి యేగె సురథుపైన్. 215

—అశ్వత్థామ సురథుఁ డనుపాంచాలకుమారుం జంపుట—

ఆ. సురథుఁ డలుక వచ్చుగురునందనునిఁ గాంచి, సరభసముగ వాఁడి శరము లతని
పయిఁ బరంపరలుగఁ బరఁగింపఁ బాంచాల, సుతుని కలిగి ద్రోణసుతుఁడు నగుచు.

మ. కుటిలభ్రూకుటియై పదాహతపృథాకుప్రక్రియన్ రోఁజుచున్
గుటకల్ వేయుచు నాకుచుం జెలవు లుగ్రుండో యనన్ మండుచున్
రటనం బేర్పడ భూనభోంతరమునన్ జ్యావల్లి మ్రోయించుచున్
బటువై కాలకరోగ్రదండ మన నొ బాణంబు వైచె న్వడిన్. 217

చ. అది పిడుగట్లు వానిహృదయంబు వగిల్చి నిమేషమాత్రలో
విదితము గాఁగ నారణభువిం జొరఁ బాఱె నొకింతలోపలన్
భిదురహతాద్రిశృంగమనఁ బృథ్వికి వ్రాలి గతాసు నయ్యె ద్రో
వదియనుజన్ము లెల్లరును బమ్మెరవోయి చలించి రమ్మెయిన్. 218

క. గురుసుతుఁ డంతన్ సురథుని, వరరథమున నెక్కి రథికవర్యుం డగుచుం
గరమరుదుగ సంశప్తక, పరివృతుఁడై మఱియు వీఁకఁ బార్థుం దాఁకెన్. 219

క. అపు డర్జునునకు వీరికి, నపరిమితాస్త్రములయుద్ధ మతిభర మయ్యెన్
సుపరిష్కృతమై మున్నమరపతికిని దైత్యతతికిఁ బ్రబలినపగిదిన్. 220

వ. అమ్మధ్యాహ్నసమయమ్మున దుర్యోధనుండు ధృష్టద్యుమ్ను నెదిరించి శరసహ
స్రంబు నిగిడించుచు. 221

ఉ. ఈరస మెచ్చఁ బార్షతున కేడ్తెఱఁ జూపుచు నైదువాఁడివా
నారసముల్ శరీరమున నాటఁగ నేసియు నంత వింత లై
తీరినడెబ్బదమ్ములు విదిర్చినఁ బేర్చి యతండు సప్తతి
స్ఫారశిలీముఖంబులను సాల్వఱచెన్ భవదగ్రనందనున్. 222

క. పీడితు నన్నం గని సైఁ, దోడులు గుమిగూడి పార్షతునిపైఁ గడిమిన్
వాఁడిశరంబులు గురిసినఁ, గ్రోఁడ యతం డాఁగి వారిఁ బోరొనరించెన్. 223

సీ. దారుణంబుగఁ బ్రభద్రకులతోఁ బోరెదు, కృపకృతవర్మల నపుడు తాఁకి
ఘనుఁడు శిఖండి మార్గణగణంబులు గుప్పి, కడుఘోరసమరంబు గ్రాలఁ జేసె
నంత శల్యుండు సాత్యకితోఁడఁ బాండుపు, త్రుల నర్మి బిట్టేసి త్రుళ్లడంచె
నన్న నోచ్చుటకు నత్యాగ్రహంబున నేచి, నకులుండు మామపై నవననములు
ఆ. క్రూరశరము లేసి కొంచ కీఱైనమ్మ, లతనిబాహుమధ్యమందుఁ గ్రుచ్చి
హెచ్చి నవ్వుటయును నొచ్చి శల్యుం డల్గి, గాఁడ నేసె మూఁడుకాండములను.

వ. అంత ధర్మరాజభీమసేనసహదేవసాత్యకులొక్కుమ్మడి నమ్మద్రరాజు పయిం గవియు
టయు నతండు బెండువోక. 225

తే. మూఁడుతూపుల ధర్మజు మూఁడురెంటు, కాండముల భీము నూఱుప్రచండమార్గ
ణముల సాత్యకి మూఁడుశరముల మాద్రి, పిన్నకొడుకును నోనేసె నన్న సురలు.

చ. నకులుఁడు వెండి గండడరినం గని కన్గవ నిప్పు లొల్క న
ల్కకుఁ దగ శల్యుఁ డాతనికలంబయుతంబగుకార్ముకంబు గ
త్తికి నెనయైనతూపునను ద్రెస్సి పడం బొనరింప నాతఁ డొం
డొకధను వెత్తి వాసరథ మొయ్యన ముంచెఁ బతత్రిపంక్తులన్. 227

చ. పదిపదితూపులం దొడిగి పార్థివుఁడున్ సహదేవసాత్యకుల్
చదియఁగ మోది రాన్నృపతి షష్టిశరంబుల భీమసేనుఁడున్
గదనపరాఙ్ముఖుం డగును గావుత మంచుఁ దలంచి వానిపైఁ
గదియఁగ నేసె నేసినను గన్నుల నీసు జనింప నాతఁడున్. 228

సీ. నవసప్తతిశరాళి నవయించి సాత్యకి, సశరచాపము ముష్టిచక్కి విఱిచి
నాల్గుగుఱ్ఱంబుల నీల్గించి విరథు నా, తని నూఱుతూపులఁ దగిలి నొంచి
వేర్వేఱఁ బాండవవీరులన్ నలువురఁ, బదిపదిశరములఁ బడలుపఱచి
విక్రమించిన శినివీరునకు వేఱొక్క, రథ మెక్కి వడి మద్రరాజుఁ దాఁకి

తే. పదనుఁగోలలు పది వానిపయి నిగిడ్చి, నిలువు నిలు మంచు నదలించి పలుకుటయు న
తండు గాఢవిద్ధుం డయి చండకాండ, సమితి వర్షించె శైనేయుస్యందనమున. 229

క. పాండవు లద నని మాధవు, నండం గొని మద్రరాజు నడఁచెదునిచ్చం
గాండములు గురిసి రప్పుడు, భండన మతితుములమగుచుఁ బ్రస్తుతి కెక్కెన్. 230

తే. ఆమిషేప్సువు లయినసింహమ్ము లట్ల, వార లార్చుచుఁ బోరిరి ఘోరముగను
బాణమయ మయ్యె నప్డు నభంబు భూమి, ఘనము వాఱినయట్లు చీఁకట్లు గ్రమ్మె.

ఉ. ఏవురతోడ శల్యుఁ డటు పేర్తెఱఁ జూపుచుఁ బోరుచుండుటల్
దేవత లంతరిక్షమునఁ దేరి కనుంగొని మెచ్చి రయ్యెడం
జేవ మెయిన్ భవద్బలము చేరఁగ వచ్చి యెదిర్చెఁ బార్థసై
న్యావళి పీడితం బగుచు నట్టిటు లయ్యె నొకింతమాత్రలోఁ. 232

తే. భీమసేనుఁడు వారింప బిరుదుమగలు, నిలక పఱవంగఁ జొచ్చిరి కలను విడిచి
కృష్ణపార్థులు చూచుచుఁ గ్రేవనుండఁ, బెదరి ప్రాణము లరచేతఁ బెట్టుకొనుచు 233

వ. అంతఁ గొంతవడికిఁ గౌంతేయు లామూఁక నేకముఖంబు గావించి కయ్యంబున కియ్యకొల్పి రప్పు డప్పురుహూతపుత్త్రుండు కృపకృతవర్మలం దాఁకె సహదేవుండు సౌబలు నదిరించె నకులుం డొండొక్కనిపైఁ గవిసియుఁ బ్రక్క నున్నశల్యునిదిక్కు మొగంబు వెట్టె ద్రౌపదేయులు పెక్కండ్రు నరేంద్రుల నతిమిరి శిఖండి గండుమిగిలి ద్రోణపుత్త్రునిపై నురవడించె భీమసేనుండు గదాపాణియై రాజు నెదిర్చె యుధిష్ఠిరుండు మద్రరాజు మార్కొనియె నిట్లు మొనసి బలంబులు రెండును దండి కెక్క భండనంబు పరమోద్దండంబు గావించె నప్పుడు. 234

—శల్యధర్మనందనుల ద్వంద్వయుద్ధము—

ఉ. మద్రమహీమహేశ్వరుఁడు మానవనాథునితోఁ బెనంగుచున్
రౌద్రము మూర్తి మయ్యె ననఁ గ్రాలి శశాంకుని రాహు వట్లు ని
ర్నిద్రబలంబునం జెనక నేర్చి యెటుం గనుఁగొన్నఁ దాన యై
యద్రితెఱంగునం గలఁచె నాశుగసూనుముఖారిసైన్యమున్. 235

తే. వలదు నిలుఁ డని వారించి పలుకుచున్న, ధర్మజునిపల్కు గ్రేడించి తద్బలమ్ము
విఱిగి పఱవంగఁ జొచ్చె నవ్వేళ మేలు, మే లనుచు మెచ్చి రమ్మద్రమేదినీశు. 236

వ. ఇట్లు విజృంభించినమద్రమహీమండలేశ్వరునిం గని యుధిష్ఠిరుం డత్యంతామర్షవశుండై పౌరుషంబు పెంపునఁ దనకు జయంబ కాని మరణంబ కాని యగుఁ గావుత మని నిశ్చయించుకొని తమ్ములం గృష్ణసాత్యకులం దక్కినరాజలోకంబునుం దనపాలికిం బిలిచి యి ట్లనియె. 237

శా. భీష్మద్రోణులు కర్ణముఖ్యులును బృథ్వీనాథు లన్యు ల్భవ
ద్భీష్మప్రజ్ఞకుఁ జాలుగానయి రణోర్విం ద్రెళ్లిరి శల్యుఁ డా
గ్రీష్మాదిత్యునిరీతి మండెడిని శక్తిం జేసి నాపాల న
ర్భీష్మంతుం డగునీనృపాలుఁ డితనిం జెండాడెద న్నేఁ డనిన్. 238

తే. శల్యుఁ జంపుదు నొండె నేఁ జత్తు నొండె, నేఁడు రణరంగమునయందు నిక్కువ మిది
చెప్పుచుంటిని మీ రెల్లఁ జిత్తగించి, చెప్పినట్టులు కర్జంబు సేయుఁ డిపుడు. 239

వ. నకులసహదేవులు నాకుఁ జక్రరక్షకులుగను శైనేయధృష్టద్యుమ్నులు దక్షిణోత్తర పక్షరక్షకులుగను ధనంజయుండు పృష్ఠరక్షకుండుగను భీమసేనుండు పురోభాగరక్షకుండుగను నడువవలయు నారథంబున సర్వోపకరణంబులును సన్నద్ధంబులు గావలయుననిన నట్లు కావించి పాంచాల సోమక మత్స్య చేదిప్రభృతివీరవరేణ్యు లమ్మహారాజుప్రతిజ్ఞం దెలిసి హర్షోత్కర్షంబున శంఖభేరీప్రముఖవాద్యంబులు మోయించి సింహనాదంబులు గావించి రంత నంతకాత్మజుండు కరిఘంటాదినినాదంబు భూనభోంతరం బెల్లఁ బూరటిల్ల బహుళసేనాసమేతుండై శల్యునిఁ గయిం గవియుదెంచుటయు సమరశ్లాఘి యగునతం డతనిపయిం గవిసి శరవర్షంబు వర్షించె యుధిష్ఠిరుండును ధనుర్గ్రహణంబు గావించి ద్రోణోపదిష్టము లగువివిధప్రకారంబులం జూపుచుఁ బ్రతిఘటించి వివరంబు లేకుండ బాణాసారంబు గురియుచుం బోరుకొనియె నయ్యవసరంబున ధృష్టద్యుమ్నసాత్యకులును మాద్రేయులును రౌద్రంబున సౌబలప్రభృతివీరాగ్రేసరుల నతిని దురంబు గావించిరి వృకోదరుండు రోదసీకుహరంబు నిండ మెండుగ నార్చుచుం బేర్చి దుర్యోధనుం దాఁకి పీకం జూపుటయు నతండును. 240

ఉ. ఆనతపర్వ మైనఘనమార్గణ మొక్కఁడు పూని పూనికన్
మానధనుండు మారుతకుమారుసహేమపరిష్కృతాంశుకం
బైనపతాక ధాత్రిఁ బడున ట్లొనరించి శితక్షురప్రసం
ధానమునం దెగన్ నలిపెఁ దాండవ మాడెడువిల్లు రెండుగన్. 241

మ. ప్రథితౌజుం డగుఫాల్గునాగ్రజుండు కోపప్రస్ఫురన్నేత్రుఁడై
రథశక్తిం గొని నీకుమారునురమున్ వ్రయ్యంగ నేయ న్వడిన్
రథమందుం బడి సొమ్మసిల్లె నతఁ డారాటించునాలోన సా
రథిశీర్షం బాకకుప్పకోల నలుకన్ రాఁగొట్టుచుం బెట్టుగన్. 242

క. హతసూతం బగునరదం, బతిరయమున నీడ్చుకొంచు హయములు జన్య
క్షితిఁ దవ్వుగఁ బాఱెన్, దతమై హాహారవంబు దగె నీసేనన్. 243

తే. అపుడు కృపుఁడును గృతవర్మ కృపిసుతుండు, నృపతిసంరక్షణముఁ గోరి సపరివార
ముగఁ బయింబయి గవిసిన మొనసి నరుఁడు, గాండివంబున నెల్లర గండడంచె. 244

చ. అపుడు యుధిష్ఠిరుండు రభసాతిశయంబున మద్రరాజుపై
నపరిమితాంబకంబు లనయంబు నిగుడ్చుచు నేచి మన్యువే
గపరిచితాంతరంగుఁ డయి కన్నులు నిప్పులు గ్రక్క గాబె డై
కృప విడి కూల్చెఁ బెక్కుర గిరీంద్రముల న్శతకోటి పాటిగన్. 245

క. మృదుపూర్వంబుగఁ గైకొని, కదనము భీమోత్తరంబుగాఁ జేయుచు బ
ల్లిదుఁ డై యమనందనుఁ డం, బుదములఁ బెనుగాలి వోలె మూఁకం దోలెన్. 246

క. లయకాలరుద్రుఁడుం బలె, హయహస్తిశతాంగభటమహాసైన్యంబున్
భయదగతిఁ గూల్చి పాండు, ప్రియసుతుఁ డాయోధనోర్వి రిత్తగఁ జేసెన్. 247

క. తనమును మది బయ లైనం, గని కన్నులఁ గ్రోధరసము గ్రక్కుచు శల్యుం
డను వెఱఁగి ధర్మనందను, తనువున నతిగతిగ బాణతతుల న్నాటెన్. 248

చ. అలుకఁ బృథాసుతుం డపు డహర్పతిచాడ్పున నుగ్రమూర్తి యై
నిలునిలు మద్రభూమిధవ! నే ననిఁ గోలతి నంచు సారెకుం
బలుకుచుఁ దీవ్రబాణముల బాధతరంబుగ నేయ నాతఁడుం
దళముగ బాణవర్షము నుదగ్రతఁ బర్వఁగఁ జేసి నీసునన్. 24)

ఉ. మామయు నల్లుఁ డిప్పగిది మార్గణకోటులు మాఱుకొంచు సం
గ్రామ మొనర్చుచుం బ్రసృతరక్తసముచ్ఛ్రయసిక్తగాత్రు లై
యామని కారున న్విరియునట్లుగఁ బూచినకింశుకంబులో
నా మహితారుణద్యుతిఁ గనం దగి రబ్బురపాటు ప్రబ్బఁగన్. 250

తరళము. జనులు తుల్యపరాక్రమంబున జన్యముం బొనరించున
మ్మనుజనాథులఁ గాంచి యెట్లును మానసంబున నిశ్చయం
బొనరుపం దగ రైరి రాజ్యము నొందుఁ బార్థుఁడు శల్యునిం
దునిమి శల్యుఁ డొసంగుతేనికిఁ దున్మి పార్థు నటంచు చటన్. 251

—ధర్మరాజు బాణంబుల శల్యుండు మూర్ఛితుం డగుట—

సీ. అపు డంతయును సవ్య మై కనుపట్టంగ, జనుపట్టి పెనకువం జలుపుచుండ
శరశతంబు నిగిడ్చి శల్యుండు ధర్మజు, కార్ముకము క్షురప్రకమునఁ దునిమె
నతఁడు వేఱొకవింటి నంది మున్నూఱమ్ము, లపరించి కత్తివాయమ్ము వెట్టి
విఱిచిమద్రేశ్వరువి ల్లొంటఁ డెక్కెముం, వెగ నేసి నాల్గింటఁ దేరికరుల

తే. బడలుపడఁ జేసి రెండింటఁ బార్ష్ణిసార, థులను జక్కాడి మొక్కవో సలుపుటయును
భయ మెత్తిఁగి ద్రౌణి చనుదెంచి రయమెసంగ, శల్యురథమున నిడికొని చనియెఁదొలఁగి.

క. మనబలఁగ మెల్లఁ గోల్పోలిఁ, గని పఱచెడు లేళ్లగుంపు కరణిం బఱచెం
గనుచుండు నంత శల్యుఁడు, చనుదెంచె రథంబు నెక్కి సరభస మెసఁగన్. 253

ఉ. చాప మలాతచక్రగతిఁ జంక్రమణం బొనరింపఁ జేయుచుం
జూపఱు మెచ్చ మద్రపతి జోరున వెల్లిగ నంపసోనలన్
భూపతిపై నిగిడ్చి చెఱిమూఁడిటితో సహదేవభీములన్
గోపము దీఱ నేసి పదికోలల సాత్యకి నొంచి నవ్వుచున్. 254

క. తక్కినవారల నెల్లన్, మొక్కలముగ బాణపంక్తి పొదలించి వడిం
దక్కక నొగిలించెం బే, రుక్కున శల్యుండు గరుల నుల్కలఁ బోలెన్. 255

వ. మఱియుఁ గుంజరంబులతోడఁ గుంజరారోహకులను హయంబులతోడ హయారోహకులను రథంబులతోడ రథికులను బెక్కువేల నొక్కుమ్మడి నుక్కడంచి కరవాలాద్యాయుధంబులతోడ బాహువులం ద్రుంచి ధ్వజంబులతోడఁ గేతువులం ద్రెంచి జోదుల కళేబరంబులం జేసి రణాంగణంబు సమిత్కుశచయంబున యజ్ఞవేదిం బలె నలంకరించె నిట్లంత కాకారంబునఁ గోలుతల నేయుచుం గోలుమసంగి బలంగంబుల నెల్లఁ గసిమసంగించుచున్నం గని భీమసేన శైనేయ మాద్రేయ సహితుం డగుధర్మసుతుండు పాండుపాంచాలసోమకానీకపరివృతుండై మద్రపతి న్మార్కొని మార్గణగణంబు వరఁగించుచు నురంబు గాఁడ నేసి బరవసంబు సేయుచున్నంత నీతనయుండు వానికోలుతల కోహటించి శల్యునకుం దోడు సూపఁ బెక్కురథంబులవారిం బుచ్చుటయుఁ దత్సహాయుం డగుమద్రమహీమండలాఖండలుండు గండుమిగిలి. 256

మత్త. ఏడుతూపుల ధర్మనందను నేయఁ బాయనికిన్క నా
ఱేఁడు తొమ్మిదినారసంబుల ఱిచ్చవోఁ దనమామకున్
వేఁడిఁ జూపె శతండు నాతఁడు వీగ కీరస మెచ్చ నీ
డాడి రామిషలోలుపంబులు వ్యాఘ్రరాజము లట్లుగన్. 257

వ. ఇ ట్లెక్కువతక్కువలు లేక మహేంద్రవజ్రాశనితుల్యనిస్వనంబు లగుజ్యాతలనిస్వనంబుల దిశావలయం బెల్లఁ బగిలించుచుం గోపాటోపంబునం బోరుచున్నంత మద్రభూకాంతుం డుద్రేకించి. 258

ఉ. అగ్గితెఱంగునన్ వెలుఁగునాశుగ మొక్కఁడు దీసి రోసముం
దగ్గుపడంగ నీక వడి ధర్మతనూజునిపేరురమ్మునన్
బిగ్గర నాడె నాడినను వీరశిఖామణి నొవ్వ కాతఁ డి
ల్లిగ్గులు గాఁగ మద్రవిభు నేసె నిశాతశిలీముఖంబునన్. 259

—శల్యుండు ధర్మజుని విరథుం జేయుట—

సీ. సొమ్మ వో నింతలో నమ్మహీవిభుఁ డేచి, కందోయి నెత్తురు గ్రక్కుచుండ
శరశతంబున నతిత్వరితుఁడై పార్థునిఁ, బ్రహరించె నతఁడును బ్రదరనవక
మేసి ఱొమ్మాడఁగఁ జేసి శల్యునికత్త, ళమ్మొఱువాలమ్ములం బగిల్చె
దాని కల్గియు నవ్వి ధనువు సారించుచు, మద్రేశ్వరుఁడు రెండుమార్గణములఁ
తే. బాండవునివిల్లు త్రుంప నాతండు కొండొ, కండు కార్ముకముం గొని గండుమిగిలి
నముచి నింద్రుఁడు బలెఁ జెక్కునారసములు, రౌద్రమున నేసి నొప్పించె మద్రవిభుని.
చ. అతఁడును భీమధర్మజులయంగములం దగుబాందళంబులం
జితుకఁగఁ జేసి తొమ్మిదిటఁ జేవడిఁ జూపుచుఁ దద్భుజంబులన్
శితశరముల్ నిగిడ్చి కురుశేఖరు కార్ముక మొంటఁ ద్రుంచె న
ప్డతనినియంతఁ జంపె నృపుఁ డాఱుశరంబులు వాఱఁ జేయుచున్. 261
క. తానే రథచోదకుఁడై పూని యనిం జేయుధర్మపుత్త్రుని తేజీల్
ప్రాణములు వాయ నేసెన్, మానవనాథుండు నిశితమార్గణపంక్తిన్. 262
ఉ. ఒత్తొర వట్టు లన్న కగుటొప్పనిచిత్తముతోఁడ భీముఁ డు
ద్వృత్తుగఁ దీర్చి పుత్తు నని యొల్ల నటంచుఁ దలంచు చుగ్రుఁడై
మెత్తన గాక మద్రపతిమే శరయుగ్మము నాటి మేటివిల్
తుత్తుమురై పడం జలిపి తూపొకఁ డేసి నియంతఁ ద్రోసియున్. 263
చ. తురగముల న్వధించి వడితోఁ గడుఁ దూపుల మద్రరాజుమేన్
బరియలు వాఱఁ జేసి గరువంబున వర్మవు సించె నంత న
ద్దొరపయి మాద్రిపుత్త్రులును దూపులవాన నిగిడ్చి రేపునన్
హరియనుజుండు పిట్టపను గట్టిశరంబునఁ గొట్టె నాతనిన్. 264
తే. విరథుఁడును వీతవర్ముఁడై వెగడుపడక, కడఁక వాలును బలకయు వడిగఁ బూని
మద్రభూజాని రథ మీఁగి మాద్రిపెద్ద, కొడుకునరదంబు కాడిని బెడియ నఱికె. 265
తే. అంతకాకారుఁడై శమనాత్మభవుని, మీఁది కుఱుకంగ ద్రౌపదేయాదులును శి
ఖండిపార్షతసాత్యకుల్ కవిసి రతని, పఘుక్తి ధర్మజునకుఁ దోడుపాటు సూపి, 266

వ. అంతలోన భీమసేనుండు. 267

ఉ. కేడెము తొమ్మిదమ్ముల నికృత్తము చేయుచుఁ జేత నట్టువం
బాడెడువాలు ముష్టికడ నట్టిట్టులై తెగఁ జేసి శల్యుమేన్
గాఁడగ నేయఁ దజ్జనము కౌతుక మావహిలంగఁ బొంగుచున్
వేడుక సంకు లూఁది యొదవించిరి మించఁగ సింహనాదముల్. 268

క. రుధిరోక్షితాంగ మగుచున్, మథియింపం బడినసీకుమారునిబల మా
మృధ మీఁగి యథాయథ లై, వ్యథకై పఱవంగఁ జొచ్చె నాసమయమునన్. 269

ఉ. మద్రవిభుం డమర్ష మది మానస మేర్చఁ బేర్చి పెల్చనన్
మాద్రికి మీఁఱురౌద్రమున మండుచుఁ బాండవు తేరిమీఁదికిన్
రుద్రుఁడు కల్పమందు బలె రూక్షతఁ జూపుచుఁ బింగదృష్టి తా
క్షుద్రమృగంబుపై కడరు చొప్పున రొప్పి రయంబు చొప్పడన్. 270

—ధర్మరాజు శక్తిం బ్రయోగించి శల్యుం జంపుట—

వ. ధర్మజుండును నిహతాశ్వసూతం బయినరథంబునంద యుండి క్రోధతామ్రాక్షుం డై పరమసంరంభంబున సముజ్జ్వలజ్జ్వలనుచందంబునం దనమీఁదికి వచ్చునమ్మద్రదేశాధినాథుం గాంచి కాంచనాంబరధరునివచనంబులం దలంచి తనమనంబున నిజభాగం బయి నిలిచియున్నయిన్నరనాథునివధం బవశ్యకర్తవ్యం బని నిశ్చయించి సువర్ణమాణిక్యదండానుషక్తం బయినశక్తిం గ్రహించి కోపఘూర్ణమానమానసుండై నిష్పలోలుకం గన్ను విప్పి తెప్పునం జూచె నప్పుడు. 271

తే. చూచినంతన శల్యుండు సొంపు దక్కి, భస్మసాత్కృతుఁ డగు నని భయము నాకుఁ
బుట్టెనే కాని యది యేమి బూమె యొక్కొ, క్రాఁగి పోఁ డయ్యెనదివజ్రకాయమేమొ.

వ. అంత నంతకాత్మజుండును. 273

సీ. రుచిరోగ్రదండము ప్రచురమణిప్రవేకోజ్జ్వలితమ్ము మృత్యూపమమ్ము
బ్రహ్మదండప్రభాభాసమానము మహోల్కాసదృక్షమ్మమోఘసమాన
బలసంప్రదీప్తము జ్వలనార్కసంకాశ, ముగ్రరూపమ్ము పాశోచ్ఛ్రితమ్ము
విస్ఫులింగసహస్రవిస్తృతప్రభము ప, తాకామణీఘంటికాకలితము

తే. త్వష్టృనిర్మిత మీశహస్తప్రశస్త, భూషణము శత్రుసంహారభీషణమ్ము
గంధపుష్పార్చితము శక్తిఁ గడఁకఁ బట్టి, మంత్రపూతముఁ గావించి మహితశక్తి.

మ. నిజపీనాయతబాహుదండము వడిన్ దీపించుచో శాత్రవ
ధ్వజినీచక్రము తల్లడిల్లునటు నృత్యం బాడుచుం బాండవా

గ్రజుఁ డామద్రధరాధినాథుపయి నుగ్రంపశక్త్యఁడై వ్రేసె భూ
భుజు లార్తధ్వను లాచరించుచును బెంపుం దక్కి వీక్షింపఁగన్. 275

ఉ. ఆజ్యము వేల్వఁ బ్రజ్వరిలునగ్ని తెఱంగున మండుచున్ జగ
త్పూజ్యమహోగ్రశక్తి యది పోయి కదున్ వడి మద్రనాథుపైఁ
బ్రాజ్యరవం బెసంగఁ బడి బాహుయుగాంతరముం బగిల్చి స్వా
రాజ్య మొసంగ బాస యిడి రంహాగతిం జనె భూమిలోనికిన్. 276

తే. శక్తి తాఁకున శల్యుండు సంధిబంధ,ములు దెగన్ ఱొమ్ము దీర్ణమై పోవ నెత్రు
ముక్కులను నోటఁ గన్నులఁ గ్రక్కుకొనుచు, బోరగిలఁ బడె కొండనా భూతలమున.

తే. చాచి చేదోయి శల్యుఁడు సాఁగిలఁ బడి, పెద్దకాలము ప్రేమించిపేర్మిఁ గన్న
పుడమిపడఁతిని సర్వాంగములను విభుఁడు, గౌఁగిలించి శయించెనాఁ గాన వచ్చె. 278

తే. ధర్మయుద్ధమునన్ ధర్మతనయుచేత, నట్లు హతుఁడైనశల్యుండు ప్రాణములను
విడిచి హోమాంతమున యజ్ఞవేదియందు, శాంతుఁ డగునగ్నిహోత్రునిసరణిఁ దనరెఁ.

—శల్యానుజుండు ధర్మరాజుం దాఁకి హతుఁడగుట—

వ. ఇట్లు మద్రరాజుం బరిమర్దించి ధర్మరా జింద్రధనుఃప్రభం బగు ధనూరాజంబు రాజిల్లం గొని గరుత్మంతుండు పన్నగంబులం బోలె మనమూఁకలం జీకాకుపఱచు చున్నం గని శల్యానుజుండు కోపాటోపాతిశయంబునఁ బాండవాగ్రజుపయిం గవిసి శరవర్షంబు పరఁగించుటయు నతండును. 280

మ. అలుకం గార్ముకమున్ విదిర్చుచు మహోగ్రాకారుఁడై పత్త్రరం
బులు శల్యానుజుపై నిగిడ్చియు క్షురంబుల్ రెండు చేఁ బూని వా
ని లసత్కార్ముక మొంట నొంట సిడమున్ ఛేదించి కేఱొంటఁ గుం
డలగండస్థలమండితంబు శిరమున్ ఖండించె మొండెంబుగన్. 281

శా. ఆమద్రేశ్వరునగ్రసోదరుఁడు పుణ్యాం బెల్లఁ జెల్లంగఁ బై
పైమార్గంబుననుండి క్రిందఁ బడు తేవన్ రక్తసిక్తాంగుఁ డై
భూమిం జేరె రథంబునుండి బలగంబుల్ సూచి హాహారవం
బామైఁ జేయుచు విచ్చి పాఱె రిపులోకానందమున్ గూర్చుచున్. 282

ఉ. వారల వెన్నడించి యదువర్యసహోదరుఁ డుగ్రమార్గణా
సారము పర్వఁ జేయుచు వెసం దఱుమం గృతవర్మఁ డడ్డి మేల్
నారసముల్ నిగిడ్చి జతనం బొనరించుచు వృష్ణి వీరు ల

వ్వారలపోరు ఘోర మయి ప్రస్తుతి కెక్కఁగ నయ్యె నయ్యెడన్. 283

శా. హార్దిక్యుం డపు డేచి సత్యకసుతున్ హా వృట్ట బిట్టేయుచున్
నిర్దాక్షిణ్యము గా దశాంబకముల న్వేధించి రథ్యంబులన్
మర్దించెం దిగతూపులన్ మఱియు విల్ మాయించె నొక్కమ్మునన్
దుర్దాంతప్రతిభా ప్రభావనిధి యై దోర్దర్పముం జూపుచున్. 284

తే. అపుడు సాత్యకి యొండువి ల్లంది హార్దిక,నందనుని వక్షమునఁ బది నారసములు
నాటి మేటిశరంబుల న్వానిరథము,రథ్యముల ద్రెంచి పార్ష్ణిసారథులఁ ద్రుంచె. 285

మ. విరథుం డై వివశత్వ మొంద నగునవ్వృష్ణిప్రవీరుం గృపుం
డరదంబం దిడికొంచుఁ గొంచ కని దవ్వై పోయె నవ్వీడునన్
ధరణిం గ్రమ్మినదుమ్మున న్మనిఁగి విత్రాసంబున న్మార్గ్గముం
బరుదేఁ బిక్కబలంబు సూపె నపు డేయం డాయఁ బోఁ కయ్యనిన్. 286

వ. అంత నారజం బంతయు నొక్కంతలో రక్తప్రవాహంబునం జేసి యడంగుటయు నీనందనుండు తనబలం బంతయుం గాందిశీకం బగుటయు ధృష్టద్యుమ్నాభిరక్షితం బయినపరబలంబు ప్రబలి యుంటయుం గాంచి తా నొక్కరుండ పాండవులఁ గండడంప నుద్యమించి యుండె నంతహార్దిక్యుం డన్యరథం బెక్కి గౌతమనహితుండై పెచ్చుపెఱిఁగిన మచ్చరంబున ధర్మరాజుం దాఁకుదెంచి ప్రదరప్రకరంబులం బ్రయోగించిన నతండును. 287

క. హార్దికాత్మజు రథ్యంబులఁ బ్రదరంబులు నాలు గేసి వధియించి కృపుం
బదను గలషట్చరంబుల, సదమద మొనరించి మించె సమరక్రీడన్. 288

క. విరథుం డగుహార్దిక్యుని, గురుపుత్త్రుం డనికి వెలిగఁ గొనిపోయెఁ గృపుం
డురవడి మార్కొని ధర్మజు, శరషట్కము పఱవఁ జేసి సమర మొనర్చెన్. 289

తే. సునిశితాష్టశిలీముఖస్యూతములుగ, నలిపి తనహయంబుల నొంప నలిగి ధర్మ
సుతుఁడు లయకాలరుద్రునిసొంపు దోఁప,గౌతమునితోడ డీకొని కల నొనర్చె. 290

వ. అట్లు విజృంభించిన పాండవాగ్రజుం గాంచి పాంచాలసోమకప్రభద్రకబలంబులం గల యోధు లాయోధనంబు సాలించి శంఖంబులు పూరించి సింహనాదంబులు గావించిరి దేవతలు వృత్రాసురవధానంతరమున దేవేంద్రునిం బోలె మద్రవధానంతర మాధర్మ రాజుం బ్రశంసించి రని చెప్పిన విని నైమిశారణ్యవాసు లవ్వాలి వృత్తాంతంబు సెప్పు మని సూతు నడుగుటయును, 291

ఆ శ్వా సాం త ము.

ఉ. పుట్టినదెల్ల గిట్టు నొకపూటక కాక మఱొక్కపూటకే
నిట్టియెడం దిరం బనుచు నెంచుచు నీయెడ లీప్రపంచముం
దుట్టినిఁ గట్టి యూయెలల నూఁగెద మంచుఁ దలంత్రు వెట్టు లీ
చెట్టతలంపు నామదికిఁ జేరఁగ నీకుము లోకరక్షకా. 292

క. భారతము వ్రాయుపనికై, ధారుణి జన్మించినాఁడఁ దత్కార్యంబుౘ
భారంబు ముట్టఁ జేయుచుఁ గారుణ్యముతోడ నన్నుఁ గావుము దేవా. 293

గద్యము.

ఇది శ్రీమదధునాతనోభయకవిమిత్ర వేంకటయజ్వాగ్రపుత్త్ర
సమారాధితవిబుధరాజ శ్రీపాదకృష్ణమూర్తికవిరాజ
ప్రణీతం బయిన శ్రీకృష్ణభారతంబునందు
శల్యపర్వంబునఁ బ్రథమాశ్వాసము.

శ్రీ. శ్రీ. శ్రీ.



# శ్రీకృష్ణభారతము

శల్యపర్వము-ద్వితీయాశ్వాసము.



మంత్రమాతృకాదిమ
హోమంత్రోపాసనాత్త మగుధీశక్తి
నీమీఁదఁ గృతు లొనర్చితి
నామీఁదం గరుణఁ జేయ న్యాయము దేవా. 1

—శల్యునిబంధువులు లోనగువారు ధర్మరాజుం జుట్టుముట్టుట—

వ. అక్కథకుండు శౌనకాదిమహామునుల కిట్లనియె నట్లు మద్రరాజు నిధనంబు నొందుటయు వానిపదానుగు లేడునూర్లరథంబులవారు బలంబునుండి పలాయనంబు నొందుటయుఁ బాండవులు గండుమీఱి శంఖభేరీపణవానకంబులు మొఱయించుటయుం గని సైంపక దుర్యోధనుం డహార్యనిభం బగుమదేభంబు నారోహించి ఛత్రచామరాదిరాజోపచారంబులు విరాజిల్ల నెల్లవారలం బోవల దిది క్షాత్రధర్మంబు గా దని యెలుంగెత్తి పిలుచుచు బలంబుల నేకముత్తంబు చేసికొని బరవసంబు సేయుచు ధనుశ్శబ్దంబున నభ్రంబు నిండించుచు నజాతశత్రునిపయిం గవియుటయు నర్జునుండు శల్యప్రభృతులు నిహతు లగుటకు సంతసించుచు గాండీవంబు నారి సారించుచు రథధ్వానంబున దిక్కులు పిక్కటిల్ల నల్లనల్లం దలపడినం గని వృకోదర నకుల సహదేవ సాత్యకులును ద్రౌపదేయధృష్టద్యుమ్నశిఖండులును బాండవ పాంచాలసైన్యంబులతో ధర్మరాజరక్షాపరత్వంబునం బయికొని మహామకరప్రకరంబులు మకరాలయంబునుం బోలెఁ గలంచి మహావాతంబులు పాదపసంఘాతంబునుం బోలె నగురం గొట్టిన నీసైన్యంబు దైన్యంబు నొంది యున్నంత మద్రవీరులు పురోవాతవిధూననంబున గంగాప్రవాహంబుకరణిం బొంగి యుధిష్ఠిరుం డెక్కడ వానితమ్ము లెక్కడ యని యుక్కుమిగిలి పలుకుచుం గవిసినంగని ధృష్టద్యుమ్నశైనేయద్రౌపదేయసాత్యకులు వారలం దాఁకి తేరుల భంజించియుఁ గేతనంబులం జించియు వాహనంబుల రాల్చియుఁ గైదువులం దుల్చియుఁ బెల్చ భీభత్సంబు గావించి నంతఁ గురువల్లభుండు బోధించుచున్ననుగణింపక పోవుచున్నవారిం గని గాంధారవల్లభుం డల్లన నీకుమారుం దరియ వచ్చి యి ట్లనియె. 2

ఉ. రాజబిడౌజ! మద్రుల నరాతులు రాల్చుచునుండఁ జూచుచున్
రోఁజుచు నూరకుంటి తగునో సమయం బొనరింప లేదొ నేఁ
డాజి నొకండు వోరుకొన నందఱుఁ దోడ్పడ నొ నటంచు నీ
వే జతనంబు సేయ విది యేటివిధం బన నాతఁ డిట్లనున్. 3

తే. పలుదు వల దని వాదించి పలుకుచున్న, నన్నుఁ గా దని మద్రకుల్ తెన్ను వట్టి
రట్టి వారికిఁ దోడ్పాటు నగునె యనుచు, నూరకుంటి ననన్ వెండియును నతండు. 4

చ. అని మొన భర్తృశాసనము నొదలఁ బూన రటంచు జోదులం
గనలుచు నుంట రాజునకుఁ గా దిటు లొప్పరికింప నొప్పునే
జనవర! మద్రకావలికి సాయ మొనర్తము లెమ్ము తజ్జయం
బును మనదే గదే యనుచు బోధనముం బొనరింప నాతఁడున్. 5

చ. అగు నిది లెస్సమాట యని యాశకునిన్ మది మెచ్చి సర్వసై
న్యగణపరీవృతుం డగుచు నట్టువ మాడుచు సింహనాదముం
దగ నొనరించి పాండవుల దాఁకుపయిం బడె నప్పు డెంతయే
మగఁటిమిఁ జూపుఁ డేఁడుఁ డను మాటలు మాటికి నయ్యె నయ్యెడన్. 6

సీ. అంత మధ్యమగుల్మ మంది పాండవసైనికులు పోరుకొనిరి చేతులను గలిపి
తుముల మై యుద్ధంబు తోఁచె నొక్కింతలోఁ, దెగిన తేరులును దొఱఁగినకరులు
మడిసినగుఱ్ఱము లిడిసినసిడములు, పడినకాల్బారు దెగి పడినతలలు
మొండెంబులును దుండె తుండెంబు లయినకాల్, సేతులు ప్రోవైనహేతిగములు
తే. గలిగి కయ్యపునేల యుర్వ్వలనఁ బీఁగ్గఁ, బెంటమై కాన నయ్యె నవ్వెంటఁ బడిన
మద్రకులు పుణ్యముకుయింప మహిని బడెదు, సిద్ధజను లట్లు పడి రేమి చెప్ప నధిప. 7

వ. ఇవ్విధంబున వితథప్రయత్నులైనమన వారిం జూచి పాండవసైనికులు సింహనాదం
బులును శంఖనాదంబులును జ్యాతలనాదంబులును గ్రాలఁ గోలుతల సేయుటయు
నోహటించి దుర్యోధనబలం బెల్లఁ జెల్లచెదరయ్యె నయ్యెడ. 8

సీ. మున్నీటిమధ్యమున న్నావ యవిసిపో, నట్టిట్టు లయినబేహారు లట్లు
సింహార్దితంబులై చేవ యింతయు లేక, మినువంకఁ జూచెడుమృగము లట్లు
గుమ్మలాడుచునుండఁ గొమ్ములు విఱుగుడు, బమ్మతిల్లిన మహోక్షమ్ము లట్లు
వింతగా దంతంబు లింతింత లై పోవఁ, దబ్బిబ్బు లాడెడుదంతు లట్లు
తే. నీబలంబులు నీసుతుల్ నీదుహితులు, సైన్యపతి మద్రపతి యట్లు జమునిఁ గొల్వఁ
బోవ దిక్కింతయును లేక చేవ దక్కి, భయముఁగదిరినమనుజుల బసలువడిరి. 9

ఆ. కురుపితామహుండు గురుఁడును గర్ణుండు, పడినయప్పు డైన భయముకన్న
నధికభయముగలుగ నస్మజ్జనం బాశ, విడిరి మద్రవిభుఁడు పడినయంత. 10

వ. అప్పుడు మనబలంబులందలి జనంబులు. 11

క. కొందఱు గజముల నెక్కియుఁ, గొందఱు తురగముల నెక్కి కొందఱు రథముల్
కొందఱు గాల్నడ వడిగా, నందఱుఁ బఱువంగఁ జొచ్చి రాసమయమునన్. 12

తే. బాణపాతంబునంజేసి ప్రాణభయము, గదుర గా ద్విపహస్రముల్ కిరులు మరలి
కరము గీపెట్టుచును బాఱెఁ గలను విడిచి, మావటీఁడుల గణియింపఁ బోవ కపుడు.

వ ఇట్లు పరాజితు లై పాఱునీవారిం జూచి పాంచాలపాండవజనంబులు శంఖంబులు
పూరించి సింహనాదంబులు గావించి సంతసించుచు వారిలో వారు. 14

ఉ. నేఁడు గదా యుధిష్ఠిరుఁ డనింద్యచరిత్రుఁడు శత్రుసంతతిన్
బోడిమి దూలఁబుచ్చి ధరఁ బొందెడువాఁ డగు నింక రాజరా
జోడి సిరుల్ సెడంగఁ దెగ నుండెడు నాధృతరాష్ట్రు డిష్టముల్
వీడఁగ వించు దుఃఖమున విహ్వలుఁ డై పడు గిల్బిషంబునన్. 15

వ. మఱియు నాధృతరాష్ట్రుండు. 16

సీ విదురవాక్యంబులు వినక నేనే పాప,కుంకు గడంగినఖలుఁడ ననుచుఁ
దెలియక కౌంతేయు లల్పులు భీష్మాద,ులకు నోడుదు రని తలఁచితి ననుచు
సంధికై వచ్చినశౌరిమాహాత్మ్యము, తెలియనివాఁడ నై తెగితి ననుచు
నర్జునాస్త్రము లింతలా భుజబల మింత, యూ కటకట వెఱ్ఱి నైతి ననుచుఁ

తే. బిలువనుం జేప లేకుండఁ బిలుకు మాల్చె,సుశశకముభీముఁ డెంతటిశూరుఁ డనుచు.
గొసర కేక్చెడు శోకంబు కొనలుసాఁగఁ, దనదుగతికిఁ బశ్చాత్తాపతప్తుఁ డగుచు.

వ. మఱియు దేవతలకు నజేయుం డగునీమద్రరాజుం జంపుట ధర్మరాజునకుం జెల్లెఁ
గాని యొండొల్లకుం జెల్లునే? దుశ్శాసనవధంబున భీమసేనుండు చేసినచేఁత లాఁతి
వాని కలవియే నారాయణగోపాలురనోడం గూడ సంశప్తకులం బరిమార్చుట కాల
కేయనివాతకవచాంతకుం డగునర్జునునకుం దగుఁ గాని యేవారికిం దగు నిట్టిసౌబలుం
బరిమార్చి నకులసహదేవులును బ్రశంసకు నెక్కుదురు. మఱియు శైనేయద్రౌపదే
యధృష్టద్యుమ్నశిఖండు లఖండపరాక్రమంబునం బ్రవర్తించి రింతకును దేవదేవుం
డగువాసుదేవుం డెల్లవేళల నేడుగడ యై యుండఁ బాండవులకు విజయం బేల కా
కుండెడిని. భీష్మద్రోణకర్ణశల్యముఖ్యులం దొట్టి జెట్టిమగలం గిట్టించు టేమి భరమ్ము
కావునె ధర్మనిరతుం డైనధర్మజున కెట్టికీడునుం గాఁ బోవ దని తమలోఁ దారు సం

భాషించుకొనుచుఁ బ్రభగ్నం బైననీసైన్యంబు వెన్నుఁ దన్ని నడచిరి. ధనంజయుండును రథానీకంబు నఱిమి తఱిమె. నకులసహదేవసాత్యకులు శకునిం దాఁకి రయ్యవసరంబున దుర్యోధనుండు భీమసేనభయార్దితులై పాఱుచున్న నిజయోధులం గాంచి సారథిం బిలిచి యి ట్లనియె. 18

ఉ. చాప మలాతచక్రగతిఁ జంక్రమణం బొనరింప నర్జునుం
డేపున నున్నఁ గా దనుచు నెల్లచమూపతుల న్వెలార్చు నీ
వోపి శతాంగముం బిఱిది కొయ్యనఁ బోవఁగ నిమ్ము పార్థునిన్
నాఁటుబాణపంక్తులఁ బ్రణష్టునిఁ గా నొనరింతు వింతగన్. 19

క. అదె పాంసుపటల మెగయుం, బొదివి యటం బొమ్ము మనము పోయిన మూఁకల్
పదింపడి మరల మార్కొను, గదనంబున కనిన నట్లు గావించుటయున్. 20

వ. ఇట్లు చని దుర్యోధనుండు ధైర్యశౌర్యంబులు చూపుచున్నంత రథాశ్వగజహీనులగు నిరువదియొక్కవేలపదాతు లొక్కమొగి మొనకట్టి నీపట్టికిం బాసటలై రంత బకాంతకుండును ధృష్టద్యుమ్నుండును వారి మాఱుకొనినం బోరు ఘోరం బయ్యె నయ్యెడ. 21

మ. మనయోధుల్ యశముం దలంచుకొని భీమప్రక్రియన్ భీమసే
ననినానావిధమార్గణంబుల నడి న్నొప్పించుచుం గప్పి పే
ర్మిని సొంపొందుచు మాఱుకో బలియుఁ డామేల్చేయి మైనాకమో
యన నింతేని చలింప కాగ్రహము నేత్రాంతంబులం గ్రక్కుచున్. 22

చ. అరదము డిగ్గి డిగ్గున మహాగద గైకొని దండపాణి నాఁ
బరఁగుచు విక్రమించి తనపైఁ బడవచ్చినయిర్వదొండువే
గుర మడియింప వారు ధరకుం గయిసేతకు నై మహాస్థలిం
బొరసగుకర్ణికారములపోలిక నొప్పిరి కుప్పతిప్పలై. 23

— ◆ సుయోధనుండు విఱిగిననిజబలంబుం గూర్చుకొని శత్రువుల [illegible] ◆ —

వ. ఇట్లు నానాదేశాగతు లైన యేకవింశతిసహస్రయోధులును [illegible] జపురోగము లగుపాండవవీరులు పెక్కండ్రు మిగిలి దుర్యోధనునిపై నడరుటయు నయ్యేకవీరుండు పౌరుషాతిరేకంబునఁ బారావారంబుం జెలియలికట్టవోలె వారి నెల్ల నాఁగి మహాద్భుతక్రమంబునం బోరుచున్న బల్లిదుమనవారికి జేయి వీఁది పిలిచి యు ట్లనియె. 24

ఉ. మిత్తికి డాగికొంద మని మీతలఁ బైపడి యేమొ పాఱి మీ
రిత్తఱిఁ బర్వతంబులకు నేగిన నచ్చటి కేగిన న్మిమున్
మొత్తెడు వెంట నంటి యది పోలనికార్యము మళ్ళఁ డిందఱున్
హత్తికొనంగ శాత్రవబలాళి జయింపఁగ సాధ్య మయ్యెడిన్. 25

క. అలసిరి కృష్ణార్జును లా,బల మల్పం బయ్యె మనము బాహాబలముం
గలిగికొని కలిసి పోరిన, సులభము గా విజయ మందఁ జొప్పడు నాజిన్. 26

తే. విఱిగి పఱచినమిముఁ జూచి వెన్నుఁ దన్ని, చంప కుండరు పాండవుల్ సంగరమునఁ
జావు శ్రేయము క్షత్రియజాతి కింత,కన్న శ్రేయము వే ఱొండు గాన రాదు. 27

ఉ. క్షత్రియుఁ డైనవాఁ డితరసంగతిఁ జచ్చుటకంటె సంగర
క్షేత్రమునందుఁ జచ్చు టది శ్రేష్ఠతరం బగుధర్మ మందునన్
సత్రము లాచరించినద్విజన్ములు పొందెడునూర్ధ్వలోకముల్
క్షత్రియజాతికిం గలుగు సర్వసుఖంబులు నొందఁ గల్గెడున్. 28

తే. కాన మీరు కులాగత మైనధర్మ,మును త్యజింపక మగఁటిమిఁ బూని మరల
కొండుజయమొండెఁజావొండెఁగోనఁ దలంచియాల మొనరింపుఁడిపుడుభూపాలురార.

వ. అని పలికినపలుకు లాలకించి పరాఙ్ముఖు లైనరాజు లెల్లరును మరలి మొగ్గరంబు దీర్చి పాండవవ్యూహంబుం బ్రతిఘటించి రపుడు పాండవమధ్యముండు గాండీవంబు మ్రోఁగించుకొనుచుఁ బయిం గవయ నకులసహదేవులును సాత్యకియు సౌబలుం దాఁకి భీకరయుద్ధంబు గావించి రాసమయంబున మ్లేచ్ఛగణాధిపుం డగుసాళ్వుండు రోషసంరంభసముద్రిక్తుఁ డై పర్వతోపమంబు నైరావణప్రఖ్యం బగునత్యుత్తమమత్త మాతంగంబుపై నధిష్ఠించి పూర్వశిఖరిశిఖరాధిష్ఠితుం డయినబాలభాస్కరుం గ్రేణి సేయుచుఁ బాండవానీకంబుపయిం గవియ గజరాజంబు గొల్పుకొనుచు వచ్చి మహేంద్రవజ్రోపమంబు లగుమహాకోపంబుల నేపు సూపుచు నెందుఁ జూచినం దానయై సహస్రప్రకారంబులం బ్రవర్తిల్లె నంత శత్రుసైన్యంబు దైన్యంబు నొంది వానిశస్త్రాస్త్రంబులకును మత్తేభసమ్మర్దంబునకును దాళఁ జాలక విఱిగి పఱవం జొచ్చె నీబలంబున శంఖారవంబులు హెచ్చె నచ్చట ధృష్టద్యుమ్నుం డుత్కృష్టశౌర్యద్యుమ్నుండై మహామర్షంబున నద్దంతీంద్రంబు నెదిరించి. 30

— ధృష్టద్యుమ్నునిచే సాళ్వుండు చచ్చుట. —

మ. జ్వలనజ్వాలము లట్లు మండునిశితప్రక్ష్వేడనంబు ల్వడిం
గలఁ డై మూఁడును నేడు కుంభతలముం గాఁడంగ బిట్టేయ న

క్కలభం బెంతయు నొచ్చి పెం చ్చుడిగి ఘీంకారంబు దీనారవ
స్ఖలితం బై పొడమఁగ బరాఙ్ముఖము గ్గం బాఱె. బో రీఁగుచున్. 31

తే. సాళ్వుఁడును దానిఁ దోత్త్రాంకుశప్రహార,ములను వేధించి మరలించి కొలిపె ద్రుపద
పుత్త్రునరదంబుపైఁ బడి పొడ వడంప, నదియుఁ బఱతెంచె నతనిపై నతిరయమున.

మ. నరగ న్వచ్చెడుసామజంబుఁ గని ధృష్టద్యుమ్నుఁ డుద్యద్భయ
త్వరితాత్ముం డయి దాఁటె ధాత్రికి గదాదండంబుఁ గైకొంచు న
ద్ద్విరదేంద్రంబు నవీతిసూతముగ నత్తే రెత్తి హ స్తంబునన్
ధరతో వ్రేసిన వ్రేటుతో నదియుఁ జూర్ణం బయ్యెఁ దూర్ణంబుగన్. 33

సీ. అట్లు చేసినకరి నరసి భీమశిఖండి,సాత్యకు లరుదెంచి సరభసమున
శరపరంపర లేసి సామజవేగంబు, నాఁగిన నాఁగ కయ్యది మదించి
మంథాద్రి యనఁ జమూమధ్యంబునఁ బరిభ్ర,మించె నాసంచున మించి సాళ్వుఁ
డర్కుఁ డంశువులు నా నాశుగజాలంబు, పరఁగించి పాఱించె బలఁగ మపుడు

తే. దండపాణి యనన్ గదాదండమునను, బార్షతుఁడు భుజాబలము పేర్పడఁగ నడరి
కుంభికుంభస్థలంబుపైఁ గొట్టుఁడు నది, నెత్రు గ్రక్కుచు నార్చుచు నేలఁ గూలె. 34

ఉ. కూలెడువేళ నీకొడుకు కుయ్యిడ నెయ్యెడ నార్తనాద మా
భీలముగా నెలంగ శినివీరుఁడు ధీరుఁడు సాళ్వశీర్షమున్
వాలికతూపునం దునిమె వాఁడు గజేంద్రముతోడ భూమికిన్
వ్రాలెఁ బవిప్రభిన్న మగుపర్వతశృంగముభంగి పర్వఁగన్. 35

వ. ఇట్లు సాళ్వుండుఁ దెగినంత మహావాతంబున మహీరుహంబు లట్లు నీబలం బెల్ల నల్లకల్లోలం బగుచుండఁ గృతవర్ముండు గండుమిగిలి దండు నిలువరించి సింహనాద పురస్సరంబుగా నరిసైన్యంబు నఱిమి తఱిమె నయ్యవసరంబున సత్యకాత్మజుండు సంరంభించి సాయకసప్తకంబున సత్యకీర్తి యనువాని సమవర్తిపురంబునకుం బుచ్చి కృతవర్మపయి నడరి శరాసారంబు వరఁగించుటయు నతండును జండకాండంబులు తండోపతండంబులుగ నింగియు నేలయు నిండ నేయుచు నని సేయుచుండ నయ్యిరువురకు నారాచవత్సదంతభల్లప్రదరాదులం జేసి ఘోరయుద్ధంబు సిద్ధం బయ్యె నంత గొంతవడికి హార్దికాత్మజుండు. 36

—♦ సాత్యకి కృతవర్మను మూర్ఛితుం జేయుట. ♦—

ఉ. నాలుగువాలుతూపులను నాల్గుహయంబులఁ జావ నేసినం
గోలుమసంగుకోపమునకుం గుదురై సిని సూపినసింగ మట్లు పాం

చాలబలాన్వితుం డయినసత్యకసూనుఁడు వానిమేనిపైఁ
గీలుకొనంగ నేసె నసికీలితబాణచతుష్టయద్వయిన్. 37

తే. అంతఁ గృతవర్మ మూఁడుశితాశుగముల, సత్యకాత్మజు నొప్పించి చాప మొక్క
టూఘ్రునం ద్రుంచుటయు నతం డేపుమీఱి, చాప మొండొక్కఁ డంది సజ్యంబు చేసి.

తే. పదిశరంబుల నొకపరిఁ బట్టి హార్దిక, సుతునిధనువు ధ్వజంబును సూతు నశ్వ
ములను ద్రుంచుటయును గ్రోధమున నతండు, వానిపై నేసె శూలముం బూని కడఁక.

ఉ. మండుచు వచ్చుశూలమును మార్గమునన్ శతధా సహస్రధా
ఖండము లై పడన్ సలిపి కందొవఁ గెంపు జనింప భల్ల మొ
క్కండు నిగిడ్చి సాత్వతుఁ డహో యని మెచ్చఁగ వృష్ణివీరునిన్
గుండెలమీఁద మోదెఁ గురుకుంజరు లందఱు డిందు వందఁగన్. 40

ఆ. దాన రథమునుండి ధరణిపైఁ బడియున్న, వాని నరసి కృపుఁడు వడిగ వచ్చి
తనరథంబునందుఁ గొని నిర్గమించె నెల్లరు గనుంగొనంగ దూరముఁ దొలఁగి. 41

వ. ఇట్లు కృతవర్ముండు విరథుండై పోవుటయు మనబలం బెల్ల నల్లతల్లడం పడి పలాయ
మానం బయ్యె నయ్యెడ దుర్యోధనుం డొక్కరుం డుక్కుమిగిలి పాండుపాంచాల
సోమకసృంజయకేకయానీకంబులం దాఁకి ధృష్టద్యుమ్నశిఖండిద్రౌపదేయప్రభృతి
మహారథుల నెల్ల నిలువరించి యజ్ఞమధ్యంబున మంత్రపూతం బైనమహాగ్ని
మాడ్కి నిరుపమానతేజోవిభ్రాజితుం డై చూపట్టె నట్టియెడ రథాంతరం బధిష్ఠించి
వచ్చి కృతవర్మ తోడుసూపె నంత. 42

—◆ దుర్యోధనుండు పాండవయోధులతో ఘోరయుద్ధంబు చేయుట ◆—

మ. మనదుర్యోధనుఁ డట్లు మార్కొని మదిన్ మాత్సర్య మెచ్చ న్మహో
ధనువుం గైకొని శింజినీధ్వని దిగంతవ్యాప్తి గా మ్రోయ ను
గ్రనిశాతాశుగసంతతుల్ పఱపుచుం గౌంతేయుసైన్యాళి నె
ల్ల నిమేషాంతరమందె ముంచె నృపు లెల్లం బోయి భీతిల్లఁగన్. 43

ఉ. లే దపు డాస్యపానసులిప్తశరాహతిపాలు గాని పై
వేదనఁ బొందనట్టిదయి విద్విషి పోయినప్రాణి యొక్కఁ [illegible]
నాదపసావసానమునయం దరిసైన్యమునన్ రథాశ్వనా
గాదులు నూఁచమై పడియె నాహవగహ్వరి యెల్లఁ గప్పుచున్. 44

ఆ. క్షిప్రహస్తుఁ డగుచు క్షితితలం బంతయు, విశిఖమయము గాఁగఁ బెనఁగుమనసు
యోధనునకుఁ జాలి యోధుఁ డొక్కండు డిరువాఁగునందు లేఁడు నాఁగనొప్పె. 4[illegible]

చ. పరుల కజయ్యుఁడై నృపుఁ డవక్రపరాక్రమ మేర్పడంగ సం
గర మొనరించుచుం బ్రబలి కాండశతంబునఁ బాండవాగ్రజున్
నరశరసప్తతిం బవననందను సాయకసప్తకంబునన్
హరుసముతోడఁ బోరుకొను నాసహదేవునిఁ జెండి వెండియున్. 46

తే. నలువదియు నాల్గు తూపుల నకులు నేడు, శరములం బార్షతుని నేడు సాయకముల
ద్రౌపదేయుల మూఁట సాత్వతుని నొంచి, భల్లమున నొంట సహదేవు విల్లు విఱిచె.

సీ. ధను వొండు గొని మాద్రితనయుండు రారాజు, నెదిరించి పదికోల లేసె నలుక
నకులుండు తొమ్మిది నారసంబులు సుయో, ధనునిపై నిగిడించి తడయ కార్చె
వాల మ్మొకఁడు దీసి వైచె సాత్యకి పాండు, పౌత్త్రు లేసిరి త్రిసప్తతిశరములు
చౌవంచములుకులు సంధించె ధర్మజుం, డెనుబదితూపుల నేసె భీముఁ

తే. డిందఱును నిట్లు మార్కొని క్రందుకయ్య, మొనరుచుచునున్న నించుకయును జలింప
కవనిపతి లాఘవమును సౌష్ఠవము మెఱయ, మేలు చేయఁగఁ బెనఁగె మేల్మేలనంగ.

క. తెఱఁగిన మనసైనికు ల, త్తెఱఁపిని గవియంగ వచ్చి తెగువ రణంబుం
బఱపిరి ప్రావృడ్దినములఁ, దఱచగువార్ధిస్వనంబుఁ దగి స్వన మయ్యెన్. 49

ఉ. అప్పుడు ద్రోణనందనుఁ డహంకృతి మీఱఁగ భీముఁ దాఁకి పే
రొప్పఁగఁ బెక్కుబాణముల నుక్కడఁగం బరఁగింప లోఁగ కా
చొప్పున బాణముల్ వఱపి శూరతఁ జూపె వృకోదరుండు నేఁ
జెప్పఁగఁ జాల గుండె లవిసెం జుమి వారల వింటిమ్రోఁతలన్. 50

మత్త. నీమఱంది యుధిష్ఠిరుం గొని నిర్దయం బ్రహరించి సం
గ్రామముం బొసఁగించుచున్ వడి వ్రాల్చి వానిహయంబులన్
భూమి దద్దిఱ నార్చె పేర్చిన పోమిడిన్ సహదేవుఁ డా
భూమిపుం దనతేరిపైఁ గొని పోయె నాజికి దవ్వుగన్. 51

తే. ఒండుతేరెక్కి ధర్మజుం డొయ్య వచ్చి, సౌబలునిఁ దొమ్మిదియు నైదు సాయకముల
నొంచి సింహనాదంబు గావించె నపుడు, ఘోరమై చూడఁగా నొప్పె వారిపోరు.

క. శకునికొమారుఁ డులూకుఁడు, నకులుండును విక్రమంబునం దాఁకి శర
ప్రకరముల ముంచి కొంచుం, బ్రకటగతిం బోరి రమరవర్యులు మెచ్చన్. 53

సీ. కృతవర్మయును సాత్యకియును బెనంగిరి, బలివాసవులయట్లు బరవసమున
దుర్యోధనుఁడు విలు ద్రుంచి ధృష్టద్యుమ్ను, నిశితశరంబులు నిగుడఁ జేసె
నతఁ డొండుకోదండ మంది కడఁగిన న,క్కజ మయ్యె నాపోరు కరులకు బలె

ద్రోపదేయులు గృపుఁ దాఁకి బాలిశు నింద్రి,యములట్లు కలఁచి కయ్యముఁ బొనర్చ
తే. రప్పు డిరుపాఁగునం గలయట్టిబిరుదు,మగలు ద్వంద్వములై తమ కగు తెఱఁగున
సంకులంబుగ సమరంబు సలిపి రది యు, హాద్భుతంబును నాభీల మయ్యె నధిప. 54

మ. అసిధారాహతి నుద్గతం బగురజం బశ్వాదిసంఘట్టన
ప్రసరద్ధూళి రథాంగసంచలననిర్యద్రేణువుం బత్తిపా
దసముద్భూతపరాగముం గలిసి వాతప్రోత్థితం బై వడిన్
దెసలం గప్పుచు నుప్పరంబుఁ జని దీప్తి న్మాపె మాపో యనన్. 55

ఆ. వెదురుటడవి గాలునదనున నగునట్టు, లులివు గా శిరంబు లిలఁ బడంగఁ
బాడమునెత్రు రజముపొడ వడంగించినఁ, గన్నుఁగవకుఁ దెలివి గాన నయ్యె. 56

ఆ. అరుల కోహటించి మరలినదొరలను, గూర్చుకొనుచు నీదుకొడుకు కడఁక
ననిఁ బొనర్చుచుండు నయ్యవసరమునఁ, బాండవాగ్రజుండు గండుమిగిలి. 57

క. మూఁడమ్ముల శారద్వతు, గాఁడం గా నేసి నాల్గుకాండంబులఁ జెం
డాడెఁ గృతవర్మహయముల, వేడుకకుం బోలె నొక్కవ్రేల్మిడి లోనన్. 58

క. విరథుని హార్దిక్యునిఁ దన, యరదముపైఁ బెట్టుకొనుచు నతిరయమున నా
గురుసుతుఁడు దొలఁచెఁ గృపుఁ డద్దొర నేసెన్ రెండుతొమ్మిదుల బాణములన్.

చ. కనుఁగొని కంట మంట లెసఁగన్ భవదగ్రసుతుండు ధర్మనం
దనుపయి నేడునూ ర్లగురథంబులవారినిఁ గొల్ప వా రన
ల్పనిశితసాయకంబులను బైకొని తేకువఁ జుట్టుముట్టె ని
ట్టన నృపతిన్ ముసుంగిడి రెడన్ జడదంబులు భాస్కరుం బలెన్. 60

ఆ. అట్లు వారిశరసహస్రంబులం గప్ప,వడినధర్మసుతునిమొడ రెఱింగి
వడి శిఖండిముఖ్యు లడరి రథాళితో,నరుగుదెంచి కవిసి రాతఱిమున. 61

క. యమరాష్ట్రవివర్ధనమై, యుమితం బగునమర మయ్యె నయ్యెడ వారల్
సమయించి రొక్కపెట్టున, యమరులు మెచ్చంగ నారథావళి నెల్లన్. 62

ఉ. ఆతఱి నెన్నఁడు న్వినని యట్టిసుదారుణయుద్ధ మెప్పుడో
భూతలమందు వ్యోమమునఁ బుట్టెను బెట్టిద మైనవై మహా
త్పాపము లెన్నియేనియును దాని కొకింతయుఁ గొంక నట్టిరై
బీతఱి పోరి రాదొరలు బీరము గూరగ స్వర్గకాము లై. 63

వ. అయ్యవసరంబున సౌబలుండు మనసైనికులం బిలిచి మీ రెల్లరు నగ్రభాగంబున
నుండి పాండవబలంబున నఱుముం డేను బశ్చాద్భాగమం దతిమెద ననిన నొఁ

గొంత మని మనమద్రయోధులు కిలకిలారవంబు లెసంగ సంగ్రామంబునకుం గడంగి
శత్రుశరపీడితు లై మరలఁ బరాఙ్ముఖంబు వెట్టినంత నింతలోఁ గొంత బరవసంబుఁ
బొసంగించుచు గాంధారధారణీశ్వరుండు వెండియుం జే వీచి పిలుచుచు నిట్లనియె

—శకుని పాండవసైన్యముతో మహాయుద్ధము చేయుట.—

ఉ. పాఱెడ రేల ధర్మమును బాయఁగఁ బెట్టి విరాట్టులార! మీ
రాఱడి పోక క్రమ్మఱుఁ డహంకృతి మీఱఁగ శత్రుసైన్యముల్
మాఱుకొనుండు నే నివల మార్కొని పేర్చెద నంచు మించి నా
ర్వాటులగుట్టముల్ గలుగ నూఱిచిన ట్లొనరించె వైరులన్. 65

వ. అట్లు భగ్నం బైననిజబలంబుం గని యుధిష్ఠిరుండు సహదేవుం బిలిచి యి ట్లనియె.

తే. వీఁడె సుబలాత్మజుఁడు సేన వెన్నుఁ దన్ని, నుఱుచుచున్నాఁడు చూ తె నీవతిమతి విడి
ద్రౌపదేయులతోఁ బోయి దాయ యైన, వాని నెదిరించి గెలుము చేవాఁడి మెఱయ.

వ. నే నిదె నీ వెంట నేనూఱుయేనుఁగులను నైదువేలతురగంబులను మూఁడువేల
కాలుబంట్లనుం బుచ్చుచుంటి ననిన నతం డవ్విధంబునం జని సౌబలానీకంబుపయిం
గవిసి బాణవర్షంబు గురియించుచుండె నతనిరాహుత్తులును మొత్తంబు లై శత్రుసైన్యం
బులపయిం బడి కడిమిం జూపుటయు నప్పుడిరువాఁగుబలంబులకును గదాప్రాసతో
మరకుంతాద్యాయుధంబులం జేసి మహాయుద్ధంబు సిద్ధం బయ్యె నయ్యెడ. 68

సీ. శూరబాహువిసృష్టఘోరశక్తులు నేల, జ్యోతిర్గణము గూలు భాతి నొప్పె
విమలయష్టిప్రాసవితతి వియత్తల,మున శలభంబులపోల్కి నాడెఁ
గరవాలశూలాదికమహాద్యుతులు నింగి, విద్యుల్లతలు వోలె వెలుఁగ నయ్యె
సంతతాశుగపాతసంజాతశబ్దముల్, పిడుగులు పడునట్లు భీతిఁ గొలిపెఁ

తే. దలలు నట్టలు నాసార మొలయుపగిది,నయ్యె రక్తప్రవాహ మయ్యవనిఁ బాఱె
రావుతుల కందుఁ దలమున్క లై వెలువడ,వలను గాకుండె నమ్మహాకలహమందు.

సీ. పటాడి రావుతు లేకమై పడి మల్లు, లట్లు పెనంగి రిట్టట్లు వడుచుఁ
దుండముల్ చుట్టి వేదండంబు లొండొండ, నడగొండ లట్లాడె నట్టువంబు
నరులు ముష్టాముష్టి నడపి కేశాకేశి, గాఁ గట్టుకొని పోరి రీగకుండఁ
గరి కరియును గాఁక కరితోడ హయమును, హయముతోఁ గరియు నై యనిఁ బొనర్చె

తే. నిట్లొకముహూర్తమాత్ర మొంతేని ఘోర,రూపమై యొప్పె సంగ్రామ మేపు మీఱ
ఛిన్నభుజశీర్షములఁ జేసి క్షితితలంబు, కీర్ణమై నెత్తురువాఁకనాఁ గీర్తి కెక్కె. 70

వ. ఆసంకులసమరంబున సౌబలుం డోహటించి హతశేషం బగుషట్సహస్రాశ్వికదళంబు
తోడ మొనఁ దిరుగుటయుఁ బాండవబలంబు రుధిరసముక్షితంబును శ్రాంతంబు నయ్యు
జీవితాశం ద్యజించి కయ్యంబునకుఁ గట్టాయితం బై రథంబు రథంబును గుఱ్ఱంబు
గుఱ్ఱంబును ద్విరదంబు ద్విరదంబునుం బోరుకొనునట్లు కట్టడిం జేసికొని సుబలాత్మ
జునిబలంబు వెండియు రాకుండ దని ప్రతీక్షించుచుండునంత ద్రౌపదీపుత్రులు నిజ
గజానీకంబుతోడ ధృష్టద్యుమ్నుండును దరియ నేగిరి సహదేవుండును రజోమేఘంబున
మిన్ను మన్నుం గానఁ బడకున్నయప్పుడు తా నేకాకియై యుధిష్ఠిరునిపరిసరంబు
నకుం జనియె నట్టిసమయంబున సౌబలుండు వెండియుం గడంగి పార్శ్వంబునుండి
పార్షతవాహినిపయిం గవియుటయు నుభయసైనికులు మాంసలోలుపంబు లగు శ్యేనం
బులచందంబున నహమహమికం బాఁపిడివోయి కోపంబు రూపంబుఁ గొన్నకై వడిం
బాదలి యన్నలు దమ్ములు దండ్రులు గొడుకు లని చూడక వేడుకకుం బోలెఁ గో
లుమసంగి నానావిధాస్త్రశస్త్రంబులం బోరునప్పు డుప్పరంబునుండి తాళఫలంబులు
వడునట్లు పడినశిరంబులయు శరీరంబులయు శబ్దంబులును బక్కెరలనుండి పట్టి పడ
నెట్టినం బుట్టినశబ్దంబులును నికృత్తపాదంబులై నేలం గూలువారువంబులశబ్దంబులు
ను శక్త్యాద్యాయుధంబు లొండొంటిం దాఁకి విఱిగినశబ్దంబులును నరతురగాస్థికపా
లంబులు పగులునెడం బొడమినశబ్దంబులును నొక్కటియై పిక్కటిల్లి దిక్కు లవియం
జేయుటయు నీసైనికులు నీరువట్టిన వారువంబు లలయుటం జేసియు రుధిరగంధం బుద
గ్రంబై సహింపఁ దలంబు గాకుండుటయు నెండవేడిమి పొడిమిం దూలించుటం జేసి
యుఁ గాయమ్ములందలిగాయమ్ములమంట లెగయుటం జేసియు విచేతసులు గాన నెది
రిం ద మ్మోపుంగ కెదురుపడినవారిం బొడిపుచ్చుచుం జచ్చియుం జావనిమచ్చున నై
కాకకంకగృధ్రసృగాలవృకాదిమోదావహం బగునయ్యాహవంబునఁ దెగినపెరవాని
తల కేశంబులం బట్టి యీడునట్టలును నెత్తుట నత్తమిల్లినకరవాలంబులఁ గరంబుల
నత్తి పఱచుకబంధంబులును రెండు రెండుచేతుల నొండొకరిం గట్టుకొని బిట్టుకూలు
మొండెంబులును నిండుకొన జెండువడి పెనంగులాడుచుండ నల్పావశిష్టతురంగసైన్యం
బుతోడ సౌబలుండు కాందిశీకుం డయ్యును బ్రవిదారణాంతంబుగోరి తన్నుఁ దన్నిన
పాండవచతురంగబలంబులఁ జలంబున నెదిర్చి తదీయశరపాతంబునఁ బరిక్షీణబలుం
డై మిగిలినసప్తశతసాదులు దన్నంటి రాఁ దప్పించుకొని పోయి నీకుమారునిబలంగం
బునం జొచ్చి యచ్చటిరాజులం గాంచి యిట్లనియె.

—శకుని దుర్యోధనునికడకు వచ్చి తనపరాక్రమం బభివర్ణించుకొనుట.—

క. కురురా జెందున్నాఁడే, నరయంగా వలయుఁ జెప్పుఁ డనుటయు వారా
పరమార్థుఁ డయినశకునిం, బరికించి వచించి రిట్లు ప్రత్యయ మెసఁగన్. 72

ఉ. అల్లతఁడే సుయోధనమహారథుఁ డారథబృందమధ్యమం
దుల్లసదారవం బుఱుము నోజ నెసంగుచు నున్నచోట శో
భిల్లుచునున్నవాఁడు శశిబింబసమప్రభ మైనవాని పే
రెల్లి వెలుంగుచుండె నట కేగినఁ జూతువు గాత మాతనిన్. 73

వ. అనిన నతం డతిరయంబున రథానీకపరివృతుం డై యున్ననీకొడుకుపాలికిం జని త
న్నుఁ గృతకృత్యునిఁ గా నెన్నుకొనుచు నీవారి నందఱ నానందంబునం దేల్చువాఁ
డై యి ట్లనియె. 74

క. వడి నే గుఱ్ఱపుదడముల, మడియించితి నీవు రథికమండలి నెల్లన్
మడియింపు మాజిఁ బ్రాణము, లడఁచినఁ బాండవుల గెల్చు టరిది నరేంద్రా! 75

క. అరదములు దెగినపదపడి, ద్విరదంబులు గాలుబంట్లు దెగినవ యనుడున్
గురువిభుఁడు సంతసించుచు, నరదంబులతోడ నరిగె నార్పు లెసంగన్. 76

వ. ఇట్లురవడించి శరాసారంబు నిగిడించుచు సమీపించుసుయోధనసేనాసందోహంబుం
జూచి సవ్యసాచి సముత్సాహదోహలి యై దేవకీనందనుం బిలిచి యి ట్లనియె. 77

చ. అరిబలు మేగుడెంచెడి మహాహవముం బొనరించునిచ్ఛ మై
మురహర! తేరి నద్దెసకుఁ బోవఁగ నిమ్ము శితాశుగమ్ములం
గరమరు దంది నీవు ననుఁ గౌఁగిటఁ జేర్చెదునట్లు పేర్చి యి
ద్ధరనిముసంబునం దొరల నందఱఁ జిందఱ సేసి పుచ్చెదన్. 78

వ. అని మఱియును. 79

—కృష్ణార్జునులు దుర్యోధనునిచేతకు సంభాషించుట.—

క. పదునెనిమిదిదివసంబులు, కదనం బెడ తెగక చెల్లెఁ గౌరవసైన్యం
బుదధివలె మొదలఁ బఱపగుఁ, గద గోష్పదమట్టు లిపుడు గానఁగ నయ్యెన్. 80

సీ. కలఁచె దైవం బిట్లు కాదేని సురనదీ, సూతి నేలం గూలఁ జూచి యైన
మేల్గాఁగ సంధికి మేకొడుఁ జీకురా, జాతనిసుతుఁడు నయ్యనఘుమాట
పాటింపఁ డయ్యె దుర్భావుండు గావున, నొం డేమి యెఱుఁగని మొండి యగుచుఁ
గలఁడు ద్రోణుం డది కత మనుకొందు మే, నతఁడు ద్రెళ్లినమీఁద నైనఁ గాని
తే. శాంతి యొనరయుఁ గలిగినజాడఁ గనఁడు, కయ్య మొనరింపఁ గా నిట్లు కాలు ద్రవ్వ

నిన్నరాధము నన్నెంచుకొన్నయేని, బుద్ధిహీనుఁడు హీనుఁ డగు బుద్ధి వోషము. 81

ఉ. అమ్మెయిఁ గావ సింధువిభుఁ డాఁడివోవుటఁ గంటఁ జూచియున్
నమ్మినబంటు సూతకులనందనుఁ డట్లయిపోవఁ జూచియున్
దమ్ముఁడు దుస్ససేను నడఁదం గలనెత్తురు ద్రావఁ జూచియున్
నెమ్మది సమ్మతించెడి ననిం బొనరింపఁగ నెంతవింతయో. 82

క. కర్ణునకు దీటు వచ్చువి,కర్ణుండు నలాయుధుండుఁ గాంభోజుండున్
వర్ణితభుజుఁ డగుసాళ్వుఁడు, ఘూర్ణిల్లుచు నాజిఁ బడుటకుం దలఁకఁ డహో. 83

మ. పరిచర్యం బొనరించి దారినడుమ న్వంచించి లోనెంచియున్
వరముం గాంచి స్వపక్షమందు నని నల్వు న్నిల్పుకొన్నట్టిబం
ధురబాహాబలుఁ డైనమద్రమహినాథుం డిట్లు పెన్నిద్రకై
ధరణిం ద్రెళ్లుట నెల్ల మైన నితఁ డంధప్రక్రియం దోఁగెడిన్. 84

వ. మఱియు భూరిశ్రవ స్సోమదత్త భగదత్త బాహ్లీ కావంతిక శ్రుతాయు శ్శ్రుతాయుధ పౌరవ జలసంధాదులును దక్షిణరాజలోకంబునుం జక్కుపడిపోయినను మొక్కలీఁడై వీఁడు లోభమోహంబులఁ బెనంగులాడుచున్నవాఁడు రాజవంశంబునం బొడమినవాఁ డిట్టివైరంబు పాటించునే హితాహితంబు లెఱింగినప్రాజ్ఞుండు బలశౌర్యగుణంబులఁ దనకు నెదిరికిం గలతారతమ్యంబు విచారింప కూరక పోరికిం దిగునే వీఁడు మూఢుండ కానివో సర్వలోకాభిగమ్యుండ వైననీవు సర్వక్షేమంబు గోరి సంధిగావింపం జని చేసినహితోపదేశంబు విననివీఱిఁడి వీని నేమనంగలదు తల్లిదండ్రులును విదురుండును భీష్మద్రోణాదులుం జెప్పినచొప్పెఱుంగక ప్రత్యాఖ్యానంబు చేసిన యిప్పశుప్రాయుని మహాధ్యరోగంబునకు మందు గలదే వీఁడు కులాంతకుం డై పుట్టె ననుట విస్పష్టం బయ్యె నన్నిపాట్లం బడుచున్నవీఱిఁడి వీఁడు మాటలం జేసి మాకు మారాజ్యం బిచ్చునే యనుచున్నంత మురాంతకుం డిట్లనియె. 85

చ. ఖలుఁడు సుయోధనుండు తనకంతముసం దుసురాడుచుండ నెం
తలు పఱు వచ్చెనేని వసుధాతలభాగ మొసంగఁ డాజి గా
కెలర దోకం డటంచు వచియించెఁ దగ న్విదురుండు నాఁటియ
ప్పలుకులు నేఁటికిం దెలియ వచ్చెను సత్యము లంచు నర్జునా. 86

ఆ. అతఁడు సెప్పినట్ల యయ్యె నీతసవ్యవ,సాయ మెల్ల మఱియు జామదగ్న్యుఁ
డనిననుడు కప్వ డవమతిఁ జూపిన, దాన నాశ మిట్లు గాన నయ్యెఁ. 87

వ. అనిన నర్జునుండు వెండియు. 88

ఉ. ఉక్కివుఁ డైనవీఁడు జని నొందిననాఁడ మహాత్ము లెందఱో
తక్కక చెప్పి రీతనికతమ్మున నిమ్మహి క్షత్త్రియక్షయం
బొక్కటఁ గల్గు నంచు నదియు న్నిజ మయ్యెఁ దలంప నయ్యయో
మిక్కిలికష్ట మే మనుచు మీఁద వచించెద నయ్య మాధవా. 88

క. శిబిరము శూన్యం బైనన్, సుబలసుతుం దోడుకొనుచు శూరంమన్యుం
డబలుఁ డగుధార్తరాష్ట్రుఁడు, కబళింపం జూచు మనలఁ గల నొడ్డి కటా. 89

చ. విదురునివాక్యముల్ మఱియు వీనిదురాకృతముం దలంపఁగాఁ
గదనము వీనితో ముగియుఁ గాని మఱొక్కటఁ గాదు గాన నీ
వదలిచి వాజుల న్నడపు మాతనిచెంతకుఁ దేరు తద్బలం
బడవడ కై పడంగఁ దెగటాఱిచి యన్నకు మేలు గూర్చెదన్. 90

వ. అనిన నాఁ గాక యని ప్రగ్రహహస్తుం డగుచక్రహస్తుండు వానిచెప్పినచొప్పున రథంబు వోవ నిచ్చి నిస్త్రింశశరఘోరంబును శక్తికంటకసంకులంబును గదాపరిఘపథంబును రథనాగమహాద్రుమంబును హయపత్త్రిలతాకీర్ణంబును నగుసుయోధనసైన్యాటవిం దఱిసి యెందుఁ జూచినం దన వ్రాలుమావులశతాంగంబ చూపట్టునట్లు బెట్టుగ విహరణంబు గావించుటయును. 91

సీ. గాండీవికోదండఘనశింజినీధ్వని, భూనభోంతర మెల్లఁ బూరటిల్లఁ
వాసవాశని కీడు వచ్చుకాండంబులు, ధారాధరము వారిధార లట్లు
కురియుచుం గవిసిన నరనాగరథహయ,పత్త్రిసంతతి గప్పువడియె నపుడు
పార్థనామాంకితబాణమయుం బయ్యె, సంగరాంగణ మెల్ల నింగి నేల
తే. దిక్కులు విదిక్కులును జూడఁ దెలియ నయ్యె, వేనవేలుగఁ దెగి పడె సేన లెల్ల
వెల్లువగఁ బాఱెఁ గీలాల మెల్లకడల, నేచె నార్తనినాద మదెంతయేని. 92

క. శరచాపధరుం డగుని,త్వరుఁ డాఫాల్గుణుఁడు బాలభానునిపగిదిం
బరఁగి కురుసేనఁ గాల్చెం, గర మరుదుగఁ గక్ష మగ్ని శరణి నరేంద్రా! 93

తే. రుక్మపుంఖము లగువానిరోపము లొకఁ,డొకఁడు గా వచ్చి నరగజాశ్వకము నెల్లఁ
గప్పఁగూలిచె నిట్లు నీకొడుకుబలము, నరుఁడు మంద్రించె నింద్రుఁ డసురుల నట్లు.

వ. ఇట్లు వక్రపరాక్రమంబున శక్రనందనుం డానందంబునం గ్రందుకయ్యం బొనర్చ నప్పు డాతనిమునుమున న్నిలఁ జాలక నీసైనికులు దుర్యోధనుండు సూచుచుండ బెండువడి హతరథాశ్వకేతుహేతిసూతంబుగాఁ బితృపుత్త్రభ్రాతృమిత్త్రాదులం బరిత్యజించి పఱచువారును బాఱుట క్షాత్త్రంబుగా దనునభిమానంబునం బట్టి పెనంగి గిట్టి

నిట్టూర్పు నిగిడించు వారును మూర్ఛిల్లినవారి నపసరిల్లం జేయుచు సాంపరాయికం
బునకుంగానివారును దప్పిగొని నీళ్లాని తెప్పిఱిల్లి దుర్యోధనునిపంపునం దెంపుచేసి
తెగువారును దోఁగియుం దమతమపితృపుత్త్రాదుల శిబిరంబులకుం బుచ్చి కట్టాయి
తంబై వచ్చి వివ్వచ్చు నెదర్చియు వానికోత్తలల కోహటించి క్రీడించువారును నై
కొందఱు కొందఱుగ నందఱు సమందగతి ధృష్టద్యుమ్న నఱిమిన నతండును శిఖం
డియు శతానీకుండును నెల్లవారి నెదిరించి రప్పుడు దుర్యోధనుండు ధృష్టద్యుమ్ను
నెదుర్కొని. 95

శా. నారాచంబులు వత్సదంతములు బాణంబుల్ ప్రయోగించి దో
స్సారం బేర్పడ వాని తేరిహరులం జక్కాడి గాఁడంగ బా
హూరస్స్థానములందు శాతశరముల్ యోజించి యేయంగ నా
వీరోత్తంసుఁడు సిబ్బు సూపిన మహావేదండ మట్లొప్పెఁజుమ్. 96

—ధృష్టద్యుమ్నుండు సుయోధనుని విరథుం జేయుట.—

మ. అలుకం జేసి భవత్కుమారరథరథ్యశ్రేణి నాల్గిమ్ములం
జులకం దున్మి తదీయసారథిశిరస్సున్ మేనికిం గానియ
ట్టులు గావించి యలంచినన్ నృపతిపట్టుం దప్పి యప్డేగె సౌ
బలసైన్యం బగుచోటు సేరుకొన బాబా నెక్కి యొక్కింతలోన్. 97

ఆ. తేరిదడము లట్లు తీఱిన పదపడి, మూఁడువేలయేన్గు లోడ కపుడు
పంచపాండవులను బ్రహరించుట్టుఁడు వార, లైరి ఘనవృతగ్రహంబు లనఁగ. 98

ఉ. అప్పుడు సవ్యసాచి గొనయంబు రయంబున మ్రోయ గాండివం
బప్రతిపాశ మట్లుగ మహాశుగసంతతిఁ బర్వఁ జేయుచుం
గుప్పలు తిప్పలై పడఁగఁ గూల్చె గజావలి భీమసేనుఁడున్
గుప్పున తేరు డిగ్గి గద గొంచుఁ జరించె లయాంతకుండు నాన్. 99

సీ. వానిఁ గన్గొని నీచమూనిచయం బెల్ల, నాత్రమునన్ శక్రసూత్రము విడ
గుదె తాఁకులన్ భిన్నకుంభములై నెత్రు, వాఱ వారణములు వ్రాలెఁ గొన్ని
కొమ్ములు విఱిగియు ఱొమ్ములు వగిలియుఁ, దొండముల్ దునిసియుఁ దోరెఁ గొన్ని
పిడుగుపాటునఁ గొండ వడినట్లు పడి నేల, నార్తస్వరంబున నడలెఁ గొన్ని

తే. యట్లు పడుచున్న శౌఱిఁ బాండవాగ్రజుండు, నకులసహదేవులును భయప్రకటితమతిఁ
బఱచుమనసైనికులపయి బహుశరాళి, పఱపి రప్పార్షతునితోడుపాటు గలుగ. 100

వ. ఇట్లు మనమూఁక చీఁకాకుపడుచున్న సమయంబునఁ గృపాశ్వత్థామకృతవర్మలు రథా
నీకంబున దుర్యోధనుం గాన కతండు హతుండు కా వలయు నని తలంచి వగచుచు

నట నున్న పోటుపలం గాంచి సుయోధనుం డెం దున్నవాఁ డని యడిగిన వాసను.

మ. విరథుం డై సుబలాత్మజధ్వజినికి న్వత్రస్థుఁ డై పోయె నా
నరనాథుం డని కొందఱుం బగఱు బాణవ్రాతఘాతంబులం
బరిమర్దించుచు నున్నవా రిపుడు జీవం బుండినం జూత మ
ద్దొరతో నే మని కొందఱుం బలికి రార్తుల్ గానఁ దొట్రిల్లుచున్. 102

శా. ఆతం డుండిన నేమి చేయఁ గలవాఁ డాఖీల మాలాం బరి
వ్రాతం బేర్చి వెలార్పఁ బ్రాణములు నిల్వం జాల మీ రింతలో
మాతో నుండి దురం బొనర్పఁ డనుచు న్మాటాటగాఁ గొందఱుం
బ్రీతిం దక్కి వచింప నాముగురు దోర్వీర్యాబుసం బర్వుచున్. 103

వ. ఇంచుక పోరి రాజదర్శనలాలసులై వారిం బాసి సౌబలానీకంబునకుం బోయి రంతఁ బార్థతపురస్కృతు లగుపాండుపుత్త్రులు ప్రకృష్టచిత్తులై నీబలంబుపై నురవడించిన వివర్ణముఖభూయిష్ఠు లయి నీవారు జీవితాశం బరిత్యజించుకొని బెండువడి యుండి రప్పు డేను బరిక్షీణాయుధు లై పగఱకుం జిక్కియున్నవారిం గాంచి బిక్కమొగం బు వైచికొని విన్నబోయి చావునకుం దలంకక మున్ను శారద్వతుం డున్నచోట నంగద్వయసేనాసమేతులై నలువురు పోటుమానుసులమాటున నిలిచి పాంచాల బలంబుతోడం బెనంకువకుం దిగినంత నంత కాకారుం డగునస్త్రనుశరంబులు కరం బు పీడింపఁ బెంపు దఱిగి సాంపరాయికంబునకుం దొలంగి ధృష్టద్యుమ్నునకు మ లంగి పోవుచున్నంతఁ జతుశ్శతరథపరివృతుండై సాత్యకియును పఱతెంచి వచ్చి న న్నెదుర్కుటయు నేను జేయునది లేక దుష్కృతి నరకంబునుం బోలెఁ దదనీకంబు నం జొచ్చి చిచ్చుఱపెనుగున కెత్తువచ్చునయ్యచ్యుతానుజనితో ముహూర్తమాత్రం బు మహాహవంబు గావించి తదీయశరప్రహారంబుల మూర్ఛితుండనై పడిన నన్నతం డు జీవగ్రాహంబుగం గ్రహించి పట్టుకొనియె నట్టియెడ భీమసేనుం డట్లు వేదండశతం డంబుల నుగ్గునూఁచంబు గావించుచున్నంత హతశేషు లగునీసుతులు దుర్మర్షణ శ్రుతాంత జైత్ర భూరిబల రవి జయత్సేన సుజాత దుర్విషహ హరిహ దుర్విమోచన దుష్ప్రధర్ష శ్రుతర్వు లనువారు నిశితవిశిఖంబులం గురియుచు నలుగడం జుట్టుముట్టి గాడ్పుపట్టిపయిం గవిసిన నబ్బలుమగం డుబ్బి గొబ్బున నరదం బెక్కి మొక్కవోని పరాక్రమంబున నిశాతసాయకంబులు నిగిడించుచు. 104

—దుర్విషహప్రభృతికురుకుమారులు భీమునిచేఁ జచ్చుట —

సీ. కనలి యొక్కక్షురప్రమునను దుర్మర్షణుఁ, శిరము డొల్లిపడంగఁ జేసి భల్ల
మున శ్రుతాంతుని నంతకునిఁ గొల్వఁ గాఁ బుచ్చి, శితశరంబున జయత్సేనుఁ గూల్చి

తనమీఁద నూఱమ్ముల నిగిడ్చిన శ్రుతర్వు, నొక్కనారసమున నుక్కడంచి
మూఁడుతూపుల జైత్రపుత్రకునిన్ రవిఁ, బృథ్వీపయుఁ బడ బిట్టు మోఁది
తే. భల్లమున దుర్విలోచను ద్రెళ్ళ నేసి, రెండురెండు శిలీముఖకాండములను
దుష్ప్రధర్ష సుజాతులఁ దునిమివైచి, శాతసాయకమున దుర్విషహునిఁ జంపె. 105
మ. తనసోదర్యుల నట్లుచంపుటకు. జి త్తంబందు రేకెత్తవ
చ్చినక్రోధంబున బోధ మాఱఁ బగయుం జేరన్ శ్రుతర్వుండు భీ
మునిపైఁ బాఱి సురూపచాపగుణమున్ మ్రోఁగించి దీవ్యద్ధుతా
శనతుల్యాశుగసంతతిం గురిసి పెల్చం బేర్చి పెల్లార్చుచున్. 106
క. విలు దునిమి తునిమినంతన, బలుతూపులు రెండుపదులు పావనిమేనన్
జిలుకుటయు నతఁడు నొండొక, విలు గైకొని యేసె నతని విక్రమ మెసఁగన్. 107
ఉ. వారలపోరు పేఱుకొని వాసవజంభుల కట్లు ఘోరమై
వారిశరాసముక్తశరవారము సూరునితేజు నాఁగ నై
ధారణిఁ గప్పె నప్పుడు క్రుధం గొని సీతనయుండు భీముబా
హూరము లావ నేసె నిశితోగ్రపృషత్కము లెన్నియేనియున్. 108
ఆ. దాని కలిగి భీమసేనుఁడు పర్యాప్తి, నా గ మొఱసి సీతనయునిసార
థినిఁ దురంగములను దునిమి యంతన లోము, వాహిసాయకము వాని నొంచె. 109
క. విరథుఁడు శ్రుతర్వుఁ డంతం, గరవాలము ఖేట మంది కడఁగెను వో న
మ్మరుదాత్మభవుఁడు తచ్ఛర, మరుదారగ నొకక్షురప్రహతిఁ దెగ నేసెన్. 110
క. తల దెగి శ్రుతర్వుఁ డుర్వి,తల మద్రువ రథంబునుండి తల్వారును దా
నిలఁ బడియెఁ బడినఁ దావకు, లలికిరి విభ్రమవిమోహితాత్మకు లగుచున్. 111
వ. ఇట్లు శ్రుతర్వుండు పడినపదంపడి హతశేషబలార్ణవంబునుండి వెలువడి వచ్చి భవ
త్సైనికు లోలం బాసగొనక భీమసేనుం జుట్టుముట్టి బిట్టేయుటయు నాజగజెట్టి సహ
స్రాక్షుండు రాక్షసులం బోలె వారిం బట్టి పీడించుచు నేనూఱుమహారథంబులను నే
డునూఱు కుంజరంబులను నెనమన్నూఱు ఘోటకంబులను పదివేలపత్తులను మిత్తి
కప్పనంబు వెట్టి తన్నుఁ గృతార్థునిగను సఫలజన్మునిగను దలంచుకొనుచుఁ దనవం
కం దేరిపాఱం జూడ లేకున్నపదానుగుల నెల్లఁ బరిమర్దించికరతాలశబ్దమాత్రంబున
దంతావళలంబులం బాఱఁ ద్రోలుచున్నంత నీసైన్యంబు హతభూయిష్ఠయోధంబును
నల్పావశిష్టంబునై దైన్యంబు నొందె నయ్యవసరంబున హతశేషం బయినగుఱ్ఱపుద
డంబునడుమ దుర్ధర్షద్వితీయుండై యున్నదుర్యోధనుం గాంచి శ్రీకృష్ణుండు జిష్ణుని
దిక్కు మొగంబై యిట్లనియె. 112

—: కృష్ణుం డరిబలంబు తెఁగుట జిష్ణునకుం జెప్పుట :—

సీ. పగ ఱింతకొలఁదిగాఁ బెగిరి దాయాదులు, పరివారితులు శినివరుఁ డితండు
సంజయుఁ బట్టి శత్రుంతపుఁ బోరి, పోగి పరిశ్రాంతు లైరి కవలు
కృపుఁడును గురుసూతి కృతవర్మయును జేని, విడి యెడ మై వేఱుకడకుఁ జనిరి
పాంచాల్యుఁ డదిగో ప్రభద్రకసహితుఁడై, యరిసేనఁ జెండి మే లంది యుండె

తే. నల్లదె సుయోధనుఁడు వ్యూహ మల్లుకొనుచు,హరిసమూహమునందు శ్వేతాతపత్ర
మొనయ మనవంకఁ జూచుచు నున్నవాఁడు,వానిఁడ చే బసి జయ మంద నౌను విజయ.

చ. గజఘట లెల్లఁ జచ్చుటలు కవ్వడి పీ వఱుమంగ వచ్చుటల్
నిజము గ్రహించి దాయలయసీకినిఁ జావఁగ నున్నసైనికుల్
గజిబిజిఁ బాఱిపోకమును గౌరవనాథుని గండడంచి నీ
విజయము చాటగా వలయుఁ బిల్వఁగ నంపుము గెల్వఁ బార్థతుర్. 115

ఉ. బాలిశుఁ డా సుయోధనుఁడు బాహుబలం బఱి వాఁడి వత్తమై
పోలక యుండెఁ దప్పకొని పోవఁగఁ జాలఁడు మిమ్ముఁ గూల్చి మీ
పాలు హరింపఁగాఁ దలఁచువాఁ డిపు డిట్టుగఁ జావనెంచి తా
నాలము సేయ నుండెఁడి యధార్థము నావుడు నర్జునుం డనున్. 116

సీ. ధృతరాష్ట్రసుతు లెల్ల హతు లైరి భీముచేఁ, గొలవదునిద్దఱుం గూలువార
సురనదీసుతుఁడును గురుఁడు కర్ణుఁడు శల్య,సైంధవముఖ్యులు సమసి రాజి
గృపకృతవర్ములుం గృపిసూతియు సుశర్మ,యు నులూకశకును లాతనిహయంబు
లేనూఱు తేరులు నిన్నూఱుకరులు నూ,శ్వాలిబంటులు మూఁడువేలు మిగిలి

తే. యుండెఁ గురుబల మిప్పటి కున్నవారు, గాలగతికిని దప్పిపోఁ జాల రిట్టి
బలము హత మైన రారాజు బయిసిమాలి, తనర నున్నాఁడు చూడు మాతని తెఱంగు.

మ. హతశత్రుండగుఁ బాండవాగ్రజుఁడు నేఁ డాదుర్హృదుల్ సంగర
క్షితికిం బాయకయుండి రే నొకరుఁడున్ జీవింపఁ బోరంచు నీ
మతి నూహింపు మమర్త్యులైనఁ గడిమిన్ మార్కొంచు నే నందఱన్
శితశస్త్రంబునఁ దీర్చి పుచ్చెద సుహృచ్ఛ్రేణుల్ ప్రశంసింపఁగన్. 118

తే. ఇపుడ గాంధారపతిఁ గూల నేసి యీ న,మరమునం దైన రాజు జాగరమ దెల్లఁ
బుచ్చివైచెద దుర్ద్యూతమున నతండు,దిగిచికొన్న ధనంబులు దెత్తు మరల. 119

తే. నాగపురకాంత లెల్ల నీనాఁట సుతులుఁ, బతులునుం బాండవులచేత హతు లయి రని
యెఱిఁగికొందురు నేఁటితో నెల్లజనులు, ముగియు నిప్పుడ రారాజు దెగు నిజంబు

క. జ్యాతలనిర్ఘోషమునన్, మాతంగంబులు తురంగమంబులు దేరుల్
పాతరలాడం జాలునె, పాతము నొందెడిని రథము పఱపుము కృష్ణా. 121

వ. అనిన నప్పుండరీకాక్షుం డక్షీణజవంబున దుర్యోధనబలాభిముఖంబుగా నిజరథంబు వోవ నిచ్చుటయు భీమసేనుండును సహదేవుండును సింహనాదంబులు సేయుచు సుయోధనుం జంప నుత్సహించువాని ననుసరించినం గాంచి కొంచక సౌబలప్రభృతులు వారి మువ్వుర నెదిరించి రందు నీసుతుం డగుసుదర్శనుండు భీమసేనుని సుశర్మశకునులు శ్వేతవాహనుని హయపృష్ఠగతుం డగుసుయోధనుండు సహదేవుని నఱిమి దురమ్ము గావించి రాసమయమ్మున నీయగ్రనందనుండు గండుమీఱి. 122

ఉ. ప్రాసము వట్టి త్రిప్పి యద్రువన్ సహదేవునిమీఁద పట్టుపై
నిసునఁ జేసి వేయుటయు నింతటిలోన నతండు సొమ్మ రాఁ
గాసిలి తేరిమీఁద నొరగం బడి రక్తపరిప్లుతాంగుఁడై
కూసము నూడ్చు త్రాఁచుబలెఁ గ్రుద్ధత రోఁజుచు లబ్ధసంజ్ఞుఁడై. 123

క. వేఁడిపిడుగులకు నీడగు, వాఁడిశిలీముఖము లతనివక్షమునందున్
గాఁడంగ నాడి నొంచెన్, వేడుకకుం బోలెఁ బగఱు వెక్కసపడఁగన్. 124

ఉ. కవ్వడి నెవ్వడిం గొని త్రిగర్తలపై నెదిరించి గాండివం
బివ్వల నవ్వలం దిరుగ నేర్పుల జూపుచు రోపకోటులన్
రువ్వుచు గుఱ్ఱపుందడము రూపఱఁ జేసి రణప్రియం బెరన్
నివ్వటిలన్ శతాంగతతి నేలకుఁ గోలకుఁ దెచ్చె నచ్చోటన్. 125

—: అర్జునుండు త్రిగర్తులతో సుశర్మం దెగటార్చుట. :—

క. ఉక్కునఁ బేర్చి త్రిగర్తులు, మిక్కిలికసి జిష్ణురథముమీఁద శరంబుల్
క్రిక్కిఱియ నట్లు గురియుచు, నెక్కిరిఁ బోరుటయు విజయుఁ డేర్తుఱ మెఱయన్.

సీ. ఱంకొన్న సింగమ ట్లుసరి పిల్చుచు సత్యకర్ముని యరదంబుకాడి గూల్చి
యొకక్షురప్రమున మస్తక మిల ద్రొల్లించి, మూఁడమ్ముల సుశర్మ నాశ నేసి
త్రైగర్తపీఠులఁ దఱిమి క్రోధరసంబు, గ్రుక్కుచు నూఱింటఁ బ్రస్థలపతి
నొంచి రథ్యంబులఁ ద్రుంచి శరంబు వాఁడు, సంధించి బిట్టు వక్షమున నేసె

తే. సందున నతండు గుండియ లవిసి మాంసపేశి వెలి వచ్చుటం జేసి ప్రేత మగుచుఁ
గుంద మనవారు పాండవుల్ కుతుక మంద, నేలపైఁ గూలెఁ బెనుగొండ గూలినట్లు.

వ. ఇట్లు సుశర్మం దెగటార్చి పేర్చినవిక్రమంబునం బెల్లార్చుచు నేద్వు రేనమండ్రు ము
ప్పదుండ్రు నగువానిపుత్త్రుల మిత్తివాసం బెట్టి పదానుగుల నెల్లఁ దెళ్లఁ జేసి పర

మోహ్లానంబునం బ్రవర్తిల్లుచున్నంత భీమసేనుండును హస్తోత్కర్షంబున నవ్వుచు సుదర్శనునిశీర్షం బొక్కకుప్పకోలం ద్రెవ్వనేసి తదీయపదానుగులు పరివేష్టింప నింద్రాశనిసమస్పర్శంబు లగునిశాతసాయకంబుల వారి నందఱ మ్రందించినం గినిసి సేనాధ్యక్షుం డక్షీణపరాక్రమంబునం గవిసి శరవర్షంబు గురిసినంత నుభయబలంబులకు నొక్కింత సమ్మర్దనమగం బయ్యె నయ్యెడ సౌబలుండు సహదేవుం దాఁకి శరాసారం బడరించుచుండ నులూకుండు భీమసేనుం దలపడి పది ప్రదరంబులం బ్రహరించి సహదేవునిపైఁ దొంబదివాలంబులు వాటించె నప్పు డప్పాండవేయు లిరువురును ధారాధరం బంబుధారలం బోలె శరాసారంబు తోరంబు గావించి చీఁకట్లు పుట్టించిన నీబలం బంతయుఁ దత్సాయకపరిచ్ఛిన్నం బై యున్నంత నమ్మోహారంబున దుత్తుము రైనకత్తళంబులును గడికండ లైనఖడ్గప్రాసకుంతాదులును ముక్కలైన టెక్కియంబులును జిరిగినశరీరావయవంబులును దెగినకాలుసేతులును జిలికినశీర్షంబులునుం గలిగి నేలం గూలినకాలుబంట్లును నిట్టనిలిగినగుఱ్ఱంబులపల్యాణంబుల నుండి గుండె లవియం బడి యొగిఁబడి మడియురాహుత్తులును గళ్లెంబులం గఱచుకొని కత్తారుల ఖండితంబు లైనకాళ్లునుం గంఠంబులును గలిగి కూలి మొత్తంబు లైనకత్తలానులును జిత్తజల్లుగ నెల్లెడలం బడి వెల్లువ లైనసల్లయును గలిగి సంగ్రామరంగంబు క్రవ్యాదగణభూయిష్ఠం బై భయావహం బైనంత మనయనీకిని యల్పావశిష్టం బై కానంబడియె నయ్యవసరంబున గాంధారవల్లభుండు. 128

శా. మాద్రేయానుజనత్తలంబున శిరోమధ్యంబున న్మోఁదఁ దుర్
నిద్రం బొందినయట్లు మూర్ఛమునుఁగన్ వీక్షించి భీముం డటన్
రుద్రుండో యన రౌద్రమూర్తి యగుచున్ రూపింప నై భూపతుల్
క్షుద్రత్వంబున నోహటిల్లి కనుఁగో స్రుక్కించి రాశ్మాంతముల్. 129

క. ఒక్కఁగుఁడ సర్వసైన్యము, మిక్కుట మగుతూపుగముల మేదించి పెసల్
పిక్కటిల సింహనాదము, బక్కజముగఁ జేసె నెల్లరది విని పాటన్. 130

వ. అట్లు వెఱచి పఱచువారిం జీఱుచుఁ బేరెలుం గెత్తి దుర్యోధనుండు. 131

చ. మరలుఁడు వెన్ను సూపకుఁడు మార్కొని పోరుఁడు పాఱ నేటికిన్
దురమునఁ జత్తు రేనియును దోరపుఁగీర్తి సుఖాంబునం దగుం
బరమున సర్వసౌఖ్యము లపారములై చనుదెంచు నావుడున్
దిరిగి చమూసమూహ మది దీకొనెఁ బార్థచమూసమూహమున్. 132

సీ. ఫాల్గును ఫ్లిగి నదిగిగ్రధి ఫోఁధం జొచ్చి రంశల్లో నహదేవుఁడు చెప్పిటల్లి ముప్పటి

గొన్న బీరంబున గాంధారనాథుం దాఁకి. 133

తే. దశశరంబుల నాతనిఁ దరల నేసి, మూఁట మావుల నొప్పించి మేటివిల్లు
విఱిచె నవ్వుచు నతఁ డొండువిల్లు పూని, సద్దు మొనరించి శర మేయుసమయమందు.

క. అనిలజుఁడు నకులుఁ డఱిమిన, ననిలజు నేసెంట నకులు నర్వదిట నొమ్మఁ
దినయప్పు డులూకుఁడు వడిఁ, దనతండ్రికిఁ దోడుసూపి దర్పమెలర్పన్. 135

క. పావని నేడమ్ముల సహ, దేవుని నేడ్పదుల నొవ్వ దేర నడఁచినం
బావని గినుకం జేయుచుఁ, జేవమెయిం దొమ్మిదింటఁ జెరివియు వానిన్. 136

—; సహదేవుం డులూకుం జంపుట. ;—

చ. అఱువదినాల్గుతూపు లరయంబున సౌబలుఁ దూల నేసి యే
డ్తెఱఁ గొని మూఁడు మూఁ డయిసతీక్ష్ణశరంబులఁ బార్శ్వవస్తులం
దెఱఁగఱఁ జేసె వారలు మదిం గడు నల్గి రవిఁ ఘునాఘునం
బఱిమినయట్లు ముట్టి నకులానుజు ముంచిరి శస్త్రధారలన్. 137

మ. సహదేవుం డపు డంపతుంపర వెసం జల్లార్చి పెల్లేర్చి దు
స్సహుఁడై వీఁక నులూకునిం దఱిసి తీక్ష్ణం బైనభల్లం బొకం
డహినా రోఁజుచు నేసి తచ్ఛిరము వాయం జేయ నెత్రొల్కుచున్
మహిఁ గ్రాలె నతండు పాండవుల కానందంబు సంధించుచున్. 138

మ. తనపుత్త్రుం డటు ధాత్రికిన్ బలిగ సంతాపంబునం దోఁగుచుం
గనులం దస్రులు జాలువాఱఁ గొన నగ్గాంధారభూనాథుఁ డా
ర్తి నిడూర్పుల్ నిగిడించుచు న్విదురసూక్తిన్ జ్ఞప్తికిం దెచ్చుకొం
చు నిమేషాంతరమందుఁ గుందె నెడఁదన్ శోకంబు పాకంబుగన్. 139

క. అడ లుడిగి కితవుఁ డంతం, గడిమిన్ సహదేవుఁ దాఁకి కాంశత్రయమున్
వడిఁ దిగిచి యేసె నాతఁడు, గడికండలు చేసి దానిఁ గడువడి నడుమన్. 140

ఉ. విల్విఱుపంగ నేయుటయు వీతశరాసనుఁ డాతఁ డాగ్రుఁడై
వాల్వెఱపించుచు న్విసరి వైచె వెసన్ సహదేవుపై నతం
డల్వున నవ్వి దానిఁ దుమురై పడఁ జేసె నహంకరించుచున్
బల్విడి సౌబలుండు గద పట్టి కరంబుల బిట్టు త్రిప్పుచున్. 141

క. విసరిన నదియును వమ్మయి, వెస నోయెం బాంసవాస్త్రవినిహత మగుచుం
గసిమసఁగి కాళరాత్రికిఁ, బన వచ్చెడుశక్తి నత్తి వైచెం బెలుచన్. 142

ఉ. మండుచు వచ్చుదాని నడుమన్ సహదేవుఁడు నొండు రెండు గా

ఖండములై పడన్ వరకఁగా నది నాకమునుండి కాంతులన్
నిండి విశీర్యమాణమయి నేలపయిం బడు గ్రక్కు నస్థయ
గ్గ్రొందఁ గశబ్దముం గలిగి యుద్ధభువిం బడె ఖేటదంబుగన్. 143

తే. అట్లు విసహాస మగుశక్తి నరసి సేన, బెగడ నంతయు విముఖమై భయము గదుర
విచ్చె శకునియు ననుచరుల్ వెగడు గుడిచి, పఱచెఁ జొచ్చిరి పగతుఱెల్ల నఱచుచుండ.

వ. ఇట్లు పరాఙ్ముఖంబు వెట్టి కదలుచున్న సౌబలప్రభృతులం గని కనలుచు సహదేవుండు శరాసారంబు గురియించుచు వెన్నడిన్ని కొన్ని యడుగులు చని ముట్టడించి నాఁడు తనపాలికిం బెట్టిన జూదరిం దుద ముట్టింప కుండరా దని తలంచి. 145

ఉ. పోవఁగ నీక పేఁకమెయిఁ బోరుచు నూఱులు వేలు కోలలం
జేవమెయిన్ నిగుడ్చుచును శింజినిమ్రోఁత దిగంతగామి యై
పోవఁగఁ జేయుచున్ ద్విరదముం గొని తోత్రముల స్మరించున
ట్లావిమతాగ్రగణ్యు సుబలాత్మజు నొవ్వఁగ నేసె నీసునన్. 146

వ. ఏసి వాఁడు చేసిన చేతలెల్ల స్మరింపఁ జేయువాఁడై యి ట్లనియె. 147

—: సహదేవుండు శకునిం గూలనేయుట. :—

ఉ. పాటెఱిఁగ వేల సుస్థిరతఁ బట్టి పెనంగుము పూరుషుండ వై
మీఱితి రాజధర్మ మిది మేరయె జూదమునాఁడు నవ్వుచున్
దూఱుచు నుబ్బి బొబ్బలిడి దుర్లలితత్ఫలమెల్లఁ బొందు దే
నీఱిచిపుత్త్రు నిన్నిపుడు త్రెళ్ళఁగ నేయుచు భల్లసంహతిన్. 148

తరువోజ. తొలి మున్ను నవ్వినదురితాత్ము లెల్లఁ, ద్రుంగిరి రణమందు దుర్యోధనుండు
కులనాశకుండును గ్రూరుండు వాని, కూర్చు మామవు నీవు క్రూరతరుఁడవు
తెలియంగ మివిలి తిత్తైఱఁగున నిష్ఠ, తీవ్రక్షురప్రముం గీసి నే నీదు
తల తాళఫలము క్రిందకు రాల్చునట్లు, తఱిగి రాల్చెద నింత తఱలక నిలుము. 149

వ. అని నొనాడి సహదేవుండు క్రుద్ధుండై సౌబలు నగ్గలించి. 150

తే. పదిశరంబుల నాతనిఁ బడలుపఱచి, నాలుగమ్ముల వాజులం గూల నేసి
మూఁడుశరముల నొగి చాపముం గొడుగును, సిడమునుం గూల్చి పెల్లార్చె సింగమట్లు.

ఆ. అంతఁ బోక సాయకాసారముం బర్వఁ, జేసి నకులుతమ్ముఁ డీసున సుబ
లాత్మజునిశరీరమందలిసంధులు, గ్రంథులెల్ల నట్లు గా నొనర్చె. 152

ఉ. నొచ్చియు నగ్గిఱన్ శకుని నూల్కొని మాద్రికుమారుఁ జేరఁగా
వచ్చి కరద్వయంబునను ప్రాసము ద్రిప్పుచు నైన నాతఁడుం

గ్రచ్చఱ మూఁడుభల్లములఁ బ్రాసముఁ జేతులు నొక్కమాఱుగా
వచ్చనినొత్తుటం దడిసి పృథ్విఁ బడం దెగ నేసి యార్చుచున్. 153

క. శాత మగునొక్కభల్లము, చేతం గొని తిగిచి యేయఁ జెచ్చెఱ నది యా
ద్యూతప్రియుశీర్షము దెగి, భూతలమునఁ ద్రెళ్ళి బూదె బ్రుంగం జేసెన్. 154

మ. కురురాజానయమూలమై నిక్కృతికిం గొట్టైనగాంధారభూ
వరుమొుండెం బది రక్తసిక్త మగుచున్ వైముఖ్యముం గూర్చుచున్
ధరణిం గూలె భయంబు గూరినమదిన్ ధైర్యంబు వోకారఁ బా
ఱిరి నీసైనికు లెల్ల నగ్గడలు కీర్తింకుల్ ప్రదర్శించుచున్. 155

మత్త. అంకకాఁ డగుసౌబలుం డటు లస్తమించుట కెంతయే
నంకిలిన్ విడనాడి సంతస మంది పొంది ప్రియంబునన్
సంకు లొత్తిరి పాండుపుత్రులు చక్రపాణియు సైనికుల్
పొంకమేర్పడఁ బ్రస్తుతించిరి పొందుచున్ సహదేవునిన్. 156

—♦ హ్రా ద ప్ర వే శ ప ర్వ ము ♦—

వ. అయ్యవసరంబున. 157

మ. అరు లిట్లున్నతిఁ గొంటకున్ నిజధరాధ్యక్షుండునుం బుత్రుఁడుం
వరశస్త్రాహతిఁ గూలిపోవుటకు సైరన్ లేక గాంధారచ
క్రరమారక్షకు లాత్మరక్షణ మెదం గాంక్షింప కప్పాండవా
వరజుం దాఁకఁగ వచ్చిన న్విజయుఁడున్ వాతాత్మజుండున్ వడిన్. 158

మ. వరశస్త్రాస్త్రములం దదీయబలము న్వామ్మోచనం జేసి త
చ్ఛిరమున్ బాహువులున్ ధరాతలమునం జిందాడఁ గావించి సు
స్థిరు లైనం గని పేరెలుంగు వొదలం జేపిచ్చి దుర్యోధనుం
డరులం జంపక పోవు టొప్పదని నైజానీకినిం బిల్చుచున్. 159

క. హతశేషు లయినసైనికు, లతని న్మన్నించి మరలి యరిబల మఱుమన్
గర మలిగి నరుఁడు వారల,శిరముల్ క్షణమాత్రలోనఁ జెండాడె నృపా. 160

వ. అప్పు డొక్కరుండై దుర్యోధనుండు. 161

క. పదుమూఁ డక్షౌహిణు లక్కదనమునం దట్లు వోవఁ గని నిజబల మ
ప్పదమునఁ గానం జాలక, పొదవెడునరిదళము విడిచి పోవం దలఁచెన్. 162

వ. అనిన ధృతరాష్ట్రుండు సంజయునిదిక్కు మొగం బై. 163

క. మామకసైన్యం బంతయు, నామెయిఁ దెగినపుడు పాండవానీకిని యెం
తై మసలుచుండె నాకొడు, కేమయి వర్తించెఁ జెప్పు మేర్పడ సూతా. 164

వ. అని యడిగిన సంజయుండు విను మప్పాండవబలంబున రెండువేలరథంబులు నైదు
వేలగుఱ్ఱంబులు నేడువందలయేనుఁగులుఁ బదివేలకాలిమానిసులును మిగిలి యుండిరి
నీదండుం గొని ధృష్టద్యుమ్నుండు రణాంగణంబున మెఱయుచుండె నని వెండియు.

—: దుర్యోధనుండు కాందిశీకుండై పలాయితుం డగుట. :—

చ. వినుము నరేంద్ర నీకొడుకు వేనినిఁ దోడ్పడువాని నొక్కనిం
గనుఁగొనఁ జాలకేపునను గ్రాలెడుశత్రులఁ జూడ నోఁప క
య్యనిమొన నిల్వ నోడి హత మైనతురంగము వీడి భీతునం
దనమది దద్దఱిల్లఁగ గదం గొని పోయె నొకండు బెండమై. 166

సీ. అక్కట యేకాదశాక్షౌహిణీసేన, కధ్యక్షుఁ డైనరాజాధిరాజు
కాల్నడ నొక్కండ కదలి ప్రాఙ్ముఖముగా, నొక్కింతద వ్వేగి యొక్కచక్కి
సేద దీఱంగ నిల్చి సేనాక్షయంబున, కెద దురపిల్లుచు విదురుఁ డపుడు
పలికినపలుకులు దలఁపునకుం దెచ్చు,కొని పోరు వైశసంబునకు నవ్వ్యె

తే. నతఁడు ప్రాజ్ఞుఁడు విన నైతి నజ్ఞుఁడ నని, తనదుచేఁతకు నెంతయుఁ దనకుఁ దాన
తెగడుకొనుచును గడుచింత వెగడుపడుచుఁ, జెంత మడు వున్న దానిలోఁ జేరఁదలఁచె.

వ ఇట ధృష్టద్యుమ్నపురోగము లగుపాండవసైనికులును హతశేషు లైననీసైనికులం
బొదివి పోనీక పెనంగుచున్నంత శ్వేతవాహనుండు గాండీవంబున వారి నందఱ
మ్రందించి కృష్ణసారథికం బైననిజరథంబునఁ గపికేతనంబు గ్రాల లీలావిహారంబు
గావించె నిట్లు నిహతం బై ఛిన్నద్రుమం బైనమహావనంబు పోలె నైననీసైన్యంబునఁ
గృపకృతవర్మాశ్వత్థామలు మువ్వురును దక్క నొక్కరుండును గాన రాఁ
డయ్యె నయ్యెడ ధృష్టద్యుమ్నుండు కట్టువడి యున్ననన్నుం జూచి తలయూఁచి
సాత్యకిదిక్కు మొగం బై యి ట్లనియె. 168

క. ఈతని నేటికిఁ బట్టితి, వీతఁడు జీవించి చేయు నెగ్గేమి యగుణ్
జాతము విను మనఁ గాదని, ఘాతుకుఁ డయి శినివరుండు క్రౌర్యం బెసఁగన్. 169

వ. ఖడ్గంబు పెఱికి వ్రేయ నున్నంత సాత్యవతేయుండు సన్నిధిం జేసి వీనిం జంపవలదు
విడువు మనిన వల్లె యని వాసుదేవానుజుం డమ్మునితల్లజునిపాదారవిందంబులకుం
బ్రణమిల్లి నాదుబంధంబు వెడలించి బ్రదికి తెందేని బొమ్మనిన సమ్మతిం గొని నేను
బొందళంబు లేక నిరాయుధుండ నై నెత్తుట నత్తమిల్లినమేనితో సాయాహ్నంబున

నగరంబునకు రా నెంచి సుయోధనుండు పోయినదారి వట్టి క్రోశమాత్రదూరంబు పోయి యచ్చట. 170

—: దుర్యోధనుండు ద్వైపాయనహ్రదంబున డాఁగియుండుట :—

చ. అలుగులు గ్రుచ్చుట న్నిగుల నారట మొందుచు నిందు నందుఁ జూ
పులు భయసూచకంబు లయి పొందఁగఁ బుచ్చుచు వెచ్చ నూర్పు నిట్
బొలసి గదాద్వితీయుఁ డయి పొందుకొనం దలపోత వెచ్చినా
వెలసిననీరుమారుకునిగ్రహముం గనుఁగొంటి నొంటిమై. 171

తే. అతఁడు నన్నశ్రుపూర్ణాక్షుఁ డగుచుఁ దేరి, చూడ నోడియు నోరగాఁ జూచి కొంత
వడికి దీనుఁడ నగునాదువదన మరసి, వగలఁ బొగలెడువిధమునఁ దగియె నధిప. 172

సీ. ఏకాకినై యిట్లు శోకించుసద్గోరఁ, బలుకరింపఁగ లేక పలవి నేను
నెసఁగించుకొని యెలుం గెట్టకేలకు నవిరళముగా నించుక పలికి పిదప
ననుఁ బట్టుటయు వ్యాసముని విడిపించుట,యును జాఁప్ర దప్పుటయును దెలిపితిఁ
దెలిపినంత నతండు దెలివిఁ బొంది యొకింత, చింతించి తమ్ముల సేన నడిగె

తే. నేను బ్రత్యక్షదర్శిని గాన నెల్ల, వారును ద్రెళ్ళ రాకృతవర్మ కృపుఁడు
గురుసుతుండును బ్రతికి పోయిరి మహీశ!, తెలుపఁ దే యిట్లువ్యాసుఁడు కలను మొదల.

వ. అనిన నతండు పెద్దయుం బ్రొద్దు వెట్టవెట్టూర్పు నిగిడించి నన్నుఁ జూచి నామేను నిమురుచు సంజయా! యిపుడు పాండుపుత్రులు సహాయసంపన్నులై యెసంగుచున్నవారు నాకు నీకన్న మఱియొక్కరుండు లేడు గావున నీవుమాతండ్రి పాలికిం బోయి

ఉ. నీకొడుకు సుయోధనుఁ డనక సహజన్ములఁ బుత్రమిత్రులన్
బోకడఁ బెట్టుకొంచుఁ దనభూతలరాజ్యము పాండుపుత్రికుల్
చేకొనిపోవ నుండు టది చెల్లదు గావున నిట్లు సెప్పి తా
నాకడ నొక్కపెన్మడుపునందు నడంగె నటంచుఁ జెప్పుమా. 175

వ. అని చెప్పి యట నున్నద్వైపాయనహ్రదంబునం బ్రవేశించి తన మాయావిద్యాప్రభావంబున జలంబులు తన్నంటకుండ స్తంభనంబు గావించుకొని యుండె నయ్యవసరంబున శరక్షతాంగులై డస్సి యున్నకృపకృతవర్మాశ్వత్థామలు మువ్వురును మూఁడురథంబు లెక్కి పోవుచు నట నన్నుం గని గుఱ్ఱంబులం దఱుముకొనుచు నాచెంతకుం జనుదెంచి. 176

క. జీవించి యుంటె సంజయ, భూవల్లభుఁ డేడి బ్రదికి పోయెనె చెపుమా
నావుడు నాతనికుశలము, వా విడిచినసుతులఁ దెలియ బలుకుము నంతన్. 177

వ. ఈహ్రదంబునం జొచ్చియుండె నని వాక్రుచ్చితి నంత నశ్వత్థామ మదుంగునిక్క
మొగంబు చేసి విషాదంబునం బరిదేవనంబు సేయుచు ని ట్లనియె. 178

ఉ. అక్కట మమ్మెఱుంగ కిటు లాఱడివోవు సుయోధనుండు మే
మిక్కరణిన్ మెలంగుట యొకింత తలంపున కయ్యె నేని తా
నొక్కటఁ బోర శాత్రవుల నేయ సమర్థుఁడు గాక పోవునే
మిక్కిలి కష్ట మే మనుచు మేలు దలంపఁగ వచ్చు సంజయా. 179

వ. ఇట్లు పెద్దయుం బ్రొద్దు పరిదేవనంబు సేయుచుఁ బాండవులు పరిసరవర్తు లగుచుండి
రని వెఱింగి నన్ను శారద్వతునిస్యందనంబుపై నిడుకొని వారు సేనానివేశంబునకుం
బఱతెంచి రక్కడ. 180

సీ. అరుణాస్తమయసమయంబున శిబిరరక్షకులు సైన్యం బెల్ల సమసి పోవ
వినుచు నెలుం గెత్తి విడకేడ్చుటయు వృద్ధ, లైనయోషిద్రక్షు లడలు గుడిచి
రవ్వార్త దెలిపి రాజాంతఃపురస్త్రీలు, శిరము లురంబులు కరము మోఁది
కొని గోళ్ళ మేన్ జీఱుకొని కేశపాశము,లను బీఁకుకొని త్రెంచుకొని విభూష

తే. లశ్రు లురలంగ లాలు నగుగుదేర, నార్తనాదము లెంతయు నతిశయిల్లఁ
గురరుల ట్లేడ్చు మండఁగ గుహుజనంబు, వారిఁ దోడ్కొని నగరికి వచ్చె నధిప. 181

తే. ఎండకన్నను వానక న్నెఱుఁగకుండ, నగళులం దుండి యేరికి గానఁ బడక
సౌకుమార్యాంచితలు కులసతులు వారు, పసులకంటెఁ బడం గడుబడలు వడిగి. 182

మత్త. ద్వారపాలురు వేత్రహస్తులు తద్భయంబునఁ ద్రస్తులై
వారియాస్తరణాదులం గొని వాహనాదుల నెక్కి య
మ్మారుతాత్మజుసాధ్వసంబున మానసంబు వడంకఁ గా
నూరుఁ జేరిరి సత్వరంబుగ నూర్పుచుం గడు నార్పుచున్. 183

వ. అయ్యవసరంబున యుయుత్సుండు శోకసంతప్తచిత్తుండై ప్రాప్తకాలంబుం దలపోయు
చుఁ దనమనంబున. 184

మ. హితవాక్యంబు దలంప కాలమున కై యేకాదశాక్షౌహిణీ
పతి దుర్యోధనుఁడున్ సహోదరులునుం బాటందఁ గానై రనిన్
హతు లాభీష్ముఁడు ద్రోణుఁడున్ మఱియు సైన్యవ్రాతమున్ సర్వమున్
క్షితి నే నొక్కఁడ నుంటి భాగ్యగరిమం జెప్పంగ నిం కేటికిన్. 185

చ. హరిణులు వోలె దద్దతిలు చట్టిటఁ జూచుచు భీతచిత్తలై
కురుకులకాంత లందఱును గుయ్యిడుచున్ శిబిరంబు వీడి పో

దురమునఁ గాని వృద్ధు లదె తోడ్కొని పోవుచునుండి రే యుధి
ష్ఠిరునకుఁ జెప్ప వెంటఁ జనఁ జేరుట లొప్ప నటంచు నెంచెదన్. 186

వ. అని యప్పుడ వైశ్యాపుత్త్రుండు ధర్మపుత్త్రునిపాలికిం జని తనయభిప్రాయం బెఱిం
గించిన నజాతశత్త్రుండు ప్రీతచిత్తుండై నీ తలంచినది లెస్స కార్యంబు పోయి రమ్మని
వాని నక్కునం జేర్చి వీడ్కొల్పుటయు నతండు రథారూఢుండై రయంబున
రథ్యంబులం దఱుముకొని రాజదారలం గొనిపోవు వృద్ధకంచుకులం జేరి వారితో
నమ్మునిమాపున నశ్రులోచనుండై పురప్రవేశంబు గావించి రాజమందిరంబునుండి
కంట నీరు వెట్టుకొనుచు వచ్చుచున్న విదురుం గాంచి ప్రణతుండై నిలువంబడి యు
న్నంత నతం డతనిం గాంచి యిట్లనియె. 187

క. కురుకులనాశక మగునీదురమునఁ బడ కీవు బ్రదికి తొలఁచితి వకటా
నరపతి లేకిట కేవొ, క్కరుఁడవు రా నేల చెపుము కలుషా పల్కన్. 188

మ. అనినన్ నీసుతుఁ డిట్లనున్ వినుమహాత్మా! పుత్త్రమిత్త్రాళితో
నని గాంధారవిభుండు ద్రెళ్ళఁ గని సాహాయ్యంబు గావింప నొ
క్కని నెందుం గన లేక వ్యాకులమతిం గౌరవ్యుఁ డాతేభయం
బునఁ దా నెక్కినవాజి వోవిడిచి నడన్ బోయె న్వడిం దూర్పుగన్. 189

తే. భూవిభుండు స్కంధావారమును దొఱంగి, పోయినంతట సాధ్వసంబునను రాజ
వనితలం దోడుకొని వృద్ధజనులు వచ్చు, చుండ వచ్చితి వారిఁ గాపుండు నిచ్చ 190

తరళము. అని యుయుత్సుఁడు చెప్పిన న్మనమందు సంతస మంది యి
ట్లను నతండు తగం బొనర్చితి ప్రాప్తకాలమునందు మా
నినులఁ గాచితి లెస్స చేసితి నీవు ఘోరరణంబునన్
దునుఁగ కిట్లు వెంచుటల్ శుభవోహాలంబ తలంపఁగన్. 191

క. దైవోపహతుండగు నీ, భూవరునకు నంతకాలమునను బుత్త్రుఁడవున్
నీ వైతి వరుఁడ నీతో, జీవించెదు వాఁడ యయ్యొ క్షితిపయు నింకన్. 192

వ. అని పలికి మఱియును. 193

తే. ఇందు నేఁ డీవు విశ్రాంతి నొంది రేపకడన ధర్మజుపాలికి వెడలు మనుచు
సాశ్రులోచనుఁడై రోదనాన్వితముఖు, నగరునకుఁ బోయె నిట్టూర్పు నిగిడికొనఁగ.

వ. యుయుత్సుండును నిజమందిరంబునకుం జని కురుకులక్షయంబునకుఁ జింతిల్లుచున్న
వాఁడు గావునఁ దమవారి ప్రశంసలకుం బ్రహర్షింపక యారాత్రిం బుచ్చె నని ధృత
రాష్ట్రుండు సంజయుం బిలిచి. 195

—, కృపకృతవర్మాశ్వత్థామలు దుర్యోధనుం గని సంభాషించుట. :—

సీ. సర్వసైన్యంబులు సమసినపదపడి, శిష్టులు మువురు నాశ్వత్థసుతుఁడు
నేమి చేసిరి శేష మెట్లు ప్రవర్తించె, నెఱిఁగింపు మన నతం డిట్టు లనియె
నవ్వనీసుతు నరయఁ జాలక పార్థ,సేనలు చనె నిజశిబిరమునకు
మనమువ్వ రమ్మునిమాపునయందు న,వ్విడిదం నుండంగ నెఱుఁగ సేయ
తే. కపుడు ద్వైపాయనహ్రదమందు సుప్తుఁ, డయినరారాజు కడ కేగి వానికిఁ దమ
రాక యెఱిఁగించి లే లెమ్ము రాజచంద్ర, మముఁ గనుసి పోరఁ బిలుము ధర్మజుని ననికి.
చ. గెలిచినరాజ్యభోగము లకించనత స్వడనాడి పొందుటో
కలన హతుండ వైనఁ గుతుకంబున స్వర్గసుఖంబు నొందుటో
కలుగును గాని యిట్టి లిటుఁ గాఱియ నొందుట కానిమాట త
ద్బలమును డస్సి యున్నది హతం బగు నిప్పుడు నీదుకైవడిన్. 197
వ. అనిన దుర్యోధనుండు. 198
శా. నాపుణ్యంబునఁ జాక యున్నమిముఁ గానం గల్గితి న్వీరులా
రా! పాటించి వినుండు నానుడులు సంగ్రామంబునం డస్సి నా
మీపట్లన్ మన మింత విశ్రమముగా నిట్లుండుటల్ పోలెడిం
గోపస్ఫూర్తి ననిం దొడంగుటకు సంకోచించి భాషించితిన్. 199
క. స్తుతమతియుం బ్రభుభక్తియు, నతులితముగ మీకు నగుట కచ్చెరు వగునే
కృతహస్తులార! సహజస్థితియే యిది కాని కాలచింతయు నాయున్. 200
క. కావున నీరే యొకఁ డీక్రేవలఁ దగి విశ్రమించి రేపాడి భవ
ద్భావము మెయి వర్తించుచు, నావల నని కెత్తెఁ దాఁకు నారిప్రబలున్. 201
మత్త. నావుడున్ గురునందనుం డను నానుడి న్విని లెమ్మనిన్
నీవు భద్రము లొంద నుంటివి నేను సోమకముఖ్యులం
జావ నేసెద నేఁటి రే యటు సల్పకుండఁగ పాంచాలం
బే విడం దలపోయు నిశ్చయ మిట్లు బాస యొనర్చెదన్. 202
సీ. అని వారిలో వార లనుకొనుచుండంగఁ, బాండవులకు మాంసభారము లిడు
వేటకాఱులు కొంద ఱాటవికులు పల్లంపుమోపులు మోఁతఁ బెంపర మగు
దప్పి జనింప నాద్వైపాయనహ్రదంబునకు నీరానెడుబుద్ధి వచ్చి
వారిరహస్యసంభాషణంబు లవెల్ల, విని ధర్మసుతునాజ్ఞ మనుజపతిభువి
తే. నరయు వారలు గావున నం దతండు, దాఁగి యుంటయు నని కిచ్చ దలఁపమియును

ముఁగరనిర్బంధమును ధ్రువంబుగ నెఱింగి, బసధనం బిత్తు రెఱిఁగింపఁ బాండవు లని.

ఉ. బోయలు నిశ్చయించుకొని పొంగుచు నంజుడిమోపు లన్నియున్
మోయఁగఁ బూని వేగులను బుచ్చియు నెట్లు సుయోధనస్థితిం
దీయఁగ లేక చింత కయి తీరినపాండవు లున్నచోటికిం
బోయి వృకోదరాంతికముఁ బొందిరి కావలివారిఁ ద్రోయుచున్. 204

వ. వృకోదరుండును వారి నాదరించి వారివలన సర్వవృత్తాంతంబును విని వారికిన్ బసధనం బొసంగి పొంగినసంతసంబున ధర్మరాజునొద్దకుం జని యది యంతయు నెఱిఁగించి. 205

చ. తెలియఁగ వచ్చె లుబ్ధకులు దెల్పుటఁ జేసి సుయోధనుండు తా
సలిలములందు డాఁగికొనె స్తంభనవిద్య నెసంగఁ జేయుచున్
బలుకులచొప్ప నిట్టి దని పల్కెఁ బ్రహృష్టమనస్కుఁ డమ్మహీ
తలపతి తమ్ములందఱకు దానవవైరికిఁ దక్కువారికిన్. 206

వ. అది అంతయుఁ దెలియఁ జెప్పి యప్పు డప్పురుషోత్తమునిం బురస్కరించుకొని ప్రస్థానంబు ప్రకటించుటయు భీమార్జుననకులసహదేవులును ధృష్టద్యుమ్నశిఖండులును యుధామన్యూత్తమౌజసులును ద్రౌపదేయులును సాత్యకిప్రభృతులును బెక్కండ్రు పాంచాలవీరులును బహువిధమాతంగతురంగశతాంగపదాతిబలంబులునుం బరివేష్టించి నడువ సైనికులకిలకిలారవంబులును శంఖభేరీమృదంగానకపణవకాహళాదిరవంబులును సింహనాదంబులును బోరుకలుగఁ బదరేణుజాలంబు మిన్నుముట్టఁ బదఘట్టనంబున నిలాతలంబు గ్రక్కదల దుర్యోధనాన్వేషణతత్పరుం డై యుధిష్ఠిరుండు చని చని యొక్కచో మాఱటసముద్రంబు నా నొప్పు ద్వైపాయనహ్రదంబు నకుం జనుదెంచుటయుఁ గాలనీరదనిస్వనోపమం బగు సేనానిస్వనం బాలించి కృపకృతవర్మాశ్వత్థామలు జలాంతర్గతుం డైనసుయోధనుం బిలిచి. 207

మ. ధృతరాష్ట్రాత్మజ! పాండుపుత్త్రు లిదె సంహృష్టాత్ము లై సైన్యసం
తతితో వచ్చుచునున్నవా రిచట నుండన్ రాదు మా కిప్డు నీ
మతమే నింత తొలంగి పోవుదుము నా మన్నించి మన్నీఁడు నం
తతసంస్తంభన మాచరించుకొని క్రింద న్నిల్చె నీరంబులన్. 208

తే. రాజునామంత్రణము చేసి రథికవరులు, దఱుము కొనుచు రథంబుల దవ్వు వోయి
కానలో నొక్క మఱ్ఱివృక్షంబు క్రింద, విశ్రమించిరి తేజీలఁ బీడఁ జేసి. 209

వ. అప్పుడు వారు మువ్వురుం దమలోన. 210

ఉ. భండన మెట్లు కాఁ గలదొ పార్థివుఁ డెట్టులు కాఁ గలం డొకో
పాండవు లెట్లు కౌరవునిఁ బట్టుకొనం గలవారొ యైన మె
ట్లుండెనొకో యటంచుఁ గడు నూర్పుచుఁ బేర్చినచింత వారలం
దుండినయంత నమ్మడుపునొద్దకు వచ్చెను బార్థసైన్యముల్. 211

వ. అయ్యవసరంబునఁ బాండవాగ్రజుండు గదాగ్రజుం గాంచి యి ట్లనియె. 212

శా. దైవీమాయను జేసి కౌరవకులాధ్యక్షుండు దుస్స్తంభన
ప్రావీణ్యంబున నిందు డాఁగె నితరుల్ భంజింపఁగా లేరు దు
ర్భావుం డీనికృతిజ్ఞుఁ డెట్టినికృతిం బాటించిన స్వనికిక్
దేవాధీశుఁడు తోడు సూపిన సనుక్ గ్రోశించి పోవచ్చునే. 213

క. ఒక్కింతలోన నీఖలుఁ, డెక్కటికయ్యమునయందు నీల్గినవాఁడై
దక్కినపుసామి చేతికిఁ, దక్కినవానిగ జగంబు తప్పక చూచున్. 214

వ. అనిన జనార్దనుం డి ట్లనియె. 215

క. మాయావియైనవానిన్, మాయం గెలువంగ నొప్పు మహీతలమున నీ
మాయాత్మ నీవు మాయం, జేయుచు నోడించి జయము చేకొన వలయున్. 216

వ. అని మఱియును. 217

ఉ. మాయకు మాయ మం దనుచు మాన్యులు వల్కుచు నుంద్రు గాఘన
న్మాయలమాఱి మాయమెయి మార్కొని మాన్పరు ప్రొందఁ జేయుచుం
డ్రాయమరేశ్వరుండు మును నాలమునం దలవృత్రముఖ్యులన్
మాయ లనేకము ల్గొలిపి మర్దన సేయుట లాలకింపమే. 218

సీ. శ్రీమహావిష్ణు వాశ్రితపక్షపాతియై, బలిని బంధించె నుపాయమునన
హరి హిరణ్యాక్షుని నడఁచి తదగ్రజు, వధియించి పుచ్చె నుపాయమునన
రామచంద్రుఁడు తొల్లి రావణుఁ బరిమార్చెఁ, బ్రధనంబునందు నుపాయమునన
కార్తికేయుఁడు లోకకంటకుం దారకుఁ, బట్టి మర్దించె నుపాయమునన

తే. మఱియు నిల్వలవాతాపిమాంసభుజులు, విప్రచిత్తియుఁ ద్రిశిరుండు వీరు లైన
సుందుఁడుపసుందుఁడును దొట్టియెందఱేని, ప్రాణములు వాసిరి క్రియాభ్యుపాయమునన.

తే. ధర్మనందన నీ విప్డు తగునుపాయ, మెద్దియే పన్ని మాయావి నిద్దురాత్ము
ధార్తరాష్ట్రునిఁ దెగటార్పఁ దలఁపు మనుచు, వెరవుబోధించెఁ గృష్ణుఁడు వెరవరియయి.

వ. ఇట్లు బోధించినంతఁ గౌంతేయాగ్రజుండు జలాంతర్గతుం డైనసుయోధనుని సంబో
ధించుచు ని ట్లనియె. 221

—: ధర్మరాజు మడుగునఁ డాఁగియున్న దుర్యోధనునిఁ బాలనాడుట :—

ఉ. క్షత్రియజాతిలో స్వకులసంభవులం దుదముట్టఁ జేసియున్
ధాత్రి యుగాంతసంహతి గఁ దాఁగిలి మూఁకల నాచుచుం దనూ
యాత్రను దీర్పఁ జొప్పడు ప్రయత్నము సేసి మడుంగునీటిలో
గాత్రము దాఁచుకొంటె యిది కాదన రే జను లోసుయోధనా. 222

మత్త. లెమ్ము లెమ్మిఁక నైన నెమ్మది లేవడిం దిగఁ ద్రావి బీ
రమ్ము సూపుచుఁ బోర నుండుము రాజధర్మము పూని నీ
కమ్మెయిం గలమానదర్పము లవ్వి యెక్కడి కేగెని
న్నిమ్మహీప్రజ పోటుబంటుగ నెంచు నంతయు వమ్మయే. 223

తే. క్షత్రియుండవు కురుకులసంభవుఁడవు, కులము జన్మముఁ దలపోసి కొనుచు నైన
వెఱపు విడువుము పోరికి వెడలు టరయ, నార్యజుష్టము స్వర్గదాయకము గాదు.

ఉ. తాతలు తండ్రులుం సుతులు దాయలుఁ దమ్ములు మామలుం సమా
ఘాతమునందుఁ జచ్చుటలు గన్నులఁ జూచియు ఘాతుకుండవై
భీతున మేని నోము కొన భీముని బారికిఁ దప్పి వచ్చితే
నీకలపోఁత నీచ మసి నే నన నేటికిఁ దేటతెల్లమే. 225

శా. శూరంమన్యుఁడ వీవు గాని యరయం శూరుండవా కావు నే
శూరాగ్రేసరుఁడన్ ఘనుండ ననుచుం గోష్ఠిస్థలిం జెప్పఁగాం
దారా శూరులు పాఱిపోవుదు రె ప్రత్యర్థిస్థితిం జూచి యే
ధీరత్వంబు దలంచి యిట్లరిగి తేదీ చూపు మీపట్టునం. 226

క. తమ్ములు దడములు వోవన్, సమ్మతి పడి యెట్లు బ్రదుకఁ జాలితి విది ధ
ర్మమ్మని తలఁచితె చాల్చా, ల్లెమ్మనికిం దిగుము నీకు లివ లేదొకోఁ. 227

మ. శకునిం గర్ణుని నాశ్రయించి తమరే సర్వంబు సాధింపువా
రిఁక నే మర్త్యుఁడఁ గా నటంచు నిను నీవే కానఁ గా లేక మో
హకుఠారంబునఁ గొట్టుకొంటి వెగపై నామోహ మేమయ్యె దా
నికిఁ దార్కాణమె యిప్పలాయన మిఁకే నీచెల్మికే మందుఁ బో. 228

సీ. నీపౌరుషంబును నీపరాక్రమమును, గంగపాల్సేసితే కౌరవేంద్ర
నీదుమానంబును నీదుగర్వంబును, మంటలోఁ గలిపితే మానవేంద్ర
నీకృతాస్త్రత్రయము నీభుజాబలమును, గాలికిఁ బోయెనే కాశ్యపీంద్ర
నీధైర్యగరిమంబు నీగభీరత్వంబు, బూదె పాలయ్యెనే పూరుషేంద్ర

తే. నీదుపేరెల్ల నింగిపూనెఱిఁగఁ జేసి, నీళులం డాగితే చాలుచాలు నింక
రాజధర్మము దలఁచితే నోజ గలిగి, రమ్ము మాతోడఁ బోరుము రాజరాజ. 229

ఉ. పూజ్యత గల్గి రమ్మనికిఁ బూనుము మమ్ము నెదిర్చి యోర్చి సా
మ్రాజ్యము నొందు మందులకు మాలితివేనియుఁ జచ్చి స్వర్గభూ
రాజ్యసుఖంబు లొందు మిది రాజులధర్మముగా నొనర్చె ముఖ్య
ప్రాజ్యపరార్థుఁ డానలువ రాజవ యే నటు సేయ నెంచుమా. 230

—: దుర్యోధనుండు నీటనుండి ధర్మరాజున కుత్తరం బిచ్చుట. :—

వ. అని పలికినపలుకు లాకర్ణించి యవకర్ణించుచు జలాంతర్గతుం డగునీతనయుండు ధర్మ
తనయుండు విన నిట్లనియె. 231

ఉ. ప్రాణభయంబు గల్గు టది ప్రాణికి నైజమ యట్టులైన నేఁ
బ్రాణభయంబునం దొలఁగి నట్టిఁడ గాను రథంబు నాయుధ
త్రాణము లేనివాఁడ నయి రక్షకు లెవ్వరు లేక యొంటి నై
త్రాణ చెడంగ డయ్యుట హ్రదంబునఁ జేరితి విశ్రమింపఁగన్. 232

ఆ. ఇంతలోన మీరు నిట విశ్రమింపుఁడు, నేద దేఱి వచ్చి నాదుశక్తి
కొలఁది మీఱి పోరుకొందు మి మ్మందఱ, నన యుధిష్ఠిరుండు ననియె నిట్లు. 233

క. నినుఁ దడవుచు మే మింతటి, దనుకన్ విశ్రాంతి గాంచి తగి యుంటిమి నీ
వును దేఱుకొంటి వింక మ,మ్మని గెల్వుము రమ్ము తడయ నది యేమిటికిన్. 234

క. మము గెలిచి మహీరాజ్యసు,ఖము నొందెదు కాద యేని కయ్యమునం ద
ప్రసుఖంబునఁ దెగి పరమో,త్తమవీరస్వర్గ మొందెదవు నిక్కముగన్. 235

వ. అనిన దుర్యోధనుండు. 234

చ. ఎవరికిఁ గాఁగ రాజ్యము వహింపఁ దలంచితి నట్టినాదు బాం
ధవులును దమ్ములున్ రణమునం దెగి రిప్పుడు శూన్యరత్నమై
నృపవరవిహీన మైనధరణి న్విధవం బలెఁ బొందనొల్ల ని
క్కువముగ మిమ్ము నోర్చుటకుఁ గోరుదు మీఁదగుత్రు ళ్ళడంచుచున్. 237

సీ. అదియుఁ గార్యము గాద యని బుద్ధి యగుదెంచు, ద్రోణభీష్మాదులు త్రుంగు దాన
రిత్తరాజ్యం బెల్ల నిత్తఱి నీనెత్తి,పయిఁ బెట్టుకొనుము నాపట్టు వదలెఁ
దాతల భ్రాతలం దండ్రులఁ బుత్రులన్, మిత్రుల గోల్పడి మిగిలి నేను
దగుదు నంచును బ్రదుకఁగఁ జాల నైశ్వర్య, మంది మీ రెంతయు నలరుచుండ

ఆ. రాజ్యకాంక్ష యెల్లఁ బూజ్య మయ్యెను నేఁడ, తోలు దాల్చి నే వనాళి కేగి

కడుతపం బొనర్చి కైవల్య మందెద, జీవితాశ నాకుఁ జెల్లెఁ జూవె. 238

చ. అరదములుఁ గజంబులు హయంబులు కాల్బరు లిష్టబాంధవుల్
దొరలును యోధులుం దెగియు దుర్గము వోయియు సర్వశూన్యమై
బరిబయ లైనయిప్పుడమిభార మదంతయు నీవ పూను మో
నరవర ! నీకుఁ దమ్ములక నామయ మయ్యెడు లెమ్ము పొమ్మికన్. 239

వ. అని పలికెడువానిపలుకు లాకర్ణించి యుధిష్ఠిరుండు వెండియు. 240

శా. ఆర్తాలాపము లిట్లు నీళ్ళగమిలో నల్లాడుచుఁ దైన్యవి
స్ఫూర్తిన్ బల్కెడునీదుపల్కు లివి యింపుం గూర్ప వర్తిత్రి
గర్తధ్వానము వోలెఁ జాలు నిఁక నీఁగం జాలుదే నీ విలా
భర్తృత్వంబున ధర్మవృత్తి గొన నే భావింప నోతమ్ముఁడా. 241

క. రాజులకుఁ బరిగ్రహమే, రాజధర్మంబు గా దరయ నీ విపుటల్
యోజన చెడి నేఁ గొనుటల్, రాజ్యనిపూట నిన్ను రాల్చియు గొందుఁ. 242

సీ. ఈశ్వరుండవు గాని యీ వెట్టు లీపృథ్వి, యీఁ దలంచితొ నాకు నిచ్చువాఁడ
వేని నాఁడు శమంబు నెంచి శ్రీకృష్ణుఁడు, యాచింప నిసుమంత యైనఁ గాని
యీనంటివే యిప్పు డిత్తు నం టిది యేమి, చిత్తవిభ్రమ మొకో చెప్పు మయ్య
పగతెత్తి రా నెట్టిపార్థివుండే నేఁ, నీ నుండునే మూఢుఁ డీవు తలఁప

తే. సూదిమొన మోపునంతటిచోఁటు నైన, వదల ననునీవు మీఁదికి వచ్చుకతన
నిట్లనుచునుంటి వెట్లైన నిపుడు బ్రదికి,పోవఁ జాలవు రా రమ్ము పోరుకొనఁగ. 243

క. నీవును నేనును ధరపై. జీవంబులతోడ నుంట చేకుఱె నేనిన్
మావిజయమందు సంశయ, మావిష్కృత మగును జూవె యఖిలప్రజకున్. 244

క. నీజీవిత మంతయు నా,చేఁ జిక్కిన దిపుడు నిన్ను జీవించెదున
ట్లేఁ జేయనెంతుఁ గానీ, రాజాధమ! నిను క్షమింప రా దరి వగుటన్. 245

తరువోజ. జతుగృహంబునఁ గాల్చి సర్పసంతతులఁ జాఁ గఱపించి విషంబు వెట్టించి
గతి దప్ప నీళ్లలం గట్టి త్రోయించి కపటంపుజూదంబు గల్పించి సిరులు
తెఱియు హరించి వంచించి నో నాడి చెఱఁ బట్టి సభ కీడ్చి చెట్టలు చేసి
సతము గాఱించినశత్రుండ నగుట సంతసింతురు నీదు చావున్న జనులు. 246

ఇందువదన. తప్పదెట్లైననిఁకుఁ దాఁకుదుముగానన్, చెప్పననురక్తినిఁ దేఱుకొనియుంచుఁ
విస్ఫుగలవీర్యమున వీరవిజయోక్తుల్, చొప్పడ వచించె యమసూతి దగుకీతిన్. 247

—గదాయుద్ధపర్వము —

వ. అని ధర్మనందనుం డుల్లసం బాడె నని పలికిన విని ధృతరాష్ట్రుండు సంజయుని
దిక్కు మోమై యి ట్లనియె. 248

చ. కొడుకు నిసర్గమన్యువునఁ గూడినవాఁ డతఁ డిట్లు పెట్టిదం
బడర వచించుచుండ నెటు లయ్యెనొ ము న్నపు డిట్టితగ్గనల్
గడుకొన నాలకించి యెఱుఁగండు నృపత్వమతిన్ జనైకమా
న్యుఁడు ఘనుఁడై ప్రవర్తిలుచు నుండెడువాఁడు శుభప్రసంగతిన్. 249

సీ. తలఁపనేఁ డాతపత్రచ్ఛాయ నర్కుండు, ఛాయనుం బలె నెప్డుఁ బాయకుండు
మ్లేచ్ఛాటవికు లాదిమేదినీశ్వరు లెల్లఁ, జీవింతురో వేని చెల్మివలన
సకలావనీనాథసంస్తూయమానమై, వెలయుచునుండునో వేని పేర్మి
నాయకమణి వోలె నేయెడ నెవ్వండు, తమ్ముకుఱ్ఱలలోనఁ దనరువాఁడొ

తే. యట్టిరాజాధిరాజు నాయాత్మజుండు, స్వజనబంధువిహీనుఁడై చనలు విఱిగి
పడ్డచోట నరుల్ ముట్టి పలుక నట్టు,లెట్టి ప్రత్యుత్తరం బిచ్చె నెఱుఁగఁ జెప్పుము.

వ. అనుటయు సంజయుం డతని కి ట్లనియె. 251

—దుర్యోధనుండు గదతో హ్రదంబునుండి వెడలి వచ్చుట—

చ. అనుజులతోడఁ గూడి శమనాత్మజుఁ డగ్గతి నిష్ఠురోక్తులం
బనివడిఁ బల్కుచుండ జలమధ్యగతుం డయి నీసుతుం డవె
ల్లను విని వాని కుత్తరములం బచరింపఁగ వెచ్చ నూర్పుచుం
దనకరముల్ విదిర్చుచు హ్రదంబుననుండి హ్రదంతరంబునన్. 252

వ. యుద్ధంబునం గృతనిశ్చయుండై యుధిష్ఠిరుం గూర్చి యి ట్లనియె. 253

ఉ. మీరు సమిత్రబంధుల రమేయపదాదిరథేభసైంధవ
స్ఫారబలప్రచారుల రపారశరాయుధసాధనోత్కరో
ద్ధారసమంచితౌజుల రుదారుల రే నొకరుండ నాయుధా
ధారము లేనివాఁడ విరథత్వము నొందినవాఁడఁ గావునన్. 254

క. మీ రందఱు నొక్కుమ్మడిఁ, బోరికి రా నేల నిలిచి పో రొనరింపం
గోరుదు నే యొక్కఁ డొకఁడుగఁ, బోరినఁ జూపుదును నాదుపోటరితనమున్. 255

ఆ. పలువు రొకని నఱుమఁ బాడియెఁ గా దేను, గత్తళంబు లేక కడు నలసియు
సొలసి యుంటిఁ గానఁ బలికితి నిటు గాక, మీరు వెఱచినట్టివారు లగుదె. 256

ఉ. ఏల వచింప జిష్ణుఁడును గృష్ణుఁడు నీవు వృకోదరుండు పాం
చాలురు మాద్రిబిడ్డలును సాత్యకియుం గలనీదుసైనికుల్
పోలఁగఁ గూడి వచ్చినను బోకడఁ బెట్టెద నొక్కరుండ నై
యాలములోన జంకు గులమందున లేదు నిజంబు చెప్పెదన్. 257

తే. సజ్జనులకీర్తి ధర్మము జాడ నడచుఁ, గావునం ధర్మమునఁ గీర్తి గడన సేయఁ
దలఁచి పల్కితి నిట్టు లోధర్మతనయ, చూడు మిపు డెట్లొనర్తునో కూడి మిమ్ము.

చ. ఋతువుల వత్సరంబు వలె నెల్లర మి మ్మెఘు డాక్రమించి దీ
ధితుల దివాకరుం డుడుల తేజు హరించినయట్లు మీాబల
ప్రతతుల నెల్ల ప్రేల్మిడిన పాయఁగఁ జేయుదుఁ జక్కనిల్వ మే
క్షితిపయి నుండి శస్త్రమును జేకొన కుండినవాఁడ నయ్యెదన్. 259

వ. న న్నిట్లు నిష్ఠురవాక్యంబుల నలయించిననిన్నును నీవారి నందఱను నే నిప్పుడ రూపడంచి నాకై కదనంబునం జెగినభీష్మ ద్రోణ కర్ణ శల్య బాహ్లీక సోమదత్త భగదత్త జయద్రథ శకుని భూరిశ్రవః ప్రభృతులఋణంబు గడముట్టం దీర్చెదం జూచుచుండు మని పలికి యూరకున్నంతఁ గొంతేయాగ్రజుండును. 260

ఉ. ఆడితి క్షత్రధర్మ మటు లంచు సుయోధన ! నీదుబుద్ధి యు
ద్ధేడిత మయ్యె శూరత వహించి యొకండవ యెల్లవారిఁ బో
రాడుదు నంటి ర మ్మొకని నాఁగి పెనంగుము లాఁతు లందఱున్
వేడుకఁ జూచుచుండెద రనిం గొను మిచ్చెద శస్త్ర మిచ్చగన్. 261

వ. మఱియు నొక్కమాట చెప్పెద నాకర్ణింపుము. 262

క. పోరిలో నెవ రే నొక్కని, నాలంబునఁ గూల్చి నట్టి దైతివ యేనిన్
నేలఁ గొని యేలు మాతఁడు, కూలిచినన్ స్వర్గ మందుకొనుము న రేంద్రా. 263

వ. అనుటయు సుయోధనుండు. 264

సీ. ఒకఁడ నాతోఁ బోర నుత్సహించినయేని, శూరునితో నాకుఁ బో రొసఁగుము
నీకు సమ్మతమేని నేను గుదెం గొందు, న ట్లన్యుఁడుఁ బదాతియై పెనంగ
నగు విచిత్రములు రథాయోధనము లెన్ని, యో చెల్లె నీగదాయుద్ధ మెన్న
నత్యద్భుతం బగునస్త్రపర్యాయము, యుద్ధపర్యాయము నొప్పమీాఱు

తే. నేఁడు నాగదతో నిన్ను నీసహోదరులను బాంచాలసృంజయాదులను సైని
కులను దెగటార్తు దేవేంద్రుఁ డలిగి వచ్చె, నేని చలియింప నింత యు మానవేంద్ర.

ఉ. గావున నే నొకండ కదనమ్మునకుం గదఁ బూని వచ్చెదం

చేవ నెదిర్చి పోరుకొనఁ జిత్తము సేయుము పూరుషుండ వై
నీవలనం ద్రినేత్రుఁ డని నిల్చిన నీబ్రతు కింక నుత్తమై
పోవు నటంచు ధర్మజుఁ డపూర్వవిధంబునఁ బల్కెఁ బల్కినన్. 266

సీ. హ్రదజలాంతర్గతుఁ డగు నీసుతుఁడు విని, బిలమహానాగమువలెను రోఁజి
కశలఁ దాటించినఁ గనలెడు నుత్తమ,తురగంబుతెఱఁగునఁ గెరలు గుడిచి
జాతరూపపరిష్కృతాతిభారసహంబు, నగుగదాదండము నంసపీఠి
నమరించుకొని స్తంభనము వాయ మడు వెల్లి, వడిఁ గలంచుచు నీరు వెడలి వచ్చి
తే. పట్టపవలింటిసూర్యునిపగిది వెలుఁగుచున్నపుడు వాని నచ్చట నున్నవారు
శృంగమునఁ బొల్చుభూధ్రముభంగి శూల,పాణి యగునంతకాంతకుపగిదిఁ గనిరి. 267

వ. అట్లు కాంచి పాంచాలురును బాండవులును హర్షోత్కర్షబునం జేసి చేతు లప్పళిం
చుటయు నప్పురుషాగ్రగణ్యుం డది యుపహాసం బని తలంచి కోపారుణితాక్షుండు
గుటిలభ్రూకుటియును దష్టదశనుండు నై యెల్లవారిం గలయఁ బరికించి యి ట్లని

—ధర్మజ దుర్యోధనుల సంభాషణము—

మ. అపహాసంబులకున్ ఫలం బిపుడ మీ రస్మద్గదాఘాతపా
తపరిత్యక్తశరీరులై జమునిచెంతం జేరి కైకొందు రం
చపు డెల్లర్పడ గోవృషంబుగతి నుగ్రారావ మేపార నా
ర్చి పరాక్రాంతి నెసంగె నంగమున నీ ర్నైత్రంతయుం బొత్తుగన్.
తే. రక్తధాతుపరీతపర్వతముభాతి, రుధిరపరిషిక్తగాత్రుఁడై ప్రథితశక్తి
నంసపీఠి గదాదండ మమర నార్చు,నతని నంతకుఁ డని యెంచి రచటివారు.

వ. అట్టియెడ బిట్టార్చుచు ధార్తరాష్ట్రాగ్రజుండు పాండవాగ్రజుం దిలకించి యి ట్లనె

చ. ఒకఁ డొకఁడే ననుం జెనక నొయ్యన రండు రణం బొనర్పఁగా
నొకరునితోడఁ బెక్కురకు నొప్పదు పోరిది ధర్మ మే నవ
ర్మకుఁడను శ్రాంతుఁడన్ జలభరప్లుతుఁడన్ క్షతవిగ్రహుండ ధా
ర్మికుఁడవు నీ వెఱుంగుదు వరిందమ యుక్త మయుక్తము న్మదిన్. 2

చ. అనుడు నజాతశత్రుఁ డను నయ్యారె నీదగుధర్మచింత కే
మన నభిమన్యు నొక్కని మహారథు లందఱుఁ జుట్టుముట్టి చం
పినయపు డెందుఁ బోయె నిరపేక్షము క్రూరము క్షత్రధర్మ మం
చనఁ దగుఁ గాక యున్న నటు లయ్యెడు నే నినుబోటు లుండఁగన్. 27

తే. అఖిలధర్మజ్ఞులును శూరు లైనమీరు, పదుగు రొక్కని హింసింపఁ బాడి గాదు

న్యాయమునఁ జేసి సంగ్రామ మాచరింతు, ననుచు సమయముచేసి యట్లగుని చేయ.
తే. సకలజనులును సంకటసమయమందుఁ, దప్పుచుందురు ధర్మశాస్త్రం బదెల్లఁ
బదమునం దుండునప్పు డెప్పటికిఁ గాని, చావ మని పరంబును గానఁ బోవ రకట.
ఉ. మాటకు నిట్లు చెప్పితిని మాదృశు లెప్పుడు ధర్మసంగతిన్
దాఁటరు కత్తళం బిదిగొఁ దాల్పుము సల్పుము కేశపాంశవుం
బోటున కేది యిష్ట మది పొందు మొసంగెద సాధనంబు నీ
వేటికి సంశయింతు వని కెత్తుము మొత్తుము శత్రుసంతతిన్. 275
క. ఏవురము మేము పాండు,త్మోనరపుత్రులము గలము మాయం దొకనిన్
నీవలసినట్టివానిని, జేవమెయిన్ గెలిచికొనుము క్షితితల మెల్లన్. 276
సీ. బ్రదు కొకం డది తక్క నీబవరమందుఁ, గోరుకొను మెద్దియే నిత్తుఁ గొసరకనుడుఁ
గవచమును శిరస్త్రాణముఁ గైకొని గద,ద్రిప్పుచును వాని కి ట్లని చెప్పఁ దొడఁగె.
ఓయుధిష్ఠిర ! నేను మీయన్నదమ్ముల,లో నేరితోఁ బోర నౌనో చెపుమ
సహదేవుఁడో సవ్యసాచియో భీముఁడో, నకులుఁడో నీవో నన్ దాఁకువారు
గదాదండమునన్ మిమ్ము నిర్జించి, మించినపగ యడఁగించుకొందు
నేన పల్కఁగ రాదు గాని నా, కుద్ది యెవ్వఁడు గదాయుద్ధమందు
ర్యమున మీరు పోరిన నపజయంబు, నందెదరు నాదుమాట సత్యంబొ కాదొ
ం నయ్యెడు నిప్డు నన్ గలన నోర్చు,వేటి గదఁ గొని రా నొప్పునేటి కొదుగ.
శౌర్యధుర్యం డగుదుర్యోధనుండు మాటిమాటికిం గర్జించి పలుకుచుండ వాసు
ండు క్రుద్ధుండై యతండు వినకుండ ధర్మరాజుం బిలిచి యి ట్లనియె. 279

—శ్రీకృష్ణుండు ధర్మజునితోఁ బ్రసంగించుట—

లుఁ బురే ! నరేశ్వర! ప్రశంసకు నెక్కఁగఁ బల్కినట్టిదై
ములోన మ మ్మొకని నాఁగితి వేని సమస్తభూతలం
ఁగ నిత్తు నంటి విది యేటివివేకమొ నిన్నుఁ గాని కై
వాలనికట్టిఁ గాని కవవారల నేనియుఁ గాని పిల్చెడిన్. 280
పిలిచిన నేమి యయ్యెడిని వీరిడి వైతివి యేటిసాహసం
బాలికితి నీకృపారస మయో గుదెపోరుల మీరు వాని కే
కాలఁదికి రా రయఃపురుషుఁ గూడి యితండు త్రయోదశాబ్దముల్
కలన వృకోదరుం గెలువఁ గా గద నేర్పరి యయ్యె వింటివే. 281
చ. వృకోదరుఁడు తక్కఁ దక్కువీరుఁ డొక్కఁ డెన్వం డిం

తఱిఁ గదారణంబునందు ధార్తరాష్ట్రు నోర్చుశ
క్తి గల్గి యుంట వింటి మోటు కేవలంబు శక్తిమై
వృకోదరుం డెసంగు నేర్చి పేర్చి యీతఁ డొప్పెడున్. 282

క. నేరుపు బల మను రెంట, న్నేరుపె తలమీఱుఁ గాన నేర్పరి యగు నీ
వీరుని మారుతి మార్కొని, పోరంగా నోపఁ డనెడిబుద్ధియుఁ బొడమున్. 283

తరువోజ. తొలి నీకు సుబలపుత్రునకు జూదంబు, దొడరినట్లు వీనితో విషమాగ్ర
మలయింపఁ దెచ్చితి వయ్య! దాయాది, నలరించుమార్గము నట్టె చేఁబట్టి
తిల నీదు ప్రజలకు నెప్పటికష్ట, మెఱయింపఁ జేసితి వేమందు నిన్నుఁ
గలన నెల్లర గెల్చి కలఁ డొక్కఁ డతని, కతనఁ గోల్పోవుట గలిగె రాజ్యంబు. 284

మ. గద దుర్యోధనుతోడఁ బోరుకొన లోకంబందు లేఁ డెవ్వడుం
ద్రిదశుండే సమరుండు నే నతనికిం డీలు న్నిజం బీవునుం
ద్రిదశేశాత్మజముఖ్యులుం దగరు వీనిం దాఁక వాతాత్మజుం
డెద సందేహము నొందఁ జేసెడిని నీ కీసాహసం బొప్పునే. 285

క. నీయీవరదానం బన్యాయం బిద్దానఁ బాండునందనులు మహిన్
శ్రీ యుడిగి భైక్ష్యవృత్తికి, నై యడవుల నిడుమ గుడువ నగు విధివ్రాఁతన్. 286

వ. అనిన భీమసేనుండు విష్వక్సేనుం గని యి ట్లనియె. 287

చ. వలదు విషాద మే నిపుడ వైరము నంతయుఁ బుచ్చి వైచెదన్
జలమున ధార్తరాష్ట్రు ననిఁ జంపెద నింపెద సంతసంబు మీ
కిల విజయంబు ధర్మజున కింతటిలోనన చూడ నయ్యెడిన్
దెలియ గుణాధికం బగుమదీయగదం బురుడించునే గదల్. 288

తే. అచ్యుతా! నే గదాయుద్ధమందు మందు,ధార్తరాష్ట్రాగ్రజుం దాకఁ దలఁతు మీరు
వేడుకం జూచుచుండుఁడు మూఁడుజగము, లెత్తి వచ్చిన సురలతో నిపుడ కూల్తు.

—శ్రీకృష్ణుండు భీమసేనుని దుర్యోధనునితో గదాయుద్ధంబునకుఁ బుచ్చుట—

క. అలఁతి యగునీసుయోధనుఁ, బలుకంగా నేల యనుడు వసుదేవసుతుం
డలరి బకారి న్మెచ్చుచుఁ, బలికె న్వీ పప్పళించి బరవస మెసఁగన్. 290

మ. బకవిధ్వంసక! నే నెఱుంగుదును నీప్రాగల్భ్య మెల్లన్ భవ
త్కకుబంతావృతబాహుసార యశముం గైకొంచుఁ గాదే లయాం
తకసూనుండు హతాభియాతి యగుచుం దళ్కొత్తి ధాత్రి న్మహో
త్సుకతన్ రాజ్యసుఖవిభూతిఁ బడయం జూపట్టి యుండెం బుమీ. 291

మ. తలఁపం జాలదె లోక మీరణమునన్ దర్పంబునం ధార్తరా
ష్ట్రుల నెల్లం గడతేర్చి పేర్చినబలస్తోమంబుతోడం గళిం
గుల గాంధారుల మాగధాదులను గర్గో ల్వట్ట గిట్టించి నీ
బలుపుం జూపితి వెల్లవారలకు నీబాహాబలం బల్పమే. 292

శా. సాంద్రావక్రపరాక్రమక్రముఁడ వోసామీరి! వేమాఱు భూ
మీంద్రుల్మే లని మెచ్చుమచ్చునను నీ వీధార్తరాష్ట్రాగ్రజున్
దంద్రం బెందక ముందుఁ జేసి ప్రతినం దర్కించి మీయన్న కు
ర్వీంద్రత్వం బిడు మయ్యుపేంద్రుఁడు సుపర్వేంద్రుం బలెం గొల్చుచున్. 293

క. కృతి గాన సుయోధనునిన్, జతనించి ప్రతిజ్ఞ నెంచి నక్కులు విఱుఁగన్
మృతి నొందఁ జేయు మాతఁడు, ప్రతి యగుచు న్నేఁడు చెడినవాఁ డగు నీకున్.

క. అని పురికొల్పిన సాత్యకి,యును వాని న్మెచ్చె సృంజయులుఁ బాండవులున్
గొనియాడి రంత మారుతి,యును నగ్రజుఁ గాంచి పలికె నుత్సుకుఁ డగుచున్. 295

సీ. అనఘ! నే నీసుయోధనునితో నని నేయ, నుత్సహించుచునుంటి నుల్లమందుఁ
బురుషాధముఁడు వీఁడు దురమున నను నోర్వ, నోపఁడు నాలోన నున్నకోప
మంతయు ఖాండవమం దర్జునుం డగ్ని,సం బోలె వీనిపై నిగుడఁ జేసి
నాగదాదండమునం బిండిపెట్టి నీ, హృదయశల్యము పుచ్చి ముద మొనర్తు

తే. మత్సమర్పిత మగుకీర్తిమాలఁ దాల్చి, యెడఁద సుఖయింపుమీ ఖలుం డిపుడ వీఁడు
ప్రాణములతోడ సిరియు రాజ్యంబుఁ జీకు,రాజు వగలొందు శకునికర్మంబు దలఁచి.

వ. అని పలికి గదాదండమండితకరుండై లేచి సుత్రాముండు వృత్రుం బోలె నీపుత్రుఁ
బోరికిం జీరుటయు నతం డయ్యాహ్వానంబున కలుకం జేసి మత్తమాతంగంబు
మాడ్కి మార్కొనం దలంచె నంత శృంగవంతం బగుకైలాసశైలంబుబోలె నేకాకి
యయ్యు భయసంభ్రమంబు లెఱుంగక వీఁకంజూప నున్నసుయోధనునిం జూచి
పాండుసూనులు సంతసించుచుండ భీమసేనుండు వానిదిక్కు మొగం బై పేరెలుం
గున నిట్లనె. 297

క. నీవును నీతండ్రియు మా,పై వేరము చేసి చేయుపాపము లెల్లన్
భావించుకొనుము దుర్మతి, యీవేళకు నైన మదికి నేర్పడు నేమో. 298

తే. జతుగృహంబునఁ గాల్పించి సాధ్వి యైన, ద్రోవతినిఁ బట్టి సభ కీడ్చి దోసఁగుగూర్చి
శకునికైతవమున జూద మకట పన్ని, మాకుఁ జేసినకీడులు మఱవ నగునె. 299

తరళము. నిరపరాధుల మైనమా కిటు నీవొనర్చినయోగ్గు లీ

వరుస నన్నియుఁ జేరి చేరఁగ వచ్చెడిఁ ఫలరూపమై
కురుకులాధమ! నీకతంబునఁ గూలె నమ్మలసెజ్జపైఁ
గురుపితామహునంతవాఁడును ఘోరజన్యముఖమ్మునన్. 300

తే. మఱియు ద్రోణుఁడు కర్ణుండు మద్రవిభుఁడు, వైరమున కాదికర్త సౌబలుఁడు నీదు
భ్రాతలును బుత్రపౌత్రులుఁ బ్రాతికామి, రాజులును సైనికులు ద్రెళ్ళి రాజిలోన. 301

ఉ. నీ వొకరుండ వింతకును నిల్చితి వోరి కులఘ్న! నిన్ను నీ
భూవలయాభికాంక్షయును భూరితరం బగునీదుదర్పముఁ
బోవఁగఁ జేసి మాయెడలఁ బ్రోఁగులు వెట్టినదుష్కృతంబులో
నీవపు వగ్ని కౌనటులు నే నిదె చేసెద నాగదాహతిన్. 302

చ. అనవుడు నీకుమారుఁ డను నౌర ప్రశంసకు వత్తు విల్లు నీ
ఘుతనను నీవ మెచ్చుకొనఁ గల్గితి దీనఁ బ్రయోజనంబు లే
దనిమొన నిల్చి పోరుకొనుఁ మప్పటి కేఁ గనుగొంటు నీదుశ
క్తిని గిరిశృంగ మట్టిగదఁ గేల వహించిననన్నుఁ జూడవో. 303

చ. గదఁ గొని పోరుచున్న ననుఁ గన్గొనఁ జాలి పురందరుండు నే
విదితుఁడు గాఁడు నీ వనఁగ వేఁడవు వెంబరవిత్త! రిత్త శా
రదఘనమో యన న్మొఱయ రాకుము వీఁకయు కల్గెనేని రా
కదన మొనర్పు మెంతమొనగాఁడవొ కందురు గాత మిందఱున్. 304

తే. అనుచు బీరము లాడునాతనికి నుబ్బు, వొడమఁ బొగడిరి తలశబ్దముల మదేభ
మును బలెన్ హర్షమునఁ దేల్చుచునుగడంకఁ, బాండవులును బాంచాలురుబలిసికవిసి.

తే. అపుడు పాండవులకు విజయమ్ము దెలుపు, నట్లు గజబృంహితమ్ములు నశ్వహేషి
తమ్ములుం దలశబ్దముల్ తవిలి పర్వె, శస్త్రసందీపనమ్మును జదలు ముట్టె. 306

—బలరాముఁడు భీమదుర్యోధనులగదాయుద్ధంబుఁ జూడవచ్చుట—

వ. అట్లాం ఘోరం బలుకుకొని గదాయుద్ధవిశారదు లగువా రిద్దఱుం దలపడ నున్న యప్పు డెల్లరు నెడగలుగం గూరుచుండి చూచుచుండి రయ్యవసరంబున నది యంతయుం దెలిసి బలరాముండు భీమసేనదుర్యోధనులు తనశిష్యులు గావున వారియుద్ధంబుచూడ వేడుకం జేసి యచ్చోటికి వచ్చుటయుం జూచివాసుదేవసహితు లగునందఱుం బ్రత్యుత్థానాభివందనాదు లొనరించి పూజించి రంతఁ గౌంతేయాగ్రజుండు కృష్ణాగ్రజుం బరిరంభణంబున నాదరించి స్వాగతంబు వలికె వాసుదేవార్జును లభివందనంబు గావించిరి మాద్రేయులుం ద్రౌపదేయులును దండప్రణామంబు లొనరిం

చిరి సాత్యకియుం బ్రణమిల్లె గదాపాణు లగుభీమసేనదుర్యోధనులుం గేల్మోగిచి రప్ప డప్పరుషోత్తముం డెల్లవారి నాదరించి ధర్మరాజుం గ్రుచ్చి కౌఁగిలించుకొని వాసుదేవార్జునులు నాలింగనంబు చేసి తక్కినవారి సాదరావలోకనంబుల మన్నించి యెల్లవారికుశలం బడిగి వారిమధ్యంబున నక్షత్రగణపరివృతుం డగుమృగలాంఛనుని చందంబునం బొందుపడి విశ్రమించి పాండవసహితుం డగుకృష్ణుం గాంచి నేను దీర్ఘయాత్రాచణశీలుండనై పోయి నేఁటి కిరువదియాఱునాళు లయ్యె నేఁడు శిష్యులగదాయుద్ధవృత్తాంతంబు విని చూడ వచ్చితి ననిన యుధిష్ఠిరుఁడు దేవా! నీశిష్యులగదాయుద్ధం బెంతయు వింతగొలుపుం గాని చూడు మనియె నని సంజయుండు ధృతరాష్ట్రునకుం జెప్పె నని చెప్పుటయును. 307

ఆశ్వాసాంతము.

మ ఇది విహితంబు కృత్య మన హీ యను వారును వేదశాస్త్రముల్
పొదలవు పొల్లమాట లనఁ బోయెడువారును జూచుచుండఁ గాఁ
జమరుల మోసగించి కొనఁ జాలినవారును దల్లి పిల్ల నా
కొదవినకాంతలం దడవ నుండినవారును గల్గి రక్కటా. 308

క. మనుగడ కష్టం బయ్యెఁగా, మనుజేంద్రులు స్వార్థపరులు మత్సరయుక్తుల్
కనుఁగాన రిట్టిపట్టున, నను నీకడఁ జేర్చుకొనుము ననువున నీశా. 309

గద్యము.

ఇది శ్రీమదఘునాశనోభయకవిమిత్ర వేంకటయజ్వాగ్రపుత్త్ర
సమారాధితవిబుధరాజ శ్రీపాదకృష్ణమూర్తికవిరాజ
ప్రణీతంబయిన శ్రీకృష్ణభారతంబునఁ శల్య
పర్వంబున ద్వితీయాశ్వాసము.
శ్రీ. శ్రీ. శ్రీ.





బాలాత్రిపురసుందర్యై నమః

# శ్రీకృష్ణభారతము.

## శల్యపర్వము-తృతీయాశ్వాసము.

గలవారని విద్యా
యోగము గలవారు వారియుడుగర లందం
గాఁ గోర్కె సేత హీనము
గాఁ గని నిన్నుఁ భజింతుఁ గరుణావార్ధీ. 1

వ. అక్కథకుండు శౌనకాదిమహామునుల కిట్లనియె నట్లు చెప్పిన విని జనమేజయుండు
వైశంపాయనుం గాంచి యిట్లనియె. 2

మ. కలహోద్యోగమునందు రాముఁడు బలాంగంబుల్ సమావేశ మై
మెలఁగం జొచ్చిననాఁడు తా నిరుగడ న్మిత్రత్వబంధుత్వముల్
కల వౌటన్ రణమందు నేపెడకు మ్రొగ్గం జిత్తముం జేయ క
గ్గలికం గృష్ణునితోడఁ జెప్పి చనె నాఁగ న్వింటి మాలాగునన్. 3

తే అతనియాత్రాక్రమంబు ప్రత్యాగమనవి, ధమ్మ భీమదుర్యోధనుల్ తవిలి గదలఁ
బోరినప్రకారమును నానుపూర్వికముగ, నెఱుఁగఁ జెప్పుము నా నతం డిట్టు లనియె.

సీ. పాండునందను లుపప్లావ్యంబునం దుండి, వనజోదరుని సంధి కనుచుటయును
బొత్తు పొసంగమిఁ బురుషోత్తముఁడు వచ్చి, సర్వ మెఱింగించి సమరయాత్ర
ప్రకటించుటయు మున్ను పలికితిఁ దెలియంగ, బలములఁ గూర్చునప్పటునందు
బలభద్రుఁ డనుజన్ముఁ బరికించి ధార్తరాష్ట్రులకును సాయంబు సలుపుఁబొప్ప

తే. ననిన దానికి సమ్మతింపనిముగారి, కలిగి బలుఁ డేగె దీర్థయాత్రలు పొనర్ప
భోజుఁడు సుయోధనునిఁ జేరఁ బోయెఁ గృష్ణ, సాత్యకులుపాండవేయులసరసఁజనిరి.

వ. అట్లు రౌహిణేయుండు పుష్యయోగంబున ద్వారకానగరంబున సర్వసంభారంబులు
సర్వోపకరణంబులును సమకూర్చుకొని సువర్ణ రజత రత్న కుంజర ధేను రథోష్ట్రి
వాహన వస్త్ర సముదాయంబుతో వెన్నంటి రా భృత్యుల నియోగించి శ్రౌతా
గ్నులం దేర యాజకులకుం జెప్పి ఋత్విజులును ద్విజోత్తములును సుహృద్వాసలు
నుం బరివేష్టింపఁ బయనం బయి పథిశ్రాంతులకు బాలురకును వృద్ధులకును వాహ

నంబు లొసంగి సపరివారుం డై తరలి పోవుచు సరస్వతీతీర్థంబుల నందు నందు బ్రాహ్మణోత్తములకు గోభూహిరణ్యాదిదానంబు లొసంగి యెల్లవారల నిష్టాన్న పానీయంబులం దనుపుచు సర్వలోకసుఖావహంబుగఁ దీర్థయాత్రం గావించుచుఁ గ్రమక్రమప్రయాణంబులఁ గురుక్షేత్రంబునకుం జనుదెంచె ననిన జనమేజయుండు సారస్వతతీర్థంబు లెవ్వి యెవ్వి యె ట్లెట్లు సేవించె వివరించి చెప్పు మనిన వైశంపాయనుం డాకర్ణింపు మాసంకర్షణుండు మునుమున్న సరస్వతీసముద్రసంగమస్థానం బైన ప్రభాసతీర్థంబున కరిగి యందుఁ గృతావగాహనుం డై యనేకదానంబు లాచరించె నాకర్ణింపుము. 6

—బలరాముని తీర్థయాత్రాప్రకారాభివర్ణనము—

తే. తొల్లి చంద్రుఁడు క్షయరోగదూషితుఁ డయి, యా ప్రభాసమునం దీర్థమాడియఱువుఁ
దెవ్వు లరుగఁ దొంటియట్టులు తేజరిల్లి, జగము భాసిల్లఁ జేసె విశాపుఁ డగుచు. 7

చ. అన జనమేజయుం డను మహాత్మ! హిమాంశుని కట్లు యక్ష్మ రాఁ
బని యేది మజ్జనం బొనరుపం గత మెయ్యది యెట్లు మజ్జనం
బొనరిచెఁ దత్ప్రభావమున నున్నతరోగము నెట్లు వాసె నే
విన మది చేసితిం దెలుపవే యన నాతని కాతఁ డిట్లనున్. 8

ఉ. దక్షుఁడు తొల్లి చంద్రున కుదాతర నిచ్చి పొనర్చెఁ బెండిలిన్
ఋక్షసమాఖ్య నొప్పెసఁగు నిర్వది యేడ్వురఁ గన్నకన్నెలన్
లక్షణలక్షితాంగు లయి నల్వగువారల నొంది యుండుఁ డం
దక్షయ మైనప్రీతి గలఁ డై యిడె రోహిణియందు డెందమున్. 9

మత్త. తక్కునిర్వదియార్వు రగ్గతిఁ దమ్ముఁ జూడక యున్నయ
చ్చక్కరాయని కల్గి కల్గినశోకపాకము పెంపునం
బొక్కుచుం జని తండ్రి కంతయుఁ బూస గ్రుచ్చినమచ్చునన్
నొక్కి చెప్పి వచించి రిట్లని నుచ్చిళుల్ గడుఁ హెచ్చఁగన్. 10

క. పతి యొల్లనిజీవన మవి, సతికిన్ నిష్ఫలము గానఁ జంద్రుని విడి మే
మతినిష్ఠ నిరశనవ్రత, మతుకం దపియింతు మింద మై నీకరుణన్. 11

తే. అని నివేదింప నాదక్షుఁ డాగ్రహమునఁ, బిలిచి జాబిల్లి నీ వెల్లవెలఁదులందు
సమత వర్తింపు మట్లుగా సలుపవేని ,నిను స్పృశింప వచ్చు నధర్మ మనుచుఁ జెప్పి.

వ. కొమరితలం గని శశాంకుండు నాశాసనంబునం జేసి మిమ్మందఱ నొక్కచందంబున
జూచు మీరీతని శోకం బొం డని యుంపి పుచ్చుటయు నయ్యుడుపుండు మామ సెప్పి

నట్లు సేయ కెప్పటియ ట్లున్న వారు మరలఁ దండ్రిపాలికిం జనుదెంచి రోహిణీ ప్రియుండు నీమాట నిరాకరించె మే మింక నందుఁ బో నెల్ల మనిన నతండు మఱియు జామాతం బిలిచి నీవు నీనెలంతల నెల్ల నొక్కరూప గాఁ జూడకున్న శపించి పుత్తునని పుత్త్రికల వానితో నంపిపుచ్చె నతం డెప్పటియట్లు రోహిణీసక్తచిత్తుం డై యుండె నశ్విన్యాదు లందఱు కలిగి మగిడి జనకునికడకుం జని విన్నవించుటయు నతండును. 13

శా. ప్రాంచత్క్రోధభరంబున న్విధునిపై నారాజయక్ష్మం బ్రయో
గించె న్వాఁడుసుతం దదామయమునన్ క్షీణించి తచ్ఛాంతికై
కిం చాతం డధికేష్టులం జలిపియుం గించిత్ఫలం బేనియుం
గాంచం జాలక నాఁడునాఁటఁ గృశుఁడై కన్పట్టె నప్పట్టునన్. 14

క. అఱుఁదెవులున నబ్జుం డత్తఱిఁగునఁ దఱుగుటయు నోషధీతతి యెల్లం
దఱిఁగె న్నీరసమై తినఁ, దొఱయక ప్రజయును క్షయించెఁ దోరము గాఁగన్. 15

తరువోజ. అంత వేలుపు లెల్ల నబ్జునికడకు నరుదెంచి నీరూప మలఁతి యై పోవు
నంతకంత కి దేమి యన నాతఁ డిట్టు లనియె దక్షునిశాప మది నాకృశత్వ
మంతకుఁ గారణం బయ్యె నా నెల్ల రా ప్రజాపతిచెంత కరిగి మహాత్మ!
శాంతించి శశి కైనశాపంబు వాపు మన్నఁ గించె నతండు స్వప్రశిష్టుండు. 16

చ. అతఁడు క్షయింప నోషధు లవన్ని క్షయించుఁ బ్రజాక్షయంబు నొ
క్కతిఁ బ్రజ లేనిమాయునికిఁ గ్రియఫల మెయ్యది లోక మెద్ది నీ
మతి నిది యంతయుం దెలిసి మాఁదెసఁ గూర్మి పొసంగ యామినీ
పతిఁ గరుణింపవే యనుచుఁ బ్రార్థనముం బచరించి రంతయున్. 17

వ. ఇట్లు ప్రార్థించినఁ బ్రజాపతియును. 18

ఉ. నావచనం బమోఘ మది నాకును మీకును గ్రమ్మఱింపఁ గాఁ
బోవ దుపాయ మొం డొకఁడు పోహణ చేసి వచింతు నింక నీ
రేవెలుఁ గెల్లపత్నుల వరించి సమప్రియతం జరింపఁ గా
భావ మొసంగినం తపిదపం బొనరించెదు చొప్పు చెప్పెదన్. 19

సీ. అమరుఁ బశ్చిమసముద్రమున సరస్వతీనది సంగమించినపదమునందు
సదమలతీర్థరాజము ప్రభాసము నాఁగ, నందు జలంబాడి చందురుండు
దేవదేవుని మహాదేవు నారాధించి, మరల నెప్పటియట్లు మనఁ గలఁడు
ప్రతిమాసమును బూర్వపక్షమునన్ వృద్ధి,నపరపక్షమున క్షయంబు నొందు

తే. అనిన దేవళ్లు చంద్రున కది వచించి, యతనితోడ సరస్వతి కనుగమించి
రిందుఁ డత్తీర్థరాజమునం దమాన, నాడి శీతాంశుఁ డైలోక మరలఁ జేసె. 20

వ. జేజేలును జాబిల్లిం తోడ్కొని వచ్చి దక్షునకు నివేదించుటయు నతండు సంతసించుచు నెల్లవారి నామంత్రణంబు చేసి యల్లునిఁ బిలిచి యి ట్లనియె. 21

తే. వత్స నీ వెప్డు విప్రులవలనఁ గాని, వారి జాతులవలనఁ గానీ రవంత
యేని యవమతిఁ దలఁపకు మింక నునికి, కరిగి నాశాసనంబున నలరవయ్య. 22

వ. అనిన నతం డమ్మహాత్ము నామంత్రణంబు చేసి నిజనివాసంబునకు నిర్గమించె నోషధులు నెప్పటియట్ల యొప్పె న ట్లత్తీర్థంబు ప్రభాసంబు గలిగించుటం జేసి ప్రభాసంబు నా భాసిల్లె నప్పటినుండి చందురుం డెప్పుడు నమావాస్యలయం దాప్రభాసంబున నాడి భాసమానుం డగుచుండు నిది ప్రభాసతీర్థప్రభావం బనంతరం బారోహిణీనందనుం డం దుండి చమసోద్భేదంబున కరిగి యత్తీర్థంబునఁ గృతస్నానుండై విశిష్టదానంబు లొనరించి యొక్కరే యక్కడ నివసించి యంతం గదలి యుదపానతీర్థంబునకు స్వస్త్యయనపూర్వకంబుగం జని స్నానదానాదికం బాచరించె నాకర్ణింపుము.

తే. అచటి నేలయు నోషధు లధికమస్నిగ్ధము లయి యుండుట నష్టమై పోవు నాస
రస్వతిని గాంత్రు సిద్ధు లాప్రాంత మెల్లఁ, దెలియ నత్యంతఫలద మై వెలయుచుండు.

క. త్రితుఁ డను బ్రాహ్మణుఁ డొకఁ డా, క్షితి నూతం ద్రోయఁ బడియు సెపియించి రుషామతి వంచకు లగునన్నల, నతిభక్తిగ సోమపాన మం దొనరించెన్. 25

వ. అనిన జనమేజయుం డాతీర్థం బుదపానం బెట్లయ్యెఁ ద్రితుం డేటి కన్నలచే నూతం ద్రోయఁ బడియె నతనిసోమపానప్రకారం బెట్టిది చెప్పు మనిన వైశంపాయనుండు. 26

తే. గౌతముఁ డనునొక్కముని కేకతుఁడు ద్వితుఁడు, త్రితుఁడు నా ముగ్వురొప్పిరి సుతులు వారు
బ్రహ్మవాదులును దపస్విపర్యు లార్యులును బ్రజావంతులును దొంటిదినములందు.

ఉ. వారి లోనఁ దృప్తులు జలకు వారితపోనియమవ్రతాదిన
త్కారవిధానసంగతికి గౌతముఁ డెంతయు సంతసించుచుణ
దూరము కాల మేగ ముని నుగ్గగు మేను దొఱంగి స్వర్గముం
జేరుడు వాని యాజ్యు లయి చెన్నలరా రెమరాజు లందఱుణ. 28

ఆ. అతనియందుఁ బోలె నతనిసుతులయందు, భక్తి చేసి రందుఁ బ్రస్తుతింప
నయ్యెఁ ద్రితుఁడు తపమునందు నధ్యయనంబునందు యాజకత్వమందుఁ బ్రబలి. 29

చ. యతులును రాజు లా త్రితుని నాదలఁ గొంచు భజించు చుండి రే
కతుఁడు ద్వితుండు నంత నొకకాలమునందు మఘుం బొనర్పఁ గా

మతిఁ దలపోసి తద్ధనసమార్జకులై త్రితుతోడఁ బోయి భూ
పతులను వేఁడి యాజకత పర్వఁగఁ దెచ్చిరి గోసమూహమున్. 30

వ. ఇట్లు యాజ్యు లయినరాజులకడఁ దమయాజకత్వంబునఁ బశుప్రతిగ్రహణంబుచేసి.

సీ. పెద్దమొత్తం బయి పెఱిఁగినయప్పసి, మందముందఱఁ ద్రితుం బొందుపఱచి
యేకతద్వితులు వెన్నలి తూరుపుదిక్కు,గాఁ దోలుకొనివచ్చుకాలమందుఁ
ద్రితుఁ డధ్వరములందుఁ గృతి యొన్నఁడే నిట్టి, గోవుల నార్జించుకొనఁ గలండు
వీఁడు లేకుండినవేళ నిన్నింటిని, మన మొందఁ జాలనిమాట నిజము

తే. గాన వీనిని వంచించి గోనివహము,మనము గొనిపోద మని తమ మదిఁ దలంచి
వారు పోవుచు నుండ నాదారి నెదురు, పడియె వృక మొంటు మెండగుభయముదోప.

తే. త్రితుఁడు వృకదర్శనమున భీతిల్లి తొలఁగి, పోవుచు సరస్వతీతీరభూమిఁ దృణల
తావృతం బగునొకకూపమందుఁ గూలి, దశదశలు మ్రోయ నార్తనాదం బొనర్చె.

మ. అతిఘోరమ్ము నగాధమున్ భయద మానానూతిలోఁ గూలి దీ
నత ఘోషించెడు తమ్మునిం దెలిసి యన్న ల్వానితె న్నారయన్
మతి గావింపక పాసి పోయిరి వెస న్మన్నించి సాలావృక
ప్రతిపన్నోన్నతభీతి లోభమును గప్పం గోతతిం దర్మచున్. 34

వ. త్రితుండును దృణలతావృతంబును బాంసుసహితంబును నిర్జలంబు నగునయ్యుదపా
నంబునం బడి నరకంబునం బడిన దుష్కృతునింబోలెఁ దన్నుం దలంచుకొనుచు
సోమపానంబు సేయక తా నచ్చోఁ జావఁ గివచ్చె నని వెచ్చనూర్చుచు. 35

సీ. ఒకచోట వ్రేలుచునున్నతీవను గాంచి, దానిని సోమలతగఁ దలంచి
కల్పించి ఱాల శర్కరలుగాఁ దలఁచునం,తన జలాగ్నుల నందుఁ దనరఁ జేసి
జల మాజ్యముగ నల్పి నవసంకల్పము, గావించి తా హోత గా నెసంగి
మది ఋగ్యజుస్సామమంత్రముల్ చింతించి, బర్హిర్ముఖుల కాజ్య భాగము లిడి

తే. సల్పి సోమాభిషవము తుములనినాద, మాచరించుటయును దాని నాలకించి
త్రిదివమునయందు గీష్పతి దేవసమితి, నెల్ల నాహ్వాన మొనరించి యిట్టు లనియె.

చ. త్రితుఁ డనువాఁడు నేఁడు జగతిం బొనరించుచునుండె జన్న మా
క్రతువున కెల్లవేల్పులును గ్రన్ననఁ బోవుట లొప్పుఁ గాని చో
నతఁ డలుకన్ సృజింపఁ గలఁ డన్యుల వేల్పుల నాఁగ నెల్లరున్
క్షితిపయి కేగి కాంచిరి యజించెడు దీక్షితు నూఁతిలోపలన్. 37

వ. కాంచి వాని నాహ్వానించి. 38

తే. అమరులము మేము యజ్ఞభాగార్థ మరుగు,దెంచినారము నావుడుఁ దెలిసి త్రితుఁడు
తనదుకూపస్థితిం జెప్పి తగ నొసంగె, వారికి స్మంత్రయుతహవిర్భాగములను. 39

వ. ఇంద్రాదిబృందారకబృందంబు పరమానందంబునం బొంది మునీంద్రా వరంబు లర్థింపు మనిన నతండు నన్నీకూపంబునుండి వెలువరించుటయు నిందలిజలంబు లాచమించు వారికి సోమపులగతి లభించు నట్లు ననుగ్రహింపుఁ డనుచున్నంత సరస్వతీనది తరంగంబులతో నయ్యుదపానంబునుండి యుప్పొంగి త్రితునిం దెచ్చి భూభాగంబునం బెట్టె నట్టియెడ నమృతాంధసులు వానికోరినవరంబు ననుగ్రహించి యథాగతకృత గమను లయి రనంతరంబ త్రితుండునుం గృతకృత్యుండై నిజనివాసంబునకుం జని పశులోభంబునం ద న్నట్లు చేసిననిజభ్రాతలం గని మీరు మీకృత్యంబునం జేసి సాలావృకంబు లగుదు రనియు మీకు గోలాంగూలఋక్షవానరులు జన్మింతు రనియు నమర్షంబున శాపం బొసంగె నాసత్యవచనంబున వారాక్షణంబున నదృశ్యాకారులై రిది యుదపానతీర్థమహాత్వం బాతీర్థంబున హలాయుధుండు స్నానసంధ్యాద్యను ష్ఠానంబులు ననేకదానంబు లొనరించి యటనుండి వినశనంబునకుం జనియె. 40

క. అందు సరస్వతి శూద్రులయం దాభీరకులయందు నలిగి ప్రణష్టిం
బొందుట వినశన మనుపే, రందెం దీర్థంబు సార్థకాభిఖ్యమెయిన్. 41

వ. రోహిణీనందనుం డందు జలోపస్పర్శనంబుచేసి సుభూమికంబునకుంజనియె నదియును.

తే. అప్సరోగణములకు విహారభూమి, యై సుభూమికాభిఖ్యఁ బెంపలరె నటకు
దేవగంధర్వు లరుదెంచి దివ్యపుష్పములను గ్రీడింత్రు ప్రతిమాన మెలమి గలిగి. 43

వ. బలరాముం డాతీర్థంబున దేవగంధర్వాదుల దివ్యవాదిత్రనిస్వనం బాకర్ణించియు వారిక్రీడలం గనియు విస్మితుండై స్నానదానాదులంజేసి విశ్వావసుప్రముఖగంధర్వాత పస్థానంబు ను నృత్యగీతవాద్యమనోహరంబు నగుగంధర్వతీర్థంబునకుం జని యందు నజావికగజోష్ట్రసువర్ణాన్నదానంబు లొసంగి గర్గస్రోతంబునకుం జనియె. 44

శా. ఆతీర్థంబున గర్గుఁ డన్ముని ఘనుండై కాలయోగంబులున్
జ్యోతిర్భాగములున్ శుభాశుభము లుగ్రోత్పాతజాతంబులున్
జేతోవీథి నెఱింగి యుండె మును లాసిద్ధర్షి సేవించి లో
కాతీతప్రతిభావిశాలమతులై హర్షొంది రుర్వీస్థలిన్. 45

వ. తాలాకుం డత్తలంబునం గలమునితల్లజుల నారాధించి వారి నుచ్చావచంబు లగు భోజ్యంబులం దనిపి బహుధనం బొసంగి శంఖతీర్థంబునకుం గదలి పోయి యట శ్వేత పర్వతసంకాశం బగుమహాశంఖంబును దత్తటంబున నొక్కమహావృక్షంబునుం గాంచి హర్షించె. 46

క. మనుజులకు గోచరింపక, యనిశము యక్షులును రాక్షసాదులు సిద్ధుల్
తిన కొండ్లు గత్ఫలంబులఁ, దినుచు న్నియమవ్రతంబు దిద్దుదు రచటన్.  47

వ. అత్తీర్థంబునఁ గృష్ణాగ్రజుండు ద్విజులం బూజించి నిర్వర్తితాహ్నికుండై గోధేనుదానంబులును దామ్రాయసభాండవస్త్రాదిదానంబులు నొనరించి ద్వైతవనంబునకుం బోయి యచ్చట నిత్యకృత్యంబులు నిర్వర్తించి నానావేషధరు లగుమునులం జూచి పూజించి సరస్వతీదక్షిణతటంబున నున్న నాగవర్త్మతీర్థంబునకుం జనియె నాకర్ణింపుము.

ఉ. పన్నగరాజు వాసుకి నివాసము సేయుచునుండు నచ్చటం
బన్నగముల్ సహస్రములు భక్తి భజింపఁగ నందు నెందునుం
బన్నగభీతి లేదు పదునాలుగువేలఋషీంద్రు లుండ్రటన్
బన్నగరాజ్యమందు మును వాసుకి నిల్పిరి వేల్పు లుల్లలన్.  49

వ. రోహిణీనందనుం డందు విశేషదానంబు లొనరించి ప్రాఙ్ముఖంబు వట్టి పోవుచు నందందుఁ గలశతసహస్రసంఖ్యాకంబు లగుతీర్థంబుల ఋషిప్రోక్తప్రకారంబున నుపవాసాదినియమవ్రతంబులం దీర్చి నానావిధదానంబు లొనర్చి నైమిషేయఋషిదర్శనార్థియై చని చని యొక్కచోఁ బ్రాఙ్ముఖనివృత్తయైనసరస్వతిం గాంచి విస్మితుం డయ్యె ననిన జనమేజయుం డట్లేమికారణంబున సరస్వతి నివృత్త యయ్యె బలభద్రుం డేమిటికి విస్మితుం డయ్యె నెఱింగింపు మనిన వైశంపాయనుం డి ట్లనియె.

సీ. కృతయుగంబున మున్ను క్రతువు ద్వాదశవార్షిక మొనర్చి రా సత్రకాలమందు
నిలఁ గలఋషు లెల్ల నేతెంచి నివసించి,రచ్చోట సత్రసమాప్తి యైన
వెనుక నైనను వీడి వెడలఁ జాలరు తీర్థ, కారణంబున నొండుకడకు దాన
జనబహుళత్వమునఁ దక్కినమునను స్యమంత,పంచకముదనుకఁ బరఁగుచున్న
తే. వరసరస్వతీతీర్థముల్ పురము లట్టు, లయ్యె నయ్యవి సతము స్వాధ్యాయపఠన
పాఠసుస్వరనిస్వానభారముఖరి,తమ్ములై యొప్పె నేత్రపర్వమ్ము లగుచు.  51

వ. అందు వాలఖిల్యులు నశ్మకుట్టులు దంతోలూఖలులు స్థండిలశాయులు నగుమహామును లనేకు లనేకసత్రంబు లాచరించుచుఁ గిక్కిఱిసి యుండి రందునం జేసి నిర్మలోదకంబు లభింపమి నెఱింగి వా రందఱునుం జింతించి యజ్ఞోపవీతంబుల వేల్చి నిర్మలార్థం బిష్టులం గానించి రంత సరస్వతి వారియెడం బ్రసాదించి ప్రాఙ్ముఖంబుగం బ్రతినివృత్తయై నైమిశీయకుంజంబులు నిండం బ్రవహించి మరలఁ బ్రతీచీముఖంబై చనియె నావక్రగమనంబునకు విస్మయంబు నొంది ప్రలంబాంతకుం డత్తీర్థంబున నవగాహనంబును భూంషాదివివిధదానంబులు నొనరించి నానాద్విజ

గణాన్వితంబును బదరేంగుదకాశ్వత్థబిల్వామ్రాతకపారిజాతాదివివిధతరువృతంబును కదళీవనభూయిష్ఠంబును వాలఖిల్యాదిమహామునీంద్రసాంద్రంబును నిరంతరస్వాధ్యాయఘోషసంఘుష్టంబును మృగయూథశతాకులంబు నగుసప్తసారస్వతతీర్థంబునకుం జనియె నదియునుం దొల్లి సరస్వతి పుష్కరంబుల నధ్వరంబు పొనర్చుచుం దలంచిన నట సుప్రభ యనియు నైమిశంబున ఋషులసత్రంబున స్మరించునంతఁ గామాక్షి యనియు గయాక్షేత్రంబున గయుండు సేయుసవనంబున నాహూతయై విశాల యనియు నుత్తరకోసలాభాగంబున నుద్దాలకునధ్వరంబున ధ్యానించుటం జేసి మనోరమ యనియుఁ గురుక్షేత్రంబునఁ గురునిమఖంబున వసిష్ఠునాహ్వానంబునం బోయి యోఘవతి యనియు గంగాద్వారంబున దక్షప్రజాపతియాగంబున సురేణువనియు మఱియుం బరమేష్ఠి చేసినహిమాలయంబునందలిసవనంబున విమలోద యనియు నేడు తెఱంగులం బ్రవహించి పోయి ప్రఖ్యాతిం గాంచి మరల నచ్చో నేకీభవించుటం జేసి సప్తసారస్వతసమాఖ్యం గాంచె నత్తీర్థంబున. 52

తే. అనిలదేవునకు సుకన్య యనెడుసాధ్వి,యందు మంకణకుం డనునఘమూర్తి
పుత్త్రుఁడై పుట్టి లోకైకపూజ్యుఁ డగుచుఁ, దపమునం జేసి సిద్ధుఁడై తనరె మున్ను.

వ. జగత్త్రయవిశ్రుతం బయినయమ్మహామునిపవిత్రచరిత్రంబు చెప్పెద నాకర్ణింపుము.

—మంకణమహాముని మాహాత్మ్యాభివర్ణనము—

సీ. పరమతపస్వియై పరఁగునామంకణ,కోర్వీసురుం డొకానొకదినమున
నదికేగి యవగాహన మొనర్చుచు నొకింత, చెంతఁ దనుపుగట్ట కంతలోన
నీరాడునొకసుందరీరత్నమును జూచి,కలఁగుడు నింద్రియస్థలన మయ్యె
నది వృథ వోకుండ నాతఁడు తనకమండలువునఁ గొని చనె నిలయమునకు

తే. సప్తభాగములై కలశంబునందు, వెలుఁగుచుండినవీర్యంబువలన నేడ్గు
రు మును లుదయించి సప్తమరుద్గణమ్ము,లకు జనకులై వెలసిరి కాలక్రమమున. 55

వ. కలశీపుత్త్రు లగువారేడ్వురును వాయువేగుఁడు వాయుబలుఁడు వాయుహుఁడు వాయుమండలుఁడు వాయుజ్వాలుఁడు వాయురేతుఁడు వాయుచక్రుఁడు ననువారు వారిజనకుండ మంకణుండు. 56

చ. మును పొకనాఁడు మంకణుసిరుంబెయి శాతకుశాగ్రసంగతిం
గొనవిడి గంటివోయి యటఁ గూరరసంబు స్రవించె దానినిం
గనుఁగొని యమ్మహర్షి తనకౌతుకమున్ వెలిబుచ్చి యిచ్చపెం
పునఁ బొనరించె నృత్య మది పోలఁ గనుంగొని భూతజాతముల్. 57

ఆ. తన్మహత్త్వమోహితమ్ములై తామును, నృత్య మాచరించె నెఱిఁగి సురలు
మునులుఁ దమ్మిచూలి మునుకొని హరుపాలి,కరిగి విన్నవించి రట్టిమొఱకు. 58

వ. హరుం డాసంక్షోభం బుడుపనెంచి బ్రాహ్మణరూపంబున మంకణునిచెంత కరుదెంచి
యి ట్లనియె. 59

శా. ఓధర్మజ్ఞుఁడ! బ్రాహ్మణోత్తముఁడ! నే నూహింప లేకుంటి నా
యాధర్మంబుల నుండి సత్తపమునన్ హర్షించుచునీ వేటికో
బోధాధిక్యము గల్గినట్లు ముదముం బోషించి నర్తింతు వా
శ్లాఘేయం బెది చెప్పవే యన నతం డమ్మేటితో ని ట్లనున్. 60

ఉ. నాకరమందు గంటె నట నల్లి స్రవింపక సంశయంబు గా
శాకరసంబు గాంచెఁ బ్రశంసకు నెక్కఁగఁ జూడకుంటివో
నా కిది హర్షహేతు వయి నాట్యము సేయుచునుంటి నావుడున్
లోకగురుండు నవ్వి యనులోమగతి న్వచియించె వానికిన్. 61

క. దీనికి విస్మయ మొందం, బో నే లిది మేటివాఁగఁ బోఁటనె నన్నా
గానవె యని తనబొటన్వ్రే, లాంచించిన వ్రేలిగోట నరుగును గీఱెన్. 62

ఉ. గీఱిన దానఁ దెల్లనయి కీరితి కెక్కినభస్మ మొగసెఁ
గాఱఁగఁ జొచ్చె నచ్చెరువు గన్గొని మంకణకుండు సిగ్గునన్
జాఱిన చిత్తవృత్తి మెయిఁ బాతరలాడుట మాని లోన న
ప్పాపుని దేవదేవునిగఁ బ్రస్తుతి సేయుచు మ్రొక్కి యి ట్లనున్. 63

సీ. ఈ వెన్న దేవాదిదేవుఁడ వగుదువహో, దేవుఁడవే కాని కా వొకఁడవు
సచరాచరము లగుసకలలోకములకు, దేవదానవులకు నీవ గతివ
యీవిశ్వమంతయు నీవలనం బుట్టుఁ బ్రళయంబున న్నిన్నె పట్టు మరల
దేవళ్ళకైన నిం దెలియ శక్యము గాదు, నా నేల నాఁగోటివానిఁ దడవ

తే. లోకభవము లెల్ల నీలోనఁ దోఁచు, నిన్నుపాసింత్రు బ్రహ్మాదు లెన్నఁ డేవి
కర్తవును గారయితవు నీ వార్తిదక్కి, సురలు మోదింత్రు నీకృపాభరము గలిమి. 64

వ. అని యనేకవిధంబులం బ్రస్తుతించి ప్రసన్నుం డయినవానిపదంబులఁ జాఁగిలిపడి
వినమ్రుండై. 65

ఆ. నాదుచాపలంబు నాస్మయాదికమున, నయిచి నాదుతపము క్షరము లేక
యుండునట్లు సేయు మోదేవ యన్నింపు,మనుడుఁ బ్రీతచిత్తుఁ డయి హరుండు. 66

తే. మత్ప్రసాదమున న్నీదుమహితతపము, వేమడుంగులు వర్ధిల్లి వెలయుచున్న

చేయు నీత్రోవ నిచ్చట నే వసింతు,భుక్తిముక్తుల నొసఁగుచు బుధవరేణ్య. 67

తే. సప్తసారస్వతమున నేజనుఁడు నచ్చి, భక్తి నర్చించు నో వాఁడు పరమసౌఖ్య
మంది పరమందు సారస్వతాఖ్యలోక,మం దధివసించు నని శివుం డానతిచ్చె. 68

వ. ఇది మంకణకునివృత్తాంతం బమ్మహాత్మునినివాసం బైనసప్తసారస్వత తీర్థంబున
రేవతీరమణుండు నియమపరుండై యొక్కరే యుపవసించి ద్విజాతులకు వివి
ధార్థంబు లొసంగి మఱునాఁ డరుణోదయంబున లేచి కపాలమోచనం బను
నౌశనసతీర్థంబునకుం జనియె నట శుక్రుండు తొల్లి నిర్వక్రప్రభావంబునఁ దపంబు
గావించుటం జేసి యౌశనసం బనియును మహోదరుం డనుమహాముని తన
పిక్కం గ్రుచ్చుకొనినరక్కసికపాలంబు వాయఁ గలుగుటం జేసి కపాలమోచనం బని
యును దీర్థంబు సార్థకం బయ్యె ననిన జనమేజయుం డక్కపాలవృత్తాంతంబు సెప్పు
మనిన వైశంపాయనుండు. 69

సీ. మునుదండకారణ్యమున రాఘవుండు రాక్షసుల సంహారించెడుసమయమందుఁ
గత్తివాయమ్మునఁ గాయమ్ము వాసిన,యొకరక్కసునిశిరం బురుజవమునఁ
దెగిపడి వనములోఁ దిరుగుమహోదరు,పిక్కలో నెమ్మింటఁ జిక్కుకొనియెఁ
దద్బాధ కోర్వ కాతండు వాచియుఁ జీము, గట్టికం పెత్తినకాలు గదిపి

తే. మెట్టఁ జాలక మెట్టుచు మేదినిఁ గల,యెల్లనదులును దీర్థము లేగి చూచి
యెందునుం బుక్క విడమికి ,నెనరు గుడిచి,సంయములు సెప్ప నౌశనసమున కరిగి.

ఉ. నీళులఁ గాలు వెట్టుటయు నెంజిలి యంతయు వింతగాఁ జనం
గాలను దూరియున్నతల గగ్గొనుచుండఁగ నూడి నీళులం
గూలి యదృశ్య మయ్యె మునికుంజరుఁ డంతయు మౌనికోటికిం
బోల వచింప వా రటకుఁ బోయి భజించిరి తీర్థరాజమున్. 71

వ. నాఁటంగోలె నౌశనసంబునకుఁ గపాలమోచనం బనునామంబు నంకితం బయ్యె నం
దచ్యుతాగ్రజుం డనేకదానంబు లొనర్చి పృథూదకంబునకుం బోయె నందు రుషం
గుం డనువృద్ధబ్రాహ్మణుండు తనపుత్రులకుం జెప్పి మరణకాలంబున కటఁ జేర్పంబడి
దేహత్యాగంబు సేసి సిద్ధుం డయ్యె మఱియు నార్ష్టిషేణుం డనుద్విజోత్తముం డత్తీర్థం
బునం దాదియుగంబునఁ బెద్దకాలంబు గురుకులవాసంబు చేసియు వేదంబులు
సమాప్తి నొందింపం జాలమి విసివి నిర్వేదంబు నొంది యందు ఘోరతపంబు గా
వించి తత్ప్రభావంబున దేవళ్ళదర్శనంబు గలిగించుకొని సంపూర్ణవిద్యాంసుండును
దపస్సిద్ధుండునై యిందలిజలంబుల నవగాహనం బొనర్చినవాఁడు నేఁడు మొదలు

వాజిమేధఫలంబు నొందునట్లును సర్వభయం బందు లేకుండునట్లును నటఁ గావించిన సత్కర్మం బల్పకాలంబునన ఫలించునట్లును మూఁడువరంబులు వడసి త్రిదివంబునకుం జనియె నల్పకాలసిద్ధిదం బగునచ్చోట సింధుద్వీపుండును దేవాపియు విశ్వామిత్రుండు నుబ్రాహ్మ్యంబు నొంది రనిన జనమేజయుండు విశ్వామిత్రుండు విప్రత్వంబు నొందిన విధంబు చెప్ప మనిన వైశంపాయనుం డిట్లనియె. 72

—విశ్వామిత్రుని చరిత్రము—

సీ. క్షత్రియతిలకుండు గాధియన్ భూపతి, గనియె విశ్వామిత్రుఁ డనెడుతనయు
నాతఁడు సంపూర్ణయౌవనుం డగునంతఁ, దనయునిఁ బట్టభద్రునిగఁ జేసి
తాఁ దపోవని కేగఁ దలఁచినఁ బ్రజ లెల్ల, మూఁగి పోవల దని మ్రొక్కి కొనఁగ
గాధియుఁ బ్రజలార! కలమిాభయం బెల్లఁ, బుచ్చి వైచెడి నాదుపుత్రుఁ డనుచు
తే. నతనిసామ్రాజ్యమున నిల్పి యఁరిగె నంతఁ, గౌశికుఁడు చక్రవర్తియై ధ్మాతలమున
రాక్షసులబాధ కల దని ప్రజలు దెలుప, నధికసైన్యముతో దండయాత్ర వెడలి.
ఆ. పెద్దదవ్వు వోయి పిదప వసిష్ఠాశ్రమంబు పొంత దళము మసల నిలిపెఁ
దజ్జనాళి యందుఁ దగి వనభంగము, నలుపఁ గాంచి మౌని యలుకఁ జేసి. 74

వ. తనహోమధేనువుం బిలిచి ఘోరదర్శను లగుశబరులం బుట్టింపు మనిన నది యట్ల కావించుటయు నంత వా రాక్షణంబ విశ్వామిత్రసైనికులం బాఁడవి పాఱవుచ్చిర చ్చెడు గెలిసింగి విశ్వామిత్రుండు. 75

క. నీ నీ క్షత్రియబల మిది, తీసి నశించెడిని బ్రహ్మతేజోబల మే
వాసిం గాంచి నశింపక, భాసిల్లెడి నధిక మగుచు బలముల కెల్లన్. 76

వ. అని చింతించి పృథూదకంబున నియమోపవాసవ్రతంబుల శరీరంబు కృశింపం జేయుచు జలాహారుండును బర్ణాహారుండును వాయ్వాహారుండును స్థండిలశాయియు నై దివౌకసులు సేయునంతరాయంబుల కించియును జింతింపక నిరాతంకం బగుపరమప్రయత్నంబున బహులతపంబు గావించి బ్రహ్మసన్నిధానంబు గల్పించుకొని బ్రాహ్మ్యంబు సాధించి సుపర్వోపముం డై కృతకాముం డయ్యె నయ్యెడఁ గామసాలుండు స్నానదానాదిసత్క్రియాకలాపంబు లాచరించి బకదాల్భ్యునాశ్రమంబునకుం జనియె దానివృత్తాంతంబు సెప్పెద నవధరింపుము. 77

క. బకుఁ డనుదాల్భ్యుం డచ్చోట, నకలంకమతిం దపించి యధికుం డగుటకా
బకదాల్భ్యతీర్థ మయ్యెన్, సకలఫలప్రదము మౌని సన్నుత మగుచున్. 78

తే. మున్ను నైమిశీయమునుల్ సమున్నతగతి, విశ్వజిద్యాగ మొనరించి పిదపఁ బదియు

రెండు నేండ్లగు సత్త్రం బొకం డొనర్పఁ, గడఁగి పాంచాలనాథునికడకుఁ బోయి. 79

వ. దక్షిణార్థం బేకవింశతిసహస్రంబుల యాచించునంత నీకున్న నా బకదాల్భ్యుండు నాయొద్దనున్న కోడెలం గొని పొండు నేను మరల నేరాజునైన నడిగి తెచ్చుకొందు నని వారి కాకోడెల నిచ్చి తాను ధృతరాష్ట్రుం డను నొకానొక రాజుపాలికిం బోయి యాచించిన నతం డప్పుడు చచ్చియున్న గోవృషంబులం దెప్పించి వీనిం గొనిపొమ్మనిన బకుండు వానికిం గినిసి సరస్వతీతీరంబునకుం జని పావకుం బ్రజ్వలింపం జేసి ధృతరాష్ట్రుని రాష్ట్రం బంతరింపం జేయ నెంచి మృతకళేబరంబుల నుండి మాంసంబు గ్రహించి వేల్చుటయు నభ్యభిచారికంబునం జేసి గోడంట నలకినవనంబు వోలె ధృతరాష్ట్రు రాష్ట్రంబు క్షీణింపం దొడంగె నది యెఱింగి యతండు బకుని చెంతకుం జని దే[illegible] క్షత్త్రియాణాం [illegible] యపరాధంబు క్షమించి రక్షింపు మని ప్రార్థించిన నతండు కరుణించి తదాపన్మోక్షార్థంబు హోమంబు గావించి రాష్ట్రోపద్రవంబు శాంతిం జేసి ధృతరాష్ట్రునివలనం బశుసమూహంబుం బడసి నైమిశంబునకుం జనుచు నత్తీర్థంబునం దొల్లి బృహస్పతి దైత్యదానవవినాశనంబు నెంచి మాంసంబు వేల్చి యిష్టిం గావించె నందున సుర లసురుల నెల్ల నిర్జించి రందు ముకుందాగ్రజుం డగ్రజన్ములకు నానావిధదానంబు లొనరించి యాయాతతీర్థంబునకుం బోయె. 80

ఉ. నాహుషుఁ డైన యయాతి యలనాఁడు తపించుచునుండువేళ ను
త్సాహముతో సరస్వతి రసావలయాధిపు మెచ్చి యచ్చటన్
దేహులఁ బ్రోవఁ బాల్పెరుఁగు నేయియుఁ గూరలు వంటకంబులుం
దోహన మాచరించునటు దొప్పలు దోర లొసంగుచుండెడిన్. 81

ఆ. ఆయయాతి దాన నభిలషితార్థము, లెల్ల నెల్లవారి కిడుచు నచట
నధ్వరములు సలిపి యఖిలసన్నుతుఁ డయి, యూర్ధ్వలోకములను నొందఁ గలిగె. 82

వ. అంత ధర్మకేతుం డగు తాళకేతుండు నానావిధదానంబు లొనరించి వసిష్ఠాపవాహం బను తీర్థంబునకు నిర్గమించె నమ్మార్గంబున స్థాణుం డధ్వరంబు లొనర్చినదాన స్థాణుతీర్థంబు కీర్తితం బయ్యె నందుఁ గుమారస్వామి దేవసేనానాయకత్వంబున నభిషిక్తుం డయ్యె నయ్యంతికంబున వసిష్ఠాశ్రమంబును దానికిఁ బూర్వపార్శ్వంబున విశ్వామిత్రాశ్రమంబును గలవు వసిష్ఠవిశ్వామిత్రు లయ్యాశ్రమంబులఁ దపశ్శత్రుత్వంబు ప్రవర్తిల్లఁ బరస్పరస్పర్ధాసమన్వితు లై యుండ నొకనాఁడు విశ్వామిత్రుండు వసిష్ఠునితపఃప్రభావంబునకు సహింపనిచిత్తంబున వాని వధింప నెంచి. 83

తే. క్రోధసంరక్తలోచనుఁ డై ధరిత్రి, నిలిచి ధ్యానించె నెడఁద వాణీమహాస్త్ర

వంతి నెంతయుఁ బంతంబు వంతుకెక్క, నదియుఁ గోపనుఁ డని వాని మది నెఱింగి.

ఉ. వ్యాకులతావధూతమతి యై హతభర్తృక యైనకాంతనా
శోకము పాఱ యై కడుపు చుమ్మలు చుట్టి భయంబు పుట్టఁగా
నాకుశికాత్మజాంతికము నంది కరంబులు మోడ్చి కర్ణనున్
వాకొను మేమి సేయ నగు నావుడు నమ్మునినాథుఁ డి ట్లనున్. 85

శా. ఆమైత్రావరుణిన్ వధించుటకు లో నర్థించితిం గాన నీ
వేమోఁ చెప్పితి నాక నాకడకు నాపృథ్వీసుపర్వు న్వడిన్
నేమంబుం గొని తెమ్ము నావుడు మరున్నిర్ధూతవల్లీగతిన్
మైమూనేది వడంక డిల్లపడి యున్నం గాంచి గాధేయుఁడున్. 86

క. అవిచారమ్ముగఁ గొని తెమ్ము వసిష్ఠునిఁ బొమ్ము నాఁగఁ బోయెద నని ద్వీ
పవతీవతంస మమ్మునిసవిధమ్మున కేగి సాధ్వసం బెదఁ ౨ దలఁన్. 87

క. విశ్వామిత్రోక్తం బగు,విశ్వామిత్రోక్తి యెల్ల వినిచి యుభయమహా
నీశ్వరశాపభయమ్మున, నిశ్వాసము నిగుడఁ జేయునిమ్నగతోడన్. 88

వ. మునిశ్రేష్ఠుం డగువసిష్ఠుండు. 89

చ. వగవకు మీవు న న్నతనిపాలికిఁ గైకొని పొమ్ము కానిపోఁ
దగ దన కాతఁ డాగ్రహ మెదం బొదలంగ శపించు నిన్ను నీ
కగుఁవిభవంబు గాచుకొను మమ్మరో! నెమ్మది నమ్మతింపు మె
ట్లగుటకు వ్రాసి యుండె విధి య ట్లగు దీనికిఁ జింత యేటికిన్. 90

క. అనుడు సరస్వతి నెమ్మన,మునఁ దనపై మోసియున్నమునిదయ కెంతేఁ
దనియుచు నతనికి హితముం, బొనరింపఁగ నెంచి కార్యమున్ దలపోసెన్. 91

వ. అంతలో నవ్వసిష్ఠుండు గనతటంబునందుండి తపించుచుండఁ దరుణం బని తలంచి సరస్వతి నిజవేగంబునం గూలాపహరణంబు చేసి గట్టుతో నతనిం దనపయిం బెట్టు కొని పోవుచుండ నమ్మునీశ్వరుండును. 92

సీ. తల్లి! సరస్వతి తగఁ బితామహసరస్సునఁ బుట్టి జగ మెల్లఁ జుట్టి తీవు
గగనంబునందుండి మొగుల కప్పుల నిచ్చి, జనులఁ బోషించెదుజనని వీవు
సకలదిక్కుల నుండుజలము లన్నియు నీవు, స్వాహాస్వధాసరస్వతులు నీవు
బుష్టియుం దుష్టియు బుద్ధియు సిద్ధియు, బుద్ధియుం ద్యుతియుఁ గీర్తియును నీవు

తే. నాల్గుతెఱఁగుల భూతసంతతులయందు, నధివసింతువు నీవు నీయనుఁగుఁజూపు
వలన నల్లి జగము నీవలన నగుచు, నెనకమెసఁగెడు నిట్టినీ కిదె జోహారు. 93

తే. అని వినుతించుచుండఁగ మహానది యంతటిలోన నమ్మహా
మునిఁ గుశికాత్మజాశ్రమముపొంతకుఁ దోడ్కొని వచ్చి చెప్పినం
గనుఁగొని గాధినందనుఁడు కన్నుల నిప్పులు రాల నమ్మునిం
దునుమఁగ నాయుధంబునకుఁ దాంపెసలాడుచు నుండె నంతలోన్. 94

వ. సరస్వతీస్రవంతియుఁ దా నాబ్రహ్మహత్యం జేయించినపాతకంబున కయ్యెడ నను
భయంబున వసిష్ఠుని విశ్వామిత్రునిబారికిం గాకుండ దొలంగం గొనిపోయి ప్రాఙ్ము
ఖంబుగం బాఱ దాని కలిగి విశ్వామిత్రుఁడు తన్నట్లు కన్నుఁ బ్రామినసరస్వతి శోణిత
వాహినివై రాక్షససేవ్య యగు మని శపించె నాశాపంబునం జేసి యొక్కసంవత్సరం
బా స్రోతస్విని నెత్తురు వాఱె నక్కారణంబున నత్తీర్థంబు వసిష్ఠాపవాహం బన నొప్పె
నప్పు డొక్కనాఁడు దేవర్షులు కొందఱు తీర్థయాత్రలు సేవించుచు నందు వచ్చి
రక్తమయం బై రక్షస్సేవ్య మగునసరస్వతిం జూచి నీ వేమి యిట్టు లుంటి వని
యడిగి తద్వృత్తాంతం బంతయుం దెలిసి మేము నీశాపమోక్షంబు గావింతు మని చెప్పి
తపోనియమోపవాసవ్రతంబుల నీశ్వరు నారాధించి తత్ప్రసాదంబున నన్నది యెప్ప
టియట్లు ప్రసన్నసలిలం బై ప్రకృతిం బొందఁ గావించి రప్పు డందున్న రాక్షసులు
క్షుధార్దితు లై మునులం గాంచి ప్రార్థించుచు మే మాఁకట మటమటలాడుచుంటిమి
ధర్మశూన్యంబునం జేసి మా కిట్టియిక్కట్టు సంభవించె నిది మా యిచ్ఛానురూపంబు
గాదు పురాకృతం బిట్లనుభవనీయం బయ్యె మీప్రసాదంబున మాదుష్కృతం
బెల్లఁ బెడఁ బాయు నని యున్నవారము పాపవర్ధనంబున నిట్లు బ్రహ్మరాక్షసుల
మైతిమి యోషిత్సంగంబునను యోనిదోషంబునను బ్రహ్మద్వేషంబునను బుత్వి
గాచార్యగురువృద్ధజనావమానంబునను రాక్షసత్వంబు సిద్ధించు నని పెద్దలు పలుకు
చుందు రిట్టిమాకు నిష్కృతి ననుగ్రహించి తరింపఁ జేయ మీర తగుదు రని
వేఁడుచున్న నతి నెంతయుం గరుణాతరంగితాంతరంగు లై దేవర్షులు క్షుతకలితం
బును గీటావపన్నంబును నుచ్ఛిష్టాన్వితంబును గేశాన్విష్టంబును రుధిరోపహతంబును
బర్యుషితంబును నవధూతంబును నగునన్నము రాక్షసాహారం బట్టిదుష్టాన్నంబు
భుజించుట దోషకారణంబు గావున విద్వాంసుం డగువాఁ డిది యెఱింగి దానిం బరి
త్యజించు నది యని నియమించియు నారాక్షసులకు మోక్షంబు ప్రసాదింప నెంచి
సరస్వతిం బ్రార్థించిన నమ్మహానది వారిమతం బెఱింగినది కావున నిమ్మహాకార్యం
బున కరుణానది యోపి యుండు నని నిగూఢంబుగ దానిం దనలోనికిం దెచ్చుకొని
యరుణాస్నానంబు బ్రహ్మహత్యాపహం బగు నని చెప్పె నప్పు డారాక్షసు లందుఁ

గ్రుంకి విగతపాపు లై త్రిదివంబునకుం జని రయ్యర్థం బమరేంద్రుం డాకర్ణించి వచ్చి
తత్తీర్థంబునం గృతస్నానుం డై తన బ్రహ్మహత్యం బాసె ననిన జనమేజయుం
డింద్రున కట్టిపాతకం బెట్టికి వాటిల్లె నొక్కొ ముక్తుం డయ్యెం జెప్పు మనిన వైశం
పాయనుండు. 95

ఆ. నముచి మున్ను దేవనాథుని భయమున, సూర్యరశ్ము లందుఁ జొచ్చి యున్న
నతని జాడఁ దెలిసి శతమన్యుఁ డచ్చోటి, కరిగి కపటమైత్రి నాచరించి. 96

తే. ఆర్ద్రమున శుష్కమున రేయియందుఁ బగటి, యందు ననుఁ జంపననిసమయంబు చేసి
చంపె నాతని నుర్వున సంజవేళ, నందు నం జుట్టుకొనె బ్రహ్మహత్య వృషుని. 97

ఉ. ఫేననికృత్తశీర్ష మది వెల్లువపుల్ నిగుడంగ బ్రహ్మహ
త్యానుపదాక్రమిం దవ్వుల నంటి పురందరు వెన్నడించినన్
దానివిముక్తికి న్వెర వతండు జగత్త్రయమందు నెందునుం
గానక తల్లడిల్లుమను గంజభవుం గని చెప్పఁ జెప్పినన్. 98

క. కరుణించి దేవదేవుం, డరుణాసంగమజలంబు లాడి యజింపన్
దురితంబు వీఁగ గల దనఁ, బురుహూతుం డట్లు చేసి పూతుం డయ్యెన్. 99

క. నముచిశిరం బరుణాసం,గమతీర్థము దాఁకినంతఁ గ్రవ్యాదత్వ
స్ఫురణంబు విడిచి నిర్జర,నరలోకము లంది పొందెఁ బరమసుఖంబుల్. 100

వ. బలరాముం డాతీర్థంబున జలంబాడి పృథగ్విధదానంబు లొనరించి సోమతీర్థంబున
కరిగె నందు సోముం డత్రిమునిహోతృత్వంబున రాజసూయంబు నిర్వర్తించె నయ్యు
ద్ధ్వరాంతంబున దేవదానవుల కైనమహాసంగ్రామంబునఁ గార్తికేయుం డత్తీర్థంబునఁ
బ్లక్షవృక్షంబు సమీపంబున దేవసేనాధిపతిత్వంబున కభిషిక్తుం డై తారకాసురుం
బరిమార్చెఁ దద్వృత్తాంతం బంతయుం జెప్పెద నాలకింపు మని మఱియును. 101

—కుమారస్వామి పరిభావాభిషేచనము—

సీ. గిరిజామహేశ్వరుల్ క్రీడించు చోటికి, నెఱుఁగక పావకుం డేగినంత
సిగ్గుపెంపున గౌరి దిగ్గునం దొలఁగుడు, హరునితేజము స్కన్న మయ్యె నపుడు
శంకరుం డద్దాని సంగ్రహించి కృపీట,యోనినోటం బోసె నోపు మనుచు
సర్వభక్షకుఁ డయ్యు జాతవేదుఁడు దాని, నఱిగించుకొనలేమి కఱగొఱపడి

తే. యఱుఁ దెవులు వుట్ట నలునకు నెఱుఁగఁ జేసె, వానియనుమతి గంగలో దాని విడిచె
నదియు భరియింపఁ జాలనిదై హిమాల,యమున విడనాడె శరసంచయమ్ముమీఁద

ఉ. అందుఁ గొమారుఁ డభ్యుదయ మంది నిజాంగకదీప్తి దిక్కులం

దుం దెలివొందుచందమునఁ దుప్పలుదూలుచు నొప్పుచుండె న
క్కుందువఁ జూచి కృత్తికలు కన్నకుమారుఁ డటంచు నార్వురున్
ముందఱ కేగుదెంచి తమముచ్చట లచ్చుపడంగఁ బల్కుచున్. 103

క. పాలిండ్లు చేపఁ దాసిన, బాలుం డాభావ మెఱిఁగి వారలచన్నుం
బాలెల్లఁ గ్రోలె నొంటిగ, కాలంబునఁ దనదునార్మొగమ్ములతోడన్. 104

క. కృత్తికలు తత్ప్రభావము, చిత్తము దవులంగ వెఱఁగుఁ జెందుచు నుండం
బుత్తడి యై తత్ప్రాంతన,గోత్తమ మలరారె దారకోత్తేజితమై. 105

వ. అవ్విధంబున నభివృద్ధిఁ గాంచినకుమారుం డాగ్నేయుండు గాంగేయుండు కార్తికే
యుండు శరజన్ముండు నా నొప్పి శుక్లపక్షశశాంకునిచందంబునఁ బొందుపడి సువర్ణ
శరస్తంబంబునఁ బొలుపారుచున్నసమయంబు సమాగతులై దేవమునులు స్తోత్ర
పాఠంబులును గంధర్వులు దివ్యగానంబును నప్సరోజనంబు నానావిధవాదిత్రనృత్యం
బులును గావించిరి గంగయుం ధాత్రియు ధాత్రీరూపంబులు దాల్చి వచ్చి సేవించిరి
బృహస్పతి జాతకర్మాదిసత్క్రియాకలాపంబు నిర్వర్తించెఁ జతుర్మూర్తి యగు వేదం
బును జతుష్పాదం బగుధనుర్వేదంబును ససంగ్రహం బగుశస్త్రసంగ్రామంబును సాం
గంబులై మూర్తీభవించి వచ్చి సేవించె సరస్వతీదేవి యేతెంచి వాని నాశ్రయించె
హైమవతీసమేతుండు మహాదేవుండు వ్యాఘ్రసింహర్క్షగజోష్ట్రాదినానావిధవదనులు
వికృతాకారులు నద్భుతదర్శనులును భూతసంఘంబులతో నచ్చటికి విచ్చేసె మఱియు
సప్తమాతృగణంబులును సిద్ధులు సాధ్యులు విశ్వదేవులు మరుత్తులు వసువులు
రుద్రు లాదిత్యులు పితృదేవతలు భుజంగులు ఖేచరులు బ్రహ్మదేవుండు విష్ణుండు
జిష్ణుండు వీతిహోత్రుండు నారదప్రముఖులు దేవగంధర్వసత్తములు దేవర్షులు బ్రహ్మ
ర్షులు సర్వౌషధంబులు సకలసరిత్సముద్రపర్వతంబులు లోనగువారు కార్తికేయ
దర్శనలాలసులై కైలాసపతి ననుసరించి వచ్చిన నచ్చో టతిసాంద్రం బయ్యె నయ్యెడ
షడాననుండు బాలుండు మహాయోగబలాన్వితుం డై తన్నుఁ జూడ వచ్చినవారి
కాభిముఖ్యంబు సేయ నెంచుటయును. 106

మ. కని మృత్యుంజయుఁడున్ మృడానియును గంగాదేవియున్ వహ్నియున్
మనమం దెంచుచునుండి రీకొడుకు మున్ మన్నింప నెవ్వానినం
కను జేరం జనుదెంచు వేని నెఱుఁగుం గన్గొందు మం చంతలో
నను నన్నించు వినిశ్చయించుకొని రానందంబునం దోఁగుచున్. 107

శా. అయ్యర్థం బెద రాఁగ ఘోరమహిమవ్యాపార మేపారుటన్

నయ్యాటంబుగ నాల్గుమూర్తు లగుచున్ సాతాత్మ్యుండై గుహుం
డొయ్యన నాల్వుర కేక కాలమున నయ్యం దుల్లంబు రంజించె న
ప్డయ్యారే యని యద్భుతాకుడిగవా రైరందఱున్ సందడిన్. 108

వ. అట్లు ప్రతికృతం బయిన కుమారునిమూర్తిచతుష్టయంబు గంగాపార్వతీ పరమేశ్వ
రాగ్నులం డాయం జనినప్పు డనుక్రమంబుగ నైగమేయ విశాఖ స్కంద శాఖ
నామంబులఁ బ్రసిద్ధంబయ్యె నయ్యెడ వారు నల్వురును బరమేష్ఠిం బ్రస్తుతించి మ
త్ప్రియార్థం బియ్యర్భకునకు నేదే నభీప్సితాధిపత్యం బొసంగు మనుటయును. 109

చ. అతఁడు ముహూర్తమాత్ర మనమందు విచారము చేసి విష్టప
త్రితయము మేలు గోరుచుఁ దదీయసమర్థత గొప్ప యేమహో
న్నతపద మా నటంచు నిపుణత్వము పెంపున దేవసేనకుం
బతిగ నొనర్చి దిక్పతులఁ బల్కెఁ దదర్థము సార్థకమ్ముగన్. 110

తే. కార్తికేయునిఁ బిలిచి యోఘనభుజుండ, దేవసేనాని వైతివి నీవు వీర
లోకపాలముఖ్యామరుల్ నీకు వీరిఁ, జేకొనం జెల్లు భువనముల్ చెలఁగఁ బొంటె. 111

వ. అని యెల్లవారు వినం బలికినంతఁ గొంతసేపటి కాదేవేంద్రాది దేవతాసమూహంబు
లెల్ల హరిహరపరమేష్ఠిపురస్సరంబుగాఁ గుమారుం గొని వానికి సైన్యాధిపత్యోత్స
వం బనుసంధింప శమంతపంచకపరిసరంబునందలి సరస్వతీతీరంబునకుం జని సర్వాభి
షేక సంభారంబులును సంతరించి హిమవద్దత్తరత్నసింహాసనంబున మంగళవిధిమం
త్రపురస్సరంబుగా మహాసేను నాసీనుం గావించినంత బృహస్పతి పుణ్యాహవాచ
నాగ్నికార్యాదిక్రియాకలాపంబు లొనరించుచుండ బ్రహ్మవిష్ణుమహేశ్వరులును
సూర్యచంద్రేంద్రులును బవమానపావకులును ధాతృవిధాతృలును ద్వాదశాదిత్యులు
నేకాదశరుద్రులు నష్టవసువులు విశ్వేదేవులు నశ్వినులు మరుద్గణంబును బితృగణంబును
సిద్ధులును సాధ్యులును గంధర్వులు నప్సరసలును యక్షులును గరుడులును విద్యాధ
రులును రాక్షసులును బన్నగులును గిన్నరులును గింపురుషులు దేవర్షులు బ్రహ్మ
ర్షులు వైఖానసులు వాలఖిల్యులు భృగ్వంగిరఃప్రభృతులు యతులును బులస్త్యపుల
హక్రతుముఖ ప్రజాపతులును గశ్యపాత్రివసిష్ఠప్రముఖమహర్షులును మరీచి ప్రచేతో
మనుదక్షప్రభృతులును నక్షత్రగ్రహతారకాది జ్యోతిర్గణంబులును మూర్తిమంతం
బు లైనసరిద్వరంబులును సముద్రంబులును సనాతనంబు లైనవేదంబులును నానా
పుణ్యతీర్థంబులును భూమ్యంతరిక్షంబులును వనస్పత్యోషధులును శ్రీ హ్రీ స్వాహా
సరస్వత్యది త్యుమా శచీ సినీవా ల్యనుమతీ కుహూ రాకా ధిషణాదులును నైరా

వర్షోష్ణశీతవస్సులును సంవత్సరాయనర్తుమాసపక్షాహోరాత్రముహూర్తకలాకాష్ఠలును హిమవద్వింధ్యమేరుముఖ్యమహీధరంబులును వాసుక్యైరావతాది సర్పరాజంబులును గరుడానూరులును యమమృత్యుముఖులును నానావిధదేవగణంబులును సానుచరులై వచ్చి సర్వమంగళంబులు సెలంగ నాభిషేచనికభాండంబులం గొని సరస్వతీసలిలంబుల నసురభీకరుం డగు నాసేనాని నభిషేకించి రయ్యభిషేకోత్సవం బ్లనాఁడు వరుణునకుం గావించిన జలేశ్వరాభిషేకోత్సవంబుకంటె వేయిమడుంగు లధికంబై కాన నయ్యె నయ్యెడ నయ్యగ్నిభవునకుఁ బద్మభవుండు బలవంతులును వాతవేగులును గామవీర్యధరులు నగు నందిసేన లోహితాక్ష ఘంటాకర్ణ కుముదమాలి నాము లగు నలుగురు పార్షతులును భర్గుండు దేవదానవసమరంబునఁ జతుర్దశపరియుత సంఖ్యాకు లగు దైత్యులం బట్టి యొక్కపరి నుక్కడంగించిన కామవీర్యబలాన్వితుండు మాయాశతధరుండు కామనామ పార్షదుని నింద్రాది బృందారకులు జయజయశబ్దంబు గావించుచు దేవశత్రుక్షయకరియు విష్ణురూపిణియు నగు దేవసేనను గంధర్వయక్షరాక్షసులు విజయాశీర్వాదంబులును యముండు కాలోపము లగునున్మాదప్రమాథు లనునను చరులను సూర్యుండు సుభ్రాజ భాస్కరులను నిజానుయాయులను సోముండు కైలాసశృంగసంకాశు లగుమణిసుమనులను హుతాశనుండు జ్యోతిర్జ్వాలాజిహ్వులను నంశుండు పరిఘ పట భీమ దహాతి దహనులను వాసవుం డుత్క్రోశపంచకులను విష్ణుదేవుండు చక్రవిక్రమకసంక్రములను నాసత్యులు సర్వవిశారదు లగునందనవర్ధనులను ధాత కుందకుసుమకుసుదడంబరాడంబరులను త్వష్ట మేఘచక్రు లగుచక్రానుచక్రులను మిత్రుండు సువ్రతసత్యసంధులను విధాత సువ్రతశుభకర్ములను బూషుండు మహామాయావు లగుపాణీతపాణికులను వాయుదేవుండు మహాపక్ష్మ లగుబలాతిబలులను వరుణుంగు తిమివక్త్రి లగుయమాతియాములను హిమవంతుండు సువర్చోతివర్చసులను మేరువు కాంచన మేఘమాలు లనుస్థిరాతిస్థిరులను వింధ్యము పాషాణయోధులగు నుచ్ఛృంగాతిశృంగులను సముద్రుండు సంగ్రహవిగ్రహులను పార్వతి యున్మాదపుష్పదంతశంకుకర్ణులను వాసుకి జయమహాజయు లనుపన్నగోత్తములను వసురుద్రాదిత్యపితృసిద్ధసాధ్యసాగరసరిద్గిరులు దివ్యప్రహరణోపేతులును నానావేషభూషితులు నగుశంఖుకర్ణనికుంభపద్మకుముదాదులను నొసంగిరి మఱియు దేవదానవు లొసంగిన స్కందసైనిక ప్రధానులు శంకుకర్ణ నికుంభపద్మకుముదులు ననంత కృష్ణోపకృష్ణులును వ్యాఘ్రశ్రవుఁడు ప్రతిస్కంధుఁడు కాంచనాక్షుఁడు జలం

ధముఁడు నక్షుఁడు సంతర్జనుఁడు కునదీశుఁడు తమోన్నతకుఁడు నేకాక్షుఁడు ద్వాదశాక్షుఁడు ద్వాదశభుజుఁడు నేకజటుఁడు సహస్రబాహుఁడు వికటుఁడు క్షీఃకంపనుఁడు పుణ్యనాముఁడు సునామఁడు సుచక్రుఁడు ప్రియదర్శనుఁడు పరిశ్రుతుఁడు కోకనదుఁడు గజోదరుఁడు గజశిరుఁడు స్కంధాక్షుఁడు శతలోచనుఁడు జ్వాలాజిహ్వుఁడు కరాలాక్షుఁడు శితికేశుఁడు జటి పరిశ్రుతుఁడు కోకనదుఁడు కృష్ణకేశుఁడు జటోదరుఁడు చతుర్దంష్ట్రుఁడు నష్టజిహ్వుఁడు మేఘనాదుఁడు పృథుశ్రవుఁడు విద్యుతాక్షుఁడు ధనుర్వక్త్రుఁడు జాఠరుఁడు మారుతాశనుఁడు నుదరాక్షుఁడు రథాక్షుఁడు వజ్రనాభుఁడు వసుప్రభుఁడు సముద్రవేగుఁడు శైలకంపి వృషుఁడు మేఘప్రవాహుఁడు నందుఁడు నుపనందుఁడు ధూమ్రశ్వేతుఁడు కలిందుఁడు సిద్ధార్థుఁడు వరదుఁడు ప్రియకుఁడునందుఁడు గోనందుఁడు నానందుఁడు ప్రమాథుఁడు స్వస్తికుఁడు ధ్రువకుఁడు క్షేమబాహుఁడు సుబాహుఁడు సిద్ధపాత్రుఁడు గోవ్రజుఁడు కనకాపీడుఁడు గాయనుఁడు హాసలుఁడు బాణుఁడు ఖడ్గుఁడు వైతాళి గతితాళి కథకుఁడు వాతికుఁడు హంసజుఁడు పంకదిగ్ధాంగుఁడు సముద్రోన్మాదనుఁడు రణోత్కటుఁడు ప్రహాసుఁడు శ్వేతసిద్ధుఁడు నందకుఁడు కాలకంఠుఁడు ప్రభాసుఁడు కుంభాండకుఁడు కాలకాక్షుఁడు శితుఁడు భూతమథనుఁడు యజ్ఞవాహుఁడు ప్రవాహుఁడు దేవయాజి సోమపుఁడు మజ్జలుఁడు క్రథుఁడు క్రాథుఁడు తుహానుఁడు తుహారుఁడు చిత్రదేవుఁడు మధురుఁడు సుప్రసాదుఁడు కిరీటి వత్సలుఁడు మధువర్ణుఁడు కలశోదరుఁడు ధర్మదుఁడు మన్మథకరుఁడు సూచీవక్త్రుఁడు శ్వేతకరుఁడు సువక్త్రుఁడు చారువక్త్రుఁడు పాండురుఁడు దండబాహుఁడు బాహుఁడు రజుఁడు కోకిలకుఁడు నజుఁడు కనకాక్షుఁడు బాలానాముఁడు సంచారకుఁడు గృధ్రపత్రుఁడు జంబుకుఁడు లోహాజవక్త్రుఁడు జవనుఁడు కుంభవక్త్రుఁడు కుంభకుఁడు స్వర్ణగ్రీవుఁడు కృష్ణౌజుఁడు హంసవక్త్రుఁడు చంద్రభుఁడు పాణికూర్చకుఁడు శంబూకుఁడు పంచవక్త్రుఁడు శిక్షకుఁడు చాషవక్త్రుఁడు జంబూకుఁడు శాకవక్త్రుఁడు కుంజలుఁడు యోగయుక్తుఁడు కూర్మకుక్కుటవక్త్రులు శశోలూకముఖులు ఖరోష్ట్రవదనులు మార్జార దంశవక్త్రులు దీర్ఘవక్త్రులు నకులోలూకకాకకంకవక్త్రులు నాఖుబభ్రుకవక్త్రులు మయూరవదనులు మత్స్యమేషాననులు నజావిమహిషాననులు ఋక్షశార్దూలవక్త్రులు ద్వీపిసింహాననులు గజాననులు గరుడాస్యులు వృకకాకకంకముఖులు గోఖరోష్ట్రముఖులు వృషదంశముఖులు కోకిలాభముఖులు శ్యేనతిత్తిరికాననులు కృకలాసముఖులు విరజోంబరధారులు వ్యాళవక్త్రులు శూలముఖులు

చండవక్త్రులు గోనాసావదనులు స్థూలోదరులు కృశాంగులు స్థూలాంగులు కృశోదరులు హ్రస్వగ్రీవులు మహాకర్ణులు నానావ్యాలవిభూషణులు గజేంద్ర చర్మవసనులు కృష్ణాజినాంబరముఖులు స్కంధముఖులు నుదరముఖులు పృష్ఠ ముఖులు హనుముఖులు జంఘాముఖులు పార్శ్వముఖులు నానాదేశముఖులు కీటపతంగసదృశులు నానావ్యాలముఖులు బహుబాహుశిరోదరులు నానా వృక్షభుజులు కటిశీర్షులు భుజంగభోగవదనులు నానాగుల్మనివాసులు చీర సంవృతగాత్రులు నానాకనకవాసనులు నానావేషధరులు నానామాల్యాను లేపనులు నానావస్త్రధరులు చర్మవాససులు సుగ్రీవులు సువర్చసులు కిరీటులు పంచశిఖులు కాంచనమూర్ధజులు త్రిశిఖులు ద్విశిఖులు సప్తశిఖులు శిఖండు లు ముండులు జటిలులు చిత్రమాలాధరులు రోమాననులు విగ్రహైకరసులు న జేయులు కృష్ణులు నిర్మాంసవక్త్రులు స్థూలపృష్ఠులు తనూదరులు హ్రస్వపృష్ఠులు ప్రలంబోదరమేహనులు మహాభుజులు హ్రస్వభుజులు హ్రస్వగాత్రులు వామనులు కుబ్జులు హ్రస్వజంఘులు హస్తికర్ణశిరోధరులు హస్తినాసులు కూర్మనాసులు వృక నాసులు దీర్ఘోచ్ఛ్వాసులు దీర్ఘజంఘులు కరాళులు నధోముఖులు మహాదంష్ట్రులు హ్రస్వదంష్ట్రులు చతుర్దంష్ట్రులు వారణేంద్రనిభులు సువిభక్తశరీరులు పింగాక్షులు శంకుకర్ణులు రక్తనాసులు స్థూలోష్ఠులు హరిమూర్ధజులు నానాపాదోష్ఠదంష్ట్రులు నానాహస్తశిరోధరులు నానాచర్మచ్ఛన్నులు దేవభాషాకుశలులు దీర్ఘగ్రీవులు దీర్ఘ నఖులు దీర్ఘపాదశిరోభుజులు పింగాక్షులు నీలకంఠులు లంబకర్ణులు వృకోదరనిభులు నంజనసన్నిభులు శ్వేతాక్షులు లోహితగ్రీవులు పింగాక్షులు కల్మాషులు చిత్రవర్ణు లు చామరపీడకనిభులు నానావర్ణులు మయూరప్రభులు పాశాంకుశకరులు వ్యాది తాస్యులు ఖరాననులు కృష్ణాక్షులు నీలకంఠులు పరిఘబాహులు శతఘ్నీచక్రహ స్తులు ముసలపాణులు నసిముద్గరహస్తులు తోమరపాణులు మహాబలులుమహావేగులు నగువారలక్కుమారు నభ్యంచిచేసిన యభ్యభిషేకోత్సవంబు గాంచి హర్షించి ఘం టాజాలపినద్ధాంగులై యాడుచుం బాడుచుం గార్తికేయు సేవించిరి దివ్యాంతరిక్షపార్థి వభూతంబు లయుతంబులు ప్రయుతంబులు నర్బుదంబులు న్యర్బుదంబు లవ్విశాఖుం బ వేష్టించి సేవించిరి లోకత్రయవ్యాపిను లగు ప్రభావతి విశాలాక్షి పాలిత గోస్తని శ్రీ మతి బహుళ బహుపుత్రిక యప్సుజాత గోపాలి బృహదంబాలిక జయావతి మాల తిక ధృవరత్న భయంకరి వసుదామ సువిదామ విశోక నందిని యేకచూడ మహాచూడ చక్రనేమి యుత్తేజని జయత్సేన కమలాక్షి శోభన శతంజయ శైవక్రోధన శలభిఖరి మా

ధవిశుభవక్త్రి తీర్థసేని గీతప్రియ రుద్రకామ యమితాశన మేఘస్వనభోగవతి సుభ్రు
వు కనకావతి యలాతాక్షి వీర్యవతి విద్యుజ్జిహ్వ పద్మావతి సునక్షత్ర కందర బహు
యోజన శతోలూఖలమేఖల శతఘంట శతానంద భద్రకాళి సుమంగళ సుప్రసాద
యేఁడిమేడి సమేఁడి వేతాళజనని కుక్కుటిక శంఖులిక కుండారిక మహావేగ కేశయంత్రి
మందోదరి ముండి మేషవాహిని పృథువక్త్ర మణికుట్టిక లంబపయోధర వేణువీణా
ధర శశోలూకముఖి శింశుమారముఖి విభీషణ క్షురకర్ణి చతుష్కర్ణి గోకర్ణి మహి
షానన ఖరకర్ణి మహాకర్ణి శంఖకుంభశ్రీవ లోనగువృక్షగృహాశ్మశానవాసిను లగు
నానామాతృకలును గార్తికేయానుయాయినులై సేవించి రట్టియెడ. **112**

సీ. ముక్కంటి ఘంటయు నెక్కియంబు నొసంగె, నమరేశ్వరుండు శక్త్యస్త్ర మిచ్చె
హరి బలవర్ధని యనుమాల నర్పించె, నగజ మాయనివస్త్రయుగ మొసంగె
గంగ సుధోద్భవకలశంబు కృపచేసె, సమరగురుండు దండము నొసంగె
గరుడి మయూరముఁ గరుణించె నరుణుండు, సురుచిరం బగుతామ్రచూడము నిడె

తే. వరుణదేవుఁ డున్నతనాగవరము నొసఁగె, నలువ విజయంబు కృష్ణాజినంబు నొసఁగె
మునులు దివ్యోదయాశీర్వచనము లిడిరి, బాహులేయున కానందభరితు లగుచు.

శా. సేనానాయకుఁ డై విశాఖుఁ డధికశ్రీదీప వైశ్వానరుం
డో నాఁగ న్వెలుగొందుచుం దివిజసందోహంబు సేవింపఁ బ్ర
హ్మానందంబునఁ బొందుచుం దనుజసంహారాభిముఖ్యంబు సం
గాన న్వచ్చిన సవ్వియచ్చరవరుల్ కౌతూహలోపేతులై. **114**

వ. బాహులేయుం బరివేష్టించి భేరీ శంఖ మురజ పటహ ఝర్ఝర క్రకచ గోవిషాణి
కాడంబర డిండిమ గోముఖ ప్రముఖతూర్యంబులు మొఱయించుచుఁ బ్రస్తుతించి
రప్సరోనృత్యంబును దేవగంధర్వగానంబు ననూనం బయ్యె నయ్యెడ హర్షోత్కర్షం
బు పొంపిరివోవ మహాసేనుండు మీకుం బగఱ యై బల్లిదు లైనదైత్యదానవుల
నెల్లరం ద్రెళ్ల నేసి మిమ్ము రక్షింతు నని వారికి వరం బొసంగి వ్యవసాయ జయ
ధర్మ సిద్ధి లక్ష్మీ ధృతి స్మృతులు పురోభాగంబున నడచుచుండ మహాసేనాసమన్వి
తుం డై త్రిదశారులపై దండయాత్ర వెడలుటయు నవ్వీరాగ్రేసరుం గాంచి దైత్య
దానవసంఘంబులు వెఱచఱచి దశదిశలకుం బఱవం జొచ్చె నట్టియెడ. **115**

తే. గుహుఁడు తనసైన్యమును జుట్టుకొనఁగఁ బుచ్చి
తాను దేజోబలాన్వితుం డై నెఱి గొని
మఱియు మఱియును శక్త్యస్త్ర మఱిమి తఱిమి

వేయుటయు దాన నుల్కలు వెడలి నిండె. 116

క. పాటెడుదానవదళములు, నీఱయి వోవుటలు గాంచి నేత్రయుగము నం
గాఱంగ విస్ఫులింగము, లాఱనికోపమునఁ దారకాసురుఁ డంతన్. 117

శా. శక్త్యుద్రేకముతో ననీకమునకున్ సన్నద్ధుఁడై వాహినీ
సత్యుత్సాహమున న్విశాఖు నెదురన్ సంవర్తకాలాకృతిన్
శక్త్యస్త్రంబును బూని వైవ నతఁ డాశక్త్యస్త్రతేజంబునన్
శక్త్యస్త్రంబులు పుట్టెఁ గోట్లకొలఁదిన్ జాజ్వల్యమానంబులై. 118

సీ. తారకుఁడు దశాయుతవరూథినీయుతుం, డై మాఱుకొని తెగటాఱి పోయె
మహిషాఖ్యుఁ డష్టపద్మదళావృతుం డయి, సముదాయమున నట్టె సమసి పోయె
దశశతాయుతసైన్యపతిసమన్వితుఁడు దీ, ప్తిపాదుఁడు రణభూమి బడలుపడియెఁ
బదనిఖర్వములతోఁ బ్రఖ్యాతి గొన్న ప్రాం, దోదరుండును నశించె నొక్కపెట్ట

తే. యిట్లు శస్త్రాస్త్రకీలల హేతితతులఁ, గొందఱును గొంద ఱార్పులఁ గొందఱు ధ్వజ
హతులఁ గొందఱు ఘంటారవాధికశ్రు, తులను హతు లైరి సర్వదైత్యులునుద్భటిన.

మత్త. ప్రాణసంకటకారు లాసురవైరు లట్లు రణావనిం
బ్రాణము ల్విడి కూలినం గని పార్షదుల్ ముద మందుచున్
రాణ లొప్పఁగఁ గుప్పిగంతులు గ్రోలఁ బాడుచు భక్తసం
త్రాణశీలునిఁ దారకారినిఁ బ్రస్తుతించిరి భక్తిమై. 120

వ. ఇట్లనేకనాకలోకద్వేషు లుక్కు దక్కి పోవం బోవఁ గాంచి బలిపుత్త్రుం డగుబా
ణాసురుండు వెఱచఱచి పఱచి పర్వతోత్తమం బగుక్రౌంచంబునం దాఁగి దేవసం
ఘంబులం బాధించుచుండె నంత నవ్వృత్తాంతం బెఱింగి. 121

మత్త. క్రౌంచనాదనినాదితంబును ఘోరగుహోన్నతశృంగముం
గ్రౌంచపర్వతముం గనం జని కార్తికేయుఁ డజయ్యుఁడై
యించుకంతటిలోన గుబ్బలియెల్ల దూఁటులు వోవఁ గా
వించి పొల్చినబాణముఖ్యుల వేల్చి పుచ్చె నొకింతలోన్. 122

వ. అట్లు విజయంబు గాంచి కుమారస్వామి దేవతాస్తోత్రవచనంబు లాలించుచు దేవ
దుందుభిధ్వానంబు లవధరించుచుఁ బుష్పవర్షంబుల మునుంగుచు వెలుంగుచుండె
నయ్యవసరంబునం గొంద ఱాస్కందుని శతానందనందనుం డగుసనత్కుమారు
ననుజుం డనియుఁ గొందఱు మహేశ్వరపుత్త్రుం డనియుఁ గొందఱు పార్వతీనం
దనుం డనియుఁ గొందఱు వైశ్వానరసూనుం డనియుఁ గొందఱు గంగాసుతుం

డనియుఁ దలంచి సేవించుచుండి రిట్లు వ్యవస్థితుం డైనయయ్యోగీశ్వరేశ్వరుం డాశ్రి
తులకు నానావిధైశ్వర్యంబు లొసంగుచుండెఁ దేజోమయుం డగుచుం డమరసైన్యా
ధిపత్యపదాభిషిక్తుం డగుటం జేసి యత్తీర్థంబు దేవతాప్రసాదంబున భుక్తిముక్తిప్ర
దం బయ్యె వరుణాభిషేకంబునం జేసి తైజసంబు నాఁ బేరొందినయత్తీర్థంబునందు
యదునందనుండు స్నానదానాదికం బాచరించి యొక్కరే యధివసించె నిది కుమా
రాభిషేకప్రకారం బనిన జనమేజయుండు వరుణాభిషేకప్రకారంబునుం జెప్పు మని
యడిగిన వైశంపాయనుండు వెండియును. 123

సీ. పూర్వకల్పమునందు మొదటికృతంబున, వేలుపుమూకలు నేర్పుఁ జేసి
వరుణునిఁ బూజించి వజ్రిమమ్ముం బలె, నీవు సరిత్పతివై వఱలుచు
నీవశంబున నుండునీరధిలోఁ గాపు, రం బుండి వృద్ధిక్షయంబు లొంది
చంద్రునితోఁ గూడ పొరుమీఱుచు నీవు, పడమటిదిక్కునఁ బ్రభువ వగుము
తే. నావుడుఁ బ్రచేతసుఁడు నల్లె నా సుపర్వు, లతనిఁ దోడ్కొని విధిదృష్టమైనవిధిని
వరుణదేవున కత్తీర్థవరమునందుఁ, దనర నభిషేక మొనరించి చనిరి దివికి 124
వ. హలాయుధుం డత్తీర్థంబునఁ గృతస్నానదానుండై యగ్నితీర్థంబునకుం జనియె నం
దు నష్టుం డైనయగ్నిభట్టారకుండు శమీగర్భంబునం బుట్టె నావృత్తాంతంబు
చెప్పెద వినుము. 125

మ. భృగువంశంబున సర్వభక్షుఁ డగుచుం భీతిల్లి వైశ్వానరుం
డగుఁ బొమ్మంచుఁ బ్రణష్టుఁ డయ్యె జగముం దత్యంతహాహాకృతుల్
దగులం దానికిఁ దల్లడిల్లి సురలీధాత్రీతలం బంతయుం
మొగి నన్వేషణ మాచరించుచును బోఁ బోఁ గాంచి రచ్చోటునన్. 126
తరువోజ. జమ్మిగర్భమునందుఁ జని డాగి యున్న జ్వలనుని గుర్తించి శాంతవాక్యముల
సమ్మతి గలిగించి సంస్తుతు లెసఁగ సర్వభక్షకుఁడ వయ్యు సకలపావనత
నెమ్మెయిఁ గొందు లె మ్మివల రమ్మన్న నెరగలి వెలి వచ్చి యెల్లరతోడ
నమ్మహితాంగ నాఁడి పూతాత్ముఁ డయ్యె నందునఁ దీర్థ మాగ్నేయ మయ్యె. 127
వ. అందు మున్ను ప్రలంబఘ్నుం డఘమర్షణస్నానంబును వివిధదానంబులు నిర్వర్తించి
కౌబేరతీర్థంబునకు నిష్క్రమించె నత్తీర్థంబునం దొల్లి యక్షేశ్వరుండు పరమతపంబు
గావించి ధనేశ్వరత్వంబును భూతేశ్వరసఖ్యంబును లోకపాలత్వంబును గామగమనం
బగుపుష్పకంబును నలకూబరుం డనుకుమారుం బొంది మరుద్గణాభిషిక్తుం డయ్యె
నత్తీర్థంబున బలుండు నిత్యకృత్యంబులు నిర్వర్తించి శ్వేతానులేపనం బనుబదరపాచన

తీర్థంబునకుం బోయెఁ దద్వృత్తాంతంబు సెప్పెద నవధరింపుము. 128

సీ. మున్ను భరద్వాజముని ఘృతాచిఁ జూచి, నంత రేతస్స్ఖలన్న మగుడు దానిఁ
గరమునం బట్టి యక్కడ నున్నయొకపర్ణ, పుటమునం బెట్టె నాపుటమునుండి
బుట్టెఁ గన్యామణి ముని యామెకు శ్రుతావతి యను పేరం కించి దినము లరుగ
బుదుత నాశ్రమమున విడి యొంటిఁ దా హిమవంతమునఁ దపించుచింత నరిగె

తే. నదియు సురపతిఁ బతిని గా నందఁ గోరి, పరమనిష్ఠాగరిష్ఠ యై భవ్యతపము
నూఱుసంవత్సరంబులు దీక్ష దాఁక, నెఱపె దుశ్చర మని మునుల్ వెఱఁగుపడఁగ.

చ. అటులు తపించుచున్నతఱి నాయమ చెంతఁ బురందరుండు ప్ర
స్ఫుటముగ నవ్వసిష్ఠమునిపుంగవురూపము దాల్చి పొల్చినం
దటుకున నామె లేచి యుచితంబుగ నర్చ యొనర్చి నే నొన
ర్చుట కగుకార్య మెద్ది మదిఁ జొచ్చిన వచ్చితిరో వచింపుఁడీ. 130

క. త్రిదశేంద్రుఁ బెండ్లియాడఁగ, మదినెంచుచు నున్నదాన మహనీయగుణా
స్పద ! దానిఁ దక్క నొండొక, హృదయార్థ మెఱుంగఁ జెప్ప మే నొనరింతున్.

వ. అనిన నమ్మాయావసిష్ఠుండు నవ్వుచు నామె నూరార్చి యి ట్లనియె. 132

ఉ. ఉగ్రతపంబు సేయుటకు నుంటి వి దేటికి గీన నీమనో
వ్యగ్రత దీఱ వాంఛిత మవశ్యము నొందెదు నిక్క ముర్వియం
దగ్రియ యై చనం జలుపునట్టి తపంబున కేమిసాధ్య మా
నగ్రిము రాల వీవు నియమాఢ్యతపస్వినులందుఁ దన్విరో. 133

ఆ. దానిమాట కేమి గాని తలోదరి, తిండి కైదు రేఁగుఁ బండు లేరి
తెచ్చినాఁడ వీని నిచ్చమై పక్వంబు, చేసి పెట్టు మనుచుఁ జేతి కిచ్చి. 134

వ. తా నంతలో నింద్రతీర్థంబునకుం బోయి జపపరాయణుం డయ్యె నయ్యన్నుమి
న్నయు నంతలో నగ్ని రగుల్కొలిపి పండులు వండ మొదలువెట్టి కట్టియ లన్ని
యుం జెల్ల దినాంతం బగునంతకును బం డ్లుడికకుండి కొంతయు వంత నొంది యింధ
నంబులు లేక తనపాదంబులు రెండు నాప్రొయ్యి బెట్టి జాతవేదుం బ్రజ్వరిల్లం
జేయుచుఁ బ్రదగ్ధపాదయై వైమనస్యంబు గానకున్నంత వాసవుండు వచ్చి దానిభక్తికి
మెచ్చి దర్శనం బిచ్చి మచ్చెకంటీ! భవదీయనియమవ్రతంబునకుఁ బ్రీతుండ నైతి నీ
యభీష్టంబు నెరవేర్చెద నీ వీ దేహంబు త్యజించి త్రిదివమ్మునకు ర మ్మాతీర్థంబు బదర
పాచనం బనుపేరఁ బ్రదిలోకవిశ్రుతంబై పరమపావనం బగునిందుఁ దొల్లి సప్తర్షు లరుంధ
తిం దిగనాడి హిమవంతంబునకుం జని తపించుచున్నంత నరుంధతియు నిటఁ దపించె

వంతఁ బన్డ్రెండు వర్షంబు లనావృష్టిదోషం బాసన్నం బయ్యె నప్పు డిందుశేఖరుం
డు బ్రాహ్మణరూపంబున నరుంధతికడం బొడసూపి భిక్ష యొసంగు మనుటయు నా
యమ్మ యన్నంబు లేదు కొన్ని బదరంబుల నిచ్చెద భక్షింపు మనిన నతండు వీని వండి
పెట్టు మనిన నమ్మహాభాగ వాని సమిద్ధాగ్నిం బెట్టి మనోహరంబు లగుదివ్యకథ లాక
ర్ణించుచుఁ బన్డ్రెండేఁడు లాహారంబు వర్జించి రేఁగుఁబండ్లు వండుచు నక్కాలం బొ
క్కదినంబు వోలెఁ బోఁ దోలె నంత ననావృష్టి వోయిన పదంపడి సప్తర్షులు ఫలంబు
లం గొని హిమవంతంబునుండి వచ్చునంతలో నిట నరుంధతికిఁ బరమేశ్వరుండు
నిజరూపంబునం బ్రత్యక్షుం డై నీకు మెచ్చితి నీ చెప్పటియట్లు మహర్షుల నుపసర్పిం
పు మని వారి కయ్యరుంధతిచరిత్రం బెల్ల తెల్లంబు గావించి హిమవంతంబున మీ చేసి
నతపంబు నాకు సమ్మతంబు గా దియ్యమ చేసినతపంబు తపం బని చెప్పుచు నప్పతి
వ్రతదెస మోము పెట్టి వరం బర్థింపు మని తదిష్టక్రమంబున నిత్తీర్థంబున నాశి త్రిరా
త్రోపవాసవ్రతం బొనరించినవాఁడు ద్వాదశవార్షికోపవాసఫలం బనుభవించు
నని యనుగ్రహించి వారి నామన్త్రణంబు చేసి నిజనివాసంబునకు నిర్గమించె సప్త
ర్షులు నామెతపఃప్రభావంబున కబ్బురంపడిరి శ్రుతావతీ! నీ వరుంధతిం బోలినదా
నవు భవదర్థం బే నొక్కవరం బొసంగెద నిత్తీర్థంబునం దాఁడి యొక్కరే యాహా
రంబు వర్జించినవాని కుత్తమలోకంబు ప్రాపించుత మని పురందరుండు వరంబు ప్ర
సాదించి స్వర్గంబునకు నిర్గమించె శ్రుతావతియును దేహంబు త్యజించి శతక్రతువు
ననుసరించె బలభద్రుం డం దొక్కదినం బుండి దాని నాఁటి తొల్లి యింద్రుండు శత
క్రతుసమాప్తి గావించినకతనఁ దన్నామంబున నైనయింద్రతీర్థంబు సేవించి రామ
తీర్థంబునకుం జనియె నదియును. 135

మ. జగతీనాథుల నెల్లరం దునిమి సంశాంతస్వభావంబునన్
భృగురాముం డట వాజిమేధశతముం బెంపెక్కఁ గాఁ జేసి యి
జ్జగతీమండల మెల్లఁ గశ్యపునకున్ సద్భక్తి నర్పించె ముం
దగ నారామునిపేర నొప్పెసఁగి తీర్థం బర్థిసంతానమై. 136

వ. బలరాముం డాభృగురామతీర్థంబున నానావిధదానంబు లొనరించి యమునాతీర్థంబు
నకుం బోయె నందు వరుణుండు చేసినరాజసూయానంతరంబున దేవదానవులకు
ఘోరసంగ్రామం బయ్యె నయ్యాదవోత్తముం డయ్యెడ నవగాహనాదికంబు గా
వించి యాదిత్యతీర్థంబునకుం జనియె నం దాదిత్యుం డాదికాలంబున యజించి
జ్యోతిఃపతిత్వంబును మహాప్రభావంబునుం బడసె మఱియు నప్పరిసరంబున యక్ష

రక్షోగంధర్వాదులును మరుత్తులు విశ్వేదేవులు మొదలగువారు నింద్రుండును ద్వైపాయనుండును శుకుండును గృష్ణుండును లోనగువారు పలువురు యోగసిద్ధిం గాంచిరి శ్రీమహావిష్ణు వందు నవగాహనం బాచరించి మధుకైటభులం బరిమార్చె మఱియు నత్తీర్థంబున. 137

సీ. అసితుండు దేవలుం డనుముని తొల్లిట, గార్హస్థ్యధర్మముం దర్హవృత్తి
నెలఁగుచు సత్యవ్రతులలో మొదటిలెక్క, కయి బ్రహ్మనిష్ఠుఁడై యలరుచుండె
నపుడు జైగీషవ్యుఁ డనుముని చనుదెంచి, వాఙ్నియమంబున వఱలుచుండె
నసితుండు వాని నాహారకాలమునందఁ, గాంచి సద్భక్తిఁ బూజించుచుండె

తే. నట్లు పెక్కేఁడు లేగినయంత నొక్క, నాఁడు దేవలుఁ డమ్మునినాథుఁడాన
మునకు నబ్బుర మొందుచు మొయిలుదారి, నరిగె స్నానార్థ మంబుధి కంతలోన.

వ. జైగీషవ్యుం డమ్మహోదధిం గృతస్నానుండై యుండం గాంచి వానిరాక కంతరం గంబున నద్భుతంబు నొందుచుఁ దానును స్నానసంధ్యాదు లొనరించి నిజాశ్రమం బునకు నిర్గమించి తనకన్న మున్న పోయి సమీపంబున నాసీనుం డయి యున్న జైగీషవ్యుండు లోచనగోచరుం డగుటయు దేవలుండు పరమాద్భుతభరితుం డై యిమ్మహాత్మునియోగప్రభావం బత్యంతస్తోత్రపాత్ర మీతనిఁ బరీక్షింతుఁ గాక యని మంత్రపారగుం డగునసితుం డంతరిక్షంబున కెగసి యట సిద్ధసేవ్యుండై యున్న జైగీషవ్యుం దిలకించి మఱింత పరమాద్భుతంబు నొంది యందుండి పితృలోకంబునకు ను యామ్యలోకంబునకును సోమలోకంబునకు నగ్నిహోత్రలోకంబునకును దపోధనలోకంబునకును మిత్రావరుణలోకంబునకు నాదిత్యలోకంబునకును రుద్రలోకంబునకును వసులోకంబునకును బృహస్పతిలోకంబునకును గోలోకంబునకును బ్రహ్మసత్రిలోకంబునకును బతివ్రతాలోకంబునకును ననుక్రమంబునం బోయి యందందుఁ దనకన్న మున్నర్చితుం డై యుండు జైగీషవ్యుం జూచి చూచుచుండ నట నదృశ్యుం డగువానిజాడం దెలియఁ గోరి యందలిసిద్ధులం జేరఁ జని ప్రణమిల్లి యి ట్లనియె. 139

శా. జైగీషవ్యునిదివ్యయోగమహిమం జర్చింప సాధ్యంబు గా
దేఁ గన్గొంటిని లోకజాలములయం దీతండు నాకన్న ముం
యోగక్షేమము లంది పోవుట లిటం జూపట్టియుం జూడ రా
కేగెం గారణము న్వచింపుఁ డన వా రిట్లాడి రా ప్రోడకుం. 140

క. భవ్యమతీ ! విను జైగీ,షవ్యుఁడు శాశ్వతము బ్రహ్మజగమున ,కరిగెం

దివ్య మ్మది నేర్చెన్ గంతవ్యము గా దెఱిఁగి కొంటి తద్వృత్తంబున్. 141

ఉ. ఆనుడు లాలకించి పరమాద్భుత మందుచు దేవలుండు పై
పై నరుగంగ నోడి మును వచ్చినదారిన ధారణీముఖుం
డై నభసంగమంబువలె నయ్యయిలోకము లెల్ల నానుపూ
ర్వ్యానుగతంబుగం దిగుచు నాశ్రమభూమికి వచ్చి యచ్చోటన్. 142

న. ఎప్పటియ ట్లున్న జైగీషవ్యునిం జూచి వానిప్రభావంబున కబ్బురంపడి వినయవినమితోత్తమాంగుండై యుపసర్పించుచు మోక్షధర్మం బుపదేశింపు మని ప్రార్థించిన నతండు కార్యాకార్యస్వరూపంబును సన్న్యాసయోగలక్షణంబు నెఱింగించుటయు నసితుండు సన్న్యాసంబునం గృతబుద్ధియై యున్నం గని భూతజాతంబును బితృవర్గంబును హవ్యకవ్యవిభాగంబునకై దుఃఖించుచు మా కెవ్వరు గతి యని విన్నవించిన నతండు వారి కెల్ల యథాయోగ్యంబుగ సంవిభాగంబు గల్పించి గార్హస్థ్యధర్మంబు పరిత్యజించి మోక్షధర్మంబు స్వీకరించి చరితార్థుం డయ్యె నట నక్కాలంబున బృహస్పతిప్రముఖు లచ్చోటికి వచ్చి జైగీషవ్యునిఁ బ్రశంసించుచు గాలవుం డనుమునీశ్వరుం డీజైగీషవ్యుఁడు తపస్వి గాకున్న నసితుని మోహింపఁ జేయుచున్నవాఁ డని వాదించుచుండ వేల్పు లతనిఁ గా దని నిషేధించి తత్ప్రభావం బగ్గించుచు స్వర్గంబునకు నిర్గమించి రది జైగీషవ్యాసితస్థానం బయి పరమోత్తమం బైనతీర్థం బందు హలాయుధుండు నిత్యకర్మనిరతుండై సోమతీర్థంబునకుం జనియె. 143

తే. అచటఁ జంద్రుఁడు రాజసూయం బొనర్చె, నందె తారకాసురయుద్ధ మయ్యెఁ దొల్లి
హలి యటన్ స్నానసంధ్యాదు లాచరించి, తరలె సారస్వతమునితీర్థమున కవల.

సీ. మున్ను దధీచుఁ డన్ముని బ్రహ్మచారి యై, విడనాడి యింద్రియవిషయములను
బరమనిష్ఠఁ దపించువానికి సురపతి, వెఱచి విఘ్నములను బెక్కొనర్చి
వితథపరియత్నుఁ డై వెసఁ దత్పరిలోభనార్థ మలంబుస యనంగ నమరునప్స
రోంగనఁ బుచ్చుడు యది యమ్ముని సరస్వతిని దేవతర్పణమును బొనర్చు
తే. నపుడు చెంగట దివ్యరూపాతిశయము, మెఱయఁ గఁ జరించుచుండె నత్తఱి దధీచుఁ
డరసినంతన వీర్యము తొరఁగి నీటఁ, బడియె దాని సరస్వతి వడి గ్రహించి. 145

ఉ. గర్భమునన్ ధరించి చిరకాలము మోయుచుఁ బుణ్యలగ్నమం
దర్భకుఁ గాంచి వానిఁ గొని యమ్ముని చెంతకు వచ్చి చూపుచున్
నిర్భరతేజ! యీసుతుఁడు నీదగుతేజము లో ధరించుటన్
గర్భిణి నైననావలనఁ గల్గె గ్రహింపుము నీదుపుత్రునిన్. 146

వ. అని ముందఱం బెట్టిన నమ్మునిసత్తముండు సంప్రీతచిత్తుండై తత్తరంబున వానిం గొని యక్కునం జేర్చి చెక్కిలి ముద్దాడి మూర్ధంబు మూరుకొని లాలించుచు సరస్వతిం గాంచి నీజలతర్పణంబునం బితృదేవతలు విశ్వేదేవతలు గంధర్వులు లోనగువా రత్యంతతృప్తిం గాంతు రని వరం బొసంగి నీవు తొల్లి బ్రహ్మసరస్సునం దుద్భవిల్లి ప్రవహించుచున్నదానవు నిన్ను మహామునీంద్రులు ప్రశంసింతురు నాకుం బరమప్రియం బాచరించిన దానవు నీవు సరిద్వరంబు లన్నింటికన్న మిన్న యైనదాన విక్కుమారుండు నీకుం బుట్టినవాఁడు గావున సారస్వతుండు నాఁ జెప్పనొప్పి గొప్పవాఁ డగుం గావుత మని మరల వాని నామె కర్పించి యంపిపుచ్చె నంతఁ గొంతకాలంబునకు. 147

ఆ. దేవతలకుఁ బూర్వదేవతలకు బల్వవిరోధ మేరుపడియె నపుడు
పాకశాసనుండు ప్రహరణాన్వేషియై, విసువఁ దిరిగె మూఁడువిష్టపములు. 148

చ. తిరిగియు నెందునుం రిపుతతిం దునుమాడఁగఁ జాలునాయుధో
త్కరముల నొంద నోడి విబుధప్రకరంబులఁ బిల్చి శత్రుసం
హరణ మొనర్ప నాయుధము లారయ రావు దధీచుఁ డన్మునీ
శ్వరుఁ డగు వానియెమ్ము లవి సర్వసమర్థము లాజి గెల్వఁగన్. 149

క. సురలార! మీర లమ్మునిఁ, శరణముఁ జని వేఁడుఁ డతఁడు సర్వజ్ఞుఁడు మీ
కరమర సెప్పఁడు నా సుర, వరు లాతనిపాలి కరిగి ప్రార్థించుటయున్. 150

వ. భృగుపుత్త్రుండును దేజోవంతుండును బరోపకారపరాయణుండు నగు నమ్మునిప్రవరుం డువాని కొండాడక ప్రాణత్యాగంబు గావించుకొని పరంధామంబు నొందె బృందారకులును మునిబృందారకునిశరీరాస్థు లెల్ల సంగ్రహించుకొని పోయినఁ బురుహూతుండు గశేరుకంబున వజ్రాయుధంబును నితరాస్థుల నానావిధాయుధంబులును నిర్మించుకొని శత్రుసంహారంబు గావించె నంతఁ గొంతకాలంబునకు. 151

క. పదిరెండువత్సరంబులు, వదల కనావృష్టిదోషవశమున నై భూ
పద మెల్ల వేఁడిమంగల, మిది యనువిధమునను వేఁగె నెంతయు వెట్టన్. 152

తే. అయ్యనావృష్టియందు మహర్షు లెల్ల, వృత్తి లేక క్షుధార్తులై వివిధభూము
లందఁ బోవుటఁ గని దధీచాత్మజుండు, తానునుం గమనప్రయత్నం బొనర్చె. 153

వ. అయ్యవసరంబున సరస్వతి సారస్వతునకుం బొడసూపి. 154

ఉ. పోవల దీవు న న్విడచి పుత్త్రక నా కిట వృత్తి లే దనం
బోవుదు వేమొ బేడిసల భోజనముం బొనరించు నుండు మే

నావటిలం బొనర్చెద నహర్నిశముం దినఁ జాలినన్ని నా
నావసుధాసుపర్వసుతుఁ డాసతి మీఱక నిల్చె నచ్చొటన్.  155

ఆ. అంద యుండి లభ్య మాహారముగఁ గొని, తనియ దేవతాదితర్పణంబు
సలిపి కొనుచుఁ బ్రాణములును వేదంబులుఁ, జిక్కఁ బట్టి యుండె నొక్కముగిని.

ఉ. ఏఁడులు వో యథాప్రకృతి నెల్లజగంబు సువృష్టి గల్గుటం
బోడిమి నంది యున్నతఱిఁ బొట్టకు లేక తపించునాఁడు పో
నాడిన వౌట వేదములయం దిసుమంతయు నేని సంస్మృతిం
గూడమికిం గడు న్వగలఁ గూఱినచిత్తముఁతోడ బాడబుల్.  157

క. సారస్వతుఁ డనువిప్రకుమారుం డొక్కరుఁడు శ్రుతుల మన్నించు సమా
చారము విని యటకుం జని, కోరిరి నిగమములు తమకుఁ గోరిక యనుచున్.  158

తే. అతఁడు శిష్యత్వమును బొందుఁ డనుఁడు వారు, నీవు బాలుఁడ వే మెట్లునీకుశిష్య
తావిధి వెలార్తు మనుడు నత్తాపసాత్మ,సంభవుం డను మఱియు నానయములకు  159

ఉ. ధర్మవిరోధముం గలుగుదారి మెలంగుటకే నొడంబడన్
ధర్మము దప్పి చెప్పటలు దాని గ్రహించుటలుక్ గణింప దు
ష్కర్మము నాచరించినప్రకారమునక్ దురితప్రదంబులై
నిర్మలతం దొలంచియును నిత్యవిరోధము లెంచు వారికిన్.  160

తే. ఏండ్లు సెల్లుట వెండ్రుక లెంతయేని, నరయుటయు విత్త మధికంబు పరఁగుటయును
జుట్టు మగుటయు వృద్ధత్వసూచకములు, గా వనూచారుఁ డే వృద్ధుగా నెఱుఁగుఁడు.

వ. అనిన నావచ్చినయఱువదివేవురు భూదేవు లాసారస్వతుండు బాలుండయ్యును వాని
కంతేవాసులై దర్భముష్టులం దెచ్చి సుఖాసనంబు గల్పించి వానితోడ వేదాధ్య
యనంబు గావించి ధర్మంబు ప్రతిష్ఠించి రిది సారస్వతతీర్థవృత్తాంతం బందు రోహి
ణేయుండు కృతకృత్యుండై వృద్ధకన్యాశ్రమంబునకుం బోయె నందు.  162

సీ. కుణిగర్గుఁ డనుమునికుంజరుండు మహాత, పస్వియై తనతపఃప్రతిభవలన
మనమునం దలఁచినంతన యొక్కకన్నియఁ, బుట్టించి పెంచుచుఁ ముదము గాంచి
యించుకలో మేఁ ద్యజించి స్వర్గమునకుఁ, దగ నిర్గమించె నత్తలిరుఁబోఁడి
తన కనురూపవరునిఁ గాన కుద్వాహ, మును మాని తప మూని భూరినిష్ఠ

తే. వ్రతము లుపవాసములు దేవపితృసమర్చ, లాచరించుచు నిర్జన మగునరణ్య
మందు నివసించి సుకృశాంగి యగుచుఁ బెద్ద, కాల మేగించె వృద్ధయై కదల లేక.

ఉత్సాహము. అడుగు దీసి యడుగు వెట్టనంత కేని నేర క

ప్పడఁతి యొడలు వాసి పరమపదము వాసి నొందఁ గా
నెడఁ దలంచునంత సురమునీంద్రుఁ డేగుదెంచి నీ
కడరఁ బోదు పుణ్యలోక మతివ! కన్య వగుటచేన్. 164

వ. అని యాదేశించి చనుటయు నవ్వృద్ధాంగనఁ దనతపంబునం దర్థం బుంకువగా నొసంగుదు నని చెప్పి యొప్పించి గాలవపుత్త్రుం డగు ప్రాక్శృంగవంతుం డనువాని వరించె నతం డేకరాత్రసహవాసంబు సమయంబు చేసి యుంకువం గ్రహించి విధిదృష్టవిధానంబున వృద్ధాపాణిగ్రహణం బొనర్చి యుద్వాహంబు గావించుకొనియె నారాత్రి. 165

చ. తనదుతపఃప్రభావమునఁ దన్వి మనోహరరూపసంపదం
బొనరి వినూత్నయౌవనసముజ్జ్వలమూర్తియు సౌకుమార్యసం
జనితవిలాసయుక్ విధృతచారువిభూషణవస్త్రదామ యై
మనసిజరాజ్యలక్ష్మి యనుమాడ్కి గనుంగొన నయ్యె నయ్యెడన్. 166

క. గాలవియు నవ్విలాసినిఁ, బోలం గని ప్రీతుఁ డగుచుఁ బువ్వుంబోడిన్
లాలించి కేళిఁ దేలెం, గాలం బొక్కింతలోన కడచనియె నృపా. 167

వ. మఱునాఁ డరుణోదయంబున నవ్వరవర్ణిని వానిం గాంచి యి ట్లనియె. 168

క. ఒకరేయి నీదుపాలన్, సుకముఁడగ నమయ మీవ చొనిపితి వయ్యెన్
సుకుమారమూర్తి నే నిఁక, సుకృతగతిం బోవుదాన శుభ మగు నీకున్. 169

వ. అని బయలు వెడలి యాతీర్థంబున దేవర్షిపితృతర్పణంబు చేసి యొక్కరే యున్నవాఁ డఱువదినాలుగు వత్సరంబులు బ్రహ్మచర్యవ్రతం బాచరించినఫలం బందం గలఁడని వరం బనుగ్రహించి దేహంబు త్యజించి త్రిదివంబునకుం జనియెఁ బ్రాక్శృంగవంతుండును గాంతకై సంతాపించుచుఁ దత్తీర్థమహిమంబునం జేసి తానును మేను వాసి దాని ననుసరించె నిది వృద్ధకన్యాచరిత్రంబు సంకర్షణుం డత్తీర్థంబున స్నానదానాదు లొనరించి సంగ్రామంబున శల్యుండు పాండవులచేతం ద్రెళ్ళుట విని సమీపంబున నున్న శమంతపంచకంబునకుం జని యందలిమునులఁ గురుక్షేత్రప్రభావం బడిగిన వా రీసమంతపంచకంబు ప్రజాపతియుత్తరవేది యని యు నిందు నింద్రాదిబృందారకు లుత్తమసత్రంబులు గావించి రనియు మున్ను కురుం డనురాజు బహువర్షంబులు దీనిం దున్నినకారణంబునఁ గురుక్షేత్ర మయ్యె ననియుం జెప్పిన నప్పురుషవరేణ్యుండు తద్వృత్తాంతంబు చెప్పఁ డనిన నప్పరమమును లి ట్లనిరి. 170

—కురుక్షేత్రవృత్తాంతము—

సీ. కురురాజు నాఁగేలు గొని దున్నుచుండంగ, నింద్రుండు వచ్చి యి ట్లేటి కనియె
ననిన నాతం డిందుఁ దను వీఁగినట్టిరు, సుకృతలోకంబులు చూఱలాడ
నొనరింతు నని చెప్ప విని నవ్వి యవ్వాసవుం డేగె దివికిఁ గురుండు లోన
నిర్వేద మొందక నేల దున్నుచునుండె, మఱియు మఱియు వచ్చి మరుదధీశుఁ
తే. డడిగి పరిహాస మొనరించి యరుగుచుండె, నృపతి విముఖుఁడు గాక ట్లు నిష్ఠఁ జేసి
కర్షణ మొనర్చుచుండె నక్కాలమందుఁ, దెలిపెఁ దచ్చికీర్షితము వేల్పులకు వజ్రి. 171

క. వా రనిరి దేవ! యాభూధరుని వాంఛితము దీర్పఁ దలఁపుము కాదే
ధారుణి మానవులెల్ల శరీరం బటుఁ బాసి వత్తు రే కద దివికిన్. 172

క. క్రతువులు వేల్వమి మనకుం, గ్రతుభుజుల కుపాధు లుడుగుఁ గావున నింకన్
మతి వచ్చినట్లు సేయుము, శతమన్యూ! నా నతండు సదయహృదయుఁడై. 173

వ. ఆరాజర్షి చెంగటికిం జని యిట్లనియె. 174

ఉ. ఖేదము మాను మోయి నృపకేసరి నీసరివారు లేరు నీ
వాదిన రేద్రచంద్రులకు నౌదలఁ దాల్పఁగ నైనవాఁడ వే
మూదల సేయుచుంటి నిటఁ జోరులఁ గీడిన వా రుపాసముల్
కాదన కాచరించి మృతిఁ గాంచినవారును గాంత్రు సద్గతిన్. 175

వ. అని వాని నొప్పించి యప్పాకశాసనుండు సపరివారుండై నాకలోకంబునకుం జని
యె బ్రహ్మాదులు నవ్వరం బనుమోదించిరి. 176

సీ. బలభద్ర! వినుము భూతలమందు నీకుకుక్షేత్రమ్ము కంటె వాసిం జెలంగు
క్షేత్ర మొక్కఁడు లేదు చెప్పితి మిచ్చటఁ, దపముండి మే న్వాసి తరలువాఁడు
బ్రహ్మక్షయం బంది పరఁగు నిందలిదాన, మక్షయం బగును సహస్రగుణిత
మగుచు నిందు వసించునందఱు యమలోక, మెప్పుడేఁ జూడక యొప్పుచుండు
తే. రిచట యాగము లొనరించి యేగి దివికి, నేలఁ గలయంత కాలము లీల నుంద్రు
దూళిమైఁ దూలె నే నిందు దోషి యైన, నమరుఁ డగు నని మునీంద్రుఁ డానతిచ్చె.

వ. ఇందు సురసత్తములు బ్రాహ్మణోత్తములు నృగుప్రముఖు లగునరదేవముఖ్యులును
నానావిధాధ్వరంబు లొనరించి సుగతిం గాంచిరి తరంతుకారంతుకములకును రామ
హ్రదంబులకును భచక్రంబునకును నంతరం బైనయిక్కురుక్షేత్రంబు స్యమంతపంచ
కంబు నాఁబడు నని విని మనంబున హర్షించుచు సంకర్షణుండు స్నానదానాదు
లొనరించి సంచరించుచు నట నొక్కచో మధూకామ్రప్లక్షన్యగ్రోధబిల్వ పనసార్జు

సవనోపేతం బగునొక్కపుణ్యాశ్రమంబుఁ గాంచి యిది యెవ్వరి దని తన వెన్నుఁ దన్ని యున్న మునీంద్రుల నడిగి పూర్వకాలంబునం బురుషోత్తముం డుత్తమతపంబు గావించి సనాతనంబు లగుసవనంబు లాచరించుటం జేసి పుణ్యప్రదం బైనయిందు శాండిల్యమునీంద్రునికూఁతురు కౌమారబ్రహ్మచారిణి యై యోగమహిమంబునఁ దపస్సిద్ధిం గాంచి త్రిదివంబునకుం జనియె నని యెఱింగి తా నంత సంధ్యాకార్యం బులం దీర్చి నాతిదూరంబున నున్నప్లక్షప్రస్రవణం బను పర్వతంబున నధిరోహించి కారవపనతీర్థంబునకుం జని జలం బాడి దేవర్షిపితృతర్పణం బాచరించి యొక్కరే యక్కడ నివసించి యింద్రచంద్రదినేంద్రాగ్నుల కానందజనకం బైనమిత్రావరుణాశ్రమంబునకుం బోయి విశ్రమించి పుణ్యకథాశ్రవణంబు సేయుచుండె నాసమయంబున. 178

తరువోజ. ఘనజటామండలకలితశీర్షుండు కాషాయచీరాదికల్పితాంగుండు
కనకదండధరుండు కమనీయరత్నఘటితకమండలుకరకమలుండు
ఘనుఁ డుత్తరుఁడు నృత్తగానశిక్షితుఁడు కలహాశనుఁడు తన కచ్ఛపి మీటు
కొనుచు శ్రుతుల కింపు గూడంగఁ బాడుకొనుచు నచ్చోటునకు న్వచ్చె నచ్చ. 179

చ. యదువరుఁ డమ్మహామునికి నల్లనఁ దా నెదురేగి తెచ్చి య
ప్పదమున నిల్పి యర్ఘ్యమును బాద్యము నిచ్చి సపర్యల న్ముదం
బెదఁ బొదలంగఁ జేసి యొకయించుక కాలము విశ్రమించున
ప్పిదప వచించె నల్లకురువీరులపో రది యెల్లఁ దెల్లఁగన్. 180

క. వినవలతుఁ జెప్పవే యన, మునిచంద్రుఁడు బలునిదిక్కు మొగ మయి సర్వా
బు నివృత్తం బనుచుం బెద,విని విఱుచుచు సంగ్రహించి వినిచె న్మరలన్. 181

వ బలదేవా! విను మక్కురుపాండవయుద్ధంబునఁ గౌరవబలంబునఁ గృపకృతవర్మాశ్వత్థామలు మువ్వురు తక్కఁ దక్కినభీష్మద్రోణకర్ణశల్యాదు లెల్లం దెగిరి దుర్యోధనుండు దుఃఖితుండై ద్వైపాయనహ్రదంబునం డాగి యుండఁ బాండవు లట వచ్చి వాగాయుధంబుల నొప్పించిన నప్పురుషుండు గదాపాణియై హ్రదంబు వెలువడి వచ్చి భీమసేనునితో నిప్పుడు పోర నుండె నని చెప్పి. 182

ఉ. వారికిఁ బోరు ఘోర మయి వర్ధిల నున్నది నీకు శిష్యు ల
వ్వీరులపోరు సూడ మది వెట్టినవాఁడవ యేని సత్వరం
బారణభూమి కేగుము ముదావహ మయ్యెడు నేడు నావుడున్
నారదవాక్యము న్విని జనార్దనుదగ్రజుఁ డగ్రజన్ములన్. 183

వ. సముచితప్రకారంబున నామంత్రణంబు చేసి యనుచరుల నెల్ల ద్వారావతి కంపిపు
చ్చి శిలోచ్చయంబు డిగ్గి సరస్వతిం దిలకించి. 184

రగడ. దురితము లన్నియుఁ ద్రోచు సరస్వతి పరమసుఖం బలవఱ్చు సరస్వతి
గురుతరదుఃఖము గూల్చు సరస్వతి నిరతము పుణ్యము నిల్చు సరస్వతి
సురలు వసించెడు చోటు సరస్వతి వరమునితల్లజవంద్య సరస్వతి
స్థిరగుణకల్పిత తీర్థ సరస్వతి సురుచిరవాగ్విధిసూతి సరస్వతి. 185

చ. సకలసరస్వతీసుకృతసారసమంచిత సర్వలక్షణ
ప్రకటితదివ్యతీర్థపరిభర్త్సితభక్తజనోగ్రదుష్కృత
ప్రకర సరస్వతిం గనినవారి కవారిగ నూర్ధ్వభూములన్
సుఖము లభించు నెన్నఁటికి స్రుక్కని తక్కని ప్రక్రమంబునన్. 186

క. అని మాటి మాటి కన్నదిఁ, గనుచున్ బలరాముఁ డెక్కె కనకరథంబున్
మును నేఁ జెప్పినచొప్పునఁ, జనుదెంచె హ్రదంబుకడకు సమరదిదృక్షన్. 187

వ. అప్పుడు బలదేవుండు శిష్యుల యుద్ధంబు సూడ వచ్చె నని చెప్పిన విని ధృతరాష్ట్రుండు
సంజయు దిక్కు మొగం బై. 188

క. సన్నిహితుం డగురాముఁడు, గన్నంగనఁ గాంచి నాకుకన్నకొమారుం
డన్నాలిభీము మార్కొని, యెన్నఁటి యుద్ధం బొనర్చె నెఱిఁగింపఁ గదే. 189

చ. అనవుడు సంజయుం డనియె నాబలరామునిరాకఁ జూచి నీ
తనయుఁడు సంతసించుచు నుదారగతిం గదనం బొనర్ప నె
మ్మనమున నెంచుచుండె నపమానితుఁ డబ్బలి యప్డు ధర్మపు
త్రునిఁ గని ఘోరలోకపరితోషకరంబుగఁ బల్కె వాక్యమున్. 190

—బలరామసహితులై యెల్లరు మడుఁగు విడిచి శౌలికలనికిఁ బోవుట—

తే. పరమపావన ముక్తిసుపదము పుణ్యదము కురుక్షేత్ర మటఁ బోరి తనువు విడుచు
జనుల కుత్తమగతు లవశ్యముగ వచ్చుఁ, గాన నటఁ బోయి పోరుట కార్య మనఘ.

మ. అనినం ధర్మజుఁ డట్ల కాక యనుచున్ వ్యాహారముం జేయ నీ
తనయుం డంసమునం దమర్చుకొని ప్రోద్దామప్రభాంచద్గదం
జనియెన్ సంగరకేళిఁ దేలుటకు నిచ్చం జేసి మత్తద్విపం
బనుమాడ్కి న్నడయాడుచున్ జదల మే లంచున్ సుర ల్మెచ్చఁగన్. 192

తే. రామకృష్ణులు పాండవుల్ రాజునయును, భూరివాదిత్రములు ధాత్రి పూరటిల్ల
సింహనాదము లొండొండఁ జేసి కొనుచు, ధార్తరాష్ట్రుని వెన్నంటి తరలి చనిరి.

వ. ఇట్లెల్లరుఁ బ్రతీచీముఖులై చని యల్లంతదవ్వుల సరస్వతీదక్షిణతీరంబునందలి కురుక్షేత్రంబు నంటియున్న యఱిఘృణ మ్మను ప్రదేశమ్మున విశ్రమించి యున్నంత. 194

తే. కనకవర్మ శిరస్త్రాణ కలితదేహు, లున్నతగదాయుధోచ్చలదుగ్రభుజులు
భీమసేనదుర్యోధనుల్ భీమబలులు, మేరుమందరములు నాఁగ మెఱసి రపుడు. 195

మ. మదమాతంగము లట్లు వా రిరువురున్ మట్టాడుచుం బెట్టుగన్
గదలం ద్రిప్పుచు నిప్పుకల్ గురియుచుం గందోయి నొండొక్కనిం
దుద ముట్టించెడు నాఁగఁ జూచుకొనుచుం దూఁగాడుచుం గిన్కమైఁ
బెదవుల్ నాకుచు నూర్చుచుం బిలుచుచుం బెల్లార్చి రొక్కుమ్మడిన్. 196

వ. మఱియు నయ్యన్నదమ్ములు సుందోపసుందులచందంబునను వాలిసుగ్రీవులపోలికను వృత్రవాసవులవాసిని రామరావణులతేవను మధుకైటభులక్రమంబునను గయ్యంబునకుఁ గట్టాయితంబై వృషభంబులవలె ఱంకె లిడుచు భుజంగంబు లట్లు క్రోధవిషంబు గ్రక్కుచు నేనుంగులతెఱంగున ఘీంకరించుచు సింగంబులభంగి బొబ్బరించుచు నార్చుచుం బేర్చుచు గదాదండంబులం ద్రిప్పి యాడించుచుఁ గాలసూర్యులగతిఁ బ్రళయాగ్నులలీలఁ గల్పాంతకాలమృత్యువులమచ్చున నచ్చోటం గన్పట్టి రట్టియెడఁ గౌరవాగ్రజుండు పాండవాగ్రజుం బిలిచి రామకృష్ణులును దక్కనుం గలరాజలోకంబును విన గంభీరస్వనంబున ని ట్లనియె. 197

క. ఇక్కరణి నాకు భీమున, కెక్కుడిపో రెనఁగు మీర లిందఱు నిచటం
జక్కనయి కూరుచుండియు, మక్కువ నీక్షింత్రు గాక మాభుజబలమున్. 198

వ. అనిన నాఁ గాత మని యెల్లరు నల్లంత దవ్వులం దాసీను లైరి వారిమధ్యంబున నీలాంబరుండు తారకాసహస్రమధ్యంబున మృగాంకుండునుం బోలె విరాజిల్లుచుండె నప్పుడు భీమదుర్యోధను లొండొరులఁ గొండొకవడిఁ బరిహాసించుకొని రనిన ధృతరాష్ట్రుండు దుఃఖసమన్వితుండై సంజయునివంక మోము ద్రిప్పి. 199

తే. అకట సంజయ ! యేమందు నవనిజనుల, యత్న మంతయు వ్యర్థమై యరుగుఁ గాదె
పదియు నొకఁ డైనమూఁకలు బలసి కొలువ, సకలనృపతులుతనపంపు సలుప నొప్పి.

చ. సుకలుండై సకలాబ్ధిమేఖలకు నీశుం డై ప్రజాపాలనో
త్సుకుఁడై ప్రస్తుతి గన్ననాకొడు కనాథుం డట్లు నేఁ డిట్లు తా
నొకరుండై గద చేతఁ బూని యని కుద్యోగించుచుం గాల్నడ
న్వికలస్వాంతత నేగు నా వినుటకంటెన్ దుఃఖ మొం డుండునే. 201

వ. ఇది యంతయు నామురదృష్టం బని పలికి యూరకున్నంత సంజయుండు వెండియు.

క. ఆకర్ణింపుము నీకొడు, కాకరణిన్ సమరభూమి కరిగి మహోల్లా
సాకలితమూర్తి యగుచుం, జేకొని గద యనికి భీమసేనుం బిలిచెన్. 203

వ. అ ట్లాఁబోతురీతి వార్చుచుం బిలుచుచున్నసమయంబున. 204

మ. సహానిర్ఘాతము లైనవాతము లు వీచెన్ శర్కరావర్షముల్
బహులధ్వాంతసమన్వితాశ మయి పర్వ న్వీచె సాహార్య మై
మహి గంపించె మహోల్క లెల్లెడల భీమప్రక్రియన్ రాలె వి
గ్రహశూన్యంబుగ ఘోరనాద మొదవెం గ్రవ్యాదనాదార్భటిన్. 205

క. అపపర్వ మైనరాహువు, సుపరిస్థితిఁ గదిసి పట్టె సూర్యు వఱఁకు ల
త్యపరిమితంబుగ నఱచె, న్విపరీతము గాఁగఁ దోఁచె వివిధాశుభముల్. 206

వ. అయ్యవసరంబున భీమసేనుండు యుధిష్ఠిరుం గాంచి యి ట్లనియె. 207

—భీమసేనుండు దుర్యోధనుని గర్హించి పలుకుట—

శా. మందాత్ముం డగునీసుయోధనుఁడు నన్ మార్కొ సమర్థుండు గాఁ
డిందుం జూచినవీఁ డలంతి యనియే యెంతు న్మహీకాంత! నా
స్వాంతం బందు నిగూఢమై మెఱయు బాధామర్షము న్వీనిపైఁ
బొందన్ ఖాండవమందు నగ్నినిబలెం బొంగారగాఁ బోయుదున్. 208

ఉ. ఇప్పుడ నాగదాహతుల నీదురితాత్ముని మేను భిన్నమై
తెప్పునఁ దేలిపోఁ దునిమి దేవరహృద్గత మైనశల్యముం
దప్పక పుచ్చివైచి యఱుతం దగిలించెదఁ గీర్తిమాలికల్
చెప్పితి విశ్వసింపు మిఁక లేదు సుయోధనుఁ డిజ్జగంబునన్. 209

సీ. విషమును బెట్టించి విషధరంబులఁ గఱపించి మున్నీటఁ ద్రోయించి నొంచి
జతుగృహంబునఁ గాల్చి సతిపుట్టముల నొల్చి, కొలువునఁ బరిహాసముల నొనర్చి
వనవాస మజ్ఞాతవాసంబు గావింపఁ, బంచి యెంతేని కాఱించి మించి
దుష్టుఁడై యున్నయీదుర్యోధనునికారణమ్మున నైనదుఃఖమ్ము లెల్ల

తే. నంత మొందింపఁ గంటి నీయధముమనికి, ముగియు నీనాఁటితో వీని పొడ వడంచి
యే ఋణవిముక్తుఁ డయ్యెద నింక వీఁడు, జనని జనకుని సతిఁ జూడఁ జనఁడు నిజము.

క. సిరియును రాజ్యము నసు రొకపరి విడిచి ధరిత్రిఁ గూలి పడినకుమారుం
గురుపతి విని తనచేసినదురితము స్మరియించుఁ గాక దుఃఖార్తుండై. 211

వ. అని పలికి పవమాననందనుండు దుర్యోధనుదిక్కు మొగం బై. 212

ఉ. నీవును నీమతంత్రియు ననింద్యచరిత్రులు పాండుపుత్రకుల్

జీవన మీఁగి పోవుటకుఁ జేసినచేత లవెల్లఁ దెల్లఁగా
భావన చేసికోఁ దెలియ వచ్చుచు నుండెను దుశ్చరిత్ర! నా
దైవముచేతఁ గంటి నినుఁ దత్ఫల మెల్ల భుజింతు విత్తఱిన్. 213

క. నీకతనఁ గూలె భీష్ముఁడు, నీకతనన్ ద్రోణముఖులు నీయనుజన్ముల్
నీ కగువా రందఱునుం, బోకాడిరి నీకు నిలువఁ బోలునె చెపుమా. 214

తే. ఈవు నాబాఱి కగ్గమై యిపుడ నిన్ను, మాఱుకొని మగ్గడాహాతి మహినిఁ గూల్తు
నెందుఁ బోయెద వింక ర మ్మిదిగొ కాల,దండ మనునంత ధార్తరాష్ట్రుండు గనలి.

క. పలుఁదెఱఁగుల కత్థనములు, పలుకంగా నేల నోట పచ్చినయట్లో
తులుఁ! మోయిలావు గలిగినఁ, గలనం జూపంగ రాదె కల నే నెదరన్. 216

ఉ. వాఁడును వీఁడుబోలె నినువంటిన రాధసుఁ డాడుమాటలం
బోడిమి వీటిఁబుచ్చి వెఱఁ బోఁడు సుయోధనుఁ డెంత వచ్చినే
నోడఁడు నేఁడు నిరగుసమున్నతి యంతము నొందున ట్లనిం
గ్రీడ యొనర్చు నోర్చు నిను గ్రిందను మీఁదను గా కెమర్చుమా. 217

క. నీతోడ గదాయుద్ధము, చేతకు నే నభిలషింతుఁ జిర కాలము గా
నీతఱి నాహ్వాదగా నగు,ప్రీతిన్ ఫలియింపఁ జేసె విధిబల మహహా. 218

స్రగ్ధర. వాచాలుం బోలి నీ వీవరుస వచనముల్ వల్కఁగాఁ బోవ కింకన్
నిచత్వం బిట్టి చెయ్విన్ నెగడెడు గుదెతో నీకు మాఱొడ్డి పోరన్
నాచిత్తం బిచ్చగించున్ నడచెఁ గడుసమల్ నాఁటి కీనాఁడు పుణ్య
ప్రాచుర్యప్రాప్తి కయ్యెం బలుకుల కనురూపంబుగాఁ జేయు మాజిన్. 219

మ. అని నిర్భీకుఁడు నీకుమారుఁడు వడిన్ వ్యాహారముం జేయుచో
విని మేల్మే లని సోమకాదినృపతుల్ వేభంగుల న్మెచ్చుచున్
ఘనహర్షధ్వనులం బొనర్చి రపు డాకౌరవ్యుఁ డుప్పొంగుచున్
గొని చేతం గద పోరి కాయితపడెం గోపంబు దీపింపఁగన్. 220

క. గుదెదాల్చు నాఁగ భీముఁడు, గద చేతం ద్రిప్పుకొనుచుఁ గట్టాయితమై
కదిసి తలపడియె వారికిఁ, గదనము సమకూరె నపుడుఁ గడుభీకరమై. 221

వ. అయ్యవసరంబున సామజబృంహితంబులును హయహేషితంబులును దివ్యాయుధ
ప్రదీపనంబును బాండవజయంబు సూచించె నట్లు తలపడిన భీముం గాంచి నీసూనుం
డార్చుచు నెదిర్చి పేర్చుటయు నంత. 222

—భీమసేనదుర్యోధనుల గదాయుద్ధము—

తే. ఘనగదాదండమండితకరులు వారు, శృంగవంతము లైనగోవృషము లట్లు
దాఁకి పోరాడి రప్పుడు దారుణ మయి, పొలిచెఁ బ్రహ్లాదశక్రులపోరుఁ బోలి. 223

మ. వార లొకళ్ళొకళ్ళ మెయి గాఢగదాహతి నొవ్వఁ జేయుచుం
బోరెడువేళ నిర్వురును బూచినమోదుగ లట్లు రక్తసి
క్తారుణగాత్రులై నభమునం దగువారల కబ్బురంబు రా
నారయ నైరి బీర మటు లాకృతిఁ దాల్చి పొల్చెనో యనన్. 224

ఆ. పెనఁగి పెనఁగి యిర్వురును బరిశ్రాంతులై, సేద దేఱి కొంత సేపు నిలిచి
మఱియు వాసితార్థ మఱిమిన మత్తేభ,యుగ్మ మట్టు లఱిమి రొక్కమొగిన. 225

క. అంతర మరయుచు నొండొరు, లంతర మింతయును లేనియట్లని సేయన్
స్వాంతమున భూతకోటికి, వింతయు సందియము నయ్యె విజయము పట్లన్. 226

ఉ. కొండలు రెండు తాఁకి కడుఁ గూలినయట్టులు తద్గదాద్వయం
బొండొకదానిపైఁ బడ మహోగ్రరవం బుదయించి యెల్లెడన్
నిండికొనెన్ నభంబుపయి నీరదముల్ కనరాక యుండియున్
మెండుగఁ బిట్టపిడ్గు లొగి మేదినిపైఁ బడునట్లు పెట్టుగన్. 227

తే. ప్రహరి దిరుగుచుఁ బేరెముల్ వాఱుకొనుచు, మండలంబులు గట్టుచు మఱియు వివిధ
మార్గముల మెట్టుచున్ వారు మచ్చరించి, రెఱచికై పోరుపిల్లుల తెఱఁగు దోఁప.

వ. ఇట్లు భీమసేనదుర్యోధను లాగత ప్రత్యాగత మండలాదిపరిభ్రమణంబుల గదాప్ర
హారంబులం జేసికొనుచుం దప్పించుకొనుచు నావంతేనికొఱంత లేనిచందంబునం
బొందుపడి క్రందుకయ్యంబు సేయుచుం డాసియుఁ బాసియు రోసియు నేసియుఁ
బొడిచియు విడిచియుఁ జుట్టియు ముట్టియు నెదిరించియు బెదరించియు నాగ్రహించి
యు నిగ్రహించియుఁ దొలంగియు మలంగియు నార్చియుఁ బేర్చియు నొక్కొకళ్ళ
నొప్పించుకొనుచు నొకండు వలపలించిన నింకొకండు దాపలించుచు దాపలించిన
వలపలించుచుఁ బొంచి వంచించుచుఁ గత్తళంబులు సించుచు సుత్రామవృత్రులతెఱం
గునం బెనంగుచున్నంత దుర్యోధనుండు. 229

చ. వడముడిపార్శ్వదేశమున గాఢహతి న్నొగిలింప నాతఁడు
క్కుడుజవనంబునం బొదలి కోపులు సూపుచుఁ జూపఁ దెన్న నీ
కొడుకుగదాగ్రభాగమునకుం దగులన్ గద ద్రిప్పి వేసినన్
మిడుఁగురులున్ మహాధ్వనియు మిన్నును మన్నును నిండె మెండుగన్. 230

తే. కనలి దుర్యోధనుఁడు తనగదను బట్టి, గిరగిరం ద్రిప్పుచుం బెట్టు కెరలువోడిచేఁ
జండమారుత మగ్గదాదండవిభ్రమమునఁ బొడకట్టెఁ బార్థులమది చలింప. **231**

సీ. కొమ్ములం గోరాడుకుంజరంబులరీతి, వా రట్లు గుదెలతోఁ బోరునంతఁ
గౌంతేయు నెక్కుమైఁ గౌరవ్యుఁ డతిమిన, నాతఁ డాతని గద నట్టె కొట్టె
నవని గంపింపఁగా నది పడుటయు వెండిఁ, గొని క్రోధరసము గ్రక్కుచు నతండు
దాపలించుచు వాయుతనయునిశిరముపై, నేయుటయు నతఁ డొకింత యేని

తే. కదల కుగ్రుండు నా నొప్పి గద నడంచె, దానిఁ దప్పించుకొనిసుయోధనుఁడు గాడ్పు
పట్టిచే గద నేలపైఁ బడఁగఁ గొట్టి, భీమసేనునివక్షము బిట్టు మోఁదె. **232**

తే. మేటిపాటున నొక్కింత మేను పుఱచి, నిగిడి కర్తవ్య మెఱుఁగక నిలిచియున్న
గాలిపట్టినిఁ గాంచి పాంచాలపాండుసైనికులు తల్లడిల్లి రాక్షణమునందు. **233**

తరళము. సిడులు సూపినసింధురం బను చెల్వునం గడు నల్గి పె
ల్లడరి కాననమందు సింహము హస్తినిం బలె డాసి నీ
కొడుకు పార్శ్వమునందు బెట్టుగఁ గొట్టుచుం గడు సోలుచుం
బుడమి మోకరిలంబడెం గని పొంగి యార్చిరి పాండవుల్. **234**

ఉ. ఆయలి వాలకించి భవదాత్మభవుం డపు డుగ్రమూర్తియై
పాయనికిన్కఁ బన్నగము భాతిఁ గడుం గడు రోఁజుచుం గనుం
దోయి మిడుంగుఱుల్ పడఁ గనుంగొనుచుం గద నెత్తి నెత్తిపై
వ్రేయఁ దలంచియు౯ విసరి వ్రేసె వృకోదరుశంఖదేశము౯. **235**

చ. మదగజ మట్లు నెత్తురుల మానధనుండు వృకోదరుండు పె౯
గదఁ గొని విక్రమించి సరగ౯ భవదాత్మజుమీఁద నేయుడు౯
వదనదలాడి ఱేఁడు మెయి వాఁడి చెడ న్నుమితావనీజ మ
ట్లదరుచు వ్రాలె నేల కతిహర్షమునం జని రెల్లపాండవుల్. **236**

ఆ. కొంతవడికిఁ దెలిసి కురురాజు రోఁజుచు మడుగు వెడలి వచ్చుమదగజంబు
కరణి లేచి వచ్చి కడుక్రోధమునఁ జేసి, భీమసేను డాసి బిట్టడంచె. **237**

వ. దానం జేసి యతండు విహ్వలాంగుండై గహ్వరీతలంబునం బడుటయు సింహనాదం
బు సేయుచు సుయోధనుండు గండుమిగిలి గదాదండంబున వానివర్మంబు వగిలించి
మించినం గని దేవళ్ళు హాహాకారంబు సేయుచు నంతరిక్షంబుననుండి పుష్పవర్షంబు
గురిసి రట్లు భీమసేనుండు ద్రెళ్ళుటకుఁ బాండవులు భీతిల్లుచుండి రంతఁ గొంతసేప
టికిఁ హిడింబాంతకుండు సొమ్మ దేరి నెమ్మొగంబు దుడుచుకొనుచు ధైర్యంబు

దెచ్చుకొని పెచ్చు పెఱిఁగిన శౌర్యంబున నలుగడం గలయఁ బరికించి దుర్యోధనుం
దలపడియె నవ్వు డప్పాకశాసనాత్మజుండు వసుదేవాత్మజుం దిలకించి వీరిలో నెవ్వఁ
డధికుండు చెప్పుమనిన నప్పుండరీకాక్షుండు. 238

— శ్రీకృష్ణుం డర్జునునితో భీమదుర్యోధనులతారతమ్యము చెప్పుట —

సీ. ఉపదేశ మిర్వుర కొకరూపమై నను, భీముఁడు బలమునం బెద్ద యగును
గౌరవ్యుఁ డధికుండు కౌశలంబున మేని,బలముకన్నను బుద్ధిబలము పెద్ద
మనవృకోదరుఁడు ధర్మమున వీని జయింప, నోపఁడు పెడదారి నోపు నోర్వ
వినుము మాయం గాదె వేల్పులు దైత్యుల, నిర్జించి రసురాధినేత తొల్లి
తే. వృత్రుని విరోచనునిఁ ద్రెళ్ళ నేసె మాయ, ననిలజుండును మాయామయమగువిక్ర
మమ్ము పూనంగవలయుఁ జూదమ్మునాఁడు,తొడలుతునిగింతుననుచుఁబూనఁడెప్రతిజ్ఞ.
చ. ప్రతినకుఁ బోల వీని నిటఁ బట్టి వధించుట లొప్పు నిప్పు డీ
క్షితిపతి మాయకాఁ డగుటఁ జెల్లును మాయఁ బొనర్ప నట్లు కా
కితఁడు నయంబునన్ గెలుతు నే నని యొంచుచునున్నఁ బాండురా
ట్సుతులకు దైన్యముం దొడరుచొ ప్పరుదెంచు నిజంబు చెప్పితిన్. 240
తే. తెలివి మాలినమీయన్న పలుకుబడిని,మనకు భయ మావహిల్లె నిమ్మాడ్కి-మఱియు
భీష్మముఖ్యులఁ గూల్చినపిదప జయము,యశమునుం బొంద నుండ నిట్లయ్యె నకట.
ఉ. ఒక్కని గెల్చి రాజ్యరమ నొందుము నీ వని పందె మాడెఁ దా
నక్కట ధర్మరా జతనియజ్ఞత కే మనువార మాజులం
దక్కడికాఁడు ప్రాణములు దాల్పఁ దలంపఁడు ధార్తరాష్ట్రుఁ డీ
చక్కినిఁ దెంపు చేసికొని సంగరముం బొనరించు నెంచఁగన్. 242
మత్త. ఇట్టివాని శతక్రతుం డగు నేని పోర నెదుర్పఁగా
దిట్ట గాఁ డని తొల్లి శుక్రుఁడు తేటతెల్లఁగఁ దెల్పె ని
ప్పట్టునం జెడి పాఱి పోయిన వాని ద్వంద్వరణంబు చే
పట్టు మంచును బిల్వవచ్చునె బైసిమాలిన షేనికిన్. 243
వ. ఈదుర్యోధనుండు పదుమూఁడేఁడులు పరిశ్రమంబు చేసి గదాయుద్ధంబు తెఱం గె
ఱింగి కుశలియై యున్నవాఁ డిపు డూర్ధ్వతిర్యగ్గతులం జరించుచు మాయోపాయంబున
మరున్నందను ప్రమందింప నున్నవాఁ డితండు నాచెప్పినట్లు చేయకున్నఁ దాను ని
హతుం డగుటయు మీకీధార్తరాష్ట్రుండు రా జగుటయుం దప్ప దని చెప్పిన విని
ధనంజయుండు వేగిరంపడి వృకోదరుండు చూచుచుండ నిజోరుతలంబు కరతలంబున

నప్పళించుటయు భీముండు గద చక్కఁగాఁ గొని గదాపాణియై దక్షిణోత్తరమండ
లంబుల గోమూత్రకచిత్రక్రమంబుల శత్రుమోహనంబు గావించుచుం బరిభ్రమించె
నీపుత్త్రుండును లాఘవంబు మెఱయఁ జిత్రత్వంబు నెఱయ భీమసేనజిఘాంసం జేసి
గదామార్గములం బ్రదర్శించుచుండె నిట్లు వా రిర్వురును సంతకద్వయంబు మాడ్కి
సముద్దండగదాదండంబులు ద్రిప్పుచు నామిషలోలుపంబు లగు గరుత్మంతులట్లు చిత్ర
మండలప్రచారంబుల నొండొరులం బ్రహరించుకొనుచు సంవర్తసమయజంఝూవా
తసంక్షోభితమహాసాగరంబుల చందంబున ఘూర్ణిల్లుచుఁ బెద్దయుఁ బ్రొద్దు పోరి యి
ద్దఱుం డస్సి ముహూర్తమాత్రం బూఱడిల్లి మరల మార్కొని యితరేతరగదా
ఘాతంబుల గాత్రంబులు చెక్కుఁ గొని పంకస్థితమహిషంబులరీతి రక్తసిక్తాంగులు
జర్ఝరితసర్వాంగులునై పుష్పితాశోకంబులవిధం బొలుపొంది రప్పుడు సుయో
ధనుండు. 244

శా. క్రేగంటం గని క్రీడిసన్న పగతుం గ్రేడించినన్ మోసమం
చీగం బోయినయట్లు వోయి రభసం బేరాళమై తోఁపఁ బై
రాఁగం గాంచి వృకోదరుండు గద పర్వం జేసె నయ్యంతలో
వేగ న్నీసుతుఁ డోసరిల్లె గద పృథ్విన్ వ్రాలె వ్యర్థంబనై. 245

చ. అది తఱిగా గ్రహించి భవదాత్మజుఁ డాపవమానసూనునిన్
గుఱిగొని మొత్తె మొత్తిన వృకోదరుఁ డత్తఱి మూర్ఛ మున్గియున్
గదలనివానిఁ బీడితునిఁ గాఁ దలపోయఁగ లేక నీసుతుం
డదవదయై తొలంగి చనె నత్తఱి మొత్తఁగఁ బోక వెండియున్ 246

—సుయోధనుండు భీముగదాభిఘాతమునఁ దొడలు విఱిగి పడుట.—

వ. అంతలో నాశ్వాసితుండై పృషదశ్వాత్మజుండు. 247

చ. వడివడి రాజరాజుపయిఁ బాఱి ప్రహారము సేయ నుండఁ గా
నడరి యతండు వాని నెటులైనను మోసము చేసి మోదఁ గా
నెడఁ దలపోసి పై కెగయ నెంచినఁ గాంచి బకాంతకుండు పెం
బొడుగుగ నార్చి పేర్చి పయిపోటున మీటుచు వేసె నాతనిన్. 248

ఉ. భీమగదాభిఘాతమునఁ బెందొడదోయి కడిందిభగ్నమై
భూమిపయిం బడెన్ భయదభూరివిరావముతో సుయోధనుం
డామెయిఁ గూలినప్పు డడఁకాడె ధరిత్రి సగోత్రవృత్తమై
వ్యోమమునుండి యుల్కలు మహోత్కటమై పడె నెల్లదిక్కులన్. 249

తే. వాయువులు వీచె వడిఁ బాంసువర్షరక్త,వర్షములను బర్జన్యుఁడు వఱలఁ జేసెఁ
జదల యక్షరక్షఃపిశాచములయులివు, పృథివి మృగపక్షిరుతమును బెల్లెసంగె. 250

శా. అంతర్యామిగతంబులుగ్ర బహుళబాహాదండదీప్తంబు ల
త్యంతస్థూలపదోదరంబులును ఘోరాకారము ల్గల్గి కా
ష్ఠాంతవ్యాప్తిగ నై కబంధములు నృత్యం బాడుచుం జూడ నై
కాంతల్ గానిభయప్రకంపములు గైకోఁ జేసె మర్త్యాళికిన్. 251

వ. ఇట్లనేకమహోత్పాతంబులు పుట్టినం గని పాండవపాంచాలసైనికులావేగంబు నొం
ది రంతరిక్షచరులు సయ్యద్భుతసమరప్రకారంబు చెప్పికొనుచు యథాగతంబుగం
జని రట్లు బూరువు గూలినట్లు నేలం గూలియున్న దుర్యోధనుం గాంచి పాంచాలపాం
డవులు సంతసించి రంతఁ గిమ్మీరాంతకుండు సుయోధను డాయం జని. 252

— భీముఁడు దుర్యోధనుని దిరస్కరించుట —

ఉ. ద్రౌపది నేకవస్త్ర నటు తోడ్కొని వచ్చి సభాస్థలంబునన్
గో వని గోలి చేసి కయికోక నుకుం బ్రహసించి తాఁకలం
భీవరునర్ లభించె నని యుద్ధి వడిం గడకాలఁ దన్నె నా
త్మీయవరు నుత్తమాంగమును గా దనుచుం దలపోయ కింతయున్. 253

వ. తన్ని యంతనిలువక కోపాటోపంబున. 254

క. ఆడుచుఁ బసు లని మము నో,నాడితి వపు డుల్లసంబు లాడుచు నిపు డే
మాడుదుఁ బసువా యని ని, న్నాడెద మానట్లు డీఱు న ట్లోమూర్ఖా. 255

క. కా దిది కపటద్యూతము, కా దనలము ముట్టఁ జేసి కాల్పించుటయుం
గాదు విషాన్నము నిక్కతియుఁ, గాదు భుజాబలజయంబు గాని దురాత్మా. 256

వ. అని పలికి వైరాంతంబు గాంచఁ గలిగితి నని సంతోషంబునఁ జిన్నినవ్వు నవ్వుచు
ధర్మరాజార్జుననకులసహదేవకృష్ణసాత్యకిపాంచాలప్రముఖులం గాంచి యిట్లనియె.

ఆ. చెఱఁగు మాయ నొంటిచీఱ గట్టిన సాధ్వి, సభకుఁ దెచ్చి గతవసన గఁ జేసి
నట్టి క్రూరు లెల్ల హతులైరి పాంచాలి,తపమువలనఁ జూడుఁ డిపుడు మీరు. 258

తే. పంక్తిలంబకు మముఁ బొల్చి పారె తెగడి,నట్టి ధృతరాష్ట్రజుల మేము సానుబంధ
ముగ వధించితి మిఁక మాకుఁ బుణ్యమైనఁ, బాపమైన సహించెద మోపి యుండి. 259

వ. అని కోపాటోపాతిశయంబున వెండియు గదాదండంబున ధరణీతలపతితుం డైనసు
యోధనుని కంఠం బదిమి పట్టి నట్టనం బాడుచు శిరంబు వామపాదంబున మరలఁ
దన్నిన ధర్మపరాయణు లగుసోమకాదులు దాని కిష్టపడకున్నంత ధర్మనందనుండు
మురుస్మందనుం గాంచి యిట్లనియె, 260

సీ. శుభకర్మముననో యశుభకర్మముననో ప్రతినరుఁ బోలం బగఁ దీర్చి పుచ్చి
ఋణవిముక్తుఁడ నైతి విఁక నూరకుండుము,హతుఁడు జ్ఞాతియు రాజు నైన వీని
గాలఁ దాఁచుట పాడి గాదు ధర్మాత్మక, మైనకృత్యము దగునయ్య నీకుఁ
గౌరవనాథుఁ డేకాదశాక్షౌహిణీపతి హతపరివారుఁ డితని కిపుడు
తే. వగవనగుఁ గాని దూరంగ నగునె మనకు, భ్రాత యుత్పన్నపిండుఁడు నీతని యెడఁ
జేయు నపచార మన్యాయమై యెసంగు,ధార్మికుం డనునీపేరు తగునె పోవ. 261
వ. అని చెప్పి యొప్పించి సాశ్రుకంఠుండును దీనుండు నై దుర్యోధనుం జేర నరిగి
యి ట్లనియె. 262

—ధర్మరాజు దుర్యోధను నూఱార్చుట.—

సీ. వత్స! దుర్యోధన! వగవకు మయ్య నీచిత్తంబునం గ్రోధ ముత్తరింపు
మనుభవించు జనుండు తనపూర్వకృతకర్మమున కనుగుణఫలంబులను విధిగ
నిన్ను మేమును మమ్ము నీవును జంప నౌ, టాత్మాపరాధనం ప్రాప్తమ సుమి
మదలోభములు బాల్యమత్సరంబులు నీకు,నింతలు వ్యసనముల్ సంతరించె
తే. భ్రాతల న్మిత్రులం బుత్రపౌత్రుల నిటు,చంపుకొంటివి తుద కీవు చచ్చి తకట
నీదు నపరాధమున మాకు నిఖిలబంధు,వర్గమును ద్రెళ్ళ నేయంగ వలసి వచ్చె. 263
క. దైవంబు గడవ నేరఁగ, నేవారికిఁ దరము గామి నెఱిఁగి నిజ మింకన్
నీ వాత్మశోచనంబునఁ, బోవకు నీమృతి నుతింపఁ బోలుం జుమ్మీ. 264
శా. శోచింపం దగువార మే మయితి మీచుట్టాలఁ గోల్పోయి శు
శ్రూషాచర్యంబునఁ గుందుతత్పతులు నొవ్వం బల్కఁ గా వించు నీ
నీచం బై నరకోపమం బగుధరణ జీవించి దుఃఖింతు మీ
వా చేసేత సుపర్వు లందుకొన సౌఖ్యం బందు దా స్వర్గతిన్. 265
వ. అని పలికి దుఃఖాయత్తచిత్తుం డై నిట్టూర్పు నిగిడించుచుండె ననిన విని ధృతరా
ష్ట్రుండు సంజయుదెస మొగంబు వెట్టి యి ట్లనియె. 266
మ. బలభద్రుండు ధరాతలంబున గదాభ్యామర్దమం దాఘ్యుఁ డం
దలిధర్మంబు లెఱుంగుఁ దెల్లముగ వాత్రపోద్భవుం డట్లు ధ
ర్మలఘుప్రక్రియ రాజరాజు వధియింపం గాంచి తా నేమి యేఁ
బలుకం జాలెనో మిన్నకుండెనో వచింపం బూను మోసంజయా. 267
ఉ. నావుడు సూతపుత్రుఁ డను నాలివృకోదరుఁ డట్లు కౌరవ
ష్మావరు నుత్తమాంగమును సవ్యపదంబునఁ దాఁచినంతఁ గ్రో

ధావిలమూర్తి యై బలవదగ్రసరుండు హలాయుధుండు దు
ర్భావముతోడ లేచి గరుపాఱఁగ నార్చుచు నూర్ధ్వబాహుఁ డై. 268

— బలరాముండు భీముని జంప నుంకింప శ్రీకృష్ణుండు శాంతింపఁజేయుట. —

శా. ఛీఛీ! భీముఁడ! నాభిక్రిందనడుచం జేవాఁడికిం జెల్లునే
నీచేతల్ దగు నాఁ దలంచితివె కాసీ యంచుఁ గన్నెత్తి యీ
నీచుం డిట్టులు ధర్మముం దొలఁచి నిర్నిద్రాభిమానంబునం
దాఁచెం జూచితిరే నృపాలు రని క్రోధజ్వాలలం దేలుచున్. 269

ఉ. లాంగల మట్టి చేకొని ప్రలంబవిపక్షుఁడు తత్క్షణం బ యు
త్తుంగమనశ్శిలానిచయ ధూర్వహరౌప్యనగంబు చాడ్పునన్
బొంగుచు భీమసేనుఁ దుద ముట్టఁగఁ జేయఁగ లంగ వేయుడుం
జెంగున వచ్చి యచ్యుతుఁడు చేతుల నాతనిఁ బట్టు గట్టిగన్. 270

క. వినయాన్వితుఁ డై కృష్ణుఁడు, తనచేతులు రెండు గ్రుచ్చి తద్దయు జతనం
బున నాగఁ బట్టె బలభద్రుని దంతిం దంతి వోలె దోర్బలశక్తిన్. 271

తే. శ్వేతనీలాంగు లగుయదువీరవరులు, సంజప్రొద్దగుతఱి నాకసమున యందు
వెలయుచున్నట్టిచంద్రసూర్యులవిధమునఁ, జూడఁగా నొప్పి రప్పుడు చూపఱకును.

వ. ఇట్లాగంబట్టి దేవకిపట్టి రోహిణిపట్టికిం గోపాటోపోపశమనంబు సేయుచు నిట్లనియె. 273

సీ. వినవయ్య తనవృద్ధియును మిత్రవృద్ధియు, మిత్రమిత్రునివృద్ధి శత్రుహాని
శత్రుమిత్రునిహాని శత్రుమిత్రునిమిత్రహానియు నభివృద్ధ యీ ద్విధములు
దీనికి విపరీత మగు నేని తనకు గ్లాని యగుఁ గావున శాంతి నెరపఁ నొప్పు
మనకు సహజమిత్రులును మేనయత్తపుత్రులు పరవంచితుల్ దెలియఁ బాగు
ఆ లిట్టి వీరివృద్ధియే మనవృద్ధికిఁ, గారణంబు గదవె కామపాల
సంతసిల్ల వలయు సమయంబునం దిట్లు, నీకు నలుక దగునె నెమ్మనమున. 274

మ. ప్రతినం దీర్చుట పాడి క్షత్రియునకున్ రాణ్మధ్యమం దీమరు
త్సుతుఁ డల్లప్డు సుయోధనోరుయుగమున్ ద్రుంతున్ గద నొంచియున్
ప్రతినం బట్టినవాఁడు గాన నిటు లొప్పం జేత దోషంబు గా
మతి నూహింపను మాను మీ వలుక రామా! నామనఃప్రీతిగన్. 275

ఆ. మఱియు వినుము మున్ను మైత్రేయుఁ డనుముని, భీముగదకు నితఁడు తొడలు విఱిగి
కూలు నని శపించె నేల వమ్మగు నది, దీని కింత కినుక మాను మన్న. 276

వ. అనిన సీరపాణి చక్రపాణి కి ట్లనియె. 277

మ. తగు నీచెప్పినవెల్ల నిక్కమయినన్ ధర్మార్థకామంబులన్
మొగి నొండొంట న బాధకంబుగను బెంపుం బూననేఁ గాని ధ
ర్మగతుల్ తప్పక నర్థకామములఁ గోరం జెల్లునే సర్వమి
ప్పగిదిం బోవఁగ ధర్మపీడనమునం బాటించె భీముం డటః. 278

చ. అనవుడు శౌరి యిట్లనియె నార్య! జగత్త్రయమందు ధర్మవ
ర్తనునిగ రోషశూన్యునిగఁ దత్త్వవిదుం బ్రశంసింత్రు నిన్ను నీ
మనమునఁ గోపసంగతిని మాని సుశాంతి వహించి పాండవే
యుని ప్రతినం దలంచి కలియుం దలసూపఁగ నుంట లెంచుమా. 279

వ. అనిన విని హలాయుధుండు ధర్మచ్ఛలంబునకు సంప్రీతమనస్కుండు గాక వీఁక విడిచి
యిట్లనియె. 280

శా. ధర్మంబుం దిగనాడి గాద్భుకోడు కేతద్ధ్వస్తమార్గస్థితిన్
ధర్మాత్ముం డగు ధార్తరాష్ట్రుని గదాదండంబునం గూల్చి దు
ష్కర్మంబుం బొనరించెఁ గావున జగజ్జాలంబునన్ దుర్యశో
వర్మంబుం దొడి జిహ్వయోధి యన నై వర్తించెడుం గావుతన్. 281

పంచచామరము. సుయోధనుండు ధర్మయుద్ధశుద్ధయజ్ఞదీక్షితుం
డయై విపక్షవహ్నియం దట న్నిజాంగహోమమున్
నయంబునం బొనర్చి కీర్తి నా నెసంగునీట నా
డి యుండెఁ గాన స్వర్గ మందెడిన్ నిరంతరంబుగన్. 282

వ. అని పలికి రథం బధిష్ఠించి ద్వారకాపురంబునకుం బోయె నంతఁ బాంచాలపాండవ
యాదవవీరులెల్ల విన్నఁబోయినవదనంబులతో నప్రసన్నహృదయులై యున్నంగని
శోకోపహతసంకల్పుండును దీనుండు నధోముఖుండును జింతాపరుండు నైన
పాండవాగ్రజుం డాయ వచ్చి గదాగ్రజుం డిట్లనియె. 283

—శ్రీకృష్ణుండు ధర్మరాజుతో నుచితవాక్యము లాడుట—

చ. మఱుగుచునుంటి వేమిటికి మారుతసూతి సుయోధనోరువుల్
దఱి గొని యేసి వానితలఁ దన్నె నధర్మమటంచు నెంతె నీ
తెఱఁగిటు లుండె నా సతఁడు దేవ! వృకోదరునిట్టిచేతకుం
జుఱచుఱఁ జూఁడి నామనము చుమ్మలు చుట్టుచు నుండుఁ జూచితే. 284

మ. ధృరాష్ట్రాత్మజు లెల్లఁ గ్రూరులగుచుం దీపించి వంచించి మ
మ్మతిఁ గష్టంబులపాలు సేసి రనుచున్ స్వాంతంబునం బెంచుచుం

బ్రతినం జేసినదానికిం దగ నకార్యం బిట్లు గావించె నీ
ప్రతిఘాత్ముం డిది నాకుఁ బ్రీతి కగునే పాపంబు శంకింపనే. 285

క. కురుకులనాశన మగుతఱిఁ, బరికింపక యిట్లు సేయుమని గా దని యు
ప్పరికించినాఁడఁ బాండవు, లరయఁగ నడి వైరి కాము మ్రగ్గించి కటా. 286

వ. అనిన వాసుదేవుండు వెండియు. 287

ఆ. సతినిఁ గొప్పు వట్టి సభ కీడ్చి తెచ్చిన, చెనఁటిపట్ల భీమసేనుఁ డిట్లు
తగవు మాలె ననుట తగదు కృచ్ఛ్రంబుల, ధర్మ మిట్లి యొప్పు ధర్మతనయ. 288

వ. అని భీమసేనప్రియంబుగాఁ బలికి ధర్మరాజచిత్తంబునం గలయుత్తలపాటు దీటుసం
బుచ్చిన నతం డౌఁగాత మని తమ్మునిచేఁతకు సమ్మతిం జేసె నాసమయమ్మున
సమీరకుమారుండు మోడ్పుఁగేలు ఫాలంబునం గీలించి నిజాగ్రజుపాలికిం జని హ
ర్షోత్ఫుల్లనయనుం డై యిట్లనియె. 289

తరళము. నిహతకంటక మైనరాజ్యము నీయధీనము యయ్యె నేఁ
డహితుఁడు న్నికృతిప్రియుం డగునాసుయోధనుఁ డొగ్గ నై
మహి శయించెను దుశ్శసేనుఁడు మాయలాఁ డగుసౌబలుం
డహ మహమ్మనుకర్ణుఁడుం దెగి రల్లనాఁడె నరేశ్వరా. 290

క. సకలమహీతలరాజ్యము, సుకరంబుగ నీకుఁ జిక్కె శుభవైభవముల్
ప్రకటించి కులోచితగతి, సుకలుఁడవై యేలుకొనుము సూనృతమూర్తీ. 291

క. పగ దీర్చితి రారాజుం, దెగ నేసితి కృష్ణమతము దెస నుండి మహిన్
దగ గెల్చితి మాత్ర్యాణము, మగఁటిమిఁ దీర్చితివి భాగ్యమహిమమువలనన్. 292

వ. అని యభినందించె ననిన విని ధృతరాష్ట్రుండు సంజయుదిక్కు మొగంబుచేసి. 293

తే. సూత! దుర్యోధనునిపాటు సూచి పాండవులును బాంచాలురును నేమి సలిపి రెల్ల
సంతసించిరి వినియెద సంశయింప, కంతయును జెప్పు మన నతం డనియె నిట్లు. 294

వ. అట్లు భీమసేనగదాభిఘాతంబునం దొడలు విఱిగిపడినదుర్యోధనుం గాంచి శ్రీకృష్ణ
సహితు లగుపాండవసైనికు లెల్లరును బ్రహృష్టమనస్కులై యుత్తరీయంబు లెగిఱిం
చుచు సింహనాదంబులును శంఖనాదంబులుం జేయుచు దుందుభులు మొఱయిం
చుచు వింటుల విక్షేపించుచుఁ గౌక్షేయకంబులు ద్రిప్పుచు నవ్వువారు నాడువారుఁ
బాడువారు నై వడముడిం జేర నరిగి. 295

సీ. హరిహయుం డావృత్రునట్లు శాత్రవుఁ గూల్చి, కడుదుష్కరంబగు కార్య మిపుడు
సల్పితి వివిధమండలగతులఁ జరించు నృపతి నెదుర్చి నీకుఁ దక్క

నొండొక్కనికిఁ గాదు దండిమగఁడ వీవు, తన్నుఁ గల్గితి కాలఁ దచ్ఛిరంబు
సింగ మెనుముసెత్తు భంగి ద్రావితి దన్న, నేనునురమునెత్తు జీల్చి పుచ్చి
తే. ధర్మపుత్త్రునకుం గదు దలఁచినట్టి, వారితలలపైఁ గాలిడ్డవాఁడ వైతి
ప్రథనమున నీయశము జగత్ప్రథిత యయ్యెఁ, జెప్పనిన్ను మఱొక్కనిఁజెప్పవలయు•
తే. వేలుపులు వృత్త్రవధ నైన వెనుక వాసవునిబలె న్నిన్ను మే మిష్టు కని భజింతు
మిదిగో చూడుము రాజరా జీగ్ని నపుడు, మొలక లెత్తినపులకలు నిలిచియుండె.
వ. అని ప్రశంసించు చున్నంత మురాంతకుండు సుయోధనుం జూపుచు నల్లవారి కిట్లనియె.
సీ. చచ్చినవానినిఁ జంపఁ బాడియె వెండి, పరుషవాగస్త్రముల్ పఱవఁ జేసి
వీఁడు భీష్మాదులు వివరించి చెప్పిన, విన నొల్లఁడై పాండవేయులకును
దండ్రపా లీయ కింతలు దెచ్చుకొని చచ్చెఁ, గాపథభూతుఁడు వీనిఁ గాదు బదరఁ
బుత్త్రమిత్త్రామాత్యముఖ్యులతో నశియించి పోయినవాని కింతయేల
తే. వీనిపై నింక శత్రుత్వవిధము విడిచి, మనము వచ్చినపని దీఱె మసల కిచటఁ
దేరు లెక్కుఁడు పోదము సూరుఁ డసర, వార్ధిఁ గ్రుంకకమున్న భూపాలురార.299
—సేలఁ గూలినదుర్యోధనుఁడు కృష్ణు నాక్షేపించుట.—
వ. అని పలికినపుండరీకాక్షునధిక్షేపవచనంబు లాకర్ణించి సుయోధనుం డవకర్ణించుచు
నమర్షవశంబునం జేసి యట్టు నిట్టుఁడుచు నెట్టకేల కించుక లేచి పిఱుఁదు లాన్చి హస్త
ద్వయంబున ధరణీతలం బదిమి పట్టి యర్ధోన్నతశరీరుండై కూరుచుండి తొడఁక
దెగిన త్రాఁచుపగిదిం బూడ నొప్ప రోఁజి నిట్టూర్పు సిగిడించుచుఁ గటంబు లదరఁ
గుటిలభ్రూకుటిమై క్రూరవీక్షణంబున నధోక్షజుం జూచుచుఁ జూచుచుఁ బ్రాణాంత
కరం బైనఘోరవేదనం బాటింప కుగ్రవచనంబుల నిట్లనియె. 300
ఉ. నీ వొకయింతయుం దెలియ నేరవు పేరును గౌరవంబు సి
గ్గేవయు లేక ప్రేలెద విహీ యన వచ్చెదు నీదుచేత మే
మీవలఁ బోరుచుండ నను నిట్లు వధింపన సన్న సేయ నీ
కావరుఁ గత్తిఁ బుచ్చి తొకకంటను గంటిని గంసదానజా. 301
క. బుజయుద్ధ మొనర్చెదుభూ,భుజులం దెక్కుడను బోరుప్రొద్దుల లోన్
వృజినము దలఁపక పాడిం, ద్యజియించి వధింపఁ జేసి తది ధర్మ వొకో. 302
సీ. మును శిఖండిని బెట్టుకొని ధనంజయుచేఁ, గూలిపంచితి భీష్ముఁ గుటిలవృత్తిఁ
గొడు కీల్గె ననునెపం బసరించి ద్రోణును, గూలించితివి తప్పి నాఁడ
పెరవాని మూర్కొని పెనఁగు భూరిశ్రవు, చేయిఁ దున్మించితి జిష్ణుఁ గొలిపి

తే రిలం గ్రుంగ నెత్తెడువేళఁ గర్ణునిఁ, జంపించితివి పాపశంక విడిచి

తే. యిన్నియును మేర తప్పుట లిట్లు కాక, కర్ణుని న్నన్ను భీష్మునిఁ గార్ష్మకగురు
బుజురణంబునఁ జంపంగ నేరితరము, మమ్ముఁ జంపించితి ట్లధర్మమున నీవు. 303

వ. అనినం గోపాలదేవుం డాతనివదనం బాలోకించి దుర్యోధనా! దుష్టచిత్తుండ వైననీ వును నీపుత్రపౌత్రమిత్రభ్రాతృప్రభృతులునుం ద్రెళ్ళిరి నిదుష్కృతంబునం జేసి భీష్మ ద్రోణులు నీశీలానువర్తనుం డగువైకర్తనుండునుం దెగిరి నేను వచ్చి ప్రార్థించినను సౌబలనిశ్చయంబునం జేసి లోభావిష్టుండవై పాండవులపా లియ్య వయితివి భీమసేను నకు విషంబు వెట్టించితివి జతుగృహంబునఁ జిచ్చు పెట్టి కాల్పించితివి సభకు రజ స్వలం దెచ్చి పలువిధంబులఁ బరిభవించితివి నికృతిద్యూతంబు గల్పించి వారిసిరులు హరించి వనంబులకుం బుచ్చితివి సైంధవుం బంపి తృణబిందునాశ్రమంబునఁ బాంచా లిం భంగపెట్టించితి వేకాకి యగునభిమన్యుకుమారు నధర్మంబునం జుట్టుముట్టి పడు గురం బెట్టి గిట్టించితివి మఱియు ననేకాకార్యంబు లాచరించినకష్టుండ వీవు నీదోషంబు లెల్ల లాంతులపయిం బెట్టుటకు నీకు సిగ్గు పుట్టకుండె నీచేసినదోషంబులం జేసి నీ కిట్టి బెట్టిదం బగునిక్కట్టు ఘట్టినది నీవు శుక్రబృహస్పత్యుపదేశంబు లెఱింగినవాఁడ వును బెద్దల సేవించినవాఁడవును గావు హితవాక్యంబు లాదరింపవు లోభావిష్టుండవు నీ లోభంబ నిన్నింతకుం దెచ్చె నీచేఁతలకుం దగ ఫలం బనుభవింపు మని నిర సించి పలికిన దుర్యోధనుండు వెండియును. 304

చ. అది యిది యంచు నేటి కిపు డాడ జనార్దన! యెల్లవేదముల్
చదివితి నిచ్చితిన్ జగతి సర్వము నేలితి శత్రుమూర్ధమం
దొదవఁగఁ జేసితిం బదము నొందితి భోగము లెల్ల నింక ను
త్పదమున కేగెదన్ సకలబంధుజనంబులఁ గూడి వేడుకన్. 305

క. హతసంకల్పులరై మీ, రతిగులు బలె నగుచు నధమ మగునిజ్జగతిన్
బ్రతుకుఁడు పశ్చాత్తాప, ప్రతిహతచిత్తమున దుఃఖభారము దోపన్. 306

మ. అని భాషించెడునట్టిచో దివిజపుష్పాసార మేతెంచెఁ జ
ల్లనివాతంబులు వీచె నప్సరస లాలాపించి కీర్తించి రా
యనకీర్తిన్ సురదుందుభుల్ మొఱసె సర్వాశ ల్వెలుంగొందె మే
లని వాక్రుచ్చిరి సిద్ధు లద్భుతరుచుల్ వ్యాపించె నాకంబునన్. 307

వ. అయ్యద్భుతంబులం దిలకించి పాండవు లదియంతయు దుర్యోధనునిఁ బూజించుటగా నిశ్చయించి లజ్జించుచు భీష్మద్రోణకర్ణభూరిశ్రవు లధర్మనిహతు లైరని నితాంత

చింతాక్రాంతస్వాంతంబుల నెంతయు దుఃఖించి రవ్వ డప్పుండరీకాక్షుండు వారివగ పెక్కంగి మేఘగంభీరనిస్వనంబున నెల్లరు విన ని ట్లనియె. 308

ఉ. ఈతఁడు భీష్మముఖ్యులు నహీనవిభావిభవాభిరాము లీ
భూతలమందు వీరి సరిపోల జయింపఁగఁ జాలువారు లే
రీతెఱఁగే నెఱింగి రచియించితి మాయ లుపాయముల్ భవ
త్ప్రీతిగ దాన గెల్చు పటుతెంచె నటంచు నెఱుంగుఁ డిందఱున్. 309

చ. ఒనరు నుపాయ మే నలుపకుంటినయే నటు ధర్మయుద్ధముం
బొనరిచి మీరు వారలను బోర వధింపఁగఁ జాల రంచు నే
ననఁ బని యున్న దిక్పతు లైన నసాధ్యులు నాఁగ నివ్విధం
బున విజయంబు రాజ్యమును బొందుట లేనిద యొండొకందురన్. 310

క. వారికిఁ బోలినవాఁ డిక్కురువీరుండును దండధరుఁడువీనికి నెదురై
పోరి జయింపఁగ నేరఁడు, మీ రిట శంకించుకొనఁగ మేలౌనె చెపుడా. 311

తే. పగతురం గెల్చు టది నీతిపథ ముపాయ,మునను దొల్లింటి పెద్దలీ పుంత వట్టి
యున్నవా రట్లు మీరును జన్నవారు, వగవఁ బాగలంగఁ గలదె మీవర్తనముల. 312

వ. మనము కృతకృత్యుల మయితిమి సాయాహ్నంబును జనుదెంచెఁ జతురంగబలంబుల
కోడంబోయి విడిదల విశ్రమించు పొమ్మ నని చెప్పిన నొప్పుదలంజేసి సంతసించు చుఁ
బాంచాలపాండవులు తమతమశంఖంబు లొత్తినం బురుషోత్తముండునిజపాంచజన్యంబు
పూరించె ననంతరంబ వారందఱుం గలసి యచ్చోటు విడి కొంతదూరంబు వో నంత
ద్రౌపదేయధృష్టద్యుమ్నశిఖండిప్రభృతులు పాండవశిబిరంబులఁ దమతమపొందు
పట్లకుం జనిన వెనుకఁ గృష్ణసాత్యకియుయుత్సనమేతు లగుపాండవు లేవురును గౌరవశిబి
రంబులకుం జనుదెంచి నాటకజనప్రదర్శనాంతంబున జనశూన్యం బయినరంగస్థలంబు
వ లెను హతోత్సవం బైనపురంబు చందంబునను హతనాగం బైనహ్రదంబుతెఱంగునను
హతేశ్వరం బై చెన్ను దఱిగి వృద్ధామాత్యాధిష్ఠితంబును స్త్రీజనభూయిష్ఠంబును గుదు
ర్యోధన శిబిరంబు దరియ వచ్చి యచ్చటఁ గాషాయమలినాంబరు లగుకురురాజపుర
స్సరులు కృతాంజలిపుటులై పొడసూపిన వారి నాదరించి రథావతరణంబుగావించు
చున్న సమయంబున హృషీకేశుండు గుడాకేశుం గాంచి యి ట్లనియె 313

తే. నీవు తూణీరములుకు గాండీవముఁ గొని, దిగుము మునుమున్న రథమేనుదిగుదు పెనుక
శ్రేయ మిది నీకు నావుకు శ్వేతహయుఁడు, నాని చెప్పినచొప్పున దా నొనర్చె. 314

క. గాండీవి దిగినపదంపడిఁ, గొండొకవడి కచ్యుతుండు ఘోటకరశ్మల్

గుండుగిల విడిచి కుంభిని, కిం డిగ నుఱికెన్ రయంబు గ్రేళ్ళుబ్బంగన్. 315

—పాండవులు శిబిరంబుల కరిగినవెనుక యర్జునరథంబు గాలుట—

క. కేతనకపి యంతర్హిత, మై తఱలెం దత్క్షణంబ యస్త్రంబులతో
హేతులతో వీతులతోఁ, ఖ్యాతం బగురథము దగ్ధ మయ్యె మహాగ్నిన్. 316

వ. అట్లు భస్మీభూతం బయిన శ్వేతవాహనరథంబుం గాంచి పాండవులు పరమాద్భుతంబు నొందుచుండ గాండీవధరుండు పుండరీకాక్షుం దిలకించి మోడ్పుఁగేలు ఫాలంబునం గీలించి యేటికో ళ్ళర్పించి వినయవినమితోత్తమాంగుం డై యిట్లనియె.

క. దేవా! నాదివ్యరథం, బీవిధమున దగ్ధ మయ్యె నిది గనుచబ్రం
బే వినఁ దగి యుంటినయే, నావిధ మెఱిఁగింపు మనుడు నతఁ డిట్లనియెన్. 318

క. చాపగురుకర్ణదివ్యా, స్త్రాపాదితవహ్నివలన నపుడే కాలెన్
నాపట్టి యుంట నీ తే, రీపగిదిన్ రూపు మాయ దిప్పటివఱకున్. 319

వ. నీవు కృతకృత్యుండ వైతివి గావున నాపట్టు విడిచితి దానం జేసి యిట్లు దగ్ధం బయ్యె నని మందహాససుందరవదనారవిందుం డై గోవిందుండు ధర్మనందనుం గౌఁగిలించుకొని.

సీ. నీభాగ్యవశమున నీశాత్రవు లడంగి, రీవు నీతమ్ములు నెమ్మి నుండి
రే నుపప్లావ్యము నీక్షింప వచ్చిన, ప్డీ విచ్చు మధుపర్క మిచ్చి నాకు
వివ్వచ్చునిం జూపి వీఁడు నీచెలికాఁడు, నీభ్రాత యని రక్షణీయుఁ డనుచు
నప్పన వెట్టితే నట్ల యగుం గాత, మని యియ్యకొంటి నయ్యగ్రజుండు
తే. రక్షితుఁడు వీఁడె విజయి నై రాణ లెసఁగు, రాజచంద్రమ! యింక నొనర్పఁగవలసిన
పనులు నడపింపు మనిన నాఘనభుజుండు, హర్షరోమాంచకంచుకుఁ డగుచు ననియె.

మ. గురుకర్ణాస్త్రవిముక్తముల్ త్రిభువనక్రూరక్రియారంభముల్
పరమేష్ఠ్యస్త్రము లీవు గాక కరుఁ డోర్వం జాలునే నిర్జరే
శ్వరుఁ డైనం జెడు నీప్రసాదమున నాసంశప్తకవ్రాతముల్
దురమందుం దునుమంగ నోపి నరుఁ డొందుం బొందఁ బో కీర్తిమిన్. 322

తే. పలికె ద్వైపాయనుఁ డుపప్లావ్యమందు, నేవలనఁ బొల్చునో ధర్మ మావలనను
నిలుచుఁ గృష్ణుఁడు కృష్ణుండు నిలుచువలన, జయము సిద్ధించు ననుచు నోజగదధీశ.

వ. నీప్రాపు గాంచినమాకు దుష్కరం బెయ్యది యని ప్రశంసించి రథరథ్యమోచనం బాచరించి దుర్యోధనశిబిరంబులం బ్రవేశించి కోశాగారంబునం గలకనకరజతరత్నమౌక్తికకంబళాజినాదులును దాసీదాసజనాదిరాజ్యోపకరణంబులును స్వవశంబు చేసికొని యున్నంత వాసుదేవుండు మన మీరేయి మంగళార్థము శిబిరబహిఃప్రదేశ

మున శయనింత మని సాత్యకిత్రోడం బాండవులం దోడ్కొని యోఘవతీనదీపరిసరం బునకుం జని విశ్రమించె నప్పు డజాతశత్రుండు రుక్మిణీకళత్రుం గాంచి నీ విప్పుడు నాగపురంబునకుం బోయి ర మ్మని ప్రార్థించిన నతండు దారుకానీతంబును శైబ్యసుగ్రీవమేఘపుష్పబలాహకవాహనమోహ్యంబు నగునిజరథం బధిష్ఠించి చనియె ననిన జనమేజయుండు వైశంపాయనుం గని మునీంద్రా! యుధిష్ఠిరుం డయ్యవసరంబున వాసుదేవు నేమిటికిం బుచ్చె నెఱింగింపు మనిన నతం డతని కి ట్లనియె. 324

—శ్రీకృష్ణుఁడు గాంధారి నూఱడింప హస్తిపురి కరుగుట—

తరువోజ. అనయంబునం గౌరవాగ్రజుఁ డట్లు హతుఁ డౌటకుం జిత్తమునఁ గాంధారి కనలి శపించెడుఁ గా నోపు నావె కలితతపశ్శక్తి గలిగి ముజ్జగము ననలసాత్కృతము చేయం జాలుదాన నగుఁ దమకుం జెడు గనుచుఁ జింతించి మనమునం గడుభీతు మసలుచును దదమర్షప్రశమనంబు మతిఁ జేసి యపుడు. 325

మ. వసుదేవాత్మజుఁ జేరఁ బిల్చి యను దేవా! నీప్రసాదంబున
న్వసుధారాజ్యము నిస్సపత్నముగఁ బొందం గల్గె దేవాసురో
గ్రసమాఘాతమునందు దేవతల వేడ్కం గాంచి న ట్లీయనిం
బ్రసమీక్షించుచు మమ్ముఁ గాచితివి చెప్పం గాదు ప్రత్యక్షమే. 326

క. నరునకు సారథ్యము నీ, పరమే గాకున్న మాకుఁ బ్రత్యర్థిజయం
బరు దగు ముంజేకడియము, నరయంగా నద్దమేటి కవసర మనఘా. 327

తే. అస్త్రశస్త్రప్రహారము లలఁతిజనుల, పరుషవచనములుఁ నీవు పడఁగ నైతి
మానిమిత్తమునఁ శ్రమ మైన సఫల, మయ్యెను బ్రయత్న మని మది కార్తి కాదు.

మ. అది యెల్ల న్వితథంబు గానియటు చేయం జూడు మోకృష్ణ! నా
హృదయం బాధృతరాష్ట్రదేవిమెడ నెంతే భీతి శంకించెడిఁ
దుద కాసాధ్వి గుడగ్నికాహుతులమై త్రుంగాటి పో నౌదు మో
కద పుత్రాదులచావు విన్న నలుకల్ గాకుండునే యామెకుఁ. 329

వ. పుత్రవ్యసనకర్శిత యగునగ్గాంధారిం దేర్చుట మన కిప్పుడు కర్తవ్యంబై యున్న యది దానికి నీవు దక్క సమర్థుం డెవ్వండునుం గాడు కావున నీ వీక్షణంబ పాండవహితార్థివై హస్తిపురంబునకుం బోయి కాలోచితంబులును గారణసమన్వితంబులు నగువచనంబుల నద్దేవిక్రోధానలంబు చల్లార్ప నర్థించుచుంటి వీతలో నస్మత్పితామహుం డగు ద్వైపాయనుం డట సన్నిధిం జేసి యుండు నని తెలంచెద ననిన సాత్వతశ్రేష్ఠుండు పాండవజ్యేష్ఠుని వాక్యంబు లాదరించి దారుకుం బిలువఁ బంచి

రథంబు సజ్జితంబు గావింపు మని నియోగించి సన్నద్ధం బగుదానిపై నధిష్ఠించి య తిత్వరితగతిం గరిపురంబునకుం జని మొగసాల రథంబు డిగ్గి తనరాక ధృతరాష్ట్రున కెఱింగించి పుచ్చి నగరుసొచ్చి యచ్చటం దనకన్న మున్న వచ్చియున్నవ్యాసభ ట్టారకునిం గని వానిపాదారవిందంబుల కభివందనం బాచరించి వెనుక గాంధారీ ధృతరాష్ట్రులకు నమస్కరించి వారిచెంతం గూరుచుండి విచిత్రవీర్యాత్మజునికరంబు కరంబునం గీలించి కొండొకవడిఁ బ్రాకృతుండుబలెఁ బలవించి కలశోదకంబునఁ గ న్నులు గడిగికొని యాచమించి సముచితసంభాషణంబుల నమ్మహీనాథుని సంబో ధించుచు ని ట్లనియె. 330

ఉ. భూతభవిష్యముల్ గతులు పోల నెఱుంగుదు కాలవృత్తముల్
నీ తెలియంగ రానియవి లేవు దలంప జగత్త్రయంబునన్
భూతము లెల్ల గిట్టుచును బుట్టుచు నుండుఁ బ్రవాహరూపమై
పాతరలాడు నిగ్గతికిఁ బండితుఁ డెవ్వఁడు చొప్ప దప్పనే. 331

క. ఈవు గతాగతగతులకు, నేవేళం గాని చిత్త మెఱియఁగ దుఃఖ
వ్యావర్తనమునఁ గావని, భావించెదఁ దెలిసినట్టివాఁడవు గానన్. 332

సీ. ప్రకృతినిం బట్టినే భాషించునది విన్మ, పాండవుల్ నీమదిఁ బట్టి యెపుడుఁ
గురుకులక్షయమునకున్ సమ్మతింపక, ద్యూతచ్ఛలవినిర్జితు లయి నాఁడు
సమయంబు సలిపి యశక్తు లో యన వన, వాసము నజ్ఞాతవాసము నొగి
నడపి సంధింగోరి ననుఁ బుచ్చి రే నిటఁ వచ్చి యెల్లరు విన ముచ్చటించి

తే. తుదకు నై దూళ్ళ ని మ్మని తొడరి తొడరి, నిన్ను యాచించితిని గాలనియతి నీవు
దానికిని నియ్యకొన వైతి నీనిమిత్త,మునన సర్వక్షయం బయ్యె మనుజనాథ. 333

వ. కాలోపహతచిత్తుండ వగునీవు సోమదత్తబాహ్లీకభీష్మద్రోణవిదురాదులు శమార్థము ప్రార్థించుచు నెంత చెప్పినను వినక మూఢునితెఱంగునఁ బ్రవర్తించితి విది కాల యోగంబు గాని యొండొక్కటి గాదు దేనికిని దైవమే పరాయణం బని యె ఱుంగు మని మఱియును. 334

శా. దోషం బేదియు లేనిపాండవులపై దోర్లింపఁగా నెంచ రా
దీవద్దోషము లేదు వారికడ ని న్నెల్లప్డు ధర్మార్థసం
తోషస్నేహము లేర్పడం దలఁచుచున్ భూషింతు రం చిట్లు నే
భాషింతున్ మది నాత్మదోష మనుచున్ భావించుకో నొప్పెడిన్. 335

ఆ. ఇట్టివారిమీఁద నీ వింత యేని యసూయ సేయ వలదు సుతఫలమ్ము

వంశపిండములును వారియందే మీకు, నిలిచి యుండె ననుచుఁ దలఁప నొప్పు.

క. ఈవును గాంధారియు మును, గావించినకర్మఫలముగా యిది యనుచున్
భావించి పాండుపుత్రుల,పై వైరము సేయ కోమఁ బ్రార్థింతు మిమున్. 337

వ. ధర్మపుత్రునకు మీయెడ స్వభావంబున నైనభక్తిస్నేహమ్ము లపారమ్ము లని నీ వె
ఱుంగుదువు శత్రుసంహారంబు గావించి కదనంబున విజయంబు గాంచియు నిన్ను
ను గాంధారిం దలంచుకొని సంతప్తచిత్తంబున దివారాత్రంబులు శాంతియు సుఖమ్ము
నెఱుంగక సంతప్తచిత్తుల రగుమిమ్ముం జూడ సిగ్గుపడుచున్నవాఁ డిది యంతయు
నెఱింగి కరుణాయత్తచిత్తంబున నాతని నాదరించి కాచి రక్షింపు మని నే నిదె నీకు
నమస్కరించి ప్రార్థించుచున్నవాఁడ నని గాంధారిం గాంచి యి ట్లనియె. 338

సీ. నినుఁ బోలుసాధ్వి యీనిఖిలజగంబునఁ, జూపట్ట దానాఁడు భూపతిసభఁ
గోడు కని మూఁడక కూడినరాజులు, వినుచుండ ధర్మార్థపిహితగతుల
నుభయపక్షములకు నొప్పెడువిధమునఁ, జెప్పితి నీమాట చెవి నిడండు
మీవాఁ డసకి నెత్తి దీవింపు మన్న నీ, వెందు ధర్మమో జయ మంద యుండు
తే. నంటి వామాట సఫలం బ య్యె ననుచు, నెంచి శోకంబు దుగుమానీయెడఁ దలఁప
కెపుడుఁ బాండుపుత్రులకుఁ జే టీవలిగిన, ముజ్జగంబులు భస్మమై పోవు నిజము. 339

తే. అనుడు గాంధారి నీ వన్నయట్లు నిజము, తావకోక్తుల నా మనస్తాపభర మ
దెల్లఁ జల్లాఱెఁ జీకు వృద్ధియుపుత్రకునకు గతి నీవు పాండవులును దలంప. 340

వ. అని పలికి చేలచెఱంగున మోము గప్పుకొని కన్నీరు మున్నీరై పాఱ నేడ్చినం గని
వాసుదేవుండు హేతుభూతంబు లగువాక్యజాతంబుల నామె నూఱడించి తేర్చినం
తలో నశ్వత్థామ దురుద్యోగంబు తలంపువచ్చినం దటాలున లేచి పారాశర్యుని
పాదంబుల కభివాదనం బాచరించి ధృతరాష్ట్రు దిలకించి కుంభసంభవాత్మజుండు
పాండవుల నీరేయిఁ జంపుదు నని ప్రతిన వట్టినవాఁడు నే నిట మసల నొప్పదు
పోయి వచ్చెద నంపి పుచ్చు మనిన గాంధారీధృతరాష్ట్రు లట్లయిన నతిశీఘ్రుం
బరిగి పాండవులం గాపాడుము పునర్దర్శనం బయ్యెడుఁ గాక పోయి రమ్మని వీడుకొ
ల్పిన నతండు వారి నామంత్రించి కృతకృత్యుండై యతిత్వరితగమనంబునఁ బాండ
వేయులకడకుం జని తద్వృత్తాంతం బంతయుం జెప్పి వారి ననుసరించెఁ గృష్ణద్వై
పాయనుండును గృష్ణుండు చనినవెనుక ధృతరాష్ట్రు నాశ్వాసించి యంతర్హితుం
డయ్యె నంత ధృతరాష్ట్రుండు సంజయుం బిలిచి యి ట్లనియె. 341

ఆ. తొడలు విఱిగి పుడమిఁ బడిననాతనయుండు, గాలికొడుకు తలను గాలఁ దన్న

వ్యసనకలితుఁ డయ్యె నంటి వనంతర, మేమి చేసె నాతఁ డెఱుఁగఁ జెపుమ. 342

—దుర్యోధనుండు సంజయుం గని విలపించుట—

తరువోజ. అనిన సంజయుఁ డను నట్లు వా రెల్ల, నరిగినపిదప నే నటఁ జేరుకొంటి
విను మట్లు కూలినపృథివీధవుండు వికృతాకృతిం బొల్చి విఱియఁ గెంధూళి
దనమోము గప్పినఁ దలవెండ్రుకలను, దలఁగించి నన్నుఁ గాంచి దశదిశలను
గని యత్నమునఁ ద్రాఁచు కరణి రోఁజుచును,గనులనీర్నించుచుఁగడుదీనుఁ డయ్యె.

వ. అయ్యెడ. 344

ఉ. మత్తగజంబు మాడ్కి పలుమాఱులు చేతుల నేలఁ దట్టుచుం
జిత్తడి నంటి మోముపయిఁ జిక్కులు వడ్డనెఱుల్ విదిర్చుచుం
గుత్తము గాఁగ దంతములు గొర్కుచుఁ బాండుసుతాగ్రజన్మునిం
జిత్తము వచ్చిన ట్లనుచుఁ జేరి నన్నుం దిలకించి యి ట్లనున్. 345

వ. సంజయా! భీష్మ ద్రోణ కర్ణాశ్వత్థామ కృప కృతవర్మ శకుని శల శల్య ప్రభృతులు బాసట గలిగియు నేకాదశాక్షౌహిణీచమూసమేతుండ నయ్యు నే నిట్టియవస్థం బొంద వలసినవాఁడ నైతిం గట్టా కాలం బెట్టివారికి దురతిక్రమం బని మఱియును. 346

మ. మనలోఁ జావక యున్నవార లెవరే మట్లాడుచున్నార యే
ననిలోఁ గూల్చె వృకోదరుండు సమయం బాలింప కీలీల న
న్ననియుం శాంతనవాంగభూమివిభుచాపాచార్యభూరిశ్రవుల్
దునిగింపం బడి రద్ది మోన మనుచుం దోపం బ్రబోధింపుమా. 347

మ. అయశోదాయకమౌల్ నృశంసము లుకర్మారంభముల్ నేసియుం
నయ మింతేనియు లేక పాండుసుతు లన్యాయంబు శంకింప కిం
తయు సంతోషము నొందుచుందు రెద విద్వాంసుల్ సుధర్మచ్యుతిన్
జయముం గాంచినవారి నించుకయు మెచ్చం జూతురే సూతజా. 348

ఆ. జగతి భీమసేనుచందంబున నధర్మవిజయమునకు నెట్టి కుజనుఁ డైనఁ
బొంగిపొఱలు నొక్క భువి తొడల్ దెగిపడ్డ, నన్ను శీర్షమందుఁ దన్నెఁ వాఁడు.

క. భూతల మేలెదు తేఁ డను, భ్రాతను సిరు లంది పొంది పరఁగినవాఁడం
నాతలఁ దన్నుట పాపము, హేతువుగా కనము గూర్చునే భీముఁ డకుం. 350

వ. ఉండనిమ్ము సంజయా! నాతల్లిదండ్రు లఖిలధర్మజ్ఞులు దుఃఖార్తులు వారి కిట్లు నావచనంబు గా విన్నవింపుము. 351

ఉ. జన్నము లాచరించితి విశాలధరాతల మేలితిన్ జగ
త్సన్నుతవైభవంబున నెసంగితి భృత్యుల నెల్లఁ బ్రోచితిన్
నన్నెదిరించు కించుల నణంచితి మిత్త్రుల నాదరించితిన్
వన్నెకు నెక్కు దానము లొనర్చితిఁ బేర్చితిఁ బేర్మి పెంపునన్. 352

ఉ. చుట్టల గారవించితిని సూరెలవారల నాజ్ఞ నిల్పితిన్
బెట్టితి విప్రకోటికిఁ బవిత్రకులంబున జన్మ మందితిన్
నెట్టన సర్వసంపదల నిల్పితిఁ బొల్పున నా త్రివర్గముం
బట్టితి వాహనాదికశుభస్థితు లొందితిఁ గీర్తి నందితిన్. 353

చ. చదివితి వేదశాస్త్రములు సర్వధనంబులు సంగ్రహించితిన్
విదితయశస్కులన్ సుతులఁ బెక్కురఁ గంటి ననూనమాన మిం
పొదవఁ దలిర్చితిం బ్రభుత నొందితి నాధియు వ్యాధి దైన్యముం
గదురనియున్నతిం బ్రదుకఁ గంటి జయంబులు గొంటి నాజులన్. 354

క. ఇహసౌఖ్యము లన్నియు నే, నహరహముగ ననుభవించినట్టిఁడ నైతిన్
మహిఁ గలరాజులలో నే, మహనీయుఁడు గాని నాసమానుం డగునే. 355

ఉ. ఇట్టిప్రభావముం గొనినయే నరిచేతికిఁ జిక్కి దైన్యముం
బట్టఁగఁ బ్రేష్యధర్మమును బొందుచు నొందుల నాశ్రయింపఁ బో
కెట్టియెడన్ స్వధర్మమున నేడ్తెఱఁ జూపుచుఁ బోరి పోరి సా
మ్రాట్టుల కేనలభ్యము లమానుషలోకములన్ జయించితిన్. 356

మ. అని మాఱొడ్డి జయింపలేక పగ అన్యాయంబునన్ యుద్ధధ
ర్మనియూఢస్థితి దప్పి యోవ నిదుర న్మిన్నంచువాని న్వధిం
చినరీతి న్విష మిచ్చి చంపినగతిన్ జిచ్చుం బ్రయోగించి కా
ల్చినచందంబున నన్నుఁ గూల్చిరి ధరాశ్రీఁ గోరి క్రూరాత్ములై. 357

వ. అని చెప్పి కృపకృతవర్మాశ్వత్థామలతో ననేకవిధాధర్మంబులం బ్రవర్తించి సమయంబు దప్పినపాపాత్ము లగుపాండుపుత్త్రుల విశ్వసింప రా దని చెప్ప మనుచున్నప్పు డచ్చటికి వచ్చినవార్తాహరులం జూచి యిట్లనియె. 358

సీ. ధర్మశూన్యం బనఁ దవిసమ్మృథంబున, భీమసేనునిగద బిట్టు కూలి
యే నిప్డు గురుకర్ణవృషసేనశల్యులు, దుశ్శాసనాదులు తోడఁబుట్లు
జలసంధముఖ్యరాజవరేణ్యులున్ లక్ష్మణాదిసుతుల్ లోఁగ నైనవారు
చన్నలోకములకుఁ జనిరొక్క వెన్నంటెర, సాఁతు దప్పినపాండుచందమునను

తే. మగఁడు నన్నలు చచ్చినమాట వినుచుఁ, బలవి దున్పల యెట్లు కాఁగలదియొ కట
విధవ లగునాండ్రఁ గని దుఃఖవివశ లయిన, తల్లిదండ్రులగతి యెట్లు చెల్లునో కద.

వ. మఱియుఁ బరివ్రాట్టగుచార్వాకుండు నావృత్తాంతం బెఱింగె నేని నాకు నిశ్చయంబు గ నపచితిం గూర్పక మానండు త్రిలోకవిశ్రుతం బై పుణ్యక్షేత్రం బైనయీశమంత పంచకంబున నిధనంబు నొంది నేను శాశ్వతలోకంబులం బొందఁ గల నని వాక్రుచ్చి నఁ గన్నీరు మున్నీరై పాఱ వా రందఱు నుమ్మలించుచు నమ్మహీపతి కొండాడ నేర క వాని సమక్షమున నుండ నోడి సెలవుగొని పలుదెసలం బట్టి పోయి రందుఁ గొంద ఱు కృపకృతవర్మాశ్వత్థామలం గని గదాయుద్ధంబును బార్థివపతనంబు నెఱింగించి చని రంత వారు మువ్వురు నవ్వచనంబునం జేసి మిన్ను విఱిగి మీఁదఁ బడినవారిచం దంబునం గుంది స్యందనంబు లెక్కి సత్వరగమనంబున సంగరాంగణంబునకుం జను దెంచి వాయువేగపరిభగ్నం బైనమహాసాలంబుచాడ్పునను వ్యాధపాతితం బగువన గజంబుతెఱంగునను గాలపర్యయంబునం గూలినసూర్యమండలంబుమచ్చునను భీమ సేనగదాభిఘాతపాతితుం డై పుడమిం బడి తుషారావృతం బైనపూర్ణచంద్రమండ లంబు చందంబునఁ జెన్ను దఱిగి ధూళిధూసరితగాత్రుండును రక్తసిక్తాంగుండును గ్రవ్యాదగణావృతుండును భ్రుకుటీకృతవక్త్రుండును క్రోధోద్వృత్తలోచనుండును నై యున్నసుయోధనుం జూచి మోహపరవశులై రథంబులు డిగ్గి డగ్గఱకుం బఱ తెంచి వానిసమీపంబున నేలం గూలఁబడి రప్పు డాచార్యపుత్త్రుండు బాష్పపూరిత లోచనుం డై నిట్టూర్పు నిగిడించి డగ్గుత్తికం బెట్టి యి ట్లనియె. 360

—కృపకృతవర్మాశ్వత్థామలు దుర్యోధనునికడకు వచ్చి విచారించుట—

ఉ. అక్కట రాజశేఖరుఁడ వై ధరణీతల మెల్ల నేలి పెం
పెక్కినవాఁడ విప్పు డిటు లీధరణిం బడి ధూళి గ్రుంగియుం
నొక్కఁడవై నృపాలకజనోచితచామరముఖ్యవస్తువుల్
చక్కరబోండ్లు భృత్యులను సైనికముఖ్యులఁ బాయ నైతివే. 361

శా. ఏడీ కర్ణుఁడు దుస్ససేనుఁడును బృథ్వీశుల్మహామాత్యులుం
జూడం దోఁపరు లోకయాత్ర తెఱఁగుల్ శోధింపఁగా లేము ము
న్నీడం బోవక దివ్యవైభవమునన్ హెచ్చిల్లు రారాజ వీ
వీడం దైవగతి న్విపద్దశకు నై హీనుండ వై పోయితే. 362

తే. ఈవు మూర్ధాభిషిక్తుల కెల్ల మొదటి, వాఁడ వయ్యును నేఁ డిట్లవస్థ గుడువ
నైతి వే మందుఁ గాలపర్యయముకంటె, లక్ష్మి చంచల యనుమాట సత్య మయ్యె.

క. అని దుఃఖించుచుఁ గనుఁగొనలఁ బాష్పములు చాలు గొనఁ బల్కుటయున్
విని నీసుతుండు కన్నీళ్ళను గరములఁ దుడుచుకొనుచు నలి ని ట్లనియెన్. 364

ఉ. కాలవిపర్యయంబునను గల్గువినాశన మెల్లవానికిన్
లీల నొకండు నే నిలువ లే నది నా కిపు డావహిల్లె భూ
పాలుఁడ నైననే నెటులు భూ తల మేలితినో రణంబు లే
లీలఁ బొనర్చి శాత్రవులిబ్బులు గొంటినొ మీ రెఱుంగరే. 365

చ. దళములు లేక యుండిన నుదారతఁ బోరితి నుత్సహించుచున్
ఛలమునఁ బాపచిత్తు లగుశత్రులు నన్ను వధించి రిట్లు నా
పొలియుట కీరు నెవ్వగలఁ బొందగఁ బోకుఁడు భాగధేయపుం
బలమునఁ జూడఁ గంటి మిము భావుకముం గయికొంటి నియ్యెడన్. 366

తే. వేదమున ప్రమాణ మగునేని వేదవేద్యులార! సాధింతు నే నక్షయంబు లైన
లోకముల నెల్ల శ్రీకృష్ణు లోకమాన్యు, నెఱిఁగియుం బోరి చచ్చితి నేను గాన. 367

తే. ఉత్తమపదంబు నొందునా కిత్తఱి వగవంగ నొప్పదు మీరు మీవారికొఱఁది
పోరితిరి గాని జయము చేకూర దయ్యె, జిహ్మ మగుమేటిదైవంబు చెయిదికతన. 368

వ. అని పలికి గదాభిఘాతబాధావిహ్వలుండు గావున బాష్పవ్యాకులలోచనుం డై
యూరకుండె నప్పుడు ముప్పిరిగొన్న క్రోధంబునఁ గల్పాంతకాలానల్పజ్వాలామాలా
కులజాతవేదునిచాడ్పున వెలింగి హస్తనిష్పీడనంబు సేయుచుఁ జే యప్పళించి గురు
నందనుండు రాజేంద్రు దక్కు మొగం బై బాష్పవిహ్వలవచనంబుల ని ట్లనియె 369

ఉ. క్షుద్రులు క్షుద్రకర్మమునఁ గోసిరి నాపితృపాదశీర్ష మా
రౌద్రముహూర్తమం దయిన రాజమహేంద్ర! వచింతు సత్య మీ
మాద్రి మనోవ్యథల్ గలుగుమాటయు నేని యెఱుంగ నక్కటా
భద్రము గోరువా రిటులు భావి దలంపక నిన్నుఁ గూల్తురే. 370

శా. ఇష్టాపూర్తులు దానధర్మములు పుణ్యేష్టిప్రచారంబులుం
దుష్టిం దోడుగఁ జెప్పుచుంటి విను మీదుఃఖంబు చల్లాఱ నా
దుష్టస్వాంతుల సృంజయప్రభృతులం ద్రుంగింతు నేఁ డెట్టులున్
గష్టం బోర్చి జనార్దనుండు గనుఁగోఁగం జేయు మాజ్ఞాధృతిన్. 371

వ. అనిపలికిన మనఃప్రీతిజనకంబు లగువానివచనంబు లాకర్ణించి కౌరవేశ్వరుండు కృపా
చార్యుం బిలిచి నీవు నాకుం గూర్చుపాఁడ వై జలపూర్ణకలశంబు దెచ్చి సైన్యాధిప
త్యంబున నాచార్యాపత్యంబునభిషేకింపుము రాజనియోగంబునం జేసి బ్రాహ్మణుండు

క్షత్రధర్మప్రవర్తకుండై ప్రధనంబు ప్రవర్తింపఁ జేయ నర్హుం డని ధర్మజ్ఞులు సెప్పుదు
రని చెప్పిన నాశారద్వతుండు నీసుతుండు చెప్పినచొప్పునం గావించె నట్లభిషిక్తుం డైన
బ్రాహ్మణసత్తముండు నృపోత్తముం గ్రుచ్చి కౌఁగిలించుకొని దిక్కులు పిక్కటిల్ల సింహ
నాదంబు సేయుచు నతనిచే ననిపించుకొని కృపకృతవర్మసమేతుం డై కృతగమనుం
డయ్యె దుర్యోధనుండు ధూళిధూసరితాంగుండును శోణితపరిప్లుతుండు నై సర్వభూతభ
యావహం బగునారాత్రి యంతయుం గంఠగతప్రాణుం డై పడినచోటం బడియుండె
నని సంజయుండు ధృతరాష్ట్రున కెఱింగించె నని. 372

క. జనమేజయజననాథున, కనుపమమేధానిధాన మగువైశంపా
యనమౌని శల్యపర్వం,బునఁ గలకథ యెల్ల నానుపూర్వము దెలిపెన్. 373

ఆశ్వాసాంతము.

శా. రారాజై నను రాజతాచలమునన్ రంజిల్లువాఁ డైన వి
ద్యారాజీవభవుండు తానయిన సత్యాశప్రభాభ్రాజితుం
డై రెక్కొన్నను గాలనిర్మితిని ద్రోయం జాలఁ డై ప్రొంగు నీ
దారిం గాంచియుఁ గన్నుగానరు జనుల్ దార్ష్ట్యంబునం గష్టులై. 374

మాలిని. సకల ఖలవిదారీ! సర్వలోకోపకారీ!
ప్రకటితగుణహారీ! పండితేంద్రానుసారీ!
నికృతిరహితసూరీ! నిత్యసత్యప్రసారీ!
సుకవిహృదయధారీ! శుద్ధవిద్యావిహారీ! 375

గద్యము.

ఇది శ్రీమదధునాతనోభయకవిమిత్రి వేంకటయజ్వాగ్రిపుత్త్ర
సమారాధితవిబుధరాజ శ్రీపాదకృష్ణమూర్తి కవిరాజ
ప్రణీతం బయిన శ్రీకృష్ణభారతంబునందు
శల్యపర్వంబున సర్వంబును
ద్వితీయాశ్వాసము.
శ్రీ. శ్రీ. శ్రీ.

---

మ. తనలో నా ల్గుపపర్వముల్ గలిగి గంధప్రాయమై భారతం
బునువృత్తంబున సుప్రసిద్ధ మయి శల్యప్రాభవప్రాప్తమై
ప్రణుతిం గాంచినశల్యపర్వ మిది గీర్వాణానుసారంబుగా
నొనరించెం గవిరాజకృష్ణుఁడు మహోద్యోగంబు సంధిల్లఁగన్.



బాలాత్రిపురసుందర్యై నమః

# శ్రీకృష్ణభారతము

## సౌప్తికపర్వము - ప్రథమాశ్వాసము.



వేదవ్యాసముని
ద్భావగతార్థప్రసూక్తి భావించి నినున్
సేవించుదీనుని న్నను
నీవలనం జేర్చుకొనుము నిఖిలాండపతీ. **1**

వ. అక్కథకుండు శౌనకాదిమహామునుల కి ట్లనియె నట్లు దుర్యోధనుని వీడ్కొని వారు ముగ్వురు నానాయంసమయంబున దక్షిణాభిముఖులై కదలి పాండవశిబిరంబుల సమీపంబునకుం జని శత్రుశస్త్రక్షతవిగ్రహులు గానం బాండవులం దలంచుకొని నిట్టూర్పు నిగిడించుచు విజయు లగుటం జేసి చేయువిద్వేషులపేరెలుంగు లాలించి ముట్ట వత్తు రనుభయంబునం దొలంగి ప్రాఙ్ముఖంబుగ నొక్కముహూర్తమాత్రంబు పఱచి తారును వారువంబులు నలసి దప్పి దగిలియుంట నడువ నోపక రాజవధామర్షకర్షితహృదయులై పరితపించి రనిన విని ధృతరాష్ట్రుండు. **2**

ఉ. నమ్మఁగఁ బోలకుండెడిని నాగవరాయుతసత్త్వుఁడై సుశౌ
ర్యమ్మునఁ దోఁగునాసుతుని నాపవమానసుతుండు గూల్చె నా
నమ్మకచెల్ల భూతతతి కాతఁ డవధ్యుఁడు వజ్రవిగ్రహుం
డిమ్మెయి రిత్తవోయె నన నేరి కలంఘ్యము దిష్ట మక్కటా. **3**

చ. సుతశత మిట్లు కూలె ననుచు న్విని నాహృదయంబి దెట్టిదో
చితుకదు వేయి వ్రక్క లయి చేష్పడిపోవదు ఱాత నయ్యెనో
కత మెఱుఁగంగ రాదు నలకంతయు నంతయు నింత గాఁగ నీ
క్షితిపయి నేవిధంబున వసించెదరో కద వృద్ధదంపతుల్. **4**

తే. రాజునై రాజుతండ్రినై రాజులతల, మానికము నయి మెలఁగిన నేను ప్రేష్య
భావమునఁ బాండవులచెంత బ్రదుకఁ జాలఁ, గలనె సంజయ! నా కింకఁ గల దెదిక్కు.

చ. విదురునిమాటల న్వినక వీఱేఁడి నాఁడు కింత తెచ్చె నే
'బ్రదుకఁగఁ జాల నూర్వురను బట్టి వధించినగాడ్పుపట్టి ప్ర
ల్లదముల నాలకించుచు నలంతిబలెం బగ ఱేఁడుకూఁటికిన్
మది పొనరించుచుం బిఱుసుమాటలపోటులఁ గుళ్లిపోవుచున్. 6

వ. కానిమ్ము గావల్గణీ! కా నున్నది కాక మాన దట్లధర్మంబున దుర్యోధనుండు హతుం డగుటకుఁ గృపకృతవర్మాశ్వత్థామ లేమిచేసి రెఱింగింపు మనిన నతం డి ట్లనియె నట్లు కొంతదూరంబు వోయి వారు మువ్వురు నానాద్రుమలతావృతంబును నానామృగగణసేవితంబును నానాపక్షిసమాకులంబును నానాపుష్పోపశోభితంబును నానాతోయసమాకీర్ణంబును నగు నవ్వనంబున నలుగడం బరికించుచు శాఖాసహస్రసంఛన్నం బగు నొక్కమఱ్ఱివృక్షంబు వీక్షించి దానిక్రింద రథంబులు డిగి రథ్యంబుల విడిపించి వార్చి సంధ్యోపాసనంబు గావించుచుండి రంత. 7

కృపకృతవర్మాశ్వత్థామ లారాత్రి యొకమఱ్ఱికడ విశ్రమించుట.

సీ. అరుణాంశుమండలం బస్తంగతం బయ్యె, సాంధ్యరాగం బెల్ల జగము గప్పె
శర్వరీముఖము ప్రశస్తమై చూపట్టె, గ్రహతారకాదులు ప్రబలఁ జొచ్చె
నంబరం బెల్లఁ జిత్రాంబరం బన నొప్పెఁ, జీఁకట్లు తలసూపి చిక్క నయ్యె
నిఖిలసత్వంబులు నిద్రావశము లయ్యె, రాత్రించరములనిహ్రాద మెసఁగె

తే. నట్టిరాత్రిముఖమ్మున నమ్మహార, థులు ముగురు దుఃఖకర్శితాత్ములు శ్రమాన్వి
తులును గావున నమ్మఱ్ఱికెలనఁ గూరు, చుండి చింతించుచుండి రయ్యుద్ధవిధము. 8

చ. అలయిక నైననిద్దురకు నామెత వెట్టుచుఁ గన్నుదోయి ఱె
ప్పలు బలు వెక్కు మూఁత లయి పాటునకుం గడకట్టుకున్న మే
నులు మఱవంగనై కృపుడునుం గృతవర్మయు నత్తమిల్లి ర
త్తలమునఁ గార్యభారపరతం గలదుఃఖము శాంతి నొందఁగన్. 9

క. మెత్తని పాన్పుల పరవు, ల్లొత్తఁగఁ బాదములు నిద్ర నొందెడు సుకుమా
రోత్తములు వా ర్మారపుటా, లొత్తఁగ మిడినేల నిద్ర నొంది రనదలై. 10

వ. ద్రోణపుత్రుండు క్రోధదందహ్యమానమానసుండై మహానాగంబువలె రోజుచు నిదురింపక కూరుచుండి నానాసత్వవిషేవితంబును ఘోరదర్శనంబు నైన కాననంబు నలువంకలఁ గలయఁ బరికించి వటవిటపివిటపంబులఁ గాకసహస్రంబులు తమతమకులాయంబుల సుఖనిద్ర చేయుచుండం జూచుచుండె నంతఁ గొంతవడికి. 11

మ. కొఱవిం ద్రిప్పినరీతి గూండ్ర నగుచుం గ్రుడ్లగ్నివర్ణంబులై

మెఱయం బింగళదేహకాంతులు గడు న్మిన్నెల్లఁ గెంజాయలన్
నెఱయం జేయుచు ఘోరఘోణనఖముల్ నిర్నిద్రశస్త్రాకృతి
న్వాఱల న్వచ్చె నులూక మొక్కఁడు వడిం దాష్ట్యండు నా ఱొప్పచున్. 12

అశ్వత్థామ యులూకంబు వచ్చి కాకులం జంపుట నాలోకించుట.

ఉ. చప్పుడు సేయకుండ వటశాఖపయిం గడు నేర్పు పేర్పడన్
గుప్పున వ్రాలి లీన మయి కొమ్మలసందునఁ గొంతసేపు తా
నప్పు డడంగి వాయసము లన్నియు నిద్దుర నుం డెఱింగి పెం
పుప్పతిలంగఁ బొంగుచు సమున్నతిఁ గైకొని ఘూక మాఁకటన్. 13

మ. శిరముల్ ద్రుంచియుఁ గొన్నిటిం జరణముల్ చెండాడి కొన్నింటి బే
రురముల్ చీలిచి కొన్నిటిన్ గఱులప ట్లూడించి కొన్నింటి న
చ్ఛరణాస్త్రంబు లయాంతకాకృతి విలాసం బేర్పడం జంపె న
త్తరుశాఖాగ్రములందుఁ బొందుపడి నిద్రంబోవు కాకంబులన్. 14

తే. నిముసమున నెల్లఁ గులల నెమకి నెమకి, యిట్లు వధియించి ఘూక మావృక్షమండ
లాంతరం బెల్లఁ దచ్ఛరీరాంగములను, గప్పి కౌతూహలంబున నొప్పుచుండె. 15

చ. పగతురఁ బట్టి త్రుంచి గరువంబున మెట్టెడుజోదు పోలికన్
దగినపతంగముం గనియు దానిపొనర్చినచేత లెంచియుం
దగునుపదేశ మయ్యె నిది నాకని డెందమునం దలంచుచున్
మగఁటిమిఁ బూనెఁ గుంభజకుమారుఁడు కార్యవినిశ్చయంబునన్. 16

క. బలవంతులును గృతోత్సాహులు జయశీలురును శత్రుయోధులు వారిం
బొలియింప బ్రతిన వట్టితి, ఛలమునఁ గాకెట్లు కార్యసాధన మెసఁగున్. 17

మ. ఋజుమార్గంబున వారితోఁ బెనఁగ నే నేగం దలంపెట్టినన్
నిజ మగ్నిన్ శలభంబు ద్రెళ్ళుపగిది న్జీవంబులం బాయనౌ
నజితుల్ వార లుపాయ మె యుచటఁ జేయం జెల్లు నియ్యర్థమున్
వృజినం బం చనఁ బోఁడు ధర్మవిదుఁ డేవీరుండు నిర్ధారణిన్. 18

తే. తనకు విజయంబు సిద్ధించుదారి యెద్ది, దైనఁ గైకొని జనుఁడు కార్యం బొనర్ప
నొప్పు నప్పాండవులు విజయోచితములు, ననుచితము లెన్నియేఁ జేసి రని తెలియమె.

సీ. అలసినప్పుడు వీఁగినప్పుడు విఱిగిన,యప్పుడు పఱచినయప్పు డనికిఁ
గాకున్న యప్పుడుఁ గాఱియపడునప్డు, దళవాయి నష్టుఁడై తఱలినపుడు
నడురేయిఁ గున్కునప్పుడును బెక్కుఁ దెఱలంగ, లయినప్డు చేఁ జిక్క నయినయప్డు

వీక్రమించి విపక్షచక్రిముం దునుమాడ, నొప్పదు నని శాస్త్ర మొప్పఁ జెప్ప
తే. క్షత్రధర్మజ్ఞులీరీతి చనున యండ్రు, గాని కా దని పలుకరు గాన నేను
నిద్రితుల శాత్రవుల నెల్ల నేఁటిరేయిఁ, జంపెద నటంచు నతఁడు నిశ్చయ మొనర్చె.

వ. ఇట్లతికౄరకార్యంబునఁ గ్రూరనిశ్చయంబు గావించి నిద్రితులై యున్న కృపకృతవర్మ ల మేల్కొలుపుటయు వారు తమనిద్రించుటకు సిగ్గుపడుచు నూరకున్నంత నతం డొక్కముహూర్తమాత్రంబు చింతించి కంట నీరు వెట్టుకొనుచు గద్గదకంఠంబున వారి కి ట్లనియె. 21

సీ. ఏకాదశాక్షౌహిణీశుండు నేకవీరుండు నుద్దండబలుండు నైన
కౌరవేశ్వరు క్షుద్రకర్ముఁడై భీమసేనుఁడు నృశంసంబుగఁ దొడలు విఱిచి
పొలియించుటయె కాక, మూర్ధాభిషిక్తుఁ డాఘనునిశీర్షము కడకాలఁ దన్నఁ
బడి నేల వేదనాభరమున నే కాక, పరిభవంబున నిప్డు బడలు నృపతి
తే. సంతసించుచుఁ బాంచాలు రెంతయేని, నవ్వు చార్చుచు నాడుచుఁ గెవ్వు మనుచు
సంకు లొత్తుచు మొత్తుచు సతము భేరులులివు దెసలెల్ల నిండించుచుండి రకట.

వ. అదిగోఁ దూరుఘన నశ్వహేషితమ్ములునుగజబృంహితమ్ములును శూరులసింహనాద మ్ములును రథనేమినిస్వనమ్ములును విన వచ్చుచున్న వాకర్ణింపుఁడు. 23

శా. ఈయుద్ధంబున ధార్తరాష్ట్రబలముం దిద్ధాస్త్రవిద్యాధ్వరుల్
వ్యాయామార్జితమత్తవారణశతప్రాణుల్ మహాయోధు లా
దాయాదాస్త్రహతాంగు లైరి విపరీతప్రాప్తకాలమ్మునం
గాయమ్ము ల్విడ కుంటి మీముగురముం గన్గొంగ శేషంబుగన్. 24

ఆ. ఇట్టు లున్నయప్పు డేభంగి కార్యంబు, సేయ నగునొ మనకు శ్రేయ మదియు
తెలుపుఁ డయ్య మోహకలితంబు గాక మీ,బుద్ధిబలము ప్రకృతిఁ బొంది యున్న.

వ. అనినఁ గృపాచార్యుండు ధనురాచార్యనందనుం దిలకించి నీచెప్పినది వింటిని నీవు నాచెప్పినది విను మని యి ట్లనియె. 26

—కృపాచార్యుం డశ్వత్థామకు నీతివిశేషంబు లెఱింగించుట—

ఉ. దైవము పౌరుషంబు ననుద్వంద్వమునం బ్రతిబద్ధ లీజనుల్
కేవలపౌరుషంబునను గేవలదైవమునం గ్రియాఫలం
బీవసుధం బొసంగదు ప్రవృత్తినివృత్తులు రెండు రెండిటన్
గావలెఁ గాని యొండిటను గానితెఱంగు నిజంబు సెప్పితిన్. 27

ఉ. వానలు గల్గినన్ నగము పండదు దున్నిన మంచిక్షేత్రమున్

వానలు లేకయుండినను బండదు లెస్సగ దున్ని బీజముల్
మానుగఁ జల్లినంతటఁ బొలంబున వానలు గల్గె నేని దై
వానుగతిన్ ఫలించు నరయం బురుషార్థముసిద్ధి యిట్టిదే. 28

ఉ. దైవబలం బెఱింగి కొని దానివెసం బురుషప్రయత్నముం
జేవ మెయిం బొనర్చినను జేకుర నయ్యెడుఁ గార్యసిద్ధి యా
దైవబలంబు దప్పి పెడదారిని బోయెడునట్టి పౌరుషం
బేవగ నైనఁ గొల్పుటకు నెంచఁగఁ బోవఁడు ప్రాజ్ఞుఁ డెప్పుడున్. 29

ఆ. పురుషకార మెప్డు పొసఁగు దైవము కల్మిఁ, బ్రాజ్ఞుఁ డిట్లు తెలిసి పరఁగఁ జేయుఁ
గార్య మఫలగతికిఁ గా దెఱుంగనివాని, చేత విఫల మగుచుఁ జెడు నిజంబు. 30

తే. శ్రమ మొనర్పక యొకఁడు ఫలమును బడయు, మఱియొకం డెంత యో శ్రమంపడియు ఫలమొ
కింత యేనియుఁ బడయఁ డీయిద్ద ఱెన్న, దుర్దశులు నాఁగ నొప్పుచుందురు ధరిత్రి.

సీ. లాలసుం డయి దక్షుఁ డీలీలనే సుఖముగ జీవనము చేసి పొనరుచుండు
నతఁడు ప్రాయికముగా నఖిలహితార్థియై, కానఁగఁ బడుచుండు త్మ్యోతలమున
నారంభముల దక్షుఁ డగువాఁడు ఫల మందకుండు నేనియు దూఱు నొందకుండు
నారంభమునఁ గానియతఁడు దైవమున ఫలము నొందియును నిందలకు నెలవగుఁ

తే. గార్యగతు లిట్టు లుండ నిక్కారణిఁ గాక యుండు తెలిఁగున వర్తింప నుండు నతఁడు
పొందెడు ననర్థముల నని బుద్ధిమంతు, లెఱిఁగి నీతిపథంబున నేగుచుంద్రు. 32

తే. దైవపౌరుషము లహీనతం బొసంగఁ, జేయు కార్యము విఫలమై చెడును వేలు
పులకు మ్రొక్కుచు నారంభముల నొనర్చు, నట్టిదక్షుఁడు విఫలత్వ మందఁ డెపుడు.

తే. ధరణి వృద్ధోపసేవయుఁ దన్మతానువర్తనంబును సిద్ధికి వర్త్మ మగుఁ
గావునం బుద్ధిమంతుఁ డగ్గతి మెలంగి, సాధ్యసాధనపరుఁ డయి సౌరు మీఱు.

శా. రాగక్రోధభయాన్వితుండు నరుఁ డారంభంబులం జేసి దు
ర్యోగప్రాప్తి ననీశ్వరుండు నసమర్థుం డై పరీభావముల్
రాఁగన్ సంపద లన్నియుం జెడఁగ శీఘ్రం బెల్లకష్టంబులున్
మూఁగన్ దుఃఖపరంపరాకలితుఁడై పోకారు నిక్కంబుగన్. 35

వ. ఆకర్ణింపుము. 36

మ. మనదుర్యోధనుఁ డర్థలుబ్ధుఁడును గామక్రోధమోహాన్వితుం
డును మూఢుం డవిచింతితుండును ఖలుండుం గావునన్ బుద్ధిమ
త్పునితోక్తుల్ విని నొల్ల కల్పునుడుల్ పాటించి పాపాత్ముఁడై

ఘనులం బాండవులన్ ద్యజించి ప్రతిపక్షత్వంబు గాంచెం గదా. 37

క. మున్నెఱుఁగఁడు దుర్బుద్ధిఁ, డున్నది తనశక్తి యెట్టిదో యని యుప్పు హా
పన్నుండై హితవాక్యము, లెన్నే విన నైతి ననుచు లావు తపించున్. 38

ఆ. అట్టిపాపపూరుషాధమున్ మన, మనుసరించి వానియనుమతిమెయి
నున్నకతన దారుణోన్నత మనయంబు, దాపరించె మనకుఁ దలను దన్ని. 39

ఉ. ఆవ్యసనోపతాపితుఁడ నై విమనస్కుఁడ నౌట నే నిటన్
భవ్య మెఱింగికోఁ గలుగుప్రజ్ఞ లభింపనివాఁడ నైతి నా
త్మవ్యవసాయమోహితుఁడు తద్విధ మెల్ల సుహృజ్జనోక్తి సం
భావ్యముగా నొనర్చుకొని ప్రస్తుతి కెక్కుట లొప్పు నెప్పుడున్. 40

తే. కావునన్ మన మిప్పుడు కరినగరముఁ, జేరి ధృతరాష్ట్రునకును గాంధారికి మతి
మంతుఁ డగువిదురునకు నియ్యంతయు నెఱిఁగించి నడుతము వారు బోధించినట్లు.

క. జగతిం గార్యారంభము, తగ దని నామతము గాదు తగ నెఱిఁగి పౌన
ర్భ్వఁగ నగుఁ గాకుండిన దైవగతిం గొనఁ గలుగ దనుచు వగ పుడుగ నగున్. 42

వ. అని కృపాచార్యుండు ధర్మార్థసహితంబుగఁ దెలిపిన విని ధనురాచార్యాత్మజుండు ప్రజ్వలితాగ్నితెఱంగునఁ దఱుఁగనిశోకంబు తన్నెఱియింప నుత్తలంపడుచిత్తంబునఁ గృపకృతవర్మలదిక్కు మొగంబై యిట్లనియె. 43

—అశ్వత్థామ కృపకృతవర్మలతోఁ దననిశ్చయం బెఱింగించుట—

చ. ప్రతిపురుషుండునుం దనకుఁ బాటిలుబుద్ధియె బుద్ధి యంచు లో
నితరుల బుద్ధులం దెగడ నెంచును బుద్ధిమదగ్రగణ్యుఁడున్
క్షితిపయి నే ననుం దెలియ నేరఁ డొకింతయుఁ జెంతఁ జేరి సం
స్తుతు లొనరించువారిఁ దనతో సరి చెప్పను జెప్పఁ డన్యులన్. 44

తే. చిత్తములు చిత్రగతులను జెలఁగుచుండు, దాన వైకల్యమును బొందుఁ గాన బుద్ధు
లును దదనుకూలములుగఁ బుట్టిపొనరుచుండుఁ, గుతలమునయందు మానవకోటులకును.

చ. కృతి యగువైద్యుఁ డామయమురీతి నెఱింగి తదీయశాంతి కం
చితగతి భేషజం బరసి చేయువిధంబునఁ గార్యయోగసం
గతి కగునట్లు బుద్ధి చొరఁగం బొనరింతురు బుద్ధిమంతు లి
ష్టతఁ గొనఁ బో కహంయు విఁకఁ జాలును బొమ్మని దూరు దానిన్. 46

చ. మనుజుఁడు బాల్యమందు నొకమాడ్కిని యౌవనమందు మాఱురీ
విని మఱివార్థకంబునను వేఱొకరీతిని నైజ మైనబు

ద్ధినిఁ గలవాఁడ యయ్యు జగతిన్ వ్యసనాదుల బుద్ధి వైకృతం
బును గొనునట్టిఁడై తనదుబుద్ధికిఁ బోల మెఱుంగుమండెడిన్. 47

క. కృతకృత్యము గామిం దన,మతియే తన కింపు గానిమాడ్కిం దోఁపం
గతి దప్పి మెలఁగు నన్నరుఁ, డిత మెఱుఁగం జాల కుండు నెపుడున్ జగతిన్. 48

సీ. ప్రజ్ఞానుగతిబుద్ధిఁ బడసి కార్యమ్ము న,మీక్షించు టుద్యోగలక్షణంబు
తమబుద్ధియే మహోత్తర మని యెల్లరు, మారణాదికకర్మమార్గు లగుదు
రే నిప్డు శోకరాహిత్యముఁ గోరుచు, దెలుపుదు నాబుద్ధితెఱఁ గదెల్ల
సృజియించి ప్రజల నయ్యజుఁడు వారికి నను,గుణముగాఁ గర్మముల్ కూర్చి పెట్టె
తే. బ్రాహ్మణులకు వేదముక్షత్రవరున కోజ,మర్త్యులకు దాక్ష్యమునుశూద్రవర్యులకుఁద్రి
వర్ణహితము ధర్మం బని పలికె నట్లు,కాక యున్న వా రధములు కాక యుండ్రె. 49

మ. ప్రణుతం బైనమహీసురాన్వయమునం బ్రఖ్యాతి కెక్కంగ నే
జననం బందియు మందభాగ్యవశతన్ క్షత్త్రోక్తధర్మంబు గై
కొని దివ్యాస్త్రములన్ గ్రహించి సమరక్షోణిం బ్రవర్తించి కా
దని దానిం దెగనాడి వెండియును బ్రాహ్మ్యం బొందఁగా నెంతు నే. 50

చ. అని మొననేను శస్త్రములు నస్త్రములుం గొని యుండ నొండొకం
డనయముగన్ మదీయపితృహంతకుఁడై యుసు రూని యుండె వా
నినిఁ గనుఁగొంచు నెట్లు ధరణి న్మన నోపుదు నింక క్షత్త్రధ
ర్మవిరతి నొప్పి తండ్రియును రాజును బొందినచొప్ప పొందెదన్. 51

మ. జయహర్షంబున నేఁడు శాత్త్రవులు విశ్వస్తాత్ములై శస్త్రసం
చయముం బెట్టి తనుత్రముల్ విడి రణశ్రాంతాంగులై యేమఱి
ల్లి యటన్ నిద్దుర వోవుచుండ్రు శిబిరాళిం బొంది నే నందుఁ జే
రి యొకల్ గానక పీనుఁ గట్లయినవారిం బట్టి భిట్టేసెదన్. 52

మ. శతమన్యుం డమరారులన్ బలెను ధృష్టద్యుమ్నముఖ్యారిసం
తతులం దాఁకి హరుండు మున్ను పసులం దర్శించిన ట్లెల్లరన్
శతకోటిం బురుడించునాదునసికిన్ సంధించి భ్రమందించి నా
పితృపాదాదిబుణంబు దీర్చి యమరాట్ప్రీతిం బ్రవర్తించెదన్. 53

చ. అడిదము చేతఁ బూని పరిశయాంతకునట్టులు బిట్టు రేఁగి పే
ర్పడినపరాక్రమంబున నరాతులకుత్సుక లుత్తతించి బ
ల్వాఁడ నయి భూతసంతతు లవుం బళి రే యని ప్రస్తుతింప న

వ్రీడిదలఁ బీన్గు పెంటలను గాల్వవన్నె వన వాఱఁ జేయుచున్. 54

వ. అనిన విని కృపాచార్యుఁ డాచార్యనందనున కి ట్లనియె. 55

—కృపాచార్యుఁడు నిద్రాసక్తులఁ జంప రా దని చెప్పుట—

చ. ప్రతికృతి సేయ నెంచి తది భాగ్యము నిన్ను మరల్ప శక్తుఁడే
శతముఖుఁ డట్టివాఁ డయిన సాధితశాత్రవలోక ! మాకు నీ
మత మిది సమ్మత మ్మిపుడు మార్కొనఁ జాలము గాని రేపు నీ
ప్రతిఘుకుఁ బోలఁ దోడుపడి వత్తుము చొత్తుము విక్రమింతుమున్. 56

క. మైమఱువు విడిచి నీ వీ, రే మాకడ విశ్రమించి రేపాడి రిపు
స్తోమమ్ముఁ దునుమ నేగుము, మేమును దో డరుగుదే మమిత్రధ్వంసీ. 57

ఆ. నిద్ర లేక నీవు నెఱి దప్పియుంటివి, మేము నటులె కంటిమీఁది కెక్కి-
బరువు దోఁపఁ గూర్కు పరవశ మొనరించి, మలఁపుఁ గొనుచునుండె మనల నిపుడు.

క. ఈకృతవర్మయు నేనును, నీకుం బరివార మగుచు నిలువఁగ నీవున్
లోకాతీతపరాక్రమ, పాకంబున నడుము టరుదె పాంచాలకులన్. 59

మ. కృతవర్మం డఖిలాస్త్రవిద్వరుఁడు నీ వీమాతులుం డట్టిఁడో
మతి నూహింతువు వీర లిర్వురును నీమైమర్వు లై యుండ నిన్
గృతహస్తుం బ్రగృహీతశస్త్రు నెదురన్ గిగ్గాడినూ డెంతవా
టి తలంపన్ శతమన్యుఁడుం దలఁకెడిన్ డీల్పాటువన్ డిందెడిన్. 60

తే. కావున న్మన మీరేయిఁ గడపి యిచట, వేగినంతన కడఁగి యవ్వీళ్ళ కేగి
పేరువాడి పాంచలాదివైరిసమితిఁ, జంపి వత్తము కాకున్నఁ జత్త మందు. 61

వ. ఈరెండునుఁ గాక మఱియొక్కండు గా నేర దని హితంబు లాడుచున్న శారద్వతు
న కశ్వత్థామ క్రోధసంరక్తలోచనుండై యి ట్లనియె. 62

క. ఆతురున కర్థచింతా, న్వీతునకు నమర్షితునకు విస్రుతకామో
పేతునకు నిద్ర వట్టమి, భూతలమున నెఱుఁగకున్న పురుషుఁడు గలఁడే. 63

క. ఇం దొకఁ డొక్కండే ని, ద్రం దొలఁపన్ శక్తి గలిగి తనరెను నాకుం
బొందుపడె నీచతుష్టయ, మందున నిపు డెట్లు నిద్ర యగునో చెపుమా. 64

ఉ. ఆలములోన నాజనకుఁ డ ట్లయిపోక దలంపువచ్చినన్
రేలుఁ బవళ్ళున్ మది పొరింబొరిఁ గాల్చినయట్లు క్రాఁగెడిన్
ప్రీలెడు మర్మముల్ తనువు వీఁకపడుం దలపోయఁ బౌరుషో
ద్వేలత గల్గువాని కిల దీనికి మించినదుఃఖ ముండునే. 65

క. చాపగురుం జంపితి మని, పాపులు పాంచాలసుతులు పలికెడిపలుకుల్
రూపించి వినుచు ననుఁబోల్, వ్యాపకుఁడు నిమేషమాత్ర బ్రదుకం గలఁడే. 66

తే. బ్రాహ్మణోత్తము నాతండ్రిఁ బట్టి కుతికఁ, గోసి నట్టిధృష్టద్యుమ్ను బాసటయగు
నల్లరం బట్టి వధియింతు నిట్లు సేయ, కేను బ్రదుకంగఁ జాలుమనే ధరిత్రి. 67

వ. ఇదియునుం గాక. 68

ఉ. క్రూరునిచేఁ దొడల్ విఱిగి కూలినయేలికకుయ్యి విన్నచో
నేరికిఁ గాని చిత్తము దహింపదొ కందొవ నీరు నింపదో
భూరమణుం డతండు మముబోఁటులు మేటిమగల్ సజీవులై
ధారణి నుండ నిట్లగుట తల్ప సుఖంబున నిద్ర వట్టునే. 69

మ. నరనారాయణరక్షితం బయిన సేనావారము న్మట్టి కోఁ
దరమే యుగ్రున కైన మర్త్యుల కిఁకం దర్కింపఁగా నేల యే
కరణింగాని జయింపఁగాఁ దలఁచి కిన్కం బూనియున్నట్టినా
కరవాయిం గొలుపంగ నీ కగునె శౌర్యవ్యంజనం బిట్టిదే. 70

తే. వార్తికులు మిత్రపరిభవ మార్తిఁ దెలుపు, నప్పటియునుండి నాచిత్త మలజడిపడుఁ
గాన సౌప్తికమున వారి గండడంచి, విశ్రమించి నిద్రించెద వినుము మామ. 71

వ. అని కృతనిశ్చయుం డయినభాగినేయునకుఁ గృపాచార్యుండు వెండియును. 72

—కృపాచార్యుం డశ్వత్థామకు హితోపదేశము సేయుట—

చ. హిత మెఱుఁగం దలంపు గలఁడేనియు మేధ యొకింత లేనియీ
క్షితిజనుఁ డింద్రియంబులను జిక్కఁగఁ బట్టఁగ లేమి ధర్మసం
గతి దెలియంగ లేఁ డటులు కన్గొన మేధ గలండ యయ్యు నీ
క్షితి వినయంబు లేనతఁడు చేకొనఁ జాలఁడు ధర్మమార్గముల్. 73

సీ. చిరకాలము జడుండు సేవించియుండు బుధవరుల సూపరసంబు గరిటె వోలెఁ
దగ్రగహింపఁగ లేదు ధర్మము ప్రాజ్ఞుం డుపాసించి పండితపరిచయమున
నింతలోఁ బడయు జిహ్వక సూపరసమును, బలె ధర్మగతి యెల్ల వసుధయందు
నియతేంద్రియుం డయి నెఱిమీఱి శుశ్రూషు, వైనమేధావి సర్వాగమములఁ

తే. దెలిసిగ్రాహ్యార్థములనెప్పుతొలఁగఁద్రోయఁ, డనయుఁడవమానియుదురాత్ముఁడైనవాఁడు
తనకుఁ గళ్యాణ మగుదిష్టమును ద్యజించి, పాపకర్మము లొనరింపఁ బాలుపడును.

ఆ. నాథవంతుఁ డైననరుని సుహృజ్జనుల్, పాతకమునుండి పాయఁ గరపు
చుందు రానిలక్ష్మి నొందు వాఁ డొ నరు, ననఁతు లక్ష్మి నొందనట్టివాఁడు. 75

చ. బహువిధవాక్యసంగతులఁ బ్రజ్ఞ గలట్టిరు దిద్దనేర్తు రా
సుహృదులు చెప్పినట్లు విని సూనృత మెంచుచు దుష్టకార్యముల్
విహితము లంచు నెంచక భువిం దమప్రాజ్ఞత నెల్ల సత్పథ
ప్రహితులు గాఁగ మాఱుదురు వారికి విమ్యతి గల్గ దెప్పుడున్. 76

వ. లోకప్రవృత్తి యిట్టియది కావున. 77

శా. నిశ్చాంచల్యము గల్గి నాపలుకలన్ నీచిత్తము న్నిన యీ
దుశ్చారిత్రమునుండి మళ్ళికొనఁ రీతు ల్వాందఁగాఁ జేసి ప్రా
యశ్చిత్తంబు దలంతువేఁ గొనెదు కళ్యాణంబు లిల్లైనఁచోఁ
బశ్చాత్తాపము నొందఁ బోవు వెనుకన్ బాహాబలభ్రాజితా. 78

సీ. వినుము నిద్రితులను విగతాయుధులను వీ, తరథాశ్వులను భీతిఁ దరలువారి
విరిసినతలవారి శరణన్న వారిని, జంపరా దని ధర్మశాస్త్ర మెసగుఁ
బాంచాలు రిపుడు విశ్వస్తులై కవచాయు, ధమ్ములు విడిచి నిద్రావశమున
నొడ లెఱుంగక చచ్చి పడియున్నవారు నా, నుఁదు రిట్టియవస్థ నున్నవారిఁ
తే. బట్టి వధియించుదుర్మతి పారరహిత, మై యగాధమై ఘోరము నైననరక
నీరధిం గూలి మునుఁగుట నిక్కువంబు, నిఖిలధర్మార్థవిదుఁడవు నీ వెఱుఁగవె. 79

వ. వత్సా! శస్త్రాస్త్రవిదులలోన శ్రేష్ఠుఁడ వని పేరు వడసితి వింతకు మున్నెన్నఁడు నే నింతపాపము ను జేసి యెఱుంగవు ధర్మజ్ఞప్రవరుఁడ విట్టినీ వసంభావితరూపం బైన దుష్కార్యం బాచరించితివ యేని మఱుంగు మసి నంటిన ట్లగు సూర్యసంకాశుండ వగునీవు సూర్యోదయం బగునంత సర్వభూతప్రకాశమానంబుగఁ బరాక్రమించి శాత్రవుల నుక్కడంపు మనిన మామ కల్లుం డిట్లనియె. 80

—అశ్వత్థామ కృపునిమాటలు నిరాకరించి కార్యోన్ముఖుం డగుట—

తే. నిజము నీచెప్పినది యెల్ల నే నొకింత, విన్నపము సేయవలసిన విధము కలదు
వినుము మీయెల్లరసమక్షమునన ధర్మ, సేతువును మున్న త్రెంచి రా చెనఁటులెకద.

సీ. సన్న్యస్తశస్త్రు నాజనకునిఁ బాంచాల, కులపాంసనుఁడు గోసె గురువు నాఁక
రథచక్ర మిలఁ గ్రుంగి రమణ చెడిన నెత్తు, నపుడు కర్ణునిఁ గూల్చె సవ్యసాచి
విముఖుఁడై శస్త్రము విడిచినభీష్ము శి, ఖండి ము న్నిడుకొని చెండె నరుఁడు
వలదు త ప్పనుచుండఁ బ్రాయోపవిష్టు భూ, రిశ్రవు సాత్యకి ద్రెవ్వనేసె
తే. ధర్మ మెన్నక భీముఁడు తనగదాభి, ఘాతమున సుయోధనుఁ గూల్చె నాతఁ డిపుడు
తొడలు తెగిభూతలంబునఁబడి మహార్తిఁ, గుందుచునివి నాదుమర్మముల్ గోయుచున్న.

క. ఇన్నివిధంబుల ధర్మము, భిన్నము గావించి నట్టిపిశునుల వారిన్
మన్నింతు విట్టి నన్నున్, మన్నింపవు దూరఁ జొచ్చినాఁడవు తగునే. 83

శా. తండ్రిం జంపినవారి నెల్లరను నేధర్మంబునం జూడ కే
వాండ్రుం గన్గొనకుండ సౌప్తికమున న్వాల్వెట్టి ఖడింతు నా
వేండ్రంబుం గనుపింతుఁ బుర్వు నయి యుద్వేంబట్టినం బట్టుదన్
జీర్ణం బైన సహింతుఁ బూనిక నికం జెల్లింప కుండం జుమీ. 84

ఆ. ఊరకుండ నిమ్మ సమోప నే నింకిట, నిద్రవోవుచుండ నేర నిట్లు
వేగిరించునన్ను వేఁడు నాఁగఁగ లేఁడు, మూఁడుజగములందుఁ బూరుషుఁడయి. 85

వ. అని పలికి సత్వరంబుగం దనతేరు పూన్పించి గురుపుత్త్రుండు ప్రాఙ్ముఖుం డయి నడు
వం జొచ్చుటయుఁ గృప కృతవర్మ లతనిం బిలిచి యి ట్లనిరి. 86

శా. ఏకార్థంబున నిట్లు వచ్చితిమి నీ వేలయ్య మమ్మొక్కటై
కాకుండ న్విడిపోవుచుంటి కట దుఃఖం బైన నేమైన నా
నేకీభూతులమై గమింత మనుడున్ హెచ్చెల్లి ద్రోణాత్మజుం
డాకారంబును గొన్న క్రోధ మన డాయ న్వచ్చి తా ని ట్లనున్. 87

మ. శతసాహస్రసపత్నయోధుల ననిం జక్కాడి న్యస్తాస్త్రుఁడై
జతనుం జేయనినాగురూత్తముని ధృష్టద్యుమ్నుఁ డేరీతి నీ
క్షితిపైఁ గూల్చెనొ నేను నాఖలమతిం జక్కాంచు నారీతి నీ
క్షితిపైఁ గూల్చెద గొడ్డునుం బలె మహాసిం గోసి తత్కంఠమున్. 88

తే. పుణ్యలోకంబులం బొందఁ బోనిచాను, వానికిం జెల్లు సన్నద్ధవర్ము లాత్త
కార్ముకాద్యాయుధుల రయి కదలి రండు, పత్తురేసయు రథికులై వడిగనిపుడు. 89

వ. అని రథంబు దోలుకొని పాండవశిబిరాభిముఖుం డై చనియెఁ గృపకృతవర్మలును
వాని ననుసరించినంత నమ్మువ్వురును మూఁడగ్నులం బెలుంగుచు నిద్రిత
జనంబైన శిబిరప్రదేశంబునకుం జని రంత గురుసుతుం డాశారద్వతభోజుల నామం
త్రణంబు చేసి ద్వారంబు సొచ్చుటయు నచ్చట.

— అశ్వత్థామకు శివుడు భూతరూపంబునం దోచుట —

సీ. జ్వాలామాలాకులాస్యంబు చంద్రార్కస, దృశప్రకాశము రూక్షదేహ
మూర్ధ్వికైయాఘ్ర చర్మాంతరీయమ్మును, గృష్ణాజినోత్తరీ యేడితంబు
దంష్ట్రాకరాళవక్త్రము నాగయజ్ఞోప, వీతాంగదము లోకభీతిదమ్ము
నానాప్రహరణోద్యతానూనభుజభూషి, తమ్ము నేత్రసహస్ర దర్శితమ్ము

తే. పర్వతోన్నత ముగ్రరూప ప్రభంబు, రోమహర్షణ మత్యంతదారుణంబు
భూత మొక్కఁడు సద్గురుపుత్త్రు నెదుటఁ, గానఁగా వచ్చె లోకభీకరము గాఁగ. 91

శా. ఆభూతోన్నతరూపవేషము లశక్యంబుల్ వచింపంగ నెం
తే భీమం బగుదానిఁ గాంచినను ధాత్రీధ్రంబులుం బ్రేలు నా
నాభూతశ్రవణాక్షిపక్షముల నుగ్రాస్యు ల్విజృంభించె నం
దాభీలంబుగ శంఖచక్రధరులయి రయ్యెంతలో వేనవేల్. 92

వ. ఇట్లఖిలలోకభయంకరం బగునమ్మహాభూతంబు లోచనగోచరం బగుటయు నమ్మ
హీసురనందనుండు. 93

చ. వెఱ పొకయింతయే హృదయవీథిఁ దగుల్కొన నీక వీఁక మై
బిఱబిఱ శస్త్రవర్ష మొకపెట్టునఁ బెట్టుగ దానిపైఁ బడన్
దొఱఁగినఁ ద్రావె భూత మది దొడ్డశరంబుల నెల్లఁ బెద్దనో
ర్దెఱచి యుదన్వదంబుసమితిం బడబానల మట్లు ప్రేల్మిడిన్. 94

చ. తనశరజాల మాలలి వితావితమై చనఁ జూచి ద్రోణనం
దనుఁడు రయంబునన్ శుచివిధంబున వెల్గెడుశక్తిఁ బూని హు
మ్మని నిగిడించె మంట లెగయం జని భూతము నంటి నం
తన యది త్రెస్సెఁ గల్పదిననాథునిఁ దాఁకి మహోల్కకైవడిన్. 95

మ. గురుపుత్త్రుం డలుకన్ బిలాంతరగతక్రూరాహిచందంబునం
గరవాలం బొఱనుండి తీసి వయివం గా నద్ది భూతాంగగ
హ్వరమందున్ నకులంబు రీతిఁ బడివ మ్మయ్యె న్మహాశ్చర్యముం
బరఁగం జేయుచు నంతలోనఁ గడుకోపం బెర్వడం ద్రోణియున్. 96

క. తోమరవితతిం జక్ర, స్తోమంబును విసరివైవఁ దోడ్తో నవియున్
గోమఱి పోయిన నశ్వ,త్థామ కడుం గినిసి శౌర్యధైర్యము లెసఁగన్. 97

క. పురుహూతధ్వజనిభమై, వరదీప్తి న్వెలుఁగుగదను వడి గొని వైవన్
బరఁగించునంత భూతం, బరుదారఁగ దాని మ్రింగె నావనునోటన్. 98

ఉ. కైదువు లట్లు వమ్మగుట గన్గొని యెద్దియుఁ జేయఁ జాలమిన్
మీఁదులు చూచువాఁ డగుచు మిక్కుటమైన జనార్దనాకృతుల్
రోదసి నిండియుండుట గురుప్రభవుండు భయాంతరంగుఁడై
వేదన కన్యె మాతులుఁడు విన్పినవాక్యము సంస్మరించుచున్. 99

ఆ. సుహృదు లైనవార లహిత మైనను బథ్య, మెఱుఁగఁ జేయునప్పు డెఱిఁగి యెఱిఁగి

తద్గతి నెమ్మలంగఁ దలపోయకుండున, న్నరుఁడు పరితపించు నన్నుఁ బోలి. 100

తే. శాస్త్రదృష్టము లగుధర్మసంగతుల న, తిక్రమించి యెవఁడు హింసఁ దివిరి చేయు
నతఁడు ధర్మ్యపథచ్యుతుం డై కుపథము, నందుఁ బ్రతిహతిఁ బొరసెడు నది నిజంబు.

తే. గోవు విప్రుని నృపతిని గురుని సఖుని, జడునిఁ దల్లినిఁ దండ్రినిఁ బడఁతి భీతు
నంధు నున్మత్తునిఁ బ్రమత్తు నల్పజీవి, నిద్రితునిఁ జంపరా దని నీతికలదు. 102

ఉ. మున్ను గురూపదిష్ట మయి పొల్చినధర్మ మతిక్రమించి నేఁ
డిన్నని గానిమార్గమునఁ దీఱినవాఁ డనయ్యె మహావిప
త్తిన్నఁడ నైతి నిట్టియెడఁ గేవలపౌరుష మేమి యయ్యెడున్
సన్నుతమై జగంబున నెసంగెడు దైవము మెన్నిభంగులన్. 103

క. నాదుర్విధానసంగతి, నీదుర్దశ సంఘటిల్లె నిది యొకభూతం
బా దైవదండ మట్లగు, నేదారియుఁ దోఁపకుండె నిప్పుడు నాకున్. 104

చ. కలుషిత మైననామన మొకానొకధర్మము కానిదానికై
మెలఁగెను దత్ఫలం బగుచు మీఁదఁ బడెన్ భయ మిట్లు దైవమే
కలను దొలంగఁ జేయునది గా నిపు డయ్యె హితంబు గాదు నా
తలఁపున నియ్యెడన్ గిరిసుతాప్రియునే శరణంబు వేఁడెదన్. 105

చ. అతఁడు త్రిలోకరక్షకుఁ డనామయుఁ డక్షయుఁ డీశ్వరుం డుమా
పతి గిరిశుండు రుద్రుఁడు కపర్దిహరుండు హరీంద్రవంద్యుఁ డం
చితవిభవాభిరాముఁ డగుచిన్మయమూర్తి దయార్ద్రచిత్తుఁ డై
ప్రతిభయ మైననాయెదరుఁ బాయఁగఁ జేసి శుభంబు గూర్చెడున్. 106

—అశ్వత్థామ భూతంబునకు భయ మంది శివుని శరణుఁ జొచ్చుట—

చ. అని కృతనిశ్చయుం డగుచు సద్గురుపుత్త్రుఁడు తేరు డిగ్గి నె
మ్మనమున విశ్వరూపుని రమారమణీరమణేష్టమానసున్
మనసిజసంహరున్ హరు సమందగతిన్ స్మరియించి దేహ మ
ప్పన మొనరించువాఁ డగుచుఁ బ్రస్తుతులం బచరించె నెంచఁగన్. 107

ఆ. న న్ననుగ్రహించి నాకు శరణమయి, యిపుడు దొడరినట్టియీవిపత్స
ముద్రముం దరించి పోఁ జేయ హరుఁ డని, ద్రౌణిమేన్ యాచింపఁ దలఁచె నంత. 108

క. హరుఁ డాతనివ్యవసాయం, బరుదారఁగ నెఱిఁగి చేయు నది యెల్లమదిం
బరఁగఁ దలంచినమాత్రన్, వరకాంచనవేది దోఁచె వారలయెదుటన్. 109

వ. అమ్మహావేదియందు జాతవేదసుండు జ్వాలామాలాకులుండై నేలయు నింగియు

దిక్కులు విదిక్కులును నిండి వెలుంగుచుండ నంత దీప్తాశ్వనయనులు ననేకపాదశి రోభుజులును రత్నచిత్రాంగదధరులును ద్వీపశైలప్రతీకాశులును శ్వవరాహోష్ట్ర రూపులును హయగోమాయుగోముఖులును ఋక్షమార్జారవదనులును వ్యాఘ్రద్వీ పిముఖులును దార్వాఘాటముఖులును మహామకరతిమివక్త్రులును సహస్రాక్షులును ప్రదీప్తనేత్రజిహ్వులును జ్వాలాకర్ణులును జ్వాలాకేశులును జ్వలద్రోమచతుర్భుజు లును శంఖమాలాపరికర్ణులును శంఖధ్వనిసమన్వనులును జటాధరులును బంచశిఖు లును ముండులును గృశోదరులును జతుర్దంష్ట్రులును జతుర్జిహ్వులును గుంచితమూ ర్ధభుజులును శతఘ్నీవజ్రహస్తులును భుశుండీపాశహస్తులును ధ్వజపతాకఘంటాపర శ్వధులును సర్పోచ్ఛ్రితకిరీటులును సర్పాంగదధరులును జిత్రాభరణధారులును లో నగువారు వేనవేలు పార్షదు లావిర్భవించి యాడుచుం బాడుచు వివిధవాదిత్రము లు మొఱయించుచు నెగురుచు దుముకుచు నుఱుకుచు నార్చుచు బొబ్బలిడుచు శూలపట్టసపాణులు నానావిరాగవసనులు శత్రుభీకరులునై దర్శనమాత్రమున నెల్లర నొల్లంబోఁ జేయఁ జాలినపరాక్రమంబున నశ్వత్థామ నరికట్టి తన్మాహాత్మ్యజిజ్ఞాసు వులును సౌప్తికదీక్షితులునై దర్శనమాత్రఁ ద్రైలోక్యంబునకు భయంబుపుట్టించు బెట్టిదంపుచెయ్వులం జూపట్టుటయు నమ్మహారథోత్తముండు. 110

—అశ్వత్థామకు శివుఁడు ప్రత్యక్షమై ఖడ్గం బొసంగుట—

మ. తనకుం జుట్టును ముట్టి బిట్టఱచుచుం ద్రైలోక్యము న్మ్రుట్టనో
పినయట్లుండినవారి నారసి మదిం బీతింతయుం గాన కా
ధనురాచార్యవరాత్మజన్ముఁడు రథస్థుం డైనకోదండముం
గొని మౌర్వీనినదం బొనర్చుచు లసద్గోధాంగుళిత్రాణుఁడై. 111

చ. శితశరముల్ పవిత్రములు చేతిధనుర్వరముల్ సమిత్తు లు
న్నత మగువేదికాగ్నిసవనప్రథితాగ్ని యటంచు నెంచి స
న్నుతమతి సౌమ్యమంత్రమున నోఁచి శరీరము వేల్చువాఁడ యై
శితిగళునిం దలంచి కలశీసుతిసూతి నయంబుపెంపునన్. 112

తే. వేల్తు నియ్యాలంబున విశ్వనాథ, యాంగిరసవంశసంభవ మైనయీశ
రీరమును నీవు బలిగాఁ బరిగ్రహింపు, మాపదబ్ధి మునింగి నే నయితి నిట్లు. 113

క. భూతములు నీదులోనన్, భూతంబులలోన నీవు పొలుపొందుదు వో
భూతేశ ! హవిర్భూతుఁడ, నైతి న్ననుఁ గొనుము పగఱ నడఁగించుమతిన్. 114

క. అనుచు నిజాత్మత్యాగం, బొనరించి గురుప్రభూతుఁ డూర్ధ్వభుజుం డై

కనదనలసమృద్ధం బగు, ఘనవేదికమీఁది కుటికిఁ గదు ధైర్యమునన్. 115

వ. ఇట్లుటికి జ్వాలాజాలమధ్యంబున నధిష్ఠించి నిశ్చేష్టుండై కూరుచుండి కొండొక కసు గందకుండినంతఁ గొంతలో నంతకాంతకుం డావిర్భవించి నవ్వుచు నతని కిట్లనియె.

సీ. వత్స ! ద్రోణాత్మజ ! వర ముసంగెద సత్య, శౌచార్జవత్యాగజపతపములఁ
  గాంతి మత్యాదుల సతతంబు నీవు న, న్నారాధనము చేసినట్టివాఁడ
  వా కృష్ణుఁడును నన్ను ననిశ మారాధించు, నతనికన్న న్నాకు క్షితితలమున
  నిష్టతముఁడు లేమియే నిక్కువము దానఁ, గలనఁ బాంచాలురఁ గాచినాఁడఁ

తే. గృష్ణసన్మాన మింతయుఁ గృతమ యయ్యెఁ, జెల్లెఁ బాంచాలురకుఁ గాల మెల్ల నింక
  నీవు నెఱవేర్చుకొనలె మ్మనీదుకోర్కి, యని మహాఖడ్గ మొక్కఁ డాతని కొసంగె.

వ. మహాదేవుం డంతర్హితుండై తన తేజం బతని దేహంబునం జొనుపుటయు నతం డత్యంత తేజోవంతుండై వెలుంగుచు భూతాపహృతాస్త్రశస్త్రంబులు స్యందనంబునం గాంచి యానందించుచుఁ గృపాణపాణియై పాండవశిబిరంబులోనికిం గందుమిగిలి పోవుచున్నం గని భూతగణం బతనివెన్నంటి పోయి నలుగడ నాక్రమించె ననిన ధృతరాష్ట్రుండు సంజయుదిక్కు మొగంబై. 118

చ. అపుడటు దీప్తిమంతుఁ డగునగ్గురునందనుఁ డట్లు వోవ నా
  కృపకృతవర్మ లిర్వురు నోకించుక ధైర్యము గల్గి యుండి రో
  కృపణులయట్లు పాపవిచికిత్స యెఱుంగక సాధ్వసంబునన్
  వ్యపగతచిత్తులై మరలి నట్టిర యైరొ యెఱుంగఁ జెప్పుమా. 119

క. కావలివా ర్వారింపం, గా వారలు మగుడ కరిగి కౌంతేయులపై
  న్యావలియెల్లఁ దెగ ననిఁ, గావించిరొ లేక తెగిరొ కౌంతేయులచేన్. 120

వ. తత్ప్రకారంబు సవిస్తరంబుగ నెఱింగింపు మనిన సంజయుండు ధృతరాష్ట్రునిదెస మొగంబై గురుపుత్త్రుం డట్లు శిబిరంబు సొచ్చి పోవుచుం గృతప్రయత్నులై తనతోడం గూడ రా నున్న కృపకృతవర్మలం గాంచి సంతసించుచు. 112

—అశ్వత్థామ కృపకృతవర్మలతో శిబిరంబులం బ్రవేశించుట—

ఉ. చాలినవారు మీరలు రసం గల క్షత్రియకోటి నెల్ల ను
  న్మూలముగా నొనర్పుటకుఁ బూరుషసింహములార యిప్డు ని
  ద్రాలసులైనకొందఱ శరాసనముం బొనరించి ఘుచ్చఁ గాఁ
  జాల రటంచు నే రసఁగఁ జాలుము రీధరణీతలంబునన్. 122

తే. వలదు లోనికి రా మీరు ద్వారదేశ, మంద యుండుఁడు శిబిరంబులందు నే నొ

కరుఁడ చని యెల్లరం గూల్తుఁ గాలు నట్లు, చెదరి పాఱెడు వారలఁ జెండుఁ డీవు. 123

వ. ఇట్లు నా నిశ్చయం బని చెప్పి వారి నొప్పించి యప్పురుషోత్తముం డద్ద్వారంబున భయంబు దక్కి యొక్కరుండ లోనికిం జొచ్చి తద్వృత్తాంతం బంతయు నంతకుమున్న సవిస్తరంబుగ నెఱింగియున్నవాఁడ కావున నల్లనల్ల ధృష్టద్యుమ్నుని శిబిరంబునకుం జని. 124

—అశ్వత్థామ ధృష్టద్యుమ్నుం జంపుట.—

క. పగలింటి సంగరంబునఁ, బగఱకు వెన్నీక పెనఁగి బహుళశ్రాంతుల్
మొగిఁ బర్వ నొడ లెఱుంగక, జగతిం బడి పరిజనంబు పరిపరిఁ గూర్కెన్. 125

వ. అట్లున్న ధృష్టద్యుమ్నునికేతనంబున నల్లనం బ్రవేశించి యం దొక్కచోట. 126

చ. పగడఁపుఁ గోళ్లు హొంబడలు కుప్పటిలు దట్టపుమేలుకట్లు మేల్
తగటు నిగారంపుదెర తలాడలు పట్టెములుంగుకుళ్లునం
దగుననుపాన్పునుం గలిగి నవ్వగ పందిరిపట్టెమంచమం
దగురుసుధూపముల్ చెనలఁ గంటఁగ నిద్రితుఁడైన పాష్ఠతున్. 127

తే. ఊఱటం జెంది యొమ్మపై నునిచి కేలు, గుబ్బు వెట్టుచు సుఖ మొందుచును మేను
మఱచి నిద్రించు ద్రుపదకుమారు వానిఁ, జూచి గురుసూతి కడగాలఁ దాఁచి లేపె.

మత్త. కాలితాకున మేలుకాంచి మొగమ్ము నుల్కుచు లేచి పాం
చాలరాజతనూజుఁ డాగురుసంభవుం దన చెంగటన్
బోలఁ గన్గొని విక్రమింపఁగఁ బోవునంత రయంబునం
గేలుఁదోయి నతండు పాష్ణతు కేశముల్ గొని క్రుద్ధుఁడై. 129

చ. బలమున గ్రిందికిం దిగిచి పాదతలంబున నేలఁ బెట్టి బి
ట్టలజడి పుట్టఁ గొట్టి యొడలంతయు వింతగఁ బింపి పిండిగా
నులిమియు ముష్టిఘాతములు నొంచియుఁ గించునియట్లు పట్టి పెం
బోలయును నల్లయుం దొలఁగి పోఁ బొడిచె న్వాడిఁ గాలుసేతులన్. 130

తే. నిద్రచే వివశుం డయి నెఱి దొలంగి, చేయునది లేక భయమున జెయ్యి దక్కి
యున్న పాంచాల్యుకంఠము దురమునందుఁ, ద్రొక్కి క్రుద్ధియురుద్దియు ద్రోణసుతుఁడు.

వ. ఇట్లనేకప్రకారంబులఁ బశువుం బట్టి నట్లు చిత్రవధంబు సేయుచున్నంతఁ గొంత వడి కెలుంగు వెడలించుకొనం జాల కూఱకుండి యెట్టకేలకు నెట్టులో నోరు పెకలించుకొని ధృష్టద్యుమ్నుం డశ్వత్థామ కెఱుంగ వచ్చునట్లు వికృతస్వరంబున నిట్లనియె. 132

శా. ఆచార్యాత్మజ! యిట్లు చంపు టుచితంబా శస్త్రముం దాల్చి సం
కోచం బింతయు లేక శీఘ్రగతి నాకుం జావు రాఁ జేయు మే
నీచేతన్ సుకృతంపులోకములు నిర్విఘ్నప్రభావమ్మునన్
బ్రాచీనోత్తమమార్గగాములు బలెం బ్రాపింతు నొక్కింతలోన్. 133

వ. అనిన వానియవ్యక్తవచనంబుల కాగ్రహించుచు నశ్వత్థామ. 134

ఆ. కలుగ పూర్వలోకములు గురుఘాతికి, నీవు ఖలుఁడ విట్టినీకు శస్త్ర
మరణ మొప్ప దనుచు మాతంగమును సింగ,మట్లు ద్రుపదపుత్త్రు నాక్రమించి. 135

క. అతిమానుషవిక్రముఁడై, క్షితిసురుఁ డాద్రుపదసుతుని శితశస్త్రమునన్
మృతినొందఁ జేయ నొల్లక, ప్రతిమర్మముఁ బొడిచి తన్ని వడి వధియించెన్. 136

ఆ. అట్లు తన్ని చంపునప్పు డాధ్వని కంతి,పురమువారు మఱియుఁ బరిజనులును
మేలుకాంచి కాంచి మిడికి రూరక పెను,భూతమో యటంచు భీతి నొడమ. 137

ఆ. సప్తతంతుపశువుఁ జంపినవిధమున, ద్రుపదసుతునిఁ జంపి ద్రోణసుతుఁడు
వెడలి చప్పరంబు వడివడి రథమెక్కి, యరిగె నొండుకడకు నార్చు లెసఁగ. 138

ఉ. క్రూరత నట్లు పాండవులకు న్మనకాఁ డగువానిఁ జంపి దు
ర్వారబలుండు ద్రౌణి శిబిరంబును వీడినయంతఁ గాంతలున్
ద్వారజనుల్ మహారవము పర్వఁగ నేడ్చిరి తేనిపోకకున్
జేరువ నున్నతేఁజ్లు విని చేరి యిదేమని పల్కి రల్కుచున్. 139

శా. ద్రౌణిం జూచిన రాజపత్నులు భయభ్రాంతిన్ బ్రవర్తించుచున్
బ్రాణంబు ల్దెగినట్టిరై బెగడి దైన్యం బేర్పడం బూర్వగీ
ర్వాణుండో మనుజుండొ మే మెఱుఁగ మీరాజేంద్రునిం జంపి యీ
క్షోణిం బోవుచునున్నవాఁ డదె రథస్థుండై రయం బేర్పడన్. 140

—అశ్వత్థామ కరితురగాదులతో యుధామన్యూత్తమౌజసులం జంపుట.—

క. ఎయిదుండు పొదివి పోరం, దయనమునకు నడ్డ దగులుఁ డనవుడు వారల్
రయమున ద్రౌణిం దలపడు,టయు నాతం డెల్లరం గడంక నెదిర్చెన్. 141

వ. శూరాగ్రేసరుం డగునతం డట్లెదిర్చి పేర్చి శస్త్రప్రహారంబుల నేర్చుచుం
గొంతటిలోన. 142

శా. రౌద్రాస్త్రం బరివోసి యేసి భుజవీర్యంబుం బ్రదర్శించుచున్
రుద్రుం డాప్రళయంబునం బలెఁ దగెన్ రూపింప నైయప్పు డ
క్షుద్రప్రాభవ మేర్పడం గవిసి కొంచున్ వారి నల్లప్పుడున్

నిద్రం బాయునియట్లు చేసె నది నిర్నిద్ర ప్రభావంబునన్. 143

వ. అట్లప్పదానుగుల నెల్లం బరిమార్చి యుత్తమౌజసునివిడిదకుం జని శయనతలంబున సుఖసుప్తుం డై యున్నవాని నరసి ధృష్టద్యుమ్నునిం జంపిన ట్లురంబునను గంఠంబునను గాలు వెట్టి మెట్టి పట్టిపడం గొట్టి చంపుటయునయ్యలికిడిం జేసి చెంతం జప్పరంబునశయనించి నిద్రించి యున్నయుధామన్యుండు లేచి రాక్షసుండు వచ్చి తనయన్నం బొరివుచ్చె నని నిశ్చయించి. 144

సీ. గద యెత్తి గురుపుత్త్రు హృదయంబుపైఁ బడ, బిట్టేయుటయు నాతఁ డట్టె యెగిచి
తప్పించుకొని వాని నప్పాడ వడిఁ బట్టి, ధరణిపైఁ బెట్టి పాదముల మెట్టి
భ్రాతలం జంపినపగిదిని బశుమార, ణప్రకారంబున నలిపి చంపి
యటఁ జని యచ్చోటచ్చోట నిద్రవోయెడు, వీరశేఖరుల మహారథులను

తే. దెలిసి సవమున శమిత పసులనుబోలె, నిశితనిస్త్రింశమునఁ జెండి నిఖిలమార్గ
ములను దిరుగుచు నెల్లరఁ బిలుకుమార్చి, మరలి మధ్యమ మైనగుల్మమున కేగి. 145

మ. అవలం జేరఁగఁ బెట్టి కైదువులు నిద్రాధీనులై యున్నభూ
ధవులం బట్టి వధించి పట్టమున నేతన్మాత్రఁ దత్తత్ప్రదే
శవసద్యోధుల సాధులన్ మదగజాశ్వవ్రాతముం గూల్చి పె
ల్చ విహారం బొనరించె మించి లయకాలప్రాప్తకాలుం డనన్. 146

క. త్రిప్పుచు నిస్త్రింశమునం, దెప్పున నఱకుచును గంఠదేశము లాతం
డప్పుడు సర్వాంగంబులఁ, గప్పిన రక్తమున భయదగతి గన్పట్టెన్. 147

అశ్వత్థామ ద్రౌపదీపుత్త్రులం జంపుట.

వ. ఇట్లు రక్తసిక్తాఖిలాంగుం డగుటంజేసి పరమభీషణాకారంబు దాల్చి యున్నభారద్వాజుం జూచియు నతండు గజఘటాదులం దెగనేయునెడం బుట్టిన దారుణారవంబు వినియు విహ్వలించి శిబిరంబులం గలవా రెల్లరు నొండొరులం జూచుకొనుచు నతండు రాక్షసుండు కాని నరుండు కాఁ డని తలంచుచుఁ బెంపారుసాధ్వసంబునం జలించుచుఁ గన్నులు మూసికొని వానిబారిం బడి మడియుచుండి రిట్లు సోమకుల నెల్లఁ దెగ్గళ్ళ నేయుచున్నంత మేలుకాంచి ద్రౌపదేయులును శిఖండిప్రభృతులును ప్రభద్రకులును ధృష్టద్యుమ్నాదులవధంబు విని క్రోధతామ్రాక్షులై తత్క్షణంబ ధనురాదిసాధనంబులు గ్రహించి ధనురాచార్యనందనుంజుట్టుముట్టి తెట్టలు గట్టి నల్లు శరపరంపరలం గొట్టి బిట్టార్చుటయు నాజగజెట్టి కట్టల్క సింహనాదంబు గావించి రథావరోహణంబు చేసి వాలునుం బలుకయుం గొని ద్రౌపదీపుత్త్రుల నవిధంబునకుం బఱతెంచి. 148

సీ. కుక్షిదేశంబునందుఁ గ్రూరఖడ్గంబునఁ, బ్రతివింధ్యుఁ డెగ నేసి మృతునిఁ జేసెఁ
జేసిన సుతసోముఁ డీసునఁ బ్రాసంబు, పఱపియు నసిఁ బూని యడిమె ద్రౌణి
ద్రౌణియు నయ్యసిపాణిఁ దునుకఁగఁ జేసి, పట్టెంబునం బార్శ్వభాగ మేసె
నేసిన సంఛిన్నహృదయుఁడై భీమసేనసుతుండు హతుఁ డయి వసుధ వ్రాలె
తే. వ్రాలినఁ శతానీకుఁడు రథము చక్ర, మెత్తి గురుసూతి యొమ్మున మొత్తుటయు న
తఁడు గనలి వాని బిట్టేసి పుడమిఁ ద్రోచి, తలయు నట్టయు వేఱుగాఁ దఱిగి వైచె.
మ. శ్రుతకర్ముం డపు డీరసంబున వడిన్ ద్రోణాయనిం దాఁకి త
న్నుతిఖేటాన్వితసవ్యబాహువు గుదెన్ నొప్పించినం గోపఘూ
ర్ణితనేత్రుం డయి వాఁడి మో మతఁ డసిం ద్రెక్కొలుగాఁ జెక్కి వై
కృతునిం జేసి ధరిత్రిపైఁ బడ నొనర్చెం బేర్చి పెల్లార్చుచున్. 150
ఉ. అయ్యెడ వాలికింపి విజయాత్మజుఁ డా శ్రుతకీర్తి లేచి లోఁ
గ్రుయ్యనికిన్కఁ దన్కఁ గడుఁ గ్రూరశరంబుల ద్రౌణి నేయఁ దద్
జయ్యన వానినిం బలుక జర్జరితంబులుగా నొనర్చి తా
నయ్యసి వానిమస్త మిల నాడెడుదానిగఁ జేసె నీసునన్. 151
వ. ఇట్లు ద్రౌపదేయుల నేవురం బంచత్వంబు నొందించినంత శిఖండిప్రభద్రకసమేతుండై
యశ్వత్థామం బొదివి నానాప్రహారణంబులం బ్రహరించి. 152

అశ్వత్థామ శిఖండిప్రభృతిపాంచాలురం బొదివి చంపుట.

తే. భ్రుకుటితలమున నొకశిలీముఖము గ్రుచ్చి, హెచ్చి యార్చిన నాగ్రహంబెసక మెసఁగ
ద్రోణనందనుఁ డాతని దొడ్డమేను, రెండుతుండెంబులై పడ గండరించె. 153
ఉ. శాంతనవాంతకుం దునిమి చాపగురుప్రభవుం డొకింత యే
కాంతి వహింప కిట్టు నటు చంక్రమణం బొనరించుచు న్భయ
స్వాంతులు గాన నల్గడలు వాఱుప్రభద్రకులన్ విరాటసై
న్యాంతరవర్తులన్ ద్రుపదునన్వయజాతులఁ ద్రుంచె నెల్లరన్. 154
వ. ఇవ్విధంబునఁ బాండుపాంచాలప్రభద్రకసైన్యంబులం గలవారి నెల్ల నసి మార్గవిశా
రదుం డేచి యేచి చంపుచుండె నట్టియెడ హతశేషు లగువా రంతకుమున్న ప్రథ
నారంభమ్ము మొదలు ప్రతిదినంబును నిద్రాసమయంబున రక్తాస్యయు రక్తనయన
యు రక్తమాల్యానులేపనయు రక్తాంబరధరయు నీలవర్ణయుఁ బాశహస్తయు నగు
నొక్కకుటుంబిని కాళరాత్రి తెఱంగున ఘోరాకారయై పాడుచు నాడుచు నిరా
యుధులఁ ద్రిప్తలు నగు యోధులను నరాశ్వకుంజరాదులఁ బాశంబులం బట్టి

కొట్టి కట్టి గురునందనుని చెంతకుం గొనిపోవునట్లు నతండు వారి నెల్లం జంపునట్లు
ను స్వప్నంబు గాంచుచున్నవారు గావున నత్తెఱం గంతయు నంతరంగంబుల స్మ
రించుకొనుచు నియ్యది స్వప్నఫలం బని నిశ్చయించుకొనుచు శిబిరంబునం గలవార
లెల్ల దైవోపహతులు గావున నుడివోనిబీరంబునం జేసి యశ్వత్థామ నెదిరించుటయు
నయ్యుద్ధదుర్మదుండు కొందఱిపాదంబులు దునిమియుఁ గొందఱికరంబులు నఱకియుఁ
గొందఱిజఘనంబులు ద్రుంచియుఁ గొందఱిదొక్కలు ముక్కలు చేసియుఁ గొందఱి
ప్రక్కలు వ్రక్కలించియుఁ గొందఱిశిరంబులు దఱిగియు నిట్లు గజాశ్వములతో
నందఱం జిందువందు సేయుచున్నంత నిది యేమి యితఁ డెవ్వఁ డియ్యది యేమి
శబ్దం బేటి కిట్లు సేయుచున్నవాఁ డితండు కాలాంతకయముండో యని యాక్రోశిం
చువారును శస్త్రాస్త్రంబులు దాల్పక యనిద్రాపరవశత్వంబున యుద్ధసన్నద్ధు లగు
వారును భయంబు పెంపునఁ గర్తవ్యం బెఱుంగక నష్టసంజ్ఞులై కరంబుల నూరువు
లం బట్టికొని వెల్లఁబోవుచు బమ్మఱించువారును దూరదూరంబున నుండియు మీఁ
ది కెగిరి పడ నుంకించువారును నోడ లెఱుంగక యసంబద్ధముగ నేమేని పలుకువా
రును కేశపాశంబులు వీడ వసనంబు లెఱుంగ కస్త్రంబులు జార నోడి పాఱువారు
ను మోహావశంబునం జేసి తమ్ముఁ దా మెఱుంగక భ్రమయువారును వికృతంబుగ
నార్చువారును నై యోధులను బంధనంబులు త్రెంచుకొని మూత్రపురీషంబులు వి
డుచుచుఁ బెల్లఱచుచు నిట్టునట్టునట్టువం బాడుకరితురంగాదులను బొడివి పోనీక వీఁక
మెయిం దునుముచు భూతప్రేతపిశాచగణంబులకుఁ గరంబు తృప్తి గావించుచుండె
నట్టియెడఁ వెఱచి పఱచుప్రాణికోటులఁ బాదఘట్టనంబునఁ బుట్టినపరాగంబు భూ
మ్యాకాశంబు లాక్రమించి చీఁకటుల నినుమడింపఁ జేయుటయు శిబిరంబులం గల
జనంబులు పితృభ్రాతృపుత్త్రాదుల నెఱుంగక తమ్ముం దామ కాలప్రబోధితులై కూ
ల్చుకొనుచుండఁ గొందఱు హా తాత పుత్త్రా యని గోత్రనామంబు లుచ్చరించు
కొనుచు హాహాకారంబు చేయుచు ద్వారంబులకు గుల్మంబులం బాసి యిట్టునట్టుం
బాఱుచుండ గురుపుత్త్రుండు వారి నారసి వారించి పోరి ప్రాణంబులు దీయుచుండె
నిట్లు భీకరప్రకారంబునఁ గోలుమసంగినవాని బాఱిఁ బడకట్టులో తప్పించుకొని జీవితా
శం బడి శిబిరద్వారంబు చేరినవారిం గృపకృతవర్మ లడ్డగించి ముక్తకేశలుం గృతాం
జలులై శరణంబు వేఁడినను ద్రోణపుత్త్రప్రియం బభిలషించి పోనీక పొదిగి వధించు
చుండి రిట్లు మువ్వురును మూఁడగ్ను లట్లు వినాశనంబు నొందించినంత నెంతయుఁ
జూచినను కబంధంబులును దునిగినశిరంబులును దెగినకరంబులును విఱిగినకాళ్లును

ముక్కలైనచోక్కలును బొడి యైనతొడలును గజగాత్రఖండంబులును దురంగాంగ
శకలంబులును విశీర్ణాయుధంబులును గలుగ నప్పాండవశిబిరంబు ఘోరదర్శనం
బయ్యె నయ్యెడ. 155

సీ. హతశేషు లగువార లార్తస్వరంబున, నేడ్చుచు నిది ఘోరమిట్లు తగునె
పార్థులు సన్నిధిం బరఁగనియప్పు డీ, క్రూరుఁ డిట్టులు చేయఁగూడెఁ గాని
కృష్ణసహాయుఁ డాజిష్ణుఁ డుండినచోట, యక్షరక్షోగణ మైన నగునె
పరమధార్మికుఁ డైనపార్థుండు సుప్తుని, న్యస్తశస్త్రుఁ బ్రమత్తు నర్థిజనుని

ఆ. ముక్తకేశుఁ గేలుమోడ్చిన వానిని, బాలుఁ బోతుఁ జంపఁ బాలుపడునె
యనుచుఁ బలుకుచుండు నార్తులమున నెల్ల, వారిఁబట్టి తునిమె బాడబుండు. 156

ఆ. నెత్తు వఱ్ఱువాఱ నెగసిన పెందూళి, నడఁచె నట్లు గురునికొడుకు రెండు
జాలలోన శిబిరపాళియంతయుఁ బీన్గు, పెంటఁ గా నొనర్చెఁ బృథివిసురుఁడు. 157

వ. ఆసమయంబున. 158

శా. భూతప్రేతపిశాచసంఘములు సంపూర్ణానుమోదంబునన్
బ్రీతిం జేసి సపుత్రమిత్రకముగా విచ్చేసి యచ్చోటికిన్
మాతంగాదుల నెత్తురాని వసతో మాంసంబు భక్షించి ప్ర
ఖ్యాతాఖ్యుం డగుద్రోణనందనుని శౌర్యం బెంచె నొ నం చెదన్. 159

మత్త. శైలదంతులు దీర్ఘశంఖులు శంకుకర్ణులు పింగళుల్
నీలకంఠులు భీషణాస్యులు నిత్యభైరవసస్వనుల్
జాలపాదులు పంచపాదులు సర్వజిహ్వులు రాక్షసుల్
గ్రోలి రాశిబిరాంతరంబునఁ గ్రొత్త నెత్తురు మొత్తముల్. 160

క. ఇది యశాం నిది మే లిదివర, మిది రుచ్యం బనివచించు చెంతయుఁ బ్రీతిం
గదిరినమదుల న్నంజుడు, కొడుగక తిని నల్ల ద్రావికొని రట సోకుల్. 161

వ. ఇట్లు క్రవ్యాదగుణంబులు మేదోమాంసమజ్జాస్థివసారక్తాదులం దృప్తిఁ జెంది
మత్తిల్లి పరమహర్షంబున నృత్యంబు సేయుచుండ సంతసించుచు నాచార్యనంద
నుండు గల్పాంతంబున లోకంబు లెల్లం గాల్చి చల్లారిన ధనంజయుని చందంబున
శిబిరంబు నిరవశేషంబు గావించి శమియించి రక్తసిక్తం బయినతనకృపాణంబు
నెత్తుటం జొత్తిల్లిన తనకరంబుతో నేకీభూతం బయిన చందంబునం బొంకుపడ
నిద్రంజేసి ప్రవేశమందుం బోలె నిధనంబునం జేసి నిశ్శబ్దం బైనపాండవశిబిరంబు
భూతసమయంబున నిర్గమించి ద్వారదేశంబున నున్న భోజగౌతములం గలిసికొని

హర్షించుచుఁ బాంచాలసృంజయాదుల నెల్లం బొలివుచ్చుట లో నగు తన విక్రమ
క్రమం బంతయుం దెలియఁ జెప్పినవారు హర్షించుచు వానికిం బ్రియంబుగా భుజా
స్ఫాలనసింహనాదంబులు గావించి రని సంజయుండు ధృతరాష్ట్రుం గాంచి వెండియు.

సీ. అకట నిద్రితు లైన సోమకాదుల, కాళరాత్రి దారుణ మయ్యె నట్లు
మహితవిక్రమమున మనవారి నెల్లరఁ, దెగటార్చి నట్టియాధీరవరులు
నేమఱిపాటున నిట్టులుండినదానఁ, దెగటారిపోనైరి పగఱవలన
నేమందు లోకమం దెవ్వారికిని గాల, పర్యాయమును దాట వలనుగాదు

తే. అనిన ధృతరాష్ట్రుఁ డనుసంజయా తొలుతన, గురుసుతుఁడు నా పుత్రుఁ బరుషజయంబు
కోరి యిట్లేటికిం జేయ కూరకుండె, నిపుడు చేయఁ గతం బెద్ది యెఱుఁగఁ జెపుమ.

మ. అనినన్ సంజయుఁ డిట్లను న్గురుసుతుం డప్పార్థభీతిం బాన
ర్పన సంకల్పము సేయఁ డప్పు డచటన్ వారున్ హృషీకేశుఁడున్
శినివర్యుండును లేనికాల మనుచు న్వీక్షించి తా నిష్ఠాన
ర్చను గర్జం బిటు తత్సమక్షమున నాజిష్ణుండు నేఁ జాలునే. 164

—అశ్వత్థామ కృపకృతవర్మలం గూడి దుర్యోధనుని కడకు వచ్చుట.—

వ. ఆకర్ణింపు మిట్లు నిద్రితు లయినవారిం జంపి వచ్చిన గురునందనుం గృపకృతవర్మ
లానందంబునం గ్రుచ్చి కౌఁగిలించుకొని మెచ్చుకొనుచున్నంత నతండు సంతసించుచు
ద్రౌపదేయాదులును బాంచాలసోమకాదులునుం దెగిరి మనము కృతకృత్యుల మైతి
మి మనపుణ్యంబున దుర్యోధనుండు సజీవుండై యుండె నేని వాని కిత్తెఱంగెఱింగిం
పవలయుం దడయక పోవుదము లెం డనిన వారు నిది లెస్సమాటయట్లు చేయుద
మని రథంబు లధిష్టించి యచ్చోట గదలి దుర్యోధనుండు పడియున్న చోటునకుం
జని యచ్చట. 165

సీ. భగ్నసక్థుం డయి పడి భూతలంబున, నొంటూర్పునంజాక యున్నవాని
నోట ముక్కులనెత్రు మాటికిం గ్రక్కుచు, వేదనాభరమున వేఁగువాని
భక్షణాసక్తి శ్వాపదముఖసత్వముల్, మూఁగిన నెట్టకే నాఁగువాని
రుధిరపంకంబున విధివశంబున బ్రుంగి, విగతచేష్టుం డయి వగచువాని

తే. నందడించెడునార్తిమై సంతతంబు, మూల్గుచుండెడు వాని వాపోవువానిఁ
గౌరవేశ్వరుఁ గాంచి రాభూతిభుజులు, మువ్వురుం దవ్వు దవ్వులఁ బోవుచుండి.

వ. ఇట్లు కాంచిరయంబున రథావరోహణంబు గావించి వచ్చి వానిం బరివారించి వేదీ
మధ్యంబునఁ ద్రేతాగ్నులు నాఁ గూరుచుండి నిట్టూర్పు నిగిడించి దుఃఖించుచు

నన్నరనాథముఖనిస్సరం బైన రుధిరంబు హస్తతలంబులం దుడుచుచున్నంతఁ గొంత
వడికిఁ గృపాచార్యుండు. 167

మ. అకటా దైవము చేయలేనిపని లే దావంతయుం గాని యే
రికి దానిం గడవంగ నీదఁ గలవా యేకాదశాక్షౌహిణీ
ప్రకటప్రాభవుఁ డీసుయోధనుఁ డనిం బ్రాణంబులం బాయనై
సకలాంగంబులు రక్తసిక్తములు గా క్ష్మామండలిం గూలునే. 168

ఉ. కాంచితి రయ్య కాంచనవికస్వరవర్ణుఁడు వీని చెంగటన్
గాంచనభూషితం బగుచుఁ గ్రాలెడునిగ్గద స్వఃప్రయాణమం
దెంచఁగ వెంటనంటి చన నిచ్చ పొనర్చి చితాగ్నిఁ గాయమ
ర్పించఁగ నున్నభర్యపరివిం గనుపట్టెడు నిట్టిపట్టునన్. 169

సీ. మూర్ధాభిషిక్తుల మొదటిలెక్కకు వచ్చుప్రభువు ధూళిం బ్రుంగి పడునె యిట్లు
పగతుఱం బరిమార్చుమగఁటిమి గలఁడేఁడు, పగవారిచే నిట్లు బడలువడునె
భూపాలవృతుఁ డయి మ్రొక్కులందుశుభుండు, క్రవ్యాదవృతుఁడయి కానఁబడునె
ద్విజసేవితుం డయి విత్త మిచ్చెడుదొర, యస్రపసేవితుం డగునె నేఁడు
ఆ. కష్ట మింతకంటెఁ గలదె వేయొక్కఁడు, దైవసంఘటనము దాఁట వశమె
యెంతవారి కైన నిక్కురవేంద్రుసమాట దడవ నేల మనకు నిపుడు. 170

వ. అని పలవించుచున్నంత నశ్వత్థామ దుర్యోధనుం జూచి. 171

— అశ్వత్థామ దుర్యోధనునితో సంభాషించుట —

మ. అయయో నిన్ను ధనుర్ధరప్రవరులం దాద్యుండు సంకర్షణ
ప్రియశిష్యుండు ధనేశ్వరోపముఁడు దోర్వీర్యంబునం బోఁగు నం
చు యథార్థస్తుతు లాచరింత్రు బుధు లీక్షోణీస్థలంబందు నీ
యయ మే ప్రోఁగెడు నిట్టినీ వసులకుం బ్రాణంబు లర్పించితే. 172

క. బలవంతుఁడ వగునీయెడ, నలభీముఁడు వివర మరసినట్టిఁడ యగుచున్
బొలియించె ననఁగఁ గాలమ, బలవత్తర మనుచుఁ దెలియ వలసినదయ్యెన్. 173

సీ. ధర్మజ్ఞుఁ డగుని న్నధర్మమ్మునం జంపెఁ, బాపుఁడై తలఁ దన్ని పవనసుతుఁడు
దగ దని ధర్మనందనుఁడు కృష్ణాగ్రజునులో, వారింప రైరి పాపమని యెఱిఁగి
వారు నిందాపాత్రు లైరి వంచనఁ జేసి, చంపినభీముని జగము తిట్టు
నిట్టివో రారాజు నేము చంపితి మని, వా రెట్లు చెప్పుకో నేరుతు రొకో
తే. రాముఁ డెప్పు గదాయుద్ధభూమి నాఁడు, ధాత్రుఁడు సుయోధనున కేఁడు చాలఁడనుచుఁ

జెప్ప నీవు కురుక్షేత్రసీమయందుఁ, గలనఁ దెగి తుత్తమం బైనగతికి నైతి. 174

శా. నీకై శోకము నొందఁగా వలదు గానీ నీదుమాతాపితల్
చీఁకుల్ వృద్ధులు పుత్రశోకకలితుల్ భిక్షించుచు న్వార లీ
లోకంబం దెటు జీవయాత్రఁ గడుపంగ లో నెంతురో యంచు నే
నేకాలంబును జింత సేయుదు మదిన్ హీనాతిహీనంబుగన్. 175

—అశ్వత్థామ దుర్యోధనుం గని పలవించుట—

తే. ధన్యుఁడవు నీవు ధర్మయుద్ధంబుచేసి, తెగితి కృష్ణార్జునులు నిన్నుఁ ద్రెంచుపట్ల
నూరకుండుట నిందార్హు లైరి వారు, సిగ్గు లే కెట్లు జీవింత్రొ క్షితితలమున. 176

మ. మతిఁ గాంక్షించినవెల్లఁ దీర్చి ప్రజలన్ మన్నించి రక్షించు భూ
పతితోఁ బోవఁగ లేక లేఁకుల గుచుం బ్రాణంబు లాశించునీ
కృతవర్మం గృపుని న్ననుం దెగఁడుదుం గీడెంచి చీ యంచు నీ
క్షితి మామువ్వురికంటె లే రధము లోగీర్వాణరాడ్విక్రమా. 177

తరువోజ. నాకు మాతండ్రికి నామాతులునకు, నవరత్నఖచితముల్ నవ్యభూషలును
రాకేందుధవళహర్మ్యంబులుం ధనము, రాసు లొసంగి గౌరవబుద్ధిఁ గొలుతు
వీకరణిం బొల్చునే మెచ్చు బంధుబృందంబుతోఁ బొంది యెల్లభోగములు
గైకొని యజ్ఞముల్ గావించి పేర్మిఁ, గాంచితి మెప్పదుగ ఘనతతో నొప్పి. 178

తే. ఇట్టిమే మిప్డు నినుఁ బాసి యెట్లు బ్రదుకు,వారమో కాని నీ వెల్ల పార్థివులను
మున్న కొనిపోవుచుంటి మేమును భవత్సహాయులము గామి కార్తుల మైతి మనఘ.

చ. నిను బెడఁబాసి మే మవని నిల్చిన దుఃఖము కాక సౌఖ్య మె
ట్లొనరెడు శాంతి గల్గుటకు నుండెడుమార్గము లెవ్వి నీ వొన
ర్చినసుకృతంబులం దలఁచి రేలుఁ బవల్లును గుందు పుట్టఁగా
మనియును జచ్చినట్టిరమ మానవనాథ వచింప నేటికిన్. 180

ఆ. ఈవు స్వర్గమునకు నేగి నామాటుగాఁ, బూజ చేసి గురుని మ్రొక్కి నీదు
కొడుకుకుజ్జి పిసిగి గొంతు ధృష్టద్యుమ్నుఁ, బిలుకుమార్చె ననుచుఁ దెలుపుమాః.

వ. పదంపడి బాహ్లిక సోమదత్త భూరిశ్రవ సైంధవాదిమహారథులు యథార్హంబుగ
నాపేర నాలింగనము చేసికొని యనామయం బడుగు మని చెప్పి వానిమొగంబుపై
దృష్టి నిగిడించి యశ్వత్థామ వెండియు ని ట్లనియె. 182

తరళము. బ్రదికియుంటివి గాన నీచెవిసందు వట్లు వగింతు వ
ల్కెడి సమాహితచిత్తుఁడై వినుమీయు మువ్వుర మిద్దెనన్

బ్రదికి యుంటిమి పాండవేయులు వాసుదేవశినీశ్వరుల్
బ్రదికియుండిరి యొప్ప రద్దెన వాహినీద్వితయంబునన్. 182

సీ. మఱియు నాకర్ణింపు మనుజేంద్ర సౌప్తిక,సమయంబున న్నేను సాహసమున
నరిశిబిరంబుల కఱిగి ధృష్టద్యుమ్ను, మునుమున్న పశువునుం బోలెఁ జంపి
తద్భ్రాతృపుత్రులఁ దదనంతరము కూల్చి, ద్రౌపదేయుల వెన్క రూపుమాపి
పదపడి వడి మత్స్యపాంచాలసైనిక,వరుల నందఱఁ బట్టి వరుస గోసి

తే. చావఁగా నున్నగజవాజిసంఘములను, బట్టి గిట్టించి విడిదల పట్టునందుఁ
బ్రాణి యొక్కటి లేకుండుపగిది వారి, చేతకుం బ్రతిచేసి వచ్చితి నరేంద్ర. 184

మ. హరియున్ సాత్యకి పాండుపుత్రకులు నాయాచోటులం దెందునన్
బరికింపం బడ రెందుఁ బోయిరొ నను న్బ్రత్యక్షమృత్యూపమున్
గురుశౌర్యాచరణైకదక్షు విని గర్వో లైనత ద్దేశమున్
బరివర్జించి మొఱేనిఁ బోయిరొ భయభ్రాంతాత్ములై డాఁగఁగన్. 185

—దుర్యోధనుఁడు గురుపుత్త్రునిచేఁతకు సంతసించుచు మృతుం డగుట—

వ. అనిన దుర్యోధనుం డాత్మప్రియంబు లగునవ్వచనంబుల కానందించి లేనిశక్తి దెచ్చు
కొని మెల్లన నిట్లనియె. 186

ఆ. కురుపితామహుండు గురుఁడును గర్ణుండు, చేరి మీరు ముగురు చేసినంత
కార్య మెన్నఁడేని గాని చేయనిమాట, నిక్కువం బటంచు నేఁ దలంతు. 187

ఆ. క్షుద్రుఁ డైనద్రుపదసూనుఁ డాపడవాలు, తా శిఖండితోడ ధరణిఁ ద్రెళ్ళె
ననుట నేను జిత్తమం దెంతు నిందృసి,కెత్తు వత్తు ననుచు నిట్టియెడల. 188

వ. మీకు శివం బయ్యెడుఁ బోయిరండు పునస్సంగమంబు స్వర్గంబున నయ్యెడుం గావుత
మని పలికి మఱిపలుక కూరకుండి కొండొకసేపులోనఁ బ్రాణంబులు విడిచి స్వర్గం
బునకు నిర్గమించె నంత వారు మువ్వురు మువ్వురున నవ్వసుమతీపతి మేదినిం బడి
యున్న మేనుఁ గౌఁగిలించుకొని మరలి మరలి జూచుచుం గదలి కనకరథంబు
లెక్కి కరినగరమార్గంబు వట్టి బెట్టు దుఃఖించుచు నహర్ముఖంబునం జని రివ్విధం
బున నీదుర్మంత్రంబునం జేసి కురుపాండవక్షయం బయ్యెఁ గృష్ణద్వైపాయనుండు నా
కనుగ్రహించినదివ్యదృష్టి నీకొడుకుతోడం బోయినట్టిదయ్యె నని సంజయుండు ధృత
రాష్ట్రునకుం జెప్పె నని చెప్పిన విని నైమిశారణ్యవాసు లటమీఁదివృత్తాంతం బెట్లు
ప్రవర్తించె నని సూతు నడుగుటయును, 189

## ఆ శ్వా సాం త ము.

ఉ. భారతధర్మమార్గము లబద్ధము లార్యనిషిద్ధముల్ దురా
చారము లంచు దూఱుచు నిశాచరభావముఁబూని దుర్జనుల్
వారక సంచరింతు రిల వారల కేగతి గల్గఁ జేయుదో
ధారణి నుద్ధరింపఁ గదె తద్భవబాధ లడంచి మాధవా. 190

క. సకలచరాచరకర్తవు, సకలేశుఁడ వైన నీకశక్యముగల దే
యిఁక నేమిచెప్ప లోకం,బకలంకస్థితిఁ దలిర్చునటు సేయఁ గదే. 191

## గ ద్య ము.

ఇది శ్రీమదఘునాతనోభయకవిమిత్ర వేంకటయజ్వాగ్రపుత్ర
సమాశ్రాధితవిబుధరాజ శ్రీపాదకృష్ణమూర్తికవిరాజ
ప్రణీతం బయిన శ్రీకృష్ణభారతంబునందు
సౌప్తికపర్వంబునఁ బ్రథమాశ్వాసము

శ్రీ. శ్రీ. శ్రీ.



శ్రీ

బాలాత్రిపురసుందర్యై నమః

# శ్రీకృష్ణభారతము

## సౌప్తికపర్వము-ద్వితీయాశ్వాసము

—:0:—



శ్రీయాయజూకకులమం
దై యుండియుఁ బూర్వనిర్మితాచారములం
బాయనివాఁడన యై మదిఁ
జేయుదు నీసేవ నన్నుఁ జేకొను మీశా. 1

వ. అక్కథకుండు శౌనకాదిమహామునుల కిట్లనియె నట్లా రాత్రి వేఁగుటయు నంత నక్కడ ధృష్టద్యుమ్నసారథి ధర్మరాజుపాలికిం బరతెంచి పరిదేవనంబు సేయుచు నిట్లనియె. 2

— ఐషీకపర్వము. —

సీ. అకట యేమందు నోసకలేశ కృపకృతవర్మలతో ద్రౌణి వచ్చి రేయి
మనవీడు సొచ్చి ప్రమత్తులై నిద్రించు,మనవారి నందఱఁ దునిమి పైచె
ద్రౌపదీనందను లేపుగం జెగిరి ధృష్టద్యుమ్నుఁ డీల్గె తజ్జనులతో శి
ఖండియుఁ జెగటారె గజవాజిగణముతో, మత్స్యపాంచాలురు మడిసిపోయి
తే. కల్ల శిబిరంబు శూన్య మయ్యెం దలంప, గండ్రగొడ్డండ్ల నఱికెను కానినంబు
నంగ బలె నిద సైనికులందు నఱకు,నట్టియెడ ఘోరనాదంబు పుట్టె నధిప. 3

క. కృతవర్మ నేమఱించుచు, గతి గానక నే నొకండ కాల్నడ నిట్లో
బ్రతికి యిటు వచ్చినాఁడను, మతిమాలినవాఁడ నగుచు మనుజాధీశా. 4

మ. అని వాఁ డుచ్చఁడు నక్కఠోరవచనం బాలించి హా యంచుఁ బా
యనిశోకంబునఁ బాకముం జెడినచిత్తాంభోజుఁ డై ధర్మజుం
డనుతాపంబున సోలి వ్రాలె ధర కత్యంతత్వరన్ వ్రాలు నా
తనిఁ జేపట్టిరి సాత్వతుండు ననుజుల్ తాత్పర్యపర్యాగతిన్. 5

వ. కొండొకవడికి లబ్ధచేతస్కుండై విహ్వలించుచు నెలుంగు రాల్పడ ధర్మరా జిట్లని విలపించె. 6

—ధర్మరాజు పుత్రులు లోనగువారశ్వత్థామచేఁ జచ్చుట విని పలవించుట—

సీ. తెలియ రా దెట్టివారల కేనియుం గార్యగతుల నెల్లరుఁ బరాజితు లగుదురు
గెల్చి యోడుదు రోడి గెల్తు రర్థ మనర్థముగ ననర్థం బర్థముగను దోఁచు
జయ మజయాకార మయి పరాజయము జయ మయి పోవుచు నుండు ననని యందు
మేము వైరులఁ బుత్రమిత్రబాంధవసమన్వితము జయించియు జితుల మైతి
ఆ. మీజయము దలఁపఁ బరాజయమే కాని, జయము కాదు కలన జయము కాంచి
యమునిఁ దుఃఖమంద నైనది గావునఁ, బరులచే జయింపఁబడితి నేను. 7
క. ధనకాంక్షమై సుహృద్వధ, మొనరించి జయంబు గాంచు టూహింపఁగ ని
ట్లొనరినదానం బాపం,బునకంటెన్ మిన్న లోకండు పోలునె తలఁపన్. 8
మహా. శరనారాచాతిదంష్ట్రాజ్వలిత మసిరసజ్ఞమ్ము చాపోన్నతాస్యం
బురుమౌర్వీశబ్దనాదం బుదితపరమృగవ్యూహసంహారచంచ
చ్చరణం బత్యుగ్రకోపాస్పదము భయదమై చాఁగు రాధేయసింహే
శ్వరముం గైకొని క్షత్రవ్రజ మకట కటా వ్రాలెనే నిద్రలోనన్. 9
చ. కనకమహారథప్రదము కాండతరంగము శక్తిమీనముం
ఘనతరకార్ముకభ్రమము గంధగజధ్వజనక్ర మశ్వర
త్ననిచయ మున్నతోన్నతగుణక్వణనారవ మైనద్రోణజీ
వననిధి నీఁది భూధవులు వ్యర్థము గా హతు లైరె నిద్రలోన్. 10
ఉ. కేతనధూమకేతువు ప్రకీర్ణశరార్చి యమర్షవాతముం
జ్యాతలనేమిఘోషము విశాలతనుత్రవరాస్త్రహోమ మ
త్యాతతసైన్యకక్షదహనాతిసమృద్ధము భీష్మవహ్ని వి
ఖ్యాతరణాటవిం దొలఁగఁ గల్గినయోధులు త్రెళ్ళిరే కటా. 11
ఆ. ధరఁ బ్రమత్తుఁ డైననరుని విద్యాతప,శ్శ్రీలు వొందఁ బోవు జిష్ణుఁ డప్ర
మత్తుఁ డగుటఁ గాదె మొత్తి శాత్రవకోటి, స్వర్గ మేలుచున్నవాఁడ చూవె. 12
మత్త. ఇన్నినాళులు కయ్యమం దొకయింత సేఁగికిఁ గాని వా
రిన్నిశీథిని నిట్లు గూలుట లెన్న సాగర మొల్ల సం
పన్ను లైనవణిక్కుమారులు పాయఁ దాఁటి యొకింతలో
నున్నకయ్య మునింగినట్టుల యుండెఁ గాదె తలంపఁగన్. 13
వ. అని మఱియును. 14
ఉ. అక్కట కన్నతండ్రి మును పాఱడివోయినదాన నెంతయుం

బోర్కొడుయాజ్ఞసేని నిజపుత్రులు భ్రాతలు వోక విన్నదై
మిక్కిలిశోకభారమున మీఁదును గ్రిందు నెఱుంగ కార్తయై
నెక్కరణిం బొలంగెడినొ యేమయి పోయెడినో తలంపఁగన్. 15

వ. అని మిక్కిలి పొక్కుచు నకులుం బిలిచి యి ట్లనియె. 16

చ. దురపిలు మందభాగ్య యగుద్రోవది నేఁడు కృశానురూపశో
కరసము పెల్లునన్ నకుల! క్రన్నన నీ వట కేగి యత్తలో
దరి సహమాతృపతుజనతన్ గొని రమ్ము రయమ్ము పెంపునం
బొరలెడువారువంబులను బూన్చినస్యందన మెక్కి చక్కటిన్. 17

వ. అని చెప్పిన నతం డతండు చెప్పినచొప్పున రథం బెక్కి యుపప్లావ్యంబునకుం జనియె ధర్మనందనుండును భ్రాతృజనపరివృతుండై పరిదేవనంబు సేయుచు భూతగణాను కీర్ణంబు నుగ్రరూపంబు నగునిజశిబిరంబునకుం జని పీనుంగుపెంట గ్తైనయచ్చోటఁ బలుదెఱంగులం బరియలై నెత్తుట నత్తమిల్లి నేలం బడియున్న పుత్రమిత్ర బాంధవాదిగాత్రంబులు సూచి యేచినశోకంబున నశ్రుపూర్ణలోచనుండై కరం బాక్రందనంబు సేయుచు మూర్ఛిల్లి ధరణిం ద్రెళ్ళినం గని కృష్ణాదు లతని నూఱార్చి తేర్చి లేవనెత్తి రత్తఱి నకులుండు ద్రోవదిం దోడుకొని వచ్చుటయు నామె యుపప్లావ్యంబున నవ్విప్రియంబు విన్నదిమొదలుకొని కన్నీరు మున్నీరై పాఱ నేడ్చుచు నచ్చటికి వచ్చి తేరు డిగ్గి సమీరసమీరితం బయినకదళివలెం గంపించుచుఁ దమోగ్రస్తచంద్రబింబంబు చందంబునఁ జెన్ను దఱిగినమొగంబుతో ధర్మరాజుం జేర నరిగి కరం బాక్రోశించుచు భూమిపయిం బడియె భీమసేనుం డమ్మానిని నిజబాహువులం గ్రుచ్చి లేవనెత్తి యాశ్వాసించుటయు నయ్యమ కన్నీరు కరతలంబున నెత్తుకొనుచు భ్రాతృసహితుండై యున్నధర్మజునిదిక్కు మొగం బై పొక్కుచు ని ట్లనియె. 18

ధర్మరాజు ద్రౌపది నూఱడించుట—

చ. కడుపునఁ గన్నబిడ్డలను గాలున కప్పనచేసి రాజ్యముం
బడసితి తుత్రధర్మమున భాగ్య మ దెంతని చెప్పవచ్చు నీ
కడిమియు నీదుసౌఖ్యముని గాని యొకప్డు సుభద్రపట్టి నే
నెడఁదఁ దలంపఁ గా నెఱుఁగ పెంతటిధన్యుఁడ వీవు చూడఁగన్. 19

ఉ. కన్నకొడుకు లెల్లఁ గడతేరి రొకనిసేఁదలఁప నెఱుఁగ విప్రుడు ఖలుఁడు ద్రోణి నిదురవోవువారి నిం జంపె నన నాదు,శాయు మెఱియు నగ్నిఁ గాల్చినట్లు. 20

క. పుట్టక విప్రుం డయ్యెం, బట్టిము పేఁ బట్టి ధర్మసద్గతి విడిచెం

గట్టేడి క్రూరకిరాతుని,యట్టిం డై నిద్రఁ జంపె నందఱ నకటా. 21

శతపత్రము. భూరితరదుఃఖజలపూరమున మున్గి వెతఁ బొందుచున నే నిపు డనిం
గ్రూరుఁ డగుద్రోణసుతుఁ గూల్చి తనచేత కనుకూల మగునట్టిఫలమున్
సారముగఁ గైకొననికొంతయునకాలమునకున్ సయిఁపఁ గానియెడలన్
మీ రెఱుఁగ నిట్టియెడ మే న్విడిచి ప్రాయమున మీఁదిగతికిం జనియెదన్. 22

వ. అని పలికి పాంచాలరాజతనయ పాండవాగ్రజునగ్రభాగంబునం గూలఁబడుటయు
నా రాజర్షి ప్రియమహిషిం దిలకించి యనునయించుచు ని ట్లనియె. 23

ఉ. నీకు నెఱుంగరాని దవనిస్థలి నింతయు నుండఁ బోవు నే
వాకొన నేల ధర్మగతివర్తనము న్విను నీదుసోదరుల్
నీకొడుకుల్ స్వధర్మమున నిల్చి రణం బొనరించి స్వర్గముం
గైకొని రట్టివారికయి కాంతరొ చింత యొనర్ప నొప్పునే. 24

ఉ. చెల్లు నటంచ మాద్విజుఁడు చేసినచేఁతకు మాఱుసేత నా
కెల్ల విధంబులం బ్రియమయే నది సాధ్యము నాఁగ నొప్పునే
త్రెళ్ళగ నేసి తా నిపుడు బ్రిమ్మతియై చనుదూరదేశముం
దెల్ల మెఱుంగ రాని దనిఁ ద్రెక్కొనఁ జూచుట యెట్లు చెప్పుమా. 25

వ. అనినఁ బాంచాలి పాండవాగ్రజున కి ట్లనియె. 26

క. దూరగతుఁ డైనపాపా,చారునిపతనంబు చూడ సాఁగక యున్నన్
బోర వధియించి వానిశి,రోరత్నముఁ దెచ్చి చూప రూపవఁ జెల్లున్. 27

ఆ. సహజ మైనదాని సంగ్రహించి భవచ్ఛి,రంబునందు భూషణంబుగా న
లంకరించి లోనిసంకటం బిదివోన, బ్రదుకఁ దలఁచియుంటి పార్థివేంద్ర. 28

—ద్రౌపది యశ్వత్థామం బరిభవింప భీమసేను నియోగించుట—

వ. అని చెప్పి యప్పుడ భీమసేనుం దరియ నరిగి. 29

ఉ. రాత్రిఁ దనుత్రముల్ విడిచి రక్షకవర్గముఁ దారు నిద్రమై
గాత్ర మెఱుంగకున్నతఱిఁ గౌర్యమునం దురితం బొనర్చె నా
ధాత్రిపతిప్రియుం డతనిదర్ప మడంప ననుగ్రహింపవే
క్షత్రియధర్మముం దలఁచి శంబరుని న్మను వాసవుండు నాన్. 30

క. ఆపదలు నిస్తరింపఁగ, నేపురుషుఁడు నిన్నుఁ బోలఁ డిల విక్రమమున్
రూపింప నిన్నుఁ జూపియ, చూపం దగు నేరి నైన శూరవరేణ్యా. 31

సీ. జతుగృహానలమహాసాగరమగ్నుల, కేపుసహేంద్రుఁడు ద్వీప మయ్యెఁ

ప్రళయంబువలె నైనబకహిడింబాదుల, నేర్చి లోకం బేలె నేఘనుండు
కీచకార్దిత వయి నీచత్వమున నైన, నాగతి కయ్యో నేనాగబలుఁడు
నను సభ కీడ్చినవాలిదుశ్శాసనును, జంపి నన్నేలె నేసారభుజుఁడు. 32

తే. మఱియు నెన్నేనిబన్నముల్ మాన్పె నేమ,హామహుం డట్టినీ విట్టిచో మదీయ
తాప మాఱంగ ద్రోణపుత్రకుని నేఁడు, పట్టి గిట్టించి సుఖి వయి పరఁగు మఘ.

వ. అని పాంచాలి పరిపరివిధంబులఁ బరిదేవనంబు సేయుచుం జెప్పినయప్పలుకు లాలించి కోపఘూర్ణితనయనుండై భీమసేనుండు కాంచనరథం బొండు పూన్పఁ బంచి నకులుని సారథ్యంబున నియమించి ధనుర్బాణ పాణియై దానిపై నధిరోహించి సజ్యం బైన కార్ముకంబు మ్రోయించుచు నశ్వత్థామ రథమార్గంబు పట్టి యతిత్వరితగతిం దేరు మరలించుచుం బోయె నట్లు భీమసేనుండు వోయినంత గదాగ్రజుండు పాండవాగ్రజుం గాంచి యి ట్లనియె. 34

అలసము. కొడుకులను జంపె నతిఘోరగతి నంచుఁ
గడుకొనినశోకమునఁ గాడ్పుతనయుం డొ
క్కఁడ చనియె ద్రోణసుతుఁ గయ్యమునయందుఁ
గెడపెద నటంచుఁ గనుకిన్క జత గాఁగ. 35

శా. నీకుం గూర్చెడుభీమసేనుఁడు కడుఁ గృచ్ఛ్రంబునం బొందెడిన్
వాకొందు న్విను మాగురూద్భవుని క్రేవన్ బ్రహ్మశీర్షంబు నా
లోకైకస్తుత మస్త్రరాజ మొసఁగెన్ లో నెన్న నయ్యస్త్ర మీ
లోకం బెల్ల నిమేషమాత్రమునఁ గాల్చుం బెంచ బల్పేఁతలన్. 36

— శ్రీకృష్ణుండు యశ్వత్థామవృత్తాంతము చెప్పుట —

సీ. ఆధనురాచార్యుఁ డర్జునునకుఁ బ్రీతి, పూర్వకముగ నిచ్చె ముచ్చు దాని
నిచ్చినం దెలిసి సహింప కశ్వత్థామ, యేకాంతమునఁ దండ్రి యెడకుఁ జేరి
కన్నబిడ్డం బెట్టి కవ్వడికిన్ బ్రహ్మ,శిర మస్త్ర మిచ్చితి చెల్లునె యిది
యని చాపలమున వేఁడినఁ దండ్రి వాత్సల్య,మునఁ బుత్రునకు నస్త్రమును నొసంగి

తే. యెట్టి యాపదలం బైన నిమ్మహాస్త్ర,మును బ్రయోగింపవలదు భూజనులమీఁద
సేయ రా దని శాసించి యీ వొకప్పు, డైన సన్మార్గనిరతుఁడ వగుము వత్స. 37

వ. అనిన జనకునివచనం బప్రియంబుగం దలంచి దురాత్ముం డగు నతండు సర్వకల్యాణ విముఖుండై వగపుపెల్లున మహీమండలంబెల్లఁ ద్రిమ్మరుచు వివాసు వనవాసంబు సేయుచున్న సమయంబున ద్వారకాపురంబునకు వచ్చి యొక్కనాఁ డేకాంతంబున సముద్రతీరంబున విహరించుచు నాతో నవ్వుచు ని ట్లనియె. 38

మ. భరతాచార్యుఁడు మద్గురుండు తపముం బాటించి పెక్కేండ్లు న
న్నరుదారంగ నగస్త్యమౌనికరుణం బ్రాపింపఁ గాఁ జేసె నై
శ్వరమున్ బ్రహ్మశిరోభిధాన మది నాస్వాధీన మే నిత్తు నీ
కొరిమం గైకొని నీదుచక్రమును నా కొప్పార నర్పింపుమా. 39

తరలము. అనిన నేను బ్రియంబు నొందినయట్లు పల్కుచు నల్క లోఁ
గొని ద్విజోత్తమ దేవదానవకోటు లన్నియుఁ గూడినన్
నను నెదుర్పఁగ లేవు వీర్యమునన్ శతాంశము నేని యె
వ్వరికి లే దని నీ కెఱుంగఁగ బల్కుమంటి నెఱుంగుమా. 40

క. ఇదె కార్ముక మిదె చక్రం, బిదె గద యిదె శక్తి నీకు నిన్నిటిలో నె
య్యది యెత్త సాధ్య మయ్యెడు, నది యిచ్చెదఁ బుచ్చుకొనఁ గదయ్యా యనుచున్.

వ. నీబ్రహ్మశిరోనామాస్త్రంబు నాకు వల దని పలుకుచు నాయాయుధమ్ములన్నియుఁ
బ్రదర్శించుటయు నతండు నాతోడి పరిస్పర్థం జేసి వజ్రనాభం బగుసహస్రారంబు గోరు
కొనిన నే నిదె కొమ్మని యెదుటం బెట్టితి నతండును. 42

తరువోజ. తనవామకరమునఁ దఱుపఁ బోయి, తరము గాకున్నంత దక్షిణహస్త
మునఁ బట్టి యెత్తంగఁ బోయియు నట్లు, పోనఁగక కరయుగ్మమును బూన్చి లావు
పొనరించి కదలుపం బోనఁగక విన్నఁ, బోయి దస్సినచందమున నొప్పె కార్య
మునకుఁ గడంగక మొగిఁ జూచువాని, మొగము గన్గొని పల్క మొనసితి నిట్లు. 43

వ. గురుపుత్రా! దేవమనుష్యాదులలోఁ బరమప్రమాణము నొంది ద్వంద్వయుద్ధంబున
దేవదేవుని మెప్పించి పాశుపతాస్త్రంబు వడసి ప్రసిద్ధి గాంచి నాకుఁ బరమప్రియుం
డై ప్రాణమే నిచ్చుటకుం దగినమిత్త్రుండైన గాండీవధన్వుండు గాని నాసహధర్మచారిణి
యైన రుక్మిణియందు సనత్కుమారునంశంబునం బుట్టిన ప్రద్యుమ్నుండు గాని బల
రామ గద సాంబాదులు గాని ద్వారకావాసు లగువృష్ణ్యంధకమహారథులు గాని
మఱి యెవ్వరేనియుం గాని నీవలె నన్నీ చక్రరాజ మిమ్మని యడిగినవారు లేరు నేనీ
చక్రరాజంబు హిమవత్పార్శ్వంబునఁ బండ్రెండేండ్లు ఘోరం బగు బ్రహ్మచర్యంబునఁ ద
పమాచరించి సాధించితి నిది యెఱుంగ కడిగితివి కానీ దీనం జేసి వేనితోడం బోర నెంచితివి
చెప్పు మనిన నతం డిట్లనియె. 44

మ. నినుఁ బూజించి యనుజ్ఞ గాంచి వెనుక న్నీతోడనే పోరి భూ
జన మెన్నంగ జయంబు నొందుదు నిమ్మైఁ జక్రం బపేక్షించితిన్
ఘనతేజోఽతిభయంకరం బయినచక్రం బుండుటం జేసి యే

నిను గెల్వం గలవాఁడు ముజ్జగముల ల్లేఁ డంచు నే నెంచెదన్. 45

వ. అనిన నేను భరతాచార్యపుత్త్రుం డనుగౌరవంబున నప్పుడు కొంతధనంబును గొ
న్నిరత్నంబులును గొన్నిరథ్యంబులు నిచ్చి యంపిపుచ్చితిఁ జపలుండును గ్రూరుం
డు నగునాదురాత్ముండు బ్రహ్మశిరోనామకాస్త్రశాస్త్రం బెఱింగినవాఁడు కావున
వానిబాఱినుండి మనభీమసేనుండు రక్షణీయుం డని చెప్పి యప్పురుషోత్తముండు నిజ
స్యందనంబున సైన్యసుగ్రీవమేఘపుష్పబలాహకంబులం బూన్చి విశ్వకర్మనిర్మితంబ
యినగరుడధ్వజం బెత్తి దారుకుండు దెచ్చిన దాశార్హుండు సాత్యకిసహదేవుల నట
నిలువ నియమించి తాను నొగ లెక్కి యుగ్యంబులపగ్గంబులును మునికోలయు గొ
నిన నర్జునుండును యుధిష్ఠిరుండును వానిపిఱుంద నధిష్ఠించి రపుడు రథస్థు లగు
వారుముగ్వురు నింద్రాశ్వినులచందంబునం బొందుపడి భీమసేనుండు చనినమార్గంబు
వట్టి రయంబునం జని యొక్కింతదూరంబునం గూడ ముట్టి వారించినను ద్వీపదర్ప
సముద్ధతుం డగునతండు వారిమాట గైకొనక యంత మున్న గురునందనుండు కరిన
గరమార్గంబు విడిచి గంగాతీరంబున వేదవ్యాసమునీంద్రునిసన్నిధికిం జని యున్నవాఁ
డని విని యున్నవాఁడు గావున దనవారు సూచుచుండ నతిరయంబున గుఱ్ఱంబుల
నదలించుకొనుచు నచ్చోటికిం జని సలిలప్రాంతంబున ఋషిగణపరివృతుండై కూరు
చున్నపారాశర్యునిచెంత రజోమలినుం డగునశ్వత్థామం గాంచి శరాంచితం బైనశ
రాసనంబు చేతఁ బట్టుకొని నిలు నిలు మని యదలించుచుఁ బైకుఱికె నంత
నతండును. 46

—అశ్వత్థామార్జునులు బ్రహ్మశిరోనామాస్త్రములు ప్రయోగించుకొనుట.—

మహా. తనపైకి న్వచ్చువానిం ధనువును శరముల్ దాల్చి పెల్లార్చువానిన్
ఘనరోషాకీర్ణరక్తోగ్రనయనయుగళుం గాంచి భీమున్ రథస్థున్
వెనుకం గృష్ణార్జునాదుల్ వెనుకొనుటయు హృద్వీథికి న్భీతి కొల్పన్
దనువెల్లం గంప మొందం దలఁచె విడువ నస్త్రంబు నత్యుత్తమంబున్ 47

గీ. ఒకయిషీకముఁ జేకొని యుచితరీతి, నంత బ్రహ్మశిరోనామకాస్త్రరాజ
మొనఁగున ట్లభిమంత్రించి యేసె నెల్ల, జగ మపాండవ మగు నని సరభసమున. 48

మత్త. అయ్యిషీకమునందుఁ గల్పమునందుఁ బోలె మహానలం
బ య్యెడం జనియించి లోకము లన్నియుం దృటిలోపలన్
బ్రయ్య నేర్చెడునట్లు మండుచుఁ బొంగి రాఁ గని మాధవుం
డయ్యుపద్రవ మెల్ల జిష్ణున కారఁ జూపుచు నిట్లనున్. 49

శా. హా హా హా పరికించు మల్లదిగొ చాపాచార్యసంపాదితం
బై హార్ద్వాందెదునస్త్రరాజ మిపు డొండస్త్రంబునం దీనియు
త్సాహంబుం గడతేర్పఁ గా దదియె యేతత్కాలమం దేసి నీ
దేహజ్ఞాతుల నిన్నుఁ గాచుకొను మో దేవాధినాథాత్మజా. 50

ఉ. ఆవచనంబుల న్విని రయంబునఁ దేర్దిగి ఫాల్గునుండు గాం
డీవము సంతరించుచుఁ గడిందిమగంటిమిఁ బూని లోన స
ద్భావముతోడ ద్రోణికిని భ్రాతలకుం దనకున్ శివం బగుం
గావుత మంచు మ్రొక్కెఁ గడఁకం గురుపీఠికి దేవకోటికిన్. 51

చ. గురుతనయాస్త్రశాంతి మదిఁ గోరుచు బ్రహ్మశిరంబు మంత్రభా
స్వరముగఁ జేసి యేసె నది సర్వవియత్తల మాక్రమించి దు
ర్భరతరకీలముల్ సెదరఁ గ్రాలుచు నగ్గురుపుత్రునస్త్రముం
దొరసి యెదిర్చె లోకమునఁ దోఁప మహాప్రళయప్రసంగతుల్. 52

వ. అంత నయ్యస్త్రద్వితయసంఘర్షణంబున. 35

మహా. ధర గంపించెం బయోధుల్ దఱిలి కలఁగె భూధ్రంబు లుఱ్ఱూఁత లూఁగెన్
సురమార్గంబందు మంటల్ సొరిదిఁ గవిసెన్ సూర్యతేజంబు మాసెన్
గురిసెం బాషాణధారల్ కొఱవులు పడియెం గూలె నిర్ఘాతపంక్తుల్
గురుశబ్దం బుప్పతిల్లెం గుతలమునఁ బ్రజాకోటికి స్ఖితి యయ్యెన్. 54

వ. ఇట్లు సర్వభూతభయంకరం బై యున్నయవసరంబున నారదుండు కృష్ణద్వైపాయనముని
చెంగటం బొడసూపె నంత లోకహితార్థంబు గావించుతలంపున నయ్యిరువురు ము
నీంద్రులు నయ్యస్త్రద్వయంబుమధ్యంబున నిల్చి భారద్వాజధనంజయులం గాంచి యి
ట్లనిరి. 55

క. నానాశస్త్రాస్త్రజ్ఞులు, మానితగుణు లైనతొంటిమానవనాథుల్
మానవులమీఁద నియ్యస్త్రానలము న్విడిచి రే సమంచిత మగునే. 56

వ. అనవుడు నర్జునుం డమ్మునులం గాంచి నమస్కరించి యి ట్లనియె. 57

పంచ. ప్రయుక్త మస్త్ర మస్త్ర మేసి పాయఁ జేయ నెంచి యి
ట్లయుక్తకార్య మేను జేసి నట్టివాఁడ నైతి నో
నయప్రవక్తలార యిప్డు నామహాస్త్రశాంతికై
ప్రయత్న మాచరింతు నేని వానియస్త్ర మేర్చెడిన్. 58

వ. మాకు లోకంబులకును గీడు వాటిల్లకుండునట్లు మీరలు హితంబు దలంపుఁడు

మీరు దేవసంకాశులరు మీతలంపునంజేసి నాయస్త్రం బుడిగింతునని సవ్యసాచి
తనయస్త్రం బశ్రమంబున నుపసంహరించె నాకర్ణింపుము. 59

—వ్యాసుం డశ్వత్థామ నుపశమింపం జేసి శిరోరత్నం బిప్పించుట—

సీ. అసిఁ బ్రయుక్తం బగునాబ్రహ్మశిర ముపసంహరించుటకు నిర్జరులు నోప
రర్జునుం డచరితాధిక బ్రహ్మచర్యవ్రతుం డగుట మరల్పఁ జాలె
బ్రహ్మచర్యము లేనివాఁడు మగిడ్చిన, నది వానిఁ బ్రజతోడ నవనిఁ గూల్చు
బ్రహ్మతేజఃప్రభవము గాన దాని కాయమహితప్రభావము విహిత మయ్యె
తే. నట్లు నరుఁడు నిజాస్త్రసంహారము నొనరింపఁ గనుగొని ద్రౌణి వారింప నెంచి
శక్తియుక్తుండు గాక లోకశాంతి దక్కి దీనుఁడై వ్యాసునకు నిట్లు తెలియ ననియె
ఉ. గాడుపుట్టి ధర్మవిముఖత్వమునన్ ధృతరాష్ట్రపుత్రునిన్
వీడక చంపి యంత నను వెన్నడి వచ్చి వధింప నున్నచోఁ
గూడినప్రాణభీతి నిది కూడును గూడదు నాఁక మంత్రముం
దోడుగఁ జేసికొంచు నిటు తోఁపఁగఁ జేసితి నిమ్మహాస్త్రముం. 61
తే. విను మపాండవ మగుఁ గాత మనుచు దీనిఁ, నిటుఁడఁ జేసితి వెండియు మగుడఁ జేయఁ
దలఁప నిది మృత్యు వగుఁ బాండవులకు నెల్ల, రోసమునఁ జేసి పాపముఁ జేసినాఁడ.
మహా. అసనన్ ద్వైపాయనుం డిట్లను గురువరపుత్రా నరుం డిమ్మహాస్త్రం
బును దాఁ గైకొంచు నున్నం బొసఁగఁ గినుకం బూని నీమీఁద నేయ
న్నన మొప్పం జేయఁ డయ్యె న్మఱికువ గొని యిమ్మాడ్కి నీవేయునస్త్రం
బును వారింపంగ నస్త్రంబును విడియుఁ గృపం బూని వారించెఁ గంటే. 63
వ. గురూపదేశంబునం జేసి బ్రహ్మాస్త్రాదులు నేర్చి క్షత్రియధర్మంబునం దుండి చలింప
కున్నయీసవ్యసాచికిని వానియన్నదమ్ములకు నీ వేల కీడు రోయుదువు మఱి
యును బ్రహ్మశిరోస్త్రం బస్త్రంబునఁ బ్రతిహతం బగునట్టిద యేనియారాష్ట్రం
బున ద్వాదశవర్షక్షామంబు ననావృష్టియు నగు నని చెప్పుచుంటి మట్లు
గ కున్న నితండు తనయస్త్రంబున నీయస్త్రంబు శాంతింపం జేసి తన్నుం దనవా
రినిం గాపాడు కొనఁ గలం డట్లు కాకుండ నీవు నిన్నును బాండవులను రాష్ట్రంబు
నుం గాపాడ నెంచి నీయస్త్రం బుపసంహరించుకొనుము కోపం బుడుగుము పాండ
వులు నిష్కాములు లయ్యెదరు గాక రాజర్షి యైన ధర్మజుం డధర్మంబున జయంబు
గొన నొల్లమి నెల్లంబు నీశిరంబున నున్నమణిం దీసి పాండవుల కిమ్ము వారు దానిం
బుచ్చుకొని నీప్రాణములు నీ కిచ్చెద రనిన నశ్వత్థామ యి ట్లనియె. 64

క. కురుపాండవులకుఁ గలిగిన, చిరత్నరత్నములకంటె శ్రేష్ఠతరంబై
పరఁగెను నాదుశిరోగత, సురుచిరరత్నంబు దానిశోభయు ననఁదే. 65

శా. దానిం దాల్చిన నుండఁబో వెపుడు నిద్రావ్యాధితృడ్బాధలున్
నానాశస్త్రవిహారబాధ లమరేంద్రవ్యాలరక్షోగణ
స్థానాత్యున్నతబాధలున్ మునివతంసా యిట్టిసద్రత్నమున్
నే నీఁ జాల నతైన నీవచనము న్నగ్గించెదం గావునన్. 66

క. రతనం బొసఁగెదఁ గానీ, ప్రతిపాదిత మైననాదుపరమాస్త్ర మమో
ఘత నొప్పఁ ద్రిప్పఁ జాలను, గతి దానికిఁ బాండవేయగర్భంబులగున్ 67

క. కావున నాపరమాస్త్రము, నీవచనంబునను మరల నీయక పాండు
క్ష్మావరసుతగర్భములం, బో విడుతున్ దాన శాంతిఁ బొందెద ననఘా. 68

తే. అనుడు సాత్యవతేయుఁ డోయనఘ చేయు, మట్లు కొండొకబుద్ధి చేయకుము శాంతిఁ
బొందు మన ద్రోణి తనయస్త్రమును వెలార్చెఁ, బాండవేయగర్భంబులఁ బడెడునట్లు.

వ. అట్టియెడ హృషీకేశుండు హర్షించుచు నశ్వత్థామ దక్కఁ జెలంగంబై యిట్లనియె.

— శ్రీకృష్ణుం డుత్తరాగర్భంబు రక్షింతు నని ప్రతిజ్ఞ చేసి గురుపుత్రుని శపించుట —

సీ. వినుము ద్రోణాయని! విరటుని కూఁతురు, విజయునికోడలు వీరపత్ని
యపు డుపప్లావ్యమునం దుండ వ్రతియగు, బ్రాహ్మణుం డొక్కఁడు వచ్చి యిచ్చెఁ
జెలి! కౌరవులు పరిక్షీణు లైనపుడు నీ, గర్భస్థునకుఁ బరిక్షయము గలుగు
ననియె నమ్మాట సత్య మగుఁ బరిక్షిత్తుఁ, డన వంశకర్త నందనుఁ డెసంగు

తే. నని పలుకుచున్న గోవిందు నరసి ద్రోణి, పరమసంరబ్ధుఁ డై నీవు పలికినట్లు
కాదు నావచనము రిత్త వోదు నీవు, కాచినం గాని యస్త్ర మక్కడుపుఁ గాల్చు.

వ. అనినఁ బుండరీకాక్షుండు వెండియు. 72

సీ. నీయమోఘాస్త్రము నెలఁత గర్భము సొచ్చి, చంపెనేన్ వెండియుఁ జావ కుండఁ
బుత్త్రుండు దీర్ఘాయువుం బొందు బాలజీ, వితఘాతుకుని నిన్ను విజ్ఞులెల్లఁ
గాపురుషుం డండ్రు కావున నప్పాప, ఫల మీవు పొందంగఁ గలవు వినుము
గతి లేకనిర్జనక్షితి ననహాయుండై, వ్యాధి బాధితుండవై బోధము చెడఁ

తే. బూయశోణితదుర్గంధములకు దాన, కంబగుచు మూఁడువే లేండ్లు త్రిమ్మరంగ
లాఁడ వెంతయుఁ గష్టంబు కూడుకొనఁగ, దెలిసి నీదుష్కృతికి నీవ తిట్టుకొనుచు.

వ. అని మఱియును. 74

చ. మృతుఁ డయి మత్తపోమహిమ మేకొనఁ గ్రీడి దాన వెండియున్

బ్రతికిన శ్వేతవాహనునిపౌత్త్రుని నీవు వినం గనం బరి
క్షితుఁ డనఁ దేరి గౌతమునిచెంత శరంబునఁ దీరి కౌరవ
క్షితి కధినేతమై ప్రభుత సొల్లగ నర్వదియేండ్లు లేలెడిన్. 57

వ. అని పల్కినంత సాత్యవతేయుండు నశ్వత్థామం జూచి.

మత్త. మ మ్మనాదరణమ్ము సేయుచు మాటపాటి పౌనర్పఁ బో
కిమ్మెయిన్ దురితంబు చేసితి వెన్న విప్రుఁడ వయ్యు వృ
త్తమ్మెఱుంగక సంచరించినదాన నీ కగుఁ గాక స
త్యమ్ము గా నపు డీరమాధవుఁ డాడినట్టివిధంబుగన్. 77

వ. అని శపించిన నశ్వత్థామ మునీంద్రా! నేను నీతోడన మనుష్యలోకంబున నుండువాఁ డ నీవు నీపురుషోత్తముండును సత్యవచను లగుదురు గాక యని చూడామణిం దీసి పాండవుల కొసంగి విమనస్కుండై యెల్లరుఁ జూచుచుండఁ దపోవనంబునకుం జని యెఁ బాండవులును నారదవ్యాసులనామంత్రణంబు చేసి గురుపుత్త్రశిరోరత్నముం బుచ్చుకొని శ్రీకృష్ణ పురస్సరులై యతిత్వరితగమనంబున శిబిరంబునకుం జనుదెంచి రథావతరణంబు చేసి దుఃఖశోకసమన్వితయై ప్రాయోపవేశముం జేయ నున్న పాంచాలిపాలికిం జని పరివేష్టించి యున్న యప్పుడు ధర్మరాజునాజ్ఞం గొని భీమసేనుం డమ్మణి నమ్మానినికి నొసంగుచు ని ట్లనియె. 78

—భీముఁ డశ్వత్థామశిరోరత్నమును ద్రౌపది కిచ్చుట.—

క. ఇది నీదుపుత్త్రహంతకు, సదమలరత్నంబు వానిఁ జక్కడచి భవ
న్మదముం గూర్పఁగఁ దెచ్చితి, మెద శోకము క్షత్త్రధర్మ మోంచి విడువుమా. 79

చ. కరిపురికిన్ శమార్థ మని కంసవిరోధినిఁ బంపునాఁడు నీ
వరమర లేక శౌరికడ నాడితి మాటలు రాజు సంధికిన్
దొరకొనె నేని నాకిఁ బతుల్ సుతు లన్నలు నేను లేనియ
ట్లరసెద నంచు తోత్త్రమున నయ్యవి యెల్లఁ దలంప నొప్పదే. 80

తే. దుష్టదుర్యోధనునిఁ గూల్చి దస్ససేను, పచ్చి నెత్తురు ద్రావి వైరంబు దీర్చి
తిమి జయించియు గురుపుత్త్రుఁ దెఱల నేసి, విడిచి నారమ విప్రుఁడన్ విధముఁ దలఁచి.

వ. అని యనేకవిధంబుల నూఱడం బలికి గురుపుత్త్రశిరోరత్నం బామెచేతి కిచ్చినం బుచ్చుకొని పాంచాలి. 82

చ. పగ మొదలంటఁ దీర్చుకొనఁ బల్కిన పల్కులె కాక వేఱుగా
పగు గురునందనుండు మన కందరికిం గురు పుండ నిమ్ము మా

డఁగ మది యా నరేంద్రుఁ డిది డక్కఁగొనం దలఁ దాల్చి యున్నవం
చగవుగ దానిధర్మజుని హస్తతలంబునఁ బెట్టెఁ బెట్టినన్. 38

తే. ధర్మజుండు గురూచ్ఛిష్టతత్పరతను, ద్రౌపదీ గౌరవంబున దానిశిరము
నందుఁ గొని యుద్యదబ్జబింబాభిరామ, మైనయునయూచలముకీతి నలరె నపుడు

వ. అట్టియెడ నయ్యజాతశత్రుండు సౌప్తికంబున రథికత్రయంబుచే నఖిలసైన్యంబు హతం
బగుటకు మిగుల వగలం బొగలుచు దాశార్హుం జూచి యి ట్లనియె. 85

చ. అకట కటా దురాత్ముఁ డగునగ్గురునందనుఁ డొక్కరుండ మా
మకు లగుయోధులన్ సుతుల మార్కొని కూల్చెబె కాక యో
తకును సమర్థుఁడై గురుని దర్ప మడంచినపార్థున్ గ్రసిం
చికొనెమునంత శక్తి గొనఁ జేసినకృత్య మ దేమి చెప్పుమా. 86

వ. అనిన భగవంతుం డగు వాసుదేవుం డి ట్లనియె. 87

— శ్రీకృష్ణుండు ధర్మరాజునకు శివప్రభావముం జెప్పుట —

చ. గురుతనయుండు శంకరునిఁ గొల్చి తదీయమహా ప్రభావసు
స్థిరగరిమన్ భవజ్జనులఁ జేకొని గెల్చె నొకండ లోకమం
దరయఁగ నమ్మహామహు మహాకృపకాకరుడైనవాఁడు ని
ర్జరుఁ డగునిర్జరేశ్వరునిఁ జంపఁగఁ జాలెడునట్టి వాఁడగున్. 88

ఉ. అమ్మహనీయమూర్తి విభవాదిక మంతయు నే నెఱుంగుదున్
ముమ్మొనవాలు దాల్పగుచు మూఁడుజగంబుల నేలుచుండున
త్యమ్మున నెల్లభూతముల కాదియునంత మతండె వాని కా
ర్యమ్మునఁ జేష్టితంబగు సమస్తజగంబును సర్వకాలమున్. 89

సీ. తొలుత నాభూతనాథుఁడు భూతములు సృజి, యింప నెంచిన బ్రహ్మ యేగుదెంచి
భూతసృష్టి యొనర్పఁ బూనవే యన హరుం, డట్లవుం గావుత మనుచుఁ బలికి
భూతదోష మెఱింగి పోయి జలంబుల, మునిఁగి తపం బేండ్లు పూండ్లు చేసె
శూలి రాకకుఁ బెద్దకాలము వేచి వి, రించి సృష్టినిఁ బొనరింప నొకనిఁ

తే. దలఁచినంతన కలిగించి పిలిచి వాని, కర్జ మెఱిఁగింప నతఁడు నాకంటెఁ బెద్ద
లేకయుండిన సృజియింతుఁ గాక యనుడు, నబ్జసంభవుఁ డాతని కనియె నిట్లు. 90

క. నీకుం బూర్వజుఁ డగు హరుఁ, డే కాలమునాఁడొ నీటియొక్కన డంగెన్
నీకంటెఁ బెద్ద యెవ్వఁడు, లేకుండెం గానఁ జేయ లెమ్మా సృష్టిన్. 91

వ. అంత నప్పరమేష్ఠి నియోగంబున నప్పురుషుండు దక్షాదుల నేడుగురు ప్రజాపతులం

బుట్టించుటయు వాడు చతుర్విధం బగుభూతగ్రామంబు సర్వంబును సృష్టించి రాభూతంబులు పుట్టినమాత్ర క్షుత్పిపాసల కోర్వం జాలక దక్షప్రజాపతిం భక్షింపం బోవుటయు నాతండు పితామహునిపాలికిం జని దేవా! నేను పుట్టించినభూతంబు లన్నము లేక నన్నె భక్షింప నున్నవి గావున వీని కాహారమ్ము గల్పింపు మని ప్రార్థించుటయు పితామహుం డోషధులను వృక్షలతాగుల్మంబులను స్థావరజంగమంబు లగుదుర్బలభూతంబులు బలిష్ఠభూతంబులకు నన్నంబుగాం గల్పించిన నీభువనంబు భూతసందోహసాంద్రంబై యొప్పిన నప్పరమేష్ఠి సంతుష్టుం డయ్యె నయ్యెడ. 92

శా. భూతేశుండు జలంబుల న్వెడలి సమ్యోకమ్మున న్వచ్చి సం
భూతంబై జగమెల్ల నిండికొని పెంపుం గాంచి యున్నట్టిత
ద్భూతవ్రాతముఁ జూచి యేచినక్రుధం బొంగారి నైజోన్నత
ఖ్యాతిం బొల్చిన లింగము న్వెఱికి వీఁకం బైచె నేలం బడన్. 93

వ. అట్టియెడ నీరజభవుం డెట్టకేల కాభవునిం జేర నరిగి కోపాటోపోపశమనంబు చేయుచు ని ట్లనియె.

క. సలిలంబులఁ జిరకాలము, నిలిచి పొనర్చినది యేమి నీవీలింగం
బిల వైచి తేమికత మని, పలికిన రుద్రుండు మాఱు పలికె నతనికిన్. 95

ఉ. భూతతతిన్ సృజించుటకుఁ బూనిన నేను దపింప నీటిలోఁ
బ్రీతి వసించి వచ్చితిని వేఱొకరుండు తదీయసృష్టి న
త్యాతతరీతిఁ జేసెఁ బ్రజ కన్నము నోషధి సాధ్య మయ్యె నా
కీతఱి సృష్టిసాధన మిదేటికి లింగ మటంచుఁ బుచ్చితిన్. 96

వ. అని చెప్పి యప్పు డప్పరమశివుండు నిజక్రోధం బుపసంహరించుకొని కవిమనస్కుండై ముంజవద్గిరిపాదంబునకుం జని తపంబుండె నంతఁ గొంతకాలంబున కలితదేవయుగంబున. 97

— రుద్రుండు దేవతలు సేయుయజ్ఞంబు సేసినకథ —

మ. సవనం బొండు శ్రుతిప్రమాణపరతన్ సంధింపఁగా నెంచి ముక్
తివిపన్నాయకు లెల్లరుం గలిసి తద్విద్ధవిర్ద్రవ్యముల్
సవిమర్శంబుగ సంతరించికొని తత్సంబంధభాగార్హులం
దక్రరీతిన్ సవరించి రుద్రునిమహత్త్వం బాగయం జాలమిన్. 98

వ. అద్దేవదేవునకు హవిర్భాగంబు కల్పింపక యజ్ఞంబు ప్రవర్తింపఁ జేయుచున్న నెఱిఁగి యుగ్రుం డాగ్రహించి లోకయజ్ఞ క్రియాయజ్ఞ గృహయజ్ఞ పంచభూతనృయజ్ఞంబుల జగం బెల్లఁ డుల్లం బగుటం జేసి లోకయజ్ఞ మనుష్యయజ్ఞంబులఁ బంచ

కిష్కుప్రమాణం బయినయొక్క కోదండంబు సృజియించి దానికి వషట్కారంబున
నారి గావించి సన్నాహనంబున యజ్ఞాంగచతుష్టయం బమరించి దానిం గొని దేవ
యజనస్థానంబునకుం జనుదెంచి యున్నంత నిత్యబ్రహ్మచారియు నవ్యయుండు నగు
నమ్మహాధనుర్ధరుం గాంచి. 99

మ. ధర గంపించె ధరాధరంబులు గదూ దార్ఢ్యంబు లయ్యెన్ దివా
కరచంద్రార్కులు వెల్గు మాని రపు డాకాశంబునం దారకో
త్కర మిట్టట్టుపడెన్ సమీరగతి శాంతం బయ్యె లోకంబునం
బరివర్తించెను జిహ్మవీచికలు స్తబ్ధం బయ్యె సర్వంబునన్. 100

మణిరంగము. వేల్పు లెల్లరు వేఱెఱుఁగక వెల్లఁ, బొల్పుపో వెఱఁ బొందిరి యజ్ఞం
బల్పమై ప్రతిభాక్షతి డిందెన్, గల్పకాలజగం బన నయ్యెన్. 101

వ. అయ్యవసరంబున. 102

శా. రుద్రుం డస్త్రలు వెల్లిగ్రెల్లెడు గతిన్ రూక్షంబుగా నార్చుచున్
రౌద్రాస్త్రం బరివోసి యేసె నది గోత్రాభాగముం గప్పి ని
ర్నిద్రార్చిప్రభతోడ డాయుటయు నార్తిన్ యజ్ఞ మగ్నిక్రియా
నిద్రాణం బయిపాఱె నిట్టి యగుచున్ శీఘ్రాతిశీఘ్రంబుగన్. 103

క. మృగరూపంబున నగ్నిం, దగిలి మఖం బిట్లు పాఱుఁడు తనవెన్నడి రా
గగనమున కెగసి నిలిచెన్, మృగరూపము గానవచ్చు నేఁటికి నింగిన్. 104

వ. అట్లు యజ్ఞంబు పోయిన యజ్ఞభుజులు నష్టసంజ్ఞులై యున్నంత నంతకాంతకుండు.

సీ. సవితృనిబాహువుల్ సడలంగఁ దెగనేసి, భగునిగ్రుడ్లూడి రాఁ బట్టి మొత్తి
పూషునిదంతముల్ పొడిపొడియై రాల్చి, క్రోధమాకారము గొన్నపగిది
వెలుఁగుచుండఁగ నట నిలువ నోపక యజ్ఞ, భుజులు యజ్ఞాంగముల్ పోవఁ జెడి
పఱచియు నలుగడఁ బఱవ నేరక చచ్చి, నట్లట నుండియు నడలు గుడువ

ఆ. వెంట నంటి తఱిమి వింటి కోపున గ్రుచ్చి, పరిహసించి నిలువఁ బట్టి పోవ
నీక తూలపుచ్చ వాకొని రా వింటి, గొనయ మూడిపడుత మనుచు సురలు. 106

వ. అట్లు పలికి నంత గొనయంబు తునియ లగుటయు దానిం జక్కఁ జేసికొనునంత
నాత్మనిండుకొని చెంత నెల్లదేవతలు యజ్ఞాంగంబులతో వచ్చి శరణంబు సొచ్చుటయుఁ
జిచ్చుఱకంటివేల్పు వేల్పులకుం బ్రసన్నుండై ప్రసాదం బనుగ్రహించి. 107

క. తనహృదయంబునఁ బొడమిన, ఘనకోపము వుచ్చి నీటికరడులలో వై
చిన నది ఘోరానల మై, చెనయుచు నీర్వాయి నింకఁ జేయుచు నుండెన్. 108

వ. ఇట్లు ప్రశాంతుండైన పరమేశ్వరుండు సవితృభగపూషులకు భుజనేత్రదంతంబులను
గ్రహించి యజ్ఞం బెప్పటి యొప్పు నట్లు సేయుటయు. 109

క. దేవతలు మరల యజ్ఞము, గావింపం దొడఁగి హవ్యగణములభాగం
బావామదేవమూర్తికి, నై వెలయం జేసి ధన్యు లైరి నరేంద్రా. 110

ఆ. అమ్మహానుభావుఁ డప్రసన్నుం డైన, జగ మడంగు సుప్రసన్నుఁ డైన
నెఱిఁ గడంగు దాన నీప్రజ లీల్గిరి, గాని ద్రౌణిశక్తి గాదు తెలియ. 111

మాణవకము. నీవు మదిం దేనికిఁ జిం, తావిలుఁడై యుండ కుమా
దేవుప్రసాదంబునకై, భావికృతిం గైకొనుమా. 112

వ. అని గోవిందుండు ధర్మనందనునకుఁ బోధించె నని. 113

క. జనమేజయజననాథున, కనుపమమేధానిధాన మగువైశంపా
యనముని సౌప్తికపర్వం, బునఁ గలకథ యెల్లఁ దెలిపె ముదమెదఁ బొదలన్. 114

ఆ శ్వా సాం త ము.

మ. కవచంబుల్ విడనాడి నిర్భయగతిన్ గన్మోడ్చి నిద్రించుపాం
డవపాంచాలురఁ జంపె నన్ననుడి విన్నన్ మృత్యు వెట్లైన నీ
భువి నొవారికిఁ దప్ప దం చెఱిఁగి నిన్ బూజించి సేవించి మృ
త్యువుబారిం బడకుండ నీకృతి నొసఁగున్ సర్వలోకేశ్వరా. 115

గ ద్య ము

ఇది శ్రీమదధునాతనోభయకవిమిత్ర వేంకటయజ్వాగ్రపుత్ర
సమారాధితవిబుధరాజ శ్రీపాదకృష్ణమూర్తికవిరాజ
ప్రణీతం బయిన శ్రీకృష్ణభారతంబునందు
సౌప్తికపర్వంబున సర్వంబును
ద్వితీయాశ్వాసము.

శ్రీ శ్రీ శ్రీ

---

ఉ. సుప్తులఁ బట్టి బ్రాహ్మణుఁడు సూత యెఱుంగక కోసి చంపుటన్
సౌప్తిక మన్నపే ర్వడసి సర్వజగజ్జనకోటియుం దభి
వ్యాప్తికి నైనపర్వ మిది వ్యాధియు నాధియు వేపుచున్న ని
ష్టాప్తము గా రచించె నెనయం గవిరాజు విరాజమానుఁడై.

---

శ్రీ

బాలాత్రిపురసుందర్యై నమః.

# శ్రీకృష్ణభారతము

స్త్రీపర్వము - ప్రథమాశ్వాసము.



పాదభక్తియుక్తిన్
శ్రీపాదాన్వయ మెసంగు క్షితితలమందున్
భూపాలసేవ్యమై నే
నాపరమాన్వయభవుండ నని కొల్తు నజా. 1

వ. అక్కథకుండు శౌనకాదిమహామునుల కిట్లనియె. 2

—జలప్రదానికపర్వము—.

క. జనమేజయజనవల్లభుఁ, డనుపమమేధానిధాన నుగువైశంపా
యనమునిదిక్కు మొగంబై, వినయంబున నడిగె నవలివృత్తాంతం బెఱుఁగన్. 3

తరువోజ. తనసైన్యమును సుయోధనుఁడును గాల, ధర్మంబు నొందుటం దా విని చేఁకు
పొసరించె నెట్లు కృపుఁడును భోజుండుఁ, బోయి రెట్లా గురుపుత్త్రుండు వ్యాస
మునిచెంత కేటికిఁ బోయె ధర్మజుఁడు, పుత్త్రు లందఱుఁ జెల్లి పోయినవెనుక
నొనరించె నెట్లింతయును దెల్పు మనుట,యును విని వ్యాసశిష్యుం డిట్టు లనియె. 4

చ. సుతశత మట్లు కూలుటను శోకమహానలదహ్యమానుఁడై
హతశతశాఖమైనతరు వట్టులు మ్రోడ్వడి చెయ్వు దక్కి మూఁ
గ తెఱఁగున న్విచారఫలకంబునఁ జిత్తము నిల్పి యున్నభూ
పతిఁ గని సంజయుం డిటులు పల్కె నయంబున నూఱడించుచున్. 5

సీ. శోకించె దేటికో క్షోణీశ! నీశోక, మునకుఁ బారము గల్గఁ బోదు వినుము
పడియె నక్షౌహిణుల్ పదియు నెన్మిదియును, దేశాధిపతు లెల్లఁ ద్రెళ్ళ నైరి
ముడిసిరి పితృపితామహపుత్త్రపౌత్త్రులు, జ్ఞాతిసుహృజ్జనసమితి సమసె
సర్వసర్వంసహా జనశూన్య మయ్యె నీ,యవినయంబున నైనబవరమునను

తే. ఆనుపూర్వ్యము గాఁగ వారం దఱకును, బ్రేతకార్యము లొనరింప విహిత మనుడు
నతఁడు వాతేరితం బైనక్షితిజ మట్లు, ద్రేఁటు నష్టమ్మృగం బట్లు నృ[illegible] వ్రాలె. 6

వ. వ్రాలి సోలి కొంతసేపటికిం దేలి దేవురించుచు నిట్లనియె. 7

—ధృతరాష్ట్రుండు పుత్రశోకంబునం బొక్కుట—

ఉ. పుత్రులు పౌత్రులుం సచివపుంగవులుం సుహృదుల్ సగోత్రులున్
ధాత్రితలంబు వాసిరి సుతప్రభుతాస్వతరజ్యలక్ష్మియుం
శత్రులఁ జేరె నిప్డు జరజర్ఝరితాంగము లూనపక్షమా
పత్రి యనంగ దుఃఖములపాల్పడ నైతి నిఁ కేమి చెప్పుదుం. 8

ఆ. క్షీణరశ్మి యైనచిత్రభానుఁడు వోలె, సర్వసంపదలును సన్నగిల్లె
జీకు వృద్ధు నగుచుఁ జెన్నఱి పోయిన, యితఁడు బ్రదుకు టెట్లు క్షితితలమున 9

సీ. పొత్తు పొసంగింపఁ బురుషోత్తముఁడు వచ్చి, శ్రేయోభిలాషి యై చెప్పి నొప్ప
ద్వైపాయనుఁడు జామదగ్న్యుఁడు నారదముఖ్యులు సెప్పిరి బుజ్జగించి
ద్రోణభీష్మాదు లీదుర్బుద్ధి వలదని, బుద్ధు లెన్నేఁ జెప్పి రిద్ధబుద్ధి
చెవులు చిల్లులు వోవఁ జెప్పె మావిదురుండు, ప్రార్థించి కోపించు వంతగించి

తే. యేను దుర్బుద్ధి నగుట నే రెట్టు లొత్తి, చెప్పినను గాని విన నైతిఁ జేయ నైతిఁ
బాండుపుత్రుల రావించి యొకపాలు, వారికీ నైతిఁ దుదఁ గిట్టివాఁడ నైతి 10

క. అని దుర్యోధనదుశ్శాసనముఖ్యులు పుత్రు లెల్ల సమసిరి కర్ణుం
డును ద్రోణుండు సుహృజ్జనులును ద్రెళ్ళిరి నాదుచెయ్దు లులివడుదాకన్. 11

ఉ. తొల్లిటినాఁడు జన్మములఁ బొట్రిలి చేసినదుష్కృతంబు లి
ట్లల్లి ఫలించునట్టులు స్వయంభు వొనర్చినవాఁడు గాన నేఁ
డెల్లను గాఁగ దుఃఖజలధిం బడి పారము గాన కుంటి నీ
యెల్లజగంబులం గలుగఁ డెవ్వఁడునే ననుఁ బోలు దుఃఖి యై. 12

వ. అది యట్టిద కావున. 13

క. వివరింప నిపుడు నన్నుఁ, వివృతం బగుబ్రహ్మలోకవిపులాధ్వమునం
జవిలినవానిఁగఁ గనుఁగొంద్రు వడి న్వడి సంశితవ్రతులు పాండుసుతుల్. 14

వ. అని బహువిధంబులం బలవించునతని నుపశమింపం జేయుచు సంజయుం డిట్లనియె.

ఆ. వేదనిశ్చయములు వివిధశాస్త్రాగమములును వింటి వృద్ధమునులవలన
మున్ను సృంజయుండు పుత్రశోకార్తుఁడై, యున్న నాఁటిమాటయును నెఱుఁగుదు. 16

ఆ. సుహృదులాడు నుడులు సుంతయు విన నైతి, ననుచు నీవ యంటి వట్టియెడలఁ
గ ప్రీవంటి నీదు ఘనతరబుద్ధి యే, యింత తెచ్చె దాని కేల వగవ. 17

సీ. నరేంద్రా నాఁడు నీకొడుకు దుర్యోధనునకు దుశ్శాసనుండును రాధేయుఁడును

శకునియు లోనగువారు మంత్రులు వారు సెప్పినట్లెల్ల నతండు ప్రవర్తించెం గాని
గాంధారియు భీష్మ ద్రోణ విదుర కృప కృష్ణ నారద పారాశర్యాదులు చెప్పిన చొ
ప్పు లొప్పు లని పరిగ్రహింపఁ డయ్యె వాఁడు దుష్టుండు దురహంకారుండు క్రూ
రుండు ధర్మంబు సంస్మరింపక నిత్యంబు యుద్ధంబు యుద్ధం బని సర్వక్షయంబు గావిం
చుకొనియె నీవు మధ్యస్థుఁడవును సమచిత్తుండవునై శమంబు దలంపక కొడుకు తీ
పిం జేసి వాని కొండాడ కింత యచ్చుకొంటి విది దైవనోదితంబు శోకిం జింతించిన
ఫలంబు లేదు వినుము. 18

క. శ్రుతమున్ సత్యము బుద్ధి, ప్రతిభయుఁ గల నిన్ను వంటి పండితుఁ డెపుడున్
మతి గలఁగి మోహపరవశ, గతి గలఁడై కుందఁ డెపుడు కౌరవనాథా. 19

క. మును మున్న యుంటఁ గాఁ దగు, జనునకు విజ్ఞాన మెల్ల సరిపడఁ జూదన్
మనమునఁ బశ్చాత్తాపం, బున నావుగు మనుచు నేర్పఁ బోలునె చెప్పుమా. 20

భుజంగ. చతుర్దిక్ జన్ను వీక్షించి సంరంభియై యోధ్రుఁ డా దానిఁ గాంక్షించి తే నెంచి పాత్రం
బెఱుంగ న్విచారింపకే యెక్కి చావై, నెఱుం దప్పవాఁ డిట్లు నీ పైతి వెన్నల్గా. 21

క. ఏడిచి యర్థము లందం, బోఁ డేడిచి ఫలము లొందంబోవందు ప్రియం
బేడిచినఁ గాదు మనుజున, కేడు పనర్థములమూల మేడుపు తగునే. 22

క. తా నగ్ని తెచ్చి యిచ్చెన్, దాని స్వవస్త్రమునఁ జుట్టి తగులంబముదోఁ
గానంగ లేక దుఃఖం, బూనెడుమనుజుండు ప్రాజ్ఞుండో తలపోయన్. 23

తే. కొడుకుతోఁగూడి నీ వాడునుడువు లనెడు, ననిలమున రేఁచి నీలోభ మనెడు నేయి
వేల్వఁ బడి శరసమిధల వెల్గునర్జునాగ్ని నీవారు శలభంబు లైరి సూవె. 24

వ. నీ వింక ధైర్యంబు చిక్కఁ బట్టుకొని సమాహితచిత్తుండ వయి శోకం బుడుగు మని
యనేకవిధంబులనాశ్వాసించుచున్నసమయంబున విదురుండు సనుదెంచి ధృతరాష్ట్రుం
గాంచి సుధామధురోక్తుల నాదరించుచు నిట్లనియె. 25

—విదురుండు ధృతరాష్ట్రునకు దుఃఖోపశమనంబు సేయుట—

క. లే లెమ్ము పెడఁగువడువున, నేలం బడి పొరలె దేల నృపవర ! నిన్నుం
దేలుప నేరును జాలరు, నీలోన న్నివె శాంతినిం గొన వలయున్. 26

ఆ. సర్వసత్వములకు సతము పరాగతి, సర్వమును క్షయించు స్రస్త మగును
ధరణిలోన జీవితము మరణాంతము, వగవ దగునె యిట్టితగులమునకు. 27

సీ. స్త్రుక్కఁ బట్టు జముండు శూరునిన్ భీరుని, కలిమిలేములు వానికడన లేక
సమర మొనర్పనిజనులును జత్తురు, చాక యుందు రొనర్చి జగతి యందు

గడవ నీదఁగ లేదు కాలావధి నొకఁడు, చా వెల్లవారికి శాశ్వతంబ
మొదల లేకయు మధ్యమున నుండియును వెన్క, లేనిభూతములకై లిఫ్స దగదు
తే. ఏడ్చినను జా వెపుడు తప్ప దేద్వరున్నఁ, దప్ప దిట్లు సంసిద్ధ మీాధరణియందు
నిశ్చయం బగుదానికి నీవు వగవ, రా దనుచు నీకుఁ దెలియదే రాజచంద్ర. 28

ఉ. గాలి తృణంబులం బలెను గాలమ కైకొను భూతకోటులం
గాలము దైవ మెప్పుడును గల్గరు దానికి శత్రుమిత్రు లా
కాలమె సార్థమై దివిముఖంబున నేగు వారిముంగలన్
లీల మెలంగు నెల్లపుడు లేవడి లేనిజవంబు మెంపునన్. 29

తే. శాస్త్రము ప్రమాణ మగునేని సంగరమునఁ, దెగి పరంబును గైకొన్న మగలకెపుఁడ
వగలఁ బొగలంగ నొప్పదు వారు దేవ, సేవ్యులును దివ్యవైభవాంచితులు తెలియ.

సీ. అనిమునం ద్రెల్లినయట్టినీవారలఁ జూచి యెఱుఁగ వాదిఁ జూడ విపుడు
లేవు వారికి నీవు లేవు వారును నీకు వారికై చింతింప వలయునొక్క-
చచ్చి స్వర్గంబును జంపి సత్కీర్తినిఁ, బోరాటమునఁ గాంత్రు పోటుమగలు
సమరాహతుల కింద్రుఁ డమరించు నెల్ల కామములు నాతిథ్యము మదిఁ దలంచి
తే. యజ్ఞదాన వ్రతజపవిద్యాతపములు, నగుగతులకన్న రణహతు లైనవారి
గతులుపరమోత్తమములనిఘనులుమౌని,సత్తములువల్కు-చుందురుశాస్త్రములనెఱిఁగి.

క. శూరశరీరానలమున, వారు శరాహుతులు వేల్చి వరయజ్ఞములం
గోరి పొనర్చినవారలు, వారికి యజ్ఞాధికఫలంబు వచ్చుట లరుదే. 32

ఉ. క్షత్రియకోటికిన్ రణముకంటె వరం బయి యొండు లేదిలన్
క్షత్రియు లైనవార లతిసౌఖ్యమునం జని స్వర్గమార్గముం
జాత్రతఁ గాంచి రిందు వగవం బని లే దని నీకు నీవ లో
క్షత్రియవృత్తముం దెలిసి కార్యగతి న్వడకుండు నొప్పగున్. 33

మత్త. వేనవే లగుతల్లిదండ్రులు వేనవే లగుపుత్రులున్
వేనవే లగుపత్నులుం బ్రభవించి నీతొలిపుట్టులన్
స్వానుభూతికి నైరి నీ విపు డందు వేనికిఁ గుందుదో
వేని కెవ్వఁడు చుట్టమో పృథివీతలేశ్వర చెప్పుమా. 34

క. భయశోకస్థానాయుత, నియుతంబులు నాఁడునాఁడు నెఱిదప్ప జడున్
బ్రియమునఁ బొందుచు నుండును, నయవిదునిం బొందఁ బోవు నాఁదెలియఁ దగున్.

తే. కాలమే భూతములఁ బెంచుఁ గాలమె పఱి, యఱియొనర్చును కాలమె మృతి యొనర్చు

గాలమే యెల్ల నిద్రింప మేలుకొనును, గాలగతి మీఱ నేరికిం గాదు తెలియ. 36

తే. జవ్వనము రూపమును ద్రవ్యసంచయంబు, జీవితంబు నారోగ్య మీక్షితితలమున
యుం దనిత్యము లని పండితాగ్రగణ్యు, లుల్లమున నెప్డు ప్రేమింపకుండు నధిప. 37

సీ. ఎల్ల మిథ్య యటంచు నెపుడుఁ ద్రిప్పకొనంగ, నొప్పు దుఃఖింపఁగ నొప్పదెపుడు
దుఃఖించినం ధృతి దూలుఁ గాని ప్రతిక్రియ కింతయుఁ దెఱవు గాదు
చింతింప కుంటయే చిత్తదుఃఖవ్యాధి, కొనరిన భేషజం బనిరి బుధులు
చింతించినకొలంది శాంతి నొందక పెచ్చు, పెఱుఁగు దుఃఖం బది యెఱుఁగు మీవు

తే అప్రియసమాగమంబున సుప్రియవిర, హమున నిల నల్పబుద్ధు లహర్నిశంబు
మానసికదుఃఖముల నల్పమాత్రమయిన, సుఖమెఱుంగక తపియింత్రు సుమి నరేంద్ర.

తే. ధర్మమర్థము సుఖమును దవుల నీదు, వగపు కార్యార్థములు దాన వదలి పోవు
తుష్టి లేనట్టి జనుఁ డెప్డు దుఃఖ మొందుఁ, బండితుఁడు సంతసించు నెప్పట్టునందు.

క. మానసదుఃఖము ప్రజ్ఞానూనప్రభ నడఁగు దేహజోన్నతదుఃఖం
బౌనన మందున డిందున్, జ్ఞానికి నివి శాంతిసాధనమ్ములు సూవే. 40

మ. కునుక న్వొండియుఁ దానునుం గునికెడిం గూర్చున్నఁ గూర్చుండుఁ బా
ఱినఁ బాఱు న్వెనుదన్ని పూర్వకృతమై చేయంగ నౌ కర్మ మె
ప్డును దేహిం బెడఁబాయకుండి ఫలముం బుణ్యంబు పాపంబు నాఁ
జను రెంటన్ సుఖదుఃఖరూపకముగాఁ బొందించు నెల్లప్పుడున్. 41

మ. తనకుం దాన సఖుండు దానె పగయుం దానే క్రియాసాక్షియున్
దనపుణ్యంబును బాపమున్ సుఖము నంతన్ దుఃఖముం గూర్చెడిం
దన కావించినదానికన్న నణుమాత్రం బైన భిన్నంబు గా
జనుఁ డిం దందు ఫలంబు నొందఁ డని శాస్త్రంబుల్ ప్రమాణం బగున్. 42

వ. అని చెప్పిన విని ప్రజ్ఞాచక్షుండు సంజయుదిక్కు మోము వెట్టి నీసుభాషితంబుల నామనోదుఃఖంబు దూరం బయ్యె నయ్యెడ నీవలన వెండియు న్విన నెంచితిఁ బండితుం డిష్టానిష్టవియోగసంయోగంబుల నయిన మానసదుఃఖముల నెట్లు విడుచుం జెప్పు మనిన విదురుండు వెండియు. 43

విదురుండు ధృతరాష్ట్రునకు సంసారగహనంబు తెలియ నెఱింగించుట.

క. ఎందున దుఃఖం బగునో, యెందున సుఖ మగునో యూహ నెఱిఁగిన మతితో
నందందుఁ దగులకుండిన, డెందంబున శాంతి నొందెడిన్ విబుధుఁ డిలన్. 44

శుభాంగి. ఈ కానవచ్చునది యెల్లయుఁ దలంపన్, వాకోన శాశ్వతమునా నెఱుఁగుమీ వీ
ల్లోకం బరంటివలె లోపల నసారంబై కానిపించి యిసుమంతయు నశించున్. 45

సీ. అజ్ఞులుం బ్రాజ్ఞులు నర్థవంతులు నర్థ, హీనులు హీనులు మానవంతు
లందఱుఁ బితృవనం బంది గతజ్వరు, లై నిద్ర నొందెదునట్టివార
పలలశూన్యము లస్థిపంజరంబులు నర, ములప్రోవు లగు దేహములను గల్గి
జీవు లచ్చో నేవిశేషములం జూడ, నోపనివార లై యుండు రెపుడు
తే. లేదు కులమును రూపము లేదు గాన, నమును బ్రజ్ఞావిశేషమా వనమునందు
మోహపాశములనుమాటపొసఁగఁబోదు, సుకృతానుభవముదక్క దొడరదెదియు.
ఉ. గేహము వాసి వేఱొకయిన గేహమున న్వసియించినట్లు లు
త్సాహము పెంపునన్ మొదటఁ దాల్చిన వస్త్రము వీడి యన్యమున్
మోహము చేసి నట్లు తలపోయఁగ జీవుఁడు తాను బొందు ని
దేహము వాసి యొండొకఁడు దేహము నొందును నుంకు నెప్పుడున్. 47
క. తన చేసినకర్మంబున, జనునకుఁ గష్టంబు సుఖము సమకురుచుండున్
గాన స్వర్గము సత్కర్మ, మ్మున నరకము పాపకర్మమున నిక్కముగన్. 48
ఉ. కుమ్మరి మట్టి సారెపయిఁ గొట్టినయప్పుడుఁ గోయునప్పుడా
వమ్మున నెత్తునప్పుడొకవంకను బెట్టినయప్పుడెప్పుడో
వమ్మయి ప్రయ్యు భాండ మటువంటిద దేహము గర్భమందొ జ
న్మమ్మునసనో దినంబులనో మాసములందునో వర్షమందునో. 49
తే. బాల్యమందున కాని యౌవనమునందు, కాని కౌమారమందున కాని వార్ధ
కమ్మునందున కాని కర్మమ్ముకలిమిఁ, జెగు నవశ్యము దానికి వగవ నేల. 50
క. జనుఁడు జలాశయమందున్, మునుగుచుఁ దేలుచును నాడుపోలికఁ గర్మం
బున గహనం బగుసంసృతి, మునుగుచుఁ దేలుచు మెలఁగు మూఢుండగుచున్.
తే. జ్ఞాని సంసారమునయందుఁ గానఁ బడియు, బురద నంటిన కుమ్మరిపురువు రీతిఁ
దనదు విజ్ఞానమునఁ జేసి శుద్ధతాత్ము, డెవకు నంటించుకొన కుచ్ఛపదము నొందు. 52
వ. అని చెప్పిన ధృతరాష్ట్రుండు సంసారగహనం బెట్లు తెలియం దగుఁ జెప్ప మనిన
విదురుండు దాని నానుపూర్వకంబు జెప్పెదవినుమని వెండియును. 53
తరువోజ. సుదతిగర్భమునందుఁ జొచ్చి శుక్లంబు, శోణితకలితమై సువఁ బిండ మగుచుఁ
బదిలమై నెలలైదు వచ్చినయప్డు, పర్వసర్వాంగముల్ వరగర్భమైన
యుదర పలలామేధ్యమందుఁ బెంపొంది, యవలఁ బై నడుగులు నడుగున శిరము
పొదల యోనిద్వారమును బొంది క్లేశమున కయి యొట్టకే బుడమిపై బడును.
మ. పుడమిం జేరినదాదిగా గ్రహములున్ భూతంబులున్ దాని ని

వ్వడుచుం గుక్కలు మాఱి యూఱుచుచుం బోలెన్ గ్రసింపంగ నెం
చెడు రోగంబులు వెన్నుఁ దన్ను వెనుకం జిత్తేంద్రియార్థంబు లే
ర్పడి నానావ్యసనంబులం గుఱుపుచుం బాధించి వేధించెడిన్. 55

చ. అపు డిది కూడఁ గూడ దనునట్టి దెఱుంగక దుష్టచిత్తుఁడున్
వ్యపగతసాధ్వసుండు నగునామనుజుండు నికృష్టకార్యముల్
చపలతఁ జేసి లేశమును జ్ఞాన మెఱుంగక సంచరించి దే
హపతన మైనమీఁద శమనాలయముం జని వేతనం బడున్. 56

సీ. తను దాన వధ్యుఁడౌ నని తెలియక క్రోధ,లోభభయోన్మత్తుఁడై భవంబు
నడపుచు నేఁ గులీనుఁడ నన్యుఁ డకులీనుఁ, డే నుత్తముఁడ వాఁడు హీనుఁ డేను
ధని వాఁడు నిర్ధనుం డని దర్పమునఁ దృప్తుఁ, డై యొల్ల నశియించు నని యెఱుఁగక
తెలివి యింతయు లేక తెగి యొల్లరును బోలెఁ, బితృవనంబున కేగి వెతలఁ గుడిచి
తే. కుందు నజ్ఞాని సుజ్ఞాని యిందుఁ బుట్టి, సర్వసముఁ డయి సన్మార్గసరణి మోఁగి
తుదకు నుత్తమపద మొందు నిది యెఱింగి, యుత్తమం బైనపదమునీవొందు మధిప.

వ. అని చెప్పిన ధృతరాష్ట్రుండు మఱియు సంసారధర్మగహనత్వంబు సవిస్తరంబుగం
జెప్పు మనిన నతండు నా విని తెఱంగునం జెప్పెద నవధరింపు మని యిట్లనియె.

మ. మును సంసారమున న్మలంగు నొకవిప్రుం డొక్కనాఁ డెక్కడేఁ
జనుచున్ వ్యాఘ్రమృగేంద్రగంధగజసంచారోగ్రసందర్శనం
బును గ్రవ్యాదసమాకులంబు భయదోద్భూతోన్నతారావ మై
చనుకాంతారముఁ జొచ్చె మృత్యుముఖ మిచ్చం జొచ్చుచందంబునన్. 59

తరువోజ. హృదయంబు చలియింప నిల మెట్టఁ గాళ్లు, లిట్టట్టుఁ దొట్రిల నొంతయు బెగడు
గదుర రోమాంచము గదుఁ బర్వ నంగముఁ, గడకఁ బోఁ దిరుగుచుఁ గడలెల్లఁ గనుచు
నెదియు దిక్కెఱుఁగుట యే పొంతఁ గనక, ధృతిమాలి కడుఁజాలి నెఱియుచిత్తమునఁ
బద మిడుచున్ సంకు పాట నొందైనఁ, బఱవంగ నెంచుచు భయపడుచుండె. 60

వ. అంతఁ గొంతదూరం బట్లు పోయియున్నప్పుడు. 61

సీ. ఆభీషణారణ్యము దెసఁ జూచిన, నొత్తుగ నుక లొడ్డి యుంట తోఁచె
నంత ఘోరాకార యగునొక్కకామిని, వచ్చి చేతులఁ గ్రుచ్చి వానిఁ బొదివె
నైదేసితలలతో నతిఘోరనాగముల్, నడగొండలో యన నడువ సాఁగె
నటఁ దృణసంఛన్న మై తీవగుంపులో, నుదపాన మొక్కండు పొదలుచుండె
తే. నందు నఱఁదుఁ బఱచునయ్యవనిసురుఁడు, కూలి కాళ్ళకుఁ బెనుఁదీవ లోలిఁ జుట్టు

కొనఁగఁ దలక్రిందుగా వ్రేలెఁ బనసపండు, వృంతమునఁ జెట్టుకొమ్మను వ్రేలునట్లు.

తే. కూపమధ్యమునం దొక్క కోఁడెత్రాఁచు, నాలుకలు గ్రోయుచుండె నవ్వేళ నాఱు తలలు పండ్రెండు గాళ్లును గలగజంబు, ఘీంకరించుచు నానూతివంక వచ్చె. 63

ఉ. కూపముచెంత వృక్షమునఁ గొన్ని మధువ్రతముల్ మధూన్నతిం బ్రోపడ సంతరింప నలుపుం దెలుపుం గలమూషికేంద్రముల్ కోపముతోడ నమ్మొదలు గొట్టుచు నుండ స్రవించునామధు వ్యాపృతి నైనధార లతఁ డాఁకలి తీఱను గ్రోలె వ్రేలుచున్. 64

వ. ఇట్లు దుర్గమారణ్యంబున నానాక్రూరసత్వసంబాధంబును వాగురాసందోహదోహలంబును ఘోరరూపాంగనాలింగనసంగతియుఁ బంచశిరోనాగదర్శనంబును దృణచ్ఛన్నకూపపతనంబును నధోనాగక్రౌర్యంబును గూపవేలాచలన్నాగభయంబును మూషికేంద్రకుట్టనపాతభీతియు మధుకరకృతసాధ్వసంబును ననుమహోపద్రవంబులం దగులుకొని నూతం బడి వ్రేలాడుచున్నయన్నగుండు జీవితాశం బెట్టుకొని యున్నవాఁడనిన వైచిత్రవీర్యుండు. 65

ఆ. అకట జాలి పుట్టెన ట్లున్నవానికి, స్థితియు గతియు నెట్లు చెల్లె నతఁడు విపమగతికిఁ గాక విడుమర నొందెనో, తెలియఁ జెప్పు మయ్య తెల్లముగను. 66

వ. అనిన విదురుం డయ్యా! యిది మోక్షవేదు లుదాహరించినయుపమానంబు గాని వేఱు కాదు విను మక్కాంతారంబు సంసారంబు వ్యాలంబులు వ్యాధులు బ్రహత్యాయ యగునన్నారి వర్ణరూపవినాశిని యగుజర కూపంబున నున్నకాలసర్పంబు కాలుండు కాలికిం దగులుకొనియున్నతీవ జీవితాశ కూపంబునుపాంతికంబున నున్నవృక్షం బాయువు షడ్వక్త్రకుంజరంబు నత్సరంబు షణ్ముఖంబులు ఋతువులు వానిద్వాదశపాదంబులు మాసంబులు వృక్షమూలంబు గొఱికిభక్షించుమూషికంబు లహోరాత్రంబులు మధుకరంబులు కామంబులు మధుధారలు కామరసంబు లిట్లు సంసారచక్రంబు పరివర్తించు నని యెఱింగి విద్వాంసు లప్పాశంబులం ద్రెంపఁ జాలి మే లందుదు రనిన నాంబికేయుండు వెండియు. 67

భుజంగ. హితం బైనయాఖ్యాన మిట్లీవు తత్త్వస్థితిం జేసి వాక్రుచ్చి చిత్తప్రశాంతిం బ్రతిష్ఠించి తింకన్ భవద్భవ్యవాక్యామృతం బారఁ గ్రోలం బ్రతీక్షించుచుంటిన్.

చ. అన విదురుండు వెండియును నవ్విధ మొల్ల సవిస్తరంబుగా విని చెవ నాలకింపు మది విన్న జనుండు వివేకవంతుఁ డై ఘనతరసంసృతివ్యధలు గల్గి తపించెడు వాఁడు గాక స

జ్ఞనుఁ డన నొప్పి సద్గతుల శాశ్వతసౌఖ్యము నొందఁ బొందుగన్. 69

మ. అతి దూరాధ్వగుఁ డైనపాంథుఁడు విశేషాయాసముం బొందుచున్
మతిసేయు న్నివసింప నచ్చటచట న్మార్గంబునం దట్లు సం
సృతిపర్యాయమునందు గర్భవసతుల్ చేయంగ నొ మూఁఢుఁ డం
చితచిత్తంబున నట్లు చేయఁడు విపశ్చిద్వర్యుఁ డొక్కప్పుడున్. 70

తే. శాస్త్రవేత్తలు ఘోరసంసారమును వచింత్రు దారుణవనముగా క్షితితలమున
సందఁ బడి యెల్లభూతముల్ భ్రమందుచుండు, జగముమిథ్యయనుచు నెంచుజ్ఞానితక్క.

సీ. శారీరములు మానసములు వ్యాధులు పరోక్షములు ప్రత్యక్షముల్ గలిగెడు నవి
కోఁడిత్రాఁచులు నా నకుంఠితశక్తిమై, ననిశంబు బాధించు నల్పమతుల
రూపవినాశిని యై పెంపుఁ జెందినజర యంతటన్ జగజ్జనుల వేఁచు
శబ్దాదివిషయముల్ సత్క్రియాప్రతిబంధకము లై మనుష్యుల కమరియుండు

తే. వత్సరంబులు మాసముల్ పక్షములును, పవలు రేలు క్రమంబున వయసు రూపు
నాయువును మాపుఁ గాలాఖ్య నతిశయిల్లి, కర్మసంయోగమునఁ జేసి కౌరవేంద్ర.

క. రథము శరీరము తత్సారథి సత్త్వం బింద్రియములు రథ్యంబులు సు
ప్రథితములు కర్మబద్ధులు, రథరశ్ములు నా వచింత్రు ప్రాజ్ఞులు ప్రజ్ఞన్. 73

మత్త. వారుపంబులు వాఱునట్టులు పాఱఁ జొచ్చినవాఁడు సం
సారచక్రమునం గులాలకచక్ర మట్లు చరించెడిన్
సారశేముషి వాని నాఁగఁగఁ జాలినట్టి జనుండు సం
సారవారిధి నీఁది సంతతసౌఖ్య మందు సమున్నతిన్. 74

సువృత్తము. సంసారదుఃఖంబు చాలింపఁ బూంచెన్, సంసర్గముం బాసి సాధుప్రసక్తిన్
ధ్యానంబుఁ గావించి పాపంబు నెల్లన్, హంసం బ్రతీక్షింప యత్నించు టొప్పున్. 75

తే. ఇంద్రియంబుల నరికట్టి యెల్లనాఁడు, క్రోధలోభనిరాకృతుండై ధరిత్రి
నిత్యసంతుష్టచిత్తుండు సత్యవాది, యైనసత్పురుషుఁడు శాంతి నందఁ గలఁడు. 76

తే. యామ్యమీస్యందనముదీనినాశ్రయింప, దుర్బుధులకెన్నియేవగల్ దొడరుచుండు
దాని విడుపరకై బుధుల్ తత్త్వబుద్ధి, జతన మొనరించుచుందురు స్వాంతమందు. 77

చ. కొడుకులతోడ నెల్లరను గూలినమాట దలంపఁ దాప మ
య్యెడు నది దుఃఖహేతు వగు సిద్ధమతుల్ తమబుద్ధిభేషజం
బడరఁగఁ జేసి దుఃఖరుజ నాఁగియు లోఁ గలతత్త్వచింత నాఁ
బడు నడిదంబునన్ నఱకి వ్రయ్యలు చేసి సుఖింతు రెంతయున్. 78

తే. దమము త్యాగము నప్రమాదమును మూఁడు, ఘోటకంబులు శీలమ్ము త్రాఁటఁగట్టి
మానసరథంబు పైనెక్కి మనుజుఁ డెడఁద, యమునిభయ మీఁగి బ్రహ్మలోకమున కేగు.

చ. విభవ మొసంగ యాగములు వేయి పొనర్చుటకంటె సర్వస
న్నిభముగ నిట్టుపాసనుల నిల్చి తపించుటకంటె లోకమం
దభయ మొసంగునట్టిపరమార్థము ముఖ్యము భూతకోటికిం
డభయ మొసంగు వాఁడు తెగినంతన విష్ణుపదంబు నొందెడిన్. 80

క. మరణ మనిష్టము భూతో, త్కరమున కది గాన భూతతతి కవ్వేళం
గరుణం జూపుచు నుండుట, పరమోత్తమధర్మ మనుచుఁ బలికెద రార్యుల్. 81

ఆ. సూక్ష్మదృష్టి లేని శుంఠలు మోహపా, శములఁ జిక్కికొంద్రు జగమునందు
సూక్ష్మదృష్టి గలుగు శుద్ధతత్త్వజ్ఞులు, బ్రహ్మ మందఁ గలరు ప్రజ్ఞకలిమి. 82

వ. అని చెప్పిన విదురునిమాట లేటం గలిపి విచిత్రవీర్యాత్మజుం డాత్మజశోకసంతప్త
చిత్తుండు గావున విసంజ్ఞుడై పుడమిం బడియె విదురసంజయప్రభృతు లతని సేద
దేర్చుచుండి రాసమయంబునఁ గృష్ణద్వైపాయనుండు విచ్చేసి దర్శనం బిచ్చె నంతఁ
గొంతవడికి లబ్ధసంజ్ఞుండై లేచి యేచినశోకంబునఁ బాకంబు దప్పి యప్పుడు పారా
శర్యునిరాక విని పరిదేవనంబు సేయుచుఁ గురుమహీవల్లభుం డతనిదిక్కు మొగంబై.

క. సీసీ మానుషజన్మము, కాసంతయు సౌఖ్యదంబు గా దత్యధిక
త్రాసము దుఃఖము గలుగం, గాసిల్లం జేయు నరునిఁ గలకాలంబున్. 84

చ. ధనములు ధాన్యముల్ పసులు దాసజనంబులు పుత్రపౌత్రులున్
వనితలు వైభవంబులును వమ్మయి పోయినఁ గల్గుదుఃఖ ము
య్యనలముకంటె నత్యధికమై హృదయం బెఱియించెముఁ బ్రజ్ఞడించెదున్
మునివర! దుఃఖియై నరుఁడు పొల్చుటకంటెను జచ్చు టొప్పగున్. 85

ఉ. భాగ్యవిపర్యయంబునను బ్రాప్తమహావ్యసనంబు గల్గి ని
ర్భాగ్యుఁడ నైననా కిపుడు ప్రాణము వోయినఁ గాని యెంతయున్
భోగ్యమ యైన దుఃఖ మిది పోవుట గల్గదు గాన నింక నో
యోగ్యతపోనిధాన సుఖ మొందెదఁ జెప్పినయట్ల చేయుచున్. 86

వ. అని పలికి ధృతరాష్ట్రుండు దుఃఖభారంబున నూరకున్నం గని కృష్ణద్వైపాయనుం
డతని కిట్లనియె. 87

—కృష్ణద్వైపాయనుండు ధృతరాష్ట్రునకు దుఃఖోపశమనంబు సేయుట.—

చ. తెలిసినవాఁడ వీ వఖిలదేవమనుష్యవిశేషధర్మముల్

తెలియని దింతయే సరయ లేదు భవన్మతి కెల్ల భూతముల్
పొలియు ననిత్యముల్ వసుధఁ బుట్టును జచ్చును జచ్చి పుట్టు ని
ట్లలవడు దీనికి స్వగచునట్టిది నీ కగునే నరేశ్వరా. 88

తోటకము. కురుపాండవవైరము క్రూరముగా, నెరయం బడె నో యని నీవు గనన్
ఖరచిత్తుఁడు నీసుతు కారణముగా, బరఁగ న్విధి నిర్మిత పద్ధతులన్. 88

తోదకము. ఎవరు శమంబున కెల్లు ప్రయత్నా, బవు ననఁ జేసిన నాలము సిద్ధం
బవుటయుఁ గౌరవు లాఱుటయుం దై, వవిధి నెసంగిన వ్యాజము సుమ్మీ. 90

దోదకము. వారుమహోన్నతవైభవ మొప్పన్, సారతరం బగుస్థానమునందుం
జేరి వసించిరి చిత్తమునందున్, వారలకై వగవం బనియున్నే. 91

రుక్మవతి. దైవముచెయ్యుం దన్వఁగఁ జేయం, దేవత లైరం ధిపులు కారో
భూవర ని కపోల్కి విచారం, బావట పూని దియచ్చెరు వయ్యెన్. 92

వ. మఱియుం బోల్లి నేను దేవతలకుం కార్యం బగు నొక్క యుగ్రంబువింటి నది నీకుం
జెప్పెద నాకర్ణింపుము. 93

సీ. ఏ నొక్కనాఁడు మహేంద్రునిసభ కేగి, దర్శించితిని దేవతాప్రవరుల
నారదాద్యమరర్షి వార మానాఁ డందుఁ విచ్చేసి సురలతో నిచ్చ నుండె
నాలోన భూదేవి జాలి వృత్తైదునట్లు, పఱతెంచి తన కేదొ పని యటంచుఁ
బలుకుచు దేవళ్ళపాలికిం జని మీరు, బ్రహ్మసభం జేయుప్రతిన సేర్ప

తే. రేమి కత మెంత కాల మే నీభరంబు, మోయ వలయునో నాయెడఁ జేయుఁడి కృప
నావుడు సదస్యమునయందు నలువుమీఱు, ననజనాభుఁడు తా నిట్లు లనియె నగుచు.

మ. ధృతరాష్ట్రుం డను రాజచంద్రునకుఁ బృథ్వీన్నాథవరాత్మోద్భవుల్
స్తుతియింపం బ్రభవిందు రందు మొదటం దర్యోధనుం డొప్పు న
ప్పతి నీభారమి దంతయుం దొలఁగి పోవం జేయు నాక్షేత్రముం
దతిఘోరంబుగఁ బోరగుం దెగుదు రాయా రాజులున్ భూజనుల్. 95

వ. నీ వింక నిశ్చింతముగఁ బోయి లోకధారణం బాచరింపు మని బోధించి యంపి పుచ్చె
నాకర్ణింపుము. 96

మ. కలిరాజాంశమునం సుయోధనుఁడు నీగాంధారిగర్భంబునం
గలిగెన్ లోకవినాశనార్థము మహోగ్రప్రక్రియాదక్షుఁడుం
ఖలుఁడున్ గ్రోధనుఁడుం దలంప ననుజుల్ గర్హాదులు న్వానికిం
దుల్యమై వానిగణంబులం గలిగి చేతు ద్రిప్పి రప్పట్టునన్. 97

క. రాజెట్టిరీతి మెలఁగెడు, భూజను లారీతి మెలఁగఁ బోదురెన్నఁగ
రాజే కారణ మగు నా,భూజనులసద్వర్తనంబు పోషించుటకున్. 98

ఆ. దుష్టచిత్తుఁడైన దుర్యోధనునిఁ గూడి, నీదుపుత్రు లెల్ల నెగులు గుడిచి
పోయి రిట్టిరీతి మను నారదాదులు, దెలియఁ జెప్పి రెల్లఁ దెల్లముగను. 99

క. తమచేసినయపరాధ,క్రమమున నీపుత్రు లెల్లఁ గడతేరిరి దు
ష్టమతులు వారలకై యు,ల్లమలార్చ్చ చెడంగ శోక మందం దగునే. 100

క. నీసుతులచేత వంచితు,లై సర్వము గోలుపోయి యలజడి వడియున్
నీసోదరసుతు లెవ్వరుఁ, గాసంతయుఁ దప్పు సేయఁ గంటివె రాజా. 101

సీ. రాజసూయమునాఁడు రాజు లెల్లరు విన, ధర్మజునకు నియ్యదంబ మెల్ల
నారదుం డెఱిఁగించె నాఁటినుండియు వగ, దగుల నాతఁడు గుందఁ దనమనమున
నే నిది యంతయు నీకు ధర్మజునకు, నెఱిఁగించితి నతండు నెట్టిలేని
కురుపాండవులఁ గోరు మరలుకొనెడునట్లు, జతనించె నెంతయే స్వాంతమందు
తే. దైవ మిట బలవత్తర మై నజలటఁ, బొందు పొసఁగక పోరయ్యె భూతసమితి
యంతకునిఁ గొల్వఁగా నేగె నధిప దీని, కింత చింతింప నేమిటి కీవు చెపుమ. 102

క. నీకున్ శోకవినాశన,మై కుంతీసుతులమీఁద ననుమతి గలుగన్
వాకొంటి దేవగుహ్యము, గైకొని నామాట కాలగతి దలఁపు మదిన్. 103

ఉ. శోకము చేఁ దపించు నినుఁ జూచి యుధిష్ఠిరుఁ డింతలోన నీ
లోకము వాయఁ జూచెడిని లో గణియింపక యెల్లసౌఖ్యముల్
నీకు విధేయుఁడై మెలఁగు నీతివిదుండును భూతతత్పరుం
డా కురుముఖ్యునిం గరుణ నారయ కిట్లు తలంప నొప్పునే. 104

క. ఆనరనాథుఁడు తిర్యగ్యోనులపైఁ గరుణ గలఁడు గోవిదుఁ డనినన్
మానవనాథుఁడ వగునీపై నిలిపెడు భక్తి ననుచుఁ బలుకఁగ వలెనే. 105

ఉ. కావునఁ బుత్రశోకమునఁ గల్గి జ్వలించెడునగ్నిఁ బ్రజ్ఞయన్
జీవనసంచయంబు మొగిఁ జిమ్మి ప్రశాంతిని బొందఁ జేయుచున్
నా వచనమ్ము నెమ్మనమునం గొని దైవముచేత యిట్టి దం
చీవు పృథాతనూజులపయిన్ దయ సేయుచుఁ జావ కుండుమా. 106

క. చాకున్న నికుఁ గీర్తి, చేకొన నయ్యెడిని దపముచే దానముచే
లోకాతీతప్రతిభుఁడ,వై కాంచెద వుత్తమంబు లగులోకములన్. 107

వ. అనిబోధించిన విని ప్రజ్ఞాచక్షుండు ముహూర్తమాత్రం బూరకుండి తండ్రి యగువ
వ్యాసోక్తమున కిట్లనియె. 103

—ధృతరాష్ట్రుండు సపరివారంబుగాఁ బొలికలనికిం బోవుట—

ఆ. దుఃఖవార్ధి మునిఁగి దరపిల్లు నేను నన్నెఱుఁగ నేర కుంటి నింత సేపు
దైవయోగజమ్ము నీవచనము వింటిఁ, జిత్తశాంతి గలుగఁ జేసికొంటి. 109

క. ప్రాణములఁ జిక్కఁ బట్టెద, మానసమును వేఁచుశోకమాత్సర్యంబుల్
పోనాడఁ బ్రయత్నించెద, నీనుడి మంత్రముగ నెంతు నింతటిలోనన్. 110

వ. అనిన విని వ్యాసభట్టారకుం డట్టు లైన మే లయ్యెడు మని పలుకుచు నంతర్ధానంబు చేసె నంతఁ గొంతవడి కట్లు ప్రబోధితుం డగుధృతరాష్ట్రుండు విదురుం బేర్కొని పొలికలనికిం బోవుదము ప్రయాణం బాయితంబు సేయుము కౌరవపాండవవర్గంబుతోఁ గుంతీగాంధారులం దోడ్కొని రమ్మని నియోగించిన నతండు చెప్పినచొప్పునం గావించె ననంతరంబ. 111

తే. తనయశోకార్త యయ్యును గాంధారి భర్తృవచనచోదితయై పరవశ యై మేను
దూలఁ గొంతియుఁ గాంతలుఁ దోడ రాఁగ, వచ్చెఁ గన్నీళ్లు వరదలై పెచ్చి పాఱ.

క. ఒండొరులు గట్టుకొనుచున్, గుండెలు చేతులను గొట్టుకొనుచుం ధృతరా
ష్ట్రుం డున్నచోట వనితామండలి నూఱార్చె ఱుత్తె మఱియున్ మఱియున్ 113

తే. ఆకుమారము గాఁ గౌరవాలయమున, శోకకర్శిత మగుచు స్త్రీలోక మెల్ల
నార్తనాదము గావించె నది ధరిత్రి, నన్నికడలును నిండియు మిన్ను ముట్టె. 114

చ. విరిసిన కేశపాశములు వెన్నునఁ జిక్కులు వాఱి వ్రేలఁ గాఁ
కరములు మస్తకంబులను గట్టినయట్టులు మోపు గాఁగఁ గ
ర్బురమణిభూషణంబులను బోకడఁ బెట్టుచు నేకవస్త్రలై
మరిమరి పొక్కుచుం గురుకుమారసతుల్ సనుదెంచి రార్తలై. 115

తే. ఎండకన్నను వానకన్నెఱుఁగ కేరి, కంటఁ బడకుండునట్టివాల్గంటు లపుడు
పెరలు సూడంగఁ బఱచుచు వెక్కివెక్కి, యేడువఁగఁ జొచ్చి రచ్చటఁ గోడుమనుచు.

క. తమచెలులచెంత నేఁ జిత్తములన్ సిగ్గించుసతులు తమ రపు డొకపు
ట్టము కట్టి వ్రీడ విడివడ, నమరిరి దుఃఖార్త లగుచు నత్తలయెదుటన్. 117

తే. మున్నొకించుకించుక వగపులు పొసంగు, నప్పు డొండొరు నూఱార్చునట్టివారు
మిను విఱిగి మీఁదఁ బడినను మిడికికొనుచు, నొకరి నొక్కరుచూడక యుండి రపుడు.

తే. శ్వేతనగములు నా నొవ్వవిమలహర్మ్య, ములను విడనాడి వచ్చు నావెలఁదిపిండు
వేఁటకులు యూథనాథుల వేసి చంప, గుహలు విడి పాఱుమప్పుల రహి నెసంగె.

తే. పతుల సుతులను భ్రాతలఁ బితలఁ బనవి, పనవి యేడ్చెడు సవ్యాఘూజవముతోడఁ

గదలి పోలికలనిక్ఁ బోయెఁ గౌరవేశ్వరుండు నగరంబు విడనాడి ప్రోది చెడఁగ. 120

వ. ఇట్లు పోవుచున్న ధృతరాష్ట్రుని వెనువెంటఁ గరినగరంబునం గలుగు వైశ్యశూద్రులును శిల్పికర్మారప్రముఖకర్మోపజీవులును లోనగుపౌరు లెల్లరును బలసి చని రిట్లు క్రోశమాత్రదూరంబు పోయియున్నంత మహారథులు కృపకృతవర్మాశ్వత్థాము లెదురుపడి లోకేశ్వరుం డగుచీఁకురాజుం జూచి గద్గదకంఠులై నిట్టూర్చి కంట నీరు వెట్టుకొనుచు ని ట్లనిరి. 121

—కృపాదు లెదురుపడి గాంధారి ధృతరాష్ట్రుల నూఱడించుట.—

సీ. భూమీంద్ర! వినుము నీపుత్త్రుండు దుష్కరకర్మంబు గావించి కాలవశత
సానుచరుం డయి మానితం బగుశక్రలోకంబునకుఁ జనె లోక మెన్న
నెల్లకాల్పుల మమ్మహీజానికిఁ బోయె, వెన్నుఁ దన్నడునట్టివిధము దోఁప
నమ్మహారాజుసైన్యమున కంతకు మేము, మిగిలినవారము ముగుర మిట్లు

తే. అనుచు గాంధారి కభిముఖుఁ డై కృపుండు, సాధ్వి నీపుత్రకులు శత్రుసమితి నేర్చి
వీరకర్మంబులు పొనర్చి పడిచి మేను, స్వర్గసుఖ మొందుచుండి రస్వప్నులట్లు. 122

చ. ఇడక పరాఙ్ముఖుం డెవఁ డనేకముఖంబులు శత్రుసేనతో
నడిచము చేతఁ బూని కలహం బొనరించి గమించునో గుణా
ఢ్యుఁ డతఁడు దేవలోకమున నున్నతిఁ గాంచు నటంచు శాస్త్రముల్
నుడివెడు నట్టివానికిఁ గనుంగవ నీ రొలికింప నొప్పునే. 123

వ. దేవీ! నీవారుం బోలె నీశాత్రవులు నశ్వత్థామపురోగము లగుమామువ్వురిచేతం జెడి రాకర్ణింపుము. 124

మ. మరుదాత్మప్రభవుండు నీసుతు నధర్మవ్యాప్తిఁ జా వేసె నన్
పరమామర్షమునం బ్రభద్రకులతోఁ బాంచాలరాట్పుత్రులన్
వరుసం బట్టి వధించి ద్రౌపదిసుతవ్రాతంబునుం గూల్చి ని
ద్దురలోనన్ శిబిరంబు గాల్చితిమి నిర్ధూమాగ్నిపా ల్సేయుచున్. 126

వ. ఇట్లు పాండవపగోతుంబునం జేసి యున్నవారము కావునఁ గ్రోధానలదందహ్యమానమానసు లగు నాశూరవరేణ్యులు మమ్ము విని మావెంట నంటి వచ్చుట సిద్ధంబు గావున మే మిటం దడయ నొప్ప దొప్పదికించిన నపాయంబు తప్పదు మాకాజ్ఞయిమ్ము పోయివచ్చెదము నీ విధివిహితంబునకు వగవం బనిలే దనుచు మఱి ధృతరాష్ట్రుం దిలకించి నీవు క్షత్రధర్మంబును దిష్టంబు నెఱిఁగి ధైర్యం బూని యుండుము పోయివచ్చెద మని వారికిం బ్రదక్షిణంబుగా నరదంబులు నడపించుచు

నెడనెడఁ వారిదిక్కు చూచుచుఁ బాండవాపచారంబు చేసియున్నవార కావున
వారివలనిభయంబునం జేసి సత్వరగమనంబున గంగాతీరంబునకుం జని యటనుండి
సూర్యోదయంబునకు మున్న కృపాచార్యుండు హాస్తినపురంబునకును గృతవర్మ
స్వరాష్ట్రంబునకును నశ్వత్థామ కృష్ణద్వైపాయనాశ్రమంబునకునుం జనిరంతఁ
గౌంతేయు లాద్రోణనందనుపైఁ దాడివెడలి యోడించి వానిశిరోరత్నంబు దెచ్చి
ద్రౌపది కిచ్చి యూఱడించుచుఁ బుత్రశోకార్తుం డగునాంబికేయుండు పాలికలనికి
వచ్చుచుంట చారులవలనం దెలిసి ధర్మతనయుండు. 126

తరువోజ. తమ్ములునల్వురుం దాశార్ఙ్గధరుఁడును యుయుధానయుయుత్సులు తనవెంట నంట
మున్మరం బగుశోకమునఁ జేసి ద్రుపదపుత్రిక తనచుట్టములతోడఁ గూడి
సొమ్మవోయియు నింత సోలియు నంత, సొక్కియుఁ గురరినాఁ జుమ్మపై లేచ్చి
యమ్మనుజేశ్వరు ననుసరించుటయును, నాతం డుడుకునుల్లి మడరంగ నడిచె. 127

వ. అట్లు నడిచి గంగాసమీపంబునకుం జనునంతలో నాంబికేయుండు నటఁ దారసించె
నంత నందున్న కాంతాజనం బక్కౌంతేయాగ్రజుం గాంచి చింతాజ్వరంబునం జేసి
చేతు లెత్తి మొత్తుకొని మొత్తంబుగా నేడ్చుచు. 128.

—ధర్మరాజు తమ్ములతో ధృతరాష్ట్రుని సమీపించుట—

సీ. అక్కట రాజ! నీకానృశంస్యము లేదు, ధర్మజ్ఞతయు లేదు దయయు లేదు
భ్రాతలం దండ్రులఁ దాతలం గురువుల, సఖులఁ జుట్టంబులఁ జలపివైచి
తలద్రోణభీష్మజయద్రథుఁ గూల్చి, నొప్పె నీమన మది చెప్ప నగునె
చుట్టాలమిత్తివై నట్టినీ కీరాజ్య, మేటికో పూజ్యత పాటి యేమొ
తే. తండ్రులను మించినట్టిరు తనయు లట్టి, ద్రౌపదేయసౌభద్రుల దండధరునిఁ
గొలువఁగాఁ బుచ్చి పెనుమ్రోఁకువలెఁ దలిర్చి, తొమ్మివిభుఁడవైతి వేమిసౌఖ్యంబొ చెపుము.

వ. ఇట్లు పలుదెఱంగులఁ బలవించుచుండ ధర్మతనయుం డొకండు వలుకక వారినెల్ల
నతిక్రమించి తండ్రిపాలికిం జని తనపేరెఱింగించుకొని పాదాభివందనం బాచ
రించె నంత. 130

ఉ. పుత్రవధార్దితుం డగుటఁ బోకడఁ బెట్టఁగ రానిశోక మా
మాత్రము నాక పాకమయి మానసవీధిని మట్టుమీఱ నా
ధాత్రివిభుం డడంచుకొని తద్దయు నాతనిఁ గౌఁగిలించి పై
శాత్రము లేక సాంత్వవచనాదులఁ దేల్చెఁ బ్రియంబు గొల్పుచున్. 131

వ. అంత భీమసేనాదులును దమతమపేరులు వాడి వందనం బాచరించుటయు దుష్టా
త్ముం డగుధృతరాష్ట్రుండు. 132

ఉ. భీమునిమాట జానుగులఁ బెట్టినమాత్రన చిత్తకోశమం
దాముకొనంగఁ గోప మనునగ్ని మహోన్నతశోకవాయువే
గామృతవర్ధితం బగుచు నయ్యెడి ప్రజ్వరిలం బొనర్చుచున్
భీమునిఁ గాల్చి వైతు ననుభీషణరూపముఁ దాల్చెఁ దాల్చినన్. 133

పంచ.. గదాగ్రజుం డెఱింగి వాని ఘాతుకస్వభావముం
దదంతికంబున న్మెలంగు ధర్మరాజుతమ్ములిం
బదంబు వాసి పోవ నేలఁ బట్టి నెట్టి నే
యిదోయిఁ దాఁకఁ ద్రోచె నొక్కయినుపభీమరూపమున్. 134

ఆ. హరి త్రికాలవేది యగుటఁగానఁ దొల్లి తా, సంగ్రహించి యుంచె స్యందనమున
దాని నిట్లు తెచ్చి వానిచెంగటఁ జేర్చి, సంవిధాన మిట్లు చక్కఁజేసె. 135

—ధృతరాష్ట్రుఁ డినుపభీముని విఱుచుట—

ఉ. చేఁకు గ్రహించి చేతులను జేవమెయిన్ బిగియంగఁ బట్టి భీ
మాకృతి నున్నదాని ననిలాత్మభవుం డని నిశ్చయించుచున్
గాక వహించి పెల్లదిమి కన్నుల ముక్కుల నెత్తు రూఱ న
స్తోకబలంబున న్విఱిచెఁ జూచుచు నుండగ రెండుగాఁ దెగన్. 136

శా. మే నెల్లన్ రుధిరమ్ము గ్రమ్మ నురము న్మెల్వాసి భగ్నంబు గా
నానాగాయుతసత్త్వుఁ డిట్లు ప్రతిమన్ హర్షంబునం ద్రెంచి పు
ష్పానీకంబున నొప్పుకింశుకమునా నై నేలకున్ వ్రాలె నా
లోనన్ సంజయుఁ డిట్లు కూడ దని పల్కం బల్కె శాంతిల్లఁగన్. 137

వ. ఇట్లు లోన సంతసించుచు నక్కంచు వృకోదరునిపే ర్వాడి శోకసమన్వితుండై హా
హాకారంబు సేయుచున్న వానిం గాంచి వాసుదేవుండు నవ్వుచు నిట్లనియె. 138

చ. వగవకు మయ్య నీ విటులు వాయుతనూజుఁడు నీకరంబులం
దెగఁడు తెగెం దదీయఘనదేహముతో నెనవచ్చునిన్నరూ
పగు నగు నూఱడిల్లు మిటు లంతయు నేన యొనర్చి మిత్తికిం
దగిలినవానిఁ గాచితిని నానయరోచిత కార్యసంగతిన్. 139

తే. నిన్ను నీకోపము నెఱింగి యున్నవాఁడ, బలమున న్నీకుఁ దులవచ్చువాఁడు లేఁడు
జగములం దంతకునిబాఱిఁ దగిలి బ్రతుక, వచ్చు నీసందిటం జిక్కి బ్రతుక వశమె.

ఉ. కావున నేను నీదయినకాంక్షకుఁ బోలన యోమయాకృతిం
జేవ ఘటించి నీకడకుఁ జేర్చితి దానిని భీముఁ డన్నదు

ర్భావమునం బగిల్చితివి తావకచిత్తము నేఁడు పుత్త్రశో
కావిలమై కుమారహితమై కుపథంబున కయ్యొ నయ్యయో. 141

తరలము. శమ మొకింతయు లేక భీమునిఁ జంపఁ జూచితి వేని నీ
కౌమరు లందఱు పెండి నీకడకుర్గ రయంబున వత్తురే
శమమఁగొరి మునీంద్రులే మును సల్పినట్టిది యంతయున్
భ్రమము వోఁ దలపోసి శాంతినిఁ బాదుకొల్పుము నెమ్మదిన్. 142

వ. అని చెప్పుచున్నప్పుడు పరిచారకులు జలంబులు తెచ్చి నివేదించిన నతండు తనమే
నం గలరుధిరంబు వోఁ గడిగికొని శుచి యయ్యె నయ్యెడ నయ్యదువల్లభుం
డు పెండియు. 143

—శ్రీకృష్ణుండు ధృతరాష్ట్రుని గర్హించి పలుకుట—

సీ. చదివితి వేదముల్ శాస్త్రముల్ సదివితి, వింటి పురాణార్థవిధము లెల్ల
రాజధర్మములు విరాఁపల్లు నీకడ, విద్వాంసుఁ డవును బ్రవీణుఁడవును
దలఁప నాత్మాపరాధము క్రోధవశమున, నొడలెఱుంగనియట్టిజడుఁడవైతి
కనలుదు విట్లు కాఁగల దని చెప్పరే భీష్ముండు, ద్రోణుండు విదురసంజ
యులు నేను సంధి సేయుతలంపున న్వచ్చి, చెవులు చీములు గట్టఁ జెప్పితిఁ గదె
తే. యట్టివన్నియు బూడిలోఁ బెట్టితీవు, సర్వనాశన మగునట్టి సమయమందుఁ
గంట నీర్వెట్టుకొనుచుంట కంటె లేదు, నాఁ కలుక గల్గి దుష్క్రియల్ నడుపనగునె.
తే. బలమునన్ శౌర్యమునఁ బాండవులకుఁ జాలి, పరులు లేరని మెఱఁగియువారితోడ
గయ్యమునకుఁ గాల్దువ్వుట కలదె యెందు, ఫల మనుభవించుఁ గొక్కఁడుగలదు గాని.
మ. తనకుం బ్రజ్ఞ దిరంబుగాఁ గలుగునే ధాత్రీతలాధీశ్వరుం
డనిశంబున్ గుణదోషముల్ తెలిసి శ్రేయం బందుఁ గాకున్నఁ బ్రా
జ్ఞనివాక్యంబున నాప్తవాక్యమున నజ్ఞుం డయ్యును న్విజ్ఞుఁ డై
తనకుం గల్గెడుకీడుమేళ్ళకును గుందం బోవఁ డెల్లప్పుడున్. 146

వ. కావున. 147

క. నీవృత్త మన్యవృత్తము భావింపుము, కొడుకుమాటబడి నడచుటచే
నీవలన నైనదానికి, నీ వేడ్వక భీముఁ జంప నెంచుట తగునే. 148

తే. చదురునకుఁ దెచ్చి ద్రోవదిఁ బదుగురయెడ, మానభంగ మొనర్చినమనుజపశువుఁ
బట్టి వధియించె భీముండు పట్టుకొలిపి, వైరమున దాన దోషియే కౌరవేంద్ర. 149

వ. నీవును నీవ ర్యోధనుండును జేసినదుశ్చరిత్రంబు తలంపునకుం దెచ్చుకొని నీవ నీ

కోపంబు సంహరించుకొని నిరపరాధులగు పాండుపుత్రులపైఁ బగం బట్టక శాం
తుండవై యుండు మనిన దేవకీపుత్రునకు ధాత్రీశపుత్రుం డిట్లనియె. 150

ఉ. మాధవ! నీవు చెప్పినక్రమం బది యంతయు సత్య మిప్డు నీ
బోధనముం గ్రహించితిని బుత్రులపైఁ గలహార్ద మిట్లు నా
బోధము మాలఁ జేసె గుణ[illegible]మను బాహులఁ బెట్టి చంప సం
శోధనముం బొనర్చితిని బుణ్యవశంబునఁ దప్పె నప్పనుల్. 151

మ. గతమన్యుండ గతజ్వరుండ నిపు డోకళ్యాణమూర్తీ! పృథా
సుతులం దెంతయుఁ బ్రేముడించితిని సంశుద్ధస్వభావంబునన్
మతిమంతుం డగుభీమసేనునిస్పృశింపం జిత్త మాసించెడిన్
ధృతి వోఁ జేసిననాదుచేఁత కెద సైరింపం గటాక్షింపుమా. 152

వ. అని ప్రార్థించినం బ్రసన్నుం డగునమ్మహాత్మునను మతంబున భీమార్జుననకులసహదేవు
వు లయ్యంధనృపతి దరియం జని తమ్మెఱింగించిన నతండు వారి నెల్ల ననుక్రమం
బున నాలింగనంబు గావించి దీవించె నంత. 153

—ధర్మజుని శపింప నెంచినగాంధారిని వ్యాసుఁ డూరార్చుట.—

సీ. కౌంతేయు లారాజుకడ ననుజ్ఞం గొని, పురుషోత్తమునిపురస్సరము గాఁగ
గాంధారికడ కేగి కానుపించిన నామె, పుత్రశోకార్తయై పొగిలి పొగిలి
తగిలినకినుక నాధర్మపుత్త్రు శపింపఁ, దలపోసెఁ జిత్తపద్మమ్మునందు
నయ్యభిప్రాయము ప్రాణభృద్భావజ్ఞుఁ, డైనవేదవ్యాసుఁ డట్టె యెఱిఁగి
తే. యమలగంగాజలంబుల నాడువాఁడు, తగమనోవేగమునఁ జేసి తత్క్షణంబ
సన్నిహితుఁ డయి కోడలి నెన్నికొనుచు, నిట్లు వచియించె విజ్ఞాన మెసక మెసఁగ.
తే. శాపకాలము గా దిది క్షమకుఁ గాల, మిమ్మహారాజుమీఁదఁ గోపమ్ము సేయఁ
గదు నినువంటిసాధ్వికిఁ గాన శాంతిఁ, జేసి సన్మతి విను మిట్లు చెప్పుచుంటి. 155

మ. జయ మర్థించి సుయోధనుం డరులతో సంగ్రామముం జేయునా
కు యథాన్యాయము గాఁగ దీవనలు వా కొమ్మంచుఁ బ్రార్థించినన్
బ్రియముం గూర్చుసుతుండు నాక యెచటం బెంపొందు ధర్మం బటన్
జయ మా నంచు వచించి తా నుడి వృథా చర్చింపఁగాఁ బోవునే. 156

చ. సమరమునందుఁ బాండవులు సాదియ మంది జయంబునందు ధ
ర్మము వలనన్ జయించి రరిమండలిఁ గావున ధర్మమంద పెం
పమరెడు వారధర్మపరు లంచుఁ దలంపకు మెల్లభంగులన్
క్షమ సహియించు టొప్పనని సారెకు నీ కిటు చెప్ప నేటికిన్. 157

క. నీయెడఁ గోపమునకుఁ జో, టీయక ధర్మాత్ము లైనపృథివీశులపైఁ
జేయుము దయ ధర్మంబుగ, ధాయునిసతి వగుట నిట్లు పలికితిఁ దల్లీ. 158

వ. అనిన గాంధారి గంధవతీసూనునకు మొగంబై యి ట్లనియె. 159

సీ. నా కసూయ సుమంత లేకుంట నిక్కంబు, వీరినాశనమును గోర నెపుడు
సుతశోకమున నా దమతి విహ్వలత్వము, గలుగ నున్మాలిక నేఁ గలఁగితి నిటు
కుంతి కట్టలు నాకుఁ గౌంతేయు లందఱు, రక్షితవ్యులు గారె రాజరాజు
నపరాధమును సుబలాత్మజకర్ణదు,శ్శాసనాదు లదుష్టశాసనమునఁ

తే. గురుకులక్షయ మయ్యె నిక్కరణి నందఁ, దప్పు పాండవులందు లే దెప్పటికిని
గలహకారకు లై కురుకులము వార, లనిఁ దెగిరి దీన నా కప్రియమ్ము లేమి. 160

మ. గదపోరం గడు శిక్షితుం డగుట మాకౌరవ్యునిం బోరిలోఁ
దుద ముట్టింపఁగ లేక గాలికొడుకు కార్తుండై హృషీకేశుఁ డ
ప్పదమం దుండి కనంగ నాభికి నధోభాగంబునం గొట్టి చం
పె దయాశూన్యుఁడు వానిచైద మది నగ్గ వేధింపదే నొంపదే. 161

క. ఇది ధర్మ మధర్మం బని, సదమలమతి ధర్మవిదులు శాస్త్రము తెలుపన్
మది నెఱిఁగి శూరుఁ డాహవ,పదమున ధర్మంబు విడున ప్రాణము చెడినన్. 162

వ. అనిన విని భీమసేనుండు భయకంపితగాత్రుండై గాంధారిం గాంచి యనునయించుచు ని ట్లనియె. 163

—భీముఁడు గాంధారికిఁ గోపోపశమనంబుగా నుత్తరంబు లిచ్చుట —

సీ. ధర్మమో లేక యధర్మమో కాని నా, ప్రాణరక్షార్థ మప్పనిఁ జేసి
నాఁడ సైరింపు మోనాతల్లి! నీతన,యుండు ధర్మంబున నోటువడఁడు
లావు గలండు యెల్లర కొక్కరుని నన్నుఁ, జంప రాజ్యముఁ గొన సమయ మయ్యె
నది గానఁ జంపితి నటు లుండె నతఁ డధ,ర్మమునఁ జేసియు మున్ను మము జయించె

ఆ. నికృతి జూద మాడి నిఖిలార్థములు గొనె, నేకవస్త్ర సభకు నీడ్చి తెచ్చె
మానెలంత కట్లు మానభంగ మొనర్చె, నడమతొడను జూపె నిలువఁజేసి. 164

తరువోజ. చంప నెంచితి నప్డు సమయంబు గామిఁ, జంప నీయఁ డజాతశత్రుండు వాని
జంపినం గాని రాజ్యము మాకు రాని,చందంబు సూపట్టె సమయంబు కల్మిఁ
జంపితి నిట్లు మానతియును మేము, సంకటంపడి నట్లు చర్చకుఁ బోలఁ
జెంపరం బగువైర విధమెల్లఁ దీర్చి, వేసితి మారాజు పృథ్వియేల్ మీఁడ. 165

వ. అప్పుడు నద్దేవి యతని కిట్లనియె. 166

జలధరము. నీవు వచించినట్లు జననిందితుం డా,భూవలయాధినాథునకుం బోలును జో
షే వగఁ గుంద వానికి నొకించుకయే,నావిధ ముండనిమ్ము విను మన్య మగుణా. 167

ఉ. ఆసురకృత్య మట్టి దగు నార్యజనుల్ నినుఁ బోలె నెవ్వరుం
జేసి యెఱుంగ రిప్పరుసఁ జివ్వలు నివ్వటిలంగ నైన దు
శ్శాసను రొమ్ము వ్రచ్చి క్షతజ మ్మది చేతులఁ బట్టి త్రావి తీ
వాసడి నీమనస్త్రిపయి నంటక పోయెనె వాయునందనా. 168

చ. అనవుడు భీమసేనుఁ డను నాసుబలాత్మజ కాలకింపు మో
జనని! మనుష్యరక్తము విచక్షణుఁ డెవ్వఁడు గ్రోల నెంచు నం
దున నద భ్రాతృరక్తము గనుంగొన నీవ్యయమ యట్టిదై యఘం
బున కగు నిట్లు నే నెఱిఁగి పోలనిపోకలఁ బోయి యుందునే. 169

క. పెదవిం బెట్టితిఁ జేతుల, మెదపుచు రుధిరంబు పలము మెన వెడునసురం
గదనమునఁ బోలి మెలఁగను, విదితము గాకున్న జమునివినుకలి కేన్కి. 170

వ. ఇదియునుం గాక. 171

ఉ. జూదమునాఁడు భూధవులు సూచుచునుండ సుహృజ్జనంబులున్
గా దనుచుండ వాఁడు కుతుకంబున ద్రోవది నీడ్చి తెచ్చి మ
ర్యాద యెఱుంగఁ డయ్యె నవు డాడినబాస ఫలింపఁ జేసితో
నాడెస నట్టు లయ్యెఁ బ్రతిన న్నెఱవేర్చుట క్షత్రధర్మమే. 172

వ. మఱియును. 173

తే. కర్ణసుతుఁచే నకులుండు గాసిపడియె,నన్నదమ్ములకుం ద్రాస మావహిల్లె
నట్టియెడ నట్టిభీభత్స మాచరించి,పగఱు భయపడి పాఱ నేఁ దెగితి నట్లు. 174

క. ననుఁ బాపంబున శంకిం,పను నీకుం దగదు తల్లి పరికింపఁగ నీ
తనయు లెపు డనపరాధులు, ననఘులు నా కిడిరి మాకు నార్తి యెఱుఁగవే. 175

వ. అనుటయు నద్దేవి వెండియు. 176

మత్త. మూఁడుకాళ్ళమునళ్ళు నంధులుఁ బూజ్యరాజ్యవిహీను లీ
గోడు గుడ్చెదువారి మన్గడ కూఁతకోలఁగ నొక్కనిం
గూడ నిల్పక మ్రింగివైచితి క్రూరచిత్తుఁడ! నూర్వరం
జేఁడు నేనియు లేకపోయెనె యుగ్గు సేయనివాఁడ నై. 177

క. ఒకనిసువు నిలిపి ధర్మ,ప్రకటన మొనరింతు వేని బ్రదుకఁ దలఁతు రి
ట్లొకచోటి వీరి దుఃఖవ శనకుఁ బోకడ పెట్ట గలిగెనం గల గుఁ గదా. 178

వ. అని పలికి గాంధారరాజపుత్రి ధర్మపుత్త్రుం దలపెట్టి యమ్మహారాజేడి యని యడు
గుచున్నంతఁ గౌంతేయాగ్రజుండు భయకంపితగాత్త్రుండును గృతాంజలిపుటుండు
నై నికటంబునకుం జని మెత్తనిమాట లాడుచు ని ట్లనియె. 179

—ధర్మజుండు గాంధారితో నతివినయంబునం బ్రసంగించుట.—

ఉ. అల్లన నీదుపుత్త్రకుల నందఱ ద్రుంగి మహాపరాధముల్
దెల్లముగా నొనర్చినయుధిష్ఠిరుఁడం బృథివీతలంబునం
దెల్లెడ నున్న రాజులకు నెల్లర కేను వినాశకుండ నో
తల్లి! నన్నున్ శపింపు మని తావకపాదము లాశ్రయించితిన్. 180

క. చుట్టాల నెల్ల జెలులన్, నట్టేటం గలిపినట్టినా కేమిటి కీ
చెట్ట కగుమేను రాజ్యము, పట్టంబును శిక్ష కేను పాత్త్రుఁడఁ దల్లీ. 181

సీ. అని వచించుచు వినయము దోఁపఁ దనచెంత, భయచిత్తమున నున్నవానిఁ దెలిసి
మఱుమాట నాలుక మలఁగ నీయక రాజ్ఞి నిట్టూర్పు నిగిడించు చట్టె నిలిచె
నపు డవనతదేహుఁడై యుధిష్ఠిరుఁ డామె, కాళులపై వ్రాలి కడకఁ ద్రొక్కఁ
బట్టాంతరము నుండి పడఁతిచూపా తని, పాదాంగుళులమీఁదఁ బడియెఁ బడిన

తే. తత్క్షణము రాజు కునఖియై తత్తఱిల్లెఁ, దలఁకి విజయుండు వసుదేవతనయుమఱువు
పొచ్చెఁ గవలును భీముండు దిచ్చవడిరి, సాధ్వీమాహాత్మ్య మెంతకుఁ జాల దనుచు.

వ. అంత గాంధారి విగతక్రోధయై వారినెల్ల మాతృభావంబునం జేసి సాంత్వనస్వరంబున
నాదరించినన్ నేద దేఱి వారు నామెచేత ననుజ్ఞాతులై కుంతీదర్శనంబునకుం జను
టయు నామయును.

క. దూరమునఁ దెగినకొమాళ్ళకుఁ, బరితాపము నొంది కుందువరపుత్త్రకులన్
జిరరాత్రమ్మున కమ్మొయిఁ, బరికించినదగుటఁ జేసెఁ బరిదేవనముల్. 184

తే. మొగమునం జేర్చి వసనంబు వగచి వగచి, శస్త్రవిక్షతగాత్త్రులై సరస నెసఁగు
కొడుకులం జూచి కన్నీరు విడిచి వారి, తనువు లెల్లెడ వేర్వేఱఁ దడవి చూచె. 185

వ. అనంతరంబ. 186

—గాంధారి ద్రౌపది నూరార్చుట.—

క. తనకడ వ్రాలినద్రోవదిఁ, దనచేతులఁ గ్రుచ్చి యెత్తి కౌఁగిట నిడి యో
వనితామతల్లి దుఃఖించిన నింతయు ఫలము లేదు చెప్పితి వినుమా. 187

వ. అంత ద్రౌపదీదేవియును. 188

సీ. కనుదోయి నశ్రువుల్ కాలువలై పాఱఁ, గుంతిమహాదేవిచెంతఁ జేరి

హా దేవి నీపౌత్రు లైనసౌభద్రాదు, లెం దేగి రేల రా రిచటి కిపుడు
నీకు మ్రొక్క రిదేమి నీపయిఁ గోపమో, యెఱిఁగింపు మోతల్లి యింతవచ్చె
నిట్టిచో సామ్రాజ్య మేటికి సంపద, లేటికి వరపుత్రవిహీనులకును

ఆ. అనుచుఁ మఱియు శోక మగ్గలం బైన భ,రింపఁ జాల కామె పృథివి కొఱఁగు
నంత లేవ నెత్తి గొంతి కోడలిఁ దేర్చి, యెల్లవారితోడ నింత గడపి. 189

వ. కొమరులుం గోడలుం దోడ రా గాంధారికడకుం జని కోడలి నెఱింగించిన నామె
యామెం గట్టుకొని కంట నీరు నించుచు నిట్లనియె. 190

శా. చన్నే పుత్త్రిక! పుత్త్రమోహమున నీచందంబునం గుందుటల్
నన్నుం జూడుము నాదుదుఃఖమునఁ గంతం బున్నె యే రేమి సే
య న్నేర్తుం గలవారు కాలము వినాశార్థంబ చేకూరె నం
చు న్నే నెంతు నవశ్యభావి యన వచ్చున్ దీని కిం తేటికిన్. 191

క. విదురుఁడు చెప్పినచొప్పునఁ, గదనము సంప్రాప్త మయ్యెఁ గలవా రెల్లన్
మొదలంటఁ దెగిరి కాఁ గలయది యంతయు నయ్యె వగవనగునే యివన్. 192

ఆ. అపరిహార్య మైనయర్థమునకు శోక, మందు టెల్ల వెఱ్ఱియండ్రు బుధులు
తెలిసి నేను బోరు తొలఁగింప లే నైతి, నేరరూప నీకు నాకు నిందు. 193

వ. అని గాంధారి కోడలి నూఱడించె నని చెప్పిన విని జనమేజయుం డవ్వలికథ యెవ్వి
ధంబునం జెల్లె జెప్పు మని యడుగుటయును, 194

ఆశ్వాసాంతము.

ఉ. వాకులలో నసత్యమును వర్తనమం దతినీచభావముం
గైకొనునట్టి కార్యముల ఘాతుకవృత్తము మర్త్యకోటికిన్
వాకొన నేల ఘోరకలి వచ్చె మనకు మన సొప్ప దింకలో
నాకృతిఁ దీర్చి వచ్చెదఁ గనన్ నిను నన్ గరుణింపు మీశ్వరా. 195

గద్యము

ఇది శ్రీమదధునాతనోభయకవిమిత్ర వేంకటయజ్వాగ్రపుత్ర
సమారాధితవిబుధరాజ శ్రీపాదకృష్ణమూర్తికవిరాజ
ప్రణీతం బయిన శ్రీకృష్ణభారతంబునందు
స్త్రీపర్వంబునఁ బ్రథమాశ్వాసము.

శ్రీ శ్రీ శ్రీ

శ్రీ

బాలాత్రిపురసుందర్యై నమః

# శ్రీకృష్ణభారతము

## స్త్రీపర్వము - ద్వితీయాశ్వాసము.



శ్రీమంతుం డైనం జచ్చున్
సామాన్యుం డైనం జచ్చుం జా కుండం డెవం
డీమాత్ర కెగిరి పడెదరు
నీమహిమం దెలియ లేక నిఖిలాధారా. 1

వ. అక్కథకుండు శౌనకాదిమహామునుల కి ట్లనియె న ట్లు గాంధారరాజపుత్రి ద్రుపదపుత్రినూరార్చిన యనంతరంబ పతివ్రతాశిరోవతంసంబును మహాభాగయు సత్యవచనయు సంతతబ్రహ్మచారిణియుం దపశ్శక్తిసంపన్నయు నగు నయ్యాంబికేయాంగన కృష్ణద్వైపాయనవరప్రభావ సంప్రాప్తం బైనదివ్యదృష్టిం జేసి రోమహర్షణంబుగు రణాజిరం బంతయు దూరంగతం బైనను సమీపగతంబునుం బోలెం బ్రతీక్షించె నదియును. 2

—: స్త్రీ విలాప పర్వము. :—

సీ. ప్రోవులై ప్రేవులు పొలసుఖండంబులు, కడికండ లగుసంగకముల గములు
నస్థిమస్తిష్కసంహతులు మజ్జావసా, కలితరక్తహ్రదస్థలశతములుం
జెదరి చిక్కులు వాఱి యాదవద లైనవె, న్నెముకలకుప్పలతోడ నెఱయుచోట్లు
నఱవఱ లగునాయుధాదులతిప్పలు, రజ మైనభూషలరాసులగము
తే. లశ్వగజయోధరథశకలాయుతశత, మండలంబులు ఛత్రచామరసహస్ర
శకలములుదిబ్బలును గ్గి సకలభాగ, ములును భీభత్సరసమును గొలుపుచుండ

క. తల లూడినయట్లులు న, ట్లులు వ్రాయినగలలు రెండిటన్ లేమిడి కై
కలయంగం బర్విన కాల్సేం, తుల బొలికల నయ్యె భయము దోపించునవై. 4.

క. కాకోల కంక జంబుక, కాక వృకవ్రజసమాస్రకలితము రణ్థో
లోకనమాకుల మధికభ, యానకభూతోన్నతారవావృత మెపుడున్. 5

సీ. గుండెకాయలు నంజుకొంచు బొమ్మ వగిల్చి, పచ్చినంజును గొంతుబట్టి మెక్కి
క్రొత్తనెత్తురు పుఱ్ఱెకోళ్ళలతోఁ బట్టి, సారెసారెకుఁ గడుపారఁ ద్రావి
ప్రేవులు నరములుం బెట్టికి వ్రేళుల నెస, పెసః జందెములు గాఁగ మెడలఁ దాల్చి
మెదడుతో నెత్తురు మెదపి రొంపిగఁ జేసి, కఱవాఱ మేనెల్లఁ గలయఁ బూసి
తే. పుఱ్ఱెపేరులు ధరియించి పొలసుదిండి, మూఁకలప్పుడు మూతులు నాకికొనుచు
నట్టహాసము సేయుచు నట్టు నిట్టు, నట్టువం బాడఁ జొచ్చె నప్పట్టునందు. 6

సీ. కొఱికి ముక్కలు చేసి గుండియ లవియించి, డొక్కలమాంసము మెక్కునవియుఁ
బుఱ్ఱెనెత్తురుతోడఁ బాలసు గట్టినమెద, డాత్రంబునం జుఱ్ఱునట్టివియును
ముక్కులతోఁ ద్రెంచి ప్రక్కపట్టుల దూఱి, క్రొత్తనంజును మెక్కఁ గోరునవియు
గ్రుడ్లూడఁ బెట్టికి లో గుళికల వడి నొల్చి, యంగిలి దిగజార మ్రింగునవియు
తే. నగుచు నక్కలుఁ గుక్కలు నావృకములు, గ్రద్దలును రాపులుంగులుఁ గాటులాడి
పోటులాడి యులివు మిన్నుముట్ట నట్టి, మెడఁగనుంగొననన్యోన్యపద్దమియందు.

వ. అట్టి సమయంబున సాత్యవతేయు ననుజ్ఞంజేసి యుధిష్ఠిరపురోగము లగుపాండవులు
ధృతరాష్ట్రవాసుదేవులం బురస్కరించుకొని కురుస్త్రీల నడపించుకొని పొలికలనికిం
జనినంత నక్కాంతలు సంతాపించుచు నందు నందుఁ బతులును సుతులును పిత
లును భ్రాతలును లోనగువారు ప్రేతంబులై పడి క్రవ్యాదగణభక్షితంబులై కనం
బడిన నోడ లెఱుంగక పుడమిం బడి పొరలువారును బొరలి పొరలి పురపురం
బొక్కువారును బొక్కి పొక్కి వాపోవువారును వాపోయి వాపోయి చెయ్వు దక్కి
చేష్టుడువారును నోరను నెత్తియు మొత్తుకొనువారును నార్చువారును నేడ్చువా
రును నలయువారును సొలయువారును నై రవు డాగాంధారరాజనందిని వసుదేవ
నందనునిం జేరఁ బిలిచి కంట నీరువెట్టుకొనుచు ని ట్లనియె. 8

—గాంధారి పొలికలను జూచి కృష్ణునితోఁ జెప్పి దుఃఖించుట.—

క. చూడుము నాకోడండ్రఁ, వీడినకేశములు వ్రేల వినిహతపతులై
పీడని దుఃఖంబున నదె, పోడిమి చెడఁ గురరు లట్లు పొక్కెద రకటా. 9

ఉ. వీరులఁ గన్న తల్లులగువీరలు వారనిభూరిశోకదు
ర్భారము పై కొనంగ నదె వ్రాలినపుత్త్రుల నన్నదమ్ములన్
సారెకుఁ జూచి కన్నుఁగవఁ జాల్కొన నశ్రువు లేడ్చి యేడ్చి ప్ర
జ్ఞారహితాత్మలై పడిరి సారసలోచన! సూతె వారలన్. 10

సీ. పొగ లేనియగ్నుల పగిదిఁ గర్ణుండును, ద్రోణుండు శల్యుండు ద్రుపదవిభుఁడు

నభిమన్యుఁడుం దొట్టియుఁ బరవీరభీకరు, లగువీరవర్యులు తెగిపడియును
వెలుఁగుచుండిరి చూడు మెలమిఁ దొఱంగియు, మణికవచాదిభూషణము లెల్ల
కడల నేలం గప్పెఁ గడికండ లగుకేడె, ములు నాయుధావళులును గలియఁగ

**తే.** నాడుచును బాడుచును నెత్తు రానుచు వడి, నార్చుచును గ్రేళ్లు వాఱుచు నదిగొ చూడు
మాజిభూతలమందుఁ గ్రవ్యాదగణము, గలయఁ దిరుగాడెడిని భయంకరము గాఁగ.

**మ.** కురుపాంచాలవినాశకం బయినయీ ఘోరాహవక్షోణిపైఁ
బరువంబుం జెడి కూలియున్న ధరణీపాలాంగసంఘాతమం
దరయం గాకులు గ్రద్దలున్ గతము లత్యంతంబుగా వ్రాలి న
త్తురుకండ ల్వెడలించి మ్రింగెడిని గొంతుల్ సాఁచి వీక్షించితే. 12

**క.** గురుకర్ణాదులశవముల, బరికింపఁగఁ గాకకంకపరివారపరి
స్ఫురితము లై యుండుట, గరుడధ్వజ దుఃఖహేతుక మ్మది గాదే. 13

**సీ.** అకట కటా! మృదుహంసతూలికలపై, శయనించువా రిప్డు జగతిఁ బడిరి
సతతంబు వందిసంస్తుతుల మేల్కనువారి, కడ శివారవములు గ్రందుకొనియెఁ
జందనాగురుదిగ్ధసర్వాంగు లగువారు, బ్రుంగుడువడిరి దుమ్మునఁ గలంగి
పరిజనాలంకృతాభరణులఁ బరమాభ, రణములు గ్రద్దలు రవళిఁ దన్ను

**తే.** నసువులం బాసియును నాయుధాళి విడక, వీరశయనంబు నొందిన వీరవరుల
సరసి జీవించి యుండినయట్టి రనుచుఁ, జెంతఁ జేరవు క్రవ్యాదసంతతు లదె. 14

**తే.** బాహువులఁ బట్టి గదలును బరిఘములును, బొమ్మనం జేర్చి భూశయనమ్ము చేసి
పెద్దనిద్దుర నొందినవీరు లతివ, లక్కునం జేర నిద్రించునట్టు లైరి. 15

**క.** రేపాడ వందిమాగధ, భూపాలకరాగకలిత భూరిస్తుతులన్
దీపించువారు నేఁడిటుఁ, జూపట్టిరి వనిత లేడ్చుచున్ మూఁగికొనన్. 16

**ఉ.** నోరును నెత్తి మొత్తుకొని నుచ్చులు వుచ్చుచు నాల్కలెండఁగా
నూరుచున్ గనుంగవల నూఱినబాష్పజలంబు కాల్వలై
చేరఁగ భూతలంబునకుఁ జేడ్పడి కౌరవకామినీజనం
బారయు నయ్యెఁ జూచితె జనార్దన చావఁగ నెంచిన ట్లదె. 17

**మ.** తలలుం గాళ్లును జేతులుం దనువులుం దండోపతండంబులై
కలయం బర్వి యనేకకోటు లొకటన్ గన్పట్ట నప్పట్టనన్
బోలఁతుల్ లేనిశరీరభాగము లెవో పోలింపఁగా లేక య
క్కలనెల్లం గలయంగ మెట్టెదర దే కన్గొంటివే మాధవా. 18

సీ. తల లేనియట్ట లట్టలు లేనితలలును, గని మోహావశమున మునుఁగువారు
నట్టలపైఁ దల లతికి పరీక్షించి, యుహ్వాని నేఁడి నిట్టూర్పువారు
నీతలకు నొ్ంగెడె మిది కాదు వేఱొండు, కూర్చి చూచెద మని కుములువారు
పరియలై తెగి పడ్డబాహూరుచరణముల్, కలియఁ గూరిచి మూర్ఛములుఁగువారు
తే. రాపులుఁగులు నక్కలును శిరములు పీకి, కొనుట బందులశవములుగనియుఁ దెలియఁ
జాల కున్నట్టివారునై చాన యెల్లఁ బురపురం బొక్కెదరు చూడు పురుషవర్య. 19

మ. ధృతరాష్ట్రస్నుష లిట్లు దుఃఖవశతన్ బృందంబులై యేడ్చుచుం
బతిపుత్రాదుల రోయుచుండ నిటు లేఁ బ్రాణంబులం దాల్చి ని
ల్చితి లోకంబున నింతకన్న నరయన్ లేదొండు కష్టంబు చె
ప్పితి నాచేసినపూర్వజన్మదురితం బే యిట్లు వచ్చెం జుమీ. 20

క. అని పనివి పనివి యేడ్చుచు, వనితామణి తనదునెదుట వసుధం బడియుం
డినదుర్యోధనశవముం, గని పడి మూర్ఛిల్లెఁ దెగినకదళికైవడిఁ గునన్. 21

వ. అట్లు మూర్ఛిల్లి కొంతవడికిం దెలిసి కన్నీరు మున్నీరై చనుకట్టుపయిం బడి కాలువ
గట్ట బెట్టు వాపోవుచు పాంసురుధిరదిగ్ధాంగుం డగుసుయోధనునికళేబరం బక్కు
నం జేర్చి. 22

— గాంధారి దుర్యోధనునికళేబరంబు సూచి విలపించుట. —

తే. హాకుమార! కుమార విఖ్యాతశౌర్య, కౌరవేశ్వర! నీ కిట్లకాలమరణ
మావహిల్లెనె నేఁ దొల్లి దేవురించి, తెలియఁ జెప్పితి విన వైతి తెగితి వకట. 23

వ. అని పరిపరివిధంబులం బరిదేవనంబు సేయుచు నాసుబలనందన సమీపగతుం డగు
నందనందనుం గాంచి యి ట్లనియె. 24

ఉ దాయలతోడ వైర మిది దాపర మైనపు డీతఁ డర్థిమై
న యెడ కేగుదెంచి చరణంబుల వ్రాలి జయంబు వల్కు నా
కోయమ! యంచు వేఁడుకొనుచున్నయెడం బయి కెత్తి వత్స లె
వ్వెమ్మెడ ధర్మ మాయెడ రహించు జయం బని పల్కి వెండియున్. 25

తరళము. కలన మాఱుమొగంబు వెట్టక గట్టిపట్టునఁ బోరి శ
త్రుల శరాగ్నిముఖంబునం బడి తొట్రు లే కసు రీగినం
గలుగుఁ బుణ్యజగంబు లం చనఁ గల్గితిన్ దయ లేక నేఁ
బలికి నట్టుల యయ్యె నే మని పల్కుదాన యదూద్వహా. 26

తే. ఇట్లు పలికిన నే వీని కెట్లు వగవ, నొప్పు శాంతింతునన్న నీముప్పుకాల

మనను బంధుహీనుఁడై ముసలితేఁడు, వగవ నయ్యె నటంచు నే వగతు మిగుల.

వ. అని పలికి మఱియుం గొడుకుఁ దలంచుకొని. 28

సీ. యుద్ధధర్మజ్ఞుఁ డయి యోపి నట్టులు పోరి, వీరశయ్యం జేరె వీఁడె యితఁడు
పచ్చియర్జు నెమ్మోమున శౌర్యంబు చూపుచు, వీఁగఁ డీతఁడు గదెన్ వీడకుండె
మూర్ధాభిషిక్తుల మొదటిలెక్క నెసంగు, ప్రభువు నేఁ డిప్పాంసుపటలిఁ బ్రుంగె
నిది కాలపర్యయ మే మన ఱేండ్లు గొల్చెడువాఁడు నక్కలనడుమ నుండెఁ

తే. బుధులు సేవించువాని రాపులుఁగు లిపుడు, మూఁగి సేవించుచున్నవి మఱి నెలంత
లాలవట్టంబు వట్టినై యొఱపునతఁడు, పులుఁగుఁగమి ఱెక్కవీవంగఁ బొదలు నేఁడు. 29

క. సింగముతో మాతంగము, లంగం గొని కూలిన ట్లిలం గూలె మహో
త్తుంగగతి భీమసేనుని, సంగరమునఁ దాఁకి యితనిసరణిం గంటే. 30

తే. పదియు నొండు నక్షౌహిణీబలమునకు నధీశ్వరుం డగు సుయోధనుం డిట్లు దక్క-
లేనివాఁ డయి మారుతసూనుగదకు, నెరగ నై కూలెఁ జూచితివే ముకుంద. 31

చ. విదురుఁడుఁ దండ్రియుం దనకు వేయివిధంబులఁ జెప్పియున్న దు
ర్మదుఁడును దుష్టబుద్ధి యగుమానవనాథుఁడు మందబోధుఁడై
కదనము సేసి మృత్యుముఖగహ్వరమందుఁ జొరంబడెం గటా
పదియును మూఁడు వర్షములె వానిసిరుల్ విలసిల్లె నిమ్మహిన్. 32

క. కరితురగాదులతో నిద్ధర దుర్యోధనుని బాహుదండమున నందెన్
జిరరాత్ర ముండ కన్యుల, కరగతమై పోయెఁ జెప్పఁగా నేమిటికిన్. 33

వ. అని గాంధారి కోడలిం జూపుచు మాధవునిదెస మొగంబై. 34

తరువోజ. కొడుకుచచ్చుట కంటె గోవింద! వినుము, కోడలిగోడు గన్గొన్న నా కిపుడు
కడుదుఃఖ మయ్యెడుఁ గడుపునం జుమ్ము, కడుకొనియెడు నింత కన్న నొండొకఁడు
పొడమునే యొక్కెండు పూఁబోఁడి చూమె, పుత్రునివదనంబు పోలంగఁ జూచి
యడలుచు నంతలో నధినాథుమేను, నరసి యం దేగుచు నలమటం గుడుచు. 35

మ. తనలాలించెడుముద్దుబిడ్డఁ డనుచుం దాత్పర్యముం జేసి యి
వ్వనితారత్నము లక్ష్మణుం దరిసి తద్వక్త్రంబునన్ వక్త్రముం
బొనర నొత్తుచుఁ బోయి భర్తృహృదయంబున్ ఱొమ్మునం జేర్చుచుం
దనుతాపంబున కోర్వ రాక శిరముం దాటించెడుం జూచితే. 36

ఉ. సాగరమేఖలేశ్వరనిసారతరాంకమునందు గౌరవ
శ్రీ గొనుచుండు పట్టమహిషి గనుఁగొంటె ప్రకీర్ణకేశయై

బా గతి పీన్గుపెంటల నభాగ్యవశంబునఁ జేసి మెట్టు నేఁ
డీగతి నీయమం గనిన నెవరికి గుండెలు వ్రీల వచ్చుతా. 37

ఆ. ఇట్లు పడెడునీమె నీక్షించునంత నాఁకటంపు చుమ్మఁజుట్టు నుదుకు పుట్టు
నింత కోర్చునట్టి రేదేశమున నుండ, రేను గాక చెప్ప నేమి గలదు. 38

క. నిగమంబు లాగమంబులు తగఁ, జెప్పినయట్లు పుణ్యాతత్పరుఁ డగుచుం
మగువం దల్లినిఁ దండ్రినిఁ, దెగి విడి చనె రాజరాజు తెలిసితె కృష్ణా. 39

వ. అని మఱియును. 40

సీ. భీమభీమగదాప్రభిన్నాంగులై నాద, నూఱ్వురుసుతు లిట్టు లుర్విఁ బడిరి
పగ పింత యని చెప్ప నగునె జనార్దన!, వేనలి విఱియ నవ్వోలఁదులెల్లఁ
బతులకై సుతులకై పరిదేవనము చేసి, రుధిరార్ద్రితలములు రోసి రోసి
కాకకంకాదులఁ గడ లంటఁ దోలుచు, నోడ లెఱుంగక మెట్టుచుండి రకట

తే. చరణములభూషణంబులభరముకతనఁ, బసిఁడివేడలపైఁ బట్టుపచ్చడముల
నడువఁ జాలనిపడఁతు లీపుడమి దేహ,శకలములలోన నడచెద రకట కట్ట. 41

ఉ. కొందఱు ప్రాణనాథులను గొందఱు పుత్రులఁ గొంద ఱిష్టులం
గొందఱు భ్రాతలఁ బాదవి కొంచు నురంబులు మోదికొంచు నా
క్రందన మాచరించెదరు కాంత లొకింతయు శాంతి లేక గో
విందా! కనుంగొనం హృదయవీథి విదారిత మయ్యెడుం జుమీ 42

క. కాయాపహృతంబును భూ,షాయుత మగుబంధుశిరము శయమునఁగొని లోఁ
బాయనివగ నొకపామణి, యీయెడఁ గడుఁ బొగలు చూచితే వనమాలీ. 43

తే తొంటిపుట్టువులం జేయఁ దోచుపాప,కర్మమునఁ జేసి ఫల మిట్లు కట్టికుడిపెఁ
గలుగ దెప్పుడు నాశము కర్మఫలము, కుడువకుండిన నెంతటికో విదునకు. 44

మ. కులసంజాతలు హంసగద్గదవచోగుప్తాభిమానల్ జలే
జలసన్నేత్రలు చారువక్త్ర లగునీచార్వంగు లెంతేని యి
క్కలనన్ దుఃఖరసస్వరూప లనఁనై క్రవ్యాదసంఘంబుతోఁ
గలయ న్మెట్టుచు వాఁడివత్తలయి శోకంజాక్ష! వీక్షించితే. 45

మ. అతిశౌర్యోజ్జ్వలు లైననాసుతు లనిం బ్రాణంబులం బాయఁ ద
చ్ఛ్రుతచంద్రంబులుఁ జర్మముల్ గవచముల్ సత్కేతుభూషావళుల్
తతమై నల్గడ వెల్గుచుండెడి బృహద్భానుప్రభాసంతతిం
బ్రతిపాదించుచు నాదుచిత్తమున కాపాదించుచుం దుఃఖముం. 46

వ. అని యొక్కింతలో దుశ్శాసనకళేబరంబుఁ గాంచి కాంచనాంబరధరునితో వెం
డియును. 47

—గాంధారి దుశ్శాసనునికళేబరంబు చూచి విలపించుట.—

సీ. దుశ్శాసనుఁడు భీముదోశ్శక్తిఁ జెగి యుండుఁ, బడి యుండె నెత్తుటం బడలువడియు
వీఁడు జూదమునాఁడు వేఁడుకమెయి ద్రౌపదిని సభకుం దెచ్చి వసటఁ గూర్చి
దుర్యోధనప్రీతిఁ దొడరి సేయఁగ నామె, మానభంగము సేయ మదిఁ దలంచె
దాసభార్యవు నీవు దాసి వంచు వచించి, పరిభవ మొనరించెఁ బంతగించి
తే. యపుడుదుర్యోధనునిఁ బిల్చికృపదలిర్పఁ, దనయ! కంసహాప్రియునిమాటలునివిడువుము
పాండుపుత్రులఁ జేపట్టిపాడి కలిగి, మెలఁగు మంటిని నామాట తెలియఁ డితఁడు. 48
ఆ. కరికి సిడుఁలు చూపు కరణి భీముని నొవ్వ, నాడె వాఁడు వీఁడు నట్ల యయ్యొ
దాన నింత పుట్టె వీనినెత్తు రురమ్ము, వ్రచ్చి త్రావె నతఁడు వగున దప్పి. 49
వ. అంత వికర్ణునిం జూచి. 50
చ. ఇతఁడు వికర్ణుఁ డుత్తమగుణైకవిభూషణుఁ డేన్గుగుంపులో
మతిఁగొని నీలమేఘములమధ్యమునందు నిశాకరుండు నా
హతుఁ డయి కూలియుండె విశిఖాతికిణాంకితమై తనుత్రసం
యుత మగువీనిచేఁ గొఱుక నోపక యున్నది గ్రద్ద గంటివే. 51
క. ఈతనిసతి దుఃఖాన్వితయై తనపతిపాలసు దివఁగ గ్రద్దలు పోఁ బోఁ
జేతుల నడఁచుచుఁ దోలిన, నేతఱికిం దొలఁగ కున్న వివి సూతె హరీ. 52
క. శరనిర్భిన్నశరీరుఁడు, పురుషర్షభుఁ డైనవీఁడు పుడమిం బడియుం
బరువము తప్పక లక్ష్మికి, నిర వగుచందమున నొప్పె నేమందు హరీ. 53
వ. అంత దుర్ముఖాదులం గని. 54
తే. దుర్ముఖుఁడు వీఁడు పడియుండెఁ దోయజాక్ష, శ్వాపదము వీనివదనంబు సాముదినుట
సప్తమీతిథిచంద్రునిచందమునను, దనరుచున్నది చూచితే వనజనాభ. 55
క. శూరుండు శూరసేనుఁడు, ధారుణిపైఁ ద్రాలి మెసవు ధరణీరజమున్
సారసలోచన! చూడుము, వేరికినిం దరము గాదు విధి దాఁటంగన్. 56
మత్త. చిత్రసేనుఁడు భూతలంబును జేరెఁ దీరనినిద్రకై
చిత్రరత్నవిభూషితుం డగుసింహవిక్రము వీనినిన్
సత్రభుక్సముఁ గాంచి కాంత లజస్రమున్ దురపిల్లుచున్
మిత్రముల్ బలె శ్వాపదంబులు నిల్వ నిల్చిరి చుట్టునున్. 57

మ. వరనారీజనపర్యుపాసితుఁడు దేవస్తుత్యతేజుం డరిన్
శరసంకృత్తసువర్ణవర్ముఁ డతఁ డుర్విన్ సాల్వద్రుచందంబునన్
ధరకుం గ్రాలు వృకంబు లంటి మొఱఁగం దన్మందహాసాంచిత
స్ఫురదాస్యం బిది సుప్రసన్న మగుచుం జూపట్టెడిం జూచితే. 58

తే. దుస్సహుఁడు శత్రుకోటికి దుస్సహుండు, విశిఖసంవృతగాత్రుఁడై వీరశయ్య
నందియును గర్ణికారసమావృత మగు, కులనగంబు తెఱంగున బొలుచుఁ గనుము.

వ. అంతలో నభిమన్యుం దిలకించి యించుక నిశ్వసించి. 60

గాంధారి యభిమన్యునికళేబరంబుఁ గని ప్రలపించుట,

సీ. కృష్ణార్జునుల మించెఁ గీర్తిశౌర్యాదుల, నని పేర్మిఁ గాంచినఘనుఁ డెవండు
మానుగ ద్రోణుని సైన్యమధ్యంబు నం జొచ్చి, చించి చెండాడిన జెట్టి యెవఁడు
గురుకర్ణముఖ్యు లేడ్వురు చుట్టుముట్టిన, నేకాకియై నొవ్వనేసె నెవ్వఁ
డెవ్వారికిని మృత్యువే యన నయ్యుఁ దా, మృత్యుముఖంబున మొఱఁగె నెవఁడు

తే. అట్టియభిమన్యుఁ డర్జునునాత్మజుండు, వీఁడు పలువురు పొదివిన నొకరుండు
నట్టివాఁ డిట్లు విశతాంగ నైనవీని, వీని ప్రోవను జెలువంబు నేఁడు కంటె. 61

చ. విరటునికూఁతు రుత్తర ప్రవీణమతిం బతిఁ జేర నేగి చే
గిరపడుచుం గనుంగవను గ్రొత్తని బాష్పము లూడిపాఱుచోఁ
గరముల వానిమై నివిరి కన్నుల మూర్కొని కౌఁగిలించియున్
గురుతరరక్తపాతమునకుం గురియై తగు మేన్ గని సంశయించుమున్. 62

తే. జాతరూపపరిష్కృత మైతళిక్కు, కవచమును విచ్చి కన్నులకఱవు దీఱఁ
గాంచి లజ్జించి శోకించి కంటనీరు, నించి చెంగట నిల్చెంచె మిన్నుఁ బోఁడి. 63

మత్త. వాసుదేవున కీడువచ్చినవాఁడు వీర్యము ధైర్యమున్
వాసు లెక్కఁగ యుద్ధభూముల మోహరించి జయించి సం
త్రాస మిచ్చెడువాఁడు శాత్రవరాజికిన్ సుకుమారుఁ డీ
భాసురాంగుఁడు నేలపాలయి పాడి దప్పెనె దైవమా. 64

తే. మారసుందరమూర్తి రమ్యకుఁడు జ్యాకి, ణాంకితంబులు కటివత్సాగంధికములు
కాంచనాంగదభూషణకలితములు లగు, హస్తములు సాఁచి నిద్రించునట్లు యుండె. 65

వ. అని వాని నుద్దేశించి. 66

ఉ. నీదు పరాక్రమంబు దలఁప నే నొకయింతయుఁ గాన మున్ను వ
న్నెయొసఁ దవ్వులం గనియు నెంతయుఁ బ్రేముడిఁ బల్కరింతు వి

ప్రీరాజిత గోముగోము మని యేమ్చుచుఁ బెంగటనున్నఁ గాని కం
డోయి గదల్చి చూడ విది దోషము గాదొకొ ప్రాణవల్లభా. 67

క. అమరోపము లగుతండ్రులఁ, దమలోనం బ్రేమఁ డించుతల్లుల నిటు దుః
ఖముల న్వేగడు వను నీ,క్రమమున విడనాడి యెందుఁ గదలితి పధిపా. 68

వ. అని వగలం బొగలుచు వాసుదేవుని మేనయల్లుం డగువల్లభుని నెత్తుట నత్తమిల్లిన
కురు లెత్తి మొత్తనితనయుత్సంగంబున వానివక్త్రంబు సేర్చి జీవించియున్నవానిం
బలె సెంచుచు. 69

తే. గోడిగలవార మని కొట్టుకొంద్రు క్రూర,కర్ము లగువారు పెక్కండ్రు కలిసి నిన్ను
బాలునొక్కనిఁ బొదివి పాపంబు గట్టు,కొనిరి వారిమగంటిమి యేమనంగ వచ్చు. 70

క. అపు డేమి తలంచిరో గురు,కృపముఖ్యులు నిన్నుఁ గూల నేయుచు నిన్నే
కృపణులు కారొకొ నీకును, విపులోన్ దిక్కుండి లేవివిధమున నయ్యో. 71

సీ. పాండవపాంచాలపతు లెల్లరును జూచు,చుండ నీ కిగ్గతి నొంద నయ్యెఁ
దన లేనియెడ నీకుఁ దగిలిన సేఁగికి, నీతండ్రి మన మొంత నెవ్వ గనునొ
నీవు లేకుండిన నీవారలకు విజ,యమును రాజ్యముఁ బ్రీతి గనున చెపుము
శరనిర్జితములు నీపరలోకముల కేను,వెనువెంట వత్తు నన్ గనుము కరుణ
తే. దుష్టురాల నెట్లు తోడు రాఁ గాను నా,ప్రాణ మూడి పోవ దయ్యో నకట
నాకలోకమందు నీ కైన కాంతతోఁ, బొదలుచుందు నన్నుఁ బోలెఁ గలిసి. 72

ఉ. అందముచందముం గలుగుసచ్చరచానల నెమ్మనమ్ము నీ
యందము చందముం గనుచు నట్టిదనై నిను వారి కెవ్వరుం
గందునిఁ గా నొనర్చెడిని గాదె మనోహర! యట్టివేళ నా
యందుఁ గలట్టిసౌహృద మొకప్పటికేఁ దలపోయకుందుమా. 73

తే. నిన్నుఁ బొందఁ గాంచి నెల లాఱు గడచె, నేడవది యిపుడు నడచు నవనినాథ
పుత్ర యింతతోన పోయె నీసహవాస, మేమిచేయుదాన నేది దిక్కు. 74

వ. అని ప్రలపించు నుత్తరఁ దత్తరంబున మత్స్యరాజకులస్త్రీజనం బకర్షించి యచ్చో
టు వాయం దిగిచి కొనిపోయి తెగి చననియార్తనాదంబు రోదసీకుహరంబు నిండిం
చుచు నిహతుం డై యొక్కచోటం బడియున్నవిరాటుం జూచి దుఃఖించుచుండి
రీక్షింపు మవ్విరాటకుటీశ్వరుండు. 75

ఉ. అక్కట ద్రోణబాణహతుఁ డై క్షితిపైఁ బడి నెత్రు మట్టినిన్
మెక్కుచు ఘృంచెఁ జూడు మదె మేకొని చుట్టును ముట్టి కాకులుం

గుక్కలు నక్కలుం బాలసు గుంజుచు నుండఁ దొలఁగఁ ద్రోలఁ గా
నొక్కసుమంతి శాల కట నుగ్మలు లార్చి వెలార్చు రిత్తతిన్. 76

వ. మఱియు నందంగు ప్రమంది పడి యున్నయుత్తర కాంభోజ సుదక్షిణ లక్ష్మణ సుత
ర్శన ప్రభృతికుమారులం జూచు మని చెప్పుచు గాంధారి రాధాకుమారుం జూచి
యి ట్లనియె. 77

—గాంధారి కర్ణుని కళేబరముఁ జూచి వాపోవుట.—

సీ. ఎవ్వాఁడు భృగురాము నెఱిఁగి దివ్యాస్త్రముల్, వడసి మహాప్రభావముఁ గమించె
నెవ్వానిపోగుల నెల్లపార్థివులను, నేలకు గోలకై నెగులు గాంచి
రెవ్వానిభుజబలం బెంచి నాపుత్రులు, పాండుపుత్రులతోడఁ బగ వహించి
రెవ్వాఁడు పదియు మూఁడేడులు హృచ్ఛల్యమై ధర్మజునినిద్ర నపహరించె

తే. నట్టివైకర్తనుఁడు మహేష్వాసుఁ డధిక, శౌర్యధుర్యుండు పార్థతేజమున నడఁగి
జ్వలితవహ్ని తెఱంగున శాంతుఁ డగుచు, రక్తసిక్తాంగుఁడై నేల వ్రాలెఁ గంటె.

క. కౌరవజాతికి దిక్కయి, భూరమణునిప్రాపు వడసి భూరిబలాఢ్య
శ్రీరమణ మించి కర్ణుఁడు, ధారణిపై వ్రాలె విధివిధానము వింటె. 79

ఉ. వేసవి ప్రీలి చిక్కుపడి వ్రేలఁ దదీయసతీవతంసముల్
మానసిశోకభారమున మాటికి నేడ్చుచు నుండ వీరిలోఁ
దా నొకమూలఁ జేరి తనుతాపముతో వృషసేనుతల్లి దుః
ఖానలదహ్యమాన యయి హా యని వ్రాలె ధరాతలంబునన్. 80

ఆ. పరశురాముశాపభరమున నస్త్రముల్, తోపకునికి విప్రశాపమునను
రథము నేలఁ గ్రుంగి రాకుండుటయుఁ గాఁ, నరుఁడు నీశిరంబు నఱకఁ గలిగె. 81

వ. అని మూర్ఛిల్లిపడి కొండొకవడికిం దెలిసి లేచి. 82

తే. పలలభుక్కులు మెసవ నల్పంబు మివిలి, యసితపక్షచతుర్దశియందుఁ జంద్రు
చందమున నున్నమగనియాస్యంబునందు, నాస్యమును జేర్చి యేడ్చె నయ్యతివమిన్న.

వ. అని కొంతలో నావంత్యుం గాంచి. 84

శా. ఆవంత్యుండు మహారథుం డితఁడు భీమాభీలశస్త్రాహతిం
జీవంబుం బెడఁబాసి వీరశయనశ్రీ నొందె రక్తోక్షితం
బై విశ్వంభరఁ జేరియున్నతనువుఁ హర్షంబునన్ ముట్టి వాం
ఛాతృప్తిం గొని వచ్చి మెక్కెడి నజస్రం బల్లక్రవ్యాదముల్. 85

డని మొనం బడి యుండె బాహుబలార్ది తారిచయుండు చ
చ్చినను వీని మొగంబు పున్నమఁ జెన్నుమీఱెడు చందమా
మను నరాసరి చేసి భాసిలు మాధవా! కనుఁగొంటివే. 86

వ. అం దొక్కచో జయద్రథుని కళేబరంబుం గని. 87

— గాంధారి సైంధవుని కళేబరంబు చూచి వగచుట. —

సీ. పుత్రశోకాభితప్తుఁడు గన విజయుండు, ప్రతిన పాలించెడు వ్రతము గలిగి
దొరలు దుర్యోధనాదు లనేకసైనికుల్, కాచుచుండఁగ సవ్యసాచి యేచి
సింధుసౌవీరేశ సైంధవు తల దీసె, నెల్లసైన్యంబును బ్రెళ్ళ నేసి
కాకులుం గ్రద్ద లాఘనభుజకాయంబు, కండలు భక్షించుచుండె నదిగో
తే. కృష్ణ ముట్టిననాఁడె యీకృష్ణుఁ డగ్గి, పట్టి డగు గాని దుస్సల నరసి పాండు
సుతులు కరుణించి విడిచిరి సుగతిదారిఁ, గలన నిటు చూపువారలు గానఁ గృష్ణ.

మ. అదిగో దుస్సల పేరెలుంగునను దుఃఖాక్రాంతయై యేడ్చుచున్
హృదయంబుం గడు మోదుకొంచు నిచట న్వీక్షింప కాశీర్షముం
బదముల్ ద్రొట్రిల నిందు నందు వెదకం బాలుం బ్రతీక్షింపు మో
యదువంశోత్తమ! నాదుచిత్త మతిశోకాయత్తమై పోయెడిన్. 89

తే. విధవలై కోడలుం గూఁతు రథమపీఠి, తమున కాశించి యుండుట వినియుఁ గనియు
ఱాలఁ జేసినబొమ్మ నా భూకలమున, బ్రదికి యుంటిని నా బ్రదు కిదియు బ్రదుకె.

వ. అనుచుం గొంత చని మద్రనాథుని కళేబరంబుం గని. 91

మ. వీఁడె శల్యుఁడు ధర్మపుత్రువిక్రమంబునఁ దాఁకి తా
న్నీఁడఁ జోక పెనంగి వానిమహోగ్రసంగతి తాఁకుచన్
వీడి ప్రాణము నేలపైఁ బడి వెల్గుచుండెఁ దదాస్యమున్
బోడిమిం గొనెఁ బూర్ణచంద్రునిపోల్కిఁ బూరుషసింహమా. 92

క. అధిరథిరథము సారథి, యై ధర్మజు గెలుపు గోరి యరి సేయుకర్ణ
ప్రోధము చెడఁ దేజోవధ, మాధిగ నొనరించి కర్ణు నర్తితి నొంచెన్. 93

క. ముక్కును మొగమును గాకులఁ, గుక్కలుఁ దిన వెలికి వచ్చి కుళ్లిననాల్కన్
ముక్కున గొని యొకగృధ్రము, మ్రుక్కాటపడిఁ బాఱు జూడు మ్మాకసమునకున్. 94

ఆ. మద్రవల్లభుండు రుద్రభూమిం బడి, యున్న వానికాంత లొల్లఁబోయి
పతికడగ్గు మగుడ్వేపముఁ బాయుఁ జాలరి, కరిగి యల్లు దుఃఖకలన కైరి. 95

ఉ. ఓపురుషోత్తమా! కను శిలోచ్చయవాసుఁడు వాసుదేవపా

దాపచితిప్రభూతవిపులార్థుఁడు పార్థకృతాహవక్రియా
వ్యాకశౌర్యస్ఫూర్తి యుఁగారె నా భగదత్తుఁడు వానికళేబరం బహో
శ్వాపదపుల్ భుజించిన నెసంగు శిరంబున స్వర్ణమాలికల్. 96

వ. అని వానికొక్కింతదూరంబున శరతల్పగతుండై యున్న దేవవ్రతునిపై దృష్టి నిగిడించి నిట్టూర్పు నిగిడించుచు. 97

—గాంధారి శరతల్పగతుఁడైన భీష్ము నుద్దేశించి పలవరించుట.—

సీ. లనవిక్రమమున కీధరణీతలంబునఁ, బురుఁడు లేఁ డెవఁ డని గరిమఁ గాంచెఁ
బరశురామునితోడఁ బదియు నెన్మిది నాళ్లు, సమరంబు గావించి జయముఁ గాంచెఁ
గాశిరాజకుమారికలకయి ధరఁ గల, రాజుల నెల్లర నాజి గెలిచెఁ
దండ్రి కోరికి దీర్పఁ దాఁ బెండ్లి యాడని, భీష్మవ్రతంబునఁ బేర్మి కయ్యెఁ
తే. గురుకులము నష్టమై పోవు టరసి దాని, నుద్ధరించె ధరారాజ్య మొదిమ నొందు
పగిది రాజ్యానుసంధానపరతఁ దనరె, నతఁడు సామాన్యుఁడే నిమ్నగాత్మజుండు. 98

ఉ. చూడుము శంతనూద్భవుఁడు సూర్యుఁడు కాలవిపర్యయంబునన్
వీడి దివంబు నేలఁ బడువీక నెసంగుచు నంపపాన్పుపై
వేడుకఁ జూచుచున్నగతి వెన్నమరించి శయించి యుండె నా
కీడిశరంబులం దనువు వీలినయట్లయి నిట్టిపట్టునన్. 99

మ. విను దేవాపిసముండు ధర్మమున నీవీరుండు ఘోరాస్త్రసం
జనితాగ్నిం దహియించి శాత్రవవసీచక్రం బవక్రక్రమం
బున శాంతుం డయి వీరశయ్యను శరవ్యూహంబునం బండియున్
దనరారన్ శరసంచయంబునను దోర్తం బొల్చు సేనానినాన్. 100

క. కీడఁదలమై క్రిందడఁగపు, డాదరమునఁ గ్రీడివాని కాధారముగా
నాదకొన మూఁడుశరముల, నాదట నిలిపెం దలాడ నతఁ డా నాఁగన్. 101

ఆ. తనద శరమయూఖతతుల శాత్రవలోక, ములను మిగుల నేర్చి పొలుపు గాంచి
రాజచక్రమునకు నోజ గల్పించి భీష్మార్కుఁ డస్తమించె నక్క టకట. 102

మ. ధరపై సుర్త్యుఁడు నాఁగనొప్పియు నమర్త్యప్రాభవం బందిధ
ర్మరహస్యర్థము లెల్లఁ దెల్లముగఁ బారాశర్యుతో నేర్చి నే
ర్పరియై యప్రతిమానుఁడై రణములన్ బ్రాజ్ఞుండునై యొప్పుని
ప్పురుషశ్రేష్ఠుని బ్రహ్మపుత్రుని జగంబుల్ మెచ్చెడిన్ హెచ్చుగన్. 103

ఉ. దేవ్నుఁడు గాంక్షితం డకన్యదేహము దాల్చినవాఁడ యౌసని ని

ష్టావిధిఁ బ్రాణముల్ నిలుపఁ జాలినవాఁ డగునే రణంబునన్
జీవనముల్ వెలార్పుటకుఁ జెప్పినశాస్త్రవశస్త్రసంహతిన్
జావఁగ నయ్యెఁ జావమికిఁ జర్చ యొనర్చినఁ బోలఁ దోపదే. 104

తే. కనికరం బెట్టిదో కానితనకు మృత్యు,వెవ్విధమ్మున వచ్చెదు నెఱుఁగఁ జెప్ప
మనినఁ బాండవులకుఁ దానె తనదుమృతికి, దారి చూపె నితండు సాధారణుండె. 105

క. దేవవ్రతుండు వోయిన, నేవాఁ డీభరతవర్ష మీఁడితధర్మ
స్థావరము సేయఁ జాలెడు, నో వేనికి ధర్మరతుఁ డెయ్యనో చెపుమా. 106

వ. అంత నాచార్యుం దలంచి. 107

— గాంధారి గురుం దలంచి పలవించుట —

సీ. వేదంబులం జతుర్విధధనుర్వేదమ్ములం బ్రవీణుఁడు రణలాలసుండు
విల్లు వట్టినవారి కెల్ల నాచార్యుండు, పార్థునకుం బ్రాణపదగురుండు
భార్గవేంద్రులకును బలె సర్వశస్త్రాస్త్రములు హస్తగతము లీయఘుమతికి
ద్రుపదునిగర్వంబు తుదముట్టఁ జేసిన, సాహసబలాఢ్యుఁడు బ్రాహ్మణుండు

తే. కుంభసంభవుఁ డితనిగురుతఁ గాంచి, కాదె కవ్వడి లోకవిఖ్యాతయోధుఁ
డై సపత్నవిజేయుఁడై వాసి కెక్కె, నట్టియోధాగ్రగణ్యుఁడు నడఁగె నక్కట. 108

క. ఈతని మున్ను డికొనిరా,దే తెగి కౌరవులు పోర నెనఁగిరి శత్రు
వ్రాతమును గాల్చె లోకఖ్యాతుం డితఁ డగ్నివోలె నడరె ముకుందా. 109

ఆ. బ్రదికి యున్నయప్డు బలె ధనుర్ముష్టియు, నస్త్రముం గవచము నాయుధములు
శీర్ణము లయిపోక చెక్కుచెదర నట్లు, చెలఁగుచున్న వితనిచేతి మహిమ. 110

చ. సతతము శిష్యకోటులకుఁ జాఁగిలి మ్రొక్కఁగ నైనయిమ్మహా
త్మునిపదద్వయం బిపుడు నక్కలుఁ గుక్కలుఁ బీకి తిన్న వీ
క్షితిసురు నంతికంబునను జేరి కృపీసతి మోము వాంచి దుః
ఖితమతియై వగం బొగలెఁ గేశవ! చూచితె దైవనిర్మితిన్. 114

సీ. హైమృధహతుఁ డైనవల్లభునకుఁ బ్రేతకృత్య మొనర్ప నక్కృపి దలంప
జటిలులునుం బ్రహ్మచారులు నగుశిష్యు, లగ్నిఁ గైకొని వచ్చి యస్త్రశస్త్ర
ములు రథపీఠముల్ కలియఁ గూర్చి విధి,వచ్చితిం గల్పించి ప్రజ్వరిల్లు
నందు మాఱట యగ్ని యన నైనద్రోణుని, మృతకళేబరము నంచితవిధమున

తే. నుంచి మూఁడుసామంబులు నుచ్చగతులఁ, గాన మొనరించి వేలిమి గానొనర్చి
సొంకు నసనవ్య మగునట్లు చట్టి కృపియుఁ, దారు గంగకు నభిముఖులైరి కంటె.

తే. సత్యకాత్మజు చేఁ జెగి సోమదత్తి, యదిగో పడియుండె నాతని యంగకములు
విహగపంక్తులు గండ్రించె వేఱు వేఱ, చూడఁ జూడంగ నెంతయు గోడువొడమ.

తే. పుత్రశోకాభిసంతప్తమూర్తి యైన, సోమదత్తుఁడు సాత్యకిం జూచుచుఱ మని
చూచుచున్నట్లు తోఁచెడిఁ జూతెసుతుని, కడ మృతుం డయి పడియున్నఘనుని వాని.

— గాంధారి భూరిశ్రవుని కళేబరంబు గని వాపోవుట. —

వ. ఆభూరిశ్రవునితల్లియు సోమదత్తునివల్లభయు నగునవ్వనితామతల్లి మురపిల్లుచు
వల్లభు నాశ్వాసించుచున్న దాకర్ణింపుము. 115

సీ. అధిప! నీదగుభాగ్య మత్యుత్తమము యుగ, తీయ మట్టికౌరవసంతతియంబు
చూడ వైళవి నీదుసుతుఁడు భూరిశ్రవ, సునిచావు నీచెవిఁ జొరఁగఁ బోదు
శ్వాపదంబులు దిన్న నీపుత్రకుని కేలు, గను దురవస్థనీ కౌనర దయ్యె
నీదుకోదండమ్రుర నెంజలియును దుఃఖ, మును నీమదికి నార్తి కొనరఁ బోవు
తే. యూపకేతునికాంచనరూప మైన, గొడుగు గడికండ్లై పడెఁ బడగతోడ
వరదమం దవి నీకంటి కగున యేని, నీమెడఁ ద యెంత తపియించునో యెఱుంగ. 116

క. నీకోడం డ్రిటులతివః, ఖాకలితస్వాంతు లగుచు నలజడి పడుచో
నోకారుణ్యపయోబ్ధి, నీ కేటికిఁ గరుణ రాదొ నే నెఱుఁగ నయో. 117

వ. అని పలవించుచు నిన్నుఁ బేర్కొనుచున్న దాకర్ణింపుము. 118

చ. మనవిజయుండొకానొకనిమాటబడి న్మఱి యొక్కవానితో
బెనఁగెడువానిహస్తమును బిట్టెకలించె నటుండనిమ్ము మీ
శినివరుఁ డప్పుడ ప్రాయమున జీవము వాసినవానికుత్తుకం
దునిమె నిదేటి ధర్మ మని దూరరె వారును వారివారునుఁ. 119

వ. అచ్యుతా! చూడు మా భూరిశ్రవసునిభార్యభీభత్సనృత్తం బైన భర్తృభుజం బుత్సం
గంబునం బెట్టుకొని. 120

సీ. ఇది నాదుసర్వాంగపదములు స్పృశియించి, యానంద మొదవించునమలహస్త
మిది మదమత్తులై యెదిరించువారల, సదమద మొనరింపఁ జాలుహస్త
మిది నేను నీవాఁడ గదె యన్నవారల, కభయప్రదం బగునట్టిహస్త
మిది గోసహస్రము లిచ్చి భూదేవులఁ, దృప్తి గావించినదివ్యహస్త
తే. మట్లు సవనపవిత్రమై యొనఁగుహస్త, మచ్యుతుఁడు సూడ నర్జునుం డట్టె నఱకె
ధర్మ మనుమాట తలఁపఁ డధర్మవర్తి, యనుచు గర్హించుచుండె నయ్యన్నుమిన్న.

వ. అని యంతలోఁ జౌతం బడియున్నసోదరునిం గాంచి శోకించి లోకనాథుం దిలకించి
యిట్లనియె. 122

— గాంధారి శకునికళేబరంబు తిలకించి పలికినమాట —

ఆ. సత్యవిక్రముండు శకుని గాంధారభూ,వల్లభుండు లోకవంచకుండు
తనకుఁ దాన తెచ్చుకొనినపోరున సహ,దేవుచేతి హేతిఁ దెగియె నకట. 123

సీ. పసిఁడిపీవన పీవ నెసఁగుతేఁ డిప్పుడు, పక్కితెక్కలగాలిఁ బడయ నుండె
వేలు కోటులు మాయ వెలయించు కితవుండు, మాయ మట్టముగాఁగ మడిసిపోయె
జూదమునం బాండుసూనుల నోడించి, నట్టేఁడు తా నోడి మట్టిఁ గలిసె
నాపుత్త్రకులకు వినాశకారణ మగు,నతఁడు వినాశన మంద నయ్యె
తే. వీనికతమున నే పాండవేయులకును, నాకొమాళ్ళకు వైరంబు లోకనాశ
హేతుభూతము గా నయ్యె నేఁడు పదునొ,కండు నక్షౌహిణులు గంగ గలిసిపోయె.

శా. కాంభోజాస్తరణోచితుం డయి జగత్ఖ్యాతిం బ్రవర్తిల్లునీ
కాంభోజుండు పడం దడీయనతి రక్తస్నిగ్ధముల్ తద్భుజా
స్తంభంబుల్ గని కన్నుఁదోయి జలముల్ చాల్వాఱ దుఃఖించుచున్
స్తంభించెం గను మబ్జలోచన తనూజ్ఞానంబు శూన్యంబుగన్. 125

తే. ఆతపంబున మగనికై యడలు గుడుచు, వారిజాక్షులు కడువాడివక్త్రలయ్యె
మేనియొప్పను బాయ రీలోన నెండఁ,బడియుఁ బువ్వుదండలకుఁ బొల్పువాయు నట్లు

మ. మగధేశుండు జనార్దనుండు మృతుఁడై తన్మోమండలిం గూలినన్
మగువల్ నల్గడ మూఁగి సుస్వరములన్ మాఱ్మ్రోయ దకూలముల్
తగు నేమ్మే లనిపించుచందమున గీతంబుల్ ప్రసంగించురీ
తిగ దుఃఖించెద రేడ్పుటెల్గిది కదా దీనత్వముం గొల్పఁగన్. 127

ఉత్సాహము. అనఘ! కోసలేశ్వరుల్ బృహద్బలుల్ మహారథుల్
గనుము చుట్టు వాఱి వానికాంత లెల్ల రోదనం
బును బొనర్చుచుం గిరీటిపుత్త్రునమ్మ లంగమం
బొనర వాని నెల్లఁ బుచ్చుచుండి రేమి చెప్పుదున్. 128

వ. వీరు ధృష్టద్యుమ్ననందనులు ద్రోణబాణపరిక్షీణప్రాణులై క్షోణీస్థలంబునం బడియు
న్నవారు వారిసమీపస్థలంబునఁ గేకయు లేవురన్నదమ్ములును. 129

మ. అరదం బెన్నఁగ నగ్న్యగారము కలంబ నంబు దీప్తార్చులున్
శరసందోహములున్ గదాదులు సమిజ్జాలంబులుం గాఁగ నం
గరభూమిన్ వెలుఁగొందుచాపగురుఁ డన్గాథాగ్నిహోత్రంబునం
దుంటారన్ శలభంబు లట్లు పడి చావైరట్లు వీక్షింపుమా. 130

— గాంధారి ద్రుపదాదుల శవంబులు గని వగచుట. —

క. సింగ మరణ్యంబున మా, తంగంబును బోలె ద్రుపదధరణీశ్వరునిన్
లంగఁ గొని పట్టి పట్టెమునం, గోసెం గనుము గురుఁడు వలినదళాసా. 131

శా. పాంచాలేశ్వరునాతపత్రము గదుం బాండుద్యుతి న్వెల్గుచుం
బ్రాంచచ్ఛారదచంద్రబింబమువలెన్ భాసిల్లెడిం దైవమా
యంచుం దద్వనితామతల్లు లచటన్ హైన్యంబునం గుందుచుం
గించు ల్వాలె నెఱుంగు లిచ్చిరి చితాగ్నిం బెట్టి ప్రాణేశ్వరున్. 132

ఉ. చేదివిభుం డితండు తనచేతివడిన్ బ్రథమాంగణంబునన్
భూదయితాయుతంబులకుఁ బోకడఁ గల్గఁగఁ జేసి ద్రోణుచే
నీదెస బోరు వట్లు నెడ నీతనినాతుక లూఁత లేక లోఁ
బోదిది సెకంగ నొక్కెతిఁ బొక్కుచు నుండిరి చూడు మచ్యుతా. 133

తే. నీమఱఁది యైనశిశుపాలునికి సుతుండు, ధృష్టకేతుఁ డీచేదిపృథ్వీశునికడ
ద్రోణపాతితుఁడై తత్సుతుఁడు సుకేతు, డొరఁగియున్నాఁడుచూచితే యోముకుంద.

క. శోకస్థానంబుగ నిట, నేకస్థానమునఁ బడినయిద్దఱఁ గనినన్
నాకంటికి దుర్యోధనుఁ, డాకడ లక్ష్మణుఁడు పొదలునట్టులు తోఁచెన్. 135

తే. వారె విందానువిందు లావంత్యు లకట, కూలియున్నారు చూచితే పెనుగాలితాఁకు
వలన నేలకుఁ గూలినపాదపములు, లేవ నెంతయు సంతాప మావహిల్లె. 136

వ. అని మఱియుం గలవారి నెల్ల వేలువేలం జూపి యి ట్లనియె. 137

సీ. దేవదానవులనే నావంతలో నోంతు, రాపగేయుఁడు ద్రోణుఁ డతనిసుతుఁడుఁ
గృపుఁడు గర్ణుండును గృతవర్మయును సుయో, ధనముఖ్యులగు నాదుతనయు లెల్ల
భూరిశ్రవుఁడు సైంధవుఁడు సోమదత్తుఁడు, లక్ష్మణప్రభృతిబాలకులు మఱియు
భగదత్తుఁడును మద్రవసుధాతలేశుండు, లోనగువోటుల్ వోయి రకట

తే. నీవు నీతమ్ముఁడును బాండుభూవరాత్మ, భవులు వారల బాఱిలోఁ బడియుఁ జెక్కు
చెదరకున్నారు తలఁప నచ్చెరువు గాదె, భారమే దైవమున కెంతపనియు నైన. 138

తరువోజ. పురుషోత్తమా పొత్తు పొసఁగక యున్న, పుడు నీ వుపప్లావ్యపురి కేగి నంతఁ
దరియంగ వచ్చి శాంతనవుం డుక్తి, తవిలి చెప్పిరి నీదుతనయులు పాప
పరు లింతలోనన పంచత్వమొందు, వారు వారలపయి వదలుము ప్రేమ
భర మని పలికి రప్పగిది న యయ్యె, వారివాక్యము లేల వ్యర్థము లగును. 139

వ. అని పలికి గాంధారి దుఃఖమూర్ఛితయై ధైర్యంబు దిగఁద్రావి ధరణిఁ బడియుంగొంత

వడికిం దెలిసి పరమక్రోధపరీతాంగియు వ్యథితేంద్రియయు నై మధుసూదనుం గాంచి యి ట్లనియె. 140

— గాంధారి శ్రీకృష్ణునకు శాపం బిచ్చుట. —

సీ. అన్నదమ్ములబిడ్డ లగుధార్తరాష్ట్రులు,పాండవుల్ వారిలో వారు పోరు
కొని నశింపఁగ నుంటఁ గని విని నీ వుపేక్షించితి వారింప నెంచ వైతి
బహుబలుం డవు బహుబలయుతుఁ డవు శక్తి,సామర్థ్యములు నీకుఁ జాలఁ గలవు
వేరికి న్నీమాట వినక తప్ప దటైనఁ, జేసి తిట్టులు నీదుచేత యెల్లఁ
తే. గురువినాశనమున కయ్యె ధరణిపతులు, సకలపరివారములతోడ సమసి రెల్ల
భూములును బాడుపడ దయ్యె దామగర్భ,దానిఫల మీవు పొందక తప్ప దింక. 141
క. పతిశుశ్రూషావ్రతమున, క్షితి నించుక తపము నేను జేసితినే నా
వ్రతఫలము కలిమి నిన్నిప్డు తగఁ గైకొని శపించి పుత్త్రు న్వినుమా. 142
ఉ. జ్ఞాతులు పోరుచున్నతఱిఁ జాలిని వృజిగింప కిట్లుపే
క్షాతతచిత్తవృత్తి గలవైతివి గావున నీదుజ్ఞాతులున్
ఘాతుకులై పరస్పరము కయ్య మొనర్చి నశింత్రు నీవురున్
బ్రాతికి నైనచుట్టములఁ బాసినయట్టివగన్ వెలార్చుచున్. 143
క. నేఁటికి ముప్పదియాఱగు, నేఁటితుదన్ వనమునందు నేకాకివనై
పాటిలినకుత్సితం బగు,పోటున నిధనంబు నొందఁ బోయెద వరయన్ 144
క. హతసుతలు హతజ్ఞాతులు, హతబాంధవులైననీకులాంగన లెల్లన్
హతపతిసుతబాంధవులీ,సతులుబలెం బరితపింత్రు సమదుఃఖమునన్. 145
వ. అనిన విని నవ్వుచు నవ్వాసుదేవుం డవ్వరవర్ణినిం గాంచి యి ట్లనియె. 146
క. లోకముల వృష్ణిలోకుల, బోకార్పఁగ దేవదానవులు చాల రొరుల్
నాకొందు నేన వారలఁ, బోకార్పఁగ నగుదు నింత పోలునె శ్రవ్వన్. 147
క. తమలోఁ దమకుం బొలి వడ, నమితంబుగఁ బోరి పోరి యాదవు లెల్లన్
యమలోకాతిథు లయ్యెద, రమలమతీ! నే నెఱింగి నది యిది కాదే. 148
క. అనుదాశార్హునిపలుకులు, వినిపాండవు లెల్లఁ జిత్తవృత్తుల భీతిం
గొని తమజీవితములదెస, వెనుదగిలెడునాస వదల విడిచిరి పెలుచన్. 149

—శ్రాద్ధపర్వము—

వ. అనసమయంబున వాసుదేవుండు నెంతయు నాసుబలసుతం గాంచి. 150

సీ. లే లెమ్ము గాంధారి! పోలదు నీ కిట్లు, నీయపరాధమే నీకు నిట్లు
శోకంబు గలిగించె నీకొడుకు దురాత్ముఁ, డెంత లెంతలు చెప్పి రేని వినఁడ
తనుదాన పగ దెచ్చుకొని యింత కయ్యె న్నాఖిలు నుత్తమోత్తముఁ గాఁ దలంచి
యీవు తత్కృతదోష మింత గణింపక, నా నెత్తిపైఁ గట్టఁ బూని తకట
తే. ధృతి చెడఁగ నుమ్మలిక రాజసుతకుఁ దగదు, మృతికి నష్టతకును గుందుక్షితిజనునకు
నినుమడించు మనోదుఃఖ మెపుడు రాచ, కూఁతు రనిఁ బోరి చచ్చెడుకొడుకుఁ గోరు
వ. అని జనార్దనుండు పలికిన విని శోకవ్యాకులితలోచన యగు నాదుర్యోధనమాత
మాటాడ కూరకుండె నట్టియెడ ధృతరాష్ట్రుం డజ్ఞానజనితం బయినశోకంబు వో
కాఱ ధర్మరాజుం దరియఁ జీరి యిట్లనియె. 152
క. మొనలం గొలంది యెఱుంగుదు, వనిఁ జచ్చినవారికొలఁది యది యెఱిఁగినచో
వినిపింపు వినఁగ నెంచితి, ననవుడు నతఁ డిట్టు లనియె నాతనితోడన్. 153
*తే. తెలియ వినుము దశాయుతములయయుత, మిరువదిసహస్రములుకోటులు రువదాఱు
పరివృఢుల్ పదినాల్గువేల్ పదియు నూఱు, నర్వదియు నైదుగురు చచ్చి రని యితరులు.
వ. అనిన విని విచిత్రవీర్యాత్మజుం డెట్టివీరు లుత్తమగతిం బొందుదురు చెప్పు మనిన
నతండు వెండియు. 155

— ధృతరాష్ట్రునకు ధర్మరాజు యుద్ధమునఁ జనినవారిగతులు చెప్పుట. —

సీ. హృష్టులై యెవ్వార లిద్ధాజిఁ దెగుదురో, వారికి సురలోక వాస మబ్బు
నట్టి హృష్టులు గాక హతు లైనవారికి, గంధర్వలోకంబు గలుగ నబ్బుఁ
బెడమోము వెట్టి పోయెడువేళఁ దెగినవారలకు గుహ్యకలోక మలర నబ్బు
వెఱ కాయుధము లేక పెర నెవ్వరో కాని చచ్చు, లోకులకుఁ బ్రహ్మలోక మబ్బు
తే. నేకరణి నైన నుత్తమలోక మబ్బుఁ, బ్రథనమున నెట్లు చచ్చినవారి కైనఁ
జాకయున్నవారికిఁ బయి జన్మమందు, నబ్బు నుత్తరకురుభూము లందు నునికి.

---

* "శ్లో. దశాయుతానా మయుతం సహస్రాణి చ వింశతిః
కోట్యః షష్టిశ్చ షట్చైవ యేస్మిన్ రాజ న్మృధే హతాః
అలక్షాణాం తు వీరాణాం సహస్రాణి చతుర్దశ
దశ చాన్యాని రాజేంద్ర శతం షష్టిశ్చ పంచచ."

ఈశ్లోకములు ప్రతులందు పాఠభేదములు కలిగి యున్నవి. ఈలెక్కకును భారతములోఁ జెప్పిన యక్షౌహిణులలెక్కకును భేదము కానిపించుచున్నది. భారతములెక్కకును నామలింగానుశాసనములెక్కకును భేదము. ఈవిషయము పరిశీలింపనై యున్నది. దీనింబట్టి తెలుఁగుపద్యమును సరి యని చెప్ప సాహసింపరాదు.

చ. అనవుడు సాంబికేయుఁ డను నాత్మజ! యి ట్లని యొట్టిజ్ఞానశ
క్తినిఁ దెలియంగ వచ్చె నెఱిఁగింపుము నాఁవుడు ధర్మనందనుం
డను ముని లోమశుం డనుమహాముని నా కిడె దివ్యదృష్టి యం
దున సకలంబునుం దెలియుచున్ వివరించితి నీవు కోరుటన్. 158

వ. అనిన ధృతరాష్ట్రుండు. 159

పంచ. అనాథులున్ సనాథు లైనయట్టివారు కర్త లెం
దునన్ లభింపకుండువారునున్ సృగాలకాకముల్
దినంగ నున్నవార లుర్విఁ ద్రెళ్ళిరేని కేవిధిన్
బొనర్ప నొప్పుఁ బ్రేతకార్యము న్వచింపు మాత్మజా. 160

వ. అనుటయు నయ్యుధిష్ఠిరుం డాలంబునం దెగినవారి కందఱకు నాహితాగ్నులకుం బోలె నగ్నిసంస్కారంబు లాచరించునది యని తన్ననుసరించియున్న ధౌమ్యు నాలోకించి విదురసంజయయుయుత్సులం బిలిచి మీ రెల్లరు నాథవంతు లై యత్నించి చ్ఛరీరంబు గలవారల కెల్లఁ బ్రేతకార్యంబు లొనరించునది యనినియమించుటయు వారు ధౌమ్యపురస్సరు లై చని చందనాగురు కాష్ఠంబులును ఘృతతైల క్షౌమవసన గంధాదులును దారుసంచయంబునుం దెప్పించి భగ్నరథావయవధ్వజచ్ఛత్ర చామరాయుధంబులతోఁ జితులం బేర్పించి దుర్యోధనాదిధార్తరాష్ట్రశతంబునకును శల్య శల భూరిశ్రవ స్సోమదత్త జయద్రథాభిమన్యు లక్ష్మణ ద్రౌపదేయ వాశ్వాసని ధృష్టద్యుమ్న ధృష్టకేతు యుధామన్యూత్తమౌజ శ్శిఖండులకును విరాట ద్రుపద కేకయ కౌసల్యాదులకును సృంజయప్రముఖులకును సౌబల వృష కాచల భగదత్త కర్ణవృషసేనాదులకును త్రిగర్తయోధులకును ఘటోత్కచాలంబుస జలసంధాదులకును దక్కనుంగల రాజలోకంబునకును ఘృతధారాహుతిదీప్తంబు లైనపవిత్రాగ్నులం జేసి సంస్కారంబు గావించియుఁ గొందఱకుఁ బితృమేధక్రియలు నిర్వర్తించియు స్త్రీలరోదనంబులతోడం గూడినసామగానంబు లొనరించియు నౌర్ధ్వదేహికక్రియాకలాపంబు పరిసమాప్తి నొందించినంత విధూమంబు లై ప్రజ్వరిల్లుచితాగ్నులెల్ల నంతరిక్షంబున గ్రహంబుల చందంబున వెలింగె మఱియు ననాథవంతులును నానాదేశసమాగతులునగు యోధాగ్రగణ్యుల నెల్ల వేలకొలంది ప్రోవులు వెట్టించి చిచ్చు ముట్టించి రనంతరంబ కౌంతేయాగ్రజుండు. 161

సీ. ధృతరాష్ట్రవిభుని ముం దిడుకొని పరివార, పరివృతుఁ డై యమాంద్రు బూసి నడువ

గంగానదికి నేఁగి కనకభూషాదులు, తీసి సుస్నానముల్ చేసి వార్చి
తానునుం దమ్ములుఁ దండ్రియుం గౌరవాం, గన లానుపూర్వికగతుల నెఱిఁగి
కలబంధువులకును గ్రమముగా సలిలక్రి,యాకలాపము దీర్చి రార్తు లగుచు
తే. నపుడు కుంతిమహాదేవి కృపణ యగుచు, నేడ్పుఁ జెలుఁగునఁ బుత్రులయెడకు నేఁగి
సన్నగించినవారున సర్వజనము, వినఁగ వారలతో విట్టు లనియె నార్త. 162

— కుంతి కర్ణరాజునకుఁ గర్ణుఁడు తనకొడుకని యెఱింగించుట —

సీ. విల్లు పట్టినవారి కెల్ల నగ్రేసరుం, డరిలోకభీకరోద్ధురబలుండు
కుఱువాహినుల కనిం గూర్చుమకారి, పలికాఁడు ధార్తరాష్ట్రులకు నెల్లఁ
కలగుండు వెట్టి మీబలముల నోర్చిన, బల్లిదుం డాదిత్యవర్చసుండు
ధరఁ జీతలంబునఁ గన్నఁ బోల్పోటరి, తే డని నడి గన్నపోరఁడ మిన్న
ఆ. అనుగు నోల మానగొనక వెన్నియని, పోటుబంటు పేకి బొంకనట్టి
మేటిమగఁడు కీర్తి పేటి కైకర్ణునుం, డెల్లరాజలోక మెఱిఁగినతఁడు. 163
ఆ. అతిరథి యటంచు రాధేయుఁ డంచు మీ, రెల్లవారుఁ బోలె నెంచి వానిఁ
బగ దలంచి పోరఁ బట్టి వధించితి, రంతవాని నేమి యందు నకట. 164
వ. అవహితచిత్తులరై యాకర్ణింపుఁ డని మఱియును. 165
చ. అలరెడుకుంతిభోజునిగృహంబునఁ గన్నియ నైననాకుగా
మునివరు సద్వరంబునను బుట్టెఁ గుమారుఁ డతండు ధర్మకుం
డలకవచాంచితాంగుఁ డగుట న్వెలుఁగొందుచు వేవెలుంగు నాఁ
దెలియుఁడు మీకు నగ్రజుఁడు దేవనిభుం డగుపాండవుం డగున్. 166
క. ఉదకక్రియ లొనరించెడు, నదనున మీయగ్రజన్ముఁ డగుకర్ణునకున్
వదలుఁడు తిలోదకంబులు, మొదట న్నామాటబడిని పుత్రకులారా. 167
వ. అని యాడినమాటలు చెవులు సూఁడినట్లయినం బాండుపుత్రకులు పరమదుఃఖాక్రాంతచిత్తులై యుండ యుధిష్ఠిరుండు వేడినిట్టూర్పు నిగిడించుచుఁ దల్లి కిట్లనియె.
సీ. ధృతరాష్ట్రసుతు లెల్ల ధీతి నేమహాహవ, బాహుబలంబునఁ బ్రతిభ గనిరొ
మేము మాబలము లే భీమపరాక్రము, కైవడిం బడి కసుగందినామొ
భూతలంబునఁ గలభూభుజు లెల్ల నే, ఘనభుజునకు నరిగాపు లైరొ
భీభత్సునకుఁ గాక పృథివి నొండెవ్వని కే, నిభృతతేజుని చెంత నిలువ రాదొ
తే. యట్టిమాయగ్రజుని ద్వాదశాత్మవరస, ముగ్ధభవుని మహాద్భుతవిక్రమోన్నతుసుతు

నగ్ని వస్త్రము నం గట్టినట్లు కట్టి, యెట్లు దాఁచితివో తల్లి యెఱుఁగఁ జెపుము. 169

చ. భయమునఁ బాండవేయులును బద్మజపాటునఁ బర్థివోత్తముల్
ప్రియమున ధార్తరాష్ట్రులును వేని భుజాజల మెల్లవేళ ని
శ్చయముగ నంతరంగముల సంతతమున్ స్మరియించుచుందురో
నయవిదునిన్ విశ్రుతున్ననందను నిట్టులు దాఁచెఁగఁ గగ్గి తమ్మరో. 170

క. లోకైకధనుర్ధరుఁ డగు,నీకొడుకు న్నాకు నన్న నీతివిదుని నీ
వీకరణి దాఁచి మాకుఁ, శోకము గల్పించి తెందుఁ జొత్తుము తల్లీ. 171

మ. అయయో! కర్ణునిపోక మా కనఁగ నేలా నెల్లచుట్టాలకుఁ
బ్రియముం బాపుట కాక దుఃఖమును బ్రాపింపఁగఁ జేసెఁ ధనం
జయపుత్త్రుండును ద్రౌపదీసుతులుఁ బాంచాలాదలుం బోయిన
ట్టయిన న్నామది కిట్టియుమ్మలిక లే దయ్యెం జుమీ యెయ్యెడన్. 172

ఆ. ఎల్లదుఃఖములకు నిది వేయిరెట్లిచ్చె,నట్టిదగుచు నాదునాత్మ నేర్చ
నయ్యె నతఁడు నాకు నగ్రజుఁ డనివిన్న,యేని యింతచేఁటి దేల వచ్చు. 173

వ. అని యనేకవిధంబుల విలపించుచు గోత్రనామంబు లుచ్చరించి కర్ణునకుం దిలోదక
ప్రదానంబు గావించె భీమార్జుననకులసహదేవులును దేవీజనంబులతో నుదకర్మం
బాచరించి రాంబికేయుండును గాంధారితోఁ దిలోకంబు పిడిచె నంతఁ గుంతీసుతా
గ్రజుండు సూతపుత్త్రువలని స్త్రీపాత్రంబున భార్యాకళత్రంబుల నెల్ల రావించి గౌర
వించె నిట్లు నానావిధదానాదులతోఁ బ్రేతకృత్యమ్ము నిర్వర్తించి సపరివారంబుగా
గంగాసముత్తరణంబు గావించె నని స్త్రీపర్వంబునం గలసర్వవృత్తాంతంబు నెఱిఁగించి
వైశంపాయనుండు. 174

క. పితృయజ్ఞఫలప్రాప్తిన్, బ్రతిపాదితసుకృతసారబహుళం బై భా
రతమున నేకాదశసంజ్ఞిత మీపర్వంబు వినిన శ్రేయము లబ్బున్. 175

వ. అని జనమేజయునకుం జెప్పె నని చెప్పుటయు. 176

ఆశ్వాసాంతము.

ఉ. చేసినచేఁతలే మఱియుఁ జేయుచుఁ జేసినవానిలో సుమం
తే సరియైనదాని గణుతింపఁగఁ జాలనివాఁడనై వృథా
యాసము నొందుచుంటి నిను నంటుకొనం గలదారి చూపి నా
దోసము వాపి సౌఖ్యమునఁ దోఁగఁగ జేయవె సర్వరక్షకా. 177

క. పుట్టుట గిట్టుట రెండుఁ, బట్టి నను స్వేపుచుండె బరువము చెడ నే
నెట్టియెడ కేని పారము, ముట్టగ లేకుంటి నన్నుఁ బ్రోవవె దేవా. 178

మాలిని. నిరుపగుణకోశా నిత్యసత్యప్రకాశా
పరసురకలనాశా వాసుదేవాద్యధీశా
పరిహృతభవపాశా పాలితాశేషదేశా
సరసహృదయవేశా సర్వలోకేశ్వరేశా. 179

గ ద్య ము

ఇది శ్రీమదధునాతనోభయకవిమిత్ర వేంకటయార్యాగ్రపుత్ర
సమారాధితవిబుధరాజ శ్రీపాదకృష్ణమూర్తికవిరాజ
ప్రణీతం బయిన శ్రీకృష్ణభారతంబునందు
స్త్రీపర్వంబన సర్వంబును
ద్వితీయాశ్వాసము.
శ్రీ శ్రీ శ్రీ

— —

మ. పాదలం గూర్చెదు నశ్వమేధపర్వమున్ బోలంగ నాలించినన్
పదునొం డై జయమందుఁ బేర్వడినపర్వం బిద్ది దీని న్ముదం
బాదవన్ మూల మతిక్రమింపనివిధం బూహించి కావించె శ్రీ
పదకృష్ణుండు కవీంద్రచంద్రులు నుతింపన్ విద్వదాస్థానులన్.

